శ్రీరస్తు.

# హరిశ్చంద్రనలోపాఖ్యాన విమర్శనము

కళాప్రపూర్ణ

శ్రీ వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారిచే

విరచితము.

---

మ. ధనమే పావనమంచు నెంచ కధికద్రవ్యంబు వెచ్చించి జీ
వనముం గూర్చుచు సత్కవీంద్రులకు గీర్వాణాంధ్రసద్వాఙ్మయం
బును దాఁ దెంచుచు దాని సుస్థిరముగా ముద్రించు వావిళ్లవం
శ్యు నదీశాగము వేంకటేశ్వరుని బ్రోచుం గాక శ్రీశుం డిలన్.

---

చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.
1953

# ఉపోద్ఘాతము

శ్లేషానుప్రాసచక్రవర్తియు సాహిత్యరసపోషణుఁడును నగు రామరాజభూషణుని యీ హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రబంధరాజమునకు విమర్శనము వ్రాయుమని నన్ను సన్మానపురస్సరముగఁ బ్రేరించిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి యెడల నెంతయుఁ గృతజ్ఞుఁడ నయియున్నాఁడను.

గ్రంథవిస్తరభీతిచే నిందుఁ గొన్ని ముఖ్యవిషయములుమాత్రమే విమర్శింపఁబడిన వని గ్రహింపఁ జదువరులను బ్రార్థించుచున్నాను.

గుణగ్రహణపారీణు లగుపండితు లిందలి గుణలేశములను గ్రహించి నన్నుఁ గృతార్థునిజేయఁ బ్రార్థించుచున్నాను.

విజయనగరము.
14-1-1918

ఇట్లు,
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి.

సుందరీవృత్తము.

సుధియా పరిపూతమానసౌ, కలయేఽహం జగతః ప్రియంకరౌ;
పితరౌ మమ వేంకటాంబికా, ముఖలింగేశ్వరజంపతీ హృది.

ఉపజాతివృత్తము.

పితామహభ్రాతృసుతం స్వవిద్యా, గురుం చ చింతామణిసత్సమాఖ్యం
శ్రీవత్సగోత్రోద్ధరణప్రశస్తిం, నమామినారాయణసత్కవీంద్రమ్.

చ. "చను దుస్సర్పకళంకపంకము హరిశ్చంద్ర ప్రశంసం దొలం
గు నలశ్లాఘఁ గలిప్రపీడనముఁ దత్ క్షోణీశయాత్రాకకీ
ర్తన మత్యంతఫలప్రదం బగుట చిత్రంబే భవత్పుణ్యావా
సన వేదాద్భుతకావ్యరాజరచనోత్సాహంబు గల్గెన్ మదిన్." (హ.న.అ. 1౮.)

హరిశ్చంద్రనలోపాఖ్యానవిమర్శన

# విషయసూచిక

విషయము. పుట.

## 1-వ ప్రకరణము



## 2-వ ప్రకరణము



## 3-వ ప్రకరణము



## 4-వ ప్రకరణము

5-వ ప్రకరణము

# పీఠిక

## ప్రథమప్రకరణము.

### బట్టుమూర్తియే రామరాజభూషణుఁడు.

బట్టుమూర్తి రామరాజభూషణు లొక్కరే యనునాయభిప్రాయమును నేను రచించిన వసుచరిత్రవిమర్శనమున ౩, ౪ భాగములందు విపులముగాఁ జర్చించి చూపియున్నాను. కావున మరల దాని నంతయు నిచట వ్రాయ నేల ? అని తలఁచి యిందుఁ దత్సారమునుమాత్రము పొందుపఱిచెదను.

సీ. "శతలేఖినీపద్యసంధానధౌరేయుఁ, ఘటికాశతగ్రంథకరణధుర్య
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని, రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య, సాధితవ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోకభాషాకృత్యు, చతురనోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
తే. నమితయమకాశుధీప్రబంధాంకసింగ, రాజసుతతిమ్మరాజపుత్త్రప్రసిద్ధ
నరసవేంకటరాయభూషణునుపుత్త్రు, నను బుధవిధేయు శుభమూర్తినామధేయు."
(నరస. ఆ. 1. 13.)

సీ. "వనధిలంఘనకృపా వర్ధితోభయకవి...మనఘుభక్తి. (హ. న. అవతారిక.53)

పై పద్యములనుబట్టి నరసభూపాలీయ హరిశ్చంద్రనలోపాఖ్యానకృతికర్తలు పినతండ్రి పెదతండ్రి కొడుకులని సామాన్యముగా గోచరించును.



హరిశ్చంద్రనలోపాఖ్యానకర్త తాను వసుచరిత్రమును జెప్పినట్లు చెప్పికొనియున్నందున వసుచరిత్రము రామరాజభూషణవిరచిత మను టలో సందేహము లేదు.

పయి నుదాహరించిన నరసభూపాలీయ హరిశ్చంద్రనలోపాఖ్యానములలోని పద్యముల కనుకూలముగా నరసభూపాలీయాశ్వాసాంత గద్యము లొకవిధముగాను, వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానాశ్వా సాంతగద్యము లొకవిధముగాను వెలయుచున్నవి.

"శ్రీహనుమత్ప్రసాద లబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపదరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయ భూషణ సుపుత్ర, తిమ్మరాజపౌత్ర, సకలభాషావిశేష నిరుపమానధాన శారదామూర్తి మూర్తిప్రణీతంబు......"

(నరసభూపాలీయాశ్వాసాంత గద్య)

" శ్రీరామచంద్ర చరణారవిందవందనపవననందన ప్రసాదసమాసా దిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతంబు"

(వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానముల గద్య)

పయిరీతి నాశ్వాసాంతగద్యములును, గవినామపితృనామములును, బట్టుమూర్తి రామరాజభూషణులు చెప్పికొనిన ప్రజ్ఞలును విభిన్నము లుగ నుండుటచేత వీరిద్దఱుకవులు నొక్కరే యనుట సరికాదని కొందఱ యాశయము:—

"ఉభయుల కవిత్వపుజాడలు నేకజాతిగ నుండుటచేతను (వసు. విమ. 54, 55 పు.) నరసభూపాలీయములోని పెక్కుపద్యముల కల్పన ములు వసుచరిత్రమునం జమత్కరింపఁబడి యుండుటచేతను, (వసు. విమ. 66-70 పు.) నరసభూపాలీయములోని పద్యములే రెండు వసుచరిత్రము నందును నుపయోగించుకొనఁబడుటచేతను (వసు. విమ. 55-71 పు.) నరసభూపాలీయ వసుచరిత్రములలోని గ్రంథారంభసంప్రదాయ మొక్కరీతి గనే యుండుటచేతను (వసు. విమ. 66, 67, 68 పు.) నుభయకవులును హనుమత్ప్రసాదలబ్ధకవితావైభవులే యగుటచేతను, గవికృతగ్రంథ త్రయమునందును గవియొక్క సంగీతకళారహస్యనిధిత్వమును వెల్లడించు

సంగీతశాస్త్రవిషయకవర్ణనములు వెలయుచుండుటచేతను (చూ. పు. 278) నుభయులుచెప్పిన ప్రజ్ఞలయందును వైధర్మ్య మగపడకుండుటచేతను, వీరిద్దఱు నొక్కరే యనుపండితవ్యవహార మనుశ్రుతముగాఁ బ్రసిద్ధమై యుండుటచేతను, కొన్ని లక్షణగ్రంథములందు వసుచరిత్రములోని పద్యముల నుదాహరించునపు డవి బట్టుమూర్తికవికృతము లని యందు వ్రాయఁబడియుండుటచేతను, (వసు. విమ. 56, 57 పు.) సోమనాథకవి కృతమగు వసుచరిత్రటీకయొక్క యారంభమున వసుచరిత్ర బట్టుమూర్తి విరచితమని వ్రాయఁబడియుండుటచేతను, (వసు. విమ. 56, 59; 75-76 పు.) గ్రంథత్రయమునందలి కవితారీతి యేకరీతినే యుండుటచేతను, (చూ. 244 పు.) వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములకుఁ గర్త యొక్కఁడే యని కొందఱ యభిప్రాయము.

ఈయభేదవాదులకుఁ దమవాదము నిల్పుటకై కవినామపితృనామ భేదములకుఁ గారణమును జూపవలసినయావశ్యకత యున్నందున వారిలో నొకరగు మ-రా-రా-శ్రీ, రాయబహద్దరు కం. వీరేశలింగంపంతులవారు బట్టుమూర్తి వేంకటరాయభూషణునకు దత్తపుత్త్రుఁ డనియు, సూరపరాజున కౌరసుఁ డనియు, బట్టుమూర్తి యనునదియే కవినామ మనియు, 'రామరాజభూషణ' అనునది "రామరాజసభ కలంకారమునంటివాఁడు" అనునర్థము గలవిశేషణమనియు, నిట్లు నామభేదములకు సమాధానమును జెప్పిరి. మఱియు నైక్యవాదము బలపడునట్లుగ హరిశ్చంద్రనలోపాఖ్యానమున "రామవిభుగర్త శుభచిహ్నవిభవయుతుఁడ" అను దానినిబట్టి యాతనికి రామరాజనస్త్రబిరుదము 'శుభ' అనునదియే యనియు, నదియే నరసభూపాలీయమున 'శుభమూర్తి నామధేయు' ననుదానిచే నుగ్గడింపఁబడె ననియు నొకకల్పనమును జేసిరి. ఇక్కల్పనవలననే 'రామరాజభూషణ' అనునది బిరుదనామము కాదనియు నది విశేషణమాత్రమే యనియుఁ జెప్పవలసినచిక్కు వీరికి సంభవించెను. మఱియు వీరిట్లు వాదించుటలో "వసుచరిత్రాదికావ్యప్రీత బహుకృప..." అను మొదలగు హరిశ్చంద్రనలోపాఖ్యానవాక్యమునుబట్టి వసుచరిత్రము ప్రథమమనియు, నరసభూపాలీయము ద్వితీయగ్రంథమనియు సంగీకరించిరి. (చూ. వసు. విమ. 63 పు.) ఇట్టి యంగీకారమే వీరి గ్రంథైక్యవాదమునకు బాధకమయ్యెను.

'శుభ' బిరుదమువల్ల వచ్చుఘనత యేమియు నగపడకుండుటచే నట్టిదాని నొకరాజు పండితున కిచ్చుటగాని పండితుఁ డద్దానిని సంపాదించియుండుటగాని యసంగత మనియును, "రామరాజభూషణ" అనునది నామముగాక విశేషణమే యైయున్నగోడల వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములలో విశేష్యభూత మగునతని పేరిని గవి చెప్పికొనకుండుట యసంభవ మనఁదగియుండుననియుఁ, బ్రథమతృతీయగ్రంథము లగు వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములం దొకరీతిగాను వాని నడుమఁబుట్టిన ద్వితీయగ్రంథ మగునరసభూపాలీయమున వేఱొకరీతిగాను గవి స్వనామపితృనామములను జెప్పకొనుటగాని యుక్తి యాశ్వాసాంత గద్యములను విభిన్నరీతిని వ్రాయుటగాని యసంగతమనియును, వసుచరిత్రమువంటి ప్రౌఢగ్రంథమును రచించినతరువాత నక్కవి యంతకన్న నప్రౌఢ మనఁదగు నరసభూపాలీయమును రచించియుండుట యసంభవ మనియు, శ్రీవీరేశలింగముపంతులవారు కల్పించినవత్తత నిరాధార మనియును, వత్తత సుస్థిరపఱచుటకై వీరుదాహరించిన—

తే. గీ. తా రచించిన వసుచరిత్రమునఁ గన్న
తండ్రి సూరన వెలయించి తలఁపఁ డయ్యె
నన్ను మనశారదామూర్తి నాఫలంబె
దత్తుఁ డగువానిఁ జేపట్టఁదరమె నాకు"

అను పద్యమునందుఁ జెప్పఁబడినట్లు వసుచరిత్రమున సూరనను గవి చెప్పికొనియుండనందున సీ వేంకటరాయభూషణుని చెప్పిన సత్యము మిథ్య యనియును, పద్యమునైన మఱొక్కచోనైనను నిరాధారముగఁ గల్పింపఁబడినదే యని చెప్పనగుననియును, శ్రీ వ. మా. శ్రీ, పూండ్ల రామకృష్ణయ్య పంతులవారు తాము రచించిన హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికయందు శ్రీవీరేశలింగముపంతులవారివాదమును ఖండించియున్నారు. (చూ. వసు. విమ. 73, 74, 75, పు.)

ఈగ్రంథములలో వసుచరిత్ర ముత్కృష్ట మైనదగుటచే "వసుచరిత్రాదికావ్య" యని యిట్లు హరిశ్చంద్రనలోపాఖ్యానమునఁ గవి యనుగ్రహించెను. అంతమాత్రమున నది ప్రథమగ్రంథ మనునలఁగునా? "నైషధాదిమహాకావ్యములు చెక్కి చెప్పినాఁడవు" అను కాశీఖండపు వాక్యమునుబట్టి నైషధకావ్యమే శ్రీనాథుని గ్రంథములలో మొదటి

దనుటసరియా? వసుచరిత్రమును నరసభూపాలీయమునకు మున్నే రచించి యున్నయెడల నాచఱకే యిట్టి వసుచరిత్రమును గృతినంది తన కగ్రహారాది మహాసత్కారములను జేసియున్న తిరుమలదేవరాయలను, నరసభూపాలీయమున వర్ణింపవలసి వచ్చినపుడు వసుచరిత్రమునందువలెనే యాకాలమునఁ గిరీటధారి కుచితమగు 'దేవరాయ' అను బిరుదముతోఁ జేర్చి 'తిరుమలదేవరాయ' అని పేర్కొనక 'ఎఱతిమ్మ' అని పేర్కొని యుండునా? మఱియును నాతఁడు తన్ను సత్కరించిన సత్కారవిషయమును స్మరింపకుండునా? కావున నరసభూపాలీయము ద్వితీయగ్రంథ మనుట కల్ల. వేయేల? వసుచరిత్రమునందలి—

సీ. " ... ... ... ... ... ...

జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నెవ్వాని లోకేశ్వరత్వముపాసంగుఁ?

జటులశార్వరమగ్నసర్వవర్ణోద్ధార, పటిమ నెవ్వనిరాజభావ మెసఁగు?

గీ. ... ... ... తిరుమలరాయశౌరి." (వసు. 1-13)

క. "ధీరవివిధారిగిరిపవి,ధారికిఁ గర్ణాటకాంధ్రధరణీపునరు

ద్ధారికిఁ దిరుమలదేవమ,హారాయాగ్రణికి వితరణామరమణికిన్." (వసు. 1-90)

క. "ఆరామశౌరిపిమ్మట, ధీరామరశాఖి వీరతిరుమలరాయం

డు ... ... " (వసు. 1-55)

తే. " ... ... ... వీర వీరప్రతాప రాజాధిరాజ

రాజదేవేంద్ర! తిరుమలరాయచంద్ర! సాంద్రపట్టాభిషేకాంబుసముదయమున."

(వసు. 1-62)

పయిపద్యములచేఁ జరిత్రకారులు వ్రాసియున్న (చూ. వసు. విమ. 129-134 పు.) 1565-వ సంవత్సరమున మహమ్మదీయులతో జరిగిన తల్లికోటయుద్ధమునందు సంభవించిన యళియరామరాజు మృతియుఁ, గర్ణాటరాజ్యజీర్ణతయుఁ, దదనంతరమందలి తిరుమలదేవరాయల పట్టాభిషేకమును, గర్ణాటరాజ్యపునరుద్ధరణమును, దురుష్కులబారిలోఁ బడి వర్ణసాంకర్యము నొందుచున్న సర్వవర్ణములవారిని మరలఁ దిరుమలదేవరాయలు కాపాడుటయును మున్నగువిషయములు వసుచరిత్రకృతి ప్రధానము నకుఁ బూర్వభావు లని యంగీకరింపక తప్పదు. మఱియును నిట్లే—

చ. "తిరుమలరాయశేఖరుని ధీరభటాళి రణాజి యాజిలో

కరయుగశేశ్వరప్రసితఖాపబలంబులఁ జిక్క సేయ ని

ద్ధరం బెనుఁగొండ కొండలు మదద్విపచర్మ కపాలమాలికా
పరికరభూషితంబు లయి బల్విడిఁ గాంచెఁ గిరీశభావమున్." (వసు. 1-59)

అను వసుచరిత్రపద్యముచే 1577-వ సంవత్సరమున ముస్తాఫా ఖానునితో జరిగిన పెనుఁగొండయుద్ధము సయితము (వసు.పిమ. 136పు.) సూచింపఁబడియుండుటం జేసి యదియు వసుచరిత్రకృతిప్రదానమునకుఁ బూర్వమే జరిగిన దని యెన్నఁ దగియున్నది.

ఇఁక నరసభూపాలీయమునందు దన్నను యట్టి విజయనగరరాజ్య జీర్ణత వర్ణింపఁబడ నేలేదు. తిరుమల దేవరాయలు పట్టాభిషిక్తుఁ డయినట్లు వసుచరిత్రమునందువలె వర్ణింపఁబడఁ డయ్యె. మీఁదుమిక్కిలి తిరుమల రాయలనుటకు మారుగా నాతఁ డెఱుకటిమ్మపార్థివుఁ డని వర్ణింపఁబడెను. (నర. 1-82) అట్టినామ మాతని పట్టాభిషేకపూర్వావస్థను వెల్లడింపఁ గలదు.

సీ. "ఖలు నతిద్రోహి సల్కాయతిమ్మని మారించి, సకలకర్ణాటదేశంబు నిలిపె
నతుని వర్ధితునిఁ దత్సుతుని బట్టము కట్టి, కుతుపనమల్కాన తోఁటినిలిపెఁ
బదిలుఁడై రాచూరు ముదిగల్లు కప్పంబు, చేయఁ గాంచి సపాదు సీమనిలిపె
శర ఱన్నమల్కనిజామున కభయం బొసంగి తదీయరాజ్యంబు నిలిపె

తే. నవనియంతయు రామరాజ్యంబు చేసెఁ దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవిదొ వచింప సత్కావ్యములను వెలయ, భూమి నొకరాజమాత్రుఁడే రాము
[విభుఁడు." (నరస. 1-80)

సలకము తిమ్మయమూలమునఁ గర్ణాటరాజ్యము తురకలపాలిటలోఁ బడుటకు సిద్ధమయియుండఁగా, సళియరామరాజు 1542-వ సంవత్సరమున సలకము తిమ్మయను వధించి కృష్ణదేవరాయల సహోదరపుత్త్రుఁ డగు రంగక్షితీంద్రుని పుత్త్రుఁడైన సదాశివదేవరాయలకుఁ బట్టాభిషేకము చేసి కర్ణాటరాజ్యమును నిల్పినవృత్తాంతమును, మఱియు నాతఁడు తనయామాత్యుఁడగు "నిబ్రహీముకుతుబ్షాను" 1550-వ సంవత్సరమున రాజ్యమునందు నిల్పినచరిత్రయును, మఱియు 1550-వ సంవత్సరమునఁ రాజ్యమునకు వచ్చిన "అలీఅదిల్‌షా"కుఁ గల్యాణపురము నిప్పించుటకయి "హుస్సేను" "నిజాంషా"ను "ఇబ్రహీంకుతుబ్షా"ను నోడించి "హుస్సేను" కసఱు దూఱఁగా వానిరాజ్యమును వాని కొసంగినచరిత్రమును (వసుచరిత్రపీఠిక నా రచించిన వసుచరిత్ర పీఠికయందు విపులముగా

వ్రాయఁబడినవి 122—125 పు. ఫర్ గాటనెంవైరు. 180—200 పు.) బయి నరసభూపాలీయపద్యమున వర్ణింపఁబడుటచేఁ దత్కృతిప్రదానము 1557-వ సంవత్సరమునకుఁ బిమ్మట జరిగినదని విశదముకాఁగలదు.

వసుచరిత్రమునం దన్నెనో పై నుదాహరించిన 1557-వ సంవత్సరమునకు జరిగిన చరిత్రాంశము లేకాక (వసు. విమ. 124—126 పు.) తదనంతరమున జరిగిన కర్ణాటరాజ్యజీర్ణతయు, నళియరామరాజమృతియుఁ, దిరుమలదేవరాయల పట్టాభిషేకమును మున్నగునవి సైతము వర్ణింపఁబడినవి. నరసభూపాలీయమున నట్టి యనంతరవృత్తాంతములను గవి వర్ణించియుండనందున నదియే ప్రథమగ్రంథమనుట యుక్తము. మఱియు నరసభూపాలీయకాలమునకు రామరాజు జీవించియుండెననియు నూహింపనగును. అప్పటి కన్నయగు నళియరామరాజు మృతినందక జీవించియుండుట చేతనే తిరుమలదేవరాయల యభిషేకాదికము వర్ణింపఁబడలేదని యూహింపనగును. సలకము తిమ్మయవలనఁ గల్గినచిక్కులను మాపి యప్పటికిఁ గర్ణాటరాజ్యమును వృద్ధిలోనికిఁ దెచ్చినవాఁడు 'అళియరామరాజే' యని "ఖలు నతిద్రోహి సల్కయతిమ్మన హరించి, సకలకర్ణాటదేశంబు నిలిపె." (నర. 1-80) అను రామరాజవర్ణనమే వ్యక్తపఱుపఁజాలును. (వసు. విమ. 131 పు) పై వానినిబట్టి యప్పటికిఁ గర్ణాటరాజ్యస్థాపకుఁడు రామరాజేకాని 'ఎఱ్ఱతిమ్మ' అనఁబడిన తిరుమలదేవరాయఁడు కాఁడనుట స్పష్టము. మఱియు నప్పటికి సలకము తిమ్మయమూలమునఁ గర్ణాటరాజ్యము తురకలచేతిలోఁ బడకుండ నళియరామరాజు కాపాడుటమాత్రమే సంభవించె నసువిషయమును "కర్ణాటదేశంబు నిల్పె" అనునది స్ఫురింపఁజేయును; గాని యిది వసుచరిత్రములోని "జీర్ణకర్ణాట" పదమువలెఁ గర్ణాటరాజ్యజీర్ణతను వ్యక్తపఱుపఁజాలదుగదా! అళియరామరాజు బ్రదికియుండు కాలమునఁ గర్ణాటరాజ్యమునకు జీర్ణతయెట్లు? అళియ రామరాజుతోడనేకదా కర్ణాటసామ్రాజ్యలక్ష్మి యస్తమించినది!

పయి నుదాహరించిన నిదర్శనములను బట్టియేకాక కవిత్వపురీతిని బట్టిచూచినను నరసభూపాలీయ మప్రౌఢదశయందును వసుచరిత్ర మంతకంటెఁ బ్రౌఢదశయందును రచింపఁబడెనని స్ఫురింపకపోదు. (వసు. విమ. 66-70 పు.) కావున నరసభూపాలీయము మొదటిగ్రంథ మనియు; వసు

చరిత్రము ద్వితీయగ్రంథ మనియుఁ జెప్పుట యుక్తము. అట్లు గ్రహించి నపుడు ప్రథమగ్రంథ మగు నరసభూపాలీయమునందలి కవినామ పితృ నామములకును నాశ్వాసాంతగద్యమునకును, భిన్నముగా ద్వితీయ తృతీయగ్రంథము లగు వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములరీతు లుం డుట విరోధింప నేరదు. ఆవిషయమునే యిఁకఁ గొనసాగ జూపుచున్నాఁడను.

తిరుమలదేవరాయల యాశ్రయమే కాక యాతని యన్నయగు నళియరామరాజు నాశ్రయమును నేనప్పుడు భట్టుమూర్తి యారాజులకు మేనల్లుఁ డగు నొబళరామరాజు నాశ్రయించి తన కావ్యాలంకారసంగ్ర హమును కాతనిఁ గృతినాయకునిఁగాఁ జేసి తన్మూలమున నళియరామరాజు నాశ్రయమును సంపాదించి యాతనియెడఁ బాత్రుఁడై యనన్య సాధా రణ మగు 'రామరాజభూషణ' అను బిరుదమును గాంచెననియు, నాకా రణముననే తదనంతరభాగము లగు వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యాన ములలో నట్టి తన లోకప్రసిద్ధబిరుదనామమునే పేర్కొనెననియును హరి శ్చంద్రనలోపాఖ్యానమున 'రామవిభుదత్త' మనికవి చెప్పుకొనిన బిరుద మిదియేయనియు గ్రహించుట సమంజసముగా నుండును.

భట్టుమూర్తికి 'రామరాజభూషణ' అనునది రామరాజదత్త మగు బిరుదనామమైనట్లే, యాతని తండ్రియగు సూరపరాజునకు 'వేంకటరాయభూషణ' అనునది వేంకటరాయలచే నీయఁబడిన బిరుద నామమైయుండును. ఆకాలమున నట్టి 'భూషణ' బిరుదములుండుట యాచారమైయున్నట్లు 'పైడిమఱ్ఱి వేంకటపతి' పూర్వుఁడగు, చంద్రాం గదచరిత్రమందు వర్ణింపఁబడిన (కవులచరిత్ర - ప్రథమముద్రణము, భా. 2. పు. 23). కృష్ణదేవరాయభూషణుఁడే వ్యక్తపఱుపఁగలఁడు. ఈ వేంకటరాయ లచ్యుతదేవరాయలకుమారుఁడై యుండుననని యూహింప నగును. అతఁడు కొందఱనుకొనుచున్నట్లు బాలుఁడై చనిపోలేదు. అతఁడు విద్వన్నిధియైయుండెను. (చూ. ఆను. విమ. 115 పు.) పై రీతిని నామభేదములకు సమాధానము నంగీకరించి వీరిద్దఱును నొక్కరే యని గ్రహించుట యుచితము.

అట్లైన ద్వితీయ తృతీయగ్రంథములయందుఁ గవి తన ప్రథమ గ్రంథ మగు నరసభూపాలీయమునందు, దన కొంటిపేరగు మూర్తినామమును, దన తండ్రిబిరుద మగు వేంకటరాయభూషణనామమును, పేర్కొన

కుండుటకుఁ గారణ మే మని శంకింపఁజనదు. వసుచరిత్రము వంటిమహా ప్రబంధమును రచించి యందుఁ దనకవితయొక్క యప్రౌఢదశను సూచించు నరసభూపాలీయమును జెప్పికొనకుండుటగాని, చక్రవర్తిప్రతినిధి యగు రామరాజుమూలమున లభించిన యనన్యసాధారణ మగురామ రాజభూషణనామమును జెప్పికొనుచున్నపుడు బట్టుకొలమును వెల్ల డించుతొంటి నిజనామ పితృనామములను విశదపఱుపకుండుట గాని వింతకాదు. మఱియు, హరిశ్చంద్రనలోపాఖ్యానములోని "వనధిలం ఘన......" (ఆ 1-58) అను పద్యమునఁ దండ్రిపేరు చెప్పినపుడు, పితామహ ప్రపితామహనామములందువలెనే యందును బట్టువారి కుచిత మగురాజపదమును జేర్చి "సూరపరాజు" అని యైనఁ జెప్పుటకుఁ జోటు చాలక "సూరపాత్మజుఁడ" అని చెప్పికొనియున్నాఁడు. ఆకా రణమున నయితమును తనయొక్కయుఁ దండ్రియొక్కయు నామాంతర ముల నెల్లను నందు నిల్పఁజాలకపోయె ననియు నెన్నఁదగును. మఱియుఁ దాను రచించినగ్రంథముల నెల్ల దస్తావేజునందువలె, సురపునామము లతోఁ బేరుల నుదాహరింపక తీరదని కాని, తనపూర్వపూర్వగ్రంథముల నెల్ల నుత్తరోత్తరగ్రంథములందుఁ జేర్కొనక తప్ప దని కాని, నియ మము లేదు గదా! బహుగ్రంథకర్త లగుశ్రీనాథాదు లట్లు పేర్కొని యుండలేదనుట యెల్లరకును విదితమే. (చూ. 13 పు). ఇంతియగాక సుప్రసిద్ధుఁడై యుండిన రామరాజభూషణుఁడు తనవిషయమునం దిట్టి వికల్పములు వచ్చునని తలఁచి యుండఁ డగును. అట్లే తలఁచియున్నచో నొక్కరీతినే గ్రంథత్రయమునందు నిజనామాదికమును జేర్కొని పూర్వగ్రంథములను రచించియుండునా? ఇంకను వానిని రిజిష్టరు చేయించునా?

భేదవాదులలో నొకఁడగు శ్రీపూండ్ల రామకృష్ణయ్యపంతులవారు నరసభూపాలీయకర్తకు శారదామూర్తి అనునది నిజనామమనియు, నట్లే వసుచరిత్రకర్తకు రామరాజభూషణుఁ డనునది బిరుదనామము కాదనియు, నదియే నిజనామ మనియు, నందలి రాజపదము బట్టుకొలము వారికిని, భూషణపదము ప్రబంధాంకమువారికిని గ్రమాగతముగవచ్చు బిరుదనామములనియు వ్రాసియున్నారు; కాని వేంకటరాయభూషణ పదములో 'రాయ' శబ్దమున్నదిగాని 'రాజ' పదము లేదు; శారదా

ఖ్యాతినామమందును గని పితామహప్రపితామహుల పేరులయందును భూషణపదమును లేదు. వివాదస్థ వేంకటరాయభూషణనామమున నొక్క భూషణపద మున్నంతమాత్రమున వారివాదము బలపడనేరదు. కావున నప్పుడు కిరీటధారు లగు రాజులకు నియతముగా నున్న ‘రాయ’ పదమును బట్టి ‘వేంకటరాయభూషణ’ అను నది కృష్ణరాయభూషణ బిరుదము వలనే వేంకటరాయదత్తమగు బిరుదనామ మని చెప్పుటయే యుక్తము. అళియ రామరాజు కిరీటధారి కాక సదాశివదేవరాయలనే కిరీటధారిని జేసి తాను కర్ణాటరాజ్యధురంధరుండై యుండుటచే నాతనికి ‘రామదేవ రాయ’ అను పేరు రాలేదు. (వసు. విమ. 133 పు.) కావుననే యాతని మూలమున లభించిన రామరాజభూషణ బిరుదమునందును భూషణపద మున్నను, రాయపదము లేకయున్నదనియు, రామరాజపదములోని రాజపదమే నిల్చినదనియు గ్రహింపవలెను.

పయి నుదాహరించిన రీతిని నామభేదములు శంకాస్పదములు కానట్లే యాశ్వాసాంతగద్యముల విభిన్నప్రవృత్తియును శంకాస్పదము కానేరదు. రామరాజభూషణుడను తనవిద్యావైభవమునకును మూలము హనుమంతుని ప్రసాదమని తలంచుచున్నవాడగుటచే గ్రంథత్రయము నందును నాంజనేయుని బ్రశంసించియున్నాడు.

“జగత్ప్రాణనందనకారుణ్యకటాక్షలబ్ధకవితా (వసు. 1-16)

అను వసుచరిత్ర పద్యభాగమునందును

“వనధిలంఘనకృపావర్ధితోభయకవితాకలారత్నరత్నాకరుండ” (హ.న.అవ.58)

అను పద్యభాగమునందును స్పష్టముగానే చెప్పబడియుండెను. ఈ పద్య భాగముల యభిప్రాయమునే “ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసాంద్ర సారస్వతాలంకార...” అను నరసభూపాలీయాశ్వాసాంతగద్యము స్ఫుట ము విశదపఱుచుచున్నది. “ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందనపవన నందన ప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య” అను వసు చరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములలోని గద్యములును నదే యభిప్రా యమునే యుగ్గడించుచున్నవి. కాని వీనియందు “శ్రీరామచంద్రచర ణారవిందవందన” అనునది యధికమైయున్నదనుమాట నిజమే. అట్లైనను నరసభూపాలీయానంతరకాలమున గవికి ముదిరిన రామభక్తిశ్రేయ మున నయ్యది సంభవించెనని గ్రహింపవలసియున్నది.

పయిరీతిని గవినామపితృనామాదిభేదములును, నాశ్వాసాంతగద్య భేదములును, బట్టుమూర్తి రామరాజభూషణులకైక్యమును భేదింపఁ జాలవని యెన్నవలెను. అట్లే మూర్తికవి చెప్పికొనిన 'శతలేఖినీ పద్యసంధానాదిప్రజ్ఞలు (నరసభూపాలీయమునఁ జెప్పికొనినవి) వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములలోఁ జెప్పికొనిన 'చతుర్విధకవితానిర్వాహక' రూపప్రజ్ఞలతోనే గర్వము లగుచున్నవి గాన నదియు శంకాస్పదము కానేరదు. ఏమనఁగా? తిక్కన శ్రీనాథాదుల గ్రంథములందును నిట్టిభేదములు గొన్ని యగపడుచున్నవి. నిర్వచనోత్తర రామాయణమునందలి 'తిక్కన' భారతమునఁ 'దిక్కనసోమయాజి'యై యున్నాఁడు. నైషధమున శ్రీనాథుఁడు 'సకలవిద్యాసనాథశ్రీనాథభట్ట'యి యుండియు, హరవిలాసములో 'వినయవిధేయ శ్రీనాథనామధేయుఁ'డై యున్నాఁడు. ఈతనికిఁ బ్రసిద్ధములైయున్న 'కవిరాజు' 'కవిసార్వభౌముఁడు' అను బిరుదము లాతని గ్రంథములం దెందును గానరావు. కూచిమంచి తిమ్మకవి తన మొదటి గ్రంథమునందు లేని 'సకలసంస్కృతాంధ్రకళాకౌశలాభిరామ' అను బిరుదమును రసికజనమనోభిరామాదులలో వేసికొనియున్నాఁడు.

ఇంత యేల? బట్టుమూర్తియే వసుచరిత్రమును వ్రాసెనని లిఖించిన వసుచరిత్రవ్యాఖ్యాత యగు నరసింహనాథకవిగాని, యితరలాక్షణికులుగాని, తక్కిన పండితలోకముగాని యీయాశ్వాసాంతగద్యములను, కవినామపితృనామబోధకము లగుపద్యములను, కవుల ప్రభావములను వర్ణించుపద్యములను జూచియుండలేదనికాని, యర్థము చేసికొనియుండలేదనికాని చెప్పఁజాలము గదా! ఇట్టి భేదము లున్నపుడు నిజముగాఁ గవియొక్కఁడే యైనను నభిన్నుఁ డనునభిప్రాయము పుట్టుట సహజము కాని వేఱైయుండినపుడు భిన్నులను నభిప్రాయము పుట్టుట సహజము కాదు. కాఁబట్టి ప్రసిద్ధుఁ డగు రామరాజభూషణుఁడే బట్టుమూర్తియై యుండుటచేత స్థూలదృష్టిని గ్రంథములు చదువునపుడు సామాన్యముగాఁ గలుగవలసిన (కవులు) విభిన్నులను నభిప్రాయ మడంగంటె నిజ మగు నభేదాభిప్రాయమే ప్రసిద్ధిలోనికి వచ్చిన దనుట స్పష్టమై యున్నదిగదా! నిపుణముగాఁ బరికించినచో గ్రంథములందలి కృత్యాదిస్తుతులు తద్గ్రంథకర్త్రైక్యమును వెల్లడింపఁజాలియున్నవి. ఎట్లనఁగా: నరసరాజు 'రామ

రాజులయాశ్రయము పొందకునప్పటికి కీతనికి వేంకటేశ్వరుఁ డిష్టదైవతమై యుండెను. కావుననే యా వేంకటేశ్వరరూపహారిని దద్భార్యయగు లక్ష్మిని నరసభూపాలీయకృత్యాదిని స్తుతించియున్నాఁడు. ఆ వేంకటేశ్వరుఁడే యట్టి రాజాశ్రయములను గల్పించి యట్టి గొప్ప యైశ్వర్యమును బ్రసాదించెనని కవి తలంచుచుండె నని "శాశ్వత శ్రీవేంకటేశ్వరానుగ్రహ, నిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ" (హ.న. 1-53) అను హరిశ్చంద్రనలోపాఖ్యానపద్యభాగము సూచించుచున్నది. పయి నుదాహరించిన సందర్భము నరసభూపాలీయ వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానముల యేకకర్తృత్వమునకుఁ గొంత నిదర్శనము కాఁగలదు. ఇంతియకాక కవియే తనచేత నరసభూపాలీయకృత్యాదిని వర్ణితు లగు శ్రీరాముఁడును సీతయు నభిన్నులని వర్ణించి తన్మూలమున గ్రంథకర్త్రైక్యమును సూచించియున్నాఁడు.

"శా. శ్రీలీలావతిఁ దా నురోమణిసభాసింహాసనత్కౌస్తుభా
వేలాభా ప్రతిబింబితాంఘ్రి యయినన్ జేటొక్కటం దాల్చినాఁ
డౌ లే యంచు దలంచునో యని యమందానందుఁ డై లక్ష్మి నే
వేళం గౌఁగిటఁ జేర్చు శౌరి నరసార్వీనాథునిం బ్రోచుతన్." (నరస. 1-1.)

"శా. శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్థలీ
లాభివ్యక్తివరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచున్ మదిం
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోచుతం దిరుమలేంద్రశ్రీమహారాయనిన్." (వసు. ఆ. 1-1.)

"సీ. ఏలేమ కడలిరాచూలి యై చెలఁగించుఁ, గళితవళీతరంగములరంగు
ఏమానినీరత్న మిందుసోదరి యౌటఁ, బ్రకటించు పొంగముపోలిక తెఱంగు
ఏతన్వి కందర్పమాత యై చెలఁగించుఁ, గరగృహీతాంభోజకాండకలన
ఏసాధ్వి దనుజారియిల్లా లవుటఁ దెల్పు, నలి విసీలాబ్జజిన్నయనగరిమ
తే. గీ. అట్టి శ్రీదేవి సుకవివాగమృతదంబు, నఖిలభువనోన్నతము నైననౌబళేంద్ర
నరసవిభుమందిరం బాత్మశరణ మనుచు, నుండి యేకాలమును బాయకుండుఁ
[గాత." (నరస. 1-2)

"సీ. సకలలోకాభినంద్యకళాకలాపంబు, దొరయయు నెమ్మోము చందురునితోడ
బహుదివ్యఫలపరిపాకసౌభాగ్యంబు, నెరపు కెమ్మోవిమానికముతోడ
నవవయశ్శ్రీనిధానంబులై తగుసురో, భవసుధాపూర్ణకుంభములతోడ
నమ్లానసుమమాలికాభిరూప్యముఁ దాల్చు, లలితభుజాకల్పలతలతోడ

తే. గీ. నడరి జనకాబ్ధిసీమ రామాభిధాన, హరి కవీంద్రగుణప్రాతహారశరాస
గిరిమథనయత్నమునఁ దోఁచు సిరి యశేష, రాజ్యములొసంగుఁ దిరుమలరాయ
[మణికి." (వసు. 1-2)

"సీ. నిఖిలలోకానందనీయస్థిరోద్భూతిఁ......కరుణించుఁగాత." (హ. న. 1-2)

కొన్ని వాడుకలుసైత మీయైక్యవాదమునకు సాధనములయి యున్నవి.

"ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక! నీవు ప్రోవ ని
చ్చోటి భవన్నఖాంకురము సోఁకె గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటినవిచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందఁగాన్." (మను. 2-70.)

"ఉ. ఈఁకునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబునన్
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్." (పారి. 1-133.)

"శా. అజాబిల్లివెలుంగువెల్లికల దాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ జటాగ్రం బొత్తి యొగ్గెత్తి యా
రాజీవాసన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగన్." (వసు. 4-52)

అను పద్యములను విని తెనాలిరామకృష్ణకవి "అల్లసాని పెద్దన యల్లనల్లన నేడ్చెను, ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను, బట్టుమూర్తి బావురుమని యేడ్చెను" అని పల్కినట్లుగ నొకవాడుక కలదు. ఆయేడ్పుపద్యములలో బట్టుమూర్తి తనదగు మూఁడవ పద్యము వసుచరిత్రములోనిదగుటచేత బట్టుమూర్తియే వసుచరిత్రకర్త యగురామరాజభూషణుఁ డను నభిప్రాయమును బయిువాడుక బలపఱచుచున్నది. ఇంకను నిట్టిసైతిహ్యములు పెక్కు గలవుగాని విస్తరభీతిచే నుదాహరింపనైతిని.

## బట్టుమూర్తి జీవితము

ఈ మహాకవిజీవితములోని కొన్నివిషయములకు జనశ్రుతులు మున్నగునవి మాత్రమె యాధారములు లయియున్నవి. కొన్నియెడల నిందట్టిపుక్కిటిపురాణముల నాధారముగాఁ జూపియుఁ గొన్నివిషయము

లూహించియు వ్రాసియున్నాను. అయ్యవి కేవలము సత్యము లని రూఢిగా నమ్ముటకుఁ దగిన నిదర్శనములు కాకున్నను నవి కేవల మస త్యము లనియు నిర్ణయించుటకుఁ దగిన యాధారము లగపడవు. కాన జనరంజకము లై ప్రసిద్ధము లై యందఱచేతను జెప్పికోఁబడుచున్న యట్టివిషయములు నాతని జీవితసందర్భమునఁ జదువరులకుఁ జూపకుండ నేల యని యెంచి వానిని గొన్నిటి నిందుఁ బొందుపఱిచియున్నాను. అట్టివాని సత్యాసత్యములను నిర్ణయించుకొనుభారము విమర్శకు లగు చదువరులే వహింతురుగాక !

"ఉ. లొట్ట! యిదేటిమాట పెనులోభులతో మొగమోటయేల ? తాఁ
గట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపు ర్వనియందు శే కదా
పట్టపురాజుపట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నేఁ
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్రభయంకరంబుగాఁ
దిట్టితినా మహోగ్రహమతిన్ మకరగ్రహజర్జరీభవత్
పట్టపుఘట్టఘాలఫణిభర్తృజుహూకృతపర్జటస్ఫుటా
ఘట్టనఘట్టనాలకవిఘట్టకనిర్గళరాజభృత్యకీ
చట్టచటార్భటీనయనజర్జరకీలలు రాలఁగా వలెన్
జుట్టతికంబునన్ బాగడఁ జూచితినా రజతాద్రిధిత్యకా
పట్టణమధ్యరంగగతభవ్యభధూవదనానుషంగసం
ఘట్టశిరస్థగాంగఝరహల్లకజాలసుధాతరంగముల్
చుట్టుకొనన్వలెన్ భువనచోద్యముగా భయదంబుగా మతిన్
దిట్టితినా సభాభవనధీంకృతభీమనృసింహరాడ్ద్విజా
తాట్టమహాట్టహాసచతురాస్యసముద్భ్రుకుటీతటీనటీ
కోట్టణరోషజాలవ్యాతకుంఠితకంఠగభీరనాదసం
ఘట్టవిజృంభమాణగతిఁ గావలె దీవనపద్య మిచ్చి చే
పట్టితినా మణీకనకభాజనభూషణభాసురాంబరా
రట్టతురంగగంధగజరాజదమూల్యఘనాతపత్రభూ
పట్టణభర్మహర్మ్యభటపంక్తిచిరాయు వనామయంబు నై
గట్టిగఁ దోడుతో వెలయఁగా వలె నెక్కువకీవిఁ జూడుఁడీ
యట్టిటుమందె మేలముల నందఱినింబలెఁ జుల్కఁజూచి యే
పట్టున నైనఁ గేరడము పల్కకుఁడీ పయివచ్చు నందులన్

గొట్టుదు దుష్కవిద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవిబృందము కే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లె లేఁబదియుఁ గాఁగలనూటపదాఱు లెయ్యెడన్
రట్టడి భట్టుమూర్తికవిరాయనిమార్గ మెఱుంగఁ జెప్పితిన్."

దీనినిబట్టి చూడఁగా భట్టుమూర్తి నెవ్వరో కేరడము లాడి నిరసించినట్లును, నందుల కాతఁడు కినిసి తిట్టుపద్యములఁ జెప్పెద నని భయపెట్టినట్లును స్ఫురించుచున్నది. ఈయుత్పలమాలికకుఁ బ్రతిభటముగా నల్లసాని పెద్దనార్యుని యుత్పలమాలిక రచింపఁబడినట్లు తోఁచుచున్నది. పయిభట్టుమూర్తి యుత్పలమాలికకుఁ గృష్ణదేవరాయలు మెచ్చుకొనఁగా నల్లసాని పెద్దనార్యుఁ డాశుకవనమున నంతకన్న నతిమనోహర మగు నీ క్రింది యుత్పలమాలికను జెప్పి రాజును మెప్పించి కవిగండపెండేరము నందె నని చెప్పుదురు.

"ఉ. పూఁత మెఱుంగులుం బసరుపూఁప బెడంగులు నూపునట్టివా
కైతలు జగ్గునిగ్గు నెనఁగావలెఁ గమ్మనఁ గమ్మన న్వలెన్
రాతిరియున్ బవల్ మఱపు రానిహొయల్ చెలియారజంపుని
ద్దారితీపులం బలెను దారసిల న్వలె లోఁదలంచినన్
బాఁతిగఁ బైకొనన్ వలెను బైదలికుత్తుకలోనిపల్లటీ
కూఁత లన న్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినకన్నియచిన్నిపొన్నిమే
ల్మూఁతలచన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టిచూచినన్
డాతొడ నున్నమిన్నుల మిటారపుముద్దులగుమ్మకమ్మనా
వాతెఱదొండపండువలె వాచవి గావలెఁ బంటనూదినన్
గాతలఁ దమ్మిచూలిదొరకైవసపుంజవరాలిసిబ్బెపు
న్మేతెలియబ్బులంపుజిగినిబ్బరపుబ్బగుగబ్బిగుబ్బపొం
బూఁతల నున్నకాయసరిపోఁడిమి కిన్నెరమెట్లబంతిసం
గాతపుసన్నబంతి బయకారపుఁగన్నడగౌళపంతుకా
సాతతతానతానలపసందివుటాడెడుగోటమీటుటల్
మ్రోఁతలునుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెన్గు నీ
రీతిగ సంస్కృతంబు పచరించెడుపట్టుల భారతీవధూ
టీతపనీయగర్భనికటీభవదానవపర్వసాహితీ
భౌతికనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా

శీతనగాత్మజాగిరిశశేఖరశీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూరబహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతిచుంచువిపంచికామృదం
గాతతతేహితత్తహితహాధితధంధణుధాణుధింధిమి
వ్రాతనయానుకూలపదవారకుహూద్వహహారికింకిణీ
నూతనఘల్ఘళాచరణనూపురఝూళఝుళీమరందసం
ఘాతవియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహో
ద్యాతకుమారగంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతముఁ జల్లఁజేయవలెఁ జిల్లునజల్లువలెన్మనోహర
ద్యోతకగోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారెసారెకున్."

బట్టుమూర్తి యుత్పలమాలికవలెఁ గాక యిది సగము చ్చ తెనుఁగుగను, సగము సంస్కృతప్రచురముగను వెలయుచున్నయది. పెద్దనార్యుని యీయుత్పలమాలికలోని యాచ్ఛికభాగము ముద్దులమూరియుచున్నదనియు, సంస్కృతభాగమున భారతి తాండవమాడుచున్నట్లున్నదనియు నందలిసొంపు వర్ణనాతీతమైయున్నదనియుఁ జెప్పుటకు సందేహము లేదు. "అల్లసానివాని యల్లికజిగిబిగి" అనునట్లు కేవలపదసంఘటనాచాతురియే కాక యీయుత్పలమాలికయందలి యభిప్రాయములును మిక్కిలి మనోహరములుగా నున్నవి.

రామరాజభూషణుని యుత్పలమాలికయందలి 'రాలఁగావలెన్', 'చుట్టుకొనన్వలెన్', 'కావలెన్', 'వెలయఁగావలెన్' అనువాని నందుకొని పెద్దనార్యుఁడు "అటువలెఁగాదు కవితారచన యిటు లుండవలెను" అని యుపదేశించినవాఁడుపోలె 'జగ్గునిగ్గునెనఁ గావలెన్', 'కమ్మనఁగమ్మనన్వలెన్', 'పల్లటీకూఁతలనన్వలెన్', 'సొగసుకోర్కులు రావలెన్', 'ముచ్చటగావలెన్', 'వాచవిగావలెన్', 'హరువు మొల్లముగావలెన్', 'చేతము చల్లఁజేయవలెన్', 'చిల్లునఁ జల్లువలెన్' అని యిట్లు సంస్కృతాంధ్రరచనాపద్ధతిని జూపి బట్టుమూర్తి యుత్పలమాలికలోని కొఱతనుద్ఘాటించియున్నాఁ డనియుఁ దోఁచుచున్నది. పయి సందర్భమునుబట్టిఁ పయిరెండుత్పలమాలికలును సమకాలికము లనియు, నందు బట్టుమూర్తిమాలిక మొదటి దనియు స్ఫురించుచున్నది.

పయి నుదాహరించిన నిదర్శనములంబట్టియు బట్టుమూర్తి కృష్ణదేవరాయలయాస్థానములోని యష్టదిగ్గజములలోనివాఁడను పండిత జనవ్యవహారమునుబట్టియు "ముప్రత్యయాభావ స్యాల్లసానిపెద్దనార్య శిష్యేణ బట్టుమూర్తిమహాకవినావిరచితే వసుచరిత్రే" అను (ఆంధ్రకవుల చరిత్రము, ద్వితీయభాగానుబంధము, 1?? పు.) నాంధ్రకౌముదీ వాక్యమును బట్టియు, బట్టుమూర్తి కృష్ణదేవరాయలకాలముననే బాలకవియై యున్నట్లు విశదపడుచున్నది.

మ. రా. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు జీర్ణకర్ణాటరాజ్య చరిత్రములో (2?2 పు.) రామరాజభూషణుఁడు కృష్ణదేవరాయల కాలములోనివాఁడు కాఁడని స్పష్టముగా వ్రాసియున్నారు. రామరాజ భూషణ కృతమగు వసుచరిత్రమునందలి "తిరుమల రాయశేఖర..." (చూ. 7 పు.) అనుపద్యముచే క్రీ. శ. 1577 వ సంవత్సరమున జరిగిన పెనుఁగొండ యుద్ధము సూచింపఁబడుచున్నందున (ఫెరిస్తా 3 వ పుస్తకము, 141 పు.) నంతకుఁ బయిగా రామరాజభూషణుఁడు జీవించియుండెనని యంగీకరింపవలసియున్నది గాన 1530-వ సంవత్సరమునకే చనిపోయిన కృష్ణదేవరాయలసభలో నాతఁడు పండితుఁడై యుండుట యెట్లు పొసఁగును ? అని వారియాశయ మయియుండవచ్చును. కాని బట్టుమూర్తి 1510 వ సంవత్సరప్రాంతమునఁ బుట్టియున్నను 1?3? వఱకు రాజ్యము చేసిన కృష్ణదేవరాయలయాస్థానిలోఁ బండితుఁడై యుండుట గాని 1?80-వ సంవత్సరమునకుఁ బయిగా జీవించియుండుట గాని యసంభవము కానేరదు. సుమారు 20 సంవత్సరముల ప్రాయమునఁ బండితులయియుండుటయు 70 సంవత్సరములకుఁ బయిగా జీవించియుండుటయు నిప్పుడును నగపడుచుండుటచే నవి యసంభవము లనుట సరికాదు. బట్టుమూర్తికి రామరాజభూషణుఁ డను బిరుదము నిచ్చిన యళియరామరాజు కృష్ణదేవరాయల యల్లుఁడగుట సుప్రసిద్ధము. (అళియ = అల్లుఁడు. కన్నడము.)

ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యల సదాశివరాయనిరంతరాయవి
ద్యాపురరాజ్యలక్ష్మికి నిదానము తా నయి మించె నెంతయున్.(రామా.అ.1.)

అట్టి యళియరామరాజు కృష్ణదేవరాయలకాలమునందును నంతకు ముందును వీరుఁడై సేనలను నడిపించియున్నట్లు జీర్ణకర్ణాటరాజ్యచరిత్రమున (250 పు.) మ. రా. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారే వ్రాసియున్నారు. ఆయళియరామరాజు 1565 వ సంవత్సరపుఁ దల్లికోట యుద్ధమునకు సయితము మహాసమర్థుఁడై యున్నట్లు చరిత్రకారు లందఱును వ్రాసినారు. అట్టిస్థితిలో నాతనికాలపువాఁ డగురామరాజభూషణుఁడు మాత్రము కృష్ణదేవరాయలకాలము నాఁటికిఁ బండితుఁ డగుటయు 1580 వ సంవత్సరమునకుఁ బయిగా జీవించి యుండుటయు నసంభవము లనుట సరియా ?

పై నుదాహరించినరీతిని బట్టుమూర్తి కృష్ణదేవరాయల సభలోని యష్టదిగ్గజములలోఁ దా నొకఁడై యుండెనని గ్రహించుట విరుద్ధము కానేరదు. ఆతఁ డప్పటికి బాలకవియై యుండి యింకను విద్యాభ్యాసమునే చేయుచుండుటచే నేగ్రంథమును నప్పటికి రచింపలే దనియుఁ గేవలము చతుర్విధకవిత్వములను చెప్పుచు నవధానతంత్రములను జేయుచు నుండెడివాఁ డనియుఁ దోఁచుచున్నది. పయి నుదాహరించిన యాతని యుత్పలమాలిక కొంతవఱకు నిదర్శనము కాఁగలదు.

పై నుదాహరించినరీతిని గృష్ణదేవరాయలకాలముననే, కవియై యుండియుఁ గొంతకాలమువఱకు నేకృతియు రచింపకుండుట కాతని సంగీతకళారహస్యనిధిబిరుదసంపాదక మగుసంగీతవ్యాసంగమును, శతలేఖినీపద్యసంధానాద్యవధానకృషియుఁ గారణములై యుండ నోపును. లేదా తత్కృతకృతులు రామరాజును మెప్పించితి నని కవి వసుచరిత్రలోఁ జెప్పికొనిన కృతులవలె నంతరించి యుండినను నుండ వచ్చును. రామరాజభూషణుఁడు సంగీతశాస్త్రమునం దెక్కుడు వ్యాసంగము చేసినవాఁ డనుటకును, నం దెక్కుడగునభిరుచి గలవాఁ డనుటకును, నాతఁడు 'సంగీతకళారహస్యనిధి' నని స్వయముగాఁ జెప్పికొనుటయు నాతని గ్రంథత్రయమునందును ననేక పద్యములు సంగీతశాస్త్రప్రచురము లయియుండుటయు నిదర్శనములు కాఁగలవు. "ఇఁక దక్షిణదేశములోని వీణె నచలటాటు (అనఁగా నచలమేళనము) చేయుపని నవలంబించవలసివచ్చినది.........రామరాజభూషణుఁ డట్టి కార్యముఁ జేయంబూనికొనియెను.........కావున సరస్వతివీణె యగు

కచ్ఛపి పండ్రెండేసిమెట్లు గలరెండుస్థాయులు గలదిగా, రామరాజ భూషణకవివలనఁ జేయఁబడినది." అని గురుజాడ శ్రీరామమూర్తి పంతులవారు వ్రాసియున్నారు. (కవిజీవితములు 374 పు.)

పయిరీతిని గృష్ణదేవరాయల యనంతరమందుఁ గొంతకాలమువఱకు రామరాజభూషణుఁడు సంగీతసాహిత్యవ్యాసంగములతోను, నవధాన కరణాభిరుచితోను గాలము నడపిన ట్లగపడుచున్నది.

అట్లు చిరకాలము విద్యాభ్యాసముచేసి సంగీతసాహిత్యములం దసమానుఁ డయి రామరాజభూషణుఁడు నరసభూపాలీయమును రచించి యోబళనరసరాజును గృతినాయకునిగాఁ జేసి, తన్మూలమున నాతనిమేన మామయు నప్పటికి విజయనగరసామ్రాజ్యధురంధరుఁడును జక్రవర్తి ప్రతినిధియు నయియున్న యళియరామరాజు నాశ్రయము సంపాదించి, యాతనిసభ కలంకారమై యలరి రామరాజభూషణబిరుదముం గాంచె ననియు ననేకసంస్కృతాంధ్రకృతులచే నాతని మెప్పించి గొప్ప సన్మానముల నొందె ననియు గ్రహింపవలయును. అందుల కీక్రిందిపద్యములు నిదర్శనములు కాఁగలవు.

" శా. శ్రీరామక్షితిపుణ్ మదగ్రజు ... ధన్యుండ వీ వన్నిటన్." (వసు. 1-17)

" సీ. వనధిలంఘనకృపావర్ధితో భయకవితాకళారత్నరత్నాకరుండ

సకలకర్ణాటరక్షాధురంధరరామ, విభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ." (హ. న. 1-53)

పయి నుదాహరించిన వసుచరిత్రపద్యమునందుఁ జేర్కొనఁబడిన 'బహుసంస్కృతాంధ్రకృతు' లిప్పు డగపడకున్నవి. అయ్యవి యంతరించియుండు నని కొందఱియాశయము. అయ్యవి సంగీతానుకూలకృతులే యనియుఁ, బ్రబంధములు కావనియును, నళియరామరాజు సన్నిధి నున్నకాలమున రామరాజభూషణుఁ డేగ్రంథమును రచింపలే దనియు, రామరాజు గాననాట్యాదిప్రియుం డై యుండుటంజేసి యట్టి సమయమున కుచితము లగుకృతులను రచించి యట్టివినోదముతో నాతని మెప్పించుచు వచ్చె ననియుఁ గొందఱు తలంచుచున్నారు. అక్కాలమునకు వసుచరిత్రరచన యారంభింపఁ బడియుండిన నుండ వచ్చును.

అళియరామరాజు 1565-వ సంవత్సరమున జరిగిన తల్లికోట యుద్ధములోఁ జనిపోయినందున, నాతనిసోదరుఁడును పెనుగొండ

రాజ్యాధిపతి యై కిరీటమును ధరించి తల్లికోటయుద్ధమున జీర్ణించిన కర్ణాట రాజ్యమును మరల వృద్ధిలోనికిఁ దెచ్చినవాఁడును నగుతిరుమలదేవరాయల నాశ్రయించి, రామరాజభూషణుఁ డావఱకుఁ దాను రచించి యున్న వసుచరిత్రము నాతనికిఁ గృతి యిచ్చియున్నాఁడు.

ముస్తాఫాఖానునితో 1577-వ సంవత్సరమున జరిగిన పెనుగొండ యుద్ధము వసుచరిత్రమున "తిరుమలరాయ శేఖరుని..." అను వెనుక నుదాహరించిన (8 పుట.) పద్యముచే సూచింపఁబడియుండుటచేతను, 1580-వ సంవత్సరమున మహమ్మద్ కూలీకుతుబ్ షాతో జరిగినయుద్ధము (వసు. విమ. 136—139 పు.) వర్ణింపఁబడకుండుటచేతను, వసుచరిత్ర కృతిప్రదానము 1577-వ సంవత్సరమునకుఁ బిమ్మటను 1580-వ సంవత్సరమునకుఁ బూర్వమునను జరిగియుండు నని చెప్పనగును.

అట్టివసుచరిత్రపుఁగృతిప్రదానమున మెచ్చి తిరుమలదేవరాయలు తనకు రత్నాభిషేకము చేసినట్లు హరిశ్చంద్రనలోపాఖ్యానములోని "వసుచరిత్రాదికావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నాప్లవుండ" అనుపద్యభాగమునఁ గవి చెప్పికొనియుండుటచే హరిశ్చంద్రనలోపాఖ్యానమును శ్రీరామాంకితముం జేయుట 1580 వ సంవత్సరమునకుఁ బరమందే జరిగె నని గ్రహింపవలసియున్నది.

కొందఱు పయి హరిశ్చంద్రనలోపాఖ్యానపద్యభాగమునుబట్టి హరిశ్చంద్రనలోపాఖ్యానగ్రంథరచనము 1580 సంవత్సరమునకుఁ బిమ్మట జరిగె ననియు, నట్లే వసుచరిత్ర గ్రంథరచనయు 1577-వ సంవత్సరమునకుఁ బరమున జరిగినదనియుఁ జెప్పుదురు.

పయి నుదాహరించిన వసుచరిత్రహరిశ్చంద్రనలోపాఖ్యానముల లోని చరిత్రబోధకపద్యము లెల్లఁ గృత్యాదిసందర్భములోనివియు నాశ్వాసాద్యంతపద్యముల లోనివియు నయియే యున్నవి. కావున వాని వలనఁ దద్గ్రంథముల కృతిప్రదానకాల మిది యని విశదమగును గాని తద్గ్రంథరచనాకాల మిది యని విశదము కాఁజాలదు. కావున "1560-వ సంవత్సరప్రాంతమున జరిగిన నరసభూపాలీయకృతిప్రదానమునకుఁ బిమ్మట బట్టుమూర్తి రామరాజభూషణుఁ డై యట్టిరామరాజున కంకితముచేయుటకే వసుచరిత్ర గ్రంథరచనము నారంభించియుండినను నుండవచ్చును. అంతలో విజయనగరరాజ్యవిప్లవము జరిగియుండును.

ఆవెనుకఁ దిరుమల దేవరాయలు రాజ్యము నారంభించి దేశము స్వాస్థ్య మునొందినపిదపఁ దదాశ్రయమును సంపాదించి యద్దాని నాతనికిఁ గృతిచేసియుండును. అట్లే వసుచరిత్రకృతిప్రదానమునకుఁ బూర్వమే హరిశ్చంద్రనలోపాఖ్యానగ్రంథరచనయు ముగిసియుండును" అని యూహింపనగును.

వసుచరిత్ర కృతిప్రదానానంతరకాలమునకు రామరాజభూష ణుఁడు గొప్పయైశ్వర్యముగలవాఁ డై తానే సప్తసంతానములను నందఁదగినస్థితిలోనికి వచ్చియుండెను. అక్కారణమున సంపదలవిషయ మున నత్యంతము తృప్తినందినవాఁ డై పారలౌకికసుఖముల సాధించు తలంపున శ్రీరామచంద్రు నారాధించుచు నగ్రహారము చేసియు దేవా లయముఁ గట్టించియు దేవతాప్రతిష్ఠ చేసియుఁ దటాకముఁ ద్రవ్విం చియు నట్టివాని నెల్ల నిష్టదైవత మగుశ్రీరామచంద్రునకుఁ గృతిచేసియు నుండె నని గ్రహింపవలసియున్నది. (25 పు.) పై విషయములకు వసు చరిత్రహరిశ్చంద్రనలోపాఖ్యానములలోని యీక్రిందిపద్యములు నిదర్శ నములు కాఁగలవు.

**శా. శ్రీరామక్షితిపుణ్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా**
**పారీణుం బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారు మెప్పించి త**
**త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాదిస**
**త్కారం బందితి రామభూషణకవీ ! ధన్యుండ వీ వన్నిటన్. (వసు. 1-17.)**

దీనినిఁబట్టి వసుచరిత్రకృతిప్రదానముననే యాతఁడు గొప్ప యైశ్వర్యము గలిగియున్నట్లు విశద మగును. సామాన్యముగా సంపదల విషయమున నెంతో తృప్తి లేనప్పుడు తన్నుఁ దాను ధన్యుఁ డని తలంపఁడుగదా!

**సీ. ...వసుచరిత్రాది కావ్యప్రీతబహునృప, ప్రాపితానేకరత్నాప్లవుండ**
**శాశ్వత శ్రీ వేంకటేశ్వరానుగ్రహ, నిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ**
**(హ. న. 1-53.)**

అని యిట్లు కవి తనకుఁ గల యైహికవైభవతృప్తిని జూపి యున్నాఁడు. పయి హరిశ్చంద్రనలోపాఖ్యానసీసపాదమును బట్టియుఁ గవి ప్రథమగ్రంథమగు నరభూపాలీయమునందలి కృత్యాదిస్థితినిబట్టియు (చూ. 14-15 పు.) నీతని కిష్టదైవము వేంకటేశ్వరుఁ డని విశదమగుచు న్నది. అటుపయి నాతఁ డాంజనేయు నారాధించెననియుఁ దన్మూలమున

నిరుపమానపాండిత్యములు తన కలవడెనని కవి తలంచుచుండెననియుఁ గవికృతగ్రంథములలోని యీక్రిందివిషయములు వ్యక్తపఱుపఁ జాలి యున్నవి.

I. కవికృతగ్రంథములు మూఁడిటియందును నాంజనేయస్తుతి నియమముగాఁ జేయఁబడెను.

II. "హనుమత్ప్రసాదలబ్ధకవితాసారస్వతాలంకార" అని నరసభూపాలీయాశ్వాసాంతగద్యములందును "పవననందనప్రసాదసమాసాదితసంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధ కవితానిర్వాహక" అని వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానాశ్వాసాంత గద్యములందును గవి స్పష్టముగాఁ జెప్పికొనియున్నాఁడు.

III. "మ. ... ... జగత్ప్రాణనం
దనకారుణ్యకటాక్షలబ్ధ కవితాధారాసుధారాశి......" అని
యిట్లు (వసు. 1-18) వసుచరిత్రగ్రంథమునందును "వనధిలంఘనకృపావర్ధితోభయకవితాకళారత్నరత్నాకరుండ" (1-52) అని హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును గవి చెప్పికొని యున్నాఁడు.

IV. ఆంజనేయుఁడు కలలోఁ దనకుఁ బ్రత్యక్షమయి తన హరిశ్చంద్రనలోపాఖ్యానమును శ్రీరామచంద్రునకుఁ గృతి యిమ్మని సదుపదేశము చేసినట్లు సైతము కవి చెప్పియున్నాఁడు. (హ. న. 1-10 మొ. 18-వ.)

గీ. తాదృశకవిత్వనిధిలాభధన్యుఁ జేసి, నన్ను బ్రోచినయంజనానందనునకుఁ
దగవె కాద తదర్హముద్రాహితోప, దేశభావం బని నుతించి కౌశలమున.

(హ. న. 1-17.)

పై సందర్భమునుబట్టి రామరాజభూషణుఁడు తొలుదొల్తఁ గృష్ణదేవరాయలసభలోనుండి క్రమక్రమముగ నరసరాజు నాశ్రయించి తన్మూలమునఁ దదధీశుఁ డగు రామరాజు దయకుఁ బాత్రుఁడై యైహిక వైభవముల నందినట్లే, వేంకటేశ్వరు నిష్టదైవముగ నారాధించుచుఁ గ్రమక్రమముగా నాంజనేయుని సేవించి తన్మూలమునఁ దదధీశుఁ డగు శ్రీరామచంద్రునికృపకుఁ బాత్రుఁడై పారలౌకికవైభవముల నందఁదలంచె నని యూహింపవలసియున్నది.

" మ. నను శ్రీరామపదారవిందభజనానందుం జగత్ప్రాణినం
దనకారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసం
జనితైకైకదినప్రబంధఘటికాసద్యశ్కృతగ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెం గృపన్" (వసు. 1-18)

పయిపద్యమునుబట్టి వసుచరిత్రకృతిప్రదానకాలమునకే రామరాజభూషణునకు రామభక్తి యతిశయించియుండెనని విశదమగుచున్నది. కావుననే ప్రథమగ్రంథ మగు నరసభూపాలీయముయొక్క యాశ్వాసాంతగద్యమునందు లేని "శ్రీరామచంద్రచరణారవిందవందన" అనుక్రొత్తవిషయము వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానముల యాశ్వాసాంతగద్యములలోఁ జేర్పఁబడెను. అట్లే వసుచరిత్రగ్రంథాదియందు నరసభూపాలీయగ్రంథాదియందువలె వేంకటేశ్వరలక్ష్మీస్తుతులను జేయక శ్రీరామజానకులను స్తుతించియున్నాఁడు. ఇట్లే హరిశ్చంద్రనలోపాఖ్యానకృతిప్రదానకాలమునకు రామభక్తి యింకను నతిశయించె నని గ్రహింపవలసియున్నది.

"సీ. సుతులఁ బెక్కండ్ర ... ... నొందవు నీవు." (హ. న. అవ. 14.)

పయిహరిశ్చంద్రనలోపాఖ్యానపద్యముచే రామరాజభూషణుని రామభక్త్యతిశయమును, సప్తసంతానవైభవమును వెల్లడియగుచున్నవి. సుతులను రామనామధన్యులను జేసి పిలిచె నని యున్నంత మాత్రమున నాతని కట్టివృద్ధదశలోనే సంతతి గల్గెనా? యని శంకించుట సంగతము కానేరదు. పయిపద్యముచేత నేకాక హరిశ్చంద్రనలోపాఖ్యానములోని యిష్టదేవతాస్తుతి శ్రీహనుమత్సీతాలక్ష్మణభరతశత్రుఘ్న సమేత శ్రీరామచంద్రమాత్రపరమే యయియుండుటచేతను, దుదకు సుకవిస్తుతియు రామభక్తవర్ణనారూపముగనే వెలయుచుండుటచేతను, గ్రంథమును శ్రీరామచంద్రునకే కృతిచేసి కృతిపతివర్ణనామిషంబున రామాయణకథాసారమును గ్రంథాదిని వర్ణించియుండుటచేతను, గవియగు రామరాజభూషణుఁడు తనయవసానదశయందు రామచంద్రైకభక్తుఁడై కాలము గడపుచుండె నని విశదమగుచున్నది.

"సీ. రామభక్తునకు ... ... నభినుతింతు." (హ. న. అవ. 6.)

అని యిట్లాంజనేయుని వర్ణనమును సందుచేసికొని రామభక్తమాత్రుఁడు సంసారసాగరమును దాఁటి మాయాతీతుఁడై ముక్తికాంతాప్రసాదము నందు ననియు, నిహమునఁ గర్మబంధమును వీడి

శీతోష్ణాదిద్వంద్వములను గణింపక తాపత్రయపీడ నందక యరిషడ్వ ర్గము నోర్చు ననియు ధ్వనింపఁజేసిన రామైకభక్తుఁ డగు రామరాజభూష ణుని సాభిప్రాయసూక్తిచాతురి యెంతయు నుతింపఁ దగియున్నది.

హరిశ్చంద్రనలోపాఖ్యానకృతికాలమునకు రామరాజభూషణుఁడు రామైకభక్తుఁ డై సదా తదారాధనతత్పరుఁ డై యుండె ననియు నవ్విష యమునే మార్కండేయుని మిష పెట్టి సూచించి యున్నాఁడనియు నీ క్రిందిహరిశ్చంద్రనలోపాఖ్యానపద్యము స్పష్టపఱుపఁ జాలియున్నది.

"ఉ. వారిచరిత్రముల్ ... ... ... నిట్లనున్." (1-5)

---

## 2-వ ప్రకరణము.

హరిశ్చంద్రనలకథలను జోడించి హరిశ్చంద్రనలోపాఖ్యాన మను పేర నాంధ్రభాషామయ మగు నీద్వ్యర్థిప్రబంధము ప్రబంధాంకరామ రాజభూషణమహాకవి రచించెను.

"అల్పాచ్తరం పూర్వమ్" అనునియమమునుబట్టి కొందఱు 'నల హరిశ్చంద్రోపాఖ్యాన' మనునది కవిప్రయుక్తమై యుండునని తలంచు చున్నారు. అట్లయినను నీప్రబంధమున వర్ణింపఁబడిన చరిత్రములనుబట్టి నలునకంటె హరిశ్చంద్రుఁడె యభ్యర్హితుండని చెప్ప నొప్పును గాన "అభ్యర్హితం పూర్వమ్" అను నియమముచొప్పున హరిశ్చంద్రనలో పాఖ్యానమనుటయె సమంజసము. కాలమునుబట్టియు ఋగ్వేదప్రసిద్ధుఁ డగుటచే హరిశ్చంద్రుఁడె పురాతనుఁ డని యెన్నఁదగియున్నది. రామ రాజభూషణుఁడును "హరిశ్చంద్రనలోపాఖ్యాన" మనియే యాశ్వా సాంతగద్యములందుఁ బేర్కొనియున్నాఁడు.

"హరిశ్చంద్రో నలోరాజా పురుకుత్సః పురూరవాః,
సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః."

అనుదానిలో హరిశ్చంద్రుఁడే మొదట గణింపఁబడెను.

"అతఁడు విశ్రుతబలుం డై చక్రవర్తులయం దాదివినుతుఁడై" (హ.న. 1-16) అని కవియుఁ బయియంశము నుద్ఘాటించియున్నాఁడు.

“మ. చను దుస్స్వర్భకళంకపంకము ... గల్గెఁ మదిఁ.” (హ. న. అవ. 1.3)
“శా. కౌంతేయాగ్రజ! యింత...సంప్రాప్తసామ్రాజ్యులై.” (హ. న. 1-3.)

అను పద్యములలోని వరుసనుబట్టియు హరిశ్చంద్రనలోపాఖ్యానమను పేరే రామరాజభూషణకవిచే నుద్దేశింపఁబడె నని విశదమగుచున్నది. మఱియు ననిత్య మగుపూర్వనిపాతశాస్త్రము నాధారముగాఁ జేసికొని యంతగా శంకింపఁ బనిలేదు.

ఇక్కావ్యమునఁ గవి, హరిశ్చంద్రనలకథలను జోడించిన రీతితోఁ దత్కథలసారము నిచటఁ జూపుచున్నాను.

| | హరిశ్చంద్రకథ. | నలకథ. |
|---|---|---|
| ఆ. 1. 15. | అయోధ్యానగరమునకు రాజు. | నిషధనగరమునకు రాజు. |
| ,, 6. 14.<br>,, 17. | (పురవర్ణనము) హరిశ్చంద్రుఁడు; అతనికి మంత్రి సత్యకీర్తి. తండ్రి త్రిశంకుఁడు. | (పురవర్ణనము) నలుఁడు. అతనితండ్రి వీరసేనుఁడు. |
| ,, 18. 22. | (రాజవర్ణనము.) భార్య చంద్రమతి; కుమారుఁడు లోహితుఁడు; ఆహరిశ్చంద్రుఁడు నిశ్శాత్రవముగా మహావైభవముతో రాజ్య మేలుచుండెను. | (రాజవర్ణనము.) ఆనలుఁడు దమయంతియం దనురక్తుఁడై యుండెను. |
| ,, 23. 27. | ...సత్యవాది యెవ్వఁడని సుధర్మలో నింద్రుఁడు మునుల నడుగఁగా వసిష్ఠుఁడు హరిశ్చంద్రుని బేర్కొనినందున విశ్వామిత్రుఁడు లోకములో ననేకు లగుమహాపురుషు లుండ నీనరు నగ్గడింప నేల యని యల్గి యారాజుచే నసత్యమాడించెద నని ప్రతిజ్ఞ పట్టెను. | కుండినపురమున కధీశ్వరుఁ డయిన భీముఁడు తనకూఁతు రగుదమయంతికిఁ దగినవరుఁ డెవ్వఁడని మునుల నడుగుటయు, నామునిపంక్తి నలుని వర్ణించి యాతఁడే యర్హుఁ డని చెప్ప దమయంతి విని నలునం దనురక్తఁ గాఁగాఁ జంద్రుఁడు, తాను మున్నగుచక్కనివార లనేకు లుండ, దమయంతి నలునిఁ బ్రేమింప నేల యనిమదనుఁడు నలదమయంతులపై మాత్సరించి వారల కప్రియము చేయ నెంచెను. |
| ,, 29. | అపుడు వసిష్ఠుఁడు విశ్వామిత్రుని దిరస్కరించుచు హరిశ్చంద్రుఁడు భార్యారాజ్యాది | అ క్లైంచి దమయంతి తారుణ్యము నాధారముగాఁ జేసికొని నలునిబీడింపఁగా నాతండు చలించి లక్ష్మిని బాయుటకైన |

| | హరిశ్చంద్రకథ. | నలకథ. |
|---|---|---|
| | వియోగమున కయిన నోర్చును గాని యసత్యమునకోర్వఁడు నని దృఢముగాఁ జెప్పినప్పటి యాయిరువురికలహమున నద్దేవ సభ చలించెను. | నోర్వనగును గాని యీమదనతాపము నోర్వరాదని పలుకుచు నీతాప మిట్లు స్థిరముగానే యున్నయెడల నుద్యానమున నెట్లు నిలువఁగలను. శరీరత్యాగముం జేయుదుఁగాక యని సాహసమునకు లోనయ్యెను. నలానురక్త యగు దమయంతియు మదనార్త యయ్యె. |
| ఆ. 1. 32. | (వసంతఋతువర్ణనము.) | (వసంతఋతువర్ణనము.) |
| ఆ. 2. 1-10. | ,, ,, | ,, ,, |
| ,, 11. | హరిశ్చంద్రుఁడు వసంతర్తువున నొకప్పుడు యజ్ఞదీక్ష వహించియుండఁగా విశ్వామిత్రుఁ డాతని వంచింపనెంచి యమిత మగుధనమును యజ్ఞమునకయి యిమ్మని యాచిం | నలుఁడు విరహాతురుఁడైయుండి పలువెతల నందుచుఁ జింతించి భీమునకు దూత నంపఁ దలఁచెను. |
| ,, 12. | చెను. రాజు సమర్పింపఁబోవ యజ్ఞావసరమునఁ దీసికొందు నని చెప్పి యాముని వెడలెను. | |
| ,, 13. | ఇట్లు వెడలి యాతఁడు క్రూరమృగములనుసృజించిహరిశ్చంద్రుని రాష్ట్రమును జెఱుపఁగా సేనాపతులు రాజుతో నా మృగములచర్యలు వర్ణించి చెప్పిరి. | మఱియు నాతఁడు దమయంతిని వశపఱచుకొనుటకొఱకుఁ జిత్తరువులతో నిండిన గొప్పసౌధములను గట్టింప నెంచెను. ఆతఁడని వనపాలురు వచ్చియుద్యానవనము లోని ఫలపుష్పాదులను జూపి వర్ణించిరి. |
| ,, 16. | (క్రూరమృగములవర్ణనము.) అట్టి మృగముల బాధ నడంపఁ గోరి లోహితచంద్రమతీసహితముగా రాజువేఁటకు బయలు వెడలి | (వసంతర్తువిలసితోద్యానవర్ణనము.) అది విని నలుఁ డుత్సుకుఁడై యుద్యానవిహారమునకు బయలువెడలి |
| ,, 19. | (సైనికుల వర్ణనము.) | (సైనికుల వర్ణనము.) |
| ,, 20. | (అడవి వర్ణనము.) | (అడవి వర్ణనము.) |
| 21. 30. | పలువిధములగుమృగములను వేఁటాడి, వసిష్ఠునియాశ్రమమున కేఁగి యాతనికి నమస్కరింప నాతఁడు రాజున కిట్లనెను. | అచట నానావిధము లగువృక్షములను దిలకించుచు విహరించి తుద కొకక్రీడాపరోవరముదరి కేఁగి యచట నున్నయొకహంసమును బట్టుకొన నదిరాజున కిట్లనెను. |

| | హరిశ్చంద్రకథ. | నలకథ. |
|---|---|---|
| ఆ. 2, 30. | (వసిష్ఠాశ్రమవర్ణనము.) | (సరోవరవర్ణనము.) |
| ,, 31. | (ఋషులవర్ణనము.) | (జలపక్షులవర్ణనము.) |
| ,, 32. | (వసిష్ఠఋషివర్ణనము.) | (హంసవర్ణనము.) |
| ,, 35.40. | "క్రూరమగునీవేఁటను మాని పురమునకు మరలుము. దురభిమాని యగువిశ్వామిత్రు నాశ్రమమున కెంతమాత్రమునుబోకుము" అనువసిష్ఠునివాక్యములను శిరసావహించి కృతజ్ఞతచూపు నాటవికులనంపివేసి రాజు భార్యాపుత్రమంత్రిసహితముగా నొకచోవిశ్రమించియుండెను. | "నాకుటుంబమునకు దిక్కు లేదు. దీనము లగుజలపక్షులను వేఁటాడుట శౌర్యము కాదు. నన్ను దయతో విడువుము" అను దాని పలుకులకుఁ గరుణించి నలుఁడు విడువఁగా నది భార్యాపుత్రాదులతోఁ గూడి యానందించి కృతజ్ఞతతో నలునొద్దకు మఱలవచ్చి "నీకు దమయంతిని గూర్చెద"నని పలుకుటయు, నాతఁ డుత్సుకుఁడై దాని నాదరించెను. |
| ,, 40.47. | అట్టియెడ విశ్వామిత్రుఁ డొకమాయలేడినంపఁగా నది హరిశ్చంద్రు నివంచించి యాతఁడు పట్టఁబోవ దొరకక, యాతని విశ్వామిత్రు నాశ్రమమునకు లాగికొనివచ్చి యాతఁడు ప్రయోగించిన బాణమునకు లొంగక యామునిదరి కేఁగెను. | నలుఁ డాహంసను బొగడి దమయంతిని గూర్పుమని బోధచేసి పంపఁగా నది దమయంతిదరి కేఁగి యామె పట్టఁబోయినను దొరకక వనాంతరమునకు లాగికొనిపోయి తుద కొకపొన్నచెట్టెక్కిపోయెను. |
| ,, 48.54. | రాజు విశ్వామిత్రు నాశ్రమమునకు వచ్చినందులకుఁ జింతింప సత్యకీర్తి ఋషుల యోగ్యతను వర్ణించి యూరడింపఁగా రాజూరడిలి నిద్రించి యొక దుస్స్వప్నమును గాంచి లేచి "తన్నొక విప్రుఁడు తలఁదన్ని రాజ్యమును లాగికొనుట" మొదలగునాస్వప్నవృత్తమును జెప్పెను. | దమయంతి వనాంతరమునకు వచ్చినందులకు విచారించుచుండ హంస "నన్నుఁ బట్టలేవు. ఏల తిరిగెదవు?" అని చెప్పి తన్ను వర్ణించుకొని "నిన్ను నలునితోఁ గూర్చెదను" అనిపల్కుటయు దమయంతి సంతసించి యట్లు కరుణింపుమని వేఁడుకొనెను. |
| ,, 55-58. | "మహానుభావుఁడ వగు నీవును భయపడ నగునా? తప్పక విశ్వామిత్రుఁడే రాజ్యము నపహరించును." అని చంద్రమతి పల్కెను. | "త్రిలోకసుందరి వగునీకు నలప్రాప్తివిషయమున భయమేల?" అని చెప్పి హంస నలునొద్దకుఁ బోయెను. |

## హరిశ్చంద్రకథ.

అ. 2, 62. ఆట విశ్వామిత్రుఁడు శేడివల్ల సర్వము నెఱింగి తన ప్రతిజ్ఞను దలంచి యిద్దఱుమాతంగస్త్రీలను సృజించి వారికి గానలాస్యములు నప్పి రాజును బీడింపఁ బంపెను.

,, 61.63. (మాతంగస్త్రీవర్ణనము).

,, 62-70. అట్లు విశ్వామిత్ర ప్రేరితలై యాకన్యలు హరిశ్చంద్రునొద్ద కేఁగి యాతనిఁదమ గానలాస్యముల మెప్పింప నాతఁడు కొన్కొ లొసంగుటయు, నిరాకరించి వారుఛత్రమును వేఁడిరి.

,, 73-79. "రాజచిహ్నములను గోరఁదగునా? వేఱొకటి గోరుఁడు' అని రాజు పల్కుటయు వారు తమ్మును బరిగ్రహింపు మని రాజుపయిం బడఁగా,నతఁడువారిని దండించెను. విశ్వామిత్రుఁడదివిని కోపావేశముతో నొకవేత్రమును ధరించి యనేకమునులు తోడరాఁగా వచ్చి రాజుం గాంచెను.

,, 80-87 కాంచి రాజు నమస్కరించిన నమన్నింపక తలఁదన్ని లేడిని బీడించుట, మాతంగకన్యలను శిక్షించుట మున్నగు నాతనిచర్య లుగ్గడింప రాజు రక్షింపు మని ప్రార్థించుటయు, నాతఁడు "నాకూఁతులగు మాతంగకన్యలనువరింపుము.నీకు నరకభీతి లేకుండ స్వర్గము నిచ్చెదను;అట్లయిన నిన్ను మన్నించెదను"అని పలుకఁగా రాజు నిశ్చేష్టుఁడయ్యెను.

## నలకథ.

నలుఁ డాహంసమువల్ల సర్వము నెఱింగి యనురాగముతో నుండ దమయంతియు నలానురక్తయై గానలాస్యాదివినోదము లుజ్జగించి విరహార్తయై యుండెను.

(దమయంతీవిరహావర్ణనము.)

అట్టి దమయంతిచేఁ బ్రేరితలై చెలులామె యవస్థను భీమునికిఁ దెల్పుటయు, నాతఁడు వారికిఁ గానుక లొసఁగి స్వయంవరము చాటింప ననేకులు రాజులు కుండినపురి కేఁగుదెంచిరి.

అట్లు వచ్చువారిం గని పురజనులు "దమయంతిని గోరుట కెవ్వరు రాకుందురు?"అని పల్కిరి. భీముఁ డావచ్చినవారికి సదుపాయములు చేసి యాదరించెను. ఆ సమయమున నారదునివలన నావృత్తాంతమును విని యింద్రుఁడు మోహావేశముతో నగ్నియమవరుణులు తోడరా బయలుదేఱి వచ్చి తమవలెనే వచ్చుచున్న నలుని గాంచెను.

కాంచి యాతఁడు నమస్కరింప దీవించి తమ్ముఁదెలిపి "దమయంతీప్రాప్తికై మాకు దూత్యము చేయుము. భీమరాజు నంతఃపురమునఁ బ్రవేశించు నిన్నెవరును గుర్తెఱుఁగకుండఁ జేసెదను" అని యింద్రుఁడు పలుకఁగా రాజు నిశ్చేష్టుఁడయ్యెను.

## హరిశ్చంద్రకథ.

ఆ.2. 8-103. అపుడు "గాలియు నెండయుఁ జొరరాని నాయాశ్రమము నెట్లు నిర్భయముగాఁ జొచ్చితివి? నిన్నే మననగును? ఎంతచేసినను నామాటవినినచో నిన్నుఁగాచెదను. సశరీరస్వర్గసుఖ మనుభవింపుము" అని మునిపలుకఁగా "నీమాహాత్మ్య మెక్కడ? నేనెక్కడ? క్షమింపుము. రాజ్యమునైన విడిచెదను గాని కులభ్రష్టుఁడను గాఁజాలను. ఏకపత్నీవ్రతమును విడువఁజాలను" అని రాజు బదులుపలుకుటయుఁ దన ప్రతిన నెఱవేఱె నని సంతసించి యట్లే రాజ్యము నిచ్చివేయుమనెను. అందుల కులికి రాజు వెనుకముందు కాఁగా "నీవు సత్యవంతుఁడవుగదా! ఇట్లు వెనుదీయనగునా?" యని యుద్ఘాటించెను.

,, 104-114. అపుడు చంద్రమతి రాజుతో "ఏల సంకోచించెదవు? బ్రహ్మతలఁపు దప్పునా? నీ యోగ్యతను దేవతలు మెత్తురు. రాజ్యమును దానము చేయుము." అని పలుకఁగా హరిశ్చంద్రుఁ డట్లిచ్చివేయుటకు సన్నద్ధుఁ డయ్యెను. అపు డాకాశమును దేవత లావరించిరి. ఆకాశవాణి హరిశ్చంద్రుని వర్ణించి స్తుతించెను. హరిశ్చంద్రుఁడు దేవభూదేవమాన్యములను దప్పించి యెల్లపృథివిని దానము చేయఁగా దేవదుందు

## నలకథ.

[illegible]తుదక్షురాజు వారియాజ్ఞ చొప్పునను, నాయింద్రునిమాయమూలమున భీముని కన్యాంతఃపురమునకుఁ బోవఁగా "గాలియు నెండయుఁ జొరరాని యిచ్చటికెట్లు వచ్చితివి? నీ వెవ్వఁడవు?" అని దమయంతి యడుగుటయు "నే నొకరాజును; దేవదూతను; ఇంద్రాగ్ని యమవరుణులలో నొక్కరిని వరించి సశరీరస్వర్గసుఖము ననుభవింపుము" అని నలుఁడు పలుకఁగా "నే నెక్కడ? ఇంద్రాదు లెక్కడ? వారి సేవకురాలను. లభింపనిచోఁ బ్రాణత్యాగము చేసెదను గాని నలునిఁ దక్క నన్యుల వరింపను" అని యామె బదులు చెప్పెను. అపుడు రాజు మైమఱచి నేనే నలుండ ననుటయు, నామె తెరచాటున నిలిచి ప్రసంగింపఁగా నలుఁ డొడలు తెలిసి దేవకార్యవిధ్వంసమునకు వగచి ఖిన్నుఁడై వెనుకముందగుచు దమయంతి యెన్నివిధములఁ బ్రార్థించినను మన్నింపకుండెను.

అప్పుడు తొల్లిటిహంస వచ్చి నలుని బ్రబోధించి "ఏల సంకోచించెదవు? బ్రహ్మతలంపు తప్పునా? నీమనశ్శుద్ధికి దేవతలు మెత్తురు. స్వయంవరసభలో దమయంతి నిన్ను వరింపఁగలదు. పొమ్ము" అని పలుకఁగా నలుఁడు లజ్జతో వెడలిపోయి దమయంతీమనోనిశ్చయము నింద్రాదులకుఁ దెల్పెను. అది విని దమయంతి నలు నెట్లు వరించునో చూతమని నలుగురు దేవతలును నలురూపముతోడనే స్వయంవరసభకు విచ్చేసిరి. సరస్వతివచ్చి స్వయంవరాగతుల నెల్లవర్ణించి పంచనళిని మిక్కిలిప్రౌఢముగా వర్ణించెను. దమయంతి మొదటఁ బోల్చుకొనలేక దేవతలను బ్రార్థించి బుద్ధివైశద్య

| హరిశ్చంద్రకథ. | నలకథ. |
| --- | --- |
| భులు మొరసెను. పువ్వులవాన గురిసెను. | మునంది సరస్వతీవాక్యములను విమర్శింపఁ గల్గి నలు నేర్చికొని వరింప దేవదుందుభులు మొరసె. పువ్వులవాన గురిసెను. |
| ఆ. 2. 110-111. ఆకాశవాణి హరిశ్చంద్రుని స్తుతించుట. | (స్వయంవరాగతరాజులను బంచవళిని వాణి వర్ణించుట.) |
| ,, 3. 3-8. పిమ్మట దేవతలు మున్నగువారు వారిస్థానములకుఁ బోయిరి. విశ్వామిత్రుఁడు రాజును స్తుతించి వెడలిపోయెను. హరిశ్చంద్రుఁ డింటికి వెడలెను. పిదప విశ్వామిత్రుఁడు తన ప్రతిజ్ఞ నెఱవేర్చుటకై చింతించి హరిశ్చంద్రుని రాజ్య మపహరించి వెనుక నాతఁ డిచ్చెద నన్న యజ్ఞదక్షిణ నడిగి పీడింప నెంచెను. | నలదమయంతుల వివాహకాలమున నింద్రాదులు నలునకు నిచ్ఛావశమున స్వసాక్షాత్కారాదికము లగువరము లొసంగి వెడలి పోవుచుండఁ గలి యెదురుపడి దమయంతీ స్వయంవరవృత్తాంతము వారివల్ల విని మత్సరించి నలుఁ బీడింప నెంచి ధర్మాత్ముఁ డగు నాతని యందావేశించుటకు సందు లేక వేచియుండి యొక్కనాఁ డాతఁడు పాదప్రక్షాళనము చేసికొనక సంధ్యోపాసనము చేయుతఱి సందుచేసికొని యాతనియందావేశించెను. ద్వాపరప్రియుఁడగు నలుని పాచికలందు ద్వాపరు నావేశింపఁజేసెను. |
| ,, 9-18. ఆ ట్లెంచి రాజ్యము లాగికొని యాతని నడవికిఁ బొమ్మనఁ నారా జట్లు పో నుద్యోగించుటయు, జనులు దీనులై నిరోధింపఁ జంద్రమతి బోధచేసి వారల మరలించి తానును రాజును వెంబడించెను. | కలిప్రేరణమున జూదమునకు వచ్చిన పుష్కరునితో జూదమాడి నలుఁడు రాజ్యమెల్ల నాతనికోడి యాతఁడు పొమ్మనఁగా నడవికిఁ బో నుద్యోగించుటయుఁ బ్రజలు నిరోధింప వారికి బోధచేసి నలుఁడు ప్రయాణమయ్యెను. దమయంతియుఁ దన సంతానమును జనకునింటి కంపి నలుని వెంబడించెను. |
| ,, 18-37. హరిశ్చంద్రుఁడు భార్యపడు శ్రమకుదుఃఖించుచుఁ గొడుకు నాఁకలి కోర్వఁజాలక ఖిన్నుఁ డగుచునుండ విశ్వామిత్రుఁడు ప్రత్యక్షమై యాగదక్షిణ నిమ్మని పీడించుటయు, నాతఁ డొక నెలలోపున నిచ్చివేసెద నని చెప్పఁగా నక్షత్రకుఁ డను తనశిష్యుని హవాలా చేసి తన ప్రతిజ్ఞావిధమును వాని కెఱిం | నలుఁడు దమయంతిపడు శ్రమకు దుఃఖించుచు నాఁకలికోర్వఁజాలక తనయెదుట నెగురుచున్న పక్షులపైఁ గట్టుబట్టను విసరఁగా నవి "మేము నీరాజ్యము నపహరించిన పాచికలము" అని చెప్పుచు నాబట్టతోఁ బాఱిపోవుటయు, దమయంతి రాజు దైన్యమును జూచి తన పైఁటకొంగ చించి యిచ్చి "మనము కుండినపురమునకుఁ బోవుదము రమ్ము" అని బోధింపఁగా "నేను స్త్రీధనమును దిని జీవింతునా?" యని చెప్పుచు |

హరిశ్చంద్రకథ.

గించి మనదేశమున ముష్టినెత్త నీయవలదని చెప్పుచుండ రాజు "నే నాచులుకనిపని చేయను. మీరు వేఱుగఁ జెప్పనేలకో?" అని పలికి యాడవియందే సంచరించుచుఁ జంద్రమతి పడుశ్రమకు దుఃఖించుచు నుండెను.

ఆ. 3. 34-36. (వనదేవతాదివర్ణనము. వృక్షదోహదవర్ణనము.)

,, 37-45. అప్పుడు నక్షత్రకుఁడు దప్పి వేయుచున్న దనుటచే రాజు నీటిని వెదకుచుండ విశ్వామిత్రకల్పితుఁ డగునంతఘాతుఁ డనురాక్షసుఁడు మునివేషమున నెదురుపడి తప్పువారిఁ జూప నక్లేఁగి బేతాళుఁడున్న వటమునుదరిసి యట నక్షత్రకునితో నందఱు నీరు త్రాగి రాత్రి పడినందునఁ జంద్రమత్యాదులు నిద్రించిరి. అత్తటి బేతాళుఁడు పైఁబడ రాజు వానిని వధించెను. మునిమాయచే గాలివాన వారినిబీడించెను.

,, 41-48. 'సూర్యాస్తమయము, గాలి, వాన, పరిశ్రాంత చంద్రమతి' అను వాని వర్ణనములు.

,, 49. (చంద్రాస్తమయము.)

,, 50-57. పిమ్మట విశ్వామిత్రుని మాయావశమున నొకదవాగ్ని యెదురుపడఁగాఁ జంద్రమతి దుఃఖించి తాను ముందుగనేఁగి యందుఁ బ్రవేశింప నది చల్లా

నలకథ.

నడవియందే సంచరించుచు దమయంతి పడుశ్రమలకు మిగుల దుఃఖించుచు నుండెను.

(వనదేవతాది వర్ణనము. వృక్షదోహదాదివర్ణనము.)

అపుడు రాజు దమయంతిని బుట్టినింటికిఁబొమ్మని తుద కామె ప్రార్థనము చొప్పున నామెను వీడకయుండ సంగీకరించి కలిప్రేరణమునఁ దప్పుదారులఁ జరించి తాళవనమును జేరి నీరుత్రాగి విశ్రమించియుండ రాత్రిపడినందున దమయంతి నిద్రించెను.

'సూర్యాస్తమయము, చీఁకటి, చంద్రోదయము, వెన్నెల, పరిశ్రాంతదమయంతి' మున్నగువాని వర్ణనములు.

అట్లు నిద్రించుచున్న దమయంతి వస్త్రము నుత్తరీయమునకై చించికొని యామెనువిడిచి కలిప్రేరణమున నలుఁడు వనాంతరమున కేఁగెను.

(సూర్యోదయము) పిమ్మట దమయంతి మేల్కాంచి నలుఁడు లేమికి దుఃఖించి నలువైపులందిరుగుచు నొకసర్పముచే మ్రింగఁబడుచు మొఱవెట్ట, నొకబోయవాఁడు వచ్చి కాపాడి యామెనుమోహించి తత్పా

| | హరిశ్చంద్రకథ. | నలకథ. |
|---|---|---|
| | రుటయుఁ జంద్రమతి మరలి భర్తృసన్నిధిం జేరెను. | తివ్రత్యమహిమచే దగ్ధుఁడయ్యెను. తద నంతరమున నామె యాయటవిం బోవుచు నొక ఋషివాటికం గాంచెను. |
| ఆ.3. 58. 63. | అత్తఱి విశ్వామిత్రప్రేరణమున నక్షత్రకుఁడు చంద్రమతికిదుర్బోధలుచేసియు నామె చిత్తమునుగదల్పలేకయామెను మెచ్చుకొనుచుండ జంద్రమతీప్రభృతులు కాశికిఁ బోవు మార్గస్థులవెంటఁబడి గంగాతీరముం జేరి శ్రమపడియున్నందున నచట విశ్రమించిరి. | అట్లగపడినఋషులు నలుని సాహసమును ధిక్కరించి, దమయంతి నూరార్చి యామెకు నలప్రాప్తిరూపభావిశుభవార్త నెఱిగించి యంతర్ధానమగుటయు, నామె సుబాహుపురికిఁ బోవుచున్న శుచి మున్నగు మార్గస్థులవెంటఁ బడి వారితో నొక సెలయేటియొడ్డున బసచేసి రాత్రిపడినందున నట విశ్రమించెను. |
| 64. | (గంగావదీవర్ణనము.) | (సెలయేటివర్ణనము.) |
| ఆ. 4. 1-21. | సూర్యోదయాస్తమయములు, సంధ్యాకాలము, చక్రవాకములు, పద్మముకుళనము, చీఁకటి, నక్షత్రములు, చంద్రకాంతి మున్నగువాని వర్ణనములు. | సూర్యోదయాస్తమయములు, సంధ్య, చక్రవాకములు, పద్మముకుళనము, చీఁకటి, నక్షత్రములు, చంద్రకాంతి మున్నగువాని వర్ణనములు. |
| ,, 22-23. | అట్లు గంగాతీరమున విశ్రమించి నిద్రించుచున్న హరిశ్చంద్రాదులపైఁ జల్లనిగాలులు వీచి వారిశ్రమ నపనయించెను. | అట్లా సెలయేటియొడ్డున విశ్రమించి నిద్రించుచున్నవారినందఱను నొక మదపుటేనుఁగులగుంపు వచ్చి పీడించెను. |
| ,, 24-33. | వేగుఁజుక్క, కోడికూఁత, దీపములు, పద్మవికాసము, కుముదనిమీలనము, కోకములయానందము, ఉదయించుచున్నసూర్యచంద్రబింబములు, సూర్యకాంతులు మున్నగువాని వర్ణనము. | వేగుఁజుక్క, కోడికూఁత, దీపములు, పద్మవికాసము, కుముదనిమీలనము, కోకములయానందము, ఉదయించుచున్న రవిచంద్రబింబములు, సూర్యకాంతులు మున్నగువాని వర్ణనము. |
| ,, 34-39. | హరిశ్చంద్రాదు లట్లు సుఖనిద్ర చేసి సూర్యోదయమగుడుఁ గాశీపురముఁ జేరిరి. రాజు విశ్వేశ్వరాలయముఁ గాంచి యాదేవుని స్తుతించి | అట్టి యుపద్రవమునుండి యెట్టులో తప్పి దమయంతి సుబాహుపురముం జేరి రాచనగరిం గాంచి దాని వైభవమును వర్ణించి యచ్చెరు వందుచుండు నంతలో, దీనుఁడై యడవిలోఁ దిరుగు నలుఁడు స్మరణకు |

| | హరిశ్చంద్రకథ. | నలకథ. |
|---|---|---|
| | యుండునంతలో నక్షత్రకుఁడు పీడించుటయు, జంద్రమతి తన్నమ్మి ఋణవిముక్తి నొందుమని రాజునకు బోధచేయుట చే నాతఁడు మిగుల వగలం బొగుల సాగెను. | వచ్చినందున నామె మిగుల వగలం బొగుల సాగెను. |
| ఆ. 4. 35 | (కాశీపురవర్ణనము.) | (సుబాహుపురవర్ణనము.) |
| ,, 40-42. | ఆరీతిని బరిపరివిధముల దుఃఖించి గత్యంతరము లేనందున నెట్టకేల కట్లె చేయుట కంగీకరించి హరిశ్చంద్రుఁడుచంద్రమతి నమ్మఁ జూపఁగాఁ, బుర పురంధ్రు లామెం గాంచి చంచలలక్ష్మివలె నున్న యామె నమ్మనగునా యనుచు నామెను వర్ణించిరి. | ఆరీతిని బరిపరివిధముల దుఃఖించి యామె రాజభవనద్వారమును దఱియునంతఁ బుర పురంధ్రు లామెం జూచి "ఈమె సార్వభౌముని భార్య కానోపును. చంచల యగు లక్ష్మిని నమ్మనగునా?" యని పల్కుచు నామెను వర్ణించిరి. |
| ,, 42-54 | ఆకేశనఖపర్యంతము చంద్రమతి వర్ణనము. | ఆకేశనఖపర్యంతము దమయంతి వర్ణనము. |
| ,, 54-65 | ఆసమయమున విశ్వామిత్రప్రేరితుఁడయి కలిపురుషుఁడు కాలకౌశిక నామ బ్రాహ్మణవేషమునవచ్చి "భార్యనమ్ముకొననగునా? వ్యవసాయముచేసికొనరాదా?" అని చెప్పి మరలించుటయు నా హరిశ్చంద్రుఁడందుల కంగీకరింపక "మహారాజ నగునేను వ్యవసాయము చేయుదునా?" అని బదులుచెప్పి గత్యంతరము లేక కరుణించి సాయపడు మని ప్రార్థింప నావిప్రుఁడు ధనరాశి నిచ్చి చంద్రమతిని గొనిపోవ నుద్యమించెను. అప్పుడు లోహితుఁడు దుఃఖింపఁగా నావు తోడిదే పెయ్యయునని తగవు | ఆసమయమున రాజమాత మేడమీఁది నుండి దమయంతినిజూచి తీసికొనిరమ్మని యొకదాదినంప నదివచ్చి "ఈదుఃఖము పోవు నుపాయము చేసికొనరాదా? ఏల దుఃఖించెదవు? ఈసుబాహుని తల్లిని సేవింపుము". అని బోధనచేయఁగా, నామె "మహారాజపత్ని నగునేను దాస్యము చేయుదునా?"అని పలికి గత్యంతరములేక తుదకుఁ గరుణించి సాయపడుమని దాదిని వేఁడుకొనుటయు, నాదాదియామెకుఁదగినట్లు సైరంధ్రిగా నుండ బోధచేసి రాజమాతదరికిఁ దీసికొనిపోయెను. రాజమాతయు నామె నాదరించి తనకూఁతున కప్పగింప దమయంతి యారాజమాత మెచ్చునట్లుగ సంచరించుచుండెను. |

## హరిశ్చంద్రకథ.

పెట్టి వానినిఁగూడఁ దీసికొని పోయెను. చంద్రమతి యాఁగాలకౌశికునింట నాతనిభార్య కలహకంఠిక మెచ్చునట్లుఁ బనులు చేయుచుండెను.

ఆ.4.66-73. అట హరిశ్చంద్రుఁడాధనమును నక్షత్రకున కర్పింప నాతఁడు "నాజీతనమందినదిగాని నాగురువుగారిసొమ్ము నిచ్చివేయుము" అనిపల్కెను. అందులకు రాజు చలించియుఁ జేయునది లేక తన్ను నమ్ముకొమ్మనుటయు, నాతఁడు రాజును బాధించి విశ్వామిత్రప్రేరణమున మాలనిరూపమున నున్న వీరబాహునియొద్దకుం గొనిపోయి వాని కమ్మఁ జూపఁగా రాజు దుఃఖితుఁడై యా మాలనిం గాంచెను.

,, 78. (వీరబాహుని వర్ణనము.)

వీరబాహుఁడు రాజుం గాంచి "నీవెవ్వఁడవు? నన్ను సరిగా సేవించెదవా? వలసిన ధనము నిచ్చెదను." అని పలుకఁగా, రాజు సత్యమునకులోఁబడి యందుల కంగీకరించుటయు నామాలఁడు నక్షత్రకునకుఁ గోరినంతధన మిచ్చి యా రాజుం గొని తోడ్కొని పోయెను.

ఆ.5.1-10. నక్షత్రకుఁడాసొమ్ముఁ గట్టుకొని పోయి విశ్వామిత్రునకు సమర్పించెను. హరిశ్చంద్రుఁడును దేవతాప్రసాదమున నాఁకలిదప్పులులేనివాఁడైయా

## నలకథ.

అట నలుఁడరణ్యమునఁ బోవుచు దవాగ్నిలోఁబడియున్న కర్కోటకునిం గాపాడి పైకిఁదీయఁగా, నాసర్ప మాతనినిగఱచి విరూపినిఁ జేసెను. అందులకు రాజు సంభ్రమింపఁగా "నీవుబాధలుపడకుండుట కిట్లు సేసితిని. నీరూపమువలసినపుడీవస్త్రమును ధరింపుము!' అని యొక బట్టనిచ్చి "ఈదరినున్న ఋతుపర్ణుని సేవించి నీయశ్వహృదయము వాని కుపదేశించి వానియక్షహృదయమును నీవు సంపాదింపుము. నీకు మేలయ్యెడు." అని చెప్పి పోయెను. నలుఁడును సంతసించి ఋతుపర్ణునొద్ద కేఁగి యాతనిఁ గాంచెను.

(ఋతుపర్ణుని వర్ణనము.)

ఋతుపర్ణుఁడును నలునిం జూచి "నీవెవ్వఁడవు? నన్ను సేవించెదవా? నీయక్కఱ తీర్చెదను." అని పలుకఁగా రాజు "నే నశ్వహృదయము నెఱుఁగుదును. పాకవిద్యలోఁ గుశలుఁడను. నిన్ను సేవించెదను." అని పలుకుటయు ఋతుపర్ణుఁడు సంతసించి యాతని నాదరించెను.

నలుఁడు బాహుకుఁడను పేరితో ఋతుపర్ణుని సేవించుచు నాతనిదయచే నాఁకలిబాధయు నుడుగఁ దనసేవకు మెచ్చి యాతఁడశ్వాధిపత్యము నొసంగిన, నశ్వములను వశపఱుచు కొనుచు, నశ్వ

## హరిశ్చంద్రకథ.

మాలని సేవించుచు నట్టి సేవకు మెచ్చి యాతఁడు శ్మశానాధిపత్యము నీయఁగా భూతప్రేతపిశాచములను వశపఱుచుకొని, శవములపన్నులు రాఁబట్టుచుఁ బ్రేతభూమియందు నివసించి ప్రియావియోగమునకు దుఃఖించుచుండెను.

ఆ. 5-6. (శ్మశానవర్ణనము.)

,, 11-13. అపుడు విశ్వామిత్రుఁడా చంద్రమతీ హరిశ్చంద్రుల నింకను బీడింప నెంచి కాలకౌశికునిఁ బ్రేరింప నాతఁడు హోమ మారంభించి లోహితు నిసమిధలకై యడవికి వెళ్లుమని పీడించుటయుఁ దల్లి చంద్రమతి దుఃఖించి రక్షకట్టి యనుప విప్రబాలకులు తోడరా నాబాలుఁ డరణ్యమున కేఁగెను.

,, 15 (చంద్రమతి దుఃఖము)

,, 18. (అటవీవర్ణనము)

,, 11-24. ఏఁగి యట భీతుఁడై యాకులను దర్భలను వెదకుచుండ విశ్వామిత్ర ప్రేరితుఁడై తక్షకుఁడా బాలకుని గఱవఁగా నాతఁడు మూర్ఛిల్లుటయుఁ దోడిబాలురు పోయి కాలకౌశికునితో నావృత్తాంతమును జెప్పుచున్నపుడు విని చంద్రమతి మూర్ఛిలి తెలిసి పలువిధముల దుఃఖించి యడవికిఁ బోననుజ్ఞయి మ్మని యావిప్రుని వేఁడెను. కాని యాతఁడునిర్దయుఁడై యామెను నిరాక

## నలకథ.

కాలయందుండి ప్రియావియోగమునకు దుఃఖించుచు నుండెను.

అపుడు భీముఁడు తనకూఁతురు నల్లుఁడు పడిన కష్టములను విని దుఃఖించి వారి నన్వేషింప సుదేవుఁ డనువాని నంపఁగా నాతఁడు తిరిగి తిరిగి సుబాహుపురి కేఁగి పౌరోహితులతో రాజాంతఃపురముఁ బ్రవేశించి యచట దమయంతిం గాంచి తన్నెఱింగింప నామె తనయవస్థ నాతనికిఁ దెలుపుచుండ విని రాజమాత మిక్కిలి దుఃఖించి తా నామెకుఁ బినతల్లి యగుట నెఱింగించి తగుసాయ మిచ్చి కొన్కలతో సంపుటయు నామె బయలువెడలి యెదుటఁ గుండినపురమును గాంచెను.

(రాజమాత దుఃఖము.)

(కుండినపురవర్ణనము)

కాంచి జనకునిల్లుచేరి యావస్త్రార్ధము తోడనే యుండి వనరుచుండ భీముఁడు కూఁతుదుర్దశను గాంచి పర్ణాదుఁడనువిప్రుని నలు నన్వేషింపఁ బంచి "భార్యనునట్టడవిలో విడిచిన యవాచ్యుఁడు" అనువాక్యమున కుత్తర మొసఁగినవానిం గని రమ్మన నాతఁడు పోయి యయోధ్యలో నశ్వశాలయందు విరూపియై యున్న బాహుకుఁ గాంచి భీముఁ డుపదేశించిన రీతిని బలికి యాతఁడు దుఃఖముతో నిచ్చిన "రాజ్యభ్రష్టుఁడై మతిచెడి యుండువాని నిట్లు పీడించుట కులకాంతకుఁ గీర్తికర మగునా?" అను ప్రత్యుత్తరమును విని యచటు

హరిశ్చంద్రకథ.

రించి యింటిపనులెల్లం దీర్చినం గాని పోరాదని పలుక నామె దుఃఖము నడంచికొని యట్లే చేసి యాతని యనుమతంబున నరణ్యమున కేఁగుచో ననూరుని సారథ్యవశమున సూర్యరథ మస్తాచలశిఖరము నధిరోహింప సూర్యుఁ డస్తమించుటయు నంధకారబంధుర మగు నాయరణ్యమున సర్పదష్టుఁ డగు లోహితుం గాంచి దుఃఖించి వానియందే తనహృదయము నిల్పియుండి దుఃఖించెను.

ఆ.5.30-32. (అంధకారవర్ణనము)

,, 33-39. అట్లు దుఃఖించి యామె యెట్టకేలకు ధైర్యము నూని యాబాలుని స్మశానవాటికనుం జేర్చి దుఃఖించుచుండ నచటఁ గా పైయొకమంచెపైఁగూర్చుండి యావలికెవ్వరును రానందులకువిచారించుచుండి యారాజు రోదనమునువిని యెవ్వరువచ్చిరో యని వెదకఁ దలఁచెను.

,, 40-55. అట్లుతలంచి యాచోటికేఁగి పన్ను చెల్లింపుమని పీడింపఁగా నామె యాబాలునిఁ జూపి యాతని కగ్నిదానము చేయుమని ప్రార్థించుటలో నాతఁ డాపిల్లని దనపుత్రునిఁగా గుర్తె

నలకథ.

వాసి భీమున కెఱిఁగించుటయు దమయంతి మూర్ఛిల్లి తెలిసి దుఃఖించుచుఁ దను మును వెదకి తెచ్చిన సుదేవుని రావించి నలుని దరి కేఁగవలయు నని వేఁడికొనెను. ఆతం డందుల కియ్యకొని యయోధ్య కేఁగి దమయంతీ ద్వితీయస్వయంవర మచిరకాలమున నగు నని ఋతుపర్ణునకుఁ దెలుపఁగా నాతఁ డానుదేవుఁడు చెప్పినకాలము దాఁటకుండఁ గుండినపురిం జేరఁదలంచి బాహుకుని సారథిఁగాఁ జేసికొని రథాధిరూఢుఁ డై పోవుచు నరణ్యమున రథవేగవశమున నుత్తరీయ మెగిరిపోవుతఱి నాబాహుకుఁడు రథవేగమును వర్ణించుటం జేసి మత్సరించి తనయక్షహృదయజ్ఞతం జూపుచు నొక తాండ్రచెట్టుపర్ణంబుల సంఖ్యచెప్పఁగా బాహుకుఁడచ్చెరువొంది యాతనికిఁ దనయశ్వహృదయము నిచ్చెద నని వాగ్దానముచేసి యాతనివలన నాయక్షహృదయము నుపదేశమందెను.

(తాండ్రచెట్టు వర్ణనము.)

అట్లుపదేశమందిన యాయక్షవిద్యామహిమచేఁ గలి యాతని విడిచిపోవఁగా నలుఁ డచిరకాలమున ఋతుపర్ణుని గుండినపురమును జేర్చుటయు నారథఘోషము నలునిదిగాఁ దలఁచి దమయంతి తనయుక్తి నెఱవేఱినందులకుప్పొంగుచు మేడమీదనుండి నలేతరులనుజూచి విఫలమనోరథయై దుఃఖించుచుండ నాఋతుపర్ణుఁడు భీముఁ డిచ్చినవిడిదిలోదిగి రాజులెవ్వరును నావలికు రాకుండుటకుఁజింతించుచుండె. దమయంతియు నాఋతుపర్ణుని సారథి యెవ్వరో యనుసందేహము వాపికొనుటకై యాతనితో వచ్చినవారిని శోధింపఁ దలంచెను.

అట్లు తలంచి కేశిని యనుదానితోఁ దనపుత్రుని బెట్టి పంప నాతఁడు వానిని

హరిశ్చంద్రకథ.

ఱిఁగియు నాకారగోపనముచేసికొని యామె మెడలోనున్న మంగళసూత్రముఁ బన్నుక్రింద నిమ్మనుటయు, నామె యాతఁడు తనభర్తయే యని గ్రహించి యాతని తొంటి వైభవమును వర్ణించి యిప్పటి దురవస్థకు దుఃఖింపసాగెను.

ఆ. 5. 51. (హరిశ్చంద్రుని తొంటి వైభవము.)

హరిశ్చంద్రుఁ డట్లు దుఃఖించు చంద్రమతి నూరార్చి "పలు దేశములు నాతోఁ దిరిగిన పరమోపకారిణి వగునిన్ను నమ్మివేసి నే నెట్లు నీయెదుట నిలుచువాఁడను?" అని దుఃఖముతోఁ బలుకఁగాఁ జంద్రమతి "మహానుభావా! అట్లనఁదగునా? నీ సచ్చరిత్రమునకు భూమ్యాదులు సాక్షులై యున్నవి." అని పల్కుచు వనరుచుండ నామెతోఁ గలిసి లోహితుని పై కన్నీటిధారలు పాఱున ట్లాతఁడును మొఱవెట్టి తుదకు ధైర్యమునూని సదుపదేశముచేసి పన్నునకై సొమ్ము తెమ్మనఁగా నామె యందులకై యూరిలోని కేఁగుటయు, విశ్వామిత్రకల్పితుఁ డగుచోరుఁ డొకఁ డాయూరిరాజపుత్త్రుని జంపి నగలం దోఁచికొని తెచ్చి కపటముచేసి యామెకిచ్చెను. ఆ కారణమున నామె యా వస్తువులతో రాజభటులకు

నలకథ.

గుర్తెఱింగియు నాకారగోపనము చేసికొని దాని నటనుండి పొమ్మనఁగా నది యాతఁడు వంటచేయునపు డప్రయత్నసిద్ధములై సాక్షాత్కరించి యున్న యగ్నిజలములఁ జూచి పోయి దమయంతికిఁ దెలుపఁగా నామె యాతఁడు తనభర్తయే యని గ్రహించి తనతండ్రిమూలమున నాతని రావించి యాతనితొంటివైభవమునువర్ణించి యిప్పటిదురవస్థకు దుఃఖింపసాగెను.

(నలుని తొంటివైభవము.)

నలుఁ డట్లు దుఃఖించు దమయంతి నూరార్చి "పలుదేశము లొంటరిగఁ దిరిగిన నిన్నెట్లు నమ్మి గ్రహింపనగును?" అని దుఃఖముతోఁ బలుకఁగా నామె పాతివ్రత్యము నెఱిఁగినవాయుదేవుఁ డచట నిలిచి "నీ వట్లనఁజనునా? నీభార్య పాతివ్రత్యమునకు భూమ్యాదులు సాక్షు లయియున్నవి" అని పలుకుటయు నలుఁ డామెను గూడి కర్కోటకుఁ డిచ్చిన వస్త్రమును ధరించి తనతొంటిరూపము నంది తన్ను సేవకునిఁ జేసినందులకుఁ బరితపించుచున్న ఋతుపర్ణుని దేర్చి యాతని కశ్వహృదయమునుపదేశించి పంపివేసెను. వెండియు నతఁడు తన కుటుంబమును భీమునొద్దనుంచి పుష్కరునిపాలికింబోయి దమయంతినొడ్డి జూదమాడి వానియధీనములోనున్న తన రాజ్యమును గెలిచికొనెను.

| హరిశ్చంద్రకథ. | నలకథ. |
| --- | --- |
| దొరకి రాజదండనకర్తయై వీరబాహునకప్పగింపఁబడెను. | |
| ఆ. 5. 61-70. వీరబాహుఁడును వామెను వధ్యశిక్షకుఁ డగు హరిశ్చంద్రునొద్దకుఁ బంపఁగా నాతఁడు ధైర్యముతో విశ్వామిత్రుఁ డాపఁ జూచినను నాఁగకయామెతలనఱకుటకై కత్తిని దీసియుండ దేవతాగణముతో నీశ్వరుఁడు ప్రత్యక్షమై "ఓరాజా ! నీ నీతికిని నీభార్యపాతివ్రత్యము నకును మెచ్చితిని" అని పలుకుచు లోహితుని గాశిరాజపుత్రుని బ్రతికించి పరసేవావైలక్ష్యము పోఁబలుకుటయు నాతఁడు పుత్రుని గలిసియాపరమేశ్వరుని స్తుతించి విశ్వామిత్ర దత్తరాజ్యమెట్టకేలకు గ్రహించి రాజపూజితుఁడై బంధుజనరక్షకుఁడై రాజ్యమును బాలించుచు ధరాపురంధ్రితోఁ జంద్రమతిని సుఖింపఁజేసెను. | ఆవెనుకఁ గానుకలతో భీమరాజుచే నంపఁబడిన తనకుటుంబము నాదరించి నలుఁడు శత్రుల నణంచుచు దానధర్మములం జేయుచునుండి దమయంతితో నొక యజ్ఞముచేయఁగా, నింద్రుఁడు దేవతాగణముతో సాక్షాత్కరించి "ఓరాజా! నీ నీతికిని భార్యపాతివ్రత్యమునకును మెచ్చితిని" అని పల్కుచు వరముల నొసంగి వారికిఁ బరసేవావైలక్ష్యము పోఁబలుకుటయు నాతఁడు భార్యతోఁ గూడి యామహాత్ముని స్తుతించి యింద్రదత్త రాజ్యపాలనావైభవము నంది రాజపూజితుఁడై బంధుజనరక్షకుఁడై రాజ్యమును బాలించుచు ధరాపురంధ్రితో దమయంతిని సుఖింపఁజేసెను. |
| ఆ. 5. 66. (శివస్తుతి.) | (ఇంద్రస్తుతి.) |

పయిరీతిగ జోడింపఁబడిన హరిశ్చంద్రనలకథలు కవిచే నే గ్రంథమునుండి సంగ్రహింపఁబడినవో యనువిషయము విచారింపవలసియున్నది. నలకథ మహాభారతమునఁ గలదు. హరిశ్చంద్రకథ ఋగ్వేదమునందును. మార్కండేయపురాణమునందును, భాగవతమునందును, దేవీభాగవతమునందును నగపడుచున్నది.

భారతమునమన్న నలకథలో "నలుఁడు స్వయంవరమున దమయంతిని బరిణయ మయి మహావైభవముతో రాజ్యము నేలుచుండె" అను కథాభాగముమాత్రమే శ్రీహర్షకవిచే స్వీకరింపఁబడి నైషధకావ్యమున వర్ణింపఁబడెను. నలునియుత్తరకథయం దాతఁడు పడినకష్ట

ములుమాత్ర మున్నవి గాని యాతనికి ఘనతను సంపాదించువిషయము లెవ్వియులేవు. మఱియుఁ బూర్వకథతోడనే "అంగవంతో ముఖాద్యర్థా విప్రకీర్ణా యథాయథమ్, ఏకార్థ ముపనీయంతే యత్ర నిర్వహణం హి తత్" అనులక్షణము గల నిర్వహణసంధి ముగిసి కావ్యోపసంహారా వస్థ సంభవించుటంజేసి యుత్తరకథారంభము వేఱొకకావ్యము నారంభమువలె నుండు నని కావలయు శ్రీహర్షమహాకవి నలుని యుత్తర కథను వర్ణింపలేదు. అట్టి శ్రీహర్షుని సంస్కృతనైషధకావ్యమునకే శృంగారనైషధకావ్య మాంధ్రీకరణ మైయున్నది. సంస్కృతాంధ్ర భారతములును, సంస్కృతాంధ్రనైషధములును రామరాజభూషణునకుఁ బూర్వములే యయినను హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి నలకథ చాలవఱకు సంస్కృతభారతమును సంస్కృతనైషధమును మాత్రమే యాదరించిన ట్లున్నదిగాని వాని యాంధ్రీకరణముల నాదరించిన ట్లగ పడదు. కొన్నియలంతిస్థలములందు నర్థద్వయసంఘటనయోగ్యత మొద లగు కొన్నికారణములచే నట్టి సంస్కృతగ్రంథములలోని కథాభాగ ములు నైతము రామరాజభూషణునిచే మార్పఁబడినవి.

హరిశ్చంద్రకథ లనేకగ్రంథములం దనేకరీతుల నున్నవి. వానిలో నెల్ల మొదటిది ఋగ్వేదభాగ మగునైతరేయబ్రాహ్మణస్థకథయే యనఁ దగును. అట్లయినను నాహరిశ్చంద్రునికథ సత్యవ్రతోపస్తుతియోగ్య ముగ మార్కండేయపురాణమున నవరింపఁబడినది. అట్లు నవరించుటలో నందైతరేయబ్రాహ్మణస్థకథాసారమును మాత్రము సూచించి యా కథను వర్ణింపక వేఱొకకథను గల్పించియున్నాఁడు. అట్టి మార్కండేయ పురాణకథయే దేవీభాగవతమున నవరింపఁబడినది. అట్లు నవరింపఁబడు టలో మార్కండేయపురాణమున వర్ణింపని యైతరేయ బ్రాహ్మణకథయు తము వర్ణింపఁబడెను. ఆకథయే మార్కండేయపురాణమునుండి గ్రహిం చినకథకుఁ బీఠిక యగునట్లు సందర్భపఱుపఁబడెను. ఈ దేవీభాగవతకథయే యాంధ్రప్రబంధవర్ణితకథకు మూలమనఁదగినంత సంబంధము గల్గియున్నది.

రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానమేకాక మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్రమును, గౌరనమంత్రి హరిశ్చంద్రద్విపదయును, శంకర కవి హరిశ్చంద్రోపాఖ్యానమును, కంచివీరశరభకవి హరిశ్చంద్రోపాఖ్యాన

మును నాంధ్రభాషలో హరిశ్చంద్రకథను వర్ణించిన ప్రాచీనప్రబంధము లగపడుచున్నవి. దేవీభాగవతస్థితహరిశ్చంద్రకథయే కొంతవఱకు మార్పఁబడి వీనియందు వెలయుచున్నది. కొన్ని పేరులును మార్పఁబడినవి. 11-వ శతాబ్దమువాఁ డగునార్యక్షేమేంద్రునిచే రచిత మగుచండకౌశిక నాటకమందుసయితమీమార్పు లగపడవు. ఆనాటకము కేవలము మార్కండేయపురాణము ననుసరించియే రచింపఁబడె నని చెప్పవచ్చును. మారనకవి మార్కండేయపురాణకథను సరిగాఁ దెనిఁగించెను గాన నందును నిట్టికల్పనము లగపడవు. కావున నాంధ్రకవులు చేసినమార్పులు గలకథకు మూలగ్రంథ మేదో! లేక, యాంధ్రకవులలో నొక్క రట్టి మార్పులను జేసియున్నయెడల వారిలో నెవ్వరు మొదటివారో యను విషయము నిర్ణయించుకొనవలసియున్నది. సామాన్యముగా వీ రెల్ల నొక్కశతాబ్దములోనివారే యయియున్న ట్లగపడుచుండుటచే, వీరి గ్రంథముల పౌర్వాపర్యము నిర్ణయించుట యశక్య మని చెప్పవచ్చును. దేవీభాగవతమున లేని కొన్నికల్పనములును, పేరులమార్పులును మున్నగునవి వీనియన్నిటియందును జాలవఱకుఁ దుల్యములే యైయుండు టచే నట్టిమార్పులు కల యేదోయొకగ్రంథము దేవీభాగవతమునకును వీనికిని నడుమనుండి యుండవలె ననికాని, లేదా యా యాంధ్రప్రబంధ కర్తలలోనే యొక రామార్పులను జేసియుండఁ దద్గ్రంథ మితరులకెల్ల మూలమయి యుండియుండవలె ననికాని చెప్పకతప్పదు.

> "చెలఁగి ఋగ్వేదప్రసిద్ధుఁ డై జగతి, వెలయు హరిశ్చంద్ర విభుపుణ్యచరితఁ
> గవితాచమత్కృతిఁ గాంచి వర్ణించి, కవు లందఱును శిరఃకంపంబు సేయఁ
> బచరించి వీనుల పండువుగాక, రచియింతు............"

అని యిట్లు ఋగ్వేదప్రసిద్ధహరిశ్చంద్రకథను దాను జమత్కార ముగాఁ గల్పించి వర్ణించెద నని గౌరనమంత్రి చెప్పికొనియుండుటచేతను, నాతనికావ్యము ద్విపదకావ్య మగుటచేతను గొందఱు చరిత్రకారులు గౌరన కృష్ణదేవరాయల కాలమునకును గ్రిందటివాఁడే యని యభిప్రాయ పడుచుండుటచేతను, నీగ్రంథమే తక్కిన యాంధ్రప్రబంధములందలి హరిశ్చంద్రకథలకు మూల మని కొందఱు అభిప్రాయపడుచున్నారు.

గౌరన వర్ణించినకథలోని కొన్ని విషయములు రామరాజభూష ణుని హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును, మల్లారెడ్డి షట్చక్రవర్తి

చరిత్రలోని హరిశ్చంద్రకథయందును నగపడకుండుటచే నవియే మొదటి వని గ్రహించుట యుక్తము. అందును హరిశ్చంద్రనలోపాఖ్యానమున శ్లేష ప్రతిబంధముచేఁ గొన్ని కల్పనములు విడువఁబడిన వనుకొంద మన్నను నేకార్థియగుమల్లారెడ్డి గ్రంథమునం దట్లులేకుండుటకుఁ గారణ ముండదు గదా! మఱియు ఋగ్వేదప్రసిద్ధ హరిశ్చంద్రకథయందు గౌరన చేసిన మార్పు లనేకములు పురాణములయందే యుండుటచే నాతఁడు పురాణములలోని కథలను సవరించెద నన్నచోఁ గొంతవఱకు సత్యముగా నుండును గాని ఋగ్వేదప్రసిద్ధ హరిశ్చంద్రకథను మార్చి చెప్పె ననుట సత్యమైయుండఁజాలదు. హరిశ్చంద్రద్విపద వ్రాసిన గౌరనమంత్రి 1600 ప్రాంతమునం దుండెడివాఁ డని బ్రౌనుదొరవా రభిప్రాయపడియున్నారు. గౌరనమంత్రి కృష్ణదేవరాయలకును బూర్వుఁ డనుటకుఁ దగిన ప్రమాణము లగపడవు. గౌరనహరిశ్చంద్రోపాఖ్యానాదిని జెప్పినమాధవనృపాలుఁడు (గౌరనపెదతండ్రి) ఈమాధవనృపాలునియొద్ద మంత్రి యని గౌరన చెప్పియున్నాఁడు (మూ.గౌ. హ. ద్వి. పూ. 40పు.) కవులచరిత్ర ద్వితీయ ముద్రణమున శ్రీవీరేశలింగముపంతులవారు వ్రాసినరీతిని 1427-వ సంవత్సరమున నున్న రేచన్నమాధవనృపాలుఁడే యనుటకుఁ దగినయాధార మగపడదు. రామరాజభూషణుఁడే యీకథను గల్పింపఁగా నయ్యది శ్లేషనిర్బంధమున నంతరసవంతముగా నుండనందున గౌరన ప్రతిబంధశూన్య మగుపాటవంటిద్విపదతో మిక్కిలిమనోహరముగా వర్ణించెననుట విరుద్ధము కానేరదు. మఱియు నాంధ్రప్రబంధములం దగపడుచున్న పయిమార్పులు కొన్ని రసౌచిత్యపోషణోపయోగులు గాక యనావశ్యకము లయి కేవలము నర్థాంతరానుసంధానానుకూల్యమునకై కల్పింపఁ బడిన ట్లగపడుచున్నవి.

"అ ట్లర్థాంతరఘటనానుకూల్యమునకై కల్పింపఁబడినవే యని తోఁచినవానిని గొన్నింటిని మల్లారెడ్డి విడిచిపెట్టియుండవచ్చును. అట్లు విడువఁబడినవానిలోఁ గొన్ని సందర్భయోగ్యములుగా వర్ణించుటకు వీలు పడియుండుటచే వానిలోఁ గొన్నిటిని గౌరన తనగ్రంథమునఁ జేర్చియుండవచ్చును. అట్లే మఱికొన్ని నూతనకల్పనములనయిత మాతఁ డౌచిత్యానుసారముగాఁ గల్పించియుండవచ్చును" అని యిట్లు మఱికొంద అభిప్రాయపడుచున్నారు.

వీరు చెప్పినరీతినే కొన్ని కథపట్టు లగపడుచున్నను రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమున వర్ణించినట్టియుఁ, బురాణములందు లేనట్టియు బేతాళవృత్తాంతము మున్నగు కొన్ని భాగము లర్థాంతరమందును నప్రసిద్ధమగు వర్ణనములను గల్పించుకొనవలసిన యావశ్యకతను గూర్చుచుండుటచే (చూ. హ. న. 3, 37-48) నట్టి కల్పనములంతకుముందే యుండియుండునని యంగీకరించుట యుచితము. ఇప్పటికట్టి మూలగ్రంథము వేఱొకటి యగపడనందున నట్టిది గౌరనగ్రంథమే యని నేను దలంచెదను. మఱియు శ్లేషార్థఘటనకై యప్రసిద్ధార్థములను గల్పించెననుటకన్న నవి యాపటికిఁ బ్రసిద్ధములై యున్నవనియుఁ, గవి తన సామర్థ్యవిశేషమున నట్లద్భుతముగా సందర్భపఱిచె ననియు నంగీకరించుటయే రామరాజభూషణుని కవితాపాటవమునకుఁ దగియుండునని నా యభిప్రాయము.

పై విషయమున మ-రా-రా-శ్రీ వూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు తామురచించిన హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికయం దిట్లు వ్రాసియున్నారు. "రామరాజభూషణకవి శంకరకవికృత మగు హరిశ్చంద్రోపాఖ్యానమును, శ్రీనాథకవివిరచిత మగుశృంగారనైషధమును ముందిడుకొని యీశ్లేషకావ్యమును వ్రాసియున్నాఁడు" అను నీవ్రాఁత సరిగా నున్న ట్లగపడదు. శ్రీనాథుని తెలుఁగునైషధమునకు మూలమగు శ్రీహర్షుని సంస్కృతనైషధము రామరాజభూషణునిచే నాదరింపఁ బడినదిగాని శ్రీనాథుని యాంధ్రీకరణ మాదరింపఁబడలేదు. శ్రీనాథుఁడు విడుచుకొనినట్టియు, సంస్కృతనైషధమున నున్నట్టియుఁ గొన్ని మార్గములు రామరాజభూషణునిచేఁ జూపఁబడినవి. మఱియు శ్రీనాథుఁడు విడుచుకొనిన కొన్ని యద్భుతమార్గములు రామరాజభూషణునిచే వసుచరిత్రమున సంగ్రహింపఁబడినవి. (చూ. నారచించిన వసుచరిత్ర విమర్శనము.) పై కారణములచే రామరాజభూషణుఁడు శ్రీహర్షుని సంస్కృతనైషధమును జదివినవాఁడని స్పష్టపడుచున్నది. కావున నీగ్రంథమునం దున్న నైషధకల్పనములు సంస్కృతనైషధమూలకములే యనుట సరిగాని శ్రీవూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు వ్రాసినట్లు శ్రీనాథకవిరచిత శృంగారనైషధమూలకము లనుట సరిగా దని గ్రహింపనగును. అయినను నలకథలో "నలుఁడు దమయంతిని వివాహ మయి సుఖ

ముండె" అనునంతవఱకుఁ గలకథ మాత్రమే నైషధకావ్యస్థమగుట చేతను, భారతస్థమగునలకథయెల్ల హరిశ్చంద్రనలోపాఖ్యానముననుండుట చేతను దానిలోని నలకథను గవి నైషధమును ముందిడుకొని వ్రాసె నని వ్రాయుట బొత్తిగా నసంగతముగ నుండును.

అట్లే శంకరుని హరిశ్చంద్రోపాఖ్యానము దీనికి మూల మను టయు సరికాదు. గౌరనరచననెల్లను నిర్వహించుచు నతోధికకల్పనను రచించిన శంకరునిరచన గౌరనకుఁ దర్వాతిదే యని స్పష్టపడుచున్నది. శంకరకవికృతగ్రంథమంతయు గౌరనగ్రంథము ననుసరించియు, దానిని సవరించియు వెలయుచున్న దనుటకు సందేహము లేదు. కాఁగా గౌరన గ్రంథమున లేనిశంకరకవికృత నూతనకల్పనము లెవ్వియు నిం దగపడవు. కాన గౌరనగ్రంథమును మూలముగాఁ జేసికొని వ్రాసినశంకరకవిగ్రం థము దీనికి మూల మనుటకంటె గౌరనగ్రంథమే దీనికిని మూల మనుట యుచితము.

**"చ. కుదురు మెఱుంగునిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్**
**చెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా**
**విదళితమానసాబ్జ వయి వేమఱు నాయువు శాశ్వతంబె సం**
**పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె యేరికిన్?"**

(హ. న. 5. 54.) (శంకర. హరి. 5. 87.)

ఈపద్య మున్నసందర్భమున హరిశ్చంద్రనలోపాఖ్యానమున నొక నాల్గు పద్యములు సుగమార్థకము లై యుండుటచే వాని వ్యాఖ్యాన మనావశ్యక మని తలంచి చిత్రకవి యనంతకవి "పై నాల్గుపద్యములును సుగమములు" అని వ్రాసియున్నాఁడు. ఇట్లు ముద్రితగ్రంథమునందే కాక నేను జూచినతాళపత్రగ్రంథములందెల్ల వ్రాయఁబడియున్నది. పయి పద్యమును విడిచినయెడల నచట వ్యాఖ్యానము లేనివి మూఁడుపద్య ములుమాత్రమే యగును. చిత్రకవి యనంతకవి రామరాజభూషణునికిఁ దరువాత మిక్కిలి సమీపకాలములోనివాఁ డగుటచే నీపద్య మీగ్రం థమునందు రామరాజభూషణునిచే నిలువఁబడినదే యని యంగీకరింపక తప్పదు. ఇఁక శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందు నయిత మీ పద్యమును దీసివేసినయెడల నీపద్యమునకుఁ దరువాత నున్న "అనినఁ జంద్రమతి యిట్లనియె" (5. 88) అను గద్యము మున్నగునవి సందర్భింప నేరవు గాన నందును నీపద్యము ప్రామాదికముగఁ బ్రక్షిప్త మయ్యె

ననుటకు వలనుపడదు. పై కారణములచే నం దొక గ్రంథకర్త వేరొకతి గ్రంథమునుండి యాపద్యమును గ్రహించె నని కాని యిటీవలివా రెవ్వ రేని యట్లు దృఢముగాఁ జొనిపి రనికాని యంగీకరింపక తప్పదు.

ఇఁక నాపద్యముయొక్క యదుకుబడినిబట్టి యదీ యేగ్రంథమున మిక్కిలి సరిగా నదుకుకొనియున్నదో విచారింపవలసియున్నది. ఏడ్చుచున్న యామె చంద్రమతి యని తెలిసినపిదప హరిశ్చంద్రుఁ డీపద్యార్థమును బల్కినట్లు రామరాజభూషణుఁడు సందర్భపఱిచియున్నాఁడు. ఏడ్చుచున్న యామె చంద్రమతి యని తెలియకమునుపు హరిశ్చంద్రుఁ డట్లామెతోఁ బలికె నని శంకరకవి సందర్భపఱిచియున్నాఁడు. కావున హరిశ్చంద్రుని వంటి మహాపురుషుఁ డామె తనభార్య యని గ్రహింపనపుడు—

> "కుదురు మెఱుంగునిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
> చెదరఁగ..."

అని యిట్లామెతోఁ బల్కె నని చెప్పుట యనుచితము గాన నీ పద్యము రామరాజభూషణుని గ్రంథమునుండియే శంకరకవిగాని వే ఱొకరుగాని సంగ్రహించియుండఁదగు నని తోఁచుచున్నది. మఱియు—

> "మ. అకటా! చేరఁడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టితభవ
> త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల
> ప్రకటానర్ఘశిరర్గళత్కిరణకుంభత్పాదుఁ డైనట్టిరా
> జకుమారుం డని యేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్ కాల్వలై పాఱఁగాన్.
> (శంకర. హరి. 5. 86.)

అనుదానివెనుక నున్నపయినుదాహరించిన "కుదురు మెఱుంగు" అనుపద్యమునందు "ఆయువు శాశ్వతంబె" అనువాక్యమునకుఁ (శంకరుని గ్రంథమునందు) బ్రసక్తి యగపడదు "సప్తద్వీపముల నేలురాజు కొడుకునకు దహనస్థలమునైతము లేకపోవలయునా?" అని యేడ్చు నపుడు సంపదలు స్థిరములు కావనియు, విధివిపాకము దాఁటరాని దనియు మాత్రమె చెప్పుటకుఁ బ్రసక్తి యుండును. రామరాజభూషణుని గ్రంథ మునం దన్నదో చంద్రమతి హరిశ్చంద్రుని గుఱుతించి యాతనిదీనదశను, బుత్రమృతిని, దనదురవస్థను నుగ్గడించి (చూ. హ. న. 5. 51-52) యేడ్చె నని చెప్పినవెనుక నీపద్యము వెలయుచున్నది. ఇందు "...ఆ యువు శాశ్వతంబె సంపదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె

యేరికిఁ" అనువాక్యముల కన్నిటికిఁ బ్రసక్తి యగపడుచున్నది. అశ్లీలకథాపక్షమునందును దన్నుగుఱుతించి తనదురవస్థకయి యేడ్చుచున్న దమయంతినిఁజూచి యామె యావఱకొంటరిగ నితరులతోఁ గలసి విజనప్రదేశములలో సంచరించిన దనుకారణమున నామెను బరిగ్రహించుట నింద్య మని తలఁచుచున్నవాఁడు గావున "ఆయుర్భాగ్యము లశాశ్వతములు; విధివిపాకము దుర్లంఘ్యము; ఏమిచేయ నగును?; అట్టి యనిత్యవస్తువులకై యకృత్యము చేయరాదు గదా! ఏకాకినివై సంచరించిన నిన్నెట్లు పరిగ్రహింప నగును? కావున నీవీజన్మమున విధివశమున వచ్చిన యీకష్టములకు దుఃఖింపఁబనిలేదు." అని యిట్లు నలుఁ డాశ్వాసించె నని చెప్పుట మిక్కిలి సందర్భపడియున్నదనుటకు సందేహము లేదుగదా! ఇంతియకాక వివాదస్థమగు "కుదురు మెఱుంగు" అను పద్యముయొక్క భావమే కల వేఱొకపద్యమునుయుతము శంకరకవిగ్రంథములో నీసందర్భముననే కొన్నిపద్యములతర్వాత వెలయుచున్నది.

"చ. సరసిజనేత్ర! జీవితము సత్యముగాదు శరీరధారికిన్
మరణము నిశ్చయంబు పలుమాఱు కుమారునిఁ జూచి యేడ్చినన్
మరలునె వీనిప్రాణములు మంగళసూత్రసువర్ణ మిచ్చి నీ
వరసుతునిం దహింపు మనువా! యన మూర్ఛిలి శోకమగ్నయై."

(శంకర. హరి. 5. 96.)

దీనినిఁబట్టి చూడఁగా "కుదురు మెఱుంగు" అను పద్యము రామరాజభూషణుని గ్రంథములోనిదే యనియు, శంకరకవిగాని యితరులుగాని యద్దానిని శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమున నదికియుండవచ్చునవియు నూహింపఁ దగియున్నది.

మ-రా-రా-శ్రీ, రా. బ. కందుకూరి వీరేశలింగముపంతులవారు మనయాంధ్రకవులు వర్ణించిన హరిశ్చంద్రకథ మార్కండేయపురాణమునుండి గ్రహింపఁబడిన దని యాంధ్రకవుల చరిత్రము మొదటిముద్రణమున వ్రాయఁగా మ-రా-రా-శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులవారామాటనునిరసించి యాంధ్రకవుల హరిశ్చంద్రకథకు మూలము స్కాందపురాణముగాని మార్కండేయపురాణము కాదని వ్రాసియున్నారు.

"స్కాందపురాణమునుండి పూర్వహరిశ్చంద్రకథకు మూలమగు సంస్కృతభాగమునంతయు బెంగుళూరుపట్టణమునందు 1882-వ

సంవత్సరము మార్చి 27-వ తేదీన ముద్రింపఁబడియున్నది. శంకరకవి విరచితమగు తెలుఁగుకావ్యములో నగపడుచున్న కథయంతయు నం దగపడుచున్నది. మార్కండేయపురాణమునందలి హరిశ్చంద్రకథయు నందలిపేరులును సాంతముగాఁ జదివిన స్కాందమునందలి హరిశ్చంద్ర కథంబోలి జనానురంజక మయియుండలేదు గాన మనదేశమున వాడఁ బడు హరిశ్చంద్రకథ శ్రీవీరేశలింగముగారు ప్రకటించినరీతిని మార్కం డేయపురాణాంతర్గతము కాదని స్కాందపురాణాంతర్గత మనియుఁ నొక్కి వక్కాణించుచున్నారము" అని యిట్లు హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠిక యందు వ్రాసిరి.

పై వాక్యములలో "తేదీన" అనుచో నున్నయవధారణార్థకాకారము వారు చూచిన గ్రంథములోఁ దేదీసంఖ్య వ్రాయఁబడలే దనియు, భోగటాచేసి వారు వ్రాసి రనియు సూచించుచున్నది. అందు లకు సరిగా నిపుడొక నిర్మూలహరిశ్చంద్రోపాఖ్యానము సంస్కృతభాషా మయ మగపడుచున్నది. అందది యేతేదీని ముద్రింపఁబడినదో, యే ముద్రాలయమున ముద్రిత మయినదో వ్రాయఁబడలే దని వేఱ చెప్ప నేల? దానికి ముఖపత్రమే లేదు; కాని పంతులవారు చెప్పినట్లు దాని యందు మనయాంధ్రకవులు వర్ణించిన హరిశ్చంద్రకథయెల్ల వెలయు చున్నది. గ్రంథమునుబట్టి నయిత మది యేపురాణమునుండి తీసి వ్రాయఁబడినదియుఁ దెలియుట కాధారములు లేవు. బ్రహ్మనారదసంవాద మనిమాత్రము దానివల్లఁ దెలియవచ్చుచున్నది. దానికాల మిది యని తెలియకున్నందున నద్దానిని మూలముగా గ్రహించుట సరికా దని తోఁచుచున్నది. రామకృష్ణయ్యపంతులవారు చిత్తగించినగ్రంథమదియే యైయుండు నేమో యనుసందేహము పొడముచున్నది. నిజముగా వీరు స్కాందపురాణభాగమునే చిత్తగించియున్నయెడల నక్కథ యాపురా ణమునం దేఖండములోనిదో, నేసంవర్గమున నే యధ్యాయమున నున్నదో వ్రాయఁజాలకుందురా ? కావున వీరు చిత్తగించినది నిజముగ స్కాందపురాణభాగముకాదని తోఁచుచున్నది. ఈవఱకు నాకు లభిం చిన స్కాందపురాణభాగములయందు హరిశ్చంద్రకథ యగపడనందున నం దాకథ యున్న దనికాని, లే దనికాని, యీరీతిగా నున్న దనికాని చెప్పఁజాలను. ఒకప్పు డట్లు స్కాందమున నున్నపు డదియే రామరాజ

భూషణుని గ్రంథమునకు మూల మనక శంకరకవిగ్రంథము మూల మనుట కేమియాధార మున్నదో తెలియకున్నది. మఱియు నిట్టి యీ దుర్బల మగువిమర్శనమును జూచి మ-రా-శ్రీ, కందుకూరి వీరేశలింగము పంతులవారు సయితము తమయాంధ్రకవులచరిత్రము ద్వితీయముద్రణమునఁ దమతొంటి యభిప్రాయమును మార్చుకొనుట మిక్కిలి వింతగా నున్నది. మ-రా-శ్రీ, పూండ్ల రామకృష్ణయ్యపంతులవారు స్కాంద పురాణభాగ మనుకొనిరని వెనుక నుదాహరించిన బ్రహ్మనారదసంవాద రూప మగు గీర్వాణభాషామయ నిర్మూలహరిశ్చంద్రోపాఖ్యానమునుండియే సంగ్రహించి వీరును గౌరనకవిచరిత్రమునఁ గొన్నిశ్లోకములను వ్రాసిరనుట సాహసముకాదు. వీరు నిజముగా స్కాందపురాణము నుండియే యెత్తి వ్రాసినయెడల నాయాశ్లోకములవిగూఢ నవి యేఖండము లోని యే యధ్యాయములోనివో స్పష్టముగా వ్రాయక "స్కాందము" అని మాత్రము వ్రాసియుందురా? *

ఈవఱకు నాకు లభించినపురాణములలో మార్కండేయపురాణ దేవీభాగవతములలోనికథయే మనయాంధ్రకవులు చెప్పిన హరిశ్చంద్ర కథకు సంబంధించియున్నది. కావున నవియే దీనికి మూల మని నేను దలంచుచున్నాఁడను. అందును మార్కండేయపురాణస్థహరిశ్చంద్రకథా గ్రంథమే సవరింపఁబడి దేవీభాగవతమున వ్రాయఁబడినది. కావున దేవీభాగవతము దీనికి మూల మైనపుడు దానికి మూల మగు మార్కండేయపురాణము దీనికి మూల మనుట విరుద్ధము కానేరదు. కావున శ్రీ వీరేశలింగముపంతులవా రాంధ్రకవులచరిత్రము ప్రథమముద్రణమున వ్రాసినవ్రాఁతయే సరియయిన దని చెప్పవలసియున్నది. ఇచట మార్కండేయస్థ కథాభాగమే సవరింపఁబడి దేవీభాగవతమున నెత్తివ్రాయఁబడిన దని విశదపడుటకై యొక్కసందర్భములోని చిన్నభాగములను రెండిటి నుండియుఁ దీసి చూపుచున్నాను.

"దేవరాజానునుజ్ఞాత స్స్వామినా శ్వపచేన వై,
అగత్వా నిష్కృతిం తస్య నారోఢ్యేఽహం సురాలయమ్.

* శ్రీ వీరేశలింగముపంతులవారొకవేళ స్కాందపురాణభాగమును జిత్తగించిరేమో యని శంకించుకొని వారిపేర రెండుజాబులు వ్రాసితొంటినిగాని వారందులకు జవాబును బ్రసాదింపరైరి. నామొదటియుత్తరమునకు జవాబుగా వారికవులచరిత్ర పూర్వభాగమును (ద్వితీయముద్రణము) నాకు దయతోఁ బంపిరి.

ధర్మ ఉవాచ:—

తమైవంభావినం క్లేశ మవగ మ్యాత్మమాయయా,
ఆత్మా శ్వపాకతాం నీతో దర్శితం తచ్చ చాపలమ్.

ఇంద్ర ఉవాచ:--

"ప్రార్థ్యతే య త్పరం స్థానం సమస్తై ర్మనుజై ర్భువి,
త దారోహ హారిశ్చంద్ర స్థానం పుణ్యకృతాం నృణామ్."

(మార్కం. 8. 56-68.)

హారిశ్చంద్ర ఉవాచ:—

"దేవరాజాననుజ్ఞాత స్స్వామినా శ్వపచేన వా,
అకృత్వా నిష్కృతిం తస్య నారోక్ష్యేఽహం సురాలయమ్."

ధర్మ ఉవాచ:—

"తమైవంభావినం క్లేశ మవగమ్యాత్మమాయయా,
ఆత్మా శ్వపాకతాం నీతో దర్శితం తచ్చ పక్కణమ్."

ఇంద్ర ఉవాచ:—

"ప్రార్థ్యతే య త్పరం స్థానం సమస్తైర్మనుజై ర్భువి
త దారోహ హారిశ్చంద్ర స్థానం పుణ్యకృతాం నృణామ్."

(దేవీభాగ. స్కం. 7. అ. 27.)

గ్రంథవిస్తరభీతిచే నుదాహరింప నైతినిగాని రెండుగ్రంథముల కును నీసందర్భమున శ్లోకసామ్య మీరీతిగనే సామాన్యముగా నంత టను వెలయుచున్నది. ఇట్టి గ్రంథసామ్య మాగ్రంథముల యేకకర్తృకత్వమునుగాని పరస్పర సంబంధమునుగాని సాధింపఁజాలియుండదు గదా. *

---

* "మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్,
అనాపలింగకూస్కాని పురాణాని పృథ క్పృథక్.
అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః,
భారతాఖ్యాన మతులం చక్రే తదుపబృంహితమ్." (స్కాం. మానస. అ. 1.)

(మద్వయము = మాత్స్యమార్కండేయములు, భద్వయము=భవిష్యభాగవతములు, బ్రత్రయము = బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మకైవర్తములు, వచతుష్టయము = వామన, వాయవ్య, వైష్ణవ, వారాహములు, అనాపలింగకూస్కములు = అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందములు.)

## 3-వ ప్రకరణము.

శ్రుతిసిద్ధములగు కథలను మూలముగాఁ జేసికొని యొక్కొక్కప్పుడు దానియం దావశ్యకము లగుకొన్నిమార్పులను జేసియుఁ గొన్ని యెడల నూతనములగుకథలను గల్పించియు నేదో యొకనీతిని బోధించుట పురాణములకు స్వభావము. ఏదో యొకకథను శ్రుతిపురాణముల నుండి గ్రహించి తత్కథానాయకునికి లోపము లేకుండఁగను, నందును ముఖ్యముగా రసమునకును నౌచిత్యమునకును భంగము లేకుండఁగను, శ్రుతిపురాణస్థకథలను మార్చియు నూతనకల్పనములను జేర్చియు వర్ణించుట కావ్యములకు స్వభావము.

పురాణములయందు సత్యవ్రతస్థాపనమును బ్రధానముగాఁ జేసికొని హరిశ్చంద్రకథ వర్ణింపఁబడినది. కావునఁ బౌరాణికులచేఁ దదుపయోగకరము లగుమార్పులే శ్రుతిప్రసిద్ధకథయందుఁ జేయఁబడెను. ప్రబంధములందు హరిశ్చంద్రుఁడు నాయకుఁడుగను వీరరసము ప్రధానరసముగను వర్ణింపఁబడెను. కావున వానియందుఁ దదుపయోగకరము లగు మార్పులు శ్రుతిపురాణప్రసిద్ధకథలలోఁ జేయఁబడినవి. అట్లే పురాణములయందు నలకథ పాతివ్రత్యమును బ్రధానముగాఁ జేసికొని వర్ణింపఁబడినది. ప్రబంధములయందు నలుఁడు నాయకుఁడుగను శృంగారము ప్రధానరసముగను వర్ణన చేయఁబడెను. కావున వానివానియందుఁ దత్తదనుకూలము లగుమార్పులు చేయఁబడినవి.

> "ప్రఖ్యాతోత్పాద్యమిశ్రత్వభేదా త్తత్త్రివిధం మతమ్"
> ఇ-హాసనిబంధనం ప్రఖ్యాతమ్, కవికల్పిత ముత్పాద్యం,
> సంకరాయత్తం మిశ్రంచేతి" (ప్రతాపరుద్రీయము. నాటకప్రకరణము.)

పయి మూఁడువిధములలో మిశ్రకావ్యమే ప్రాచీనాంధ్రకవులచేఁ దఱచుగ నాదరింపఁబడినది. రామరాజభూషణుఁడే యావిషయమున నిట్లు వ్రాసియున్నాఁడు.

> "ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
> నావిరిపుట్టురత్నము లవారితసత్కవికల్పనావిధా
> పావహపూర్వవృత్తములు సానలఁ దీఱినజాతిరత్నముల్
> గావున నిట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్." (వసు. 1, 91.)

"యత్ స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా,
విరుద్ధం త త్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్." (సాహిత్యదర్పణము.)

అనుసూక్తిఁ జెప్పునఁ గవులు చేయుమార్పులు రసపోషణమునకుఁ గాని యనౌచితినిరాసమునకుఁ గాని యౌచిత్యసంపాదనమునకుఁగాని చేసినవై యుండవలయును. అట్లయినను హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్య మగుటచే నిం దద్గ్రాంతరసంఘటనమునకు సయితము కొన్ని యెడలఁ గవి కొన్నియలంతిమార్పులను జేయవలసివచ్చెను.

"ప్రఖ్యాతవంశో రాజర్షి ర్ధీరోదాత్తః ప్రతాపవాన్,
ఏక ఏవ భవే దంగీ శృంగారో వీర ఏవ వా.
అంగ మన్యే రసా స్సర్వే." (సాహిత్యదర్పణము.)

అనుసూక్తులఁ జెప్పున నొకపక్షమున హరిశ్చంద్రుఁడును, ఒకొంతరమున నలుఁడును నిందు నాయకులుగ వర్ణింపఁబడిరి. హరిశ్చంద్రపక్షమున వీరరసమును, నలపక్షమున శృంగారరసమును బ్రధానరసముగఁ గ్రహింపఁబడెను.

"ఉత్తమప్రకృతి ర్వీర ఉత్సాహస్థాయిభావకః"
"స చ దానధర్మయుద్ధై ర్దయయా చ సమన్విత శ్చతుర్ధా స్యాత్"
"సచ వీరో దానవీరో, ధర్మవీరో, యుద్ధవీరో, దయావీరశ్చేతి
చతుర్విధః" (సాహిత్యదర్పణము. 3. పరి.)

అను చెప్పున నిందు హరిశ్చంద్రుఁడు సర్వస్వదానముచేసినట్లు వర్ణింపఁబడుటచే దానవీరుఁడును, నెన్నియిక్కట్టులువచ్చినను సత్యపాలనరూపధర్మమును వీడకున్నట్లు వర్ణింపఁబడుటచే ధర్మవీరుఁడును ననఁ దగును.

"వంశవీర్యప్రతాపాదీ న్వర్ణయిత్వా రిపో రపి,
తజ్జయా న్నాయకోత్కర్ష కథనం చ ధినోతి యః"

అనునాలంకారికసూక్తిఁ జెప్పునఁ బ్రతినాయకుఁడును వాని సామగ్రియుఁ బ్రతాపవంతు లయి యుండినంగాని నాయకునకు నుత్కర్షము సిద్ధింపదు. కావున నిందు హరిశ్చంద్రకథాపక్షమున మహాప్రభావశాలి యగువిశ్వామిత్రమహర్షి ప్రతినాయకుఁడుగను, గలితకుకధర్మాదు లాతనికి సహాయకారులుగను వర్ణింపఁబడిరి. అట్లే నాయకుఁ డగుహరిశ్చంద్రుని ఘనతకును, గావ్యాంగిభూత వీరరసమునకును బోషకముగ విశ్వా

మిత్రుని యందును నాతనిసహాయులందును నత్యంతక్రౌర్యాదులు కల్పితము లయ్యెను.

పురాణములలోనికథలతాత్పర్యమును గ్రహించునపు డాయా సందర్భములం దేయేనీతు లుపదేశింపఁబడునో వానినిమాత్రమే గ్రహింపవలయునుగాని, వాని కుపష్టంభకముగ వర్ణింపఁబడిన యితరవిషయములను గ్రహింపరా దని పండితులసిద్ధాంతము. అట్లే కావ్యములందును గావ్యాంగీభూతరసమును బోషించుట కయి యౌచిత్యానుసారముగఁ గల్పితము లగునితరవిషయములను సత్యములుగ గ్రహింపరా దని యాలంకారికసమయము. అట్టి సంప్రదాయము గ్రహింపక హరిశ్చంద్రకథలోఁ బ్రతినాయకుఁడుగ వర్ణింపఁబడిన విశ్వామిత్రునియందుఁ గావ్యాంగీభూతవీరరసపోషణమునకయి కల్పింపఁబడిన క్రౌర్యము సత్యమే యని గ్రహించుట యజ్ఞానవిలసితము.

పయి నుదాహరించినరీతిని రసౌచిత్యపోషణమునకును, నర్థాంతరసంఘటనానుకూల్యమునకును నొనరింపఁబడిన శ్రుతిపురాణాదిప్రసిద్ధకథలందు లేనినూతనకల్పనముల నీసందర్భమునఁ జూపుచున్నాను.

ఆంధ్రప్రబంధములలో హరిశ్చంద్రకథకు మార్కండేయధర్మరాజులే వక్తృశ్రోతలుగఁ జెప్పఁబడిరి. శ్రుతిపురాణములం దెచ్చటను నట్లు చెప్పఁబడి యుండలేదు. అట్లయినను ధర్మరాజు * ద్వైతవనమునం

* కామ్యకవనములో నున్నధర్మజునితో బృహదశ్వుఁడు హరిశ్చంద్రనలకథలను జెప్పినట్లు కొన్ని సంస్కృతభారతపుఁబ్రతులం దగపడుచున్నది. ఒక్క నలకథ మాత్రమే చెప్పఁబడిన ట్లనేకము లగు భారతపుఁ బ్రతులయందు వెలయుచున్నది. ఆంధ్రభారతము నందును నాసందర్భమున నొక్క నలకథయే యగపడుచున్నది. కాన నన్నయభట్టు వలెనే తక్కిన యాంధ్రప్రబంధకర్తలును భారతములోని యాహరిశ్చంద్రకథను జూచియుండరే దనియే తోఁచుచున్నది. అట్లు చూచియేయున్న యెడల నందలి వక్తృశ్రోతల నుగ్గడింపకుండుటకుఁగాని, కామ్యకవనములోఁ జెప్పఁబడినట్లు చెప్పక ద్వైతవనములోనని చెప్పుటకుఁగాని కారణము లేదుగదా! మఱియు నెల్లప్రతులయందును నిక్కథ యగపటకుండుటచేతను, నాంధ్రభారతమున నిది యాంధ్రీకరింపఁబడకుండుటచేతను, నున్న సంస్కృతభారతపుఁ బ్రతులయందుసయితమిక్కథ పూర్తిగా లేక యతిసంక్షిప్తముగా నుండుటచేతను, నిది యందుఁ బ్రక్షిప్తమని కొందఱభిప్రాయపడుచున్నారు. వసిష్ఠుఁ డింద్రసభలో హరిశ్చంద్రుని స్తుతింపఁగా విశ్వామిత్రుఁడు ప్రతిఘటించి యాతని నసత్యవాదినిఁ జేసెద నని ప్రతిజ్ఞచేసి పలుబాధలు

దుండఁగా మార్కండేయుఁడు వచ్చినట్లును నిష్టికష్టముల నందినసత్పు రుషులను గొందఱి నుగ్గడించి ధర్మరాజు నూరార్చినట్లును మహాభారత మున నగపడుచున్నది. (చూ. ఆం. మ. భారతము. ఆర. 1, 201-204.) అట్టిదాని నాధారముగాఁ జేసికొని యాంధ్రప్రబంధకర్త లిట్లు వర్ణించి యుండిన నుండవచ్చు నని తోఁచుచున్నది.

ఐతరేయబ్రాహ్మణభాగవత దేవీభాగవతములందు వర్ణింపఁబడిన హరిశ్చంద్రుని నరమేధవృత్తాంతము ప్రతినాయకునికి యోగ్యతఁ గూర్చు నదియు, నాయకునకు నయోగ్యతఁ గూర్చునదియు నని తలఁచియేకా వలయు నాంధ్రప్రబంధకర్త లెవ్వరు నద్దానిని వర్ణింప రైరి. పైవిష యము విశదపడుటకై నైతరేయనరమేధవృత్తాంతము నిట వ్రాయు చున్నాను.

* "ఇక్ష్వాకువంశజుఁ డగు హరిశ్చంద్రునకు నూఱుగురు భార్య లుండిరి. ఆతఁ డపుత్రకుఁడై నారదునుపదేశమున వరుణు నారాధించి "నాకుఁ బుత్త్రు నొసంగినచో వానినే పశువుగాఁ జేసి నరమేధము చేసి నీకుఁ బ్రియ మొనర్చెదను" అని యొప్పుకొనఁగా నావరుణుఁ డాతనికిఁ బుత్త్రుఁడు కలుగునట్లు వర మొసంగెను. అట్టి వరుణునిప్రసాదమున రోహితుఁ డనుపుత్త్రుఁడు గల్గినపిమ్మట హరిశ్చంద్రుఁడు తనంతట తాను నర మేధమును జేయకుండుటయే కాక వరుణుఁడు వచ్చి యాయజ్ఞము చేయ

---

పెట్టినను హరిశ్చంద్రుఁడు చలింపఁడయ్యెనని యిట్లతిసంక్షిప్తముగ నలోపాఖ్యానాం తమున నొక్క యరపేజీతోఁ జెప్పఁబడియున్నది. విశ్వామిత్రుఁ డెట్లు రాజ్య మప హరించెనో? యేరీతుల బాధలనందించెనో యనుమొదలగువిషయము లెవ్వియు నందు లేనేలేవు.

"పునరేవ తు వక్ష్యామి యస్త్వత్తో దుఃఖితో నృపః,
తం శృణుష్వ మహారాజ! సర్వదుఃఖాపనుత్తయే"

{ మహాభారతము. వన. నలోపాఖ్యానపర్వ.
77 అధ్యా. బొంబాయి నాగరపుఁబ్రతి. 1908. }

*హరిశ్చంద్రో హ వైధస ఇక్ష్వాకో రాజాऽపుత్ర ఆస; తస్యహ శతం జాయా బభూవుః. తాను పుత్రం న లేభే. తస్య హ పర్వతనారదౌ గృహమూషతుః. (ఐతరేయ 33. అధ్యా. 1 ఖండము)

తథేతి స వరుణం రాజాన ముపససార; పుత్రో మే జాయతాం తేన త్వా!యజా ఇతి; తథేతి, తస్య పుత్రోజజ్ఞే రోహితో నామ.....తంహోవాచా జని;వై తే

నిరోధించినను నేవేవో యుక్తులు పన్ని పుత్రమోహమున నాపిల్లనికి ధనుర్విద్య వచ్చువఱకును గడువులు పెట్టెను. పిమ్మట వరుణుఁడు శపించెద నని నిర్బంధింపఁగా హరిశ్చంద్రుఁడు "నిన్నుఁ బశువుగాఁజేసి వరుణప్రీతిగ నరమేధము చేయు నిర్ణయముపై నాతఁడు నిన్ను నాకుఁ బ్రసాదించెను. కాన నే నట్లు చేసెదను" అని పుత్రునితోఁ బల్కఁగా నాతఁ డంగీకరింపక ధనువును గ్రహించి యడవికిఁ బోయెను. అట్లు వంచితుఁ డగువరుణుని యాగ్రహమున హరిశ్చంద్రుఁడు జలోదరరోగ గ్రస్తుఁ డయ్యెను. అదివిని యాతనిపుత్త్రుఁ డరణ్యమునుండి రాఁజూచియు నింద్రునిచే నిలుపఁబడి యాఱుసంవత్సరములు గతించిన పిమ్మట నజీగర్తుఁ డనుబ్రాహ్మణునికుమారుఁ డగు శునఃశేఫుని విలిచి తెచ్చి తండ్రికి సమర్పింపఁగా, నాతఁడు వరుణు ననుమతి నంది యాశునఃశేఫుని యజ్ఞపశువుగాఁ జేసి రాజసూయము చేయఁబూనెను. ఆయజ్ఞమున విశ్వామిత్రుఁడు హోతగను, జమదగ్ని యధ్వర్యుఁడుగను, వసిష్ఠుఁడు బ్రహ్మ

పుత్రో యజస్వమామ నే నేతి; స హోవాచ యదా వై పశు ర్నిర్దశో భవత్యథ స మేధ్యో భవతి......సన్నాహం సు ప్రాప్నోద్యజస్వ మా మ నే నేతి; స త థేత్యుక్త్వా పుత్రమామంత్ర్య త్వా మదా ద్ధంత త్వయా ఽహ మిమం యజా. ఇతి సహ నేత్యుక్త్వా ధను రాదా యారణ్య ముపాతస్థౌ. (33. అధ్యా. 2 ఖండము. ఐతరేయ)

అథ హైక్ష్వాకం వరుణో జగ్రాహ. తస్యమ హోదరం జజ్ఞే. త దు హ రోహిత శ్శుశ్రావ; సోఽరణ్యాద్గ్రామ మేయాయ. తమింద్రః పురుషరూపేణ పర్యే త్యోవాచ. షష్ఠం సంవత్సర మరణ్యేచచార; సోఽజీగర్తం సౌయవసి మృషి మశనాయాపరీత మరణ్య ఉపేయాయ......శునశ్శేఫే తస్య హ శతం దత్వా సతమాదాయ సోఽరణ్యాద్గ్రామ మేయాయ......భూయా న్వై క్షత్రియా దితి వరుణ ఉవాచ; తస్మా ఏతం రాజ సూయం యజ్ఞ క్రతుం ప్రోవాచ. త మేత మభిషేచనీయే పురుషంపశు మాలేభే. (ఐతరేయ 33-3)

తస్య హ విశ్వామిత్రో హోతా సీ జ్జమదగ్ని రధ్వర్యుః వసిష్ఠో బ్రహ్మాఽయాస్య ఉద్గాతా...... అథహ శునశ్శేఫ ఈక్షాంచక్రే. అనుమానుష మివ వై మా విశప్యంతి. హంతాహం దేవతా ఉపధావామి. తస్యస్మర్త్యుక్తాయాం విపాశో ముముచేఽగద ఐక్ష్వాకఆస. (ఐతరేయ. 33-4).

(పయిసందర్భమును బట్టి రోహితుఁడు ధనుర్విద్య నేర్చిన పిమ్మట నాఱుసంవత్సరము లడవిలో నున్నట్లు తేలుచున్నందున హరిశ్చంద్రుని నరమేధకాలమునకు రోహితుఁడు రమారమి యిరువదిసంవత్సరములవాఁ డైయుండు నని గ్రహింపవలసియున్నది.

గను, నాయూస్యుఁ డుద్గాతగను నియమింపఁబడిరి. అందు శునఃశేఫుఁడు మిక్కిలి దుఃఖించి యాత్మరక్షకై దేవతల నారాధించినందున దేవతాప్రసాదమున వానిపాశములు విడిపోయెను. హరిశ్చంద్రునికి యాగఫల మగు జలోదరనివృత్తియుఁ గల్గెను." అనునది మొట్టమొదటిహరిశ్చంద్రకథయై యున్నది. సంస్కృతభాగవతమునందును బయిగైతరేయబ్రాహ్మణస్థకథయే వ్రాయఁబడెను. (భాగ. 9. స్కం. 7. అ.) అద్దానిని దెనిఁగించుచు బమ్మెరపోతరాజు పయి నరమేధవృత్తాంతమునందు హరిశ్చంద్రునిలోప మున్నట్లె యభిప్రాయపడియున్నాఁడు.

సీ. పురిటి లోపల వచ్చి పుత్త్రు వేలుపుమన్నఁ బురుడు పోయినఁగాని పోల దనియెఁ
బలురాకమును వచ్చి బాలు వేలుపుమన్నఁ బండ్లు లేకుంట నభావ్యుఁ డనియెఁ
బండ్లు రాఁజూచి డింభకుని వేలుపుమన్నఁ బడిపండ్లు రామి నభావ్యుఁ డనియెఁ
బడిపండ్లు వొడమినఁ గొడుకు వేలుపుమన్నఁ బోరుల కొదవక పోవ దనియె

ఆ.వె. తొడరి యిట్లు కొడుకు తోడి మోహంబునఁ,బ్రొద్దు గడపుచుండె భూవరుండు
తండ్రి తలఁపుకోలఁదిఁ దనలోనఁ జింతించి,యింట నుండ కడవి కేఁగెఁగొడుకు.
(భా. 9. స్కం. 196)

---

అటుపయిని గొంతకాలమునకు విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రరోహితచంద్రమతులఁ బీడించియుండెను. అట్టిస్థితిలో నట్లు పీడింపఁబడినకాలమునకు రోహితుఁడు బాలకుఁడని పురాణములలో వర్ణింపఁబడుట వింతగనున్నది.

"స్వపత్న్యా శైబ్యయా సార్ధం బాలకే నాత్మజేన చ
త మాగతం ద్విజం క్రోధా ద్బాల మభ్యాహన త్పదా."
"అథా జగామస్వసుతం మృత మాదాయ లాపినీ
భార్యాతస్య నరేంద్రస్య సర్పదష్టం హి బాలకమ్." (మార్కం.7, 8.అధ్యా)
"శిశు ర్దృష్ట్వా క్షుధావిష్టః ప్రాహ వాక్యం సుదుఃఖితః,
తాత తాత ప్రదే హ్యన్నం మాత ర్మే దేహి భోజనమ్.
క్షు న్మే బలవతీ జాతా జిహ్వాగ్రే మేఽతి శుష్యతి." (దేవీభాగ. 20 అధ్యా)
"తత స్స బాల స్సహసా దృష్ట్వా కష్టాం తు మాతరమ్,
సమభ్యధావ దం బేతి వదన్ సాశ్రువిలోచనః.
హస్తే వస్త్రం సమాకర్షన్ కాకపక్షధర స్స్వలన్." (దేవీభాగ. 22 అధ్యా)
వీనినిఁబట్టియే కావలయు నాంధ్రకవులును నిట్లె వర్ణించిరి. (హ. న. 3. 42.)

అద్యతనులు కొందఱుసయితము మీవిషయమున హరిశ్చంద్రుని నిరసించియే యున్నారు. "హరిశ్చంద్రుఁడు తనపుత్రునికి బదులుగ మఱియొక పాఱుని యాగపశువుగఁ జేయుటయుఁ ద్రిశంకుపట్టి నెట్టులేనియు బొంకింప సమకట్టి చలపట్టినగాధిపట్టి యట్టి యజ్ఞమునకు హోతగా నుండి సంతసించి ముఖ్యజ్ఞానంబు కృపసేసె ననుట యంతకన్న మిగుల నబ్బురముగా నున్నయదిగదా! మఱియుం జూడుఁడు. పోకల శేషాచలమునాయనిగారి పట్ప్రకవస్తులయింద్రజాలపుఁగథలలో భాగవతమునందుఁ వ్రాయఁబడినవిధముగఁ బుత్రునివిషయమై వరుణదేవునితో బొంకినకారణముచేత నీవు సత్యశీలుండవు గా వనియు, నసత్యవేణిదర్శనము నీకుఁ గలుగునే కాని సత్యవేణిదర్శనము నీకుఁ గలుగనేర దనియుఁ గుండలిశక్తి ప్రత్యక్షంబై హరిశ్చంద్రునితోఁ జెప్పినట్లుగ వ్రాయఁబడియున్నది." అని యిట్లు మ. రా. శ్రీ పూండ్ల రామకృష్ణయ్యపంతులవా రుత్తరహరిశ్చంద్రోపాఖ్యానపీఠికయందు వ్రాసియున్నారు. ఈవిషయమునే యుద్ఘాటించుచు హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికయందుసయితము వీరు; "........ హరిశ్చంద్రుని సత్యవాచాధురీణతకు భంగముగల్గినవిధమునుగూర్చియు మాచేఁ బ్రకటింపఁబడిన "ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యాన" మనుపద్యకావ్యపీఠికలోఁ జర్చించి వ్రాయఁబడియున్నందునఁ బీఠికావిస్తరభీతిచే నిచట వ్రాయ విరమించితిమి." అని వ్రాసిరి. "వరుణదేవునితోఁ దా నన్నప్రకారము జరుపక పుత్రమోహమున వరుణుని వంచించి సుతు నడవికిఁ జల్లఁగా జాఱవిడుచుటయుఁ, దుదకు వరుణునికోపమునఁ దనకు సంభవించినరోగమును బోఁగొట్టుకొనుటకుఁ గొడుకును విడిచి వేఱొక నిరపరాధియగుదీనుఁడైన బ్రాహ్మణునిజంపి యానరమేధమును బూర్తిచేయుటకుఁ దలపడుటయు హరిశ్చంద్రుఁడు సత్యవాచాధురీణుఁ డన్నప్రసిద్ధికిఁ బ్రతిభటము లయియున్నవి." అని యిట్లు వేఱొకరు వ్రాసియున్నారు.

మార్కండేయపురాణ దేవీభాగవతములందలి కథాకథనములు సైతము హరిశ్చంద్రునినరమేధచరితమునందుఁ గళంకమునే యుపపాదించుచున్నవి. "విశ్వామిత్రుఁడు భవాదివిద్యలను వశపఱుచుకొనుటకయి ఘోరతప మాచరించుచుండ నవి స్త్రీరూపమున నాక్రోశింపఁగా దీనరక్షకుఁ డగు హరిశ్చంద్రుఁడు తద్రక్షణార్థమై విశ్వామిత్రుని తపోభంగమును జేసినట్లును నందుల కాఋషి కోపించి దీనరక్షపలెనే రాజులకు

దానమును గర్తవ్యమని రాజుచేఁ బలికించి తనకు దానముఁ జేయవలెనని కోరినట్లును, రాజందుల కనుమతింప నాతనిసర్వస్వమును గోరి విశ్వామిత్రుఁడు ప్రతిగ్రహించినట్లును, బిదప విశ్వామిత్రుఁడు లోగడఁ దాను జేసియున్న హరిశ్చంద్రకృత (నరమేధరూప) రాజసూయార్త్విజ్యదక్షిణను దెమ్మని పీడించినట్లును, నెన్నికష్టములకైనను నోర్చి సత్యమునువీడక భార్యాపుత్రులను దన్నును నమ్మికొని యారాజు ఋణవిముక్తినిగాంచినట్లును, నట్టియారాజు సత్యమునకును నీతికిని మెచ్చి విశ్వామిత్రుఁడింద్రాదులతో వచ్చి యాతని కుత్తమగతిని, దత్పుత్రునకు సార్వభౌమత్వమును బ్రసాదించినట్లును, నటుపయిఁ దనయాజ్యుని బీడించినందులకుఁ గోపించి సమాధినుండి లేచివచ్చిన వసిష్ఠుఁడు విశ్వామిత్రునితోఁ గలహింపఁగా వారిరువురు నొండొరులను బక్షిరూపు లగునట్లు శపించుకొని చిరకాలము యుద్ధముచేసినట్లును, బిదప బ్రహ్మదేవుఁడు వచ్చి వారి కాయాడి బకరూపశాపవిముక్తిని జేసి నరమేధరూపరాజసూయయాగపు ఫలమును హరిశ్చంద్రుఁ డనుభవించెననియు, విశ్వామిత్రుఁ డారాజున కుత్తమగతి నిచ్చినయుపకారి యై యున్నాఁ డనియుఁ జెప్పి వారియుద్ధమును మాన్పినట్లును *మార్కండేయపురాణమునఁ గథాకల్పనము చేయఁబడెను. (చూ. మార్కం. 7-9 అధ్యాయములు) ఇయ్యది సత్యవ్రతోపస్తుతికయి గ్రంథకర్తచేఁ గల్పిత మని కొందఱును, ఋగ్వేదకథాశేష మిందు వర్ణింపఁబడె నని మఱికొందఱును జెప్పుదురు. ఎట్లయినను దీని సందర్భమును విమర్శించునప్పుడు హరిశ్చంద్రుఁడు నరమేధవిషయమున గొప్పపాపము చేసినట్లును, నద్దానికిఁ బ్రతిఫలముగ విశ్వామిత్రకృతము లగుమహాదుఃఖములను, నతోధికములగుస్వప్నానుభూతద్వాదశవార్షికదుఃఖములను నిహమునందే యనుభవించునట్లును బురాణకర్తచే వర్ణింపఁబడెనని తేలకమానదు.

---

*"రాజసూయవిపాకోఽయం హరిశ్చంద్రస్య భూపతేః, యువయో ర్విగ్రహశ్చాయం పృథివీక్షయకారకః. నచాపి కౌశికశ్రేష్ఠ స్తస్య రాజ్ఞోఽపరాధ్యతి, స్వర్గప్రాప్తికరో బ్రహ్మ న్నుపకారపదే స్థితః," (మార్కం. 9. అ.)

"తత్రాపి శయనీయే స దృష్టవా నద్భుతం మహత్, వ్యతీతో ద్వాదశే వర్షే దుఃఖస్యాంతే నరాధిపః. స్వప్నే దృష్టా మయా యత్తు కింతు మే ద్వాదశీ స్సమాః" (మార్కం. 8 అధ్యా.)

* స్వశరీరరక్షకై యన్యాయ్యముగా దీనుఁ డగుశునశ్శేఫుని బశువుగాఁ జేయరా దని యానరమేధమున హోతగా నున్నవిశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునకు బోధచేసెననియు, నల్లెంతబోధించినను నాతఁడు మన్నింపక స్వోపయోగమునే చూచుకొనఁగా విశ్వామిత్రుఁడు కినిసి శునశ్శేఫున కొకమంత్రమునుపదేశించె ననియు, దానినిజపించి యాతఁడు వరుణునిచే రక్షితుఁ డయ్యెననియు, నటపయి నొకనాఁడు వసిష్ఠుఁ డింద్రసభలోఁ దనయాజ్యుఁ డగు హరిశ్చంద్రుఁడే సత్యవంతుఁ డని యుగ్గడింపఁగా

---

* "రాజన్! ముంచ శునశ్శేఫం రుదంతం భృశదుఃఖితమ్,
ఆత్మదేహస్య రక్షార్థం పరదేహనికృంతనమ్.
నకర్తవ్యం మహారాజ సర్వత శ్శుభ మిచ్ఛతా,
ఆత్మవత్సర్వభూతేషు చింతనీయం నృపోత్తమ.
మోచనా న్మునిపుత్రస్య కరణా ద్వచనస్య మే,
తవ దేహే సుఖం రాజన్! భవిష్య త్యవిచారణాత్.
పితా తే శాపయోగేన చండాలత్వముపాగతః,
మాయాఽసౌ తేన దేహేన స్వర్లోకం ప్రాపితః కిల.
తే నైవ ప్రీతియోగేన కురు మే వచనం నృప,
ముంచైనం బాలకం దీనం రుదంతం భృశ మాతురమ్.
యాచితోఽసి మయా నూనం యజ్ఞేఽస్మిన్ రాజసూయకే,
తపా న్నమోచయా మ్యేన మన్య త్ప్రార్థయ కౌశిక!.
త చ్ఛృత్వా వచనం రాజ్ఞో విశ్వామిత్రోఽతికోపితః,
(దేవీభాగ. స్కం. 7. అ. 16.)

మంత్రం ప్రచేతసః పుత్ర! మయోక్తం మనసా స్మరన్,
జపత స్తవ కల్యాణం భవిష్యతి మ మాజ్ఞయా.
ముంచ రాజన్! శునశ్శేఫం స్తువంతం మాం భృశాతురమ్,
యజ్ఞోఽయం పరిపూర్ణస్తే రోగముక్తో భ వాత్మనా.
వసిష్ఠ ఉవాచ. హరిశ్చంద్రసమో రాజా న భూతో న భవిష్యతి,
సత్యవాదీ తథా దాతా శూరః పరమధార్మికః,
... ... ... ... ...
ఏవం స్తౌషి నృపం మిథ్యావాదినం కపటప్రియమ్,
వంచితో వరుణో యేన ప్రతిశ్రుత్య వరం పునః—
(దేవీభాగ. 7 స్కం. 17. అధ్యా)

విశ్వామిత్రుఁడు నిరసించి గతించిన నరమేధములోని యాహరిశ్చంద్రుని వ్యాపారము నెల్ల నుద్ఘాటించె ననియు, నామూలమున నామును లిద్దఱును గలహించిరనియు, విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచే నసత్య మాడించి యనుచిత కార్యములఁ జేయింతు నని ప్రతిజ్ఞపట్టెననియు, నక్కారమున నాతఁడు హరిశ్చంద్రుని సర్వస్వమును హరించి పలుబాములం బెట్టెననియు, నట్లయినను నాహరిశ్చంద్రుఁడు చలింపక యసత్య మాడక తన్నును దన పత్నీపుత్త్రులను నమ్మి యాతని ఋణముం దీర్చె ననియు, నందులకు విశ్వామిత్రుఁడు మెచ్చి ప్రసన్నుఁ డయ్యె ననియు, నిట్లు దేవీభాగవతమున మార్కండేయపురాణకథ సవరింపఁబడెను.

(దేవీ. 7 స్క. 14—25. అ.)

వసిష్ఠవిశ్వామిత్రులకుఁ దుట్టతుదిని జరిగినకలహమును మొదటికి మార్చుటయు, శ్రుతిసిద్ధ మగునరమేధవృత్తాంతమును వీడక దానినే విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని బీడించుటకు మూలముగాఁ జేయుటయు నిందలిముఖ్యము లగుమార్పులు. తక్కినవి యాయాసందర్భములలో నౌచిత్యమును బట్టి చేయఁబడినయల్పమార్పులు. *

---

*ఇట్టి మార్పులుగలిగి వివిధములుగా నున్న పురాణగాథలను నిష్పక్షపాతబుద్ధితోఁ బరిశీలించునపుడుగాని యందలి యసంభావ్యవర్ణనలను వినినపుడుగాని యవి సత్యవ్రతము మొదలగు విషయములనుబోధించుటకై యథాసందర్భముగాఁ బురాణ సంప్రదాయాను సారమునఁ (దృశ్యకావ్యములందువలెనే) గల్పింపఁబడిన వని స్ఫురింపకపోదు గదా!

తక్కుళ్లపాటి లింగనామాత్యవిరచితమగు నుత్తరహరిశ్చంద్రోపాఖ్యానమునందుఁ బయిరీతిని హరిశ్చంద్రునికష్టముల కాతనిరాజనూయము కారణ మని చెప్పుటకు మాఱుగఁ జంద్రమతీ హరిశ్చంద్రులు పూర్వజన్మమున మహాపాతకములను జేయుటచే నట్టికష్టములు వారికి సంభవించె నని చెప్పఁబడియున్నది.

తే. గీ ... ... ... ... ...

చంద్రమతి తెఱంగును వింటి సతియుఁ బతియు

నిలను నట్లార్తిఁ జెందంగ హేతు వేమొ? (ఉ. హ. 3. 160).

అని యిట్లు శంకించుకొని "హరిశ్చంద్రుండు పూర్వజన్మవలన నీలలోహితుఁ డనురాజుగ నుండె ననియుఁ, జంద్రమతి పూర్వజన్మమునఁ గలకంధర యను శూద్రస్త్రీ యై యుండి కులటయై యానీలలోహితుని మరఁగిన దనియు, నీలలోహితుఁడును నాకు లటయందలియనురాగమున నామెసాంగత్యమునకడ్డువచ్చుచున్న యామెశ్వశురకులమును

పయినుదాహరించినరీతి ననేకు లనేకవిధములుగ హరిశ్చంద్రుని నరమేధరూపరాజసూయయాగవృత్తాంత మాతనికిఁ గళంకసంపాదక మని యభిప్రాయపడియున్నారు. అక్కారణముననే గౌరనాదు లగు నాంధ్రప్రబంధకర్త లక్కథను విడిచిపెట్టి రని తోఁచుచున్నది.

“య త్స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా,
విరుద్ధం త త్పరిత్యాజ్య మన్యథావా ప్రకల్పయేత్”

అను నాలంకారికసూక్తిచొప్పున నాయకుని ఘనతకు లోపమును గూర్చు నక్కథాభాగము విడిచివేయుట యుక్తమేగదా!

---

నశింపఁజేసె ననియుఁ దుదకుఁ గలకంధర కేదారగౌరీవ్రతము చేయుటచే నాదంపతులు చంద్రమతీహరిశ్చంద్రులై పుట్టియుఁ బయినుదాహరించిన పూర్వజన్మపుఁబాతకముల వలన నట్టిదురంతము లగుకష్టముల ననుభవించి రనియు నిట్లు కథ కల్పించి వర్ణించియు న్నాఁడు. ఇట్లే యాంధ్రకవుల పూర్వహరిశ్చంద్రకథలోని యసంభావ్యము లగునితర విషయములకును మఱికొన్ని శంకలు రాఁగా వానికిని బయిరీతినే కొత్తకొత్తహేత్వాభాసములు వర్ణితము లయియున్నవి. అప్రసక్తము లనియు, గ్రంథవిస్తర మగుననియు వాని నెల్ల నిట నుదాహరింప నైతినిగాని వానిలోని కొన్నిప్రశ్నములనుమాత్ర ముదాహరించుచున్నాఁడను.

తే. గీ. చాల భువి రట్టుపడి హరిశ్చంద్రుచేత
లీల భూచక్రమెల్ల నేలించుటకును
నిలఁ దనదుపుణ్య మటు పంచి యిచ్చుటకును
గారణం బేమి గాధికుమారునకును. (ఉ. హ.)

చ. ... ... ... ... ...
... ... ... నిజాధినాథునకె గాని.
మఱి గయి యీశుభాంగి గళమంగళసూత్రము చిత్రవైఖరిం
బరులకు నేరికైనఁ గనుపట్టక యుండుట కేమి హేతువో. (ఆ. 2-13.)

చ. అదియునుగాక తత్సుతుఁ డహా!కృతి నేటికి లోహితాఖ్యనిక
రదములఁ జెన్కఁ బ్రీతమతి నైచ్యకులప్రభవాధిపాకృతిం
గొదగక యాన్నపాలు వెలకుం గొనఁ గారణ మేమి దాసిగా
సుదతిని బ్రాహ్మణుండయి యనూయ శనైశ్చరుఁడేలు టేమొకో.
(ఆ. 2-19)

శంకరకవికృతియందువలె నిందు శనైశ్చరుఁడు కాలకంఠుఁ డయినట్లు వర్ణితమయ్యెను. (చూ. పు. 116)

సంస్కృతభాగవతమును పద్యవ్యాఖ్యానములోని విశేషాంశములను దెనిఁగించుచు బమ్మెరపోతనామాత్యుఁడీసందర్భమున నజాగ్రత్తతో వానినిఁ జూచి యాంధ్రీకరించినందునఁ గానలయు హరిశ్చంద్రుఁడు నరమేథమును జేసి పుత్త్రుని గాంచుటకు ముందే యాతఁడు విశ్వామిత్రుని మూలమునఁ గులహీనసేవనాదికష్టముల నందినట్లుగ వ్రాసియుండెను. అట్టివ్రాఁత సకల గ్రంథవిరుద్ధమయి యుండుటయే గాక విశ్వామిత్రుఁడు నపుత్త్రుఁడగు హరిశ్చంద్రుని గదా పీడించెను. మూలభూత సంస్కృతభాగవతమునకును విరుద్ధమయియే యున్నదనుటకు సందేహము లేదు.

(చూ. ఆంధ్ర భాగ. 9. స్కం 192-201.)

హరిశ్చంద్రుని నరమేథమునందు విశ్వామిత్రుఁడు హోతగానుండి యారాజుయొక్క సత్యసార మగుధృతికి మెచ్చి యాతని కుత్తమగతి గలుగునట్లు ప్రసాదించె ననియుఁ, బిమ్మటఁ గొండొకకాలమునకు హరిశ్చంద్రుని పై స్వతపోభంజనకారణమునఁ గోపము వచ్చునపు డాతని సర్వస్వమును హరించి వెనుకటి రాజసూయమునందలి తన యార్త్విజ్యదక్షిణం దెమ్మని పీడించె ననియు, నందులకై వసిష్ఠవిశ్వామిత్రులకుఁ గలహము సంభవించె ననియు సంస్కృతభాగవతాభిప్రాయమును మార్కండేయ పురాణానుసారముగ గ్రహింపవలసియున్నది.

పోతనార్యుని యీప్రమాదమునకు వ్యాఖ్యాతవ్రాఁతయుఁ గొంతకారణమని చెప్ప నగును.

హరిశ్చంద్రుని కుమారుఁడు రోహితుఁ డని యైతరేయబ్రాహ్మణ దేవీభాగవత భాగవత వాయు శివ సౌర కూర్మ బ్రహ్మపురాణములయందును, హరివంశమునందును వ్రాయఁబడియున్నది. మార్కండేయపురాణమున రోహితాస్యుఁ డని యున్నది. అగ్నివిష్ణుపురాణములయందును, జండకౌశికనాటకమునందును శబ్దరత్నాకరకోశమునందును సర్వశబ్దసంబోధినీకో

---

"త్రైశంకవో హరిశ్చంద్రో విశ్వామిత్రవసిష్ఠయోః,
యన్నిమిత్తమభూ ద్యుద్ధం పక్షిణో ర్బహువార్షికమ్.
తతః పురుషమేథేన హరిశ్చంద్రో మహాయశాః,
ముక్తోదరోఽజయ ద్దేవాన్ వరుణాదీ న్మహాయశా,
సత్యసారాంధృతిందృష్ట్వా సభార్యస్యచ భూపతేః.
విశ్వామిత్రోభృశంప్రీతోదదావవిహతాంగతిమ్." (భాగ. 9. అ. 7.)

శమునందును రోహితాశ్వుఁ డని యున్నది. * లోఁగడ వ్రాసినభారతము లోని ప్రక్షిప్త హరిశ్చంద్రచరిత్రమున లోహితాశ్వుఁ డని యున్నది* వెనుకవ్రాసిననిర్మూల మగు సంస్కృతభాషామయ మయిన బ్రహ్మనారద సంవాదరూపహరిశ్చంద్రోపాఖ్యానమునఁ బయి నుదాహరించినపేరు లన్నియు వెలయుచున్నది.

రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును నన్ని యెడలను రోహిత శబ్దమే వాడఁబడినది. ఒక్కచోటమాత్రము 'రోహి తాశ్వ' శబ్ద ముపయోగింపఁబడెను. "కం. క్షితిభర్తకుమారుఁడు రో,హి తుఁడన"(హ.న. 1. 67.)ఇక్కెల్ల యెల్లయెడలను రోహితుఁ డనియేయున్నది. పయి పద్యమునందు హరిశ్చంద్రకథాపక్షమున రోహితుఁడు అనఁగ అని యర్థము. నలకథాపక్షమున లోఁగ=లోపల, హితుఁడు; అనఁగ అని యర్థము. ఇట రలల కభేదమును గ్రహింపవలసియున్నది.

"యమకాదౌ భవే దైక్యం డలో ర్వబో ర్లలో స్తథా' అని యిట్లు సాహిత్యదర్పణమున వ్రాయఁబడియున్నది. అనేక కవులచే శ్లేష యమకాదులం దిట్టియభేద మంగీకరింపఁబడియున్నది. పేయేల రామ రాజభూషణుఁడే స్థలాంతరములయం దీయభేదము నంగీకరించియు న్నాఁడు. తద్వ్యాఖ్యలం దనంతకవియు రలల కభేద మని వ్రాసియున్నాఁడు. (హ. న. ఆ 2, 85, 3, 31, 60,) ఇక్లే యీక్రింది పద్యమునం దును, 'రోహితాశ్వ' అనియే కవి ప్రయోగించె నని గ్రహింపవలసి యున్నది.

సీ. ... ... ... ... ... ...

ఇది నా కెఱింగింపవే సద్గుణా ప్తకుతూహలవిశ్వకారోహితాశ్వ;

తే. గీ. హృదయమొనఁగూర్తు నీయందు ... ... (హ. న. ఆ. 5. 32.)

ఈపద్యమునందు సయితము హరిశ్చంద్రకథాపక్షమున 'రోహి తాశ్వ' అని ఛేదము, నల కథాపక్షమునందు "విశ్వకాల+ఊహిత+

*ఐతరేయ. 33 అ. 2 ఖం; దేవీభాగ. 7స్కం. 15 అ; భాగవత. 9 స్కం. 7 అ; వాయు. 26అ; శివ, ధర్మసంహిత,61అ; సౌర, 30అ; కూర్మ. 19అ; బ్రహ్మ. 8అధ్యా; హరిశంవము. త్రిశంకుచరిత్రము. 13అ. మార్కం 8అ; అగ్ని. 273అ; విష్ణు 4అంశము; 3 అధ్యా మహాభార అరణ్య; నలోపాఖ్యానపర్వ. 77 అధ్యా. (బొంబాయి నాగరపు ప్రతి 1908 సం.)

అశ్వ హృదయము" అని ఛేదము. కాఁబట్టి యీపద్యమునందును 'రల'ల కభేదము నంగీకరింపక తప్పదు.

"సప్తాశ్వుఁడు హరిదశ్వుఁడు నగుసూర్యుని వంశమున జన్మించిన యీ ఈ రాజకుటుంబమునందలి నామముల తుదనశ్వశబ్దము తఱుచుగా నగపడుచున్నది. సూర్యవంశపు రాజులలో యువనాశ్వ, బృహదశ్వ, కువలయాశ్వ, దృఢాశ్వ, హర్యశ్వ, బర్హణాశ్వ, కృశాశ్వ, యౌవనాశ్వాదు లుండుట సుప్రసిద్ధము (చూ. దేవీ భాగ. 7 స్కం. 9 అ.). అట్లే శ్రుతి ప్రసిద్ధరోహితనామమును నశ్వశబ్దాంత మయి 'రోహితాశ్వ, అని యిట్లు విష్ణ్వగ్ని పురాణానుసారముగ నుండఁదగు నని చెప్పనగును" అని కొందఱ అభిప్రాయ పడుచున్నారు.

రోహితుని రోహితాస్యుఁ డనుట విరుద్ధము కాకుండుటచేతఁ గాని, యుచ్చారణమున శవర్ణ వకారసంయోగము సకారసంయోగమునకు విదూరము కాకుండుటచేతఁగాని మార్కండేయపురాణమునందలి 'రోహితాస్య'శబ్దము వెలసె నని యూహింపఁ దగియున్నది. అట్లే రోహిత లోహితశబ్దములు పర్యాయము లగుటచేతను, రేఫలకారములకుచ్చారణ సాన్నిధ్య ముండుటచేతను, లోహితాశ్వ లోహితాస్య శబ్దములును నవిరుద్ధములై కవులచే వాడఁబడిన వనియు, రామరాజభూషణుఁడును గౌరన ననుసరించి లోహితశబ్దము నే వాడుకచేసియుండుటచే నట 'రల'ల కభేదము నంగీకరించి సవరించుకొనవలసిన ప్రయాస మనావశ్యక మనియు, నొక్కచోటమాత్రము (5.32) శ్లేషోపయోగమున కయి విష్ణ్వగ్ని పురాణానుసారముగా నశ్వశబ్దము జేర్చి యుపయోగించె ననియు గ్రహింప నగును. రామరాజభూషణుని గ్రంథమునందు 'రల'లకభేదము నంగీకరించి సవరించుటకు వలనుపడినట్లు గౌరనాదుల గ్రంథములలోని లకారము ప్రాసస్థలగత మగుటచే నందు సవరింప వలనుపడదు. యమకశ్లేషాద్యలంకారవిషయమున నాలంకారికసిద్ధాంతముచొప్పున 'రల'ల కభేదము నంగీకరించిన నంగీకరింప నగును గాని యాంధ్రలాక్షణికు లెవ్వరిచేతను నంగీకరింపఁబడని రలల ప్రాసము నంగీకరించుటకు వలనుపడదు గదా !

"హాలోహితాస్య ! వంశైకవిస్తార !
లాలితసౌభాగ్యలక్షణాకార!"

(గౌరన. హరి. ద్విపద. ఉ. 1987)

"చేరి యాలోహిత చెలఁగి యేప్రొద్దు" (హ. ద్వి. ఉ. 1707)
"ఉన్న యాలోహితాస్యుని జూచి ప్రాణ." (హ. ద్వి. ఉ. 1977)

పయి ప్రయోగములచే గౌరనమంత్రి 'లోహిత లోహితాస్య' శబ్దములనే యుపయోగించె ననక తీరదు. *హరిశ్చంద్రుని భార్య 'శైబ్య' అనియే పురాణములం దెల్లెడలను నగపడుచున్నది. తుదకు క్షేమేంద్రుఁడు రచించినచండకౌశికనాటకమునందును నట్లే యున్నది. అట్లయినను నయ్యది తద్ధితాంతనామముగాని సంజ్ఞానామము కాదు. కావున నామెకు "చంద్రమతి" అనుసంజ్ఞానామ ముండిన నుండవచ్చును. పురాణములం దెచ్చటను నగపడకుండుటచే నయ్యది కల్పిత మయినను గావచ్చును. చంద్రశీతల మగుమతి కల దని గాని, నామైకదేశన్యాయమునఁ జంద్రశబ్దవాచ్యుఁ డగుహరిశ్చంద్రునియందు మాత్రమే మతి గలదని గాని యామెపేరికి సార్థక్య మూహింపనగు. గౌరనాదులు చంద్రమతి నామమును వాడుక చేసిరి.

"తిలకించి చంద్రమతీదేవితోడలు" (గౌ. హ. ద్వి. పు. 779)
"మానినీమణి చంద్రమతీ సంభ్రమమున." (గౌ. హ. ద్వి. పు. 830)

అను ప్రయోగములనుబట్టి గౌరనమంత్రి చంద్రుఁడు(హరిశ్చంద్రుఁడు)కలది యను నర్థము నంగీకరించి యస్త్యర్థకమతుబంతముగా గ్రహించిన ట్లగపడుచున్నది. మతిశబ్దము క్తిన్నంత మగుటచే దానికి జీప్ ప్రత్యయము రాదు గాన నయ్యది మతుబంత మనుకొనక తీరదు; కాని యద్దానిని మతుబంతముగా నంగీకరించునపుడు డచ్చట మకారస్థానమున వకారము రాకతీరదు గావున "చంద్రవతీ" అని యుండవలయును. మకారముతో సంస్కృతమహాకవుల ప్రయోగములం దగపడనందున దీని నాకృతిగణ మగుయవాదిగణములోఁ జేర్చుటయు సరికాదు. కావుననే మహాభారత విషయానుక్రమణి యనుగ్రంథమందు (తుకారామ్‌జవాజి నిర్ణయసాగర ముద్రాయంత్రాలయము. బొంబాయి) హరిశ్చంద్ర పదమునొద్ద 'చంద్రవతీ' యనివ్రాయఁబడెను. చంద్రమతీ శబ్దములోని మకారమును యతిస్థానమునఁ బ్రయోగించుటచే గౌరనగ్రంథములోని మకారము ముద్ర

* "తస్య భార్యా శతం పూర్ణం బభూవ తిమనోహరమ్,
పట్టరాజ్ఞీ శుభా శైబ్యా." (దేవీభాగ. 7 స్కం. 14 అ)
"స్వపత్న్యా శైబ్యయా సార్థం బాలకే నాత్మజేనచ" (మార్కం. 7, అ.)

ణాదిప్రమాదకృత మనుటకు వలపడదు. కావున హ్రస్వాంత మగుచంద్రమతిశబ్దమే వెనుక నుదాహరించినరీతిని సమంజస మయియుండుటచే రామరాజభూషణుఁ డట్లె ప్రయోగించె నని గ్రహింపవలసియున్నది. శేషప్రతిబంధముచే నచ్చటి మకారమును మార్పరాదుగదా! రామరాజభూషణుని గ్రంథమునం దెచ్చటను నది జ్యంత మనక తీరదను నిశ్చయమును గలిగించు ప్రయోగములు లేకుండుటచే (హ. న. 1-18, 24; 2-54, 104.) నందు దోషశంకయంకురింప నేరదు" అని యిట్లు కొంద ఱభిప్రాయపడుచున్నారు.

సంజ్ఞానామవిషయమున వ్యుత్పత్తిని బరిగణింపవలసిననిర్బంధము లేకుండుటచేతను, నొకప్పుడు పరిగణించినను నాకృతిగణ మగుయవాది గణములోఁ జేర్చి యా "చంద్రమతి" శబ్దమును సాధించుట కవకాశ ముండుటచేతను, సంస్కృతమహాకవిప్రయోగమే కావలయు ననుట యుక్తముకాకుండుటచేతను, 'ప్రమిత' మగు సర్వశబ్దసంబోధినియం దిది జ్యంతముగను మకారవిశిష్టముగనే వ్రాయఁబడియుండుటచేతను, గౌరనకవిప్రయోగ మసాధు వనుటకు వలను పడదు. రామరాజభూషణుని గ్రంథమునం దెచ్చటను నది జ్యంత మగునో కాదో నిర్ణయించు ప్రయోగము లేదు. కాఁబట్టి స్థలాంతరములందువలెనే యిచ్చటను రామరాజభూషణుఁడు గౌరనమంత్రి ననుసరించె ననుటయే యుక్త మగు నని చెప్పనగును.

ప్రక్షిప్త మని కొంద ఱభిప్రాయపడుచున్న మహాభారతస్థసంక్షిప్త హరిశ్చంద్రకథయందు హరిశ్చంద్రునిభార్య యుశీనరదేశపురాజు పుత్త్రి యని యున్నది. శిబి యనువాఁ డుశీనరాపత్య మని భారతమున వేఱొక చోటఁ జెప్పఁబడియుండుటచేఁ బురాణప్రసిద్ధ మగు 'శైబ్య' అను దానికి మాఱుగ "ఔశీనరి" అనుట విరుద్ధము గానేరదు.*.

దేవీభాగవతప్రభృతులలోని హరిశ్చంద్రుని నరమేధవృత్తాంతమును వర్ణింపనందున వసిష్ఠవిశ్వామిత్త్రుల కలహమునకుఁ దన్మూలకత్వము నుపపాదించుట కాంధ్రప్రబంధకర్తలకు వలనుపడ దయ్యె. అక్కారణమున

* "ఉశీనరస్య రాజర్షే ర్దుహితా పుణ్యలక్షణా."
(భార. అర. అ. 77. బొంబాయిప్రతి.)
"రాజాన మౌశీనరిం శిబిం దదర్శ" (భార. అర. అ. 197. ,, )

నింద్రసభలో హరిశ్చంద్రుని వసిష్ఠుఁడు పొగడఁగా నూరకయే మత్సరించి విశ్వామిత్రుఁ డారాజుసత్యవ్రతభ్రష్టతను జూపెదనని ప్రతినచేసినట్లు వర్ణించిరి.

హరిశ్చంద్రకథాపత్త్రమునందలి యట్టి యింద్రసభలోని ప్రసంగమును వర్ణించినభాగము జతపడుటకయి నలకథాపత్త్రమున భీముఁడు సభ చేసి దమయంతికిఁ దగినవరుఁ డెవఁ డని మునుల నడిగినట్లును, వారు నలు డర్హుఁడని పేర్కొనఁగా మన్మథుఁడు మత్సరించి నలదమయంతులను బీడించి నట్లును భారతమున లేనిభాగ మిందుఁ గల్పింపఁబడెను. *

హరిశ్చంద్రుని సత్యవ్రతభ్రష్టుని జేయఁ బ్రతిజ్ఞ చేసినవిశ్వామిత్రుఁ డొకమాయాసూకరమును సృజించి హరిశ్చంద్రుని దేశమును జెఱుపనంపి తన్మూలమున మృగయాపరుఁ డగుహరిశ్చంద్రునిఁ దనయాశ్రమోపాంతమునకు రప్పించె నని దేవీభాగవతమున నున్నది.( దేవీ. 7 స్కం. అ. 18.) ఆసందర్భమును వర్ణించుటలో గౌరన ననుసరించి రామరాజభూషణుఁడును జమత్కారాతిశయమునకుఁ గావలయు విశ్వామిత్రసృష్టక్రూరమృగములబాధ నడఁచుటకు హరిశ్చంద్రుఁడు వేటకేఁగి యట వసిష్ఠుని దర్శించినట్లును, నాతఁడు శాంతిరహితుఁడగు విశ్వామిత్రునాశ్రమమునకుఁ బోరాదని యుపదేశించినట్లును, నటపయి విశ్వామిత్రసృష్టమాయాకురంగముచే రాజు విశ్వామిత్రాశ్రమమునకు లాగికొనిపోఁబడినట్లును వర్ణించెను. హరిశ్చంద్రుఁ డొంటరిగా వేటకేఁగినట్లును, నప్పుడుఁ జంద్రమత్యాదుల యుపదేశము లక్ష్యములేకయే విశ్వామిత్రునకు సర్వస్వమును నాతఁడు దానముచేసినట్లును, దేవీభాగవతమునందును మార్కండేయపురాణమునందును వర్ణింపఁబడియున్నను (మార్కం. 7. అధ్యా) గౌరన ననుసరించి కవి యిందుఁ జంద్రమత్యాదులతో హరిశ్చంద్రుఁడు వేటకేఁగినట్లును దొలుత సర్వస్వదానమునకు వెనుదీసియుఁ జంద్రమతియుప

---

* "ఉపాసనామేత్య పితుః స్మ రజ్యతే, దినే దినే సావసరేషు వందినామ్,
పఠత్సు తేషు ప్రతి భూపతీ నలం, వినిద్రరోమాజని శృణ్వతీ నలమ్"
"తమేవ లబ్ధ్వావసరం తతః స్మరః, శరీరశోభాజయజాతమత్సరః,
అమోఘశక్త్యానిజ యేవ మూర్తయా, తయావినిర్జేతు మియేష నైషధమ్."
(నైష. 1. 34, 43)

అను శ్రీహర్షునినైషధవర్ణనము పయికల్పనమునకు బీజ మయినను గావచ్చును.

దేశముపైని విశ్వామిత్రునకు సర్వస్వమును దానము చేసినట్లును హరిశ్చంద్రు నాకాశవాణి స్తుతించినట్లును వర్ణించెను.

(1) హరిశ్చంద్రుఁ డొంటరిగా వేటకేఁగి దారి తెలియక తిరుగుచుండఁగా విశ్వామిత్రుఁ డొకవిప్రరూపమున వచ్చి దారిచూపినందున నాతనికి యజ్ఞము నిమిత్తము ధన మిచ్చెదనని రాజు వాగ్దానము చేసినట్లును బిదపఁ గన్యాదానము మిషపెట్టి వరదక్షిణక్రింద రాజు సర్వస్వమును విశ్వామిత్రుఁ డపహరించి యాదానమునకు దక్షిణను నాతనివాగ్దానము చొప్పున యజ్ఞధనమును నిమ్మని పీడించినట్లును (దేవీభాగ. 18, 19, అ.) దేవీభాగవతమున వర్ణింపఁబడినను జమత్కారముగను స్వాభావికముగను నుండు నని కావలయు గౌరవ మనుసరించి రామరాజభూషణుఁడును మాతంగకన్యలవృత్తాంతమును వర్ణించెను. ఇట మాతంగ కన్యలఁ బరిగ్రహింపక తిరస్కరించిన యారాజునకుఁ బురాణకథలోని మాతంగసంపర్కము విశ్వామిత్రుఁడు గల్గించె ననుట మిక్కిలి యుక్తి యుక్తముగా నున్నయది.

(2) మాయలేడి విశ్వామిత్రుని దరి కేఁగెనను హరిశ్చంద్రకథా నిర్వహణమునకై నలకథాపక్షమున హంస పొన్న చె ట్టెక్కి పోయినట్లును భారతనైషధములలో లేనిది కల్పింపఁబడెను. దమయంతికి దొరకకుండ నామెతో హంస ప్రసంగించుట యసంభావ్య మని తలఁచి, రామరాజ భూషణుఁ డిట్లు నైషధరచనను సవరించె నని తోఁచుచున్నది.

(3) నలుఁ డింద్రదత్తతిరస్కరిణీవిద్యచే నెవ్వరికిని నగపడకుండ భీము నంతఃపురమునఁ బ్రవేశించె ననుటకు మాఱుగ శ్లేషోపయోగమునకై యిందు నింద్రుని శాంబరిచే నట్లు ప్రవేశించెనని వర్ణితమయ్యెను.

భీము నంతఃపురమున నట్టితిరస్కరిణీప్రభావమున నితరుల కగపడని నలుని పరాంగనాలింగనాదికమును, దమయంతీసమాలింగ నాదికమును మున్నగు నైషధకావ్యవర్ణితవిషయము లంగీభూతశృంగారరసపోషకములె యైనను దూతయగునలు నివిషయమున ననుచితము లగుటచేఁ గావలయు నిం దుపేక్షింపఁబడెను. నలుని బంపినవెనుక మరల దూతికల నంపుట నలునియం దపనమ్మికను సూచించుచున్న దగుటచేఁ గావలయు నైషధకావ్యవర్ణిత దేవదూతీప్రేషణాదిసందర్భ మిం దుపేక్షింపఁబడెను. నలునిపారిశుద్ధ్యమును గ్రహించుటకై దూతీప్రేషణ మావశ్యక మంద

మన్నసర్వాంతర్యాము లగుసురులకు నలుని నిష్కాపట్యము విశదము కాకుండుననుట సరికాదుగదా! అందును దూత్యమున కేఁగి నలుఁడు దమయంతియొద్దనుండుసమయముననే దేవదూతలు లచ్చటకి వచ్చుట కేవల మనుచిత మనుట సాహసము కాదు.

ఇంద్రాదులు వరము లిచ్చుపట్టున సంస్కృతభారతములో నొక్కొక్కదేవత రెండేసివరముల చొప్పున నలుగురును నెనిమిదివరముల నిచ్చిన ట్లున్నది. * వానిలో నగ్నిజలసాక్షాత్కారాదు లిహము నందును నుత్తమగతిప్రభృతులు పరమునందును నుపయోగించునవై యున్నవి. అం దైహికములలోఁ గొన్ని భావాంకరూపముతోనున్న నలుని దమయంతి పరీక్షించుటలో నుపయోగింపఁబడినవి. సంస్కృత నైషధమునందును నట్లే యెనిమిదివరములె వర్ణింపఁబడినను నం దౌచిత్యానుసారము లగునలంతిమార్పులు గలవు. నలుని యుత్తరకథ వర్ణింపఁబడినందున నైషధములోని యైహికవరములలోఁ గొన్ని నిష్ఫలములు కాఁగా వానికిఁ జమత్కారముగా నందు ఫలాంతరములు కల్పింపఁబడెను (14. స. నైష.) రామరాజభూషణుఁ డైహికవరములనుమాత్రమె వర్ణించి వానిలో నగ్ని జలసాక్షాత్కారరూపవరములకు నలు నుత్తరకథ యందు సంస్కృతభారతమునందువలెనే వినియోగము చూపియున్నాఁడు. (3. ఆ. 3; 5. ఆ. 48.హ.న.)పాకశుద్ధిరూపవరముచే నగ్నిసాక్షాత్కారమును సంగ్రహించెను. వంటవాఁడగు నలునిఁ బరీక్షించు సందర్భమునఁ బువ్వుల నాతఁడు నలుపుట యసంభావ్యముగాన నైహికమే యైనను వినియోగము లేకుండుటచేఁ గావలె వరుణదత్త

* "ప్రహృష్టమనస స్సర్వే నలా యాష్టౌ వరా న్దదుః,
ప్రత్యక్షదర్శనం యజ్ఞే గతిం చానుత్తమాం శుభామ్.
నైషధాయ దదౌ శక్రః ప్రీయమాణ శ్శచీపతిః,
అగ్నిరాత్మభవం ప్రాదా ద్యత్ర వాంఛతి నైషధః.
లోకా నాత్మప్రభాంశ్చైవ దదౌ తస్మై హుతాశనః,
యమ స్త్వన్నరసంప్రాదా ద్ధర్మే చ పరమాం స్థితిమ్.
అపాంపతి రపాం భావం యత్ర వాంఛతి నైషధః,
స్రజశ్చోత్తమగంధాఢ్యాః సర్వే చ మిథునం దదుః." (భార. ఆర. అ. 54)

"మిథునం=కుమారం, కుమారీంచ" (57. అధ్యా. 20 శ్లోకపు వ్యాఖ్య.) దీనిని గల్పినఁ దొమ్మిదివరము లగును.

మగు నష్టానకుసుమితారూపవరమిం దుపేక్షింపఁబడెను * ధర్మబుద్ధి రూప యమదత్తవర వినియోగము నలు నుత్తరకథయందును, నందును నలకేళీసీసంవాదసందర్భమందును స్పష్టముగా నగపడుచునే యున్నం దున నిఁక గానవడియున్న యింద్రసాక్షాత్కారరూపవరమునకు విని యోగము చూపుటకయి సంస్కృతభారతమున లేకున్నను నిందుఁ గథాంతగమున నలుఁడు యజ్ఞము చేసినట్లును నం దింద్రుఁడు ప్రత్యక్షమైనట్లును వర్ణింపఁబడెను. (హ. న. 5_61, 62.)

ఆంధ్రభారతమున నీసందర్భమునఁ బాఠభేదము లున్నట్లును, గొన్నిటియందు సంస్కృతభారతభాగమున కవిరుద్ధముగనే యున్నట్లు 1915-వ సంవత్సరమున ముద్రితమగు శ్రీ వావిళ్లవారి ప్రతిలోనున్నది. కావునఁ గొన్ని ప్రతులయందున్న "ధనదుఁడు స్వయంవరసభకు వచ్చుట" మున్నగు సంస్కృతభారతవిరుద్ధవిషయములను దెలుపు పాఠభేదములు ప్రక్షిప్తము లని యెన్నఁదగును.

**ఆ. వె. నలునకాని నళినదళనేత్ర వరియింప, దట్టె చూత మనుచు నమరవరులు**
**నలుగురును గడంగి నలరూపమున వచ్చి, రాస్వయంవరమున కతిరయమున.**
**(భార. అర. ఆ 2_53)**

అని యిట్లుగ నన్ని ప్రతులయందును నలుగురు దేవతలు మాత్రమె వచ్చిన ట్లగపడుచున్నందున నయిదుగురు వచ్చి రని తెలుపునట్టియు సంస్కృత భారతవిరుద్ధము లయినట్టియుఁ బాఠభేదములు ప్రక్షిప్తము లనుటకు సందియ ముండదుగదా!

(5) దమయంతి తనప్రజను (సంతానమును) బుట్టినింటి కంపెనను నలకథాపక్షమునందలి యర్థమును నిర్వహించుటకయి రామరాజ భూషణుఁ డిందు హరిశ్చంద్రకథాపక్షమునఁ జంద్రమతి తమవెంట వచ్చు(పుర)ప్రజలను మరలించె నని గౌరవగ్రంథములో లేనిరీతిని వర్ణించి యున్నాఁడు. (హ.న. ఆ. 3_18)

---

***ఆ. వె. అతనికరతలద్వయానమర్దితములై, కందియును మహాసుగంధిసుమ**
**తతులు తొంటియట్ల తమకంపు విడువక, యుండు నతని తేజ మున్నతంబు.**
**(భార. అర. 2-197)**

**కేశిని వచ్చినప్పుడు నలుఁడు పువ్వుల నట్లు నలిపివేయుటకుఁ గారణమేమో తెలియకున్నది.**

హరిశ్చంద్రుని సర్వస్వమును స్వీకరించి విశ్వామిత్రుఁడు దక్షిణ తెమ్మన్నప్పు డప్పటికి ధనము లేదనియు నొకనెలలోపల నిచ్చెదననియు రాజు చెప్పినట్లుగ దేవీభాగవతమున నున్నది. (దేవీ. 7. స్కం. అ. 19-20)

అట్లయినను గౌరన ననుసరించి యిందు రామరాజభూషణుఁడు విశ్వామిత్ర క్రౌర్య ప్రకటనమునకును స్వభావవర్ణనమునకును గావలయు హరిశ్చంద్రుఁ డీసందర్భమున విశ్వామిత్రుని బరుషోక్తులాడినట్లు వర్ణించెను. దేవీభాగవతమునందును మార్కండేయపురాణమునందును దక్షిణాధనము నిమ్మని విశ్వామిత్రుఁడే పలుమాఱువచ్చి పీడించుచుండె నని వర్ణింపఁబడి యున్నది. అట్లయినను గౌరన ననుసరించి రామరాజ భూషణుఁడును జమత్కారాతిశయమునకుఁ గావలయు విశ్వామిత్రుఁడు నక్షత్రకుని హవాలాచేసినట్లే వర్ణించెను.

హరిశ్చంద్రునకు మాయాముని యగపడి భంగింప యత్నించుటయు, బేతాళదవాగ్నిప్రభృతుల వృత్తాంతమును, దేవీభాగవతాదులలో లేకున్నను నట్టివానిని గౌరన ననుసరించి కథావస్తుపోషణమునకుఁ గావలయు రామరాజభూషణుఁడును వర్ణించియున్నాఁడు.

(6) హరిశ్చంద్రకథాపక్షమున గౌరన చెప్పిన బేతాళవృత్తాంతము సుఘటితమగుటకు నలకథాపక్షమున నలుఁడు తాళవనమునఁ దిరుగులాడె నను భారతమున లేనివిషయ మిందుఁ గల్పింపఁ బడెను.

(7) దమయంతి సుబాహుపురి కేఁగుమార్గస్థులతో నేఁగె నను నలకథాభాగము నిర్వహించుటకయి హరిశ్చంద్రకథాపక్షమునఁ జంద్రమతి మున్నగువారు కాశికిఁ బోవుమార్గస్థులతో నేఁగి రనువిషయము రామరాజభూషణునిచే నిందుఁ గల్పింపఁబడినది.

(8) హరిశ్చంద్రకథాపక్షముననున్న నక్షత్రకపీడయుఁ, జంద్రమతి తన్నమ్ము మని రాజుతోఁ జెప్పుటయు మున్నగువిషయములు నిర్వహించుటకై భారతమున లేకున్నను దమయంతికి దీనుఁ డగుభర్త స్మరణమునకు వచ్చుట మున్నగువిషయములు (హ. న. 4-37.) నలకథాపక్షమున రామరాజభూషణునిచేఁ గల్పితము లయ్యెను.

మార్కండేయపురాణమునఁ జెప్పఁబడినరీతి నెవఁడో యొక విప్రుఁడు వచ్చి యంతధనము నిచ్చి చంద్రమతిని గొనుటగాని, పిదప నామె నంతక్రూరముగాఁ బీడించుటగాని సంభవించియుండ నేరదని కావలయు నావిప్రుఁడు కౌశికుఁడే యని దేవీభాగవతమున సవరింపఁ బడెను. * దాస్యదూషణము లేకుండుటకై ధర్మదేవత వీరబాహుఁ డయ్యె ననునట్లే పార్వతీపరమేశ్వరులే యాకాలకౌశిక కలహకంఠులై రనుట యుచిత మని కావలయును. జండకౌశికనాటకమునందు వారు పార్వతీపరమేశ్వరులని కల్పింపఁబడెను. అట్లయినను క్రౌర్యాతిశయసిద్ధికై గౌరన ననుసరించి కవి యిందును నాకాలకౌశికుఁడు కలిపురుషుఁడేయని చెప్పెను. శంకరకవిమాత్ర మొకచోఁ గలిపురుషుఁ డనియు, నొకచో శని యనియుఁ జెప్పుట వింతగనున్నది. (శంకర. హరి. 5-183, 4-99).

పురాణములలో లేకున్నను జమత్కారాతిశయమునకును, స్వభావవర్ణనమునకును గావలయుఁ గాలకౌశికుఁడు హరిశ్చంద్రునకు దురుపదేశములను జేయుట, వ్యవసాయముఁ జేసికొమ్మనుట నక్షత్రకుఁడు పుస్తకపుత్రాటితో రాజును బంధించి యమ్మఁ జూపుట మున్నగునవి గౌరన ననుసరించి కవిచే నిందును వర్ణింపఁబడినవి.

చండాలరూపమున నున్నయమునికిఁ బ్రవీరుఁ డనియు వీరబాహుఁ డనియుఁ, దద్దాస్యకాలమున హరిశ్చంద్రునకు వీరదాసుఁ డనియుఁ బేరులు పురాణప్రసిద్ధములు యుక్తిసిద్ధములు నై యున్నవి. †

---

* "అథ వృద్ధో ద్విజః కశ్చి దాగత్యాహ నరాధిపమ్,
సమర్పయస్వ మే దాసీ మహం క్రేతా ధనప్రదః." (మార్కం. అ. 8.)
"శ్లో. ... ... కౌశికో విశ్వరూపధృత్,
వృద్ధరూపం సమాస్థాయ హరిశ్చంద్రమభాషత,
సమర్పయస్వ మే దాసీ మహం క్రేతా ధనప్రదః." (దేవీభాగ. 7.స్కం. 22అ)

† "అథాజగామ త్వరితో ధర్మ శ్చండాలరూపధృత్,
చండాలోఽహ మిహ ఖ్యాతః ప్రవీ రేతి పురోత్తమే." (మార్కం. అ 8)
(ప్రవీరదాసుఁడు వీరదాసుఁ డనుఁ బడునుగదా!)
"ఇమం చ జర్జరం దండం గృహీత్వా యాహి మా చిరమ్,
వీరబాహో రయం దండ ఇతి ఘోషస్వ సర్వతః."(దేవీభాగ. 7స్కం 24. అ.)

ద్వాదశవర్ష పరిమిత మగుమిక్కిలి దుష్టమైనస్వప్నము ననుభవించి హరిశ్చంద్రుఁడు పరితపించుచు శ్మశానవాటియం దుండఁగా నచ్చటికి సర్పదష్టుఁ డగుపుత్త్రు నెత్తుకొని చంద్రమతి వచ్చి రోదనముచేయుటలో నామె దీనాలాపములం దాత్మకథలను విని హరిశ్చంద్రుఁ డామెనుబోల్చి కొని దుఃఖించి చితి పేర్చి దారపుత్త్రులతోఁగూడ నాచితిలోఁబడి దుఃఖ పారమునందుటకు సంసిద్ధుఁడై యుండ నింద్రాదులును విశ్వామిత్త్రుఁ డును వచ్చి కాపాడి యాతని మన్నించి రని మార్కండేయపురాణమున వర్ణిత మయ్యెను. (మార్కం. 8. అ.)

విశ్వామిత్త్రప్రేరణమునఁ గాలకౌశికునిచే రోహితుం డడవికిఁ బంపఁబడినట్లును, నామునియాజ్ఞచేతనే యొకకృష్ణసర్ప మాబాలునిఁ గఱచినట్లును, బుత్త్రునివృత్తాంతము విన్నవెంటనే చంద్రమతి నడవికిం బోనీక కాలకౌశికుఁడు గృహకృత్యములు తీర్చి వెడలుమని యామెకాజ్ఞ యిచ్చినట్లును, నట్లామె వెళ్లఁగా నాయర్ధరాత్రమున నామెను బౌరులు బాలఘాతిని యగునొకరాక్షసినిగా నెంచి వధ్యవధకుఁ డగువీరబాహుఁని కప్పగించి నట్లును, వాఁడు వీరదాసున కప్పగింపఁగా నతఁడు స్వామ్యా దేశముచొప్పునఁ జంప సిద్ధుఁడై నట్లును, నప్పుడు చంద్రమతి తనమృత పుత్త్రుని దెచ్చి దాహసంస్కారము చేయువఱకు గడు విమ్మని ప్రార్థించి యాతనిసమ్మతిపై నేఁగి యామృతపుత్త్రునిఁ దెచ్చి రోదనము చేసినట్లును దేవీభాగవతమున మార్కండేయపురాణకథ సవరించి వర్ణింపఁబడెను. (దేవీ 7-స్కం. 25-26 అ.) (రాజసూయవిపాకరూపదుస్స్వప్నవృత్తాంత మిందులేదు.) అందు విశ్వామిత్త్రుఁడు ప్రార్థించినసర్పము తక్షకుఁ డని సవరించి గౌరన ననుసరించి కవి యిందును వర్ణించెను. అట్లె హరిశ్చంద్ర చంద్రమతు లొండొరులను బోల్చుకొనుటలో మంగళసూత్రదర్శన వృత్తాంతమును జంద్రమతి వధ్యవధకునొద్దకుఁ బంపఁబడుటకుఁ దస్కార వృత్తాంతమును గౌరన ననుసరించి యిందును రామరాజభూషణునిచే నౌచిత్యానుసారముగను గథావస్తుపోషకముగను వర్ణింపఁబడెను.

క. "భూవినుత నిన్నుఁ ద్రిభువన, పావను నఱుచి వని యొట్లు పలుకఁగ నగు న
ద్దేవి పవిత్ర పతివ్రత, గావున నఱుచులకుఁ గానఁగా దనవద్యా !"

(భార: ఆది. 1-97)

అనుభారతములోని యుదంకునిభార్య పౌష్యునకుఁ గానరాని

వృత్తాంతమె యిట్లుగ నాంధ్ర ప్రబంధకర్తలచే సవరింపఁబడి గ్రహింపఁబడెనా యని యాలోచింప వలసియున్నది.

మార్కండేయపురాణము నందును దేవీభాగవతమునందును హరిశ్చంద్రుఁడు చంద్రమతిని బోల్పలేకుండె ననియే వర్ణింపఁబడెను. (మార్క. 8 అ; దేవీభాగ. 7 స్కం. అ. 26) అట్లయినను నాయకుని ధీరోదాత్తతను జూపుటకుఁ గావలయు గౌరనమంత్రి ననుసరించి రామరాజభూషణుఁడును హరిశ్చంద్రుఁడు పోల్చియు నాకారగోపనము చేసికొని ప్రసంగించినట్లు వర్ణించెను. మృతబాలకుని జూచునపుడు రాజునకు లోహితుఁడు స్మరణకు వచ్చెనని మాత్రము పయిపురాణములం దున్నవి.

చంద్రమతి రోదనమువలన వారు తన దారపుత్త్రు లని హరిశ్చంద్రునకుఁ దెలిసినపిదప నాతఁడు దుఃఖము నోర్వఁజాలక స్వామికార్యభంగమును దనసత్యవ్రతభంగమును బరిగణింపక భార్యాపుత్త్రులతోఁ గలిసి చచ్చుటకు సన్నద్ధుఁ డయ్యె నని పయిపురాణములం దున్నది.

అట్లయినను నాయకుని ఘనతకు లోపమును గూర్చునట్టి యనుచితవిషయమును విడిచి గౌరనవలెనే రామరాజభూషణుఁడును, హరిశ్చంద్రుఁడు తనభార్య యని తెలిసినపిమ్మటనైనను మహాధైర్యముతోఁ జంద్రమతిని వధింప నుద్యుక్తుఁ డయ్యె నని వర్ణించెను. అట్లే హరిశ్చంద్రుఁడు శ్మశానములోని పిండములను దిని క్షున్నివారణము చేసికొనినట్లు పురాణములం దున్నను * నట్టివర్ణమున నాయకునిఘనత చెడు ననికావలయుఁ గవియు నిందు గౌరనవలెనె యౌచిత్యపోషకముగా నక్కాలమున హరిశ్చంద్రున కాఁకలిదప్పులు లేకుండు నట్లు దేవతలు ప్రసాదించి రని వర్ణించెను. (హ. న. 5-4)

౯. నలకథా నిర్వహణానురోధమున హరిశ్చంద్రకథాపక్షమునఁ జంద్రమతిని దగాచేసిన దొంగపేరు పుష్కరుఁ డని యిందు రామరాజభూషణుఁడు కల్పించియున్నాఁడు. ఎందును వీనిపేరు పేర్కొనఁబడనందున నిది విరుద్ధము కానేరదు.

* " నానాశవౌదనకృతక్షున్నివృత్తి పరాయణః "
(మార్కం. 7. అ; దేవీభాగ. 7. స్కం. 24.)

రోహితునకుఁ బట్టాభిషేకము జరిగినట్లును, హరిశ్చంద్రుఁడు భార్యతో స్వర్గమున కేఁగినట్లును, హరిశ్చంద్రునిదయవలన నయోధ్యా పురజనులకెల్ల నొకదినము స్వర్గసౌఖ్యము లభించినట్లును బురాణములం దున్నది. అట్లయినను నయ్యది నాయకలక్షణవిరుద్ధ మయి నాయకుని భూలోకవియోగమును జెప్పున దగుటచేతను, రసమునకును భంగము కలిగించున దగుటచేతను గావలయు గౌరన ననుసరించి రామరాజ భూషణుఁడును దానిని మార్చి హరిశ్చంద్రుఁడే రాజ్యము నంది సుఖించె నని వర్ణించెను. పురాణములలో హరిశ్చంద్రు నింద్రుఁడు కాపాడిన ట్లున్నను గాశీక్షేత్రమున నట్లు కాపాడినదైవతము పరమేశ్వరుఁడే యనుట యుచిత మని కావలయు నీశ్వరుఁడు ప్రత్యక్ష మయినట్లుగ గౌరనవలెనే రామరాజభూషణుఁడును వర్ణించియున్నాఁడు.

రామరాజభూషణుఁ డిందుఁ గొన్నియెడల నొకపక్షమునందుఁ గావ్యములలో వర్ణింపవలసిన యష్టాదశవర్ణనములలోనివానిని వర్ణించుచు నన్యకథాపక్షమునఁ గథాభాగమును నడపుచు వచ్చెను. హరిశ్చంద్రకథాపక్షమునందలి బేతాళవధ (3 ఆ. 44, ప.) గాలివాన (3-46) దవాగ్ని (3-50) మున్నగు వానివర్ణనములును, నలకథాపక్షమున నలుఁడు దమయంతి నడవిలో విడిచి పోవుట (3-49), శుచి మున్నగు వారిని మదగజములు పీడించుట (4-23), బాహుకుఁడు ఋతుపర్ణుని రథమును దోలుట (5-28),ఋతుపర్ణు నుత్తరీయ మెగిరిపోవుట (5-29), తాండ్రచెట్టు (5-30) మున్నగువాని వర్ణనములును బయి నుదాహరించినరీతిని నడపినవే యైయున్నవి.

10. గౌరనమంత్రి హరిశ్చంద్రద్విపదలో వర్ణించినవానిలో హరిశ్చంద్రుఁడు కాశికిఁ బోవుమార్గమున మాయావసిష్ఠుఁ డగపడినవృత్తాంతమును, సర్పవృశ్చిక శరభాదిపీడలును, గాలకౌశికుఁడు చంద్రమతి నింటికిఁ దీసికొనిపోయిన సందర్భమునఁ బురములోని బాలకులు కాలకౌశికుని బీడించినవృత్తాంతమును, గాలకౌశకశిష్యుఁ డగుకర్కోటకుఁడు కాలకౌశికునకును నాతనిభార్య యగుకలహాకంఠికిని గలహము పెట్టిన వృత్తాంతమును మున్నగునవి కథావస్తువున కంతగా సంబంధింపని వగుటచేతను, నంత యావశ్యకములుగ నగపడకుండుటచేతను గావలయు రామరాజభూషణుఁడు విడిచియున్నాఁడు.

వెనుక నుదాహరించిన రీతిని గొన్ని యలంతిస్థలములుతక్కఁ దక్కిన గౌరనవర్ణించినకథపట్టుల నెల్లను విడువక మహాసమర్థతతో రామరాజ భూషణుఁ డీద్వ్యర్థికావ్యమునఁ గథాంతరముతో జోడించియున్నాఁడు. అట్లురామరాజభూషణుఁడు జోడించినజోడింపులు స్వభావసిద్ధములును రసౌచిత్యపోషకములును నై యున్న వనుటకుఁ గొంద ఱీగ్రంథమే గౌర నకును మూల మని తలంచుచుండుటయే నిదర్శనము. (చూ.పు. 44.)ఇంక రామరాజభూషణుఁడు కథాద్వయమునందును జేసినమార్పులు పదింటి లోను గొన్ని రసౌచిత్యపోషకములును, మూలరచనములకుసయితము వన్నె నీయఁదగినవియును నై యున్నవి. కావున నట్టివి రామరాజ భూషణునకుఁ గొఱంతను గల్పింపఁజాలవు. రసౌచిత్యపోషణమున కై మూలమున లేకున్నను నవిరుద్ధము లై నసహజము లగుకల్పనములను గల్పించుటయును, జంద్రసూర్యోదయాదివర్ణనములను జేర్చుటయును, రసౌచిత్యభంజకము లగుననుచితకథాభాగములను విడుచుటయును సామాన్యముగాఁ బ్రబంధములకు సహజమె. ఇంకను ద్వ్యర్థికావ్యము లయం దర్థద్వయానుసంధానానుకూల్యమున కై మఱికొన్ని యవిరుద్ధము లగునలంతిమార్పులను జేయుటయు విరుద్ధము కానేరదు. పింగళిసూర నార్యుని రాఘవపాండవీయమున నిట్టిమార్పులు పెక్కుగలవు.

దశరథునకు సరయూతీరమున శాపము సంభవించినట్లు రామా యణమున నుండఁగా, రాఘవపాండవీయమునఁ దమసానదీతీరమునం దని మార్పఁబడెను. (రా.పా. 1-17-18.) రామాయణమున లేకున్నను భారత కథాపక్షమునఁ గుంతీపాండుసంవాదము సుఘటితె మగుటకయి వసిష్ఠదశ రథసంవాదము కల్పితమయ్యెను (రా.పా. 139-50). అయ్యది దశర థుఁడు స్వయముగనే యశ్వమేధమును జేయ నెంచినట్లును, నాకాలమున సుమంత్రుఁడు తాను మును విన్నసనత్కుమారోక్తభావివృత్తాంతము నుగ్గడించి తదనుసారముగాబుుశ్యశృంగుని దోడ్తెమ్మని చెప్పినట్లును నున్న రామాయణకథాభాగమునకు విలక్షణముగ నున్నది. భారతకథాపక్ష మునఁ గలనారదాగమనము సుఘటిత మగుట కై రామ పరశురామ సంవాదఘట్టమున రామాయణమున లేనినారదాగమనముకల్పింపఁబడెను. (రాఘ. 2.65,66) ద్రౌపదీసమాగమవిషయమున నారదుఁడు పాండవులకు జేసిననియమపుసందర్భము మొదలుగ నర్జునుఁడుఖాండవదహనము

ఖాండవదహనము చేయించినసందర్భమువఱకుఁ గలభారతకథను నడపు టకై రామపరశురామసంవాదము రామాయణమునకు విలక్షణముగను మిక్కిలి పిచ్చిగను రామాయణకథాపక్షమునఁ బెంచి వ్రాయఁబడెను. (రాఘ.270-95)అందును రాముఁడు తనకుఁ దగినధనువు లేదనియనఁగాఁ బరశురాముఁడు నారాయణధనుస్సు నిచ్చె ననునది బొత్తిగా నసంగతమై యున్నది. (రాఘ. 2, 93-94)పయిరీతి ననేకస్థలములందు నూతనకల్పనములు చేయఁబడెను. ఇఁక విడిచిపెట్టినభాగములును మార్చినభాగములును మఱింత మేరమీఱి యున్నవి. సామాన్యవిషయము లటుండఁగా రామాయణార్థమునందలి సేతుబంధనవర్ణనము రామాభిషేకకథనము సైతము విడువఁబడినవి. అట్లే భారతార్థమునఁ గర్ణశాపాదులు, శల్యసారథ్యాదులు, సంజయురాయబారము మున్నగునవి ముఖ్యవిషయములనేకములు విడువఁబడినవి. రామాయణార్థములోని హరి యగుసంగదుని రాయబారము నాధారముగాఁ జేసికొని హరి యగుశ్రీకృష్ణుని రాయబారముమాత్రమె వర్ణితమయ్యెను. మహాసముద్రములవంటి రామాయణభారతకథలలోఁ బయిరీతిని జోడింపరానివానిఁ విడుచుచు వీలుపడిన కథాభాగమునుమాత్రము జోడించుచుఁ గథాభాగములను గవి నడిపించియున్నాఁడు.

భారతార్థము సుఘటితమగుటకై సీతారాములరహస్యవృత్తాంతమైనట్టియు హనుమంతునకు సీత యొక యానవాలుగ లంకలోఁ జెప్పినట్టియుఁ గాకాసురవృత్తాంతము హనుమంతుఁడు రామసుగ్రీవులకు మైత్రిఁ గూర్చుసందర్భమున సుగ్రీవునితో వర్ణించిచెప్పినట్లుగ మార్చి వర్ణింపఁబడెను (రాఘ. 3, 105-106). మహాభారతమునందు ధర్మరాజ పరాజయానంతరము దుశ్శాసనవధ వర్ణింపఁబడియుండఁగా, నిం దర్థాంతరానుకూల్యమునకై తద్విపరీతముగ వర్ణితమయ్యెను. (రాఘ. 4-183).

ద్రోణసేనాధిపత్యము మొదలు కర్ణుఁడు యుద్ధ మారంభించియున్నట్లు భారతమునందుఁ జెప్పఁబడియుండఁగా, నిందు రామాయణార్థములోని కుంభకర్ణయుద్ధారంభవర్ణనము సుఘటితమగుట కయి సైంధవవధానంతరమునఁ గర్ణుఁడు యుద్ధమున కారంభించినట్లు వర్ణింపఁబడెను. (రాఘ.4.164)ధర్మరాజు తమ్ములబలమును బ్రాపుగాఁ జేసికొని శల్యు నెదరించె ననుభారతార్థము సుఘటితమగుటకయి శ్రీరాముఁడు సుగ్రీ

వుని భ్రాంపుగాఁ జేసికొని రావణు నెదరించె నని రామాయణార్థమున వర్ణింపఁబడెను. (రాఘ. 4. 192.)

గ్రంథవిస్తరభీతిచే విరమించితినిగాని యిట్టిమార్పులు పెక్కులు రాఘవపాండవీయమున నగపడుచున్నవి. దుష్కరమగుద్వ్యర్థికావ్యకల్పనమున నిట్టివి దోషములుగ నెన్నుట యుక్తము కాదు; కాన వెనుక నుదాహరించినహరిశ్చంద్రనలోపాఖ్యానము లోని యలంతిమార్పులును రామరాజభూషణున కేమాత్రము లోపమును గూర్పఁజాల వని యెన్నఁదగును.

మఱియొకవిశేషము గలదు. రాఘవపాండవీయకర్త తనగ్రంథమునకు మూలగ్రంథములు రామాయణభారతము లని చెప్పియు వాని లోనికథలందు మార్పు లనేకములను జేసియుండెను.

"శా. లోకత్రాణరతిం దదాదిమమహీలోకప్రవేశోత్కభా
పాకృత్ప్రథమద్వితీయపదగుంజన్మంజుమంజీరగ
ర్జాకల్పామలరామభారతకథాసర్గంబుల న్మించువా
ల్మీకివ్యాసులఁ గొల్చెదం దదుభయశ్లేషార్థసంసిద్ధికిన్." (రాఘ. 1-3)

రామరాజభూషణుఁ డన్నచో మూలగ్రంథములలో లేనట్టియు శ్లేషోపయోగమునకయి కల్పించిన వనఁదగినట్టియు విషయములు లోక ప్రసిద్ధము లని ప్రౌఢముగా సూచించియున్నాఁడు—

ఉ. వారిచరిత్రముల్ ......... నేర్పు దలిర్ప నిట్లనున్. (హ. న. 1-5)

---

## నాల్గవప్రకరణము.

ఆంధ్రపండితులు బాగుగ నెఱిఁగియుండుభాషాంతరము సంస్కృతముమాత్రమే యని సామాన్యముగాఁ జెప్పవచ్చును. అయ్యది వ్యవహారభ్రష్ట మగుటచేతను, దుదికి నిలిచినభాషను శోధించి పండితు లనేకులు దానిని నియమించియుండుటచేతను, నట్లు నియమించువ్యాకరణము లనేకము లతిభూయిష్ఠము లయియుండుటచేతను, నాభాషయందు వ్యాకరణముల కసాధారణ మయినయధికారము గలదు. సామాన్యముగా వ్యాకరణమునకు లొంగనిపద మెల్ల దుష్టమే యని యందఱి సిద్ధాంతము. ఇట్టిసిద్ధాంతముచేఁ గ్రమముగా వ్యాకరణమే భాషకు మూల మనువెఱ్ఱియభిప్రాయముకూడఁ గొందఱకుఁ గలిగియున్నది.

అట్టిసంస్కృతములు మాత్రము బాగుగ నెఱిఁగియుండుటచే మనవారు తెనుఁగుభాషసైతము సంస్కృతమువలెనే వ్యాకరణములకు లొంగవలెననియు వ్యాకరణమునకు లొంగనిభాష గ్రాహ్యముకాదనియు నభిప్రాయపడుచున్నారు; కాని యాంధ్రభాష సంస్కృతభాషవలె వ్యవహారభ్రష్టమయి యేదోయొకయవస్థలో నిలఁబడియుండుదశకు రాలేదు. సంస్కృతమువలెఁ గాక యాంధ్రము వ్యవహారస్థ మగుటచేఁ దత్తత్కాలములలోనికవులు తత్తత్కాలములలోని వ్యావహారికపుఁబదములను వాడుకలను గ్రంథములయం దుపయోగించుచు వచ్చుచున్నారు. (చూ. మదీయవసు. విమ. 7 ప్ర) అట్టికవుల ప్రయోగముల నాధారముగాఁ జేసికొని తత్తదుత్తరకాలికు లగుపండితులు లక్షణ గ్రంథములను జేయుచు వచ్చిరి; కాని భాష స్థిరపడక పెరుఁగుచున్నదగుటచేతను, నట్టి లక్షణగ్రంథము లత్యల్పవిషయకములగుటచేతను, నట్టివానిలోఁగూడఁ గొన్నియల్పసంఖ్యాక గ్రంథములె వెల్లడియయియుండుటచేతను నాంధ్రభాష సంస్కృతమువలె నియమింపఁబడఁ జాలనిదై యున్నది.

పయిరీతిని లక్షణము కొఱఁతపడి యుండుటచేతను, లక్ష్యగ్రంథములుసయితము కొన్నిమాత్రమే బయల్పడియుండుటచేతను, బయల్పడినవి సయితము ముద్రణాదులులేనికాలమున నపండితు లగులేఖకులు వ్రాసియుండుటచేతఁ బ్రమాదభూయిష్ఠములై యుండుటచేతను, నిటీవలివారు భాషను బాగుగఁబరిశోధింపఁజాలక యేదో యొకచిన్నలక్షణగ్రంథము నాధారముగాఁ జేసికొనియు, లేదా ఏదో కొన్నిప్రయోగములను జూచి వాని నాధారముగాఁ జేసికొనియు వానికి విరుద్ధములైయుండు ప్రయోగము లన్నియు దుష్టములే యనుకొనుచు వానిని దమతమ జ్ఞానమునుబట్టి యథేష్టముగా దిద్దివేయుచున్నారు. అట్లే కొన్నియెడల నర్థము చేసికొనలేక దిద్దుటయుఁ గలదు.

మఱియు ముద్రణములు లేనికాలమున గ్రంథములను వ్రాయువా రుచ్చారణస్థధ్వన్యనుకూలముగవ్రాయుచుండుట సంప్రదాయమై యున్నట్లగపడుచున్నది. ఆకారణముననే "ఉండ్డి చేసేనూ, చాతను, వయ్యాకరణులు, శేనాపతి, దౌవ్వారిక, గరియ్యు, పాత్రుఁడు, కరుణతోఁడా" అను మొదలగు రీతులతోఁ బండితులును వ్రాసియుండుటచేతను, నర్ధానుస్వార శకటరేఫసరళాదేశాదులను బాటింపక వ్రాసియుండుటచేతను,

మనవా రంగీకరింపనియగ్రాహ్యపదములను మఱికొన్నిటిని వ్యావహారికభాషావాసనాబలమున వ్రాసియుండుటచేతను, లిఖితగ్రంథములను యథాస్థితముగఁ బ్రమాణీకరించుటకు మనవా రంగీకరింపకున్నారు. అక్కారణమున వెనుక నుదాహరించిన సవరణము చేయునాచారమావశ్యకతలోనికి వచ్చి యంతకంతకును బలపడినది.

పయి నుదాహరించిన కారణములచేత నాంధ్రభాషను నియమించుటయే దుర్ఘట మయియున్న దని చెప్పవచ్చును. సంస్కృతమువలె నదియు వ్యాకరణములకు లొంగియుండవలె నందమా! ప్రాచీనవ్యాకరణము లత్యల్పవిషయకములగుటచేతను భాష వ్యవహారస్థమై పెరుగుచుండుటచేతను నవి భాషలోని యేకదేశమును సయితము నియమింపఁజాలకున్నవి. మహాకవులకావ్యములలోని ప్రయోగములను బట్టి నియమించుకొనవలె నందమా! అవి తప్పులతో నిండియున్నందున వానియందు లేఖకాదులప్రమాదమునఁ బడినతప్పు లేవో, లేఖకాదిప్రమాదజనితములని భ్రమించి పయినుదాహరించినరీతి నత్యల్పములై యసంపూర్ణములై యున్నచిన్నవ్యాకరణముల నాధారముగాఁ జేసికొని యిటీవలిలాక్షణికులును బండితులును దిద్దివేసిన భాగము లేవో, నిజమయినకవిప్రయోగము లేవో తెలిసికొనుట దుర్ఘట మయియున్నది. ఈసందర్భమునఁ బయియంశములను ఋజువుచేయుట కయి దిఙ్మాత్రముగా నట్టి వ్రాఁతలను వానిసవరణములను జూపుచున్నాను.

సామాన్యము గావచనగ్రంథములందును వ్యాఖ్యానము లందును వ్యావహారికపదములు వేలవేలుగఁ దాళపత్రగ్రంథములలో నగపడుచున్నవి.ఆవిషయమున నితరగ్రంథముల నుదాహరించుట కన్నఁ బ్రస్తుతమగుహరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యానమునఁ గలపదముల నుదాహరించుటయే యుక్త మని తోఁచి యవ్వానినే యుదాహరించుచున్నాను.

హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్యానము చేసినచిత్రకవి యనంతకవి కవులచరిత్రములో వ్రాసినచొప్పున రామరాజభూషణునకుఁ బయి నేఁబదిసంవత్సరములలోపలివాఁడే కావుటంజేసియు నాతఁడును బండితుఁడే యయియుండుటంజేసియు నాతని ప్రయోగములును రామరాజభూషణుని ప్రయోగములవలె మనకుఁ బ్రమాణములె యనక తప్పదు. ఇఁక నట్టివ్యాఖ్యానము కవులచరిత్రములోఁ జేర్కొనఁబడిన

కాకరప_ర్తికృష్ణకవి స్వయముగా వ్రాసినప్రతి నాకు లభించియున్నది. దానినుండి తీసి యుదాహరించెదను.అందును నెక్కడిదో తీసి చూపినచో నెంచిచూపి నట్లుండునేమో యని తలంచి మొట్టమొదటిపద్యము నంతటిని, రెండుమూడు పద్యములటీకలలోని కొన్నిభాగములను జూపెదను.

"శ్రీవైదేహసుతన్ = సీతనున్ను భృగూద్వహజయశ్రీ=భార్గవ జయలక్ష్మినిన్ని, అబ్జభృచ్చాప = శివవిష్ణుచాపాలయొక్క, లీలావాప్తి చాతను, అబ్జ శ్శంఖశశాంకౌచ, అమరః.పరియించుటకు సరిగాఁ జేసి పరి యించి యనుట.సత్=లెస్సైన, కుశలవత్త్వ=కుశలవులుగలుగుటచాతను, కుశలము గలుచుటచేతనున్ను, అమూల్యమైన మాంగళ్యదీక్షకు, ఆవా లంబగు, ఆపరిగ్రహయుగంబు = అపత్నీద్వయంబు, పత్నీ పరిజనాదాన మూలశాపాః పరిగ్రహాః, అమరః. అన్యోన్యహార్దంబునన్=అన్యోన్యస్నే హముచాతను, సేవింపన్, సత్కుశలవత్త్వము సరిగా వున్నవె గన్కు వారుయిద్దరు అన్యోన్యస్నేహము చాతను సేవింపఁగా ననుట. తగు వొప్పుచుంన రామచంద్రుడు, శుభశ్రీ లిచ్చు మా కెప్పుడునూ. "సీ. నిఖిల=నిఖిలలోకానందనియ్యమైన, స్థిరా=భూమియందలి,ఉద్భూతి= పుట్టువుచాతను, ఇట్లనిచప్పంగానే, స్థిరమైనఉద్భూతిచాతనే, తోస్తున్నది. పోలుచు= వొప్పుచున్నది.

"ఉ. అంచిత...చరింపగా, చెరించేటట్టుగాదు, యిందుకు ధ్వని తార్థము, ఆరణ్యానకు బోయేరాముని పాదుకలు. తీసుకున్నాడుగనుక, అకంటక = కంపలులేని, కోమలతాయుతమైన సరణియందు, రాముని నడపించెను. భరతుండు ఉచితజ్ఞుఁ డన్ని, నిరంతరధ్యానము చేశే, భ్రమరకీటన్యాయాన సారూప్యము వహించె నన్ని తోఁచుచున్నది.

గ్రంథాంతమున లేఖకుం డగుకృష్ణకవి యిట్లువ్రాసియున్నాఁడు.

"క. సౌఖ్యముగ వ్రాసితొసె భూ, రిఖ్యాతపదార్థయుత హరిశ్చంద్రనలో
పాఖ్యానము కాంకరప, ర్త్యాఖ్యకులోద్భవుఁడు కృష్ణయాంహ్వయుఁడు వడిన్.
క. ఘనదుర్మతి వత్సరమం, దున పంతులసాంబశివునితోను హరిశ్చం
ద్రనలోపాఖ్యానము మే, లన కాంకరప_ర్తికృష్ణనామాఖ్యుఁడు వ్రాసెను."

పండితకవి యగుకృష్ణకవి పయిరీతిని వ్రాయుటనుబట్టి యాలోచింపఁగాఁ బూర్వకాలమున నట్లు వ్రాయుచుండుటయే నిజమయిన సంప్రదాయ మని విశదమగుచున్నది. కృష్ణకవి వ్యాకరణజ్ఞానము లేనివాఁడనిగాని మాతృకకు సరిగా వ్రాయలేనివాఁ డనిగాని, తాను వ్రాయుచున్నది వ్యావహారికభాష యని తెలిసికొనలేనివాఁ డనిగాని చెప్పఁజాలము గదా!

ఒకప్పుడు బియే పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నెన్నఁబడి ముద్రింపఁబడుటలో శ్రీపూండ్లరామకృష్ణయ్య పంతులవారిచే నది యిప్పటివ్యాకరణములవొప్పున సవరింపఁబడెను గాని యందును వ్యావహారికపువాసనాబలమున వారియభిప్రాయము పూర్తిగా నెఱవేఱదయ్యె. ఆవిషయము చూపుటకై వెనుక నధోరేఖాంకితములుగ వ్రాసిన వానికి వీరుచేసిన సవరణముల నిటఁ జూపుచున్నాను.

| వ్రాఁతప్రతి. | పూ. రా॥ గారి ముద్రణము. | వ్రాఁతప్రతి. | పూ. రా. గారి ముద్రణము. |
|---|---|---|---|
| సీతనున్ను | సీతను | ఎప్పుడున్నూ | ఎప్పుడును |
| లక్ష్మినిన్ని | లక్ష్మిని | ఆనందనియ్య | ఆనందనీయ |
| చాపాలయొక్క | ధనస్సులయొక్క | ఇట్లని చెప్పంగానె | ఇట్లు చెప్పఁగా |
| లీలావాప్తిచాతను | విలాసప్రాప్తిచేత | తోస్తున్నది | తోఁచుచున్నయది |
| అమరః | అమరము | చెరించేటట్టుగాను | సంచరించునట్టుగాను |
| సరిగాజేసి | సరిగాఁజేసి | యిందుకు | ఇందు |
| గలుగుటచేతనున్ను | గలుగుటచేతను | అరణ్యానకుబోయే | అరణ్యమునకుఁబోయి |
| స్నేహాంచాతను | స్నేహముచేత | తీసుకున్నాఁడుగనక | తీసుకొనెఁగావున |
| సరిగావున్నది | సరిగానున్నది | చేశే | చేసి |
| గన్క | గనుక | న్యాయాన | న్యాయముగా |
| వారుయిద్దరుఅన్యోన్య | వారిద్దఱన్యోన్య | వహించెననిన్ని | వహించెననియు |
| వొప్పుచున్న | ఒప్పుచున్న | తోంచుచున్నది. | స్ఫురింపుచున్నది. |
| రామచంద్రుడు | రామచంద్రుఁడు | | |

అని యీరీతిగా సవరించియున్నారు. వీరు మంచిజాగ్రత్తను దీసికొనకపోవుటచేతనో మఱియే కారణముచేతనో వీరు సవరించిన టీకయందును బాలవ్యాకరణవిరుద్ధప్రయోగము లనేకము లగపడుచున్నవి. అట్టివానిని బయిసవరణపట్టికలో నధోరేఖాంకితములనుగాఁ జూపియున్నాను. "తిరస్కరించలేని (2 పుట.) తోఁచేఅర్థము (3 పుట.)

రాముని గుణమున్ను (4 పుట.) అర్థవైభవమున్ను, కాంతిసమాధు లనే కావ్యగుణములయొక్క ఆయతిన్ని, శబ్దశక్తు లనేమాటి యొక్కధురంధరత్వమున్ను లేకనే, కన్నులెఱ్ఱఁ జేసినట్టయిన = కోపమువచ్చిన మనుట, ద్రవ్యవైభవమున్ను, ఆయతిన్ని. (6 పుట) అను మొదలగునవి యందు లెక్కకు మిక్కిలిగ నున్నవి. విస్తరభీతి నుదాహరింపలేదు.

ఇఁక నిటీవలిలాక్షణికులను బండితులను మఱికొన్ని గ్రంథములం దసాధ్యమ్యముగా దిద్దినస్థలములను గొన్నిటిని జూపెదను.

"గేయవిశారదఁ జేసె కూఁతురిఁ" అను వసుచరిత్రములోని 'కూతురిఁ' అనునది బాలవ్యాకరణముచే గ్రామ్యమగును (బా. అచ్చి. 2 సూ.)గాన నచ్చో 'కూఁతునుఁ' అని సవరించిరి. పరిశీలించి నచో "కూఁతురిఁ" అనునది యసాధువు కానేరదు.

"గీ పరగ కూఁతురు" శబ్దంబుపై రకార, మొక్కపలుకునపైనను నుండుఁబాయు
పెక్కుపలుకుల నైనను దక్కిపోవు, గూతురు బడశె గూతుగా గోర ననగ."

"క. కూతులచే గూతురిచే." (కావ్యా. చూడా. 8ఆ. 79 తాళపత్రము.)

"సీ. పంటతామరకంటిదంట గూఁతురిమోవి." (అహో బల. 518 పేజీ.)

కావ్యాలంకారచూడామణి మొదలగు ప్రాచీన వ్యాకరణములు 'రక్షించుట, రక్షింపుట, అని యిట్లెల్లయెడలను 'ప' కారరూప ముండుట కంగీకరించుచున్నవి:

"క కోపింపుట కోపించుట, కాపింపుట పనుల నొప్పఁ గాపించుట నా
నేపారునిట్టిపలుకులు, లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁ దగుఁ."
(కావ్యా. చూడా. ఆ. 8. తాళ. 83)

ఆంధ్రశబ్దచింతామణి యహోబలపండితీయము మున్నగునవి రక్షింపుచున్నాఁడు.' అనుమొలగు స్థలములందును, అనఁగా బాలవ్యాకరణములోఁ జెప్పిన ముత్తుపరము కానపుడు సయితము పత్వమె నిత్యముగా రావలయు నని కూడ నంగీకరించుచున్నవి.

"అనుబంధప్రార్థనయో ర్ణా వ్యాం రేకాదికే న చోః పస్స్యాత్" (చింతామణి. క్రియాపరిచ్ఛేదము) నుతింపుచున్నాఁడు, పోషింపుచున్నాఁడు.
(అహోబల. 468 పుట.)

క. కావించుట కావింపుట, భావింపుట నటియు దీని భావించు టనం
గా వెలయుఁ గృతులఁ దుహీన, గ్రావసుతాప్రాణనాథ ప్రమథసనాథా!
(కావింపుట సులభమే. కావించుటకు,) (సర్వలక్షణసార. ఆ. 2. 205 ప.)

అని యిట్లు కూచిమంచితిమ్మకవి పయి నుదాహరించిన కావ్యాలంకారచూడామణిలోని రీతినే చెప్పి తాను జూచినపుస్తకముల యందుఁ దఱుచుగ "పకార" విశిష్టరూపములే యగపడుచుంటను బట్టి పత్వరూపము సులభ మనియు 'నికార' విశిష్టరూపమున నుదాహరించెద ననియు వ్రాసియున్నాఁడు. తాళపత్రగ్రంథములందును ప్రాచీన ముద్రణములందును నీపత్వరూపము తఱుచుగ నగపడుచునే యున్నది.

"సీ. ... ... పెంపుదీపింపఁ జాలింపుచుండ" (శంక. హరి. 1-21.)

"ఉ. చంపక...సొంపగు...భా, షింపుచు."(ఏనుఁగులక్ష్మణకవి, రామవిలాసము.4.)

"సీ. కనకంపుననసొంపుకడనుంపురుచిపెంపు, పసిఁడితీఁగెలగుంపు మెసఁగలేదొ?"

(వసు. 3-69.)

"సీ. కనకంపురుచి పెంపుకడనుంపు బలితంపు." (హ. న. 2-40.)

"ఓనర్పుదురు" (హ. న. 2-51.)

"సీ. పితరులఋణము తీర్పెడునూనుఁ జెందని." (రా. పాం. 1-42.)

అని యిట్లు మహాకవుల గ్రంథములయందు కదల్పరాని ప్రాసాదినిబద్ధస్థలములందును 'పకార' విశిష్టరూపము లిప్పటికిని నగపడుచునే యున్నవి. కావుననే ప్రౌఢవ్యాకరణకర్తకు మరల 'ప' త్వవిధానము చేసికొనవలసివచ్చెను. (ప్రౌఢక్రియా. 17 సూ.) అట్లయినను బాల వ్యాకరణమున నాగమచకారమునకు ముత్తు పరమగునపుడు పత్వము నిత్య మనియుఁ దదితరస్థలములయందు రానేరదనియుఁ, దుక్కు పరమగునపుడు మాత్రము నెఱసున్న మీఁది యాగమచకారమునకు 'ప'త్వము విభాషను రావచ్చుననియుఁ జెప్పఁబడియున్నందున (బాల. క్రియా. 68 సూ.) నిప్పటిపండితులచేఁ బరిష్కృతములై ముద్రింపఁబడిన గ్రంథములందుఁ బయిబాలవ్యాకరణనియమములకు లోఁబడనిస్థలములందలి 'ప' కారవిశిష్టరూపములెల్ల 'చ'కారవిశిష్టములుగ సవరింపఁబడినవి. ప్రాచీన వ్యాకరణసమ్మతములైనను నిపుడు ప్రసిద్ధిలో నున్నబాలవ్యాకరణమునకు లోఁబడనందున నట్టి'ప'కారవిశిష్టములెల్ల నిపుడు మచ్చునకైన నగపడకున్నవి.విస్తరభీతిని విరమించితినిగాని పైరీతిసవరణములు పెక్కుగలవు.

ఆంధ్రభాష వ్యవహారస్థమగుటచే నాయాకాలములందు సద్వ్యవహారములోనికి వచ్చి పూర్వస్థితినుండి మాఱినపదములను గవులు

ప్రయోగించుచుండుటయు, నట్టివానినిఁ జూచి యాయా కాలములలాక్షణికులు వానికి లక్షణముల నొనరించుచుండుటయు, నట్టియపూర్వలక్షణములనుబట్టి యిటీవలివారు పూర్వగ్రంథస్థప్రయోగములను లేఖకాదుల ప్రమాదము లని మిషగల్పించుకొని దిద్దివేయుచుండుటయు జరుగుచు వచ్చెను. మఱియు నాయాకాలపులాక్షణికులు స్వస్వపూర్వకాలస్థలక్ష్య లక్షణములను బరిశీలించుట కవకాశము లేక తమకు లభించిన గ్రంథములకును దమకాలమున నున్నయాస్యవ్యవహారమునకును ననుకూలముగా లక్షణములను వ్రాయుచుండుటయు, నట్టిలక్షణముల నాధారముగాఁ గొని యుత్తరోత్తర కవు లట్లు ప్రయోగించుచుండుటయు, నుత్తరోత్తర లాక్షణికులు వానినిబట్టి లక్షణముల నొనరించుచుండుటయు సంభవించుచు వచ్చెను. కొందఱు లాక్షణికులు గ్రామ్యములని చెప్పినపదములు వారికంటెఁ బ్రాచీను లగుకవులగ్రంథములలో నగపడుచుండుటయుఁ గలదు. ఆంధ్రభాషాభూషణాదులలో గ్రామ్యములని చెప్పఁబడిన 'ఆడ', 'ఏడ' మొదలగు పెక్కు పదములు తిక్కనాదులు ప్రయోగించి యుండుటచే నవి సాధువులే యని కూచిమంచితిమ్మనాదు లుదాహరించియున్నారు. లక్షణగ్రంథములకు మూలభూతము లగులక్ష్యగ్రంథము లెల్ల తప్పులతడకలై యున్నవని యంగీకరింపక తీరకుండుటచేతను, బయిరీతి నసమగ్రము లయిన లక్షణగ్రంథములు సయితము ప్రమాదభూయిష్ఠము లయియుండుటచేతను సామాన్యముగాఁ బ్రాచీనాంధ్రభాషను నియమించుటకుఁ దగినయాధారములు చాల వని చెప్పక తప్పదు.

ఒక్కొక్కగ్రంథమున కనేకములగు పలుదేశములలోని మాతృకలను సంగ్రహించుకొని యట్టివాని నెల్ల జాగ్రత్తతోఁ బరిశోధించి సందిగ్ధస్థలములయం దనేకమాతృకలయందు సంవాదముగా నుండునది గ్రాహ్య మని యెన్నఁదగు నని కొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. అట్టియభిప్రాయ మక్షరపుఁబడివాట్లను సవరించుకొని యర్థముకానిపద్యములనర్థముచేసికొనుటయందు బాగుగ నుపచరించునుగాని లేఖకాదులు దిద్దినవానిని నిర్ణయించుటయం దంతగా నుపచరింప దని తోఁచుచున్నది. మఱియు నట్లనేకములగు ప్రతులను బ్రతిగ్రంథమునకు జతపెట్టుకొనుటయు సామాన్యముగా దుర్ఘటమని చెప్పవచ్చును. ఇంతియగాక లేఖకాదులు పయిరీతిని యథేష్టముగా సవరించుచు వచ్చినందున సామా

న్యముగా ననేకస్థలములం దట్టిసంవాదమును సంభవింపనేరదు. ఒకప్పుడు కొన్నియెడల సంభవించిన సంభవింపవచ్చును గాని, పెక్కుస్ఖాలిత్యముల తోడను దిద్దుబాటులతోడను నిండియుండునట్టిమాతృకలను సందేహ నిర్ణాయకములనుగా గ్రహించుట సరికాదని చెప్పుట సాహసముకాదు. యథాస్థితిగా గ్రహింపఁదగిన నిర్దుష్టమగుమాతృక యొకటియైనఁ గల దని యెవ్వరును జెప్పఁజాలరుగదా! ఈవిషయమును వెనుక నేనుదా హరించి చూపియేయున్నాను. ఇంతియకాక యాయాకాలములందుఁ బ్రసిద్ధములయి వాడుకలోనికి వచ్చియుండు వ్యాకరణములయైక్యమును బట్టియు, నాయాకాలములవ్యావహారికాంధ్రముయొక్క యైక్యమును బట్టియు, సవరణములలో నట్టిసంవాదములు లభించినను లభింపవచ్చును. అంతమాత్రమున నట్టి సంవాదము కవిప్రయుక్తతను దృఢముగా స్థాపింపఁజాలదుగదా! మఱియు మనకు దొరకు మాతృకలెల్ల సుమారు రెండుమూఁడువందల సంవత్సరములలోపలివేగదా! తఱచుగా వాని లోనిసవరణము లాంధ్రశబ్దచింతామణ్యప్పకవీయాదుల ననుసరించియే యుండును. 'రక్షింపుచున్నాఁడు' మున్నగుచోటులందలి పత్వరూపము చింతామణ్యాదులకు సమ్మతమైయుండుటచే సామాన్యముగా వ్రాఁత ప్రతులందెల్లఁ బత్వరూపమే వెలయుచుండుటలేదా? ఇటీవల వాడుక లోనికి వచ్చిన బాలవ్యాకరణమున కట్టిప్రయోగము సమ్మతము కాకుం డుటచే నట్టిప్రయోగము లిపు డంతటను నంతరించియుండలేదా? ఇట్టి కారణములచేఁ గల్గు సంవాదములు ప్రమాణము లని గ్రహించుట సరియా? అప్పకవికాలమునకే లాక్షణికులు తమతమమతములకు విలక్షణ ములుగా నుండువాని నంగీకరింపక సవరించుచు వచ్చిరని యాతఁడు చెప్పిన "నన్నయముఖ్యసత్కవి......" అను పద్యము (చూ. పు.88.) వలన స్పష్టపడుచున్నదిగదా!

అందఱక్-అందఱిక్, పఱచు-పఱచు, తఱచు-తఱుచు, నడచు -నడుచు, త్రాగు-తాగు, ప్రోగు-పోగు, క్రాగు-కాగు, పగుల్చి-పగిల్చి, కనుపెట్టు-కనిపెట్టు, ఉదుకుట-ఉతుగుట, బ్రదుకుట - బ్రతుగుట, పురు టిల్లు-పురిటిల్లు, లోఁబడు-లోపడు,చక్కఁబాటు-చక్కపాటు, అనుమొద లగు ద్వైరూప్యములలో నేవి సాధువులో నిర్ణయించుట కాధారములు బొత్తిగాఁ జాలకున్న వని చెప్పకతీరదు.

కావుననే వ్యవహారస్థభాషల సాధుత్వాసాధుత్వములను నిర్ణయించుటకుఁ దత్తత్కాలస్థమగుసద్వ్యవహారమునే ప్రమాణముగ గ్రహింపవలయు నని భాషాశాస్త్రజ్ఞు లగుప్రామాణికులు సిద్ధాంతము చేసియున్నారు. మనశబ్దరత్నాకరాది కోశములలో నున్నపదములలో నర్థాధికపదముల కీసిద్ధాంతమే గతి యనక తప్పదు గదా!

పయిరీతిని దత్తత్కాలస్థ సద్వ్యవహారములు తత్తత్కాలస్థ ప్రయోగముల సాధుత్వాసాధుత్వములకు నిర్ణాయకములై యున్నను పూర్వకాలస్థప్రయోగముల సాధుత్వాసాధుత్వములకు నిర్ణాయకములు కాఁజాలమిం జేసియు నట్టివానిని నియమించు తత్తత్కాలరచితవ్యాకరణములు సంపూర్ణసామర్థ్యము గల్గియుండమింజేసియు, లక్ష్యగ్రంథములు వెనుకనుదాహరించిన రీతిని బ్రమాదభూయిష్ఠము లయి యుండుటంజేసియుఁ, గొన్నివిషయములందుఁ బ్రాచీనకవుల ప్రయోగము లెవ్వియో తత్తద్విషయములందు వారివారి యభిప్రాయము లెట్టివో యని నిర్ణయించుట దుశ్శక మని చెప్పక తీరకున్నది.

పయి నుదాహరించిన చిక్కులను బరిశీలించియే కావలయును మన లాక్షణికు లీక్రిందిసిద్ధాంతము నంగీకరించియున్నారు ఆంధ్రభాషలోనిప్రాచీనవాఙ్మయమెల్ల సామాన్యముగా ఛందోయతిప్రాసములతోఁ గూడినదే యయియుండుటచేతను, నట్లే యమకశ్లేషకవన మనేక కవులచే నాదరింపఁబడియుండుటచేతను ఛందోయతిప్రాసశ్లేషయమకాదులచే నిబద్ధము లయి సామాన్యముగా మార్పవలనుపడక యుండు స్థలములే సందిగ్ధవిషయనిర్ణాయకము లగునని సిద్ధాంతము చేసికొనిరి. కావుననే సామాన్యముగా లక్షణకర్తలు తాముచెప్పిన లక్షణములను జూపునపు డట్లు సామాన్యముగా మార్పరాని ఛందోయతిప్రాసశ్లేషాది నిబద్ధస్థలములను జూపుటయే సంప్రదాయమై యున్నది. ఆయాకాలముల కవులెల్లరును నియమముగా వానిని బాటించుటచే వా రట్టిస్థలములందుఁ బ్రయోగించినప్రయోగములు వారికి సమ్మతము లని గ్రహించుటఁయుచితముగాని, యతిప్రాసశ్లేషాదినిర్బంధములచే నట్టికవులు ప్రయోగించి రనియును వానిని గ్రహింపరా దనియును దలఁచుట యుచితముకాదు. దిద్దుటకు వీలుపడినస్థలములు లేఖకప్రమాదజనితము లనియు దిద్దుటకు వలను పడనిస్థలములు యతిప్రాసాది ప్రతిబంధజనితము లనియుఁ

జెప్పి యథేష్టముగా సవరించుచుండుట యెంత యసంగతమో యరయుఁడు. అట్లయినచో నిఁక నెద్ది సందిగ్ధస్థలమును నిర్ణయించుటకు వీరి కాధారమగునో తెలియ రాకున్నది.

ఛందోయతిప్రాసశ్లేషాదులచే నిబద్ధములగు మహాకవి ప్రయోగములను మన్నింపక తీకకుండుటచేత నేగదా యప్పకవి తనకు సమ్మతము కాని ప్రయోగములు లేఖకాది ప్రమాదజనితములని చెప్పి దిద్దనారంభించెను.

ఉ. "నన్నయముఖ్య సత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియెడఁ బాఠకాథములు గొన్నియెడఁ బోకడపెట్టఁ దక్కువై
యున్నెడఁ జూచి జానపదులోడక దిద్దినతప్పుత్రోవ లె
ల్లన్నిజ మంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే? (అప్ప. 3. 207)

ఈ సందర్భమునఁ జెప్పినయప్పకవి వాక్యము కొంతవఱకు సంభవింపఁదగిన దైనం గావచ్చును గాని యాతఁడు చేసిన దిద్దుబాటులు మాత్ర మసంభావితము లని చెప్పక తప్పదు.

"ఏ, మన్నఁగొఱంత లేదు మణిమండనముఖ్యము లైనకాను కల్" అను సులక్షణసారోదాహృత ప్రయోగము లేఖకప్రమాదజనితమనియు "ఏ, మన్నఁగొఱంత లేదు మణిహారము లాదిగఁ బెక్కుకానుకల్" అనునది నిజమయినపాఠ మనియు వ్రాసియున్నాఁడు. లాక్షణికోదాహృతము లగునిట్టివి లేఖకాది ప్రమాదజనితము లనుట యసంగత మనుటకు సందేహము లేదు గదా!

పయిరీతినే యప్పకవి 'రల' ల యతి తన కిష్టము లేనందున "రోలంబాలక యొత్తు గ్రుంకి బిసవల్లుల్లున్" అను సహజ మగుపాఠము రామరాజభూషణకవి ప్రయుక్తము కాదనియు నందు "లోలంబాలక" అనునది నిజమయినపాఠ మనియువ్రాసియున్నాఁడు. (చూ. అ. 3. 278) పైపాఠములయర్థమును బాగుగఁ బరిశీలించినపుడు 'రోలంబాలక' అను పాఠమే కవిప్రయుక్తమని యెట్టివారికిని స్ఫురింపకపోదు. మఱియు "రాయంచ కాళ్లఁ దొలకయమున్న" అని రామరాజభూషణుఁడు వేఱొకచోట 'రల' లకు యతిని బ్రయోగించియుండఁగా, నిట 'రల' ల యతికి వెఱచి సహజ మగుపాఠమును విడుచుకొనుట యసంగతము కదా! అప్పకవి చేయమఱచినను వసుచరిత్రటీకాకారుఁడు మాత్రము వ్యాఖ్యపకపై "రాయంచకాళ్లఁ దొలకయమున్న" అనుదానినిసైతము సవరిం

చెను. అచ్చట 'రల' ల యతియే గాక 'తవులు' అనుదానికి 'తౌలు' అను రూపాంతరము లేనందున నపశబ్దముగూడ నంగీకరింపవలసివచ్చు నని చర్చించి "కలహంసకాళ్లఁ దవులయమున్న" అని దిద్దివేసియున్నాఁడు. (వసు. 3-163-వ పద్యవ్యాఖ్య.) కాని, "సుస్థిరు నిను మాధవుం డను మతి న్వెనుదౌలెద మాడకంబునన్" అని 'తౌలు' అనునది పింగళిసూరనచేఁ గూడఁ బ్రయోగింపఁబడియున్నది.

"ఏతేన 'రాయంచకాళ్లఁదౌలకయమున్న' ఇత్యాదికవిప్రయోగాణాం నకించి ద ప్యసామంజస్య మితి ధ్యేయమ్." అని యహోబలపతి వ్రాసియున్నాఁడు (అహోబల. 133. పుట)

"భూ, రమునంబుచ్చుచు వర్ధమానవిపహల్గానికి మఁరిం గుందు చున్" అని పిల్లలమఱ్ఱిపినవీరభద్రుఁడుసయితము'రల'లయతిని శకుంతలా పరిణయమునఁ బ్రయోగించియున్నాఁడు. కావున వ్యాఖ్యాతచేసినసయి సవరణము సాహసమూలక మని యెన్నఁదగియున్నది.

ఇట్లే యప్పకవి "ఋరు"లకు యతిని జెప్పియుండనందున సులక్షణసారమున నుదాహరింపఁబడిన యనంతుని ఛందోదర్పణములోని "విలసద్రుకారమును వట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు" అను చోట "విలసద్రికారమును మఱి,రలవి విరమ మొందు శౌరిఋషులకు" అని యిట్లధునాతనులు నిశ్శంకముగా సవరించిరి. "........సహస్రా, క్షౌహిణు లట్లగుట మీరు చూడరె యెందున్ "అని తిక్కన ప్రయోగించి యుండఁగా నక్షౌహిణి యనునది తప్పనుకొని, యచ్చొ నిటీవల ముద్రిత మగు శ్రీ వీరేశలింగము పంతులు వారు సవరించిన భారతమున "సహస్రాక్షౌహిణు లట్లగుట మీరు గానరె యెందున్" అని సవరింపఁ బడెను; కాని,

క. "పూనుకొనియక్షశబ్దము, పైనూహినిశబ్దమున్నఁ బటువృద్ధియగున్,
మానుగ గుణముం జెల్లును, దాన నఖండంబు స్వరము దనరుంగృతులన్."

అను సులక్షణసారోదాహృతలక్షణము అక్షౌహిణి అను పాఠము సాధించుచున్నది. కూచిమంచి తిమ్మకవి తనసర్వలక్షణ సారసంగ్రహమునందు.

క. "అక్షౌహిణి యనఁగా మఱి, యక్షోహిణి యనఁగఁ గృతుల నాత్వోత్వంబుల్
లాక్షణికులు యతులిడుదురు, దక్షాధ్వరభంగ పాణితలసారంగా! (అ. 2, 180)

అని లక్షణము చేసి పై నుదాహరించిన ప్రయోగమునే 'అక్షోహిణి' అనునోకారవిశిష్టరూపమునకుఁ బ్రమాణముగాఁజూపెను. పయి కారణములచే నిటీవలివారు చేసినసవరణము సాహసమూలక మనియుఁ గవిసమ్మతము కా దనియు విశదమగుచున్న దిగదా!

గ్రంథవిస్తరభీతి నుదాహరింప నైతిని గాని యిట్లు మనవారు చేసినట్టియుఁ జేయుచున్నట్టియు సాహసైకమూలము లగుసవరణములు వేనవేలు గలవు. ఇట్లు సవరణముచేయుట యసంగతమె యయినను నిట్టి పని ఛందోయతిప్రాసశ్లేషాదులచే నిబద్ధ మగుప్రయోగ మున్నపుడు దాని ననురోధింపకతీరదనియు, నది యతిప్రాసశ్లేషాదినిర్బంధజనిత మగుటచేఁ బ్రమాణము కాదనిచెప్పుట యాంధ్రలాక్షణికసంప్రదాయ విరుద్ధ మనియుఁ జెప్పుటలో మాత్రము ప్రబలసాక్ష్యము నిచ్చుచున్న దనుటకు సందేహము లేదు. కావున భాషానియమనవిషయమున నీ ఛందోయతిప్రాసనిర్బంధమును శ్లేషకవనమును మిక్కిలి యుపకారకము లనుట నిర్వివాదాంశము.

ఈసందర్భమున నింకొక్కవిషయమునుగూడ గ్రహింపవలసి యున్నది. ఛందోయతిప్రాసశ్లేషయమకాదులచే నిబద్ధము లగుస్థలము లందలి ప్రయోగములకు సాధుత్వము నంగీకరించుట మాత్రమేగాక వానిచే సాధింపఁదగినజాతుల యితరరూపములకు సయితము సాధుత్వము నంగీకరించుట యాంధ్రలాక్షణికులసిద్ధాంత మనిచెప్పవచ్చును. వేయేల? సామాన్యముగా నాంధ్రవాఙ్మయములోని లక్షణగ్రంథములెల్ల నిట్టి సిద్ధాంతము నాధారముగాఁ జేసికొనియే యుత్పన్నము లయిన వని చెప్పుట సాహసము కాదు. అందును లాక్షణికు లర్ధానుస్వార శకటరేఫ సరళాదేశాదినియమములను ఛందోయతిప్రాసశ్లేషాదుల నాధారముగాఁ జేసికొనియే కల్పించి రని నొక్కిచెప్ప నగును. అట్లు గానిచో ముద్రణములకు మూలభూతము లగు వ్రాతప్రతులయందు సామాన్యముగా నెచ్చటను నియమము గనపడని యర్ధానుస్వార శకటరేఫ సరళాదేశాదులను జెప్పుటలో లాక్షణికుల కున్నయాధార మేమి? ఈవిషయ మీ ప్రకరణమున ముందు వివరింపఁబోవు వ్యాకరణవిశేషముల విమర్శనమున విశదము కాఁగలదు. కావున రసవిషయమున నంతగా నుత్కృష్ట మనఁ దగని దైనను బయిరీతిని భాషానియామక మయి యాంధ్రభాష

కత్యంతోపయుక్తము లగుగ్రంథములలో నొకటి యనఁదగు ద్వ్యర్థికావ్యము సర్వవిధములను బండితాదరణపాత్ర మని చెప్పుటకు సందేహము లేదు.

సామాన్యముగా నిట్టికావ్యములందలి ప్రతిపద్యమును నేవో కొన్ని పదములను నియమించుచునే యుండును. తమమతమున కనుకూలించినను ననుకూలింపకున్నను జోహారుచేయవలయునే గాని యితర కావ్యములందువలె నిందు నిప్పటిపండితులు సాధారణముగా స్వాతంత్ర్యము చూపి దిద్దఁజాలరు గదా!

పయికారణములచే నిట్టిగ్రంథము లాంధ్రవాఙ్మయమున కలంకారమువంటి వనియు, నిట్టివి వ్యాకరణాదులకన్న నెక్కుడుగఁ బండితులచే నాదరింపఁదగిన వనియుఁ జెప్పుట యతిశయోక్తి కానేరదు.

శ్లేషప్రబంధములందలి ప్రతిపద్యమును నేవో కొన్నినియమములను స్థిరపఱుచుచునేయుండు నని యీవఱకుఁ దెలిపియేయున్నాను. ఆవిషయమును విశదపఱుచుచు నిట్టిగ్రంథమునుండి వ్యాకరణనియమన విషయములను గ్రహించుమార్గమును జూపఁదలఁచి కథారంభములోని మొదటిపద్యమును దీసి యుదాహరించుచున్నాను.

**తే. అలరు మణివప్రవిజితహేమాద్రినిమథ, నగరమవతంసమఖిలభూనగరములకు**
**లలితజయసంపదలఁ బొల్చునిలు పయోధ్య, లఘుగభీరాంబుపరిఖాకలాప మగుచు.**

(హ. న. 1. 6.)

ఇందు 'అలరును' 'నగరములకును' 'అగుచును' అనుచోట్లులందలి ద్రుతలోపమును, 'నగరమవతంసము' అను మొదలగు స్థలములందలి యుకారసంధియు, ఛందోగణనియమమున మార్పరానివై వెలయుచున్నవి.

"వష్టిభాగురిరల్లోప, మవాప్యోరుపసర్గయోః" అనుసంస్కృత వ్యాకరణనియమమునకు 'వతంసము, అవతంసము' అనునవి శ్లేషమున నిబద్ధములై మార్పరాని లక్ష్యము లగుచున్నవి.

'అయోధ్య' అనుదానికి 'లఘుగభీరాంబుపరిఘాకలాపము' అనునది విశేషణ మగుటచే "మహాతీతరంబు లగుస్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాషనగు." (బాల. తత్స. 86. సూ.) అను సూత్రము దూఢమూల మగుచున్నది. ఇందు శ్లేషప్రతిబంధముచే 'కలాప' యగుచు అని సవరించుటకు వలనుపడదు.

ఇందలి ఛందశ్శ్లేష ప్రతిబంధములచే 'ఇల్లు' శబ్దములోని లకార లోపము మార్పరానిదై "అకారంబు క్రింది అకారంబునకుం దుది నులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు" (బాల. ప్రకీ. 7 సూ) అనుసూత్రములోని లకారలోపవిధానమునకుఁ బ్రమాణ మగుచున్నది.

'పొల్చు + ఇలు' అనుపదములనడుమ నకారము నిల్చు నను తద్ధర్మోకారసంధినియమము నిందలి శ్లేషనియమము స్థాపించుచున్నది.

'ఇలు + పయోధి' అనుపదములసంధియందు వకారాదేశా భావ మింద లిశ్లేషచే స్థిరపఱుపఁబడుచున్నందున, "న వికృతిశబ్దాత్పర తస్సాంస్కృతికానాం భవతి గసడదవాః" అను నియమము బలపడు చున్నది. (ఇట విశేషముగలదు. చూ. పు. 94)

పయిరీతినే. ప్రతిపద్యమును ననేకము లగువ్యాకరణవిషయము లను స్థిరపఱుచుచుండును. విస్తరభీతి నట్టివానినెల్ల నుదాహరింపక ముఖ్యము లగుకొన్నిస్థలములను మాత్ర మిటఁ జూపుచున్నాను.

## గసడదవాదేశము.

నిండుసున్నమీఁది గజడదబాదేశమువలెనే గసడదవాదేశము సయితము ప్రాసాదిస్థలములం దగపడుటచే నయ్యదియు నాగజడదబా దేశమువలెనె నిత్యముగా వచ్చుననియె ప్రాచీను లభిప్రాయపడిరి.

క. "పొసఁగం బల్కెడుచోఁ బొల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడుఁగ
బస నగుకచటతపల మును, గసడదవల్ ద్రోచి నిల్చుఁ గవిజనమిత్రా!
(ఆంధ్ర భాషా. 62. ప.)

అట్టి యాదేశము కొన్నియెడల నగపడకుండుటచేఁ గావలయు నాంధ్రశబ్దచింతామణికర్త ద్రుతప్రకృతికప్రథమాంతములగు 'నేను' 'తాను' శబ్దములమీఁద నున్నపరుషములకును, నచ్చతెనుఁగు శబ్దముల మీఁదనున్న సంస్కృత పదాదిస్థ పరుషములకును నట్టిగసడదవా దేశము రానేరదని చెప్పియున్నాఁడు. ఆస్థలములు తప్పఁ దక్కినయెడల నాయాదేశమును నిత్యముగానే విధించెను.

"గసడదవాస్స్యుః ప్రథమా, మ్యాత్రాదాత్మాస్మదోర్విసైవైతే,
న వికృతిశబ్దా త్పరత, స్సాంస్కృతికానాం భవంతిగసడదవాః"
(ఆంధ్ర. చింతా. సంధి.)

ఈయాదేశము సమాసగతపదములకు రానేరదను గ్రంథకర్త్రభి ప్రాయమును "గసడదవాస్స్యుః పదాద్వంద్వే" అను పునర్విధానము వ్యక్తపఱచుచున్నది.

పయి నుదాహరించినరీతి నీయాదేశము నిత్య మని ప్రాచీను లభి ప్రాయపడి యుండుటచేతనే 'పతి+తత్త్రాణము' (హ. న. 3. 43.) అనుచోట 'ద' కారాదేశమును జేసినయెడల నర్థాంతరమునకు భంగము గలుగును గాన నచట నాదేశాభావమునకు సాధుత్వ మెట్లని శంకించుకొని వ్యాఖ్యాత 'సమదాటోపారిపం క్తిరథుఁడు' అను మొదలగు రాఘవపాండవీయప్రయోగముల నావిషయమునఁ జూపియున్నాఁడు. కావునఁ బయిరామరాజభూషణుని ప్రయోగము గసడదవాదేశము యొక్క యనిత్యతను స్థాపించుచున్నది.

మఱియు గసడదవాదేశవిషయమునఁ బయినుదాహరించిన ప్రాచీనుల లక్షణము చాలదనియు, నాయాదేశము కళలమీఁద నున్న పరుషములకు సయితము రావచ్చుననియు 'ఒనర్చెదము, దమ్ము' (హ. న. 2. 38.) 'ఇపుడు, దమ, యంతి కావాక్తి' (హ. న. 2.31.) అను ప్రయోగములు నిర్ణయించుచున్నవి.

ఇంతియకాక చింతామణికారుని యభిప్రాయముఁజొప్పున వ్యస్త పదములయందే గాక కర్మధారయాది సమాసములయందును నీయాదేశము రావచ్చునని "పలు, వగతుర" (హ. న. 1–53) అను ప్రయోగము సాధించుచున్నది. అయ్యది శ్లేషప్రతిబంధమున మార్పరానిదయి యున్నది.

'ఇల్లు+పయోధి' (హ. న. 1.53) అను స్థలమునందలి వకారాదేశాభావమున, "న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః" అను చింతామణి సూత్రము బలపడుచున్నదని వ్రాసియున్నాను. (చూ. పేజీ. 92). అరయ నరయ నాచింతామణి సూత్రము "చ. జగము......ఎం, తగుమతులైన" (భార. ఉద్యో. 1.286.) అను మొదలగు తిక్కయజ్వాది ప్రయోగములకు విరుద్ధమగుటచే

"పరుషా వా స్వరూపేణ ప్రథమాంతోపరి స్థితాః,
కాకా సంబోధనే చాపి హ్యావ్యయే కర్మధారయే.
అచేతనార్థకే శబ్దే ఇతి శృంగారభూషణః."

అను నథర్వణోక్తనియమమే బలపడుచున్నదనుట లెస్స. ఈ యథర్వణోక్తికిఁ గూచిమంచి తిమ్మకవి తనసర్వలక్షణసారసంగ్రహమున విపులముగా నుదాహరణములను జూపియున్నాఁడు. (1–98 మొ–118 వఱకు.)

పై విషయముల కనుకూలముగా బాలవ్యాకరణమున నీవిధి బాహుళకముగాఁ జెప్పఁబడినను బయిన "వికృతిశబ్దాత్......" అను నదియు నాంధ్రీకరింపఁబడుటమాత్రము వింతగనున్నది.

ఈ గసడదవాదేశమువలెనే గజడదబాదేశమును ద్రుతస్వత్వ ప్రభృతిస్థలములందు రాకుంటయుఁ బ్రాచీనలక్ష్యలక్షణ సమ్మతమైయున్నట్లగపడుచున్నది; కాని తద్విషయమును నిర్ణయించు ప్రయోగము లీగ్రంథమున నాకు దొరకమిం జేసి యావిషయము లప్రస్తుతము లని యిందుఁ జర్చింపనైతిని.

## యడాగమసంధి

"యశ్రుతి మార్యా లఘుయం ప్రవదంతి ప్రాణతః పరంప్రాణమ్" అను చింతామణిలక్షణమున నున్న శ్రుతి శబ్దస్వారస్యమును బట్టి యీ లఘుయకార ముచ్చారణమునందు మాత్రమే వినఁబడుననియు నచట యకారమును వ్రాయ నక్కఱలే దనియు నిచట స్వరమాత్రమునే వ్రాయవలయు ననియుఁ గొందఱు పండితు (అద్యతను) లభిప్రాయ పడుచున్నారు.

1. సీ. "పటుమహారంభశభావంబు గని యతు, పదరూఢి నెఱపు గీర్వాణుఁడుండ" (హ. న. 1-80)

2. క. "వినుమత్యుశమథనాగ్రణి" (హ. న. 2-36. స.)

3. "ఆయతి వసుగుసౌ కాలంబనమూర్తి." (హ. న. 4-56.)

4. "ఎయ్యది......ఇయ్యెడ రెయ్యెడం గలిగ" (హ. న. 4.57.)

అను మొదలగు నిందలి ప్రయోగములు పై యభిప్రాయము సరియైనది కాదని నిర్ణయించుచున్నవి. స్వరమాత్రలేఖనమున గురుయకార విశిష్టపదోపస్థితి కలుగక పయిస్థలములం దర్థాంతరమునకు భంగము గలుగును. మఱియు 2, 4 స్థలములయందలి ద్విత్వానుమాపకస్వరలేఖ

నము దుర్ఘటము. అట్టి స్వపలేఖన మర్థాంతరస్థగురుయకారద్విత్వాను మాపక మెట్లగును? 4-వ స్థలమునందలి ప్రాసగతి యేమగును?

—॥ తద్ధర్థో కారసంధి ॥—

"సీ. ... ...

ఉరుసత్వభయ మెల్లనుడిపితి వీయుప, క్రియకుమా జేమొనర్చెద, ముదమ్మగఁ

తే. గీ. గలుగఁ జేసితి ... దొరయఁజేయు, దేవర రాజ్యంబు సిర ఫలింప."

(హ. న. 2-38).

ఈపద్యమునందు నలపరార్థమున 'దొరయఁజేయుదును+ఏను' అనుచోఁ దద్ధర్థార్థకోకారసంధి యగపడుచున్నది. వ్యాఖ్యాతయగు చిత్ర కవియనంతకవియు నద్దాని నంగీకరించియే వ్యాఖ్యానము చేసియు న్నాఁడు. కావున నీప్రయోగము "నస్యాత్తద్ధర్థోతః" అను చింతామణి నియమమున కనిత్యతను స్థాపించుచున్నది.

ఒకపక్షమున నట్టి వ్యాకరణవైరుధ్యమును మాపికొనుటకయి 'నీకు, దమయంతియనఁదగు కీర్తికాంతను. దేవర = దేవుఁడు, దొరయఁ జేయుఁగాక' అని యి ట్లర్థముచేయుట కవకాశము గలదు గాని యది కవిహృదయము కాదు. "నీవు నన్నుఁ జంపెద వని భయపడుచుండఁగా నట్టిభీతిని బాపి నన్ను విడిచితివి. ఇట్టినీకు నేనేమి ప్రత్యుపకారము చేయు దును? అయినను నీకు దమయంతిని గూర్చెదను" అనునర్థమే కవిహృద యమై హృదయంగమముగా నుండును. హంస యాశీర్వచనము చేసె ననుట యసంగతము. ఆసందర్భమున హంస తాను బ్రత్యుపకారమును జేసెద ననునర్థమే సందర్భించియుండును. వేయేల? దీనికి మూల మగు శ్రీహర్షుని నైషధమున నట్లె యున్నది.

"శ్లో. మృగయా న విగీయతే నృపైః రపి ధర్మాగమమర్మపారగైః,

స్మరసుందర మాం యదత్యజ స్తవ ధర్మ స్సదయోదయోజ్జ్వలః.

శ్లో. పతగేన మయా జగత్పతే రుపకృత్యై తవ కిం ప్రభూయతే

ఇతి వేద్మి న తు త్యజంతి మాం త దపి ప్రత్యుపకర్తు మార్తయః.

శ్లో. త దహం విదధే తథాతథా దమయంత్యా స్సవిధే తవ స్తవమ్

హృదయే నిహిత స్తయా భవా నపి సేంద్రేణ యథాపనీయతే.

(నైష. 2. 9, 13, 47.)

ఈసందర్భమున రామరాజభూషణుఁడు సంస్కృతనైషధభాగము సాంధ్రీకరించినవాఁడపోలె మిక్కిలిసరిగా వర్ణించియున్నాఁడు. విస్తరభీతి

సాభాగమెల్ల నుదాహరింపనైతిని. కాఁబట్టి హంసి "నేను నీకు దమయంతిని గూర్చెదను" అని చెప్పె ననుటయే కవిహృదయ మనవచ్చును. కవి కట్టి ప్రయోగమం దభిప్రాయముగలదా? లేదా? యనువిషయము విచారింపఁదగినది కాని, యది దిద్దదగియున్నదా లేదా యని విచారించుట సరికాదుగదా! ఇంతకును నీతద్ధర్థోకారసంధిని గవి యిచ్చటనే గాక స్థలాంతరములందును బ్రయోగించియున్నాఁడు. ఇక్కవియే కాక మఱి కొందఱు మహాకవులును బ్రయోగించియున్నారు. అయ్యవి వరుసగాఁ జూపుచున్నాను.

**సీ. తే. గీ. ... ... నే, మించి, నెయ్యంబుఁ బ్రభులయెడ నొ,**

**నర్పుదు, రమహిమనలగుణంబులరసి**

**కరము ముదమందుదురు చిరగౌరవమున."** (హ. న. 2-51.)

అను పద్యమునందును నలకథాపక్షమునఁ బయిరీతినె తద్ధర్థార్థోకారసంధి యగపడుచున్నది. "ఏన్=నేను, మించియొనర్పుదు"; అని యనంతకవియు వ్యాఖ్యానమును జేసియున్నాఁడు.

"దమయంతీ! నీవు ప్రభులయెడ నెయ్యం బొనర్పుదువు" అని యిట్లిచ్చుటసయితము వ్యాకరణాభిమానమున నసంగతముగ నర్థము చేయఁగడఁగుట పరిహాసనీయము గదా! ఈసందర్భమునకు మూలమును శ్రీహర్షనైషధమునందలి మూఁడవసర్గమున (16 మొ. 20 శ్లో. వఱకు) జూడ నగును.

"కన నయ్యెడనఘ" (హ. న. 4-58) అను పద్యమునందును, కన నయ్యెడున్, అనఘ, అని యిట్లు ఛేదము గాన నందును దద్ధర్థోకారసంధి వెలయుచున్నది. అనంతకవియు నట్టిసంధి నంగీకరించియే వ్యాఖ్యానమును జేసియున్నాఁడు. ఇచట 'కన నయ్యె ననఘ' అని యిట్లు సవరించుటకును వలనుపడదు. అట్టిభూతార్థకక్రియ యీసందర్భమున వర్తమానకాలబోధకక్రియవలె సందర్భించియుండలేదు. "నీయందు నానావనితల నేలి వర్తించువిధ మగపడుచున్న"దనునర్థమె యచట కవిహృదయ మనఁదగును,

**"క. డును దరు లారులకు..... వర్తమానార్థంబుల్"**

**క. అడిగెడు నడిగెద రనఁగా.....వరుసలో నుదాహరణంబుల్.**

(ఆంధ్ర. భూష. 142, 143.)

"ఎఱుఁగు దఖిలంబు" (హ. న. 4-60.) అనుచోట సయితము హరిశ్చంద్రకథాపక్షమునఁ దద్ధర్థోకారసంధి యగపడుచున్నది. "ఎఱుఁగుదుర్ అఖిలంబు" అనియే ఛేదముచేసి యనంతకవి వ్యాఖ్యానమును జేసియున్నాఁడు. ఇచ్చట "నీవఖిలమును నెఱుంగుదువు" అనునర్థము సందర్భింపనేరదు.

"చ. ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యఱచా టగునాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁ బోలి తేటయును జాటుదనంబును గాక యుండఁజె
ప్పినయది పో కవిత్వ మనిపించు నగిం చటుగాక యుండినన్."

(భైరవరాజు వేంకటపతి. పంచతంత్రము)

అనుపద్యమునందును "నగించున్ + అటుగాక=నగించటుగాక" అని యిట్లు తద్ధర్మార్థకోకారసంధి ప్రయోగింపఁబడినది.

చ. ... ... ... చీడపుర్వు దాఁ
జెడఁగొఱుకింతెగాక పుడిసెండు జలం బిడి పెంప నేర్చునే? (భాస్కర. 18 ప)

అను భాస్కరశతకపద్యమునందును "చెడఁగొఱుకున్ + ఇంతె = చెడఁగొఱుకింతె" అని యిట్లు తద్ధర్మార్థకోకారసంధి ప్రయోగింపఁబడినది.

మఱియు 'న స్యా త్తద్ధర్తోః' అనుసూత్రముచేఁ దద్ధర్థోకారసామాన్యమునకు సంధి నిషేధింపఁబడియుండఁగాఁ బ్రయోగములను బట్టియే కదా యది ద్రుతాంతోకారమాత్రవిషయ మని యహోబలపతిచే వ్యాఖ్యానము చేయఁబడెను.

"సలుపుద మీనిదాఘదివసంబులు" ఇత్యాది వచనాత్ 'న స్యా త్తద్ధర్తోః ఇతి నిషేధో నాంతమాత్రవిషయ ఇతి జ్ఞాయతే" (అహో. 483. పు.) ఇట్టిస్థితిలోఁ బయి నుదాహరించిన ప్రయోగములను బట్టి యాసూత్రము నాంతసమాపకక్రియాపదవిషయమునందు సైతము వైభాషిక మగుననుట యెట్లు విరుద్ధ మగును? విశేషణ విషయమున నీవఱకుఁ బ్రయోగములు నాకు లభింపలేదు. పూర్వలాక్షణికులు పూర్వప్రయోగములను వెదకుటలోఁ గొఱఁతపడి కొన్నిసామాన్యనియమములను జేయుచుండటయు నుత్తరోత్తరులకుఁ దద్విలక్షణప్రమిత ప్రయోగములు దొరకినపుడాసామాన్యలక్షణములు సవరింపఁబడు

చుండుటయు లాక్షణికసంప్రదాయములే గదా ! వేయేల ? మొన్న మొన్నటిబాలవ్యాకరణకర్త ప్రయోగాన్వేషణము చాలక ద్రుతాంత మగుభూతార్థకేకారసంధిని సంగ్రహింపఁజాలం డయ్యె! "చేసితి నచ్యుతార్చనము, చేసితచ్యుతార్చనము" (అహోబల. 190. పు.) "కొలిచితి నబ్ధిజన్, కొలిచితబ్ధిజన్" (అహోబల. 194. పు.) అని యిట్లుదాహరించి యహోబలపండితీయమున నట్టిసంధి యంగీకరింపఁబడియున్నది.

"ఉ. గాండివి నొవ్వఁ బల్కితిటు" (భార. శాంతి. 1 ఆ. 1.)

"ఉనిచి తిపుడు" (భార. కర్ణ. 2-329.)

"చిక్కితని" (జైమి 8-131)

"పొందితనేక" (కుచేలో. 1-70.)

అని యీవిషయమున ననేకప్రయోగములను వెదకి మ-రా-శ్రీ గిడుగురామమూర్తిపంతులవారు ప్రచురించియున్నారు. పై రీతిప్రయోగములను.—

"అచాం సంధా ద్రుతో౽దృశ్యస్థితో౽పి చ భవే త్సదా"

అను నధర్వణవచనము సాధింపఁజాలియున్నది.

## తద్ధర్మార్థకారసంధి

"ఉదంత తద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు." అనుసూత్రము చాలదనియు, నౌదంతతద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడును వానినడుమ నకారము నిల్చు ననియుఁ సూత్రింప వలసియున్నవనియు, "సీ. ప్రబలమానీశ నిర్దయవృత్తి ... "(హ. న. 3-26) (ప్రబలమాన్ + ఈశ = ప్రబల + మానీశ అనిచ్ఛేదము.) అనుపద్యములోని "ప్రబలమానీశ" అనుప్రయోగము వ్యక్తపఱుచుచున్నది. అహోబలపతి తద్ధర్మార్థకవిశేషణములును ద్రుతప్రకృతికములె యని చెప్పి తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనములకువలెనే వీనికిని సంధి నిషేధించినంతమాత్రముననే నకారవిధాన మక్కఱలేకయే యాసంధిలో నకారము నిల్చునని యభిప్రాయపడియున్నాఁడు. (అహోబల. 192 పు). చిన్నయసూరిగారు "న స్యాత్తద్ధర్మోక్తః"అనుసూత్రములోని నకారమును జూచి భ్రమించియో లేక కారణాంతరముననో తద్ధర్మార్థకములు కళ లని తలఁచి వానిసంధిలో నకారమును గ్రొత్తగా

విధించిరి. ఒకపక్షమున బాలవ్యాకరణ కర్తయుఁ దద్ధర్మార్థకవిశేషణములను ద్రుతప్రకృతికములుగానే తలఁచియున్నాఁ డనియు, నచట సమాసమును వివక్షించి సామాసికద్రుతలోపమును జేయునపుడు నకారము నిల్చుటకయి యట్లు పునర్విధానము చేసె ననియుఁ జెప్ప నగును గాని "తృవర్థకార్థంబునందెడి యెడువన్నియలగు" "వానికి లోపంబు బహుళంబుగా నగు" (బాల. క్రియా. 44, 45) అను బాలవ్యాకరణ సూత్రములచే సాధింపఁబడిన తద్ధర్మార్థకవిశేషణములు ద్రుతప్రకృతికము లని చెప్పుటకు వలనుపడదుగదా!

## దార = భార్య.

"దారాః పుంసి చ భూమ్న్యేవ"అను నమరకోశోక్తిని బట్టియుఁ, దదనుసారి యగు "దార...సం. వి. అ. పు. బ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము" అనుశబ్దరత్నాకరగ్రంథమును బట్టియు 'దారములు' అనియే యుండవలయు నని తేలుచున్నది. అట్లయినను నద్దాని నేకవచనముగఁ బ్రయోగింప నగుననియు నట్టియెడ మువర్ణకవిరహితముగ 'దార'అని యుండవలయు ననియు.

"చ. ... ... ... ... ఉ

ద్ధతగతిఁ దద్ద్విజాధిపతిదారఁ దమిం గడపెం..." (హ. న. 4-30.)

అను రామరాజభూషణుని ప్రయోగము వ్యక్తపఱచుచున్నది.

"చ. ... ... ... సద్గుణై

కనిధినిజాగ్రదారహితకార్యభరాత్మత నుండఁ జూచి..." (రా. పాం. 1-39.)

('నిజాగ్రదారక + హిత అనియు, సద్గుణైకనిధిని, జాగ్రత్ ఆరహిత, అనియు నుభయపక్షములందును భేదము) అని యిట్లు పింగళి సూరనార్యుఁడును నట్లే ప్రయోగించియున్నాడు.

దారశబ్దము స్త్రీవాచకమేయైనను స్త్రీలింగము కామిం జేసి "స్త్రీలింగముల ప్రథమైకవచనంబునకు లోపంబగు" (బాల. తత్స. 57, సూ) సూత్రముచొప్పున లోపము రానేరదు గానఁ బుల్లింగ మగు నీదారశబ్దమున నేకవచనప్రయోగము నంగీకరించినను నట్టియెడ'దారము'అనియె యుండవలయు నని బాలవ్యాకరణమువలనఁ దేలుచున్నది. అట్లే దాని టీకయందు బ్ర. శ్రీ. కల్లూరి వేంకటరామశాస్త్రులవారు స్త్రీలింగశబ్దమునకు

స్త్రీవాచకపరముగా నర్థము చేసిరి; గాన నిచటి ప్రథమైకవచనలోపమును బాలవ్యాకరణము సయితము సాధింపఁగల దని యందమన్న నది సరి కాదు. సంస్కృతవ్యాకరణములందు స్త్రీలింగ స్త్రీవాచకశబ్దములు పర్యాయముగ వ్యవహరింపఁబడు సంప్రదాయమున్నను నాంధ్రవ్యాకరణము లందట్లు వలనుపడదు. కార్యభేదమునుబట్టి మహతీవాచకముల విషయమున స్త్రీవాచకశబ్దమును, సంస్కృతవ్యాకరణప్రసిద్ధ పారిభాషిక స్త్రీలింగ విషయమున స్త్రీలింగశబ్దమును వాడుట యాంధ్రవైయాకరణసిద్ధాంత మయియున్నది. కాన బాలవ్యాకరణసూత్రములోని స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచక మనియర్థము వ్రాయుట ప్రామాదిక మనఁదగును. "స్త్రీలింగత్వేఽపిస్త్రీవాచకత్వాభావాత్" అని యహోబలపండితుఁడు స్త్రీలింగ స్త్రీవాచకశబ్దములు పర్యాయములు గావని విశదపఱిచి యున్నాఁడు.

"అస్త్రియా మి త్యర్థవర్ణనవచనే స్త్రీవాచకవ్యతిరిక్తానామితి వ్యాఖ్యానా న్న తన్వాదిభ్యో వృవర్ణకవికల్పో విరుద్ధః"

స్త్రీలింగ మగుతనుశబ్దము స్త్రీవాచకము కాదు. కాన దానికి వృవర్ణకవికల్ప ముండనగు ననియు స్త్రీవాచకములగు వధ్వాదిశబ్దముల కట్లుండ దనియు భావము. అని వేఱొకచోట సయితము స్త్రీలింగ స్త్రీవాచక శబ్దములు పర్యాయములు గావని (అహోబల. 296. పు.) యహోబలపతి వ్రాసియున్నాఁడు. వేఱొకచోటసయితము "సరస్వత్యాతు "మిన్నేఱు శివజటావాసిని" ఇత్యుదాహృతం. తత్ర న కేవలం స్త్రీసమత్వం కింతు స్త్రీవాచకత్వ మప్యవ్యాహత మేవేతి త ద్రూప మపి సాధ్వేవ; 'ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు'ఇతి రూపం తూభయేతి సూత్రేణ సమంజస మితి జ్ఞేయమ్" అను వాక్యములచే (అహోబల 320పు)శివజటావాసినియగు మిన్నేఱు గంగాదేవి గాన నచటి మిన్నేఱు శబ్దము స్త్రీవాచకమును స్త్రీలింగసమము నగుననియు ధరాపరాగ పటలాక్రాంతం బగుమిన్నేఱు ప్రవాహరూప మగునదిసామాన్యముగాన నది స్త్రీవాచకేతర స్త్రీలింగసమ మనియు నహోబలపండితుఁడు వివరించి యుండుటచేత సైతము స్త్రీలింగ స్త్రీవాచకపదములు పర్యాయములు కావని స్పష్టపడుచున్నది. అతివిస్తరమగు ననియు నప్రసక్తమనియు నుదాహరింప విరమించితిని గాని, ప్రమితము లగునాంధ్రవ్యాకరణములం

దెచ్చుటఁ జూచినను స్త్రీలింగ స్త్రీవాచక శబ్దములు పర్యాయములు కావనియే విశద మగుచుండును.

కానఁ బయి నుదాహరించిన గుప్తార్థప్రకాశికావివరణము చొప్పునఁ బ్రథమైకవచనలోపము స్త్రీవాచకముల కగు నని యంగీకరించి నచో కళత్రము అను రూపము మహతీనపుంసక మగుకళత్రశబ్దమునకు సంభవింపనేరదు. అట్లే మహతీపుంలింగ మగుదారశబ్దమునకును, నహో బలపండితీయశబ్దరత్నాకరసమ్మత మగు 'దారములు' అను రూపమును నసాధువు కావలసివచ్చును. మఱియు స్త్రీవాచకేతర స్త్రీలింగములగు లతావిద్యాదిశబ్దములకుఁ బ్రథమైకవచనలోపము రాకపోవలసి వచ్చును. కాన గుప్తార్థప్రకాశిక చొప్పున నీసందర్భమున లక్ష్యసిద్ధి గలుగనేరదు.

ఇఁక "బహుత్వ ఏవ దారశబ్దస్య పుంస్త్వమ్. ఏకత్వేతు స్త్రీత్వమేవ. తేన 'నిజాగ్రదార' నిత్యాదిరూప మపి సాధ్వేవ" అను నహో బలపతి వాక్యము చొప్పున దారశబ్దమున కేకత్వమున టాబంతత్వము నే యంగీకరించి 'దార' అనురూపమును సాధించుకొనుట వైయాకరణ హృదయమైయున్న ట్లగపడుచున్నది. ఏకత్వమునఁ బుంస్త్వము దార శబ్దమునకు శాసింపఁబడనందునఁ బయి యహోబలపతి సిద్ధాంతము విరుద్ధము కానేరదు. సర్వశబ్దసంబోధినీ కోశమునం దిది యాకారాంత స్త్రీలింగముగను వ్రాయఁబడియున్నది.

## దైవము = దేవుఁడు

శా. ... ... హరి కాకుత్స్థాన్వయుం డై యితం
జే దైవం బని కల్పకప్రసవవృష్టిం బూజ గావించి రిం,ద్రాదుల్. (హ. వ. 1-22.)

అనుపద్యములోని 'దైవంబు' అనుప్రయోగము "దైవం దిష్టం భాగధేయం" అను నమరకోశోక్తిచొప్పున నదృష్టవాచకమాత్రమే కాక దేవతావాచకము నైతము గావచ్చు నని వ్యక్తపఱచుచున్నది. కొందఱిట 'దైవం బని' అనుచో 'దేవుండని' అని యిట్లు దిద్దివేయుట కును సాహసింతురు గాని యట్లు చేయుట సరికాదు. పింగళిసూరన నైతము—

"తే. గీ. ... పెదవేంకటాద్రిభూవరుఁడు సేయు
సేవ లింపుగఁ గైకొనుదైవమునకు. (రా. పాం... పీఠిక. 1-38.)

అని దైవశబ్దమును దేవతావాచకముగ వాడియున్నాఁడు.

"క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని, పాలసుఁ డాఫలము లాసపడు మనుజేంద్రా!"
(భార. ఉద్యో. ఆ. 2.)

అని యిట్లు తిక్కయజ్వయుఁ బ్రయోగించియున్నాఁడు. "అమహాన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు" (బాల. తత్స. 39 సూ.) అను సూత్రమునకు బ్ర. శ్రీ. కల్లూరి వేంకటరామశాస్త్రులవారు "అమహత్తు లయిన నపుంసకలింగములకు ముపర్ణకము వచ్చును" అని టీక వ్రాసియుండుటచే దేవతావాచక మగు దైవశబ్దము మహాన్నపుంస కము గాన దానికి ముపర్ణకము సిద్ధింపనేర దని సందేహింపఁజనదు. 'అమహత్తులకును నపుంసకలింగములకును ముపర్ణకము వచ్చు' నని సూరిగారి యభిప్రాయము గాన నిట దైవశబ్దము మహత్తైనను నపుంసక లింగ మగుటచే దానికి ముపర్ణకము వచ్చుట నిర్బాధము. ప్రామాదిక మగు గ్రస్థప్రకాశికావివరణమునుబట్టి సూరిగారికి లేనిపోనిదోషము లను గల్పించుట యుక్తముకాదుగదా! సూరిగారే 'దైవము' అని యా సూత్రమునకే లక్ష్యమును జూపియున్నారు. బ్రహ్మశ్రీ, వేంకటరామ శాస్త్రులవారి కర్త్రభిప్రాయము నంగీకరించినయెడల సూత్రకర్త యుదా హరించిన దైవము అనునదియేగాక యమహత్పుంలింగము లగువృక్షము మున్నగునవియు నసాధువులు కావలసివచ్చును. మఱియు సూత్ర కర్తకు సమ్మతము లగు 'మిత్రము, శరణము, పాత్రము, ప్రధానము, (బాల. తత్సమ. 19-39) దైవతము మున్నగు ననేక మహాన్నపుంసక శబ్దము లసాధువులు కావలసివచ్చును.

"వ. సర్వోత్కృష్టంబు లగుతీర్థక్షేత్రదైవతంబులమహాప్రభావంబు."
(పాండురంగ. 1-207.)

"సీ. అత్యుత్కటప్రభావంబుల దీప్రమైన,
దైవతంబును గూడి ... ... ... (పాండురంగ. 1-195.)

అను మొదలగుకవిప్రయోగములలో నమహత్పుంలింగంబులకును మహా న్నపుంసకములకును వానివిశేషణములకును వచ్చియున్నముపర్ణక మసా ధువు కావలసివచ్చును.

## భాలము = ఫాలము.

"సీ. పస మీఱు నేవేల్పు భాలసన్నుతహేతి" (హ. న. 5. 62.)

అనుచో నొకయర్థమున 'భా × లసత్ + నుత + హేతి' అనియు వేఱొకయర్థమున 'భాల (=ఫాల) సన్నుతహేతి' అనియు ఛేదము గాన దీనిచే ఫాలశబ్దపర్యాయ మగుభాలశబ్దము గల దని వ్యక్తపడుచున్నది. అయ్యది వాచస్పత్యాదికోశప్రసిద్ధమును నై యున్నది.

## బాహుకుఁడా? బాహుఁకుఁడా?

క. "భూరితరశాంతివాహకుఁ, డై రాజిలునయ్యలాబలారి కుడిగ నా
హారజలచింత లంత సు,దారతరాదిత్యకులదయాసంపత్తిఁ." (హ. న. 5-5)

చ. "అతులిత...అ, క్షతబహుదీప్తి వాహకుఁడు." (హ. న. 5-28.)

అను పద్యములందు 'బవ'ల యభేదము నాశ్రయించి హరిశ్చంద్ర కథాపక్షమున 'వాహకుఁడు' అనియు, నలకథాపక్షమున 'బాహకుఁడు' అనియుఁ బదములను ఛేదముచేసి గ్రహింపవలసియున్నది. ఋతుపర్ణుని దాస్యమున నున్న నలునకు నుకారమధ్య మగుబాహుకశబ్దమె సంజ్ఞ యై యున్నట్లు సర్వశబ్దసంబోధినీ వాచస్పత్యాది కోశములందు వ్రాయఁ బడియున్నది.

చ. "సకలగుణప్రసిద్ధుఁ డగు సర్వహితుం డగుఁజూవె యంచు బా
హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చె."(భార.అర.2-177)

అని యిట్లుకారమధ్యముగనే వాగనుశాసనుఁడును యతిస్థానమునఁ బ్రయోగించియున్నాఁడు. కావున నిచటి రామరాజభూషణుని ప్రయోగము సరిగా లేదని చెప్పవలసియున్నది. అట్లయినను సంజ్ఞానామముల విషయమున నిట్టి యలంతిమార్పులు కవి సమయసిద్ధము లై యుండుటచే నిది యొకవిరోధము కానేరదు. "ఎఱ్ఱాప్రెగ్గడ, ఎఱ్ఱప్రెగ్గడ, ఎఱాప్రెగడ, ఎఱ్ఱతిరుమల, ఎఱ్ఱతిరుమల, ఎఱతిమ్మ, ఎఱతిరుమల, తిర్మల మున్నగు నామములలోని మార్పులు కవిప్రయోగప్రసిద్ధములే గదా.

లేదా? నలకథాపక్షమున 'బాహుక' అను నుకారమధ్యనామమునే గ్రహించి హరిశ్చంద్రకథాపక్షమున 'వాహక' శబ్దపర్యాయముగా వాహుక శబ్దమును సాధించుకొననగును.

శ్లో. "కృత్తద్ధితసమాసానా మభిధానం నియామకమ్,
లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞానసూచకమ్."

**సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయా శ్చ తతః పరే,**
**కార్యా ద్విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు.''**

అను వైయాకరణసిద్ధాంతములచొప్పున 'వహ' ధాతువునుండి ణుకారమధ్యవాహుకశబ్దమును గల్పించుకొనుట విరుద్ధము కానేరదు.

ఇక వ్యాకరణములయందుఁ జూపఁబడిన ప్రక్రియనే యపేక్షింప వలయు నన్నయాగ్రహ మున్నచో "మృగయ్వాదయ శ్చ" (ఉణాది ప్రథమపాదము.) "ఏతే కుప్రత్యయాంతా నిపాత్యన్తే మృగం యా తీతి మృగయు ర్వ్యాధః, దేవయు ర్ధార్మికః, మిత్రయు ర్లోకయాత్రాభిజ్ఞః ఆకృతిగణోఽయమ్" అను సిద్ధాంతకౌముదీగ్రంథము ననుసరించి యా కృతిగణ మగు మృగయ్వాదులలోఁ జేరిన దనఁదగు. ణ్యంత మగు 'వహ' ధాతువునకు 'కు' ప్రత్యయముచేసి వాహుశబ్దమును సాధించి దానినుండి స్వార్థికక ప్రత్యయాంత మగు వాహుకశబ్దమును సాధించు కొన నగును! "దృసనిజనిచరిచటిభ్యో ఞుణ్" అను నౌణాదిక సూత్రమునొద్ద "మృగయ్వాదిత్వా త్కుప్రత్యయే 'చటు' ఇత్యపి" అని యిట్లు వేఱొకచోట సయితము భట్టోజీదీక్షితుఁడు మృగయ్వాదిగణము నాకృతిగణత్వమును విశదీకరించియున్నాఁడు.

పైరీతిని సాధింపనగు 'వాహుక' శబ్దమే కవిహృదయమై యుండ నోపు ననియు నద్దానిని సుప్రసిద్ధ మగు 'వాహక' శబ్దమునుగా లేఖక పాఠకాదులు భ్రమించి యట్లు వ్రాసియుందు రనియుఁ దోఁచుచున్నది.

—— అప్పరిమెడ, అక్కత్రకులసిత ప్రకాశుని. ——

వెనుకటిహల్లు ద్విత్వము నొందినపుడు తత్పూర్వస్థ మగుదీర్ఘము తఱచుగా హ్రస్వ మగుచుండును. అచటి దీర్ఘపుగౌరవము ద్విత్వపరతా నిమిత్తకగౌరవరూపముగఁ బరిణమించుట సహజముగనుండును. "తీయంగాను=తియ్యంగాను; పోయేరు=పొయ్యేరు; వైయాకరణులు=వయ్యాకరణులు; యౌవనము=యవ్వనము; మున్నగువ్యావహారికాంధ్రప్రయోగములయందుఁ బయినియమ మగపడుచున్నది. అట్టి పద్ధతి ననుసరించిన వానిలో మహాకవి వాడినప్రాసాదిస్థలములలోని మాఱ్పరాని ప్రయోగముల నాధారముగాఁజేసికొని లాక్షణికు లావిషయమునఁ గొన్ని నియమములను జేసిరి. "త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు

బహుళంబుగా నగు" (బాల. సమా 14, చూ) అనునది యిట్టి నియమములలో నొకటి.

"ఇదమద సే త ద్యత్తచ్ఛబ్దాశ్శబ్దాంతరాన్వయే బహుళమ్,
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి."

అని యిట్లు చింతామణిలో నయ్యది వ్రాయఁబడెను. అందలి బహుళశబ్దమహిమచే రేఫఋకారములకును శషసహలకును ద్విత్వము రానేరదని యహోబలపండితుఁడు వివరించెను. (అహో. 40-1. పు) అట్టివాని ద్విత్వము శ్రుతిరంజకము కామింజేసి యెచ్చటను గవులు ప్రయోగింపకుండుటయు, నవ్యాకరణమున వైయాకరణు లట్టివానికి ద్విత్వమును నిషేధించుటయు సంభవించియుండును. అట్లే సంయుక్తాక్షరద్విత్వమునకును లాక్షణికులు ప్రయోగములం గానక యద్దానికిని ద్విత్వనిషేధమును జేసియున్నారు.

"ఊష్మ రేఫా న్వినా ద్విత్వ మయుక్తస్య హలో మతమ్." అని యథర్వణాచార్యుఁడు చెప్పియున్నాఁడు. అట్లయినను రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానములోని యీ క్రింది ప్రయోగము లట్టి సంయుక్తాక్షరద్విత్వమునైతము సాధువే యని నిర్ణయించుచున్నవి.

చ. " ... ... ... ... అ
చ్చెరువుగఁ బూని యప్ప్రమద శీర్ణమహోయతి యయ్యెనంతయుఁన్." (హ.న.1-69)

సీ. " ... ... ... ...
మానసాధ్వుల మిన్న మహనీయభక్తి నత్క్షత్రకులసితప్రకాశుఁ బ్రాణ"
(హ. న. 3-26)

నైవానిలో మొదటిపద్యమునందు "అప్రమద" అని యిట్టిచ్ఛేదముగల త్రికపూర్వకకర్మధారయసమాస మొకపక్షమునందును, న × ప్రమద 'నఙ్' సమాస మొకపక్షమునందును గ్రహింపవలసియున్నది. కర్మధారయపక్షమునఁ బయి నుదాహరించినరీతిగల హ్రస్వద్విత్వములు గల వనకున్నచో ద్వితీయార్థమునకు భంగము గల్గును. ఇక ద్వితీయార్థము 'నఙ్' సమాసమున 'ప్ర' అనుదానిలోని పకారమునకు 'అనచిచ' అనుపాణినీయసూత్రమువలన ద్విత్వమును సంపాందిచుకొనవలయును. అట్లే రెండవపద్యమునందును నొకట 'అ × క్షత్రకుల' అనుత్రికపూర్వ

పదకర్మధారయమును వేఱొకట 'నక్షత్రకు' అను పదమును వెలయుచున్నవి. అందును గర్మధారయపక్షమునఁ బయినుదాహరించిన రీతిని సంయుక్తమగు 'క్ష' కారములోని 'క' కారమునకు ద్విత్వమునుఁ ద్రికములోని దగు 'ఆ' అను దానికి హ్రస్వమును వచ్చిన వనకున్నచో ద్వితీయార్థమున విశ్వామిత్రశిష్యుఁడు నాక్షత్రకుఁ డనవలసివచ్చును. కాన నచట "నక్షత్రకుఁ" డను పదము సిద్ధించుటకై నలపరార్థమునఁ ద్రికపూర్వకసంయుక్తాక్షరమునకు ద్విత్వము నంగీకరింపక తీరదు. అట్టి క్షకారములోని కకార ద్విత్వమును పారిశ్చంద్రకథాపక్షమున 'అనచిచ' అను పాణినీయసూత్రమున సంపాదించుకొనవలయును.

త్రికపూర్వపదకర్మధారయమున నిట్లు సంయుక్తాక్షరమునకు ద్విత్వమును రామరాజభూషణుఁడే గాక పింగళిసూరనార్యుఁడును రాఘవపాండవీయమునఁ బ్రయోగించియున్నాఁడు.

**తే.గీ.** "**వఱలు నచ్యుతు సఖ్యాతి వర్ణితాతు, లప్ప్రిదీప్తి నిట్లలరు నీ విప్ప్రిభావ**
**మెందుఁ బెట్టని కోటగా నెసఁగుచుఁ గడ, చేర్తు వస్న నహోళరాజితనిహాఢి"**
(రా. పాం. 2. 91.)

ఇందు రామాయణార్థమున 'విప్ప్రిభావ' అనుపదమును భారతార్థమున 'ఈ + ప్రభావము' అనువిగ్రహముగల త్రికపూర్వపదకర్మధారయసమాసమును గ్రహింపకతీరదు. 'విప్రభావము' అను పదమునందును దానికిఁ బ్రాసస్థలమున నున్న 'అతులప్ప్రిదీప్తి' అను పదమునందును 'ప్ప్రి' అను చోటి ద్విత్వమును 'అనచిచ' అను దానిమూలముననే సంపాదింపవలయును. పయిరీతిని సవరింపరాని మహాకవి ప్రయోగము లుండుటచే నాంధ్రవైయాకరణులు నిషేధించిన సంయుక్తాక్షరద్విత్వముసయితము సాధువే యని గ్రహింపక తీరదు.

ఉచ్చారణమునందు భేద మగపడదు గాన ద్విత్వశాస్త్రమునకుఁ బ్రయోజనము లేదని చెప్పుచు మహాభాష్యకర్త 'అనచిచ' మున్నగు ద్విత్వశాస్త్రములను బ్రత్యాఖ్యానము చేసియుండఁగా నద్దాని నాధారముగాఁ జేసికొనక తీరదని పై ప్రయోగము లెట్లు సాధువు లగు నని శంకింపఁజనదు. మహాకవిప్రయోగములం దగపడు నీద్విత్వశాస్త్రమును నిర్వహించుపాణిన్యాచార్యులవారి మతమే యీవిషయమున లక్ష్యసాధక

మగుటంబట్టి గ్రహింపఁదగియున్నది. స్థలాంతరములందును నీద్విత్వము నంగీకరింపక తప్పదు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమున (1-16, 2-109, 3-25, 43, 58) ననేకపద్యములందును, నట్లే రాఘవపాండవీయమున 'దేవరన్న్యాయము (1-43) మున్నగు ననేకస్థలములందును ('దేవర+న్యాయము' అని యొక పక్షమునందును, 'దేవరన్+న్యాయము' అని యొకపక్షమునందును గ్రహింపవలయును.) 'అనచిచ' అనుద్విత్వమును గ్రహింపకతీరదు.

"శ్లో. రుచిం రచయితుం కచే రుచిరపుష్పవర్గ స్సమం
సదా వహతి భూషణం సహ సుధాంశునాపూషణమ్
ఉభా వభవత స్తతో జనని పుష్పవంతా మిమా
తయో ర్ఘటనయో త్తమ శ్శ్రియ ముపైషి తత్రార్థికీమ్." (లక్ష్మీసహస్రము.)

అను మొదలగు సంస్కృత మహాకవిప్రయోగములందును నట్టి ద్విత్వమున కుపయోగ మగపడుచున్నది. పైశ్లోకమునందు 'ఉత్తమ శ్శ్రియమ్' అనుచో 'ఉత్తమ+శ్రియమ్, అనియు 'ఉత్+తమస్+శ్రియమ్' అనియు శ్లేష నాశ్రయించి ఛేదముచేయక తప్పదు. అందొక పక్షమున శవర్ణద్విత్వమును సాధించుటకు 'అనచిచ' అను ద్విత్వశాస్త్ర ముపయోగించుకొనకతీరదు.

## పరసవర్ణశాస్త్రవైకల్పికత్వము

'అమ్మందగమన' (హ. న. 4-40.) అనుచో 'మంద' అను సంస్కృతపదమునందు "అనుస్వారస్యయయి పరసవర్ణః" అను పాణిని సూత్రముచొప్పున నకారదకారసంయోగమును గ్రహింపవచ్చును. ఆ పక్షమున 'అమ్మన్+తగన్' అని యర్థాంతరమున ఛేదముగాన నందు ద్రుతమునకు సంశ్లేషమును, బరుష మగుతకారమునకు సరళ మగు దకారాదేశమును గ్రహింపవలయును. లేదా సంస్కృతమునఁ బదాంతమందు వలెనే తెనుఁగున సంస్కృతపదమధ్యమునందును నీపరసవర్ణాదేశము వికల్పముగాఁ జెల్లు ననునాంధ్రలాక్షణికులసిద్ధాంతముచొప్పున 'మందగమన' శబ్దమున నిండుసున్నయే యున్నదనియు నచటఁ బరసవర్ణాదేశము రాలేదనియును గ్రహింపవచ్చును. అపక్షమున నర్థాంతరము నందలి 'అమ్మన్+తగన్ అను ఛేదమున ద్రుతమునకుఁ బూర్ణానుస్వార

మునుఁ బరుషమగుతకారమునకు సరళ మగుదకారాదేశమును గ్రహింప వలయును. పయిరీతిని బయిప్రయోగము పరసవర్ణాదేశవైకల్పికత్వమున కనుకూలించియే యున్నది.

పదమధ్యమునందు సంస్కృతభాషలోఁ బరసవర్ణము నిత్యముగానే వచ్చును. అట్లయినను నట్టిపదములు తెనుఁగునఁ దత్సమము లైనపుడు వానియం దీపరసవర్ణములు సంస్కృతమునఁ బదాంతమునందు వలెనే వికల్పముగా నిలుచు ననియే ప్రాచీను లగునాంధ్రలాక్షణికు లంగీకరించినట్లు విశదమగుచున్నది.

రామరాజభూషణుఁ డీహరిశ్చంద్రనలోపాఖ్యానములో "పంచమ" "చంచల" "అభ్యంచిత" "విజృంభించు" అను వానిలోని బిందుపూర్వకచకారములను బ్రాసస్థలములయం దొకపద్యమునఁ (2-3) బ్రయోగించియున్నాఁడు. 'విజృంభించు' అనుదానిలోని యించుగాగమమున బిందువే గలదని సకలాంధ్రలాక్షణికసిద్ధాంత మగుట సుప్రసిద్ధము గదా! అట్లే 'బంగరు', 'ముష్టింగొని' 'భంగవిహారముల్' 'ఉత్తుంగ' అనుపదములలోని బిందుపూర్వకగకారములనొకచోఁ (1-20) బ్రాసములనుగాఁ బ్రయోగించెను. ఇందు 'ముష్టిఁగొని' అను సరళాదేశసంధిలో ద్రుతమునకు బిందువు విధింపఁబడు ననుటయందును 'బంగరు' అను నాచ్ఛికపదమునందు బిందువేగాని జకారా ముండదనుటయందును సందేహము లేదుగదా! పైస్థలములయం దున్న సంస్కృతశబ్దములలో వర్గపంచమములను గ్రహించినచో బిందువునకును వర్గపంచమములకును బ్రాసము నంగీకరింపవలసివచ్చును. ఆంధ్రలాక్షణికు లెవ్వరును న ట్లంగీకరించి చెప్పియుండలేదు. మీఁదుమిక్కిలిగ నప్పకవి—

తే. గీ. జ్ఞానవేద్యాయ త ప్తకాంచనవిభూష
ణాయ మేచకవర్ణకంఠ ప్రియాయ
నగధరాయ నమో౽స్తు సౌందర్యవిజిత
మననిజాతాయ గోపడింభాయ యనఁగ." (అప్ప. 3-53.)

అని యిట్లనుకృతిచేసి శుద్ధసంస్కృతపదములను ప్రయోగించునపుడును, 'కాంచన, కంఠ, సౌందర్య, డింభ' శబ్దములలో ననుస్వారము కల దనునభిప్రాయముతో వానిని బిందుయతి కుదాహరించియున్నాఁడు.

'కల శమంబు మగ్నముగఁ జేయుచప్పుడు, (రాఘవపాం. 1-19.)

ఇందు రామాయణార్థమున జలవాచక మగు "అంబు" శబ్దమును భారతార్థమున 'శమంబు' అను తత్సమపదమును గ్రహింపవలసి యున్నది. అందు శమంబు అను ప్రథమావిభక్తిరూపమున బిందుపూర్వక బువర్ణకమే గల దని యాంధ్రలాక్షణికులసిద్ధాంతము. "మువర్ణకము నకు మాముడియేని బిందుపూర్వకంబువర్ణంబేని విభాషనగు" (బాల. తత్స. 42) కాఁబట్టి పింగళిసూరన సంస్కృతపద మగు 'అంబు' శబ్దము నడుమను బిందువు నంగీకరించె ననియు, నచటఁ బరసవర్ణశాస్త్రము నుపేక్షించె ననియు విశద మగుచున్నది.

పై యాధారములనుబట్టి సంస్కృతపదమధ్యమునసైతము పరస వర్ణాదేశము రాకపోవచ్చు ననియు, నచట బిందువు నిలిచియుండవచ్చు ననియు నాంధ్రలాక్షణికులును గవులును తలఁచినట్లు విశద మగుచుం డఁగాఁ బ్రాసస్థలములయం దట్టివైషమ్య ముండవచ్చు ననియుఁ, బరసవర్ణ శాస్త్రముచొప్పునఁ దత్సమపదములందు వర్గపంచమములే నిత్యముగా నున్నవనుకొనినను క్షతి లేదనియు, బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక యందు బ్ర. శ్రీ. కల్లూరి. వేంకటరామశాస్త్రులవారు వ్రాయుట వింతగ నున్నది. "అనఁగా నేకానునాసిక్యంబును ద్విగుణకంఠ్యత్వంబును గల 'జ' అనుశబ్దముకంటె నేకానునాసిక్యంబును నేకకంఠ్యత్వధర్మంబునఁ దక్కువ యగుట స్పష్టపడుచుండుఁగాన నిట నెట్లు ప్రాసంబు చెల్లు నని యాధునికు లగుకొందఱితాత్పర్యము; కాని యిచటఁ గంఠ్యద్విత్వం బులో నొక్కటి తగ్గినంతమాత్రమునఁ బ్రాసభంగము రానేర దనియే పూర్వుల యభిప్రాయము. (ఆపూర్వు లెవరో?) (బా. వ్యా. గు. ప్ర. 362 పు.)" అని యిట్లు వ్రాసియున్నారు. వీరి యీయభిప్రాయము లాక్షణి కులమతమునకు విలక్షణ మగుటచే నది గ్రాహ్యము కాదు. కేవల ప్రాచీనులకును నట్టియెడల బిందువు గల దనునభిప్రాయమే యున్న దని విశదపఱచుటకై మఱికొన్ని ప్రాచీనప్రమాణములం జూపుచున్నాను.

**"తే. ట త ప వర్గాక్షరములకు డాపలించి, యొనర నూఁదినబిందువు లుండె నేని**
**వరుస ణ న మ ఱ వరు లగు వాని కెల్ల, నవనిఁ గొందఱు సుకవులయనుమతమున"**

**చ. కినుకఁ జళుక్యవిశ్వనృపకేసరి తేసినచోఁ గృపాణదం**
**డనమునఁ గల్గుఁబో సురగణత్వము తత్పదవారిజాతవం**

దనమునఁ గల్గుఁబో మనుజనాథక తద్భటధర్మనావలం
బనమునఁ గల్గుఁబో గహనమధ్యనివాసము వైరికోటికిన్.

(కావ్యా. చూడా. 1 ఉల్లా. 57-58.)

పయిపద్యమునం దున్న 'దండనము' 'వందనము' 'అవలంబనము' అను సంస్కృతపదములం దూఁదినబిందువు లనఁగా నిండుసున్న లున్నవని ప్రాచీనుఁ డగు విన్నకోట పెద్దన యభిప్రాయపడియున్నాఁడు.

"భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
నాకు నిట నాల్గుఁ జెల్లుఁ బాండవసహాయ
నాకు నిట నాల్గుఁ జెల్లుఁ గందర్పజనక
మాకు నిట నాల్గుఁ జెల్లు సంపదలరాజ"

(అనం. ఛం. 1 ఆ.)

పయిపద్యమునందలి 'పాండవ' 'కందర్ప' 'సంపద' అనుసంస్కృత శబ్దములందు బిందువులె యున్నవని ప్రాచీనుఁ డగునసంతకవియు నభి ప్రాయపడియున్నాఁడు. సామాన్యముగాఁ బ్రాచీను లెల్ల నిట్లే యభి ప్రాయపడియుండి రని చెప్పవచ్చును. విస్తరభీతి నెల్లరపద్యములను నిట నుదాహరింపలేదు. ఇట్టిస్థితిలో బ్ర. శ్రీ. వేంకటరామశాస్త్రులవారే పూర్వుల యభిప్రాయమునుబట్టి ప్రాసవిషయమున నట్టివైషమ్య ముండ వచ్చు నను నూతనసిద్ధాంతమును జేసిరో తెలియరాకున్నది. మఱియు వీరి యీనూతన సిద్ధాంతమునుబట్టి 'శంకు దొంగ' అనుపదములలోన "ంక=ంగ అనువానియం దానునాసిక్యకంఠ్యత్వములకు శ్రీ శాస్త్రులవా రంగీకరించిన వైషమ్యముమాత్రమె యుండుటచే వానికిసయితము ప్రాసము చెల్లవచ్చు నని తేలఁగలదు. అది సరికాదుగదా! కాఁబట్టి ప్రాస విషయమున నానునాసిక్యకంఠ్యత్వాదులసామ్యమును బరిగణించుట యసంగతము. ప్రాసవిషయమున స్థానసామ్యమును బ్రాచీను లెవ్వరును బాటింపలేదు. ఉచ్చారణసామ్యమును మాత్రమె ప్రాసవిషయమునఁ బ్రాచీను లంగీకరించిరి. కాన నం దెచ్చటనైన సంయోగాక్షరములలో నొకహల్లుయొక్కద్విత్వ ముచ్చారణమున భేదింపదు గాన నట్టి ద్విత్వా ద్విత్వములకుఁ బ్రాసమైత్రి క్వాచిత్కముగాఁ గొంద ఱంగీకరించిన నంగీ కరించిరేమో యని యొకపక్షమునఁ జెప్పిన బాగుగ నుండును. విస్తర భీతి నావిషయము నిచట విపులముగాఁ జర్చింపలేదు.

ఇంక శ్రీశాస్త్రులవా రట్లుచేసిన తమయావర్గపంచమాదేశవాద మిం దరుచి పూని తుదకుఁ బరసవర్ణశాస్త్రమును నిరాకరించి సంస్కృత పదమధ్యమును బిందువే నిత్యముగా నిలుచు నని చర్చించిరి. అట్టిబిందు వునకుఁ బాణినీయులు విధించువర్గపంచమవర్ణములు 'పంచమవర్ణములే యనియుఁ బలుపుట్టువులేయనియు'నిట్లు ద్వ్యర్థిగా నేమేమో గొప్పగొప్ప యుక్తులు చెప్పి వానిని బహిష్కరించిరి; కాని బిందువు గలదనుటకు మనకు లభించియున్న ప్రమాణములు తత్సమ పదమధ్యమున నిత్యముగ వర్గపంచమము లే యుండవలసిన నియమము లేదని నిరూపింపఁ జాలియున్న విగాని సంస్కృతభాషాసిద్ధము లగునట్టిపంచమాక్షరము లుండ నేకూడదని నిరూపింపఁ జాలియుండ లేదు. మఱియు శ్రీ చిన్నయసూరిగారు జకా రోదాహృతికయి 'పఙ్క్తి' శబ్దము నుదాహరించియున్నారు. (చూ. బాలసంజ్ఞా. 4 సూ.) మఱచిరేమోగాని శ్రీశాస్త్రులవారుసైతమచట నుంకరి. రంతయ్యగారింకూడ "ఈశబ్దమును "పంక్తి" అని సబిందువుగా వాడుకలో వ్రాయుట తప్పు" అని వివరించిరి. అహోబలపండితుండు సైతము"అకృతస్థలే"తేత్యత్ర "అనుస్వారస్యయయి పరసవర్ణః" ఇతి సాధు త్వమూహ్యం" అని యిట్లు వర్గపంచమాక్షరాదేశము నంగీకరించియే యున్నాఁడు. (అహో. 213 పు.)

'వేగ' కళ యగునా? ద్రుతప్రకృతిక మగునా?

"క. ఆవేళ నరిగె నాకుల, జీవాతువు వేగ..." (హ. న. 3. 49.) అనుపద్యమందు హరిశ్చంద్రకథాపక్షమున "వేగన్ = తెల్లవాఱఁగా" అనియు, నలకథాపక్షమున "వేగన్=వేగముగాన్" అనియు వ్యాఖ్యాత యర్థము చేసియున్నాఁడు. ఇట "వేగము" అను ముఁవర్ణకాంతప్రథమా విభక్తిరూపమునకు సంక్షిప్తరూపమయియున్న 'వేగ' అనుపదము ద్రుతప్రకృతికమనుట విరుద్ధముఁగ నున్నది. "మ...ధృతరాష్ట్రుం డవినీతి ...వేగ తెగంబాఱకు..." (భార. ఉద్యో. ఆ.) అని తిక్కయజ్వయు దీనిని గళ యని నిర్వహించుచు 'తకార' ప్రాసపూర్వస్థానమునఁ బ్రయో గించియున్నాఁడు. కావునఁ బయి రామరాజభూషణుని పద్యమునం దును నలకథాపక్షమునందు సైతము "వేగన్=తెల్లవాఱుజాముకాఁగా" అనియే యర్థము చేయవలెను. అట్టి యర్థమే యచట మిక్కిలి సందర్భ పడియున్నది. లేదా! 'వేగ' శబ్దార్థకమగు 'వే' అనుదానికి అగుధాతువు

నుజ్యంతరూప మనుప్రయుక్తము కాఁగా 'వేగఁ' అను ద్రుతప్రకృతిక రూపము సిద్ధించు ననిన్నైన గ్రహింపనగును.

**సీ. "ప్రకటితోన్నేష కీపద్మిని కినకర, కాతుకావాప్తి వేగనె ఘటించు"(వసు. 2-89).**

అనుపద్యమునందును బయిరీతినె వ్యాఖ్యాతల 'వేగఁ'అనుదానిని శీఘ్రార్థమున ద్రుతప్రకృతికముగా గ్రహించె నని చెప్పవచ్చును; గాని యాపద్యమందుఁ దక్కనమూఁడుచరణములందును లేనిశ్లేష మాచరణ ములందును ననావశ్యకముకాన నచట నట్లు గ్రహింపవలసినపని లేదు.

## అలరుఁబోఁడి.

**సీ. "మతిచిర్మైనను నల మానవపతి యన్నపలుకు దప్పకలరుఁబోఁడి, మితోదరాత్త"**
(హ. న. 1. 80.)

అను పద్యమునం దొకపక్షమున 'అలరుఁ + పోఁడిమితో' అనియు వేఱొకపక్షమున 'అలరుఁబోఁడి + మితోదరాత్త' అనియు ఛేదముగాన 'అలరుబోఁడి'అనుస్థలమున 'రు'వర్ణమునకుఁ దర్వాత నర్ధాను స్వార మున్నదని యంగీకరింపక తప్పదు. అక్కారణమున "బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేననకు బోఁడి యగు" (బాల సమా. 23 సూ.) అను సూరిగారిరచన ప్రామాదిక మనియు నట ప్రౌఢవ్యాకరణరచనయే సరియైన దనియు (ప్రౌఢ. సమా. 19 సూ.) స్పష్టపడుచున్నది. ఇట్టిచిక్కును గనిపెట్టియే కావలయు నిటీవలి మహాను భావులు పయిసూత్రమునందు "మేనునకు బోఁడి" యనుచో "మేను నకుఁ బోఁడి" అని దిద్ది ముద్రించిరి. అద్దానికి సరిగ సూరిగా రిచ్చిన యుదాహరణములలో లేనియరసున్నలను సైతము నాయాస్థలములందు నిలిపివేసిరి; కాని యట్లుదిద్దినను సూరిగారి రచనవలన అలరు బోఁణి మున్నగు రూపములు సిద్ధింపఁజాల వని వీరు గ్రహించిరో లేదో తెలియ కున్నది.

## రేఫద్వయమైత్రి.

**సీ. "అనురక్తి ఱేఁచు నూతనసారసాటోపము."** (హ. న. 2-30.)

అనుచోట "ఱేఁచు = శునకము" అని యొకపక్షమునందును "రేఁచు = రేఁగఁజేయు" అని యొకపక్షమునందును ఛేదముగాన దీనిచే

రేఫద్వయమైత్రి దుష్టముకానేర దనువిషయము వ్యక్త మగుచున్నది. ఇయ్యది సుప్రసిద్ధమును సర్వలక్షణసంగ్రహాదులలో విపులముగాఁ జర్చింపఁబడియున్నదియు నగుటచే నీవిషయమున నుదాహరణాంతర ములను జూపనయితిని.

### సఖండాఖండమైత్రి.

"అదర నలపంది బలువిడి నడఁచె నతఁడు" (హ.న.2-25)అనుచో నొకయర్థమున'నడచె'అనియు నొకయర్థమున 'అడఁచె'అనియు గ్రహింప వలసియుండుటచే సఖండాఖండములమైత్రి గ్రాహ్య మనువిషయము స్థిరపడుచున్నది. "శ్లేషే సఖండనిర్బిందోర్వై శ్లేషనం క్వచిన్మతమ్" అని యథర్వణుఁడును నంగీకరించియున్నాఁడు.

### ద్రుతముమీఁదద్రుతము.

"సీ. మఱచియైనను నలమానవపతి" (హ.న.1-28.) అనుచోట హరి శ్చంద్రకథాపక్షమున "ఐననున్ × అలమానవపతి" అని పదచ్ఛేదము చేయవలయును. కాన దీనిచే సముచ్చయాదులందుఁ గొన్నియెడల ద్రుతముమీఁద ద్రుతమువచ్చుటయుఁ గల దని విశద మగుచున్నది. ఇదియే వ్యవహారములో నున్న 'న్ను'అనుదానికి (రామునకునును=రాము నకున్ను) మూలమని యెఱుంగునది. "ద్రుతా ద్ద్రుతః క్వచి చ్చాత్ర దృశ్యతే కవిభాషితే"అని యథర్వణుఁడును దీని నంగీకరించియున్నాఁడు.

### సంపు=చంపు.

"క. ...సారంగా, హితముఁగ సంపెఁ గన హర్ష మేపునఁ బోదలఁగ" (హ.న.2-23)అనుచో నొకట "సంపెఁగను"అనియు వేఱొకచో "సంపెఁ × కనఁగ"అనియు ఛేదముగాన వ్యవహారములోని "సంపు=చంపు" అను ధాతువు రామరాజభూషణునిచే నంగీకరింపఁబడె నని గ్రహింపవలసి యున్నది. వ్యావహారికపదములలో సద్వ్యవహారములకు రానివి నింద్య గ్రామ్యములనియు నట్టివానిని గ్రహింపరా దనియు నాంధ్రవైయాకరణ సిద్ధాంతము; (వసు. విమ. 7 భాగము.) కాన నియ్యది యగ్రాహ్య మని యందమన్న నిది ప్రాచీనకవులకాలమున నిప్పటివలె సద్వ్యవహారవిదూర మై యుండె ననుటకు నాధారములు లేవుగదా! మహాకవులప్రయోగ ములుమాత్రమే తత్తత్కాలస్థితసద్వ్యవహారములను దెలుపుసాధ

నము లయియుండఁగా నివి యాకాలమున సద్వ్యవహారమున లేదనీ గాని, యగ్రాహ్య మనిగాని నిర్ణయించుట కెట్లు వలనుపడును? భారతాదులలోఁ బ్రయోగింపఁబడియున్న 'లచ్చిని బమ్మ, కత, రోసము, దోసము, బాస, ససి, మద్దెము, కైత' మొదలగు ననేకపదము లిట్టివే యనక తీరదుగదా! వేయేల? 'అతఁడు సంపెను? ఇతఁడు సేసెను.' అను మొదలగు గ్రాంథికభాషాప్రయోగము లసాధువు లని యనఁజాలము గదా! ఒకప్పు డిప్పటి ప్రామాణికు లట్టిసద్వ్యవహారవిదూరప్రసంగములను విడిచిన విడుచుకొందురుగాక!

## ఆడ - ఏడ:

'ఆడ - ఏడ' అనుపదములు రామరాజభూషణుఁడు తఱుచుగా (4.38-57.) ప్రయోగించి యున్నాఁడు. ఆంధ్రభాషాభూషణమున నివి గ్రామ్యములనియుఁ బ్రయోగార్హములు గావనియుఁ జెప్పఁబడియున్నది. ఆంధ్రభా. 25 ప.) రామరాజభూషణుఁడేగాక యనేకకవులు వీనినిఁ బ్రయోగించియున్నారు. అట్టివాని నుదాహరించి కూచిమంచితిమ్మకవి కేతనవాక్య ముపేక్షణీయ మని వ్రాసియున్నాఁడు. (సర్వలక్షణ. 1. 5)

## అడాంతరూపము:

"తరుణిచూపులు నెలత్రావడంబులఁ బ్రోచు" (వ. వ. 4-43.)

అని యిట్లు రామరాజభూషణుఁడు 'అడాంత'రూపమును బ్రయోగించియున్నాఁడు. 'త్రావడము అనునది త్రావుధాతువునుండి పుట్టిన భావార్థక మగువ్యావహారికరూప మనియు నయ్యది గ్రాహ్యము కాదనియుఁ దలఁచియేకావలయు శబ్దరత్నాకరకర్త యద్దానిని వ్రాయక 'నెలత్రావడము=చకోరపక్షి' అని యేకముగా నొకదేశ్యపద మని వ్రాసి పయి రామరాజభూషణప్రయోగమునే యుదాహరణముగ నిచ్చియున్నాఁడు. ఇట్లే కేరడము, ప్రేలడము, చెక్కడము, ముట్టడము, వ్రాయడము మున్నగుపదములు కవులు ప్రయోగించి యుండుటచే, శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడినవి. పై శబ్దము లేవో యవ్యుత్పన్నము లగు దేశ్యశబ్దము లని యంగీకరించుటకన్న నాయాధాతువులయొక్క 'అడ' ప్రత్యయాంతరూపము లనియు, నవి వ్యావహారికభాషనుండి యేర్చి కవులచేఁ బ్రయోగింపఁబడిన వనియు గ్రహించుట యుచితము.

"ప్రతిక్రియ మడాంతత్వం ప్రతీతం తు నగీయతే,
క్వచి దింప్వంతతాం కేచి దూచిరే నహి మే రుచిః"

అనునథర్వణసూక్తినిబట్టి యిప్పటికి 'ఆడ' ప్రత్యయాంతరూప మిప్పటి వలెఁ బ్రతిక్రియకును బ్రసిద్ధమైనవాడుకలోనికి రాలేదనియు; (ప్రతీతం= ప్రసిద్ధముగా; న గీయతే = భాషింపఁబడలేదు.) నక్కారణముననే యాతఁడు తన కాప్రయోగములందు రుచి లేదని చెప్పెననియు,మఱియు నవిగాని యట్టియితరపదములుగాని ప్రతీతముగా వాడుకలోనికి వచ్చిన యెడల గ్రాహ్యములే యనియు వ్యక్తమగుచున్నది. ఇంతియకాక యాతని నాఁటికిని గొన్ని ప్రతీతము లై వాడుకలోనికి వచ్చినవనియు నట్టి వాత నికి సమ్మతములే యనియు విశదపడుచున్నది.

## ఆగమచకారపుఁబత్వము.

"మ. సహకారంబు లనేకలీల సమయించఁగా సాగెనచ్చో, (వా. న. 2-24,) అనుప్రయోగము "అనుబంధప్రార్థనయో ర్జా వ్యతిరేకాదికే చ చో పః స్యాత్" (చింతామణి;)" ఆగమాన్యచకారంబుల కద్విరుక్తం బులకు ముత్తు పరంబగునపుడు పవ లగు" (బాల. క్రియా. 88 సూ;) అను విధి నతిక్రమించి వ్యవహారస్థ మగుచకారస్థితికిఁ బ్రమాణమగు చున్నది.

ప్రాచీనవైయాకరణులు క్రియారూపములందు సామాన్యముగా 'ప'త్వమును 'చ'త్వమును నంగీకరించియున్నా రనువిషయము నీవఱకు వ్రాసియేయున్నాను. (చూ.83.పు.) అట్టి ప్రాచీనులనియమమును మీఱి యధునాతనులు కొన్నిరూపములందు 'ప'త్వము, కొన్నిరూపములందు 'చ'త్వము నంగీకరించుటచే నిప్పుడు తద్విలక్షణప్రయోగములు చూప వలసివచ్చెను. "సీ... తే. గీ...ఒ, నర్పుదురు" (వా. న. 2-31) అను మార్పరానిప్రయోగము "చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు" (బాల. క్రియా. 103. సూ.) అనుసూత్రముచొప్పున 'ఒనర్తురు' అనియే యుండవలయు నమనియమ ముపేక్షణీయ మని వ్యక్తపఱచు చున్నది.

బాలవ్యాకరణకర్త పైప్రయోగమును సాధింపకున్నను "ఆకర్ణిం పుదురు పెద్ద లతిహర్షమునన్" అను మొదలగువానిలోని "ఆకర్ణింపు దురు" అనురీతిప్రయోగములను, "ఆగమచకారంబునకు నెఱుసున్న

మీఁదిదానికి దుక్కు పరంబగునప్పుడు పకారంబు విభాషనగు" (బాల. క్రియా. ౧౦. సూ.) అను విధానముచే సాధించియున్నాఁడు. సంస్కృత వ్యాకరణవాసనావాసితుఁ డగు నహోబలపండితుఁడు చింతామణి యసంపూర్ణగ్రంథ మని తలంపకయుఁ బ్రాచీనవైయాకరణుల యభిప్రాయముల నన్వేషింపకయు స్వతంత్రించి—'బిందుపరస్య తకారో ద్విస్స్యాత్' అను చింతామణిసూత్రపు వ్యాఖ్యానావసరమున "ఆకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్" అనునది సరి కాదనుకొని "ఆకర్ణింతురు మహాత్ము లతిహర్షమునన్" అని యిట్లు సవరించెను. బాలవ్యాకరణ మంగీకరించుచున్న సున్న మీఁది పత్వరూపమునే సాధింపఁజాలని చింతామణి మనరామరాజభూషణుని 'ఒసర్పుదురు' అను ప్రయోగమును సాధింప జాల దని వేఱుగ వ్రాయ నక్కఱ లేదుగదా!

ప్రాచీనవైయాకరణులు ప్రతిక్రియకును 'చ'త్వ 'ప'త్వరూపములు రెండును నుండు నని యంగీకరించిన వారు గాన దుక్కుపరంబగునపుడు సైతమేకవచనమున నట్లే యుండుననియు, బహువచనమున 'చుదు' అనుదానికి బదులుగా 'తు' అనునది సయితము వచ్చుననియుఁ జెప్పియున్నారు. అక్కారణమున బహువచనమున మూఁడు రూపములును సాధువులే యనియుఁ జెప్పియున్నాను.

"క. కారయిత సేయుకృతి పే, రారు నజంతంబు దానికాదేశంబుల్,
ధారుణి నింపుననించున, సారసముగ నేకవచనసరణికి నయ్యెన్."
"క. తుద బహువచనములకు నిం, పుదురును నింతురును ననుట పుడమియెడల నిం
చుదురును గలుగుఁ బ్రయోగా,స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగాన్."
"సీ. శ్రీవిశ్వభూపతి సేయించుక్రతువులు; సేవింపుదురు తదాశ్రితులు సురలు
బంధువు లింద్రుండు పరగించు వానలు, హాలికుల్ పరగింతు రర్థచయము
నెసఁగి యుద్ధశ్రీల నెవ్వారు తద్వృద్ధి, వరభటు లెఱిఁగించుదురు జయంబు."

(కావ్యా.చూడా;౮౩.తాళపత్రము)

అని యిట్లు విన్నకోటపెద్దనార్యుఁడు 'ఆకర్ణింపుదురు, ఆకర్ణించుదురు, ఆకర్ణింతురు' అను మూఁడువిధములగు ప్రయోగములను నంగీకరించియున్నాఁడు. అక్కారణమున నట్టి యించుకునకు రూపాంతర మగు చుక్కునకు సైతమట్టిరూపత్రయముండుట నిరాబాధ మని వైరామ

రాజభూషణకవి ప్రయోగము నిర్ణయించుచున్నది. పై కారణములచే రామరాజభూషణునిపద్యముద 'ఒనర్పుదురు' అనిగాని, 'ఒనర్పుదురు' అనిగాని ప్రయోగింపఁబడె ననియుఁ నూహింపవచ్చును. "క. బాణుఁ డని సతులు దలఁపుదు, రేణాంక" అని నరసభూపాలీయమునఁ (5-62) బ్రయోగింపఁబడియున్నది.

బాలవ్యాకరణమునఁ జెప్పఁబడినరీతిని ముత్తుపరమగునపుడేగాక యితరస్థలములందును పత్వముండు ననియు,

"కనకంపుననసొంపుకడ నుంపు రుచిపెంపు, పసిఁడితీగెలగుంపు మెసఁగ శేవో॥"

(వసు. 3. 9)

"కనకంపురుచిపెంపుఁ గడ నుంపుబలితంపు" (హ. న. 2-40)

అను రామరాజభూషణునిపద్యముల 'ఉంపు' అనుపాఠములే కవి హృదయము లనియు నీవఱకు వ్రాసియే యున్నాను. (చూ. పు. 84) ముత్తు పరమగుట మొదలగు బాలవ్యాకరణనియమములు లేనపుడు సయితము మహాకవులు 'ప'త్వము నంగీకరించి ప్రయోగించియున్నారు.

"సీ. పితరులఋణము తీర్పెడుసూనుఁ జెందని" (రా. పాం. 1-42)

"సీ... పెంపు దీపింపఁ శాలింపుచుండ"(శంకరకవిహరిశ్చంద్రోపాఖ్యానము.1-213)

"ఉ. చంపక..., సొంపను...భాషింపుచు...,,

(ఏనుగు లక్ష్మణకవి. రామవిలాసము)

చ. ... మోవిమోవిఁ జేరుపుచును...(కళాపూర్ణోదయము)

ఉ. ... గర్జింపుచు ...,, (జైమి. 2. ఆ.)

పై ప్రయోగములు యతిప్రాసాదిస్థలనిబద్ధములు గాన మార్పరానివై యున్నవి.

—: 'చాల' అనునది విశేషణము:—

'దరియఁజాల, దురాగతత్వమునఁజేసి' (హ. న. 2-61) అనుచో 'దరియన్ + చాలదు × రాగతత్వమునఁ జేసి'అనియొకపక్షమునందును, దరియన్ + చాల + దురాగతత్వమునఁజేసి" అని యొకపక్షమునందును ఛేదము గాన దీనిచే'చాల' అనునది విశేషణమై యుండవచ్చు నని స్థిరపడుచున్నది.

"శా. ఉన్నా రెన్నిక ... ... చాల సంపన్నుల్" (శకుం. 1-ఆ.)
"కం. ... ... ఒకరునిపారంబ చాలనుత్కృష్ట మగుఁ" (భార. ఉద్యో. 2-315)
"తే. గీ. ...చాలదినములనుండియు మైలపడిన, బడుగు గావునవాఁ డన్నపాన కాంత్ష"
(పాండు. 3-44)

అని యిట్లు మహాకవి ప్రయోగములును గలవు.

చాలుధాతునుజ్యంతరూప మగు 'చాలఁ' అనునది యవ్యయ మనియు దానికి విశేషణపర మగునర్థము దుర్ఘటమనియుఁ దలఁచియే కావలయు లక్ష్మీనారాయణీయకోశమున 'చాల' 'చాలా' అనునవి విశేషణము లని వేఱుగఁ వ్రాయఁబడెను. అట్లయినను 'కూడు' ధాతును జ్యంతరూపము వ్యవహారవశమున సముచ్చయార్థక మయినట్లును (అది యునుకూడ నున్నది. దానివల్లఁ కూడ నిది సిద్ధించును) 'దగ్గు' ధాతును జ్యంతరూప మగు 'దగ్గఱ' అనునది వ్యవహారవశమున లుప్తద్రుతక మయి విశేష్య మయినట్లును (దగ్గఱకు) నిదియు వ్యవహారవశమున విశేషణము నయ్యె నని గ్రహించుటయె యుచితము. విస్తరభీతి నుదాహరింప నైతిని గాని పయిరీతి ననేకవిషయముల నీద్వ్యర్థిప్రబంధము నిర్ణయించుచున్నది.

---

## ౫-వ ప్రకరణము.

### శ్లేషకావ్యములు.

భీమకవి రాఘవపాండవీయ మను నొకద్వ్యర్థికావ్యమును జేసినట్లు ప్రతీతి కలదు; కాని యది యిప్పటికిని నెచ్చటను బయల్పడిన ట్లగపడదు.

"ఉ. భీమన తొల్లి చెప్పె నను పెద్దలమాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గాన రటుండనిమ్ము నా
నామహితప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁగల్గుటఁ
నామదిఁదద్ద్వయార్థకృతినై పుణియుంగలదంచు నెంచెదఁ?" (రా. పాం 1-11)

అని యిట్లు పింగళిసూరకవియుఁ బైరీతినె రాఘవపాండవీయముఁ జెప్పికొనియున్నాఁడు. మఱియుఁ జిక్కయజ్వకు నించుమించుగా సమకాలికుఁ డనఁదగు నథర్వణాచార్యుఁడు "శ్లేషే సఖండ నిర్ఖండద్వ్యే శ్లేశనం కుత్రచిన్నతమ్" అనివ్రాయుటనుబట్టి చూడఁగా నాతనికిముందు శ్లేషకావ్య మొకటియయిన నుండియుండు నని యూహింపనగును.

మ. రా. శ్రీ. జయంతి. రామయ్యపంతులవారు వ్రాసినరీతిని (చూ. కవిజనాశ్రయపీఠిక.) భీమకవి తిక్కయజ్వాదులకన్నఁ బ్రాచీనుఁ డనఁ దగియున్నాఁడు. కాఁగా పింగళిసూరకవి పేర్కొనినభీమన రాఘవపాండవీయ మక్కాలమున నుండియుండవచ్చు ననియు నెట్లో యది యంతరించి యుండవచ్చు ననియు నూహించిన నూహింపవచ్చును. ఎట్లయినను నిప్పటికి బయల్పడియున్న శ్లేషకావ్యములలోఁ బింగళిసూరనార్యుని రాఘవపాండవీయమె మొదటి దనియు, నటులే యిటీవలఁ బుట్టిన శ్లేషకావ్యములకు మార్గదర్శక మయ్యె ననియుఁ జెప్పక తీరదు. సూరనార్యుని రాఘవపాండవీయమునకుఁ దర్వాతఁ బ్రస్తుత మగు రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానము జనించినది. అంతకంతకు నీద్వ్యర్థికావ్యముల యందభిరుచి మెండై సమర్థులగు మహాపురుషులచేత ననేకములగు ద్వ్యర్థికావ్యములును, నింకను త్ర్యర్థికావ్యములును రచింపఁబడినవి. పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయము, పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము, మంత్రిప్రెగడ సూర్యప్రకాశముగారి కృష్ణార్జునచరిత్రము, మృత్యుంజయకవి ధరాత్మజాపరిణయము మున్నగు ద్వ్యర్థికావ్యములును, నెలకూచి బాలసరస్వతి రాఘవయాదవపాండవీయము, నెల్లూరివీరరాఘవకవి యాదవరాఘవపాండవీయము, ఓరుగంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూపనారాయణీయము మున్నగు త్ర్యర్థికావ్యములును గవుల చరిత్రము మొదలగువానియం దుదాహరింపఁబడియున్నవి.

పై నుదాహరించిన శ్లేషకావ్యములకు మార్గదర్శకుఁడై పింగళి సూరనార్యుఁ డనేకమార్గములను ద్రొక్కియున్నాఁడు. కథపట్టులను సరిపెట్టుకొని తఱచుగా నర్థాన్వయశ్లేషముల నుపయోగించుకొనుచుండుట, తఱచుగా శ్లేషస్థలములం దుపయోగించు నానార్థకపదముల నేర్చుకొనుట, నిపుణముగ సంభంగశ్లేషములను నిల్పఁజాలుట, 'అనచిచ' 'ఖర్పరేశరి వా విసర్గలోపో వక్తవ్యః' అను మొదలగు పాణినిసూత్రముల నాధారముగాఁ జేసికొని ద్విత్వాద్విత్వస్థలములను నిర్వహించుకొనుట, (దేవర × న్యాయము=దేవరన్యాయము అని యొకపక్షమున 'దేవరః × న్యాయము = దేవరన్న్యాయము అని యొకపక్షమున 'పురః × స్ఫూర్తి= పురస్స్ఫూర్తి' అని యొకపక్షమున 'పుర + స్ఫూర్తి=పురస్ఫూర్తి' అని యొకపక్షమున) మున్నగు ననేకమార్గములకు సూరనార్యుఁడే మార్గ

దర్శి యయియున్నాఁడని చెప్పవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నట్టిశ్లేషరచనములోని బందుకట్లను నానార్థకపదములయు, సభంగశ్లేషానుకూలపదములయుఁ బట్టికలను, వానియుత్తరోత్తరానుసరణములను నిట విపులముగాఁ జూపక యట్టిశ్లేషలభేదములను మాత్రము చూపుచున్నాను.

"శబ్దైస్స్వభావా దేకార్థై శ్శ్లేషోఽనేకార్థవాచనమ్"

(సాహిత్యదర్పణము. 10. పరి. 704. కారి)

"శ్లిష్టైః పదై రనేకార్థాభిధానే శ్లేష ఇష్యతే,
వర్ణప్రత్యయలింగానాం ప్రకృత్యోః పదయోరపి.
శ్లేషా ద్విభక్తివచనభాషాణా మష్టధా చ సః". (సాహి. 10. 643.)
"పుల స్త్రిధా సభంగోఽథాభంగ స్తదుభయాత్మకః" (సాహి. 10-644.)

అని యిట్లు శ్లేషభేదములు సాహిత్యదర్పణమునఁ జెప్పఁబడియున్నవి.

"ప్రకృతాప్రకృతోభయగత ముక్తం చే చ్ఛబ్దమాత్రసాధర్మ్యమ్,
శ్లేషోఽయం శ్లిష్టత్వం సర్వత్రాప్యద్వయే నాంత్యే"

(ప్రతాపరుద్రీయము. 8 ప్రక. 59. కారి.)

అని యిట్లు ప్రతాపరుద్రీయమునందును

"నానార్థ సంశ్రయ శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాత్మకః." (26. అలం.)

అని యిట్లు చంద్రాలోకమునందును వేఱొకరీతిని శ్లేషభేదము లుదాహరింపఁబడినవి. పైనుదాహరించిన శ్లేషభేదములకెల్ల నుదాహరణములు చూపిన గ్రంథవిస్తర మగు నని తలఁచియు, నాయా యుదాహరణములు తత్తద్గ్రంథములం దుదాహరింపఁబడి యుండుటచే నవి సుప్రసిద్ధములని తలఁచియు నిట నుదాహరింపనైతిని.

ఇంక రాఘవపాండవీయమునఁ బింగళిసూరన యీశ్లేషభేదములను వేఱొకరీతిని బేర్కొనియున్నాఁడు. వాని నిట నుదాహరించెదను.

"సీ. ఆంధ్రభాషాసంస్కృతాఖిభాషాశ్లేష, యొక్కొక్కచోట నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట నర్థశ్లేష యొక్కొక్కతతిని ముఖ్య
గౌణవృత్తిశ్లేష ఘటన యొక్కొకతతి, నర్థాన్వయము వేఱె యగుచు నునికి
శబ్దాన్వయవిభేదసంగతి యొక్కొక, తతి నివి యొక్కొక్కతఱిని రెండు
మూఁడు గూడుటయు నన సముజ్జ్వలముగ, నాకుఁ దోఁచినగతిఁ జెప్ప పోక లఘుర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ, జూచునుమతుల కేర్పడ నాచరింతు"

(రాఘ. పాం. 1-17.)

### ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష:

"తే. గీ. ...పుణ్యజనపాళి, కాసమసనంబు...." (హ. న. 5, 6.)

ఇందు 'పుణ్యజనపాళికి=రాక్షసపంక్తికి; ఆస = ఆశ; మసనంబు = స్మశానము' అను హరిశ్చంద్రకథాపక్షమున 'ఆస మసనంబు' అను నాచ్ఛికములును 'పుణ్యజనపాళికా=పవిత్రజనసమూహముయొక్క, సమసనంబు=ఏకత్రావస్థానముగలదానిని' అను నలకథాపక్షములో 'సమసనంబు' అను సంస్కృతపదమును నొక్కచో విఱుగుచుండుటంజేసి యట సంస్కృతాంధ్రశ్లేష యనఁదగును.

### శబ్దశ్లేష

పయి యుదాహరణస్థలమునందె 'సమసనంబు'అని యొకపక్షమునందును, 'ఆ సమసనంబు' అనియొక పక్షమునందును విఱుగుటచే నందు శబ్దశ్లేష మనఁదగును. అట్టిదానినే యాలంకారికులు సభంగశ్లేష మని వ్యవహరింతురు.

### అర్థశ్లేష

పయి యుదాహరణమునందే 'పుణ్యజనపాళికా' అనుచో శబ్దభేదము లేక రెండుపక్షములందును నొక్కశబ్దమే నిలిచి యర్థద్వయము గలిగియుండుటచే నది యర్థశ్లేషము. దానినే యాలంకారికు లభంగశ్లేష మని వ్యవహరింతురు.

పయి నుదాహరించిన శబ్దార్థశ్లేషస్థలములు రెండిటను శబ్దశ్లేషమే యని దర్పణకారాదులమతము. ఆ రెండును నర్థశ్లేషములే యని చంద్రాలోకకువలయానందకారాదుల యభిప్రాయము.

### ముఖ్యగౌణవృత్తిశ్లేష.

"చ. ... ... ... ... తదంతరసంతతరక్షణోన్నిష
త్తరులఁ బరాభవించిన యుదగ్రబలోద్ధతి కేమి చెప్పుదుణ్." (హ. న. 2-89)

ఇందు నలకథాపక్షమున 'రక్షణోన్నిషత్తరులన్=రక్షకభటులను; పరాభవించిన=వంచించిన' అని యిట్లు 'పరాభవించిన' అనుదానికి ముఖ్యార్థము వెలయుచుండఁగా హరిశ్చంద్రకథాపక్షమున 'తరులన్=చెట్లను' పరాభవించిన=చెఱచిన" అని యిట్లు గౌణార్థమును గ్రహింపవలసియున్నది గాన నియ్యది ముఖ్యగౌణవృత్తి యనఁదగును.

## అర్థాన్వయము వేఱే యగుచు నునికి

### అర్థాన్వయభేదశ్లేష.

"మ. భవదీయానుచరుండఁ దావకకృపాపాత్రుండ మీమౌళిల ని
ట్లవుఁ గా దంచు వచింపనేర్తుగా...." (హ. న. 2-83.)

పయివాక్యమునందలి పదములకు బదులుగ వానివానిపర్యాయ పదములకు నిల్పినను శ్లేషకు భంగము లేదు. అందలియర్థము రెండు కథలపక్షములందును వేర్వేఱుగా నన్వయించుచున్నది. కావున నిది యర్థాన్వయశ్లేష యనఁదగియున్నది. వెనుక నుదాహరించిన శబ్దార్థశ్లేష స్థలములు రెండిటను శబ్దశ్లేషమే యని సిద్ధాంతము చేసినవాఁ డగుటచే దర్పణకారుఁ డీయర్థాన్వయశ్లేషమునర్థశ్లేష మనియే వ్యవహరించెను.

"యత్ర శబ్దపరివృత్తేఽపి న శ్లేషత్వఖండనా తత్ర వార్థశ్లేషః" అని యిట్లు శబ్దశ్లేషాలంకారఘట్టమున సిద్ధాంతము చేసి యర్థాలంకార ప్రకరణములో "శబ్దై స్స్వభావా దేకార్థై శ్శ్లేషోఽనేకార్థవాచనమ్" అని యర్థానికి లక్షణము చేసియున్నాఁడు. "స్వభావాదేకార్థై రితి శబ్ద శ్లేషా ద్వ్యవచ్ఛేదః" అని యిట్లు స్వారస్యము వ్రాసియున్నాఁడు. ఇట్టి శ్లేషమును ఘటించుట కొందఱకు సుసాధముగాన సామాన్యముగా నియ్యది ద్వ్యర్థికావ్యములందుఁ దఱుచుగా వ్యాపించియుండును. ఇట్టి స్థితిలో "కవి కల్పించిన యితరభేదకల్పనలలో దేనిలోనైనం గలయని యర్థాన్వయభేదకల్పన కుదాహరణము మృగ్యమని యూహించుచున్నాఁడను" అని యిట్లు శతఘంటము వేంకటరంగశాస్త్రులవారు రాఘవపాండవీయోపోద్ఘాతమున వ్రాయుట (1910 సం. వావిళ్లవారి ప్రతి) మిక్కిలి వింతగా నున్నది.

### శబ్దాన్వయవిభేదశ్లేష.

"చ. తనరఁగఁ జిత్రభానుఁడును దండధరుండుఁ బ్రచేతసుండు నై
కనలి నరోపతాపకరగాఢతరాంబకలోలవృత్తి దఁ
జెనకొని రాఁ దపోధనులు విస్మయ మంద మహోచితప్రచా
రు నలవమంథరాధిపుని మౌళిఁ గనుంగొనియెన్ రయంబునన్." 

(హ. న. 2-79)

ఇందు 'తపోధనులు వెనుకొనిరాఁగా' అని యొక పక్షమునందును 'తపోధనులు విస్మయమందఁగా' అని యొకపక్షమునందును నిట్లు శబ్దముల యన్వయము భేదించియుండుటచే నియ్యది శబ్దాన్వయభేదశ్లేష మనఁదగును

పయి నుదాహరించిన జాతుల శ్లేషలు రెండుమూఁడేసి యొక్కొక్కపద్యమునందే యుండుటయు ననేకస్థలములందుఁ గలదు; గాని విస్తరభీతిచే నుదాహరింపలేను. ఇంకను వానిలో నవాంతరభేదకల్పనము జేయ నగును గాని తలవెండ్రుకలను జీల్చినట్లుగా నిట్టి సూక్ష్మభేదశతకల్పనము చేయుటవల్లఁ బ్రయోజనవిశేష మగపడకుండుటచే నింతతో విరమించుచున్నాఁడను.

"శా. రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగునఁగబ్బం బద్భుతంబంద్రు ద
త్తుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

(రాఘ. పాం. 1-10)

అను (పింగళిసూరనార్యుఁడు చెప్పిన) రీతిని ద్వ్యర్థి కావ్యరచనము మిక్కిలి యద్భుతకావ్య మనుటకు సందేహము లేదు; కాని యిందుఁ బ్రతిబంధాతిరేకముచే స్వేచ్ఛగాఁ బ్రాబంధికరీతులను జూపుట గాని రసౌచిత్యాదులను సరిగాఁ బాటించుటగాని కవికి దుష్కరమే యని చెప్పక తీరదు.

"స్యాత్తా మదోషాశ్లేషాదా నిహతార్థా ప్రయుక్తతే" అను నాలంకారికాభ్యనుజ్ఞయు శ్లేషకవనమున సుప్రసిద్ధార్థక పదాదులను బ్రయోగించుట దుశ్శక మనువిషయమునె వెల్లడించుచున్నది. అక్కారణమున శ్లేషకావ్య మొకవిధ మగు గరిడివంటి చిత్రప్రదర్శన విశేష మని చెప్పనొప్పును. ప్రతాపరుద్రీయమున కపరావతార మగునరసభూపాలీయ మను నలంకారశాస్త్రమును, బ్రాబంధికమార్గములకుఁ బ్రథమోదాహరణమును రసమున కునికిపట్టును ననఁదగు వసుచరిత్రమును నావలను రచించి యీచిత్రప్రదర్శనమును మాత్ర మేలచూపరాదని తలఁచి కవి దీనినిరచించియుండు నని తోఁచుచున్నది. ఇంతియకాక తనకు సమకాలికుఁ డగు పింగళిసూరన పలికిన —

"శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపఁగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహో యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగునఁ గబ్బం బద్భుతం బంద్రు ద
త్తుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.
ఉ. ఈమన తొల్లి చెప్పె నని పెద్దలమాటయె కాని యందు నేఁ
డేమియు నేరుపడ న్నిలుచు టెవ్వరుఁగాన రటుండనిమ్ము నా
నామహిత ప్రబంధరచనాఘనవిశ్రుతి నీకుఁ గల్గుటన్
నామదిఁ దద్ద్వయార్థకృతినై పుణియుం గల దంచు నెంచెదన్."

(రా. పాం. 1-10, 11.)

అను ప్రగల్భములకు శ్లేషానుప్రాసచక్రవర్తి యగు రామరాజభూషణునివంటి మహాసమర్థుఁ డెట్లు శక్తునిరీతిని సైఁచి యుండఁగల్గును? మఱియు భాషానియమనవిషయమున నిట్టికావ్యములు మిక్కిలిగ నుపయోగించునని యీవఱకు సోదాహరణముగఁ జూపియున్నాను. (చూ. 4. ప్ర.)

బ్ర. శ్రీ. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులవారు కళాపూర్ణోదయమును గుఱించి వ్రాయుచు రాఘవపాండవీయము, హరిశ్చంద్రనలోపాఖ్యానమునకుఁ దర్వాతి దని యభిప్రాయపడి "రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యాన మనుద్వ్యర్థికావ్యము నిదివఱకే వ్రాసియున్నాఁడు. దానినిజూచియే సూరకవి యీగ్రంథమును (రాఘవపాండవీయమును) రచించియున్నాఁడు" అని యిట్లు వ్రాసియున్నారు. అట్లె "వసుచరిత్రము తిరుమలదేవరాయనికాలమునందు విరచింపఁబడి యుండఁగాఁ గళాపూర్ణోదయము తిరుమలదేవరాయని తరువాతివాఁ డగు శ్రీరంగరాయలకుఁ దరువాతివాఁ డగు వేంకటపతిరాయలకాలమునకుఁ జివర విరచింపఁబడినది. వసుచరిత్రకృతిపతి యారవీటిబుక్కరాజునకు నాలవపురుషుఁ డై యుండఁ గళాపూర్ణోదయకృతిపతి యాఱవపురుషుఁ డై యున్నాఁడు. కానఁ గళాపూర్ణోదయము వసుచరిత్రముతరువాత రచింపఁబడిన దనుట నిర్వివాదాంశము" అనియు నిట్లు వీరు తమవాదమున కుపష్టంభకముగా వ్రాసి కృష్ణరాజతిరుమలరాజుల వంశవృక్షము నీక్రిందిరీతిని వ్రాసియున్నారు.




కృష్ణరాజు
(కళాపూర్ణోదయ కృతిపతి.)

పయి వంశవృక్షమువలన నార్వీటిబుక్కరాజునకిద్దఱుభార్యలనియుఁ గళాపూర్ణోదయకృతిపతి యందొక్కతె కోవలోనివాఁడనియు, వసుచరిత్ర కృతిపతి వేఱొక్కతెకోవలోనివాఁడనియు విశదమగుచున్నది గదా! బుక్కరాజు మొదటిభార్య సంతతిలో మనుమనిఁగాంచినవెనుక రెండవభార్యను బెండ్లియాడియుండిన నుండవచ్చును. అక్కారణమున మొదటిభార్యవంశములోని యాఱవపురుషుఁడును రెండవభార్యవంశములోని నాల్గవపురుషుఁడును సమకాలికులు కావచ్చును. ఇంతియగాక యానడుమ నున్నతరములతోఁగూడ సంతతులు గలుగుటలోఁ గాలవ్యత్యాసము సంభవించుటచే నట్టివైషమ్యము రావచ్చును. ఇప్పుడును నాపాటితరముల హెచ్చుతగ్గులు గలకుటుంబము లనేకము లగపడుచున్నందున నయ్యది యొకయసంభావ్యవిషయము కానేరదు. వేయేల? ఆర్వీటిబుక్కరాజున కాఱవపురుషుఁ డగుకళాపూర్ణోదయకృతిపతికిసవతితల్లికొడుకగు తిమ్మరాజు తిరుమలరాజుకాలమగు 1౫౮౦వ సంవత్సరమున రాజ్యము నేలుచుండె నని శ్రీబ్రహ్మయ్యశాస్త్రులవారును నంగీకరించి "కళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణరాయలయన్న యగుతిమ్మరాజు శాలివాహనశకము 14౯0 అనఁగా క్రీస్తుశ. 1౫68వ సంవత్సరమునఁ

బరిపాలనము చేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది." అని యిట్లు వ్రాసి యున్నారు. కాన వారు తలఁచినట్లు తమ్ములవ్యత్యాసము కృష్ణరాజ తిరుమలరాజులసమకాలికత్వమునకు బాధకము కానేరదు. తిరుమలరాజు నకు సమకాలికుఁ డగుతిమ్మరాజునకు సవతితల్లికొడుకగుకళాపూర్ణోదయ కృతిపతియు నక్కాలమునకుఁ బెద్దవాఁడై యయియుండవచ్చు ననుటయు విరుద్ధము కానేరదు. మఱియుఁ గృష్ణరాజునకుఁ గృతియిచ్చిన పింగళిసూరనార్యుఁడును గృష్ణరాజునకు సమానవయస్కుఁడే యై యుండవలయు నన్ననియమము లేదు. అతఁ డావలకే కళాపూర్ణోదయమును జేసియుండిన నుండవచ్చును. ఇంతియకాక కృష్ణరాజు తనయన్న యగు తిమ్మరాజురాజ్యకాలములోనే కళాపూర్ణోదయమును గృతిపొందనను బొందియుండవచ్చును. ఈవిషయమునకు శ్రీబ్రహ్మయ్యశాస్త్రులవారు వ్రాసిన, "కళాపూర్ణోదయములోఁ గృష్ణమరాజునన్నయగుతిమ్మరాజు విశేషముగా వర్ణింపఁబడియున్నాఁడు"అను వ్రాఁతయు సహకారి కాఁగలదు.

ఇఁకఁ దిరుమలతాతాచార్యులు వసుచరిత్రకృతిపతి యగుతిరుమల దేవరాయలకుమారుఁ డగు వీరవేంకటపతిరాయలకాలములోనివాఁడగుటచేతను, నాతాతాచార్యులవంశములోఁ బుట్టినసుదర్శనాచార్యుని పుత్త్రుడగుశ్రీనివాసాచార్యుఁడు కళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణరాజునకు గురు వని కళాపూర్ణోదయమునఁ జెప్పఁబడియుండుటచేతను నీకృష్ణరాజు వీరవేంకటపతిరాయలకును నంతిమదశలోనివాఁ డనక తీరదని వీరు వేఱొక యుపపత్తిని జూపియున్నారు. అదియు నంతప్రబలప్రమాణముగ నగపడదు. వృద్ధుఁ డగుతాతాచార్యుఁడు వీరవేంకటపతిరాయల యాస్థానములో నున్నపు డాతని మనుమఁడు కృష్ణరాజునకు గురు వయియున్నంత మాత్రమున వీరవేంకటపతిరాయలకంటెఁ గృష్ణరాజు చిన్నవాఁ డని యంగీకరింపవలయునా ? అరయ నరయ నాకప్పు డాతనికంటె నితఁడు పెద్దవాఁడే యయినం గావచ్చు ననుటకు బాధక మగపడదు. తాత చిన్న వానివద్ద నుండఁగూడదా? మనుమఁడు పెద్దవానికిగురువు కాఁగూడదా? ఇఁక

"క. విశ్రుతతిరుమల తాతా,ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జ శ్రీనివాసగురుచర, ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్."

అను కళాపూర్ణోదయ పద్యములోని 'తాతార్యాన్వయ' శబ్దము శ్రీనివాసశబ్దమునకు విశేషణ మనఁదగియుండఁగా సుదర్శనాచార్య

శబ్దమునకు విశేషణము చేసి వీరు మఱింతదీర్ఘకాలవ్యవధానమును జూపఁ దలఁచిరి గాని యట్లు యయినచో వీ రంగీకరించినరీతిని వీరవేంకటపతి యంతిమదశయందును గృష్ణరాజు జీవించుట దుర్ఘటమగును.

వేయేల? కళాపూర్ణోదయమునకుఁ బూర్వగ్రంథ మగురాఘవపాండవీయకృతిరచనయే గాక తత్కృతి ప్రదానముపయితము తల్లికోట యుద్ధమున (1564 క్రీ. శ.) జరిగిన విజయనగరవిధ్వంసమునకుఁ బూర్వకాలికమే యని రాఘవపాండవీయములోని యీ క్రిందిపద్యము సూచింపఁ గలదు.

క. వడిగలతనాన నీగిని, విడిముడిపసఁ బ్రాభవమున విజయనగరిలోఁ
గడు నెన్న నేర్వఁ గల మే, ల్నడకల పెదవేంకటాద్రినరవరుఁ డొప్పున్"
(రాఘ. పాం. 1-95)

ఇఁక వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానకృతులు విజయనగరవిధ్వంసానంతరభావు లనియు, వానియందు రాఘవపాండవీయమునందువలె విజయనగరము తడవఁబడకుండుటయేగాక విజయనగరవిధ్వంసము సయితము సూచింపఁబడియున్న దనియు నీవఱకు నేను (చూ. పు. 7-11) రుజువుచేసియే యున్నాను. కావున హరిశ్చంద్రనలోపాఖ్యానము రాఘవపాండవీయమునకుఁ బరకాలిక మనుటకు సందేహము లేదు.

మఱియు వెనుక నుదాహరించియున్న (చూ. 124. పు) రాఘవపాండవీయములోని

"శా రెండర్థంబుల... ...
"ఉ భీమన ... ... } (రా. పా. 1-10-11.)

అను నీ రెండుపద్యములును రాఘవపాండవీయప్రాథమికత్వమును వెల్లడింపఁజాలియున్నవి. సమకాలికుఁడును, సుప్రసిద్ధుఁడును నగురామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యాన మావఱకే యుండియుండిన యెడలఁ బింగళిసూరన పయిరీతిని నీవఱ కెక్కుడను ద్వ్యర్థికావ్యము లేనేలే దనియుఁ దానే దానిరచనకు సమర్థుఁ డనియుఁ జెప్ప సాహసించునా?

ఇంతియ కాక వర్ణనాంశము లంతగా లేని రాఘవపాండవీయమునం గలకొఱఁతలను దీర్చుచు రామరాజభూషణుఁ డష్టాదశవర్ణనలతో భూషిత మగుహరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించెననియు ముస్ముందు నేను రుజువుచేయుచున్నాను. ఆవిషయము సయితము హరిశ్చంద్రనలో

పాఖ్యానముయొక్క రాఘవపాండవీయానంతరభావిత్వమును వెల్లడింపఁ జాలియున్నది. మార్గదర్శకగ్రంథముకన్నఁ దదుత్తరగ్రంథము కొన్ని మెఱుఁగులతోఁ గూడియుండుట సహజముగదా!

శ్లేషకావ్య ముత్తమకావ్యద్వయ మనఁ దగు.

"ఉ. వారిచరిత్రముల్. (హ.న.1-52.)

అను పద్యము వొప్పున హరిశ్చంద్రనలోపాఖ్యానములోని యర్థమును రెండును సమబలములే గాన నవి శ్లేషార్థములే యనఁదగును. శ్లేషకును ధ్వనికిని గలభేదము నారచించిన వసుచరిత్రవిమర్శనమున విపులముగాఁ జూపియున్నాను. (చూ. వసు. విమ. 5 ప్ర. 84 పు) కావ్యములలో ధ్వనిప్రధానకావ్య ముత్తమకావ్య మనియు, శ్లేషకావ్యము చిత్రకావ్య మగుటచే ననుత్తమ మనఁదగు ననియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. నిపుణముగాఁ బరికించినచో శ్లేషకావ్యమునందలియర్థద్వయమునందును స్ఫురించుధ్వనులచే నక్కావ్యము ధ్వనిప్రధానకావ్యద్వయరూపమై యొప్పు నని నాయభిప్రాయము.

హరిశ్చంద్రనలోపాఖ్యానములోని హరిశ్చంద్ర నలపరార్థముల యందు వేర్వేఱ నున్నశబ్దార్థశక్తిమూలకధ్వనులును వీరశృంగారాదిరసములును శ్లేషమహిమచే స్ఫురించు నుపమాధ్వనులును దాని కనన్యసాధారణోత్తమకావ్యత్వమును బ్రసాదింపఁజాలియుండును. అట్లే హరిశ్చంద్రనలకథారూపకావ్యద్వయమందును—

"నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయ వర్ణనమ్,
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః,
విప్రలంభో వివాహ శ్చ కుమారోదయవర్ణనమ్,
మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి,
ఏతాని యత్ర వర్ణ్యన్తే త న్మహాకావ్య ముచ్యతే,
ఏషా మష్టాదశానాం యైః కైశ్చి దూన మపీష్యతే"

(ప్రతాప. కావ్య. 65. కారి.)

అను నష్టాదశవర్ణనములును యథాయోగముగాఁ దక్కిన రాఘవపాండవీయాదిద్వ్యర్థి కావ్యములందువలెఁ గాక యీం దేకార్థిప్రబంధమునందువలె విపులముగను మనోహరముగను వర్ణింపఁబడియున్నవి.

కావున శ్లేషార్థద్వయసత్త్వ ముత్తమకావ్యతాసంపాదకము కాకపోయినను నట్టి యర్థద్వయము నందును నుండు పై నుదాహరించిన రీతులుగల ధ్వనిప్రభృతులు దీని కుత్తమకావ్యత్వమును సంపాదింపఁ జాలియుండుననుటకు సందేహము లేదు. ఈసందర్భమున నిందుఁ గల యుత్తమకావ్యలక్షణము లగు ధ్వనిప్రభృతులను దిఙ్మాత్రముగ నుదాహరింపఁదలఁచి సామాన్యముగ నిక్కావ్యమెల్ల ధ్వనిప్రచురమైయున్న దని ఋజువుపఱుటకై మొట్టమొదటిపద్యమునే ముందుగ నుదాహరించుచున్నాను.

"తే.గీ. అలరు మణి ... ... ... మగుచు" (హ. వ. 1-53)

ఇందుఁ గథాద్వయమునందును వప్రోన్నత్యాతిశయము వ్యక్తమగుచున్నది. అశ్లిష్టపక్షద్వయమునందును గలశిరోభూషణత్వారోపము భూమియందు నాయికాత్వమును భూగతపురములందుఁ దన్నాయికాధృతభూషణత్వమును ధ్వనింపఁజేయుచున్నది. పైధ్వనులవలన వర్ణ్యశ్రీపురికి భూగతసకలనగరశోభాతిశాయిత్వము ధ్వనితమగుచున్నది. వర్ణ్యశ్రీపురము జయసంపదల కునికిపట్టని చెప్పుటచే జయసంపదలు తక్కినపురములందువలెఁ జంచలములుగాక వర్ణ్యనగరమున శాశ్వతములై (స్థిరములయి) నెలకొనియుండు ననువిషయము ధ్వనితమగుచున్నది. దానిచేఁ బురమందలి వీరభటులయొక్కయు, పురాధిపతులయొక్కయు సనాతనమగుసిరుపమానపరాక్రమము ధ్వనితమగుచున్నది. మఱియు వర్ణ్యనగరమునకు నగడితభూషణమునంటి దనుటచే నగడితయందు రశనారూపభూషణత్వము ధ్వనించుచున్నది. పైపద్యమునందలి ప్రకృతశ్లేషాలంకారము మహిమచే వర్ణ్యనగరములకుఁ బరస్పరౌపమ్యము ధ్వనితమగుచున్నది. పయిరీతిగలధ్వను లిక్కావ్యమున నసంఖ్యాము లయి యలరారుచున్నవి. ఇతరసద్వ్యర్థికావ్యకర్తలవలెఁ గథాద్వయనిర్వహణమాత్రపరతంత్రుఁడు గాక శ్లేషానుప్రాసచక్రవర్తి యగు రామరాజభూషణుఁడు సునాయాసముగాఁ గథాద్వయమును నిర్వహించుచుఁ దత్తదుచితస్థలములం దెల్ల నేకార్థిమహాకావ్యమునందువలెనే యష్టాదశవర్ణనాదికమును సయితము మతిమనోహరముగాఁ జేయుచువచ్చెను. అట్టివర్ణనములను నిర్వహించుటలోఁ గవి కథాద్వయమునందును గొన్నియెడల వస్త్వైక్యమును సంఘటించుకొని వర్ణించుటయుఁ గొన్నిచోట్లఁ బరస్పరసామ్య

ముగల విభిన్నవస్తువులను జతపెట్టి వర్ణించుటయుఁ, గొన్నిస్థలములం దేమాత్రమును సంబంధములేని విజాతీయవస్తుద్వయమును నింకను బర స్పరవిభిన్నధర్మములు గలవస్తుద్వయమును గథపట్టులను (హ. న. 2-54, 74, 5-23, 32, 50 పద్యములను జూచునది.) దనశ్లేషకవితాపాట వమున జోడించి వర్ణించుటయు జరుపుచు వచ్చెను. అట్టివర్ణనములలోఁ గొన్ని యేకార్థకావ్యమునందలి వర్ణనములవలె మనోహరముగను గొన్ని యతోధికమనోహరముగను నున్న వని చెప్పుటకు సందేహములేదు. అట్టి వానిలోఁ గొన్నిటి నిటఁ జూపుచున్నాను.

## వేఁటవేషము.

హరిశ్చంద్రుని వేఁటసందర్భమును నలునియుద్యానవిహారపుసంద ర్భమును జోడించి కవి యిందు మిక్కిలిచమత్కారముగా వర్ణించియు న్నాఁడు. ఈసందర్భమున నలుఁడు వాహావాహోచితవేషమును ధరించె ననిమాత్రము నైషధమునఁ జెప్పఁబడియున్నది.

"శ్లో. చల న్నలంకృత్య మహారయం హయం, స వాహవాహోచితవేషపేశలః,
ప్రమోదనిష్పందతరాక్షిపక్ష్మభి, ర్వ్యలోకి లోకై ర్నగరాలయై ర్నలః"
(నైష. 1-26)

"తే.గీ. ప్రమదనిష్పందతరనేత్రపద్మ లగుచుఁ, బౌరజనులు విలోకింపఁ బ్రమదలీల
సముచితానల్పపరివారసహితుఁ డగుచు, నవనినాథసుతుండు వాహ్యాళివెడలె"
(శృం. నై. 1-88)

పయి నైషధశ్లోకమున కాంధ్రీకరణ మగు పయిశృంగారనైషధ పద్యమున 'వాహావాహోచితవేషపేశలః' అనుదానిని శ్రీనాథుఁడు స్పృ శించియే యుండలేదు. అట్లే హరిశ్చంద్రకథాపక్షమునందును హరి శ్చంద్రుఁడు వేఁటకేఁగునపు డాతఁ డట్టివేఁట కుచిత మగు వేషమును ధరించె ననిమాత్రమే గౌరనకవియుఁ జెప్పియున్నాఁడు.

"ద్వి. పాటించి కన్నులపండువు గాఁగ
వేఁటసింగారంబు వెలయఁ గావించి" (గౌ. హ. ద్వి. పూ. 558)

రామరాజభూషణుఁ డన్నితో మూలభూతము లగు గౌరనశ్రీహర్షుల వాక్యములకు వన్నెవచ్చునట్లుగా హరిశ్చంద్రకథాపక్షమున వన్యమృగ ములు విశ్వసించి సమీపస్థితి నంగీకరించునట్లుగ వన్యమృగాద్యవయవ చిహ్నాలుగలవేషమును హరిశ్చంద్రుఁడు ధరించెననియు నలకథాపక్ష

మున విరహాతురుఁడై వినోదార్థ ముద్యానమున కేఁగువాఁడుగాన నలుఁడు తన్ను బీడించుమన్మథునిసామగ్రి నిరసించు వేషమును ధరించె ననియు మిక్కిలి చమత్కారముగను సహజముగను వర్ణించియున్నాఁడు.

"సీ. రోదమతుమ్మెదకప్పఁ ... సైన్యములు గొలువ." (హ. న. 2-18)

రాఘవపాండవీయమునఁ బాండు దశరథులు వేఁట కేఁగినసందర్భమున నిట్టివర్ణనము లగపడవు. అట్లే వారి వేఁటకేఁతియు నందు వర్ణింపఁబడలేదు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమందు నన్నెనో యట్లుగాక హరిశ్చంద్రుని వేఁటవర్ణనమును నలకథలోని నలునుద్యానవిహారవర్ణనముతో జోడించి మిక్కిలి చమత్కారముగాఁ గవి వర్ణించియున్నాఁడు (చూ. హ. న. 1 ఆ. 21 మొ 30 వ.)

హరిశ్చంద్రుఁడు వసిష్ఠునిదర్శనము చేయు సందర్భమునందలి వసిష్ఠాశ్రమవర్ణనముతో నలకథలోని క్రీడాసరోవర్ణనమును జోడించి రామరాజభూషణుఁడు మిక్కిలి మనోహరముగా వర్ణించియున్నాఁడు.

"సీ. అతిబహుళహరి ... ... మనుజవిభుఁడు." (హ. న. 2-30)

ఈసందర్భమునందు హరిశ్చంద్రుఁడు దర్శించినవసిష్ఠుని వర్ణనమును, నలుఁడు చూచిన సువర్ణపక్షరాజహంస వర్ణనమును జోడించి కవి మిక్కిలిమనోహరముగా వర్ణించెను. గౌరనకవి యీసందర్భములో వసిష్ఠుని వర్ణింపనే లేదు.

"అమ్మునివరుఁ గాంచి యడుగుల కెఱఁగి" (గౌ.హ.ద్వి.పూ.647.)

అని మాత్రమే చెప్పియున్నాఁడు. శంకరకవి యీస్థలమునందు వర్ణించినవసిష్ఠునివర్ణనమును మచ్చునకై యిట నుదాహరించెదను.

"మహాస్రగ్ధర. వరరుద్రాక్ష ... ... వసిష్ఠుఁ." (శం. హ. 2-32.)

ఈసందర్భములో శ్రీహర్షుఁడు వర్ణించిన రాజహంసవర్ణనమును దానికి శ్రీనాథుఁడు చేసిన యాంధ్రీకరణము నుదాహరించి పైవర్ణనలకును రామరాజభూషణుని ద్వ్యర్థివర్ణనమునకును గలతారతమ్యమును జర్చించి చూపుచున్నాఁడను.

"శ్లో. పయోధిలక్ష్మీముషి కేళిపల్వలే రిరంసుహంసీకలనాదసాదరమ్,
స తత్ర చిత్రం విచరంత మంతికే హిరణ్మయం హంస మబోధి నైషధః."
(నై. 11-17.)

"శ్లో. అ థావలంబ్య క్షణ మేకపాదికాం తదా నిదద్రా వుపపల్వలం ఖగః,
స తిర్యగావర్జితకంధర శ్శిరః పిధాయ పక్షేణ రతిక్లమాలసః." (నై. 1-121)

"శ్లో. సనాళ మాత్మాననిర్జిత ప్రభం హ్రియా నతం కాంచన మంబుజన్మ కిమ్,
అబుద్ధ తం విద్రుమదండమండితం స పీత మంభః ప్రభుచామరం చ కిమ్"
(నై. 1-122)

"సీ. విలసితజంబాలపులినభాగమునను, ద్దండపద్మాతపత్రంబునీడఁ
గమలకాండకఠోరకంటకాంకురపంక్తి, నొయ్యన కంధరం బొరసికొనుచు
నొంటికాలను నిల్చి యూర్మిమారుతములఁ, జిగురుఱెక్కల జేకు లెగయుచుండ
విశద మై పక్షతిద్వితయంబు వెడ జాఱఁ, జంచు లోకించు కొకుంచితముగ
తే.గీ. వరుణరాజున కిడినచామరమువోలెఁ, జొడవుమిగిలిన వెలిదమ్మిపువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రితనేత్ర మైన, రాజహంసంబుఁ గాంచె నారాజసుతుఁడు."
(శృం. నై. 1-98)

"సీ. పరమాత్మ వాసనా ... ... నాచక్రవర్తిఁ గనియె" (వా.న.2-32.)

నిమీలితాక్షుఁడై తప మొనరించుచున్న వసిష్ఠునియాకృతిని జిత్రించుటయందును, బదముల పొందికయందును నేకార్థి యగుశంకర కవిపద్యము రామరాజభూషణుని ద్వ్యర్థిపద్యమునకు బొత్తిగాఁ దీసిపోయియున్న దనుట స్పష్టముగా నుండుటచే నావిషయము నిట విశదీకరింపలేదు.

ఇఁక రాజహంసవర్ణనవిషయమును విమర్శింపవలసియున్నది. సనాళ మగు కనకపద్మముతోడను విద్రుమదండమండిత మగు (రాజహంసకాళ్లెఱ్ఱగా నుండును.) పీతచామరముతోడను (వర్ణ్యమగునీరాజహంస సువర్ణపక్షములు గలది) నౌపమ్యము సిద్ధించుటకై శ్రీహర్షుఁడు కనకపక్షములు గలయారాజహంస మేకపాదిక నవలంబించి నిద్రించెననియుఁ, బద్మమువంటియుఁ జామరమువంటియు నాకారము సిద్ధించుటకై శిరము ముడుచుకొని దానిని ఱెక్కలతోఁ గప్పికొనియుండె ననియు వర్ణించియున్నాఁడు. మఱియు విరజల్లికొని వ్రేలుచు నుండు చామరముపోలిక సిద్ధించుటకై యాహంసము రతిక్లమాలస మై నిండ్రించుచు ముడిచికొనిన శిరస్సును గప్పికొనుటలో ఱెక్కలను జాఱవిడిచికొని యుండె నని హంసాకారమును జిత్రించెను. అట్లే యట్టియాకారమును జూపుటలో నుదాహరించిన యుపమానాంతర మగుసనాళపద్మమునై తము

నలముఖవిజిత మగుటంజేసి లజ్జావనత మైనదివోలె నొరగియుండె నని సరిపెట్టుకొనెను.

శ్రీనాథుని యాంధ్రీకరణమునం దిట్టిచాతుర్య మగపడదు. మీఁదుమిక్కిలిగఁ బయిహంసాకారస్ఫురణకు భంగము గల్గునట్లు పక్షాత పత్రమునీడను గమలకాండముతోఁ గంధర యొరసికొనుచుండె నని చెప్పియున్నాఁడు. మఱియు నాహంసము పైనుదాహరించినరీతి నొరగి యున్న బంగారపుఁ బద్మముఁవలె నున్నదని సంస్కృతగ్రంథమున నుండఁ గా శ్రీనాథుఁ డట్టియభిప్రాయమును స్ఫురింపకుండుటయే గాక యందు "పాడవుమిగిలిన" "పాడవు=ఔన్నత్యము, మిగిలిన=అతిశయించిన" అని విరుద్ధముగా నిలిపియున్నాఁడు. అరయ నీసందర్భమున శ్రీనాథుఁడు శ్రీహర్షునికల్పనమును జిత్రించుటకు యత్నించినట్లే యగపడదు. ఇంతి యగాక శ్రీనాథుఁడు "ఔచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహ రించియు" (శృం. నై. 3-201) అని తాను జేసిన ప్రతిజ్ఞచొప్పునఁ జామరము తెల్లగా నుండును గానఁ బీతచామరోపమానము సరికాదని తలఁచి కావలయును హంసఱెక్కలను విశదపక్షములని మూలవిరుద్ధ ముగాఁ జెప్పియున్నాఁడు. అందులకు సరిగా నుపమానాంతరమగు పద్మము సయితము తెల్లనిదే యని చెప్పఁదలఁచి "వెలిదమ్మిపువ్వుఁ బోలె"అని చెప్పియున్నాఁడు. అరయ నరయ నీసందర్భమున నిజముగాఁ దెలుపురంగును వర్ణించుటయె యుచితమగను స్వాభావికముగను నుండును గాని పెక్కుచోటులం దద్దానిని గనకపత్ర మని వర్ణించియుం డుటచే నిచ్చటమాత్రము వేఱొకరీతిని జెప్పుట సరికా దనితలఁచి శ్రీ హర్షకవి పీతచామరముతోఁ బోల్చి యభూతోపమ ననుసంధించి యున్నాఁడని గ్రహింపవలసియున్నది.

కొంద ఱిందు మూలములోని 'వెలిదమ్మి' అనుచో 'పొందమ్మి' యనియు 'విశద' అనుచో'విరళ' అనియుఁ బాఠాంతరములను గ్రహించి యున్నారు; కాని యాపాఠము లమాయికము లగుప్రాచీనముద్రణము లందును నేను జూచిన తాళపత్రగ్రంథములందును నగపడకున్నవి. మఱియు హంసమును బొందమ్మితోఁ బోల్చుటకే కవి యుద్దేశించియున్న యెడల నట్టియౌపమ్యము సరిపడున ట్లుపమానాంతర మగుచామరము నందలి సుప్రసిద్ధమగు తెలుపుస్ఫురింపకుండుటయును, బసుపురంగు భాసిల్లు

టకును మూలమున శ్రీహర్షుఁడు నిలిపియున్న పీతత్వవిశేషణము చామరమునకు సైతము నిలుపకుండునా ? పయిసంస్కర్త లద్దానిని సైత మేల సవరింపకుండిరో తెలియరాకున్నది. మఱియు వీరు పద్యమునే మార్చి క్రొత్తగఁ గవిత్వముచెప్పినఁ గుదురునేమో కాని యిట్టిచిన్నసవరణము వలనశ్రీహర్షుని కల్పనము శ్రీనాథునిపద్యమునుండి వ్యక్తపడదుగదా ? శ్రీనాథునివలెఁ గాక రామరాజభూషణుఁడు సంస్కృతనైషధములోని హంసమునె చిత్రించె ననుటకు సందేహము లేదు. కాని శ్లేషప్రతిబంధమున నట్టిహంసము నలముఖవిజితలజ్జావనతపద్మముఁ బోలె నున్నది యను నుపమానాంతరవాక్యమునుమాత్రము నిలుపఁజాలక యొక్కవరుణచామరౌపమ్యమునుమాత్రమె వచించెను. అట్లయినను బద్మౌపమ్యము సైతము స్ఫురింపఁజేయుచు నద్దానినే యాధారముగాఁ జేసికొని హంసాకారమునుజిత్రించి దానికిఁ జామరౌపమ్యమును సరిపెట్టెను. ఈపట్టున వ్యాఖ్యాతచేసిన యర్థముమాత్రము సరిపడదు. "పద్మాసనంబునన్-పద్మ=(సనాళ)పద్మమువంటి, ఆసనంబునన్=ఊనికితో" అని యర్థము చేయవలవలయును. అట్లయినఁ బద్మాకారము గలిగిన దనుటచే హంస యేకపాదిక నవలంబించి ముడిచికొనిన శిరమును ఱెక్కలతోఁ గప్పికొనియుండె నను నభిప్రాయము లభించును. హంసమును జామరముతో నుపమించుటచేతనే రామరాజభూషణున కిట్టియభిప్రాయము గలదనియు నట్టి యభిప్రాయమును "పద్మాసనంబునన్"అనుదానిచే వ్యక్తపఱిచె ననియు విశదమగుచున్నది. మఱియు నాహంసము 'కల్యాణ (బంగారు) దీప్తి' నొప్పుచుండె నని చెప్పి చామరమును 'హరివర్ణతాళాలి' యని చెప్పియుండుటచే శ్రీహర్షుఁడు కల్పించిన పీతచామరరూపాభూతోపమయే రామరాజభూషణునిచేత సైత ముద్దేశింపఁబడె నని స్పష్టపడుచున్నది. ఈ పట్టున సైతము వ్యాఖ్యాత వ్రాసిన యర్థము సరిగాలేదు. "అమరువిధిని (హరి=) బంగారురంగు గలవర్ణనీయమగు నతిలబ్ధమయినవర్ణము గలది" అని యర్థము చేయవలసియున్నది. వ్యాఖ్యాతవ్రాసిన యర్థమునుబట్టి చామరముయొక్కరం గేదో విశదపడనేలేదు. కవి హంసము బంగారురంగుగల దని విశేషించి చెప్పియుండఁగా నిచ్చట హరిశబ్దమును వేఱువిధముగ నన్వయించుట సరికాదుగదా! మఱియు నిందు రామరాజభూషణుఁడు హంసఱెక్కల వెండ్రుకలు సామాన్యముగా

నడఁగియుండునపు డపి చామరోపమత్వమును గాని కింజల్కాదియుత వికసితపద్మోపమత్వమును గాని పొందనేరదని తలఁచి, హంసము రోమ హర్షము నందియుండె నని చెప్పి తన్మూలమున "రతిక్షమాలసః" అను శ్రీహర్ష వచనములోని గంభీరాభిప్రాయమును వెల్లడించియున్నాఁడు.

పయిరీతిని రామరాజభూషణుఁడు దుస్తర మగుశ్లేషప్రతిబంధము నేమాత్రమును లక్ష్యపెట్టక యేకార్థిప్రౌఢకావ్యములందువలెనే సామాన్యముగా నెల్లయెడలను దత్తదుచితప్రాబంధికవర్ణనములను జేయుచు వచ్చెను. అట్టివానినెల్లఁ జూపియు వానిలోని కవిచాతుర్యములను బయిరీతిని వివరించియు వ్రాసినచో గ్రంథవిస్తర మగునని తలఁచి కొన్నిస్థలములలోని మనోహరము లగుపద్యములనుమాత్ర మిట నుదాహరించుచున్నాను.

—॥ మునులను జలపక్షులను జోడించి వర్ణించుట. ॥—

"చ. వనరుహాకంద ... ... మానసాబ్జుఁడై. (హ. న. 2-31)

—॥ లేడిని రాజహంసమును జోడించి వర్ణించుట. ॥—

"సీ. కురువిందములచంద ... ... లాలించి యిట్లుపలికె." (హ.న. 2-40)

—॥ హంసకురంగముల మాయాగతివర్ణనము. ॥—

"చ. కలయఁగ నిచ్చు ... ... బెట్టుగాఁ." (హ. న. 2-45.)

నిజముగాఁ బయివర్ణనములు రామాయణములోని మాయాకురంగవర్ణనమును స్మరింపఁజేయుచున్న వనిచెప్పవచ్చును. ఇట్టివర్ణనము సయితము రాఘవార్థమున రాఘవపాండవీయమున వర్ణింపఁ బడలేదు. అదియే యన నేల? అందు రెండుమూఁడుస్థలములందక్క వర్ణనములే మృగ్యము లై యున్న వని చెప్పవచ్చును.

—॥ మునివర్ణనమును హంసవర్ణనమును జోడించుట. ॥—

"సీ. అలఘుగతిప్రౌఢి నాత్మభూ ... ... గౌరవమున." (హ. న. 2-51.)

—॥ మాతంగీవిరహిణులవర్ణనములను జోడించుట. ॥—

"సీ. సుకరాబ్జ ... ... ... తత్త్వమునఁజేసి." (హ. న. 2-61.)

—॥ మాతంగీ విరహిణీహారవర్ణనముల జోడించుట. ॥—

"ఉ. ఆరమణీలలామ ... ... ధురంధరంబు లై." (హ. న. 2-63.)

—— మదనావస్థలను సంగీతమును జోడించి వర్ణించుట. ——

"సీ. పొలుపొంద ... ... ... రాదరమున". (హ. న. 2-68.)

—— { హరిశ్చంద్ర తాడితమాతంగస్త్రీలవర్ణనమును నారద వర్ణనమును జోడించుట. } ——

"సీ. మనుజపకాండ ... ... నెఱింగింపఁ గొకకుండు." (హ. న. 2-76)

"ద్వి. పలుగాలియును జండభానురశ్మియును, బాలయ లోఁగెడుమ త్తపోవనంబునకు
నోపి నీ వెక్కడనుండి వచ్చితివో, భూపకీటమ వేఱపురఁగ వై తీవు!"
(గా.హ. ద్వి.పూ. 1219.)

అను హరిశ్చంద్రకథలో విశ్వామిత్రవాక్యమును—

"సీ. ఏదేశ ... ... , రక్షాధికృతజనవ్రాతపాలిత మైన
శుద్ధాంత మెబ్భంగిఁ జొచ్చి తిపుడు"
... ... ... ... ... ...

"అఖిలదౌవారి కాంధంకరణ మైన, శక్తినీ కేవిద్య సంభవించె."(శృం.నై.4-8)

అనునైషధములోని దమయంతీవాక్యమును జోడించి కవి యీ క్రిందిరీతిని వర్ణించి యున్నాఁడు.

"చ. ఖరకిరణా ... ... ... కేమిచెప్పెదుణా" (హ. న. 2-89)

"ద్వి. పెరికి బ్రహ్మాస్త్రంబు పిచ్చుక మీఁద, నఱవడి సంధింప నుచితమే యకట!
ఖేదంబు మనమునఁ గీల్కొన్న వేళ, నీదృష్టిపథమున నిల్చి భాషింపఁ
గమలారిధరుఁడనో కమలనేత్రుఁడనో, కమల సంభవుఁడనో..."
(గా. హ. ద్వి. పూ. 1290.)

అను హరిశ్చంద్రకథాభాగమును.

"శ్లో. ఆనంద యేంద్ర మథ మన్మథ మగ్న మగ్నిం, కేళీభిరుద్ధర తనూదరి నూతనాభిః,
ఆసాద యోదితదయం శమనే మనో వా, నో వా యదీత్థమథతద్వరుణం వృణీధాః."
(నైష. 8-108)

అను నైషధకథాభాగమును గవి యీ క్రింది రీతిని జోడించి యున్నాఁడు.

"చ. హరిపద ... ... స్మరమాత్ర లర్హ శే." (హ. న. 2-93.

1. పయిరీతినె బేతాళాంధకారవర్ణనములను జోడించి పరస్పరోపమ్యమును ధ్వనింపఁజేయుట (హ. న. 3-44); 2. బేతాళవధ-చంద్రికా వర్ణనములను జోడించుట, (హ.న.?-45); 3. వాసవెన్నెలలవర్ణనములను

జోడించుట (హ.న.3-46), 4.వనపతనపీడిత లగుచంద్ర మల్లికమయంతుల వర్ణనములను జోడించుట (హ.న.3-48), 5. సూర్యోదయదవాగ్ని వర్ణనములును జోడించుట (హ.న.3-50.). 6. గంగానదితో నొకసెలయేటిని జోడించి వర్ణించి యాధిక్యమును ధ్వనింపఁజేయుట (హ. న. 3-74), 7. కాశీపురముతో సుబాహుపురమును జోడించి వర్ణించి యద్వానిసామ్యమును ధ్వనింపఁజేయుట (హ.న.4-35), 8. ఋతువర్ణనీరబాహుళవర్ణనములను జోడించుట (హ. న. 4-74), 9. శ్మశానవర్ణనమును బురవర్ణనమును జోడించుట (హ. న. 5-6), 10. అశ్వపిశాచవర్ణనములను జోడించుట (హ.న.5-8), 11. పురవనవర్ణనములను జోడించుట (హ.న.5-18), 12. సూర్యాస్తమయవర్ణనమును బాహుకకృతసారథ్య వర్ణనమును జోడించుట (హ. న. 5-29), 13. తాండ్రచెట్టును జీకటిని జోడించి వర్ణించుట (హ.న. 5-30), 14. ఇంద్రేశ్వర వర్ణనములను జోడించుట (హ.న.5-62), మున్నగునవి యతిప్రౌఢిమతో వర్ణింపఁబడినవి. ఈయి రీతిని వస్తుద్వయమును జోడించిన వర్ణనములే మిక్కిలి చమత్కారముగా వెలయుచున్నపుడిఁక నుభయపక్షములకును దుల్యముగ నొక్క వస్తువునే వర్ణించునపుడావర్ణనములు లోకోత్తరచమత్కారశాలులై యుండుననుటకు సందియము లేదుగదా!

రాఘవపాండవీయాదులందువలెఁ గాక యిం దుభయపక్షసాధారణములగునట్లు సందర్భపఱిచికొని రామరాజభూషణుఁడు పురచంద్రార్కోదయాదివర్ణనముల నేకార్థిప్రబంధములందువలెనే విపులముగా వర్ణించియున్నాఁడు. అట్టివర్ణనములనెల్ల నిటఁ జూపినచో గ్రంథవిస్తరమగు నని తలఁచి కొన్నిటినిమాత్ర ముదాహరించుచున్నాను. సాకల్యముగఁ జూడఁగోరువారు వెనుకవ్రాసిన కథాసారపుఁబట్టికను బట్టి (చూ. పు. 41) యాయావర్ణనము లుండు పద్యములను దెలిసికొనిచూచెదరు గాక!

## వసంతర్తు వర్ణనము.

"చ. * చిగురు ... ... పథికాంగనాళికిన్." (హ. న. 2-9.)

---

*"నృపాయ తస్మై హిమితం వనానిలై, స్సుధీకృతం పుష్పరసై రహర్మహః, వినిర్మితం కేతకరేణుభి స్సితం, వియోగినే ఽధత్త న కౌముదీ ముదః" (నై ష.1-99)అను శ్రీహర్షకల్పనము ప్పై పద్యమునకు మూలమైయున్నట్లగపడుచున్నది.

* "సీ. ప్రచ్ఛాయవన ... ... పంక్తు లయ్యె." (హ. న. 3-20.)
† "ఉ. కమ్మనిపువ్వుఁ ... ... వనింజరింపఁగన్" (హ. న. 3-35.)

---

*" యః పూరయన్ కీచకరంధ్రభాగాన్, దరీముఖోత్థేన సమీరణేన,
ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం, తానప్రదాయిత్వ మి వోపగంతుమ్."
(కుమా. 1. స.)

"శ్లో. రణద్భి రాఘట్టనయా నభస్వతః, పృథగ్వి భిన్నశ్రుతిమండలై స్స్వరైః,
స్ఫుటీభవద్గ్రామవిశేషమూర్ఛనా,మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః."
రామరాజభూషణుఁడు స్థలాంతరమునందు దీని నుపయోగించుకొని యున్నాఁడు.
"సీ. సముదితానంతశ్వసనఘట్టనంబునఁ,బాణివీణాగుణప్రతతి మెఱయ." హ.న.2-76.
అల్లసాని పెద్దనార్యుఁడును నీజాతికల్పనము నుపయోగించుకొనియున్నాఁడు.
"శా. వాలాయంగొనగోళ్ల నీ వలసత న్వాయించుచో నాటకున్
మేళం బైనవిపంచి నిన్న మొదలు న్నీవంటమిం జేసి యా
యాలాపంబ యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళగింపఁగదవే లోలాక్షి! దేశాక్షికిన్." (మను 3-57.)
†"శ్లో. విలాసవాపీతటవీచివాదనాత్, పికాళిగీతే శ్శిఖిలాస్యలాఘవాత్,
వనేఽపి తౌర్యత్రిక మారరాధ తం, క్వ భోగ మాప్నోతి న భాగ్యభాగ్జనః.
తదర్థ మధ్యాప్య జనేన తద్వనే, శుకా విసృష్టాః పటవ స్త మస్తువన్,
స్వరామృతే నోపజగు శ్చ శారికా, స్తథైవ తత్పౌరుషగాయనీకృతాః"
(నైష. 1. 102-103.)

ఇట్టి జాతులకల్పనములను రామరాజభూషణుఁడు వసుచరిత్రమున నీ క్రిందరీతి నలంకరించియున్నాఁడు.

"సీ. నృపమౌళిభవసువర్ణపరాగములు సువ, ర్ణపరాగములు నభిన్నత వహించెఁ
గమనీయతపనీయకదళికాపవనంబు, కదళికాపవనంబు గలసి మెలఁగె,
లలితమాగధలోకకలకంఠగానంబు, కలకంఠగానంబు నలమికొనియెఁ,
దతవాదకసమీరహతకిన్నరీరుతుల్,కిన్నరీరుతులు నేకీభవించె.
తే.గీ. నపుడు సేరంగవచ్చినయవనిజాని, కవనిజానీక మచట సాష్టాంగ మెఱఁగెఁ
గేళివనబహిరంగణాక్షీణమధుర,మధురసఝురానుబింబసంభావనమున." (వసు.1-149)
"మ. అలచైత్రాంచిత సత్రశాలికల నిష్టాహారతృప్తిం గుతూ
హలము ల్గాంచుద్విజావళుల్ శ్రుతిహితావ్యాజానులాపంబులో
నలఘుశ్రీకరశాఖికాంచలవినిర్యత్కేసరార్ద్రాక్షతం
బులు రాల్చెన్ నరదేశరత్నమకుటీభూషావిశేషంబుగన్." (వసు. 1-183,)

—○ సూర్యాతపతప్తస్త్రీవర్ణనము. ○—

"సీ. కట్టెండ తాకున ... ... వేదండగమన!" (హ.న.3-34.)

* "సీ. బాలికబడలికఁ ... ... రసోద్భేదకరము గాదె."(హ. న.3-36)

"వా. కట్టెండకు వదనంబు ... ... నం దయ్యెడకు." (హ.న. 3-37)

—○ వానకుఁ దడిసినస్త్రీని వర్ణించుట. ○—

"సీ. కచభృంగములు ... ... దద్దర్శనంబు." (హ. న. 3-48)

—○ చక్రవాకీవిరహవర్ణనము. ○—

"సీ. పతి చన్నదిక్కు ... ... జక్కవవెలంది." (హ. న. -47)

పయిరీతిని గవిసమయసిద్ధము లగువిషయములనే గాక మహాకవు లిట్టివర్ణనములందుఁ బౌరాణికవిషయములను, లౌకికవిషయములను గూడ గ్రహించి చమత్కరించుచుందురు.

—○ సూర్యాస్తమయము. ○—

"మ. దివికిం ధాత్రికిఁ ... ... పయిం బర్వంగను." (హన. 4-9)

—○ అంధకారవర్ణనము. ○—

"సీ. వల్లవీరతిఁ దేవి ... ... బొదివికొనియె." (హ.న. 4-11)

"జారతతులు పొగడ" అనువాక్యమునుబట్టి "అహల్యాయై జార" అను మొదలగు శ్రుతిప్రస్తుతవిషయములు సైతము నింద్యము లగుటచే నవి జారులు పొగడఁదగిన వని నిరసించుట యుచిత మనుకవి యౌచిత్యపోషణలాలసత్వము వెల్లడియగుచున్నది.

---

ఇట్టివి వసుచరిత్రమున ననేకములు గలవు. ఇట్టివాని నెల్లఁ బయిహరిశ్చంద్రనలో పాఖ్యాన మలంకరించుచున్న కారణమున వీని నిటఁజూపవలసెను.

* తరుదోహదకల్పనముల నీరీతిని జమత్కరించి చెప్పుటయం దీకవి కభిరుచి మెండనితోఁచుచున్నది. వసుచరిత్రమున (1-158, 159; 3-143-147) నిట్టివి పెక్కులుగలవు, (హ. న. 2-8) పయి హరిశ్చంద్రనలోపాఖ్యానపద్య మట్టివానికి శిరోభూషణ మనఁదగియున్నది.

"సీ. చిగురుకేంగేలు సాచె రసాలవల్లరి, తేఁటిచూపులఁ జూచెఁ దిలకలతిక
పికగీతిఁ బాడి చూపెఁ బ్రియాళులత పల్కెఁ, గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తిని౦పె నింపుగల సంపఁగికొమ్మ, వన్నెగా నగి యేతెఁబొన్నతీఁగ
సురభిశ్వసనంబు నెరపె సింధుకవల్లి, గ్రచ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరెమ్మ
తే.గీ. యాత్మరుచిరోపచారంబు లధిప కల్ప, కంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనుప
నంగనానిత్యకలిత దోహదవిశేష, సన్నుతాచారములనడిసిన్నకతన.(వసు. 1-158)

## చంద్రోదయవర్ణనము.

"చ. అపరపయోధిఁ ... ... సేసఁ బ్రాలనన్." (హ. న. 4-12)

ఇందు హిందూవివాహపద్ధతియు నప్పటికాలమునఁ గాలనివేదనము చేయుఘటీయంత్రపద్ధతియు వ్యక్తపఱుపఁబడెను. ఒకచిన్నపాత్రమునకు సన్ననిరంధ్రము పొడిచి యద్దానిని జలపూరిత మగునొక పెద్దపాత్రలో నుంచుటయు, నాచిన్నపాత్ర మాసందుమూలమునే వచ్చిన నీటిచే నిండి మునుఁగుటయే కొన్నియెడల జాములకును, గొన్నియెడల ముహూర్తములకును, గొన్నియెడల ఘటికలకును నిట్లుకల్పకునియిచ్ఛానుసారముగా నివెదక మగుచుండుటయుఁ బూర్వకాలములందు జరుగుచుండెడిది. అట్టిదానినే ఘటీయంత్ర మందురు. ఇప్పటి గైడియాళ్ళాసులున్నగువానికి బదులుగ నదియె పూర్వకాలములందు వాడఁబడెడి దని పయికల్పనలోని "అపరపయోధిఁ బ్రొద్దుగడియారము గ్రుంక" అను వాక్యమువల్ల విశదమగుచున్నది.

## నక్షత్రవర్ణనము.

"గీ. ఇనుఁబాసి ... ... ప్రతతు లలరె." (హ. న. 4-13)

ఇందు విరహిణీప్రభృతినాయికావ్యాపారములు మున్నగునవి సూచింపఁబడినవి. మఱియు నప్పటికాలమునందు సయితము బోర్డుబల్లలపై సుద్దముక్కలతో బోధనీయాంశములను వ్రాసి బడులలో బోధించుచుండెడివా రనియు, నప్పుడుసయితము బాలికాపాఠశాల లుండెడి వనియు దీనివలన వ్యక్తపడుచున్నది. కావున "మీకు నల్లపలకలు మొదలైనవి ఉన్నవా ? వీథిబళ్లలో నల్లపలకలు, వ్రాతబల్లలు, పటములు, అచ్చుపుస్తకములు ఉండవు" అను నిప్పటివారి (E. Marsden B. A., First Reader) పూర్వచరిత్రానభిజ్ఞతయుఁ, గుశలంమన్యతయుఁ బరిహాసనీయము లగుచున్న వని చెప్పవచ్చును.

## వేగుఁజుక్కవర్ణనము.

"ఉ. దీపితతారహార్తిక ... ... నర్మ్యోడన్." (హ.న. 4-24)

కవికాలమునందలి మౌక్తికవాణిజ్యవిషయమును, వణిజులకాలమునందలి రాజాపగమమందుఁ బడుచిక్కులును సూచితము లగుచున్నవి.

### ఘంటామాఘమును జమత్కరించుట.

"శ్లో. ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా వహిమకరే హిమధామ్ని యాతి చాస్తమ్,
వహతిగిరిరయంవిలంబిఘంటా,ద్వయపరివారితవారణేంద్రలీలామ్." (మాఘ4-21)

అనుమాఘకవికల్పనమును వేఱువిధముగ మార్చి చమత్కరించి యున్నాఁడు.

"శా. ఆశాద్వైన్యదశా ... ... దత్తద్దిశాంతంబులన్." (హ. న. 4. 31)

ఇందు గజములపయి మంగళోదకపూర్ణకలశముల నుంచునప్పటి యాచారము వర్ణింపఁబడినది.

### వసంతవర్ణనము.

"ఉ. పూని మహీవనీ ... ... నభీప్సితార్థముల్." (హ. న. 2-4)

ఇం దనంతరకథనీయ మగుహరిశ్చంద్రునియాగమును విశ్వామిత్రాభీప్సితావాప్తియు నను నవి సూచితము లగుటచే నిందు సూచ్యార్థ సూచనము వెలయుచున్నది. మఱియు నిందుఁ గవికాలమునందు జరిగిన విజయనగరరాజ్యవిప్లవానంతరభావు లగుతురుష్కకృతవర్ణసాంకర్యాదిబాధలను మాన్పి తిరుమలదేవరాయతత్పుత్రాదులు చేసినకర్ణాటరాజ్యపునరుద్ధరణమునైతము సూచితమగుచున్నది. తిరుమలదేవరాయలు తురకల నణఁచి వర్ణసంకరములను బాపినట్లు—

"సీ. చటులశార్వరమగ్నసర్వవర్ణోద్ధార,పటిమ నెవ్వనిరాజభావ మొసఁగు." (వసు. 1-13)

అనువసుచరిత్రములోని కవిరచిత మగుసీసపాదమువల్ల స్పష్టపడుచున్నది.

అట్లె యీహరిశ్చంద్రనలోపాఖ్యానము తుదిని "నృపదేశాదిశాన్తి స్తు ప్రశస్తి రభిధీయతే" అనునిర్వహణ సంధ్యంగరూపమున వెలయు నీక్రిందిపద్యమునందు నైతము కవి తనకాలమందు జరిగినవిజయనగరరాజ్యవిప్లవమును దదనంతరమునఁ దిరుమలదేవరాయ తత్పుత్రాదులు చేసిన కర్ణాటకాంధ్రధరణీపునరుద్ధరణమును ధ్వనింపఁజేసి యున్నాఁడు.

"సీ.అతనుపావక ... ... ఖరరాజకరజాతకాతరత్వ మడంగె
గీ. ... ... ధవునిఁ దేజోరవిందబాంధవునిఁ బాసి
... ... ... ... నిలువ." (హ. న. 5-70)

హరిశ్చంద్రనలోపాఖ్యానరచనాకాలమునకుఁ దక్కిన తురక రాజ్యములకంటె నదిల్షాహియుఁ గుతుబ్షాహియు మిక్కిలి యభివృద్ధిలో నుండినవి. అందుఁ గుతుబ్షాహి పూర్వదిక్కునను౦డెడిది. అద్దాని ఘనతను నప్పటియుద్ధపుగడబిడలను గవి యందందు సూచించియుండెను. అట్టివాని నిటఁ జూపుచున్నాను.

బాలార్కకిరణప్రసారవర్ణనము.

“సీ. తొలిమిన్కు ... ... ...
మును గట్టుసురతాని మోర్లెఁ బట్టినయింద్ర ... ...
గీ. ... ... ... ... నభముఁ బ్రాఁకె.” (హ. న. 4-33)

వసంతర్తువర్ణనము.

“సీ. సరసధారావి ... ... ప్రద్యుమ్నచక్రవర్తి.” (హ. న. 2-6)

పయిపద్యద్వయమునుబట్టి కృతికాలపుయుద్ధములయందు రథగజతురగపదాతులె విజయసామగ్రు లనియుఁ, గత్తులు కటారులు చిల్లకోలలుమాత్రమె యప్పటియాయుధము లనియు, దండెత్తి వెడలినరాజులు గుడారములను వేసికొని శత్రుపురములయొద్ద విడిసి శత్రుపురములను ముట్టడించెడువా రనియు, నప్పటికిఁ గేలు మున్నగు నగ్నియాయుధములు కప్పుడు ప్రాచుర్యము లే దనియు విశదమగుచున్నది.

చతుర్థాశ్వాసమున నాకేశనఖపర్యంతము స్త్రీవర్ణనము మిక్కిలి మనోహరముగఁ జేయఁబడెను. వానిలో నొకటిరెండు పద్యములను మాత్ర మిటఁ జూపుచున్నాను.

* “చ. మెలఁత ముఖ ... ... ధారణ నిల్చునే.” (హ. న. 4-46)

---

* సీ. “వంచనామతిఁ బ్రాడ్వివాకు లై వటువు లొజ్జల కప్పగించిరి చదువు లెల్ల” (మను. 3-126)

అని యిట్లొజ్జల కప్పగించుట యనునది యల్లసాని పెద్దనార్యుఁడును నుపయోగించి యున్నాఁడు. బింబరుచిశాలికి ధారణశక్తియుండ దనువిషయమును గవి వసుచరిత్రమునందును దడవియున్నాఁడు.

“మ. అలినీలాలక ! కంటె చిల్కభవదీయాలాపలీలాప్తి నిం
పలరం గోరి విపక్వదాడిమతరువ్యాలంబిశాఖాఫల
జ్వలనావాఙ్ముఖ మై తపంబు సవరింపన్ సాగ నే ల బ్బెడిం
దలక్రిం దైన నమానవాగ్గ్రహణమేధాశక్తి బింబాశికిన్.” (వసు. 3-143)

"చ. నలువ నవారవిందములు ... సంస్మరించుచుఁ." (హ. న. 4 52)
"చ. అనఁటులజన్మ మెత్తి ... మరలింపఁగంటి మే." (హ. న. 4. 51.)

ఇం దెక్కువవానికిని దక్కువవానికిని వివాదము గల్గినపుడు న్యాయసభలయందుఁ దక్కువవాని న్యాయము బయల్పడనేర దను దురాచారమును గవి యుద్ఘాటించియున్నాఁడు.

గ్రంథవిస్తరభీతి నుదాహరింప నైతిని గాని యిట్టి నిరుపమాన వర్ణనములు పెక్కు హారిశ్చంద్రనలోపాఖ్యానమునందుఁ గలవు. పయి రీతిని వ్యంగ్యప్రధానముగను, గల్పనాభాసురముగను, బ్రసాదగుణ భూషితముగను, వెలయునట్లుగ నీద్వ్యర్థికావ్యము నేకార్థి కావ్యమువలెను గొన్నియెడల నంతకంటె మనోహరముగను గవి నడిపించియున్నాఁడు. శ్లేషార్థఘటన మాతని కొకలీలవంటి దగుటచే దానియనురోధమున నితరద్వ్యర్థికావ్యకర్తలవలె నాతఁ డిందుఁ బ్రాబంధికమార్గములను జూపుటలో వెనుదీసియుండలేదు. పేయేఁ? అర్థద్వయాలంకృతముగనే కవిత్వము చెప్పుట యాతని కొకస్వభావ మని చెప్పవచ్చును. హారిశ్చంద్రనలోపాఖ్యానమున నుభయార్థపమములగు పద్యములనునైత మర్థాంతరాలంకృతములుగ నుండునట్లు తెలియుగ రచించుటయే యందులకు నిదర్శనము. ఇట్టిరీతి యితరద్వ్యర్థికావ్యములం దగపడదు.

—— రామరాజభూషణునికవిత్వపుస్వభావములు. ——

1. శబ్దాలంకారపటుత్వము.

రామరాజభూషణుఁడు మొదటిదశలో వ్యస్తాక్షరి మున్నగు నవధానతంత్రములందును నాశుబంధగర్భకవిత్వములయందును నిరోష్ఠ్యాది సచిత్రకవిత్వములందును నాసక్తుఁడై యుండెడివాఁ డని నరసభూపాలీయములోని యీక్రిందిపద్యమువల్ల విశదమగుచున్నది.

"సీ. శతలేఖినీపద్యసంధానధారేయు ... ..." (నర. 1-13. చూ. పు. 1)

—— ఓష్ఠ్యము. ——

"కం. భూమినుమనో ... ... ..." (నర. 2. 175.)

---

కవి "శతలేఖినీపద్యసంధానధారేయు" (నరసభూపాలీయము 1-13) అని చెప్పుకొనినరీతిని నవధానతంత్రజ్ఞుఁడు గాన ధారణాశక్తి లేని సమకాలికులగు కొందఱి నిట్లు పరిహసించి తన ధారణ శక్తిని సూచించుచు వచ్చె నని తోఁచుచున్నది.

ఇందుఁ బ్రత్యక్షరమందును నజ్ఝల్లులు రెండునుగాని, వానిలో నొకటిగాని నియమముగా నోష్ఠ్య మయియుండును.

ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము.

"శా. భూనాథోత్తమజంభజంభన ... ..." (నర. 4 90.)

పయిరీతినె యొకయక్షరమున నోష్ఠ్యసంబంధ ముండుటయు దానివెనుకటియక్షరమున నేమాత్రము నోష్ఠ్యసంబంధము లేకుండు టయు ననునీనియమము తుదిదాఁక నిందుఁ బాటింపఁబడెను.

అచలజిహ్వము.

"కం. భోగాంబువాహ ... ..." (నరస. 3. 160.)

కంఠ్యములు నోష్ఠ్యములు నగు హల్లులయుత్పత్తిలో జిహ్వాచలన మనావశ్యకముగాన నట్టిహల్లులతో మాత్రమే పద్యమును నడుపు నియమమిందుఁగలదు.

వర్గపంచకరహితసుగంధి.

"హారహీరసారసారి ... ..." (నర. 5. 46.)

అంతస్థములతోడను నూష్మములతోడను మాత్రమె యీపద్యము నడుపఁబడెను.

వృత్తకంద గర్భసీసము.

"సీ. మహితవిద్వజ్జనమండలీవినుత సాహిత్యప్రియంభావుకాద్యుదార

... ... ... ... ...

తే. గీ. నిరుపమదయాపయోనిధి నిరతభరిత, చారుచరితనిర్మలతరసత్యరుచిర
తరణికులమణి నరసింహధరణిరమణ, ఘనతరగుణనిధీ మను జనులు పొగడ."

(నర. 4. 89.)

ఇందు సీసచరణములు నాల్గిటిలోను బాదాదివర్ణము నొకటిని బాదాంతవర్ణత్రయంబును విడిచినయెడల మత్తేభవృత్తము లభించును.

"గర్భమ. హితవిద్వజ్జనమండలీవినుతసాహిత్యప్రియంభావుకా"

అట్లె గీతపద్యమును మొదటినుండియుఁ గందపద్యపువరుసను గ్రహించి తుదివర్ణాష్టకమును విడిచినచోఁ గందము లభించును.

"గర్భకం. నిరుపమదయాపయోనిధి, నిరతభరితచారుచరిత నిర్మలతరస
త్యరుచిర ... ... ... ..."

—● * పద్మబంధము. ●—

"స్రగ్ధరా. రామాక శ్రీసమగ్రారణకృతభయముద్రాసకక్తారమారా
రామారక్తాసకద్రాప్తశ్రీభరణపటిమాత్రాసకసక్తీశమారా
రామాకసక్తీశసత్రా ప్రకటితరవిచిత్రాపవిత్రాసమారా
రామాసత్రావిపత్రా శ్రియనరసరుచి గ్రామసశ్రీకమారా!" (నర. 4.86.)

—● కవినామపతినామగర్భిత *చక్రబంధము. ●—

"శా. రక్షానాకపమూర్తి భానురగభీరా విక్రమోహాస్పదా
రక్షారమ్యమతిస్థిరాభరణ విద్యాకృత్యశంకిస్వనా
వత్సస్సింధుపకన్యకా నరసభవ్యా తిగ్మధీతంత్రదా
దాక్షిణ్యారతనాదవైభవవినోదా హేమనాగాశ్వదా!" (నరస. 4-88)

తృతీయవలయమున "నారసింహాంకితమ్" అనియు షష్ఠవలయమున "మూర్తికవికృతి" అనియు నిం డమున్పఁబడెను.

"కావ్యాన్తర్గడుభూతా యా సా తు నేహ ప్రపంచ్యతే,
రసస్య పరిపంథిత్వా న్నాలంకారః ప్రహేలికా.
ఉక్తివైచిత్ర్యమాత్రా సా చ్యుతదత్తాక్షరాదికా."

"ఆదిశబ్దా త్క్రియాకారకగుప్త్యాదయః" అను సాహిత్యదర్పణ సూక్తిచొప్పున రసభంజకము లగుటంజేసి యట్టివానిని విపులముగా నన్ని గ్రంథములందును రచింపక యొక్క నరసభూపాలీయము నందుమాత్రము జాతి కొక్కొక్కటినిమాత్రమే కవి చూపియున్నాఁడు. అందును నాశ్వాసాంతములఁ గృతిపతి సంబోధనపద్యములందె వానిని జొనిపియున్నాఁడు. అందును నరసభూపాలీయము ప్రథమగ్రంథమును గథాసందర్భము లేక యలంకారశాస్త్రతదుదాహరణమును నై యున్నదియుఁ గాన నందు మాత్రమె చూపి యంతతో విరమించెను. వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములు కథాసందర్భములు గల మహాప్రబంధములును గవితాపరిపాకావస్థలో రచింపఁబడినవియు నగుటచే వానియం దీపుండువంటి రచనములను నిలుపఁడయ్యె. తుదకుఁ దన్నుఁగూర్చి చెప్పికొను సందర్భమునందు సైతము నరసభూపాలీయమునందువలెఁ బయిశక్తులను జెప్పి

* ఈపద్మబంధ చక్రబంధముల యుద్ధారమును అప్పకవీయము (1918-వ సంవత్సరము ద్వితీయముద్రణము) 4-వ యాశ్వాసములో చూడవలయును.

కొనక యమృతము లొలుకునట్లుగా ధారాళవనముం జెప్పఁగలవాఁడ నని మాత్రమె చెప్పికొనెను.

"చ. నను శ్రీరామపదారవిందభజనా ... ..." (వసు. 1-17)

అట్లయినను రామరాజభూషణుఁడు నరసభూపాలీయమునఁ జెప్పికొనిన తనశక్తుల నెల్ల నేర్పుతో వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములందలి యాశ్వాసాంత గద్యములలోని "చతుర్విధకవితానిర్వాహక" అనువిశేషణమూలమున సూచించియే యున్నాఁడు. అట్లే గ్రంథద్వయమునందును—

"... ... ... ... ... ఏలబ్బెడిం
దలక్రిందైన నసూనవాగ్గ్రహణమేధాశక్తి బింబాళికిన్." (వసు. 3. 143)

అనియు,

"బింబరుచిశాలికి ధారణశక్తి నిల్చునే. ... ..." (హ.న. 4-46)

అనియు ధారణాశక్తిసౌహార్ద్యముల నుద్ఘాటించి తన యవధానతంత్రదక్షతను సూచించియున్నాఁడు.

కవిత్వము పరిపాకదశకు వచ్చుకొలఁదిని రసౌచిత్యపోషణపరత్వము బలపడుచుండును గాన నట్టి తనయు పేక్షను వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములలోని "సాహిత్యరసపోషణ" అను నాశ్వాసాంత గద్యలమూలమున సూచించియున్నాఁడు. అట్లే హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు—

"కం. శ్రీరామభూషణవచ, శ్శ్రీరసపోషణ భళీ... ..."

అని యిట్లాంజనేయుఁడు తనతోఁ బల్కినట్లు చెప్పియున్నాఁడు. పయి రీతిని వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానములందు రసభంజకములు కాని యనుప్రాసాది శబ్దాలంకారములనుమాత్రమె నిలుప నారంభించెను. నిష్పక్షపాతబుద్ధితోఁ జెప్పవలసివచ్చినపుడు రసౌచిత్యపోషణముగ మనోహరము లగు శబ్దాలంకారములను నిలుపునేర్పు రామరాజభూషణునికి మాత్రమే యుండె నని చెప్పవగును. అట్టి నేర్పు నరసభూపాలీయకాలమునకే యలవడి యంతకంతకుఁ బరసీమ నధిరోహించె ననియుఁ జెప్ప నొప్పును. వెనుక నుదాహరించినపద్యములందే కవి యొక్క యట్టినేర్పు విశదపడుచున్నది. అట్లయినను గవికృతగ్రంథ

త్రయమునుండియు నిట మరల నొక్కొక్కపద్యమునుమాత్ర ముదాహరించుచున్నాను.

"సీ. నెలవంకతోడి వెన్నెలవంజగల మేటి, నెలవంక రహితాంకుని నుతిం జెగడి
నరయమ్ముమానిఁ గన్ననయమ్ముగలయింతి, నరయమ్ముఁ దాల్చుఁ దా నన్నుఁ జెనకి
కడలేక తరిగొండకడలేకడలఁ బ్రోచు, కడ లేక మైన మీఁగడల నాల్చి
కపురాలవన్నెచొక్కపురాలనగు మేని, కపురాలపోతు బింకంబు నణఁచి
తే.గీ. తనరుచులు లోకములు నిండఁ దనరుచుండు
లాటకరహాటలలనాలలాట ఫలక
మలయజము లై ననీదునిర్మలయశంబు
లమితగుణసాంద్ర! నారసింహక్షితీంద్ర! (నర. 4. 68.)
"సీ. లలనాజనాపాంగ వలనావసదనంగ, తులనాభికాభంగదోః ప్రసంగ
మలసానిలవిలోలదళసాసవరసాల, ఫలసాదరశుకాలపనవిశాల
మళినీగరుదనీకమలినీవృతధునీక, మలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంత, రతికాంతరణతాంతసుతనుకాంత
తే.గీ. మకృతకామోదకురవకావికలవకుళ, ముకుళసకలవనాంతప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠకాకలీవి, భాసురము వొల్చు మధుమాసవాసరంబు."
(వసు. 1 126.)
"సీ. సనకాదిముని మోహ జనకాహిరిపుగేహ, కనకాసనారోహగౌరవంబు
నవనానుగుణమందపవనానుగతనంద, నవనాధికానందవివలనంబు
ఘనదీధితికలాపఖనదీజలఖగాప, ఘనదీపితద్విపగతివిభూతి
యమరీభుజవిచాలి చమరీజవికచాలి, సమరీతికకచాలి చారుమహిమ
తే.గీ. నరతనువుతోన సురవరనగరమహిత, బహుతరైశ్వర్యధుర్యులు ప్రస్తుతింపఁ
గాంచు టొప్పదె నామాట మించెదేని, నీకు నీవైభవము నిల్చులే కడింది".
(హ. న. 2. 96.)

పయిరీతి నంతటను స్థానవస్త్రాదినియమములు దప్పకుండ స్వర్ణకారుఁడు నగిషీపని చేయురీతిని, జిత్రకారుఁడు చిత్తరువులఁ జిత్రించు రీతిని శబ్దాలంకారములతోఁ బద్యములను రచించుట యిక్కవి కొక సహజ మగుస్వభావ మైయున్నది. అస్లె యాశ్వాసాంతకృతిపతిసంబోధనపద్యములకుఁ గథావస్తువుతోఁగాని రసముతోఁగాని యంతగా సంబంధ ముండదు గాన నందు శబ్దాలంకారభూయిష్ఠతను జూపుచుం

డును. అట్టి యాశ్వాసాంతపద్యములలో మొదటి పద్యము ముక్తపద గ్రస్తమై యుండుటయు నప్పద్యము మత్తేభశార్దూలములలో నొకటి యై యుండుటయు నీతని గ్రంథత్రయమునందును నియమముగా నగపడు చున్నవి. శార్దూలమత్తేభములనడక వెనుకతూగునఁ గొలుకుచు సవిలాసముగ వెలయుచుండు నని తలఁచియేకావలయు సాభిప్రాయముగాఁ గవి యట్టిముక్తపదగ్రస్తపద్యములను నియమముగా మత్తేభశార్దూలములతోఁ జెప్పుచువచ్చె నని తోఁచుచున్నది. నరసభూపాలీయము ప్రథమగ్రంథ మగుటచేతనో, లేక చతుర్థాశ్వాసమున ముక్తపదగ్రస్తోదాహరణములు రెండుండుటచేతనో యందుఁ జతుర్థపంచమాశ్వాసములతుదినిమాత్రము ముక్తపదగ్రస్తపద్యములు లేవు. మఱియుఁ జతుర్థాశ్వాసములోని యుదాహరణపద్యములు రెండుసయితము కందపద్యము లయియున్నవి. అచ్చటఁ దప్పఁ దక్కిన నరసభూపాలీయ ప్రథమ ద్వితీయ తృతీయాశ్వాసాంతములందును, వసుచరిత్ర హరిశ్చంద్రనలోపాఖ్యానముల యాశ్వాసాంతము లన్నిటియందును నవ్యభిచరితముగాఁ బయి నుదాహరించిన నియమము వెలయుచున్నది. మనుచరిత్రమున నొక్క పంచమాశ్వాసాంతమునమాత్ర మొకముక్తపదగ్రస్తపద్య మగపడుచున్నది. అట్టియీనియమ మితరప్రబంధములందును నగపడదు.

2. పయిరీతిని శబ్దాలంకారములను జత్రించుటయేగాక యర్థాలంకారములను జిత్రించుటయు నందును సమతాదినియమములను బాటించుటయు నీతనికి సహజ మగుగుణ మని గ్రహింపవలసియున్నది. అలంకారశాస్త్రాలంకృతకృతులను గవి యీక్రిందిరీతిని వర్ణించియున్నాఁడు.

"సీ. నిజరూపమునకు వన్నియఁ దెచ్చువేఁకొక్క, బెళుకొందుధ్వని హీరకళిక లమర
ఛాయాంతరాలత్సహజతేజము లైన, లత్షణావై డూర్యలత్ష లమర
రతులతోఁ దులదూఁగురమణీయరసవిశే, షములను గారుత్మతములు మెఱయ
గురుసువర్ణగుణై కగుంభితస్థితిఁ దాల్చు, నాయకనాయకోన్నతులు సెలఁగ
తే. గీ. నిల నలంకారనికరంబు లిరవుకొలిపి, కమలభవగేహినీపరిష్కారణకరణ
యోగ్యములుగా నొనర్చినభాగ్యనిధుల, భామహాదుల ననిశంబుఁ బ్రస్తుతింతు.
(నర. 1-18)

పయి నుదాహరించినరీతి నిక్కపికిఁ గలశబ్దార్థాలంకారాభిరుచిని బట్టి యప్పకవి పేర్కొనిన సప్తవిధకవులలో నితఁడు విశేషించి వాచకుఁడును, భూషణార్థియు ననఁదగియున్నాఁడు.

"సీ. గణవర్ణశబ్దార్థగుణదోషనికరంబు, పరికించి కూర్పఁ గబ్బము వివేకి
బహుతరానుప్రాసపదబంధనియమంబు, వదలక కృతి సేయు వాచకుండు
మృదుమధురోక్తులు వెదకి కావ్యం బెల్ల, రచియించుఁబదపడి రాచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు, నిమిడించు నర్థాఖ్య నెసఁగు నతఁడు
తే.గీ. సెప్పు యమకంబు లెప్పట్లశిల్పకుండు, పొందుపఱుచు నలంకృతుల్ భూషణార్థి
సరళపదవిరళార్థవిస్ఫురణముగను, జూపు రస మెందు మార్దవస్ఫుటకరుండు."
(అప్ప. 1. 210)

ఈభూషణార్థితాబిరుదముసయితము రామరాజభూషణుని బిరుదమునకు ("రామభక్త్యతిశయమున లెనే" చూ. పు. 2౫.) సార్థక్యమును సంపాదించుచున్నది. శబ్దార్థాలంకారరచనావిషయమున నీతఁడితరమహాకవుల నతిక్రమించి నిరుపమాన మగునైపుణ్యముతో నెసఁగుచుండు వాఁడు గావున నీతనిని విశేషించి వాచకుఁడు, భూషణార్థియు నగు నని వ్రాసితిని. అట్లయినను నీతఁడితరమహాకవి సాధారణముగా వివేకి రాచికార్థికశిల్పకమార్దవానుగతరూపబిరుదములకును నర్హుఁడే యని చెప్పుటకు సందేహములేదు. * ఈతని యలంకారరచనానైపుణ్య మనన్య

* రామరాజభూషణుఁడే తన కట్టిశక్తులు గల వని కృతిపతి పలికినట్లు చెప్పికొనెను.

"సీ. బాణువేగంబును భవభూతిసుకుమార,తయు మాఘుశైత్యంబు దండిసమత
యలమయూరునువర్ణకలన చోరునియర్థ, సంగ్రహంబు మురారిశయ్య నేర్పు
సోముప్రసాదంబు సోమయాజులనియ,మంబు భాస్కరునిసన్మార్గఘటన
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి, యమరేశ్వరునిసహస్రముఖదృష్టి
తే.గీ. నీక కలదటుగాన ననేకవదన, సదనసంచారఖేదంబు సడలుపఱిచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె, మూర్తికవిచంద్ర! విఖ్యాతకీర్తిసాంద్ర."
(నర. 1-15.)

పయివానికి హరిశ్చంద్రనలోపాఖ్యానమునుండి యొక్కొక పద్యము నుదాహరణముఁ జూపుచున్నాను.

సాధారణ మనుచరిత్రంబునకునే గణనచేసి వెంకటకవి తన ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసమునం దీక్రింది పద్యము వ్రాసియున్నాఁడు.

"సీ. అల విశ్వకోటపెద్దనలక్షణజ్ఞత, శబ్దశాసనకవిశబ్దశుద్ధి
ప్రాబంధికపుఁ మేశ్వరునర్థమహిమంబు, భయకవిమిత్రునిపదలలితత
శ్రీనాథువార్తాప్రసిద్ధి నాచనసోము, భూరికౌశిన్యంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషిచిత్రంబు, పింగళిసూరకవివరుశ్లేష

తే.గీ. మాంధ్రకవితాపితామహుఁడల్లసాని పెద్దన తిమ్మనతేటయు భూషణునియ
లంకృతియు నీకె కలదోఁ దలంప లక్షణకవి యప్పయ వేంకటసుకవిచంద్ర!

| | | |
|---|---|---|
| 1 సుకుమారత. | సీ. కురువిందముల. | 2-40. |
| 2 శైత్యము. | ఉ. కమ్మనిపువ్వు. | 3-35. |
| 3 సమత. | సీ. చిలికినచోనెల్ల. | 3-30. |
| 4 సువర్ణకలన. | ఉ. బంగరుగట్టు. | అవ-20. |
| 5 అర్థసంగ్రహము. | సీ. వలిజక్కవకౌకౌదు. | 4-21. |
| 6 శయ్యసేర్పు. | క. అనియనిమిష. | 4-55. |
| 7 ప్రసాదము. | సీ. పతిచన్నదిక్కు. | 4-7. |
| 8 నియమము. | చ. అన వినిరిచ్చపాటు. | 3-24. |
| 9 సన్మార్గఘటన. | శా. కట్టెండఁకవదనంబు. | 3-37. |
| 10 పదప్రసిద్ధధారాశుద్ధి. | మ. క్షితికన్యా. | అవ-33. |
| 11 సహస్రముఖదృష్టి. | సీ. పరమహంసాన్వయ. | 2-87. |

"ఆ.వె. అల్లసానివానియల్లికజిగిబిగి, ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు,
పాండురంగవిభుని పదగుంభనంబును, గాకమానురాయ నీకుఁ దగుర"

అని యిట్లు తెనాలిరామకృష్ణుఁడు బట్టుమూర్తితోఁబల్కె నని యొకగాథగలదు. నిజమునారయ నట్టి కవితావిలాసములు రామరాజభూషణున కుండుటచేతను, నతనికి మూర్తినామ ముండుటచేతను, గాకమానిమూర్తి యనుకవి వేఱొకఁ డనువిషయము తెలియనివా రెవ్వరో పైపద్యమును గల్పించి ప్రబంధాంకమూర్తిరాయని గాకమానిమూర్తిరాయనిగా భ్రమించి రని గ్రహించునది. పయిపద్యమునను దాహరించినయల్లికజిగిబిగిమున్నగుగుణము లేవలు కుదాహరింపఁబడియున్న గుణములందును వానిలక్ష్యము లందును సంతమ్యాతములు కాఁదగిన వై యుండుటచే మరల వాని కిట నుదాహరణములు వేఱుగఁ జూపఁబడవయ్యె.

స్వర్ణకారుఁడు కుందనపుఁబని చేసి మాణిక్యములను బంగారు ములోఁ బొదిగి యపూర్వాలంకారముల నొనరించునట్లే, రామరాజ భూషణుఁడును నలంకారాంతరములను శ్లేషతోఁ జోడించి యమూల్య ములు నపూర్వములు నగునలంకారములను జిత్రించుచుండును. సామా న్యముగా నేయలంకారము నైనను శ్లేషతోఁ జోడించిచెప్ప వలనుపడి యుండుటయు నట్టియెడల నాయలంకారమునకు సహజ మగుశోభకన్న శ్లేషానుగ్రహమువలన నత్యద్భుత మగుశోభ లభించుటయు సుప్రసిద్ధము. ఇంత యేల ?

"అస్య (శ్లేషస్య) చాలంకారాంతరవిషయత్వేపి ఆసంభ వా ద్విద్యమానే ష్వలంకారాంతరే ష్వపవాదత్వేన తద్బాధకతయా తత్ప్రతిభోత్పత్తిహేతుత్వ"మని (సాహి. ద. పరి. 10) యిట్లుగ నేజేని యిత రాలంకార మున్నపు డచట శ్లేషాలంకార ముండితీరు నని కొంద ఱభి ప్రాయపడునంతటి ప్రాచుర్య మలంకారలక్ష్యములందు దీనికిఁ గలదు.

వేయేల? పయిమతమును ఖండించుచు సాహిత్యదర్పణకారుఁ డలంకారరాజమగు నుపమాలంకారము శ్లేష లేక యుండనేర దనియుఁ బూర్ణోపమాలంకార మున్నచోట నెల్ల శ్లేషోపమల కంగాంగిభావసంక రము వెలయుచుండు ననియు నంగీకరించియున్నాఁడు—

"సకలేత్యాదౌ చ (సకలకలం పుర మేతత్ జాతం సంప్రతి సుధాంశు బింబ మివ) నోపమా ప్రతిభోత్పత్తిహేతుశ్లేషః; పూర్ణోపమాయా నిర్విషయత్వాపత్తేః. 'కమల మివ ముఖం మనోజ్ఞ మేత' దిత్యాద్యస్తిపూర్ణోపమావిషయ ఇతి చేన్న; యది సకలేత్యాదౌ శబ్దశ్లేషతయా నోపమా తత్కిమపరాద్ధం మనోజ్ఞ మిత్యాదావర్థశ్లేషేణ?... కించాత్ర శ్లేషస్యైవసామ్యనిర్వాహకతా. శ్లేషబంధతః ప్రథమంసామ్యస్యాసంభవా దిత్యుపమాయా ఏవాంగిత్వేన వ్యపదేశో జ్యాయాన్"

అని యిట్లు (సాహి. ద. పరి. 10) సిద్ధాంతీకరించియున్నాఁడు.

పయిరీతి నొక్కయుపమాలంకారమేగాక యనేకాలంకారములు శ్లేషానుగ్రహము లేక నిర్వహింపఁబడనేర వనుటకు సందేహము లేదు. కావున నట్లు శ్లేషతోఁ జోడించి యలంకారములను జిత్రించు నభి రుచియు, నందు నిరుపమానమగుశక్తియు నేర్పును గలరామరాజభూష ణునియలంకారము లమూల్యములు నద్వితీయములు నైయుండు ననుట యతిశయోక్తి కానేరదు. పైయంశ నిరూపణ కుదాహరింపఁబడిన రామ

రామరాజభూషణునిపద్యములనుబట్టియే విశదపడఁగలదు. అట్లయినను నిచట నీతనిగ్రంథత్రయము నుండియు నొక్కొక్కపద్యమును దీసి యుదాహరించుచున్నాను.

"సీ. బహుతరాశాభ్రాంతి బయలు వ్రాకకయున్నఁ, గువలయద్వేషంబు గోరకున్న
పీటితమ్ముల విరిపోటు సేయకయున్న, దోషాభిభూతుఁడై తోలఁగకున్న
జగతి నందఱకును బగలొనర్పకయున్న, వారుణీసక్తిని బాఱకున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి చేకొనకున్న, సరసుల నింకింపఁ జాలకున్న
తే. సాటి యగువిశ్వవినుతళశ్వత్ప్రతాప, వైభవధ్వస్తదుర్వారవైరివీరుఁ
డైన యోబయనరసింహు నమితభువన, భవనభృతతేజమున కబ్జబాంధవుండు"
(నరస. 5. 161.)

సీ. గిరికన్యమేన నేకీభవించినఁ గాని, తియ్యవిల్తుని నిరోధింపరాదు
సింధుజ నెద నుంచి సిరుల మించినఁ గాని, మిహిరాంశుఁగనుసన్న మెలఁపరాదు
శుభవాణి యభిముఖస్ఫురణఁజూపినఁ గాని, పఱచుటంచలఁ గ్రిందుపఱుపరాదు
పద్మిని గరముఖప్రాప్తిఁ దేల్చినఁ గాని, కేల ముమ్మరము వారింపరాదు
తే. నేర్పున నటంచు నృపతి యీసెలఁతిఁ దలఁచి
తలఁచి సగ మగు పాత్వికోదయదశాను
భావములఁ జెందు నున్మద ప్రసవబాణ
బాణమగ్నతఁ గాంచుఁ దాపము వహించు. (వసు. 3-94)

శా. శ్రీవైదేహసుతన్......మాకెప్పుడున్. (హ. న. అన-1.)

రామరాజభూషణునికవిత్వము ధ్వనిప్రచురమయియుండుననియు నలంకారాలంకృతమయి యలరారుచుండు ననియు నింతవఱకు వ్రాసియే యున్నాను. ఆవిషయమును విశదీకరించుట కయి యిచ్చటఁ బయి నుదాహరించిన పద్యములలోఁ బ్రస్తుత మగు హరిశ్చంద్రనలోపాఖ్యాన పద్యమునందలి యాతనినైపుణిని నానేర్పు కొలఁదిఁ గొంతవఱకుఁ జూపుచున్నాఁడను.

పయి నుదాహరించిన "శ్రీవైదేహ..."అనుపద్యమునందుఁ బ్రాకరణికశ్లేషాలంకారానుప్రాణిత మగుతుల్యయోగితాలంకారము వెలయుచున్నది. ఇందు వైదేహసుతనువలెనే భార్గవజయశ్రీనిసైత మబ్జభృచ్చాపలీలావాప్తిచే వరించె ననియు జనకసుత యెట్లు శ్రీరామునకుఁ గుశలవత్త్వామూల్యమాంగల్యదీక్షావాల మగుపరిగ్రహ మయ్యెనో

యట్లే భార్గవజయలక్ష్మియుఁ గుశలవత్త్వామూల్యమాంగల్యదీక్షావాలం
బగుపరిగ్రహ మయ్యెననియు ని ట్లుపమానధ్వనులు స్ఫురించుచున్నవి.
మఱియు జనకసుతానిష్ఠ మగుకుశలవత్త్వామూల్యమాంగల్యదీక్షావాల
పరిగ్రహత్వమునకును, భార్గవ జయలక్ష్మీనిష్ఠకుశలవత్త్వామూల్య
మాంగల్య దీక్షావాల పరిగ్రహత్వమునకును భేదము గల్గియున్నను నభే
దము శబ్దసామ్యముచే నిర్వహింపఁబడినందున నతిశయోక్తియు స్ఫురించు
చున్నయది. ఇంతియకాక భార్గవజయలక్ష్మీత్వరూపశబ్దసామ్యము స్ఫురించు
భార్గవియగులక్ష్మీకన్న జనకసుత యభిన్నయగుటచే శ్రీరామచంద్రుని
యనుకూలనాయకత్వము నిర్బాధ మనువిషయము పైశ్లేషానుగ్రహము
ననే ధ్వనిత మగుచున్నది. అట్లే శ్రీరామచంద్రునకు జనకసుతేతరభార్య
భార్గవజయలక్ష్మియే యని స్ఫురించుచుండుటచేఁ బరిసంఖ్యాలంకారము
సయితము ధ్వనితమగుచున్నది. సపత్నులు సయితము పరస్పరస్నేహముతోఁ
దన్ను సేవించునట్లు చేయఁగల్గిననేర్పు శ్రీరామునకు వర్ణింపఁబడుటచే నాయ
నయం దనన్యదేవతాసాధారణ మగు సర్వశక్తిత్వమును దన్మూలమునఁ
బరాత్పరత్వమును ధ్వనితము లగుచున్నవి. మఱియు నట్లు సపత్ను
లన్యోన్యస్నేహముతో నుండునట్లు చేసికొనఁగల్గిన సర్వశక్తుఁడే ద్వ్యర్థి
కావ్యమునందలి యర్థద్వయము నవిరుద్ధముగ జోడించు సామర్థ్యమును
బ్రసాదింపఁగలవాఁ డని తలఁచి కవి యట్టిశ్రీరాముఁడు తనకు శుభశ్రీ
లిచ్చుఁగాక యని గ్రంథాదిని జేయఁదగిన యాశీర్వాదరూప మంగళా
చరణమును జేసె ననియు, నట్టి నిపుణుఁడే కృతిద్వయమును జోడించిన
యీద్వ్యర్థికృతికిఁ బతి కాఁదగినవాఁ డనియు నిట్లనేకాభిప్రాయములు
ధ్వనితము లగుచున్నవి. ఇతియకాక నలుఁడు దమయంతిని గలిపురుష
జయలక్ష్మిని బరిగ్రహించి యత్యుత్కృష్టుఁడై యొసంగిన నలకథాపర్యవ
సానవిషయమును, హరిశ్చంద్రుఁడు చంద్రమతిని విశ్వామిత్ర జయలక్ష్మిని
బరిగ్రహించి యత్యుత్కృష్టుఁడై యొసంగిన హరిశ్చంద్రకథాపర్యవసాన
విషయమును బయి కృత్యాదిపద్యముచే సూచింపఁబడుచున్నందునఁ గవి
యొక్క గంభీరాశయము వెల్లడి యగుచున్నది.

నిపుణముగాఁ బరికించినచో నిట్టియలంకారపరంపరలును ధ్వని
నిచయంబులును నీతనికవిత్వమందు మిక్కిలి ప్రచురములై యగపడు
చుండును. విమర్శించువాని శక్తికొలఁది నీమహాకవికవితలోని నైపుణ్యము

వెలువడుచునే యుండు నని చెప్పుట యతిశయోక్తి కానేరదు. పయిరీతి పద్యము లీతని గ్రంథమున ననేకములు గలవు; గాని వానినెల్లఁబయిరీతిని విమర్శించిచూపినచో గ్రంథవిస్తర మగు నని యుదాహరింపలేదు.

పయినుదాహరించిన శబ్దార్థాలంకారరచనానైపుణియు శ్లేషకవితాపాటవమును మున్నగుస్వభావము లీతనికి ముఖ్యముగా శ్రీహర్షమహాకవిరచించిన సంస్కృతభాషామయ మగునైషధకావ్యపుఁబఠనపాఠనాదులచే నలవడిన వని తోఁచుచున్నవి. కావుననే నైషధకావ్యపద్ధతుల ననుసరించు స్వభావమొకటి యీతని కలవడినది. ఇట్టిస్వభావము నరపభూపాలీయరచనాకాలమునకే యీతని కంకురించి యంతకంతకు నతిశయించినది. వసుచరిత్రమున నైషధానుస్మృతి యత్యధికముగా వెలయుచున్నదనియు, నందుఁ గొన్నియెడల శ్రీనాథుఁ డాంధ్రీకరింపక విడిచికొనినకల్పనములు నైతము సంగ్రహింపఁబడెననియు నారచించిన వసుచరిత్రవిమర్శనమున మిక్కిలి విపులముగాఁ జూపియున్నాను (వసు. విమ. 23-35. మున్నగు పే. చూ.) తుద కట్టి నైషధములోనికథపట్టునె గ్రహించి హరిశ్చంద్రనలోపాఖ్యానములోని నలకథలోఁ బూర్వభాగమునంతను దనివి దీఱ నడిపించియున్నాఁడు. ఆసందర్భములోనినైషధమార్గములను ద్వ్యర్థికావ్యమె యయినను నిందు సాధ్యమయినంతవఱకు ననుసరించి సంగ్రహించుచువచ్చెను. అట్టివానిలోఁ గొన్ని యీవఱ కుదాహరింపఁబడిన యష్టావధానప్రసంగము మున్నగుసందర్భములలోఁ జూపియున్నాను (పు. 130-132-135-136;) అట్లయినను మఱికొన్నినైషధానుస్మృతు లీకవి గ్రంథత్రయమునుండియు దీసిచూపుచున్నాను.

శ్లో. వృథార్పయంతీ మపథే పదం త్వాం, మరుల్లలత్పల్లవపాణికంపైః
ఆలీవపశ్య ప్రతిషేధతీయం, కపోతహుంకారగిరా వనాళీః. (నైష. 3-14.)

చ. భవదరిభూమిపాలకులపాలిక చెంచెత కాత్తదుర్దశల్
వివరముగావచింప వనవీథి దయామతిఁ బల్కనీనియ
ట్లవిరళమందమారుతచలాచలచారుపలాశహస్తముల్
తవిలి విదిర్చు శౌర్యగుణధామ నృసింహనృపాలశేఖరా!. (నర. 5-79)

శ్లో. అపి ద్విజిహ్వాభవహారపారుషే, ముఖానుషక్తాయతవల్లువల్లయా
ఉపేయివాంసం భ్రుప్రతిమల్లతాం రయః, స్మరే జితస్యప్రసభంగరుత్మతః.
(నైష. 1-63)

మ. వరవల్గావిభవంబు దష్టభుజగవ్రాతంబు గా సింగిణుల్
గురుపక్షద్వితయంబు గాఁగ నరసక్షోణీశ్వరారూఢమై
తురగోత్తంసము నిందిరాహృదయనాథుం దాల్చు ప్రత్యక్షబం
ధురపక్షీంద్రునిలీలఁ జూచు నహితస్తోమంబు భీమంబు గాన్. (నరస. 5. 208)

నైషధములో నాయికానాయకపరస్పరదృష్టివర్ణనములు 7, 8, సర్గలయారంభమునం బ్రతిమనోహరముగాఁ జేయఁబడినవి. తద్వర్ణనముల ఛాయలు నరసభూపాలీయమునం దనేకములు గనఁబడుచున్నవి. (నర 2-21, 37, 75, 86, 87; 3-39. ప.) వసుచరిత్రమునందును వానియను స్మృతులుగలవు. (మా. వసు. వి. 71 పు.) వసుచరిత్రమునఁ గల నైషధములోని యితరకల్పనముల యనుస్మృతులు నైతము నేనుదహరించి వసుచరిత్ర విమర్శనమున విపులముగా నుదాహరింపఁబడియున్నందున (వసు. వి. 23. పు.) నిట మరల నుదాహరింపలేదు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు:—

శ్లో. అచీకరచ్చారు హయేన యా భ్రమీ, ర్నిజాతపత్రస్య తలస్థలేన సః,
మరుత్కమద్యాపి న తానుశిక్షతే, వితత్య వాత్యామయ చక్రచంక్రమాన్. (నైష. 1-73.)
"క. పలువగ ... ... ... ... ... దనరన్." (హరి. న. 1-18)

ఈపద్యమున "మహాబలచిత్రప్రౌఢి" అనుదానికి సుడిగాలులవంటి ప్రౌఢితోననువిశేషార్థము గ్రహించినచో మూలమునకు సరిపడును. వ్యాఖ్యాత యట్లు చేయకుండుటకుఁ గారణము తెలియకున్నది.

శ్లో. ఫలేన మూలేన చ వారిభూరుహాం, మునేరివేత్థం మమ యస్య వృత్తయః. (నైష. 1-133)
"చ. వనరుహ ... ... ... ధనము లొనర్చుచున్,..." (హ. న. 2-31)

ఉపమానవస్తువులు తపమొనరించి యుపమేయభూతము లగు నాయికావయవరూపజన్మాంతర మెత్తి తమతోం బోల్చిజన్మమునందలి కోరిం తలను బొందుచున్న వని యిట్లు వర్ణించుటయు నైషధానుస్మృతియే యన్ని తోఁచుచున్నది.

"శ్లో. శ్రితపుణ్యసరస్సరిత్కథం న సమాధిక్షపితాఖిలక్షపం,
జలజం గతిమేతు మంజులాం దమయంతీపదనామ్ని జన్మని" (నైష. 2-10)
మ. అరవిందప్రకరం ... ... పురావాసనన్ (హ. న. 4. 53)
చ. అనటులజన్మమైత్రి ... ... ... ... ... ... (హ. న. 4-51)
శ్లో. విదర్భసుభ్రూస్తనతుంగతాప్తయే, ఘటానివాపశ్య దలం తపస్యతః,
ఫలాని ధూమస్య ధయానధోముఖాన్ సదాడిమే దోహదధూపిని ద్రుమే. (నైష. 1-83)

మ. అలినీలాలక కంటె ... ... ... (వసు. 3-143.)
"శా. నానానూనవితాన ... ... (వసు. 2-47.)
"క. అళు లై కింశుకశిఖలోఁ జెలఁగుచు, ము న్నెంతతపముఁజేసెనో చెలి నే
నలి నరసింహునియురమునఁ, జెలువగుచెంగల్వదండ చేరువఁ గల్గెన్"(నర-3-86)
"సీ. ఒంటిగా మదిరాను ... ... ... " (నర. 2-129.)

చెక్కుటఁ జెయ్యిచేర్చుట.

శ్లో. ఇతి స్ఫుటం తద్వచస స్తయాదరాత్ సురస్పృహారోవిడంబనాదపి,
కరాంకసుప్తైకకపోలకర్ణయా శ్రుతం చ తద్భాషిత మశ్రుతంచ తత్ (నైష. 9.60.)
"గీ. అని నృపాలుండుపలుకహస్తాంకసుప్త కోమలైకకపోలయైయామృగాక్షి"
(శృం. నై. 4. 79.)
"సీ. చెలువక్రొమ్మించు లేఁ జెక్కుటద్దంబుయ్యఁ, బాణిపల్లవళయ్యఁ బవ్వళించె"
(శృం. నై 2-113)
"సీ.సుకరాబ్జమైత్రీవిశోభమానములైన,వదనకాంతులువింతవగలుదెలుప(హ.న.2.61)
"క. సతి చెక్కుటఁ జెయిసేర్పఁగ, నతులకరాంగుళులు సాంజనాస్రయుతములై
రతిపతిబాసట మించిన, శితపంచశరమ్ము లనఁగఁ జెలఁగు నృసింహా" (నరస.3-92)
"మ. అరవిందంబు విలాసమందిరము నీహారాంశుఁడేకోదరుం
డరయం గోత్రవిరోధ మేటికి ననర్హాంబంచు నూహించి యి
ర్వురఁ బొందించు పయోధికన్యక్రియఁ జేర్చుం గేలు గండస్థలిం
దరుణీరత్నము చింతచేత నరసేంద్రా! సాంద్రతేజోనిధీ!" (నర. 3-128)

అని యిట్లు నైషధరీతి నలంకరించియున్నాఁడు.

హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి పంచనళీవర్ణనాసందర్భము సయితము నైషధానుస్మృతినె వెల్లడించుచున్నది.

ఈసందర్భమునందు సంస్కృతభారతమునందువలె నాంధ్రభారతమున స్వయంవరసభలో రాజులు వర్ణింపఁబడి నని ద్దియెనఁ జెప్పఁబడలేదు. దమయంతి స్వయంవరసభకు వచ్చి పంచనళినిఁ జూచి నలు నేర్పరింపఁ జాలక ఖిన్నయై దేవతలను నుతింపఁగా వారు కరుణించి తమదేవతాచిహ్నముల నామెకుఁ గనుపఱుపఁగా నామె నలుని గ్రహించి యాతని వరించినట్లు భారతమున నున్నది.

శ్రీహర్ష కవి యీసందర్భమున స్వయంవరాగతరాజులను సరస్వతి వర్ణించినదని కల్పించి మిక్కిలి మనోహరముగా వర్ణించియున్నాఁడు. ఆసందర్భములోనియారీతి నద్వితీయవర్ణనముచేయుట మనుజమాత్రునకు

దుష్కర మనియు నది సరస్వత్యావేశమున నట్లు వెలువడిన దనియుఁ గవి యుద్దేశించినట్లు ధ్వనించుచున్నది. అట్టి యాపూర్వవర్ణనములలోని పంచనైషధీవర్ణనరీతి యీ క్రిందను జూపుచున్నాను.

సంస్కృతనైషధమునఁ బంచనైషధీసందర్భము పదుమూఁడవ సర్గమందంతటను బదునాల్గవసర్గమున మొదటియిరువదిరెండుశ్లోకముల వఱకును వర్ణింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నింటిని నిట నుదాహరింపక వాని యభిప్రాయములోని సారమునుమాత్ర ముదాహరించు చున్నాను.

దమయంతి నలునే వరియించెద నను నిశ్చయముతో నున్నదని విని యింద్రాగ్నివరుణులు నలుగురును స్వయంవరసభయందు నలునిరూపముతో వచ్చి నలునియొద్దనే కూరుచుండిరి. సరస్వతి వారిని వర్ణించిచెప్పుటలో నింద్రుని వర్ణించునపు డింద్రనలపరముగ నర్థద్వయ ముండునట్లును, నట్లేయితరదేవతలను వర్ణించునప్పుడును దత్తద్దేవతాపరముగాను నలపరముగాను నర్థద్వయముండునట్లును నొక్కొక దేవతను నాలుగేసిశ్లోకములతో వర్ణించెను. నలుని వర్ణించిన నాలుగుశ్లోకములందును నలపరమగునర్థ మొకటియు నేకైకదేవతాపర మగునర్థ మొకటియు వెలయుచున్నది. దమయంతి నలుని గ్రహింపలేక దేవతలను బ్రార్థించి వారిప్రసాదమునఁ దెలివొంది నలుని వెలుపఱచుట కవకాశము గల్గియున్న సరస్వతీవాక్యములను విమర్శింపఁ గల్గి నలుని దేవతలనుండి వేఱుపఱిచి గ్రహించెను. సరస్వతి వర్ణించినవానిలో నలవర్ణనమందును దేవతావర్ణనమందును బ్రతిశ్లోకమునను నలుఁడు వర్ణింపఁబడియుండఁగా, నలవర్ణనాపద్యచతుష్టయములో నొక్కొకశ్లోకమున నొక్కొకదేవతమాత్రమే శ్లేషమూలమున వర్ణింపఁబడుటచే నలమహారాజితఁడని గ్రహించుట కవకాశ మున్నదిగదా! నలుఁడు లోకపాలాంశసంభూతుఁడు గాన దేవతావర్ణనపద్యము లన్నిటియందును నలపరార్థాంతర ముండుటయు నలవర్ణపద్యములలో నేదో యొకదేవతవర్ణనము శ్లేషమూలమున వెలయుచుండుటయు స్వారస్యముగనే యుండునుగదా ? దేవతాప్రార్థనానంతరమున నిట్టివిమర్శనమే దమయంతి చేసి నలుని గ్రహించినట్లును, నట్లు గ్రహించినవిషయమును నక్కాలమున దేవతాప్రసాదమున నగపడఁ

జొచ్చిన భూస్పర్శనాభావాదిదేవతాచిహ్నములచే దృఢపఱిచికొను నట్లును శ్రీహర్షకవి విశదీకరించి యున్నాఁడు.

"శ్లో. ప్రసాద మాసాద్య సురైః కృతం సా సస్మార సారస్వతసూక్తిసృష్టేః,
దేవా హి నాన్యద్వితరన్తి కిన్తు ప్రసద్య తేసాధుధియం దదన్తే.(నై ష. 14-8)

శ్లో. శేషం నలం ప్రత్యమరేణ గాథా యా యా సమర్థా ఖలు యేన యేన,
తాం తాం తదన్యైససహాలగంతీం తదా విశేషం ప్రతి సందధే సా.(నై ష. 14.9)

శ్లో. ఏకైకవృత్తేః ప్రతిలోకపాలం పతివ్రతా త్వం జగృహు ర్ద్విశాం యాః,
వేదస్త గాథా మిళితా స్తదా సా వాశా ఇవైకస్యనలస్య వశ్యాః. (నై ష. 14.10)

శ్లో. నిశ్చిత్య శేషం త మసౌ నరేశం ప్రమోద మేదస్వితరాం తరాభూత్,
దేవ్యా గిరా భావితభంగి రాఖ్యచిత్తేన చింతార్ణవయాద శేదమ్. (నై ష. 14-11)

శ్లో. త్యాగం నరేంద్రాదిచతుష్టయస్య కి మభ్యనంద త్క్రియమూచితస్య,
కిం ప్రేరయామాస నలేచతస్తాం కౌనూక్తిరస్యామమ కః ప్రమోహః (నై ష. 14-15)

శ్లో. పరస్య దారాన్ ఖలు మన్యమానై రస్పృశ్యమానా మమరై ర్ధరిత్రీమ్,
భక్త్యైవ భర్తుశ్చరణౌ దధానాం నలస్య తత్కాల మపశ్య దేషా. (నై ష. 14-16)

శ్లో. సురేషు నాపశ్య దవైతు దక్ష్ణో ర్నిమేష ముర్వీభృతి సమ్ముఖే సా. (నై ష. 14-1.)

శ్లో. సురేషు మాలామమలామపశ్యన్న లేతు బాలా మలినీ భవంతిమ్...(నై ష. 14-20.)

శ్లో. చిహ్నైరమీభి ర్నలసంవిదస్యా స్సంవాద మాప ప్రథమోపజాతా,
సాలక్షణవ్యక్తిభి రేవ దేవ ప్రసాద మాసాధిత మప్యబోధి. (నై ష. 24-22.)

పై పంచనలీసందర్భము నాంధ్రీకరించుటలో శ్రీనాథుని శృంగార నైషధమునం దిట్టిచాతుర్య మగపడదు; కాని సంస్కృతనైషధరీతినే శృంగారనైషధమునందును గవి యింద్రాదిదేవతల నొక్కొక్కపద్య ముతో వర్ణించి వానియందుఁ దత్తద్దేవతాపరముగాను నలపరముగాను నర్థద్వయ ముండునట్లు వర్ణించెను. (శృం. నై. 5-166, 167, 168, 169) నలుని వర్ణించునపు డొక పద్యమును మూఁ డుపమానవాక్యములను రచించియున్నాఁడు. (శృం. నై. 5. 173).

తే.గీ. "*నళినవేత్ర ప్రత్యర్థి దానవహితాహి, తాత్మచేష్టాగరిష్ఠత నరసి చూడ
నితఁడు జీమూతవాహనుఁ డింత నిక్క, మింపు పొంపిరివోవ వీక్షింపు మితని.
(శృం. నై. 5-172)

---

శ్లో. *అత్యాజిలబ్ధివిజయప్రసవ స్త్వయా కింవిజ్ఞాయతే రుచిపదం న మహీమహేంద్రః,
ప్రత్యర్థిదానవశతాహితచేష్టయాసౌ జీమూతవాహనధియం న కరోతి కస్య.

"వ. మఱియు నితండు హుతవహుండునుం బోలె బహువిగాఢ మఘవదర్థ్వ రాజ్యాభిషేకవికస్వర తేజోవిరాజితుండు నీశానమూర్తిభేదంబును, దండధరుండునుం బోలెఁ బరప్రాణాక్రాంతిదానసమర్థశక్తి సంపన్నుండును, సంజ్ఞానందనుండును,వరుణుండునుం బోలెఁ బ్రతికూలవాతప్రచారచటులవాహినీ సహస్రసంసేవితుండును బ్రచేతసుండును నితనిం గనుంగొను మిప్పురుషపంచకంబునందు నీకుం గన్నిచ్చకువచ్చు నతని వరియింపుము. (శృం. నై. 5. 173.)

సంస్కృతనైషధమునందువలె నలపక్షనమునకు మనుప్రకృత శ్లేషతో లోకపాలనలపరార్థద్వయము గల్గునట్లు చెప్పక శ్రీనాథకవి పయిరీతి నుపమానవాక్యములను నిల్పుట నిపుణముగా నుండలేదు.

"తద్భిన్నత్వే సతి తద్గతభూయో ధర్మవత్త్వ"మ్మను లక్షణము చొప్పున నుపమానము భేదసూచక మయియుండఁగా దమయంతి కెట్లు సందేహము గల్గె నని కవి తలంచెనో!

"వెలయఁగఁ బంచనైషధ విశేషము నొల్లుంగలేక." (శృం. నై. 5. 176.) అని యెట్లుచెప్పెనో తెలియకున్నది.

మఱియు శ్రీనాథుఁడు, సరస్వతీశ్లేషవాక్యవిమర్శన శక్తి దమయంతికి దేవతాప్రసాదమునఁ గలె ననియే చెప్పలేదు. దేవతాలక్షణము లగు ధరణీస్పర్శాభావాదులు దేవతలు నలుగురయందుమాత్రము గనుపట్టుటం జేసి దేవతాప్రసాద మక్కఱలేకయే నలుని స్వయముగనే గ్రహించె నని చెప్పియున్నాఁడు. మీఁదుమిక్కిలి దేవతలు మదనార్త లయి

శ్లో. యే నామునా బహువిగాఢసురేశ్వరార్ధ్వ రాజ్యాభిషేకవికసన్మహసా బభూవే,
ఆవర్జనం త మనుతే నను సాధు నామ గ్రాహం మయానల మదీరిత మేవ మత్ర.

శ్లో. య చ్చండిమారణవిధివ్యసనం చ తత్త్వం
బుధ్వాశయాశ్రిత మముష్య చ దక్షిణత్వమ్,
సైషా నలే సహజరాగభరా దముష్మి
న్నాత్మాన మర్పయితు మర్హసి ధర్మరాజే.

శ్లో. కిం తే తథా మతి రముష్య యథాశయ స్సాన్య
త్వత్పాణిపీడనవినిర్మితయే న పాశః,
కా నామవా నవతి నో భువనం చరిష్ణు
ర్నాసా వముత్ర వరతా భవ తీతి యుక్తమ్, (నైష. 13-27, 28, 29, 30)
అని యిట్లు నలపక్షనము శుద్ధశ్లేషగుంభితముగ జేయఁబడియున్నది.

యుండుటచే వా రిప్పట్టున వంచకులయి సహాయపడ రని నైషధము దమయంతి పల్కినట్లు చెప్పి యున్నాఁడు.

తే. గీ. విబుధవరు లేనిఁ బ్రణమిల్లి వేఁడికొందు నలుని; వారేల యిత్తురు నాకు నలుని,
మదనశోషణబాణసంపాతపీతఘనకృపాసింధుగహ్వరాకారమతులు (శృం.నై.5-179)

క. మంచకమధ్యస్థితము, ద్వంచకపంచకమునందు వరుసమెయిఁ బరీ
క్షించెద నే నొక్కింతుక, పంచజననుపర్వలక్ష్యపర్వశ్రేణిన్. (శృం. నై.5-180.)

"వ. అనుచు నేవురం గలయంగనుంగొని యుండు." (5-181.)

మ. ధరణిం బొందనికోమలాంఘ్రికమలద్వంద్వంబులుం ఘర్మశీ
కరయుక్తంబులు గాని ఫాలములు వక్షఃశోణులం బక్షకే
సరము ల్గందనిపూవుదండలు నిమేషవ్యాఖ్య గైకోని దృ
క్సరసీజంబులు నల్వురందుఁ గనియెం గాంతాలలామం బొగిన్.(శృం.నై.5-182)

అని యిట్లు దమయంతి దేవతలను ధిక్కరించి స్వయముగనే నలుని గ్రహించె నని చెప్పి మఱల దేవతలకుఁ గోపముపోవునట్లు వారినిఁ బ్రార్థించి కన్నులు తుడిచినట్లు చెప్పియున్నాఁడు—

"వ. కని యైదవవాఁడు నిషధరాజగుట యెఱింగి దేవతాప్రసాదంబు లేక యేకార్యంబును ఫలింప నేరదు...అనుచు దివిజసభాజనంబునకుం బ్రారంభించి...తత్ప్రసాదలబ్ధం బైనబుద్ధివైభవంబున నమర్త్యవిలక్షణంబు లగు...చిహ్నంబులను సందేహంబువాసి." (శృం. నై. 5-183.)

అని యిట్లు శ్రీనాథుఁడు మూలవిలక్షణముగా నాంధ్రీకరించి యున్నాఁడు. దేవతలఁ బ్రార్థించి వారిప్రసాదమున బుద్ధివైశద్యము నందకముందే నలునిగ్రహించినదమయంతికి దేవతాప్రసాదమున నావఱకున్నజ్ఞానమే కల్గెనని చెప్పుటలో నేమిస్వారస్యమున్నదో తెలియకున్నది.

రామరాజభూషణుఁడన్ననో శ్రీనాథునివలెఁ గాక సంస్కృత నైషధమందువలెనే హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును మిక్కిలి ప్రౌఢిమతోఁ బంచనలిని వర్ణించియున్నాఁడు.

సీ. ఎన్న నేరికిఁ ... ... ... ... సంభ్రమింప. (హ. న. 2-111.)
గీ. అపుడ ... ... ... ... మాత్మఁ బొడమ. (హ. న. 2-12.)
చ. అమరవర ... ... .. ... దద్వశంబుగాన్. (హ. న. 2-113.)

శ్లేషప్రతిబంధ మగుటచే నిందు సంస్కృత నైషధమందువలె విపులముగా వర్ణింపఁజాలకున్నను బయినీసపద్యమునందు రామరాజ

భూషణుఁడు శ్రీహర్షునివలెనే యతిప్రౌఢముగఁ బంచనైషధిని వర్ణించి యున్నాఁడు. పయినీసపద్యమునందు నలపరముగను నైకైకదేవతాపర ముగను నర్థద్వయ ముండునట్లుగ నొక్కొకవాక్యమున నొక్కొక్క దేవతను వర్ణించెను. నలవర్ణనవాక్యమున దేవతాచతుష్టయపరముగను నలపరముగను నర్థపంచక ముండునట్లు సంఘటించెను. ఈ దైనవవాక్య రీతి సంస్కృతనైషధరీతికన్నను ప్రౌఢముగను గూఢముగను వెలయు చున్నది. ఇట్లయిదర్థములతో నలకథాపరార్థమును సంఘటించియు హారిశ్చంద్రకథాపర మైనయర్థమును నైతము లోపము లేకుండ నిర్వ హించెను. ఈసమయమున దమయంతి ఇట్టిశ్లేషగుంభితవాక్యముల వల్ల మొదట నలుని గ్రహింపలేక దేవతలను బ్రార్థించి వారిదయచే బుద్ధివికాసము నొంది సరస్వతీవాక్యముల విమర్శింపఁ గల్గి నలుని గ్రహించి దేవతాకటాక్షమున నపుడు దేవతలయందును నలునియం దును గనఁబడిన దేవతామనుష్యలక్షణభేదములచే మొదటఁ గల్గిన నల విషయకజ్ఞానమును దృఢపఱిచికొని నలుని వరించె నని యిట్లు సంస్కృత నైషధరీతిగనే యిందును గవి నిర్వహించి తనశ్లేషకవితాపాటవమును జూపియున్నాఁడు.

పయినుదాహరించిన తేటగీతిలో "అనంతభూస్పర్శనవిచార మాత్మఁ బొడమ" అనుదానికి, సరస్వతీవాక్యములలోని నలేంద్రాది పరార్థవిమర్శనము (అనంతభూ=అంతము సంభవము లేనిదగు సరస్వతి యొక్క; స్పర్శన=నలేంద్రాదులస్పృశించు వాక్యములయందలి, విచా రము=అర్థవిమర్శనము, ఆత్మ = మనస్సునందు, పొడమగ=అంకురిం పఁగా.) మనసులో నంకురింపఁగా నని యర్థముచేసి తరువాతిచంపక మాలికలోని "అమరవరత్వమావరవరాంచితవృత్తుల వింగడించి" అను దానికి దేవతామనుష్యలక్షణములచే వేఱుపఱిచికొని, యని యర్థము చేయవలసియున్నది. ద్వ్యర్థికావ్య మగుటంజేసి యిందు దుర్ఘట మగు విమర్శన ప్రకారము సంస్కృతనైషధమునందువలె వివరింపఁబడదయ్యె. హారిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యాతపైస్థలములందుఁ బయిరీతి నర్థముచేయ కుండుట శృంగారనైషధమాత్రమననజన్య మగు ప్రమాద మని తోఁచు చున్నది. "అనంతభూస్పర్శనవిచారము' అనుదానికా కాశభూమిపాదస్పర్శన విషయక మగుసుప్రసిద్ధవిషయముయొక్క విచారమని వ్యాఖ్యాత యర్థము

చేసియున్నాఁడు. దేవతాప్రసాదమువలన నిట్టివిమర్శనము మాత్రమె కలిగి యందువలన దేవతామనుష్యలక్షణములనుబట్టి నలుని గ్రహించె నని చెప్పుటయందు మాత్రమె కవి కుద్దేశమున్న యెడల దేవతలను నలుని వర్ణించిన పయిసీసపద్యమునందు దేవతావర్ణనవాక్యములందు దేవతా నలపరార్థద్వయమును శ్లేషించియుండునా? మఱియు నలవర్ణనవాక్యము నందు దేవతాచతుష్టయపరముగను నలపరముగను నర్థము లభించునట్లు నిర్వహించియుండునా ? దేవతలను నలునిరూపముతోనే వచ్చియుండఁ గా దమయంతి దేవతలను బ్రార్థించి తత్ప్రసాదమునఁ గనఁబడిన దేవతా మనుష్యలక్షణములనుబట్టి నలుని నేర్పఱిచె ననిమాత్రమె చెప్పినం జాలునుగదా! అట్టిస్థితిలో సంస్కృతనైషధరీతిని నలుని వేఱుపఱుచుట కనుపుపడునట్లుగ శ్లేషార్థములను నిర్వహించుట కేమిఫలము ? కావున నిప్పట్టున వ్యాఖ్యాతచేసినయర్థమును విడుచుకొని నేను బయినుదా హరించినరీతినే యర్థమును గ్రహింపవలయును. అట్టియెడఁ బయినుదా హరించిన చంపకములో "అమరవరక్షమావరవరాంచితవృత్తులు" అను వ్యాఖ్యాత గ్రహించినపాఠమును విడిచి "అమరవరక్షమావరవరాం చితవృత్తుల" అనుపాఠమును గ్రహింపవలసియున్నది. అట్లు గ్రహించి నను హరిశ్చంద్రకథాపక్షమున భంగము లేదు. (అమరవరక్షమావర వరాంచితవృత్తులన్ = దేవబ్రాహ్మణమాన్యములను; వింగడించి=వేఱు పఱిచి, అని యర్థముచేయనగును.)

"శ్లో. అముష్యవిద్యారసనాగ్రనర్తకీత్రయీవ నీతాంగగుణేన విస్తరమ్." (నైష. 1.5.

అనుశ్లోకములోని భాగమునే హరిశ్చంద్రనలోపాఖ్యానమున నొకచోట—

"సీ. ... ... తనరస, జ్ఞామృతపాకవిద్యానిరూఢి,
తే.గీ. కంగగుణజాత పరిణాహ మనువుపఱిచి." (హ. న. 1-15.)

అని యిట్లు వ్రాసియున్నాఁడు. ఇట్టివాడుక లింకను సందం దరుదుగఁ గలవుగాని విస్తరభీతిని నుదాహరింపలేదు.

"సంగీతకళారహస్యనిధి' యనుతనబిరుదమునకు సరిగా నీత నికి సంగీతమర్యాదాభూషితపద్యములను స్వకృతగ్రంథములలో నుప యోగించుటయు నొకస్వభావ మైయున్నది.

నరసభూపాలీయమునందు, 1-4; 3-112, 115, 130, 133; 5-18; పద్యములం జూచునది. వసుచరిత్రమునందు 1-3; 104, 105, 130; 2, 14, 15, 16, 17, 30, 31, 32; 3-33, 34 పద్యములం బరికించునది.

హరిశ్చంద్రనలోపాఖ్యానమందు 1-32, 63; 2-68, 76 పద్యములం జూచునది.

"సీ. పాలుపొంద నల ... " హ. న. 2-68. (చూ. 136. పు.)

స్వకృత గ్రంథత్రయమునందును బూర్వపూర్వ గ్రంథముల లోని కల్పనముల నుత్తరోత్తర గ్రంథములందుఁ జమత్కరించిచెప్పుటయు నీతని కొకస్వభావ మని చెప్పవచ్చును. ఈవిషయము నారచించిన వసుచరిత్రవిమర్శమునందు విపులముగాఁ జూపియే యున్నాను. (వసు. విమ. 54, 56, 65, 71 పు.చూ.) వసుచరిత్రమునందుఁ బరుద్రోహాదికల్పములు (వసు. 1-158, 159, 3-143, 147-) విశేషముగా నున్నవి. వానికి వన్నె పెట్టి హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును రెండుపద్యములు- (3-36; 2-8.) రచింపఁబడెను. (చూ. 139-పు.)

అల్లె పొండ (పండు) దినిన ధారాశాశక్తి చెడు ననువిషయము నాధారముగాఁ జేసికొని చెప్పినవసుచరిత్రము నలంకరించి హరిశ్చంద్రనలోపాఖ్యానమునవొకపద్యమును జెప్పియున్నాఁడు.(చూ.4.ప్రక.54పు.)

**క. లలన నృసింహునికాఁగిట, నలసిరొు పవళ్లల నిద్రనంచెడి నెలపిక్**
**నెలపొందినరేముద్దులు, గులికి పవ ల్నిద్రవోవుకుముదిని పోలెక్.** (నర. 3-90.)

**చ. కుముదిని వేగునంతకు ... ... ... సరసాళివర్గముల్.** (హ. న. 4-28.)

ఇతరకవులు వర్ణించినవర్ణములకు మెఱుఁగుపెట్టుచుఁ బద్యములను రచించుటయు నీతనికి స్వభావమై యయియున్నది. ఈవిషయము నారచించినవసుచరిత్రవిమర్శనమునందలి రెండవప్రకరణమున విపులముగా నుదాహరింపఁబడియున్నది. (చూ. వసు. విమ. 20-39.)

**సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి ముది మదిదప్పిన మొదటివేల్పు**
**నచటిరాజులు బంటు నంపి భార్గవు నైన బింకానఁ బిలిపింతు రంకమునకు**
**నచటిమేటికిరాటు లలకాధిపతి నైన మును సంచి మొద లిచ్చి మనుప దక్షు**
**లచటినాలవజాతి హాలముఖాంతవిభూతి నాదిభిక్షువు భైక్షు మైన మాన్చు -**
**తే. గీ. నచటివెలయాండ్రు రంభాదు లైన నొరయఁ**
**గాసెకొంగున వారించి గడుపఁ గలరు**

నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టినచిగురుకొ మ్మైనఁ జేవ. (మను. 1-50)

సీ. ప్రాఁతమాటలె కాని ... ... ... ... రచిరరుచుల. (హ. న. 1-7.)

మ. పరిఘం దత్పురకామినీజనము లంభఃకేళి సల్పంగఁ ద
ద్గురువక్షోరుహాలిప్తసంకుమదకస్తూరీ మిళచ్చందనా
గురుపంకంబుల సౌరభంబులఁ జుమీ కుంభీనసావాస ని
ర్జరకల్లోలిని కందు భోగపతి నాఁ జన్నంజ్ఞ గర్గిక దగక. (ఆము. 2-6)

చ. అలఘుతదీయఖేయముల ... ... ... జిల్వపెందొరల్. (హ. న. 1-10)

"మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబున డాఁచి తద్ధళిమం దాఁబోసెనో చొప్పమా
ర్ప వనక్ వెల్వెలఁ బాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ!" మను. 3-54

చ. లలితరసోపభోగదళలజ ... ... ... నయ్యెడక. (హ. న. 4-26.)

శృంగారనైషధమునందును (7-198) శృంగారశాకుంతలమునందును (3-72) మనుచరిత్రమునందును (3-55.) వసుచరిత్రమునందును (4-126)గోఁడికూఁత వర్ణింపఁబడియున్నది. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందు నయిత మావిషయమున నొకపద్యము రచింపఁబడెను. (హ. న. 4_25) ఇంకను నితరవిషయములందును ననేకము లగుననుస్మృతులుగలవు. కానివానినెల్ల నుదాహరించిన గ్రంథవిస్తర మగునని యింతటితో విరమించుచున్నాను.

ఉ. వీనులవిందు చేసెడు నవీనమృణాళమృదూక్తి, శ్లేషస
మ్మానితరీత్యలంకృతి, చమత్కృతిమత్పదచిత్రవృత్తిఁ, దో
డ్తో నరుదెంచువ్యంగ్యములతో నలరారెడు నైజకాంతిఁ, దాఁ
బూనక శూర్చరామనృపభూషణునై పుణ మెన్న శక్యమే?

ఇట్లు, సుజనవిధేయుఁడు,

విజయనగరము.
14-1-1918.

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి.
విజయనగరసంస్కృతకళాశాలాంధ్రప్రధానోపాధ్యాయుఁడు.



శ్రీగణేశాయ నమః.

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

(ద్వ్యర్థి కావ్యము.)

---

## అవతారిక

శా. శ్రీవైదేహసుతన్ భృగూద్వహజయశ్రీ నబ్జభృచ్చాపలీ
లావాప్తిన్ వరియించి సత్కుశలవత్త్వామూల్యమాంగల్యదీ
ప్తావాలం బగు నాపరిగ్రహయుగం బన్యోన్యహార్దంబునన్
సేవింపం దగు రామచంద్రుఁడు శుభశ్రీ లిచ్చు మా కెప్పుడున్. 1

### వ్యాఖ్యాతృకృతస్తుతి.

శా. శ్రీమద్రామపదారవిందయుగళీభృంగాయితస్వాంతు భ
క్తామేయాభిమతార్థదాయకదయైకాయత్తనేత్రాంతు సు
త్రామాదిత్రిదశప్రియంకరభుజాధామాతిశాంతున్ బుధ
స్తోమస్తుత్యయశో[1]నితాంతు హనుమంతున్ భక్తిఁ గీర్తించెదన్.

సీ. శ్రీహనూమద్వరశ్రీలబ్ధసుకవిత్వ
చతురుండ లక్షణసారసంగ్ర
హం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁ
డగు చిత్రకవి పెద్దనార్యసుతుండ
విష్ణుచిత్తీయాది వివిధకావ్యార్థముల్
దెలిసి వక్కాణించు ధీరనుతుఁడ

---

1. నిశాంతు.

గండికోటాఖ్యదుర్గస్థలాధ్యక్షుఁడై
పృథివి[1]మంతున కెక్కు పెమ్మసాని
గీ. చిన్నతిమ్మక్షమాపాలశేఖరుండు
గారవింపంగ బహుమానగౌరవముగ
మనినధన్యుండ సభ్యసన్నుతగుణైక
గరిమ వెలయు ననంతాఖ్యకవివరుండ.

క. ముఖ్యంబై భూస్థలి భూ
రిఖ్యాతిం గాంచి తగు హరిశ్చంద్రనలో
పాఖ్యానకావ్యమునకుఁ
వ్యాఖ్యాన మొనర్తు విబుధవర్యులు పొగడన్.

టీక. శ్రీవైదేహసుతన్=లక్ష్మీస్వరూపిణియైనసీతను, భృగూద్వహజయశ్రీన్= పరశురామజయలక్ష్మిని, అబ్జభృచ్చాప - అబ్జ=శంఖము, చంద్రుఁడు. * ('అబ్జౌ శంఖ శశాంకౌ చ' అని యమరము.) భృత్ = (శంఖమును) భరించునట్టి విష్ణువుయొక్కయు, (చంద్రుని) భరించునట్టి శివునియొక్కయు, చాప = ధనుస్సులయొక్క, లీలావాప్తిన్= విలాసమునఁ బొందుటచేత, పరిణయించి=కుంకువసరిగాఁ జేసి (వరించి యనుట), సత్కుశలవత్త్వామూల్యమాంగల్యదీక్షావాలము-సత్ = శ్రేష్ఠమైన, కుశలవత్త్వ=కుశలవులు గలుగుటచేతను, కుశలము గలుగుటచేతను, అమూల్యమైన, మాంగల్యదీక్షకున్ = వివాహదీక్షకు, ఆవాలంబు=ఆటపట్టైన, ఆపరిగ్రహయుగంబు = ఆభార్యాయుగ్మము, *('పత్నీపరిజనాదానమూలశాపాః పరిగ్రహాః' అని యమరము.) అనోన్యహార్దంబునన్= పరస్పరస్నేహముచేత, (సత్కుశలవత్త్వము సమానముగ నున్నందున వారిద్దఱు నన్యోన్యమైత్రిగలిగి) సేవింపఁగా, తగు రామచంద్రుఁడు, మాకున్, ఎప్పుడును, శుభశ్రీలు = శుభసంపదలు, ఇచ్చునుగాక యని యాశీర్వాదరూప మంగళము.

సీ. నిఖిలలోకానందనీయస్థిరోద్భాతిఁ
బొలుచు ననాదృతాంభోజపాణి
యంభోధిమథనాసహాయశౌర్యవరాప్తిఁ
జాల మించుననాప్తసంఖ్యశీల
పంకదూరకృపీటభవనివేశప్రాప్తిఁ
బరఁగు నప్రతిపన్నభంగధామ
యతిలాలితాక్షీణసుతసంపదఁ దనర్చు
నకళంకిసహజ కళాధివసతి

1. వంతుకు నెక్కు.

గీ. సుదతులు నుతింప నభినవసురుచిరమణి
యొనయకుండ నిజాధీశహృదయపీఠి
వెలయుసీతాభిధానవనవీనలక్ష్మి
నిశ్చలైశ్వర్యములు గరుణించుఁ గాత. 2

టీక. నిఖిల...ద్భూతిఁ-నిఖిల = సమస్తములైన, లోక=లోకములచే, ఆనందనీయ=సంతోషింపఁదగిన, స్థిరా=భూమియందు, ఉద్భూతి=పుట్టుకచేత, పొలుచు...పాణి-పొలుచు=ప్రకాశించు, అనాదృత=ఆదరింపఁబడని, అంభోజ=కమలములుగల, పాణి=హస్తములుగలదియు,(ఇది సీతాపరమైనయర్థము. ఈపద్యమునందు శబ్దార్థశక్తులచేత సీతాఖ్యనూతనలక్ష్మియందు ఆధిక్యమును, లక్ష్మియందు నైచ్యమును బ్రతిపాదింపఁబడినది.) నిఖిల...ద్భూతి-నిఖిలలోక = సమస్తలోకములచే, ఆనందనీయస్థిరోద్భూతిఁ=సంతోషింపఁదగిన స్థిరమగుసంపదలేమిచే, పొలుచు...పాణి-పొలుచు = వెలసియున్న, అ+నాదృత=మిక్కిలియాదరింపఁబడిన; అంభోజ=కమలములుగల, పాణి=హస్తములు గలది, అంభోజముల నిరసింపలేని హస్తములు గలదనుట)(ఇది లక్ష్మీపరమైన యర్థము.) అంభోధి...పరాప్తిఁ - అంభోధి=సముద్రముయొక్క,మథన=భేదించుటయందు, (సేతుబంధనమం దనుట) అసహాయశౌర్య=అసహాయశూరుఁడైన, పర=భర్తయొక్క, (రామునియొక్క)ఆప్తిఁ=పొందుటచేత, చాల=మిక్కిలి, మించు...శీల-మించు=ప్రకాశించు, అనాప్త=పొందఁబడని, సంఖ్య=సంఖ్యగల, శీల =ఆచారముగలది(అసంఖ్యానశీలముగలదియనుట.) (సీ.ప). అంభోధి...పరాప్తిఁ-అంభోధిమథన=సముద్రమథనమందు, అసహాయ = మిక్కిలి సహాయులుగల, శౌర్య=పరాక్రమముగల, పర=భర్తయొక్క (విష్ణువుయొక్క), ఆప్తిఁ=ప్రాప్తిచేత, చాల, మించు, అ+నాప్త=పొందఁబడిన, సంఖ్య=సంఖ్యగల, శీల=ఆచారముగలది(అనఁగా: పరిమితమైన శీలముగలదనుట)(ల.ప), పంక...ప్రౌఢిఁ-పంకదూర=పాపరహితమైన, కృపీటభవ=అగ్నియందలి,నివేశ=ప్రవేశించుటయొక్క, ప్రౌఢి=అతిశయముచేత,పరఁగు...ధామ-పరఁగు=ఒప్పుచున్న, అప్రతిపన్న=పొందఁబడని, భంగ=భంగముగల, ధామ=స్థానముగలది. (సీ. ప). పంకప్రౌఢిఁ-పంక = పంకము (పాపము-బురద). దూర = (కొంచెము) దూరమందుఁగల, (ఇచ్చటదూరస్థితత్వ మవివక్షితము.) కృపీటభవ = పద్మమునందు, నివేశ = ఉండుటయొక్క, ప్రౌఢి = అతిశయముచేత, (పంకసహితమగు పద్మమునందు నివసించుటచేత ననుట.) పరఁగు, అ: ప్రతిపన్న = పొందఁబడిన, భంగ = భంగములు (భంగపాటు-తరంగములు) గలది (సముద్రమె,) ధామ = (తేజము) స్థానముగాఁగలది. (భంగము (తరంగము - భంగపాటు) నొందిన సముద్రము నిలయముగాఁగలది-భంగమునొందిన తేజముగలది) యతి...సంపదఁ-యతి=వాల్మీకి)మునిచేత, లాలిత = లాలింపఁబడిన, అక్షీణ = చెడని, సుతసంపదఁ =

పుత్రసంపదచేత, తనర్చు...వసతి-తనర్చు = ప్రకాశించు, అకళంకి = దోషము లేని, సహజ = స్వాభావికములైన, కళా=కళలకు, అధివసతి = స్థానమైనది. నిష్కళంకకళాధామురా లనుట) (సీ.ప). అతి...సంపదన్-అతి = అతిశయమగు, లాలిత= లాలింపఁబడిన, అక్షీణ = ఎక్కిలిక్షీణించు, సుత=కుమారులయొక్క, సంపదన్= సంపదచేత, తనర్చు. అకళంకి...వసతి = అకళంకి యగు తోడఁబుట్టిన చంద్రుఁడు గలది. ఈయర్థమునందు "అకళంకి" యని ద్విత్వములేమి విచార్యము. అనఁగా: తనతోఁబుట్టువు దోషయుక్తుఁ డనుట) సుదతులు=స్త్రీలు, నుతింపన్ = స్తోత్రము సేయఁగా, అభి...రమణి...అభినవ = క్రొత్తదైన, సురుచి = మంచికాంతిగల, రమణి=స్త్రీ, ఎనయకుండన్=పొందకుండ (అనఁగా: వనితాంతరమును బొందకుండ ననుట)నిజా ... పీఠి = తనభర్తయొక్క హృదయపీఠమునందు, వెలయు = ప్రకాశించు, (సీ.ప). అభి...మణి = అభినవ = క్రొత్తదైన, సురుచిర = మిక్కిలి ప్రకాశించు, మణి = (కౌస్తుభ) మణి, ఎనయకుండన్, నిజాధీశహృదయపీఠి = తనభర్తయొక్క ఱొమ్మనుపీఠమందు, వెలయు, సీతాభిధాన=సీత యను పేరుగల, నవీనలక్ష్మి = క్రొత్తలక్ష్మి, నిశ్చలైశ్వర్యములు = చలనములేని సంపదలు, కరుణించుఁగాత = దయ సేయును గాత! (ఇందు—లోకానందనీయము గాని యస్థిరోద్భూతి గలదగుట చేతను, కమలముల నిరసింపఁజాలని హస్తములు గలదగుటచేతను, అంభోధిమథనము నందు ససహాయశౌర్యుఁడైన భర్త గలదగుటచేతను, పరిమితశీలము గలదగుటచేతను, పంకసహితమగు పద్మము నివాసము గాఁ గలదగుటచేతను, నష్టతేజస్సు గలదగుటచేతను, కళంకియగు తోబుట్టువు గలదగుటచేతను, ఱొమ్మునందలి మణి ప్రకాశింపకుండునట్లు ఱొమ్ముపై నెక్కనదగుటచేతను పూర్వలక్ష్మికి నైచ్యము వర్ణింపఁబడినది.)

ఉ. అంచితరాజ్యరక్ష కఖిలావనపావనరామపాదుకల్
గాంచినమేటి గావున నకంటకకోమలతాయుతాత్మ ని
శ్చంచలభావనాసరణి సారెఁ జరింపఁగ నమ్మహాత్ము సం
ధించి తదాత్మతన్ దగుసుధీనిరతున్ భరతున్ భజించెదన్. 3

టీక. అం...రక్షకు - అంచిత = ఒప్పుచుండెడు, రాజ్యరక్షకున్ = రాజ్యపరిపాలనముకొఱకు, అఖిల...పాదుకల్-అఖిల = సమస్తమును, అవన = రక్షించుటచేత, పావన = పరిశుద్ధుఁడైన, రామ = రామునియొక్క, పాదుకల్ = పావకోళ్లను, కాంచినమేటి గావున, అకంటక...సరణి - అకంటక = కామక్రోధాదిరహితమై, కోమలతా = మార్దవముతో, యుత = కూడిన, ఆత్మ = హృదయమందు, నిశ్చంచలమైన, భావనాసరణిన్=ధ్యానమార్గమున, సారెన్ = పలుమఱు, చరింపఁగన్= సంచరించునట్లు,అమ్మహాత్మున్=ఆరామచంద్రుని, సంధించి=పొందించి, తదాత్మతన్ = ఆరామునివలె మునిరూపమును ధరించుటచేత, తగు, సుధీనిరతున్ = ఉచితజ్ఞుఁడైన, భరతుని, భజించెదను. (ఉచితజ్ఞుఁ డనుటచే— భరతుఁ డరణ్యమునకుఁ బోవు

రాముని పాదుకలు ధాం దీసికొనియుం గాన నారాముని ముందులేక మెత్తనైనమార్గ మున నడిపించె ననియుం దన్నిరంతరధ్యానముచేత భ్రమరకీటన్యాయముగా సారూప్యము వహించె ననియు ధ్వని.)

మ. నిజనిద్రాలసతావిగాన మెడలన్ నిర్నిద్రతావృత్తిం బూ
ని జగత్ప్రాణహృతిప్రవాద ముడుగన్ విశ్వావనోత్సాహియై
యజరారాతివిఘాతికిన్ [1]వనవిహారాధార మై పొల్చు సూ
రిజనప్రస్తుతశేషభావనిరతున్ శ్రీలక్ష్మణున్ గొల్చెదన్. 4

టీక. నిజ...గానము-నిజ=స్వకీయమైన, నిద్రాలసతా=నిద్రాలస్యముచేతనైన, విగానము=నింద, ఎడలన్=పోవునట్లుగ, నిర్నిద్రతావృత్తిన్=నిద్రలేకపోవువర్తన మును, పూని, జగ...దము - జగత్ప్రాణ=జగజ్జనప్రాణములయొక్క-యు, వాయువు యొక్క-యు,హృతి = హరణముచేనైన, ప్రవాదము=అపవాదము, ఉడుగన్=పోవు నట్లు, విశ్వా...యై=ప్రపంచరక్షణమందు సంతోషముగలవాడై, అజరారాతివిఘాతి కిన్=రాక్షససంహారకుడైనరామునకు,వనవిహారాధారమై=అరణ్యవాసమునందు దాధా రభూతుడై (జలవిహారమునందాధారభూతుడై), పొల్చు, సూరి...నిరతున్-సూరి జన = పండితులచే, ప్రస్తుత=స్తోత్రముచేయబడిన, శేషభావ=ఆదిశేషభావమునందు, భృత్యభావమునందు, నిరతున్=ఆసక్తుడైన,శ్రీలక్ష్మణున్=సంపద్యుక్తుడైన లక్ష్మణుని, కొలిచెదను. (మున్నుండినగుణములయందు నిద్రాజగత్ప్రాణహరణగుణములు విడిచి దైత్యాంతకునకు వనవిహారాధార మగుటచేవిడువని సభ్యసన్నుతశేషాంశము గలవాం డనుట. భృత్యభావనిరతుడైనవాడు జాగరూకత గలిగి యపవాదము రాకయుండ రక్షణతత్పరుండై తనయేలినవాని విహారమున కాధారమై యొప్పు నని ధ్వని.)

మ. లవణోదాత్తశరప్రకర్ష హృతి లీలాధీరనారాచలా
ఘవ మాత్మశ్రితరామభద్రపదరక్షాలక్ష్మియుం గాన్చ కా
రవనిర్భర్త్సితమేఘనాదతయుం బోరం బూని త్రైలోక్యసం
స్తవనీయాగ్రభవత్రయీచరితుడౌ శత్రుఘ్నుం బ్రార్థించెదన్. 5

టీక. లవణో...లాఘవము-లవణ=లవణాసురునియొక్క-, ఉదాత్త=ఉదాత్త మైన, శరప్రకర్ష=బాణప్రకర్షయొక్క-, హృతిలీలా=హరణక్రియయందు,*('లీలా విలాసక్రియయోః'అనియు.) ధీర=సమర్థమైన, నారాచలాఘవము=బాణలాఘవమును, (లవణోద=లవణసముద్రముయొక్క-, ఆత్త=పొందబడిన, శరప్రకర్ష = ఉదకాధి క్యముయొక్క-, హరణక్రియయందు సమర్థమైన బాణలాఘవ మని రామునిగుణమును)

1. వర.

ఆత్మ...లక్ష్మియున్-ఆత్మ = తనచేత, శ్రిత=పొందఁబడిన, రామభద్రపద = రామ రాజ్యముయొక్క, రక్షాలక్ష్మియును (ఆత్మశ్రిత=తనచేత సేవింపఁబడిన, రామభద్రుని యొక్క, పదరక్షాలక్ష్మియున్=పాదుకాలక్ష్మియును; అని భరతునిగుణమును;) కార్ముకారవ...నాదతయున్ - కార్ముకారవముచేత, నిర్భర్త్సిత=నిరసింపఁబడిన, మేఘనాదతయు = మేఘధ్వనియును, (కార్ముకధ్వనిచేత నిరసింపఁబడిన, మేఘనాదతయు = ఇంద్రజిత్తు గలుగుటయు, అని లక్ష్మణునిగుణమును,) పోరక్, పూని, త్రైలోక్య...చరితుఁడు-త్రైలోక్య = ముల్లోకములయొక్క, సంస్తవనీయ = స్తోత్రము చేయఁదగినవారియందు, అగ్రభవ = శ్రేష్ఠుఁడైన, త్రయీచరితుఁడు=(లవణాసుర శరప్రకర్షహృతి లీలాధీరనారాచలాఘవాది) మూఁడుగుణములను పూనిన చర్యగల వాఁడు, త్రైలోక్యసంస్తవనీయ = ముల్లోకములయందలి జనులచేత స్తోత్రముచేయఁ దగిన, అగ్రభవత్రయీ = ముగురన్నలయొక్క (రామ, భరత, లక్ష్మణులయొక్క) చరితుఁడు=చర్యగలవాఁడు, ఔ=అగు, శత్రుఘ్నుని ప్రార్థనచేసెదను.

సీ. రామభక్తునకు భారమె ఘోరపంకాబ్ధి
తరణపాటవ మన శరధి దాఁటి
రామభక్తున కరుదా మృత్యునిరసనం
బన మహాచ్ఛాయాగ్రహంబుఁ జీరి
రామకింకరున కబ్రమె రమాసాన్నిధ్య
మన విదేహాధీశతనయఁ గాంచి
రామైకమతికిఁ జిత్రమె పాశవిగళనో
పాయం బన నజాస్త్రబంధ మెడలి
గీ. రామపరతంత్రునకు దుర్భరంబె విలయ
వహ్ని యన వాలశిఖిశిఖావ్యాప్తి నార్చి
యరిపురం బేర్చినయజేయు నప్రమేయు
నాంజనేయు మునిధ్యేయు నభినుతింతు. 5

సీ. కవినివేశితకృపాకలితుఁడౌ నితని భా
రతి కవిప్రతతికిఁ బ్రాపు గాదె?
ప్రతినవచ్ఛందోనిబద్ధుఁడౌ నితని భా
వ్యము బహుచ్ఛందోమయంబు గాదె?
వీణాయతిసహాయవృత్తియౌ నితని భా
షితము వీణాయతియుతముగాదె?

చతురాననప్రీతిశాలియగా నితని స
త్కృతి చతురానన యుతముగాదె?

గీ. యని మునులు మెచ్చ నసురశాసనపదాంక
మహితదివ్యసరస్వతి మహికిఁ దెచ్చి
జనుల కెల్లను సుగతిఁ జూపినయనంత
సుగుణసాగరుఁ బ్రాచేతసుని భజింతు? 7

టీక. కవి...కలితుఁడు-కవి = క్రౌంచపక్షియనెడి కవీశ్వరునియందు, నివేశిత= ఉంపఁబడిన, కృపా=దయచేత, కలితుఁడు=ఒప్పువాఁడు, ఔ=అగు, ఇతని = ఈ వాల్మీకియొక్క, భారతి=సరస్వతి, కవిప్రతతికిన్=కవిసమూహమునకు, ప్రాపుగాదె?= ఆశ్రయముకాదా? (ఆశ్రయమే యనుట). ప్రతినవచ్ఛందోనిబద్ధుఁడు - ప్రతినవమైన, ఛందః = వేదము అనియెడి ఉక్తానుక్తాది ఛందస్సులయందు, బద్ధుఁడు = ఆసక్తుఁడు, ఔ = అగు, ఇతని (వాల్మీకి) యొక్క, కావ్యము, బహుఛందోమయంబుగాదె = ఛందోరూపముకాదా? (ఛందోరూపమే యనుట!). వీణాయతి=నారదుఁడనియెడి వీణానియతిగల వైణికునియొక్క,-సహాయవృత్తి = సహాయముగలవాఁడు, ఔ=అగు ఇతని (వాల్మీకి) యొక్క భాషితము, వీణా...తము-వీణా = వీణయందలి, యతి=గోపుచ్ఛాదియతులచేత, యుతముకాదే = బద్ధముకాదా! (బద్ధమే యనుట.) చతు...శాలి-చతురానన = బ్రహ్మయనెడి కుశలముఖునియొక్క, ప్రీతిచేత, శాలి= ఒప్పెడునట్టివాఁడు, ఔ = అగు, ఇతని (వాల్మీకి)యొక్క, సత్కృతి, చతు...తము-చతుర = చతురులయొక్క, ఆనన=ముఖములయందు, యుతముకాదె = కూడుకొనినదికాదా! (కూడినదె యనుట. అనఁగా: చతురులైనవారందఱుఁ జదువుదురనుట.) అని మునులు మెచ్చఁగా, అసురశాసన...సరస్వత-అసురశాసనపద = విష్ణుపాదమనియెడి దేవలోకమునకు, అంక = చిహ్నమును, మహితమును నైన. దివ్యసరస్వతిన్ = దేవనదియనెడి గీర్వాణభాషను, మహికిన్=భూమికి, తెచ్చి, జనులకెల్లను, సుగతి = మోక్షమును, మంచిమార్గమును, చూపిన, అనంతసుగుణసాగరు = అనంతసుగుణి యగు భగీరథుఁడైన, గుణసముద్రుఁడైన, ప్రాచేతసుని = వాల్మీకిమహామునిని, భజింతును. (సాగరుఁడు = సగరవంశమువాఁడు.)

మ. అనఘశ్రీరఘురామనామజపవర్ణాపూర్ణవల్మీకజా
ననజాతప్రథమావతారకవితానాకేశకల్లోలినీ
ఘనకుల్యాయితకల్యవాగమృతరాకాచంద్రులం గీర్తిసా
ధననిస్తంద్రుల సత్కవీంద్రులను మేధాసాంద్రులన్ గొల్చెదన్. 8

---

1. హితము.

మ. అతిమాత్రస్ఫురితార్థవైభవము నౌదార్యాదినానాగుణా
యతిశక్తిత్రితయైకధుర్యతయు లేకాత్మైకదేశాప్తిగ
ర్వితుఁ డూహింపక తానహీనపదధౌరేయాంకముల్ పూనినం
బ్రతిరోధింపఁ దరంబె ధీరునకు దృగ్రాగంబు [1]సంధించినన్. 9

టీక. అతిమాత్రస్ఫురితమగు నర్థవైభవమును, ఔదార్యాది...ధుర్యతయు- ఔదార్యములైన, నానాగుణ=(ప్రసాద సమతా మాధుర్య సౌకుమార్యార్థవ్యక్తి శ్లేష కాంతిసమాధు)లను కావ్యగుణములయొక్క, ఆయతియును, శక్తిత్రితయ=(అభిధా లక్షణా వ్యంజన లను) మూఁడు శబ్దశక్తులయొక్క, ఏకధుర్యతయు = దురంధరత్వమును, లేక, ఆత్మైక...గర్వితుఁడు-ఆత్మ=స్వకీయమైన, ఏకదేశ (పైనిరూపించిన యర్థవైభవాదిగుణములలో) నొకయంశముయొక్క, ఆప్తిన్=పొందుటచేత, గర్వితుఁడు (అనఁగా దుష్కవి యనుట.) అహీన ... అంకముల్ - అహీన=ఆదిశేషువుభంగి* ('ఇన సూన్వర్యే ప్రభౌ' అని అమ) పదధౌరేయ=శబ్దధురంధరుఁడైనవానియొక్క, అంకముల్ = బిరుదులు పూనిన మాత్రముననే, ధీరునకున్=విద్వాంసునకు, దృగ్రాగంబుసంధించినన్ = కన్నులెఱ్ఱచేసిన, (కోపమువచ్చిన ననుట.) ప్రతిరోధింపన్ = ఎదిరించుటకు, తరంబె = సాధ్యమా! (అనఁగా: సాధ్యము గానేరదని పూర్వమున కన్వయము. ఇందలిధ్వని:—అర్థవైభవము = ద్రవ్యవిభవమును, దాతృత్వము మొదలగు నానాగుణములయొక్క ఆయతియును, శక్తి...తయు = ప్రభుమంత్రోత్సాహశక్తులయొక్క, ధురంధరత్వమును, లేక, ఆత్మైక ... తుఁడు - ఆత్మ = తనయొక్క, ఏకదేశ=ఒకప్రదేశముయొక్క, ఆప్తిచేత, గర్వితుఁడు (గర్వించినరాజు), తాను, అహీనపదధౌరేయ = అనేక రాజ్యధురంధరునియొక్క (సార్వభౌముని యొక్క యనుట), అంకముల్ = బిరుదులు, పూనినంతనే, ధీరునకు = ధైర్యవంతుఁడైనరాజునకు, దృగ్రాగంబు సంధించినన్ = కోపముచేత నేత్రము లెఱ్ఱగాఁగా, ప్రతిరోధింపన్ తరంబె? అని యన్వయము.)

వ. అని యివ్విధంబున నిష్టదేవతామననమంగళసమాచరణంబును సుకవిచరణపరిచరణంబును గుకవిత్వతృణీకరణంబును గావించి యేను పురాతన పుణ్యశ్లోకచక్రవర్తిచంద్ర హరిశ్చంద్రనలకథాయుగయుగపదనుసంధానబంధురరసానుబంధం బగు చిత్రప్రబంధంబు నిర్మింపం బూని యున్నసమయంబున నొక్కనాఁడు మదీయస్వప్నంబున. 10

సీ. అధ్యయనాబ్ధిపారాభిజ్ఞుఁ డగువాఁడఁ
గరగతబహుశాస్త్రగరిమవాఁడ

1. సంధిల్లినన్.

ప్రౌఢపలాశదండాఢౌకనము వాఁడఁ
పరమసూర్యాచార్యభక్తివాఁడ
విశ్రుతాగమవర్తి వినుతిఁ గాంచినవాఁడఁ
బలవదక్షనిరోధపటిమవాఁడఁ
కుశగురుగుణయోగవిశదాత్ముఁ డగువాఁడఁ
బావనాన్వయరూఢిఁ బరఁగువాఁడఁ
గీ. ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత
పోబలంబునఁ గడు బిఱుపోనిగోఁచి
వాఁడ ననుచు నిజానుభావంబుఁ దెలిపి
పలికె వాత్సల్యమున వటుప్రవరుఁ డోకఁడు. 11

టీక. అధ్యయనాబ్ధిపారాభిజ్ఞుఁ డగువాఁడన్ = వేదాబ్ధిపారమును దెలిసినవాఁడను; కరగతబహుశాస్త్రగరిమవాఁడన్ = హస్తగతమైన యనేకశాస్త్రగౌరవము కలవాఁడను; ప్రౌఢ...వాఁడన్ = ప్రౌఢమైన మోదుగుదండముయొక్క పరిప్రాప్తి గలవాఁడను; పరమ...వాఁడన్ = మిగుల విద్వాంసులైన యాచార్యులయందు భక్తి గలవాఁడను; విశ్రుత...వాఁడన్-విశ్రుత = ప్రసిద్ధులైన; ఆగమవర్తి = వేదప్రవర్తకులచేత, వినుతిఁ గాంచినవాఁడను; బలవ...వాఁడ - బలవదక్ష = బలవంతములైనయింద్రియములయొక్క, నిరోధమందలి నేర్పుగలవాఁడను; కుశ...వాఁడ - కుశ = దర్భలచేనైన, గురు = గొప్పదయిన, గుణ = రజ్జువుయొక్క, (ముంజియొక్క యనుట.) యోగముచేత నిర్మలమైన మనస్సుగలవాఁడను; పావనా...వాఁడన్ - పవిత్రమైన అన్వయరూఢిన్ = వంశవిఖ్యాతిచేత, పరఁగువాఁడను; ప్రతినవబ్రహ్మచర్యాప్తి = నూతనబ్రహ్మచర్యవ్రతముయొక్క పొందుటచేత; భవ్యతర = శ్రేష్ఠమైనతపోబలముచేత, కడుఁబిఱుపోని గోఁచివాఁడ = మిక్కిలి వెలితికానివాఁడను. అనుచు నిజానుభావంబున్ = తనప్రభావమును.

క. శ్రీరామభూషణ! వచ
శ్శ్రీరసపోషణ! భళీ! హరిశ్చంద్రనల
క్ష్మారమణచరితయుగళా
వ్యారంభముఁ బూని తనుపమాద్భుతశక్తిన్. 12
మ. చను దుస్స్పర్శకళంకపంకము హరిశ్చంద్రప్రశంసన్ దొలం
గు నలశ్లోఘుఁ గలిప్రపీడనము దత్క్షోణీశయుగ్మైకకీ
ర్తన మత్యంతఫలప్రదం బగుట చిత్రం బే భవత్పుణ్యవా
సన నేతాదృశకావ్యరాజరచనోత్సాహంబు గల్గెన్ మదిన్. 13

సీ. సుతులఁ బెక్కండ్ర శాశ్వతరామనామధ
న్యులఁ జేసి పిలుచుభాగ్యోదయంబు
రచితాగ్రహారంబు రామచంద్రపురాంక
పూతం బొనర్చినపుణ్యరేఖ
నవదివ్యభవనంబు నవరించి శ్రీరామ
విభుఁ బ్రతిష్ఠించినవిపులమహిమ
రామసరోనామరమణీయముగఁ దటా
కము వినిర్మించినఘనయశంబు

గీ. సఫలత వహించు నీహరిశ్చంద్రనలక
థాయుగ[1]నిబంధచిత్రబంధప్రబంధ
మంకిత మొనర్పు రఘుభర్త కఖిలకర్త
కురుతరాభీప్సితము లెల్ల నొడవు నీకు. 14

మ. అని యంతర్హితుఁడైన మేలుకని యత్యంతాద్భుతశ్రీ మనో
వనజాతంబునఁ గందళింపఁ బులకవ్రాతంబు మేనన్ జనిం
ప నసాధారణ హర్షబాష్పకణసంభారంబు నేత్రద్వయం
బున దీపింపఁ దదీయదివ్యవచనంబుల్ భక్తి నూహించుచున్. 15

సీ. అధ్యయనాబ్ధిపారాభిజ్ఞుఁ డగువాఁడు
కరగతబహుశాస్త్రగరిమవాఁడు
ప్రౌఢపలాశదండాఢాకనము వాఁడు
పరమసూర్యాచార్యభక్తివాఁడు
విశ్రుతాగమవర్తి వినుతిఁ గాంచినవాఁడు
బలవదక్షనిరోధపటిమవాఁడు
కుశగురుగుణయోగ విశదాత్ముఁడగువాఁడు
పావనాన్వయరూఢిఁ బరఁగువాఁడు

గీ. ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత
పోబలంబునఁ గడుబీడువోనిగోఁచి
వాఁడు నలయంజనానందవర్ధనుఁడె
కాక యొరులకు నిట్టివైఖరులు గలవె ? 16

---

1. నిబంధబంధచిత్రప్రబంధ.

టీక. అధ్యయన...వాఁడు- అధ్యయన = మార్గము నతిక్రమించిన (శ్రోత్రియుఁ డనుట.) అబ్ధిపార = సముద్రముయొక్క యావలిదరిని, అభిజ్ఞుఁడగు వాఁడు = ఎఱిఁగినవాఁడు, కర...వాఁడు- కర = హస్తములచేత, గత = పొందఁబడిన, బహుళమైన, శాస్త్ర = శస్త్రసంబంధమైన, గరిమ = గొప్పతనము కలవాఁడు, ప్రౌఢ...వాఁడు- ప్రౌఢమైన, పలాశదండ = రాక్షసదండనముయొక్క, ఆఢౌకనమువాఁడు = సంప్రాప్తిగలవాఁడు; పరమ...వాఁడు - పరమశ్రేష్ఠుఁడైన, సూర్యాచార్య = ఆచార్యుఁడైనసూర్యునియందు, (సూర్యుఁ డను నాచార్యునందు) భక్తిగలవాఁడు; విశ్రుతాగమ...వాఁడు-విశ్రుతులైన, అగమువర్తి = వనచరులచేత, వినుతిఁ గాంచినవాఁడు; బల...వాఁడు-బలవంతుఁడైన, అక్ష = అక్షాసురునియొక్క, నిరోధమునందు సామర్థ్యముగలవాఁడు; కుశ ...వాఁడు- కుశగురు = రామునియొక్క గుణములయొక్క, యోగ = ధ్యానముచేత ("యోగస్సన్నహనోపాయధ్యానసంగతి యుక్తిషు" అనియు.) నిర్మలమానసుఁ డగువాఁడు; పావ...వాఁడు-పావన = పవన (గాలి) సంబంధమైన, అన్వయరూఢి = వంశప్రసిద్ధిచేత, పరఁగువాఁడు; ప్రతి... బలంబునన్ - ప్రతినవబ్రహ్మ = నూతనబ్రహ్మయొక్క, చర్య= చరిత్రముయొక్క, ఆప్తి=ప్రాప్తికొఱకైన, భవ్యతరతపోబలంబునఁ గడు బీఱునోనిగోఁచివాఁడు; అంజనాదేవియొక్క యానందమును వృద్ధినొందించు నాయాంజనేయుఁడు కొకపోయిన నితరుల కిట్టివైఖరులు గలవా? (అనఁగా లేవనుట.)

తే. తాదృశకవిత్వనిధిలాభధన్యుఁ జేసి
నన్నుఁ బ్రోచినయంజనానందనునకుఁ
[1]దగవె కాదె? తదర్హముద్రాహితోప
దేశభాగంబని నుతించి కౌశలమున. 17

టీక. తాదృశ=అటువంటి (మహనీయమైన), కవిత్వ...ధన్యున్-కవిత్వనిధి= కవితయను నిధియొక్క, లాభముచేత, ధన్యున్=కృతార్థుని, చేసి, నన్నుఁబ్రోచిన-అంజనానందనునకున్=అంజనేయునకు (అంజనముచేత సంతోషపఱచువానికి), తదర్హభావంబు-తదర్హ = అకవిత్వార్హమైన (అనిశ్లేషార్హమైన), ముద్రా = అంకనము (గుఱి)యొక్క, హితోపదేశభారము యుక్తమేకదా (అనఁగాఁ దగును.) అని నుతించి కౌశలమునన్ = కుశలతతోడన్ (అని పైపద్యముతోనన్వయము.)

చ. తదుదితపద్ధతిన్ గృతికి దాశరథిం బతిఁ జేసి తత్త్రయీ
విదితచరిత్రవైభవము విస్రుతసన్ముని పావనాననా

1. దగునే కొదె...భావంబని.

భ్యుదితసరస్వతీవినుతియోగ్యమనోహితశక్తియైన త
[1]త్పదయుగభక్తి నొక్కయురుతం బచరింప నుతింతు నెంతయున్.

టీక. తదుదితపద్ధతిన్=ఆయాంజనేయునిచేతఁ జెప్పఁబడిన మార్గమున (అనఁగా: శ్రీరామునికిఁ గృతియిమ్మని స్వప్నమునఁ జెప్పినతీరున ననుట.), దాశరథిన్=రాముని, పతిన్=కృతినాథునిఁగా; త్రయీవిదిత=వేదప్రసిద్ధమైన.

సీ. అజభవప్రీతిగా నఖిలమంగళమహా
విర్భూతిఁ గాంచిన విష్ణుమూర్తి
విమలస్మృతిసుధోదయముగాఁ జతుర్వ్యక్తి
విభవంబుఁ బూనిన వేదమూర్తి
భువనచైతన్యసంభవముగా [2]నిశిచరీ
ఘాతియైన శుభప్రకాశమూర్తి
గురుసత్క్రియాఫలస్ఫురణగా నతులధా
త్రీకరూఢి వెలసిన సుకృతమూర్తి
గీ. పతికృతాభీలశాపమూర్ఛితమునిప్రి
యాపునర్జీవనమొనర్చు నమృతమూర్తి
శ్రీరఘూత్తముఁ డతనిచారిత్ర మరిది
పుట్టఁబుట్టువులకుఁ గాక పొగడఁ దరమె. 19

టీక. శ్రీరఘూత్తముఁడు, అజభవ=దశరథునికి, ప్రీతిగా, అఖిల మంగళమైన, మహావిర్భూతిన్=పుట్టువును, కాంచిన, విష్ణుమూర్తి=విష్ణువైనవాఁడు (బ్రహ్మరుద్రులకుఁ బ్రియముగ నఖిలమంగళమహావిర్భూతిఁ గాంచుటచేత విష్ణుమూర్తి యని) విమలస్మృతి సుధయొక్క యుదయము గలుగునటుల, చతుర్వ్యక్తివిభవంబున్=రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపవైభవమును, పూనిన, వేదమూర్తి=వేదస్వరూపుఁడైనవాఁడు, (స్మృతుల యొక్క యుదయము గలుగునటులఁ జతుర్వ్యక్తి విభవమును పూనుటచేత వేదమూర్తి యని, భువనచైతన్యముయొక్క సంభవము గలుగునట్లుగ, నిశిచరీఘాతియైన=తాటకా సంహారియైన, శుభప్రకాశమూర్తి=పరంజ్యోతిస్స్వరూపుఁడైనవాఁడు, (ప్రపంచమునకుఁ జైతన్యము గలుగునటులఁ జీకటిని సంహరించుటచేత శుభప్రకాశమూర్తి, అనఁగా సూర్యమూర్తియని) నిశిచరీఘాతి = అవిద్యా(జారిణీ) ఘాతియగుటచే, శుభప్రకాశ

1. త్పదయుగభక్తియే యుఁరుతపం బచరింప నుతింతు నెంతయున్"
2. వ్యంగ్యార్థమునకు లింగవ్యత్యయము లేమిని జీకటికి "నిశచరీ" అని స్త్రీలింగ ప్రయోగము. అని, ప్రా. లి. పు భాండాగారము నెం 13-2-4గల మాతృకయందుఁగలదు.

మూర్తి జ్ఞానమూర్తియనియు, ('నిశాచరీ పాంసులాయాం' అనివిశ్వము). గురు, స్ఫుర ణాగా-గురు = గురువైన విశ్వామిత్రునియొక్క, సత్క్రియాఫల = యజ్ఞక్రియా ఫలముయొక్క, స్ఫురణ గలుగునటుల, అతులధార్మికనిరూఢి = తులలేని విలుకాని యొక్క రూఢిచేత, సుకృతిమూర్తి=సుకృతస్వరూపియైనవాఁడు. (గురుసత్క్రియా ఫలస్ఫురణ గలుగునట్లు సూనృతవంతులైన ధార్మికులయందలి రూఢి వెలయుటచే సుకృతమూర్తి యని) మునిప్రియా=అహల్యయొక్క పునర్జీవన మొనర్చు, అమృత మూర్తి=అమృతస్వరూపి యైనవాఁడు. (పునర్జీవమొనర్చుటచేత నమృతమూర్తి యని) పుట్టఁబుట్టువులు (వాల్మీకమహాముని శ్రేష్ఠుఁడని) అట్టివానిచారిత్ర, మితరులకుఁ బొగడ శక్యము గాదని యన్వయము, ఇందలి రెండవయర్థము ధ్వని.

ఉ. బంగరుగట్టు బిట్టదర ఫాలవిలోచనచాపయష్టి ము
ష్టిం గొని చిల్వఱేఁ డులుక శింజిని గూర్చి రఘూద్వహుండు త
ద్భంగవిహారముల్ సలుప భర్గనిమాళి కడున్ భ్రమించె ను
త్తుంగవతంసరత్నరుచిధోరణి సారెకు సంచలింపఁగన్. 20

టీక. రఘూద్వహుఁడు, (కర్త) ఫాలవిలోచనచాపయష్టి = శివచాపదండమును, బంగరుగట్టు=మేరువు, బిట్టదరన్=మిక్కిలి చలించునట్లు (మేరువు, శివధనుస్సు గనుక), ముష్టింగొని, చిల్వఱేఁడు=ఆదిశేషుఁడు, ఉలుకన్=భయపడునట్లు (ఆదిశేషుఁడు అవింటికి వల్లెత్రాడుగనుక), శింజినిఁ గూర్చి = అల్లెనెక్కు పెట్టి, తద్భంగవిహారముల్ = ఆధనుర్భంగవిహారములను, సలుపన్, భర్గనిమాళి = ఈశ్వరునిశిరస్సు, ఉత్తుంగ...ధోరణి-ఉత్తుంగ = ఉన్నతమైన, వతంసరత్న=శిరోరత్నము (చంద్రుని) యొక్క, రుచిధోరణి=కాంతిపుంజము, సారెకున్ సంచలింపఁగన్=బెళుకునట్లుగ, కడున్, భ్రమించెను. (ఆశ్చర్యముచేత ననుట.) శ్లేష:—భర్గనిమాళి = ఆకాశము, అందలి వతంసరత్నము=సూర్యుఁడు. (రాముఁడు శివునిధనుస్సును విఱువఁగా సూర్యబింబముతోడ నాకాశమును వణఁకె ననిభావము.)

మ. హరికోదండవిఖండనప్రబలగర్వాఖర్వసంచారుఁడై
యరవిందాస్త్రుఁడు సల్పు నంబుజసపర్యంబోలి యత్యంత రా
గరసోద్భాసితభూసుతాలలితవీక్షాపాళి [1]పైఁ గ్రాలఁగా
సిరులన్ మించె రఘూద్వహుండు జయలక్ష్మీపూర్వసంశ్లేషుఁడై. 21

శా. ఆదిన్ బ్రౌఢపరస్పరోచ్ఛ్రయపరీక్షారబ్ధ విష్ణుఫాలదృ
క్కోదండం బురుశక్తిఁ ద్రుంచె హరి కాకుత్స్థాన్వయుండై యితం
డే దైవం బని కల్పకప్రసవవృష్టిం బూజఁ గావించి రిం
ద్రాదుల్ భూమిసుతావివాహమహాలీలారాము రాము న్వేసన్. 22

1. పై వ్రాలఁగా.

మ. క్షితిభృద్వర్గశిరోనిరర్గళగళత్కీలాలధారాపరి
ప్లుతిచే నాఱక మించు భార్గవభుజాభూరిప్రతాపాఖ్యచి
త్రతరాగ్నిన్ హరిచాపచారుశరసంధానంబుచే నార్చి యం
చితదివ్యాంబుదమూర్తి రాముఁ డడరించెన్ రాజవంశంబులన్. 23

టీక. అంచితదివ్యాంబుదమూర్తి = దివ్యమేఘమూర్తియైన, (దివ్యమైన మేఘస్వరూపముయొక్క అభిరామముగల దేహేంద్రుఁడైన) రాముఁడు, (కర్త.) క్షితి... ప్లుతిచేన్-క్షితిభృద్వర్గ=రాజసమూహముయొక్క (పర్వతసమూహముయొక్క), శిర=శిరస్సులవలన (శిఖరములవలన), నిరర్గళముగా, గళత్ = స్రవించుచున్న, (ప్రవహించుచున్న) కీలాలధారా = రక్తధారలయొక్క (ఉదకధారలయొక్క), పరిప్లుతిచేన్ =తడియుటచేత,ఆఱక =చల్లాఱక,మించెడు, భార్గవ...అగ్నిన్-భార్గవ=పరశురామునియొక్క(భృగువంశాధారుఁడైన చ్యవనునియొక్క), భుజాభూరిప్రతాపాఖ్య=అధికమైన బాహుబలప్రతాపమనియెడి, చిత్రతరాగ్నిన్=చిత్రమైనఅగ్నిని,(దావాగ్నిని), హరి...సంధానంబుచేన్; హరిచాప=విష్ణుచాపమందు, (ఇంద్రధనుస్సుచేత), చారు=ఒప్పునట్టి, శర=బాణముయొక్క, (ఉదకముయొక్క) సంధానంబుచేన్ = కూర్చుటచేత, (వర్షముచేత ననుట) ఆర్చి, రాజవంశంబులన్-రాజ = రాజులయొక్క, వంశ = వంశములనియెడు వెదుళ్లను, అడరించెన్ = వృద్ధిబొందించెను.

సీ. వసుధ గాంచన[1]సౌధ విసరకైతవమున
నాంతరవసురాసు లప్పగించె
రత్నగర్భ యపారరత్నతోరణ[2]నిభం
బున గర్భమణులెల్ల మ్రోల నునిచె
గంధవతి పటీరకర్పూరధూప[3]రూ
పమున సుగంధసంపదలు నించె
విశ్వధాత్రి విలోకివివిధనారీనర
చ్ఛలన దాసీదాససమితి నిచ్చె
గీ. హరికి సిరి నిచ్చె జలతత్త్వమను ననూయ
రఘుపతికిఁ గూఁతు నిచ్చిన ప్రథమతత్త్వ
మేకలిమిఁ గూర్చ దని వేల్పు లెన్న నెనసె
నతివతో రాఘవుఁ డలంకృతాత్మపురము. 24

1. మంచ. 2. మిషం. 3. ధూమమున

టీక. భూదేవి వసుధ=బంగారును ధరించినది. (కావున నయోధ్యాపురకాంచన సౌధములనియెడు నెపమునఁ దనలోని కనకపురాసులను అప్పగించెను.) రత్నగర్భ=రత్నములు గర్భమందు గలది; (కావున నప్పట్టణమందలి రత్నతోరణము లనియెడు నెపమునఁ దనగర్భములోనిమణుల నొసఁగెను.) గంధవతి=వాసనగలది. (కావున నాపురమునందలి గంధకర్పూరాదివాసన లనియెడుమిషచేత సువాసనాతిశయముల నొసఁగెను.) విశ్వధాత్రి=ప్రపంచమునకుఁ దల్లి. (కావునఁ జూచుచుండెడు స్త్రీపురుషులనియెడు నెపమున దాసదాసీసంఘముల నొసఁగెను. వసుధ, రత్నగర్భ, గంధవతి, విశ్వధాత్రి. ఇవి భూమికి హేతుగర్భ విశేషణములు. నిభశబ్దము వ్యాజ వాచకము. ('నిభో వ్యాజసదృశయోః' అని విశ్వనిఘంటువు. శ్రీమహావిష్ణువునకు జలతత్త్వము (సముద్రుఁడు) లక్ష్మి నిచ్చె నను నమూతుచేత రామునకు నయోధ్యయందలి సౌధాదిసంపదలతోఁ దనకూఁతురగు సీత నిచ్చిన ప్రథమతత్త్వము (భూమి) యింక నేసంపద నొసఁగదు ? అని దేవతలు ప్రశంసింపఁగా శ్రీరాముఁడు సీతతోడ నలంకరింపఁబడిన తనపట్టణమును (అయోధ్యను) పొందెను. (అలంకృతాత్మపురము - అలంకరింపఁబడిన, ఆత్మపురమును = స్వకీయదేహమును అని ధ్వని.)

తే. ఆత్మజనకుఁ డాశాంతరసావలంబ
మునకు శాంతరసావలంబనకుఁ బనుచు
నెడల నేకగుణస్ఫూర్తి నెడల కుండె
రాముఁ డాకారవిక్రియారహితుఁ డెందు. 25

టీక. ఆత్మజనకుఁడు=తనతండ్రి యగు దశరథుఁడు, ఆశాంత...లంబమునకున్; ఆశా=దిక్కులె, అంత=కడలుగాఁగలుగు, రసా=భూమియొక్క, అవలంబమునకున్= ఆశ్రయమునకు(పట్టాభిషేకమునకు), శాంతరసావలంబనకున్-శాంతరస=శాంతరసము యొక్క, అవలంబనకున్=ఆశ్రయమునకు (మునివృత్తికి), పనుచు నెడల, ఏకగుణస్ఫూర్తి=ఏకగుణప్రకాశమును, ఎడలక యుండెను. ఎందును రాముఁడు, ఆకారవిక్రియారహితుఁడు=తనూవికారములేనివాఁడు, (ఆశాంతరసావలంబన మనుపదమున 'ఆ' యను వర్ణము లేకపోయిన, శాంతరసావలంబన మగును. కావున శాంతరసావలంబుఁ డగువానికి నేకగుణస్ఫూర్తి సహజమే యని కవిచమత్కృతి)

చ. గురుతరదుర్గనైభవము గుబ్బల నుంచి యవక్రచక్రవై
ఖరిఁ గటిమ డలీగరిమఁ గైకొని యక్షయహేమరాశివి
స్ఫురణఁ దనుప్రకాశములఁ బూని విదేహతనూజపేర న
ప్పురమపవిత్రు వెన్కొనియెఁ బార్థివలక్ష్మి దృఢానురాగయై. 26

మ. దనుజధ్వంసికిఁ దోడునీడ యయి తత్కాంతారసంచారసా
ధనమై యూరటపట్టునై వెలయుచుఁ దచ్ఛత్రపాదూశుభా
సనభావోన్నతి దప్పకుండ నడపెన్ సౌమిత్రి నిర్నిద్రతా
వినుతాత్యద్భుతశేషభావమహిమావిర్భావభవ్యాత్ముఁడై. 27

టీక. నిర్నిద్రతా...భవ్యాత్ముఁడై - నిర్నిద్రతా = నిద్రారహితుఁడగుటచేత, వినుతమైన, అత్యద్భుతమైన శేషభావమహిమయొక్క, ఆవిర్భావ=ప్రకటనచేత, భవ్యమైన ఆత్మగలవాఁడై. (నిద్రవిడచి అత్యద్భుతమైన శేషభావమును ప్రకటించుచుఁ దాను మున్ను స్వామికి ఛత్రపాదుకాపీఠరూపమైయుండినరీతిని తప్పక నడచెననుట.) కాంతారసంచారసాధనమై=వాయువుయొక్క సారమయిన సంచారమే తనకు సాధనమై ('అర' శబ్దమునకు వాచస్పత్యమున అర=శీఘ్రతాదిగుణవతి అనియు, శబ్దకల్పద్రుమమున, అర=శీఘ్రగే అనియు నున్నది.) (ఇందలిధ్వని. భృత్యభావమహితాత్ముఁడైనవాఁడు జాగరూకుఁడై యేలినవానికి ఛాయానువర్తియై వెంటఁ దిరిగి యూరటపట్టై యుండుట సహజమే యని తోఁచుచున్నది.)

చ. అనఘమునిక్రియాసఫలతాచరణంబు తదంతరాయఖం
డనము నొనర్చు రాముఁడు వనక్షితి కేఁగినఁ దత్ప్రిచార మా
ఘనునకు బాల్యసిద్ధ మని కైకొనియెన్ మునివృత్తిఁ గైకయీ
తనయుఁడు వర్ణశూన్యగతి దా నవనిన్ వనిఁగాఁ దలంచుచున్. 28

టీక. వర్ణశూన్యగతిన్ - వర్ణ = బ్రాహ్మణాదిచతుర్వర్ణములయొక్క, శూన్యగతిన్ =లేకపోవుటచేత, అవనిన్ = భూమిని, వనిఁగాన్ = వనముఁగాను,తలంచుచున్, (ముని యడవిలో నుండును గనుక ప్రజలు లేనిభూమి నడవిగఁ దలఁచి యనుట.) ఇందలిశబ్దచమత్కారము—వర్ణశూన్యగతిన్=అక్షరశూన్యమైన గతిచేత, అవనిన్=అవనిశబ్దమును, వనిఁగాన్=వనశబ్దముగా, కైకయీతనయుఁడు=భరతుఁడు, (మునివృత్తిని గైకొనియె నని యన్వయము. రాముఁడు పిన్ననాఁటనుండి మునిసత్క్రియలు విఘ్నములు గలుగకుండ నీడేర్చువాఁడు గావునఁ దానును మునియై యుండిన మేలని భరతుఁడు ముని యయ్యె నని తాత్పర్యము. అవనిశబ్దమున నాది 'అ' వర్ణముపోయిన వని యని యయ్యె నని చమత్కృతి.)

ఉ. ఆవనమధ్యఖేలనము లాయనఘద్విజరాడనంతనే
వావిభవంబు లాయచలవైరిభవాదిశరణ్యలీల లా

శ్రీవసుధోద్భవాదరవిశేషములు న్మఁద మంటఁ జేసె ర
క్షో[1]విమతుఁ దలంప నవి క్రొత్తలె యామహిమాంబురాశికిఁ. 29

టీక. ఆవనమధ్య = ఆయరణ్యమధ్యమందు, ఖేలనములు, ఆయనఘ...విభవంబు-ఆయనఘద్విజరాట్ = ఆపాపరహితులైనట్టి బ్రాహ్మణశ్రేష్ఠులైన మహామునులయొక్క, అనంత సేవావిభవంబులు=అధికమైన సేవావైభవములు; ఆఅచల...లీలలు-ఆఅచలవైరిభవ = కాకాసురుఁడు, ఆది = మొదలైనవారలకు, శరణ్యలీలలు, ఆశ్రీ...విశేషములు-శ్రీయుక్తమైన, వసుధోద్భవా=సీతయొక్క, ఆదరవిశేషములు; రక్షోవిమతున్ = రాముని, అవిక్రొత్తలె=నూతనములే? (అనఁగా నూతనములు కావనుట. ఆ ఘట్టు లనః) ఆవనమధ్య ఖేలనములు=ఆయుదకమధ్యమందలి క్రీడలు, ఆయనఘ...విభవంబులు, ఆ అనఘ=పాపరహితులైన, ద్విజరాట్ = గరుడునియొక్కయు, అనంత = శేషుని యొక్కయు, సేవావైభవములు, ఆయచల...లీలలు-ఆ, అచలవైరి=ఇంద్రుఁడు, భవ= ఈశ్వరుఁడు, ఆది=మొదలుగాఁగలవారియొక్క, శరణ్యలీలలు; ఆశ్రీ...విశేషములు-శ్రీ=లక్ష్మీదేవియొక్కయు; వసుధా=భూదేవియొక్కయు, ఉద్భవములైన ఆదరవిశేషములు (ఉద్భవాదరవిశేషములు; ఉద్భవ = ఉన్నతప్రవృత్తులైన వారియొక్కయు, ఆదరవిశేషములు,) ఆమహిమాంబురాశికిన్ = ఆమహామసముద్రుఁడైన రామునకుఁ దలంప నవి క్రొత్తవే? (అనఁగా: ప్రాచీనము లనుట.)

మ. విశదఖ్యాతి రఘూద్వహుండు విశిఖావిర్భూతవహ్నిన్ జతు
ర్దశదేవారిసహస్రఘోరశలభవ్రాతంబు [2]గూలన్ ఖర
త్రిశిరోదూషణకంఠనాళములు ఛేదించెన్ సగం బయ్యెఁ బో
దశకంఠోద్భటరాజ్యలక్ష్మి యని సుత్రాముఁడు లూహింపఁగన్. 30

తా. దశకంఠునియొక్క యుద్భటరాజ్యలక్ష్మి సగ మాయె నని చెప్పఁగా ఖర(1) త్రిశిరో(3) దూషణ(1) కంఠనాళముల (1+3+1=5) ఛేదింపఁగా దశకంఠములయం దైదుకంఠములు పోయి యైదు నిల్చె నని చమత్కరింపఁబడినది !

చ. మెఱములజాడ లేమియును మెచ్చక మించువిదేహకన్యచూ
డ్కికినరుదై మెఱుంగుఁ దులకించు నొకానొకమాయలేడిం గాం
చిక వెనుకొన్న దాశరథికౌశల ముత్కటకూటశంబరా
ధికపదప[4]పదక్రమణధీరుఁడు గా కొరుఁ డెన్న నేర్చునే? 31

---

1. విమతుల్బఖింప. 2 దూలిన చింక, 3. తాళపత్రప్రతుల యందిట్లానే నిట్లే యున్నది. 4. పరిక్రమణ.

టీక. మెకములజాడ...నరుడై యనుటచే నాసీతాదేవిచూడ్కులు మృగముల నిరసించు సొబగుగల వని తోఁచుచున్నది. ఉత్కటమైన, కూటశంబర=మాయామృగముయొక్క, అధికమైన, పదవీ = మార్గమండలి, పదక్రమణ = పాదవిక్షేపముచేత (తిరుగుటచేత నని.) ధీరుఁడు=ధైర్యవంతుఁ డైనశివుఁడు (అనఁగాఁ గపటంపు లేటిమెకపు వేసమును ధరించిన యీశ్వరుఁడు)మాయామృగము వెంటనంటిన రాముని నేర్పు మాయామృగము వెంటనంటిన యీశ్వరుఁడే యెన్న నేర్చుఁగాని యితరులఁచేగా నేర దనుట.)

మ. వరసత్కీర్తినటీమహానటముఖవ్యాఖ్యాతచారిత్రుఁ డౌ
భరతజ్యేష్ఠుఁడు చిత్రవైఖరి నటింపం జేసె సుగ్రీవరా
గరసోత్కర్షనితాంతగీతగతి యోగ్యప్రౌఢి దీపింప దు
ష్కరభావాస్పదతాళభేదరచనోచ్ఛ్రాయంబు సంధించుచున్. 32

టీక. సత్కీర్తినటీ = కీర్తిపాత్రను, మహా...చారిత్రుఁడు-మహానట=శివుఁ డనునట్టువకానియొక్క,ముఖముచేత వ్యాఖ్యాతమైన, చారిత్రుఁడు=చర్యగలవాఁడు, ఔ, భరతజ్యేష్ఠుఁడు=రాముఁ డనెడు భరతశాస్త్రజ్ఞశ్రేష్ఠుఁడు, సుగ్రీవ...ప్రౌఢి-సుగ్రీవ=సుగ్రీవుఁ డనెడు మంచికంఠము గలవానియొక్క, రాగరసోత్కర్ష=అనురాగ రసాధిక్య మనెడు నాటాదిరాగములయొక్క రసాతిశయముచేత, నితాంతమైన, గీతగతి=స్తోత్రగతి యనెడు గానమార్గముయొక్క, యోగ్యప్రౌఢి, దుష్కర... చ్ఛ్రాయంబు-దుష్కరభావాస్పదమైన, తాళ = సప్తతాళవృక్షములయొక్క, భేద= భేదన మనెడు దుష్కరభావాస్పదములైన, తాళభేదములయొక్క రచనోచ్ఛ్రాయంబును సంధించుచు నటింపఁజేసె నని కీర్తినటి కన్వయము. (కీర్తిఁ బ్రకటించె ననుట.)

మ. క్షితికన్యాహృదయేశుఁ డేసె జయలక్ష్మీపూజనాంభోజగుం
భితమాల్యాయితపంక్తికంధరముఖాభిప్రోతవాలప్రక
ల్పితవిస్తీర్ణరణార్ణవాలి భువనాభీలప్రతాపోపరం
జితదేవాలి కపాలిపాదయుగరాజీవాలి వాలిం బడన్. 33

టీక. జయలక్ష్మీ...వాళి-జయలక్ష్మీ=జయలక్ష్మియొక్క, పూజనా=పూజకొఱకు, అంభోజగుంభితమాల్యాయిత = కమలమాలాయితమైన, పంక్తికంధరునియొక్క, ముఖాభిప్రోత=ముఖములచేతఁ గూర్పఁబడిన, వాల ప్రకల్పితమైన, విస్తీర్ణరణార్ణవము యొక్క, ఆళి=సేతువుగలవాఁడు. "ఆళిః పఙ్క్తౌ చ సంఖ్యాయాం సేతౌ చ పరికీర్తితా" అనివిశ్వము.

శా. ఆకాకుత్స్థుఁడు ధర్మకౌశలపరుండై వాలికి న్మన్నుగా
నాకీశాంచితరాజ్యసంఘటనధన్యత్వంబుఁ బాలించి తా

నాకీశాంచితరాజ్యసంఘటనధన్యత్వంబుఁ బాలించె నా
ళీకాప్తప్రియసూతికిన్ బ్రబలకౌలీనంబు లీనంబుగన్. 34

టీక. ఆకాకుత్స్థుఁడు=రాముఁడు; ధర్మకౌశలపరుండై-ధర్మకౌశల=వింటియందలి నేర్పునందు, ధనుఃకౌశలము నెడ శాస్త్రముకౌశలమునందు; పరుఁడై=తత్పరుఁడై, తాను, వాలికిన్=వాలియనువానికి, మున్నుగా=మొదట, నాకీశాం...ధన్యత్వంబు-నాకీశ=ఇంద్రునియొక్క (?), అంచితమైన రాజ్యముయొక్క, సంఘటనముచేత, ధన్యత్వంబు, పాలించి, నాళీకాప్తప్రియసూతికిన్ = సుగ్రీవునకు, ప్రబలకౌలీనంబు = ప్రబలమైన లోకాపవాదము ('స్యాత్కౌలీనం లోకవాదే' అని యమ.) లీనంబుగన్=లీనమగునట్లుగా, ఆ కీశాంచిత...ధన్యత్వంబున్-కీశాంచితరాజ్య = వానరరాజ్యముయొక్క, సంఘటనముచేత ధన్యత్వమును, పాలించెను. విరోధాలంకారము.

రాముఁడు ధర్మతత్పరుఁడై తనకపవాదము రాకుండ నన్నదమ్ముల కిద్దఱికి నాకీశరాజ్యమును సమముగా నిచ్చె ననుట. నాకీశరాజ్యము సుగ్రీవునకును నిచ్చె ననుటచే విరోధాలంకారము. తాను ఆకీశాంచితరాజ్యసంఘటనచేత ధన్యత్వమును పాలించె ననుటచే విరోధపరిహారము.

సీ. దళముఁ దప్పింతుమే కులధరాధరకోటి
రహిఁ బయల్పఱతుమే గహనరాజి
నాక్రమింతుమె దినేశాంకప్రదేశంబుఁ
దఱలింతుమే జ్వలత్తారకములఁ
దివిరి శాసింతుమే భువనజంతుశ్రేణి
ధూళిఁబుత్తుమె వియత్పాళి నెల్ల
నంతరింపుదుమె కాలాంతకప్రియవృత్తిఁ
గప్పికొందుమె దిశ ల్గలయఁ గూర్చి
గీ. కడలి యన నెంత దశకంఠుకటక మెంత
యనుచు హరివీరు లాత్మీయహరిదధీశ్వ
రాంశ[1]కఖ్యాతి సలఘువాక్యములఁ దెల్పి
రాముఁ డంభోధిభయదసంరంభుఁ డయ్యె. 35

టీ. సుగమము. ఇట్టు వానరులు తమదికొప్పలకొంకలు తెలియునట్లు వీరాలాపంబుల నాడిరి.

1. లీకీతి...డంభోధిమథన సంరంభంబు.

మ. ఖరదోర్దండలచండశౌర్యశిఖి నాఖండల్యఖండప్రతా
పరవిన్ మ్రింగి గణింప కుప్పకడలిన్ బ్రాశించెఁ గాకుత్స్థుఁడో
శ్వరరాజం బిఁక నెంత గ్రోలునొ పిపాసాస్ఫూర్తి [1]పెంపై మహో
శరవాహిన్యధినాథకోటి నని యెంచెన్ సాగి రింద్రాదికుల్. 36

టీక. కాకుత్స్థనరోశ్వరరాజము=రాముఁ డనెడు ఖరాసురుని యొక్క దోర్దండల చండశౌర్యశిఖిన్ = బాహుప్రతాపాగ్నిని, అఖండ...రవిన్ - అఖండలి = వాలి యొక్క, అఖండ=అతిశయమైన, ప్రతాపరవిని, మ్రింగి, గణింపక=లెక్కసేయక, లవణసముద్రమును ప్రాశించెన్ = పానముచేసెను. మహోశరవాహిన్యధినాథకోటి = రాక్షససేనానాయకకోటు లనెడు, మహోశర = అధికబలముగల, వాహిన్యధినాథకోటిన్ = సముద్రకోటిని.

శా. త్రావెన్ సింధువరైకదేశవిషమాత్రం బుర్వి రామాంకవ
ర్ణావాసం బగుపావకాంబకముఖం బాశ్చర్యమే యంచుఁ దాఁ
దావెన్ సింధుసమస్తఘోరవిషపూరం బెల్ల రామాంకవ
ర్ణావాసం బగుపావకాంబకముఖం బాదిత్యు లాహా! యనన్. 37

టీక. సింధు...మాత్రంబు - సింధువర = సముద్రముయొక్క, ఏకదేశవిష మాత్రంబు, (కాలకూటవిషము ననుట.) రామాంకవర్ణావాసంబు—రామాంక=రామ నామముయొక్క, వర్ణ=అక్షరములకు, ఆవాసమైన, పావకాంబక = చిచ్చుకన్నుగల శివుని యొక్క: ముఖము=ఆననము, ఆశ్చర్యమా యని, సింధు...పూరంబెల్ల - సింధు= సముద్రుని యొక్క: సమస్తఘోరవిషపూరంబెల్ల=ఉదకప్రవాహమునంతయును, (విష మనగ నుదకము.) రామాంకవర్ణావాసంబగు=రామనామాక్షరనివాసమైన, పావ...ముఖంబు- పావకాంబక=ఆగ్నేయాస్త్రముయొక్క. ముఖము=అగ్రము త్రావె నని యన్వయము,

మ. వనధిక్షోభవిభూతి నంతరచరవ్రాతంబు పైఁ ద్రేలెనో
తనకన్యామణియున్కిఁ దెల్ప నలగోత్రాదేవి చేసాఁచెనో
దనుజధ్వంసనలీలఁ బూనుహరికిన్ దల్పాహి తోడయ్యెనో
యనఁ గాకుత్స్థుఁడు గట్టె జన్యజయచర్యాహేతువున్ సేతువున్. 38

మ. కలనం [2]బ్రోద్భటపత్త్రికంఠ[3]ముఖరేఖల్ ఫుట్టఁ బుట్టన్ శరా
కలనన్ [4]దున్ముచు రాఘవుండు రణరంగక్రీడఁ గావించె నీ
ఖలు నొక్కమ్మునఁ గూల్పలేఁడె! బహుతత్క్రవ్యోపభోగాప్తికిన్
బలుజన్యంబులఁగూల్చెఁగాక యనుచున్ బ్రహ్మాదు లూహింపఁగాన్.

1. బైపై. 2. బ్రోద్ధత. 3. శిరముల్ఖండింప. 4. మొంచుచు.

మ. హారికిన్ స్వాస్థ్యము గల్గె వహ్నికిని బ్రాజ్యస్ఫూర్తి[1]యొప్పెన్నిశా
కరమార్తాండుల కాత్మమండలసమగ్రప్రౌఢి సంధిల్లెఁ దె
మ్మెర కామోదముఁ బూనఁ గల్గెఁ ద్రిజగన్మిత్రుండు కాకుత్స్థుఁడు
గ్రరణక్షోణి సబంధువర్గముగ లంకానాథునిన్ గూల్చినన్. 40

టీక. హారికిన్ = ఇంద్రునికి, స్వాస్థ్యము = నిలుకడ. స్వర్గమందుండుటయును, అగ్నికి, ప్రాజ్యస్ఫూర్తి=ప్రచురస్ఫూర్తి ప్రకృష్టమైన; ఆజ్యస్ఫూర్తియును, నిశాకర దివాకరులకు, ఆత్మమండల=నిజబింబముల యొక్కయు, నిజరాష్ట్రముల యొక్కయు; తెమ్మెరకు, ఆమోదము=సంతోషము, పరిమళము ('ఆమోదో గంధహర్ష యోః' అనివిశ్వము.)

చ. వెలయ విశుద్ధమార్గశుచివృత్తికి నీసతి పావనాంగకం
బులు భజియించెనో నిఖిలపోషణశీతల నీతలోదరి
న్వలగొని యాశ్రయాశత సనస్నుతి కెక్కెనో వహ్ని యంచు వే
ల్పులు వొగడన్ ఖరారి శిఖిపూత నిలాసుతఁ గాంచెఁ బ్రమ్మఁజన్.

చ. పరమదయ న్విభీషణునిఁ బట్టముఁ [2]గట్టి ఖరారి చంద్రభా
స్కరరఘురామసత్కథలు గల్గినయంతకు నేలు దైత్యరా
ట్పుర మనెఁ దద్రఘుప్రవర[3]పుణ్యచరిత్ర సహోక్తికల్పను
స్థిరత ఘటిల్లె మాకని శశిగ్రహనాథులు మిన్నుముట్టఁగన్. 42

ఉ. దీపితధర్మగౌరవపతిస్థిరయోజన నిష్కళంకలం
కాపురలక్ష్మి హర్షమునఁ గానుక యిచ్చిన దివ్యపుష్ప కం
బాపరమాత్ముఁ డెక్కి నిఖిలాప్తులతో నబలాకరాబ్జసం
ప్రాపితరాజరాజపదమధ్య కయోధ్యకు వచ్చెఁ జెచ్చెరన్. 43

శా. శ్రీమన్మంత్రకళాగరిష్ఠులు మునిశ్రేష్ఠుల్ గుణారాము నా
రాము న్పట్టము గట్టి రుర్విపయిఁ దద్రమ్యోత్తమాంగాగ్రసీ
మామాన్యోన్నతిఁ బర్వ విష్ణుపదజాంభఃపూర మంభోదప
థ్యామధ్యస్థితదేవవర్గ మనుబింబాప్తిన్ విగాహింపఁగాన్. 44

సీ. వర రత్నకవితభూవలయ మొప్పించువై
ఖరి మణిచ్ఛత్రంబు భరతుఁ డూనఁ
దమముఖాంశుగతాగతమరాళయుగళంబు
చొప్పునఁ గవలువీఁచోపు లొలయ

---

1. యుచ్చెన్; యుబ్బెన్. 2. గట్టె. 3. పుణ్యుఁడు పల్కెను దివ్యకల్ప.

విలసితాత్మనిధానములు మాటికొనురీతి
వనిలసూనుఁడు కేల నంఘ్రి[1] లొత్త
వలచక్కి రాలచ్చి వగ వామభాగస్థ
తావింబ మితరాంగదమునఁ దోఁప
సుతరువునీడఁ బుష్పకాంతరవితర్దిఁ
గనకపీఠాధిరూఢుఁడై మనుతు నేన
జగము లని తెల్పుకరణి విజ్ఞానముద్ర
నడరుగుణధాము రఘురాము నభినుతింతు. 45

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశ బహుమహిమ, ఖ్యాతాసమసమరవిధికిఁ గరుణాంబుధికిన్
శీతాగమజాతాసమ,ధీతాగమసదృశనిరవధియశోనిధికిన్. 46

టీక. శీతాగమజాత=పార్వతిచేత, సమధీత = అధ్యయనముచేయఁబడిన, ఆగమ సదృశమై, నిరవధి = అమితమైన, యశః = కీర్తికి, నిధి యైనవానికి.

క. లోకఖరాలోకఖరా, లోకకరాళాహవావిలోలాకృతికిన్
కాకాయిత పాకాహిత, పాకాహిత హరణభరణ భావోన్నతికిన్.

టీక. లోక...అకృతికిన్- లోక = లోకములకు, ఖర=తీక్ష్ణమైన,ఆలోక=తేజముగల, ఖర=ఖరాసురునియొక్క, ఆలోక=చూపులకు, కరాళ=భయదమైన,ఆహవ=యుద్ధమునందు. అవిలోల = చలింపని, ఆకృతికిన్ = ఆకారముగలవానికి; కాకా... ఉన్నతికిన్- కాకాయిత = కాకమువలె నాచరించుచున్న. పాకాహిత = ఇంద్రుని యొక్క, పాక = కుమారునియందు, (కాకాసురునియందనుట) ('పోతః పాకోఽర్భకోడింభః' అనియమ.) ఆహిత = ఉపఁబడిన హరణభరణముల యందలి భావము యొక్క ఉన్నతిగలవానికి (హరణభరణశక్తిగలవాని కనుట).

క. శిక్షితకబంధునకు దుర్లక్షశరక్షుభితసాగరకబంధునకున్
దక్షసుతాధ్యక్షనుతా, త్ర్యక్షరతాక్షపితవినమదకబంధునకున్. 48

టీక. శిక్షితకబంధునకున్=కబంధుఁ డనురాక్షసుని శిక్షించినవానికి, దుర్లక్ష...నకబంధునకున్-దుర్లక్ష= చూడశక్యముగాని, శరముచేత,క్షుభిత=క్షోభింపఁజేయఁబడిన, సాగరకబంధునకున్ = సముద్రోదకము గలవానికి,దక్ష...కబంధునకున్;దక్షసుతా

1. అలమ.

ధృత్ = శివునిచేత నుతమైన, అత్ర్యక్షరతా = ద్వ్యక్షరత్వముచేత, (రామనామము గలుగుటచేతననుట.) తపిత = అణపఁబడిన, వినమత్ = వినమ్రులయొక్క, అఘ = పాపముల యొక్క, బంధునకున్ = బంధములు గలవానికి.

క. గోత్రాజన విత్రాసన, సత్రాశనవైరి వీరసంహరణునకున్
ధాత్రీవరపుత్రీకర, మైత్రీకరచరణునకు క్షమాభరణునకున్. 49

టీక. గోత్రా...సంహరణునకున్ - గోత్రా = భూమియందలి, జన = జనులను, విత్రాసన = భయపెట్టుచున్న, సత్రాశనవైరివీర = రాక్షసవీరులయొక్క, సంహరణునకున్ = సంహారముగలవానికి; ధాత్రీ...చరణునకున్ - ధాత్రీవరపుత్రీ = సీతాదేవియొక్క, కర = హస్తములతోడ, మైత్రీకర = స్నేహము సేయుచున్న, చరణునకున్ = చరణములు గలవానికి.

క. హుంకారికుంభకర్ణా, హంకారిమనోభయంకరాంకునకు సురా
తంకాకరలంకావర, శంకాకరవాలిజిద్భుజవిటంకునకున్. 50

టీక. హుంకారి...అంకునకున్, హుంకారి = హుంకారము చేయుచున్న, కుంభకర్ణునియొక్క, అహంకారముతోఁగూడిన, మనస్సునకు, భయంకరమైన, అంకునకున్ = యుద్ధముగలవానికి; ('అంకో నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం యుధి భూషణే' అని నానా). సురా...విటంకునకున్ - సురలయొక్క, ఆతంక = తాపములకు, ('రుక్తాపశంకా స్వాతంక' అని అమ.) ఆకరమైన, లంకావర = రావణునికి, శంకాకరుఁడైన, వాలిని, జిత్ = జయించిన, భుజవిటంకునకున్ = భుజప్రదేశము గలవానికి.

క. చిద్రాజిత ముద్రాయుత, భద్రాయతపక్షునకు నభంగరణకళా
విద్రావణ విద్రావణ, రౌద్రారుణవీక్షునకును రణదక్షునకున్. 51

టీక. చిద్రాజిత... పక్షునకున్ - చిత్ = జ్ఞానముయొక్క, రాజితమైన, ముద్రతోడ - యుత = కూడినదియు, భద్రాయతము నైనపక్షము గలవానికి; అభంగ...వీక్షునకున్ - అభంగరణకళను, విత్ = తెలిసిన, రావణాసురునియొక్క, విద్రావణ = పాఱఁదోలుటయందు, రౌద్రమై, అరుణమైన, వీక్షునకున్ = దృష్టిగలవానికి.

క. శ్యామలతాకోమలతా, ధామలతాంతాస్త్ర శతశతస్ఫురితతనూ
ధామున కభిరామున కవి, రామగుణారామునకును రఘురామునకున్.

టీక. శ్యామ...ధామునకున్ - శ్యామలతా = శ్యామలత్వమునకును, కోమలతా = సౌకుమార్యమునకును, ధామ = స్థానమైన, లతాంతాస్త్రశతశత = కోటిమన్మథులరీతిని, స్ఫురితమైన, తనుధామునకున్ = శరీరకాంతిగలవానికి.

కృతికర్తృవిషయము.

సీ. వనధిలంఘనకృపావర్ధితోభయకవి
తాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరక్షాధురంధరరామ
విభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ,
వసుచరిత్రాదికావ్యప్రీతబహునృప
ప్రాపితానేక[1]రత్నప్లవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహ
నిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ

గీ. శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ
తిమ్మరాజప్రియతనూజ ధీరసూర
పాత్ముఁడ రామనృపభూషణాఖ్యసుకవి
సంకిత మొనర్తు నీకావ్య మనఘభక్తి. 53

వ. ఇవ్విధంబున నభీష్టవరప్రదానని స్తంద్రుం డగుశ్రీరామచంద్రున కంకి
తంబుగాఁ జేయం బూనినహరిశ్చంద్రనలోపాఖ్యానం బనుమహాప్ర
బంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 54

---

1 యత్నరత్నప్లవుండ.



# హరిశ్చంద్రనలోపాఖ్యానము

## ప్రథమాశ్వాసము.

### కథాప్రారంభము

ఉ. పాండుసుతాగ్రజుండు పరిపాండురకీర్తి యఖండశార్ఙ్గకో
దండ దయానువర్తి యలద్వైతవనంబున నుండి యప్రమే
యుండు మృకండుమానితనయుం డరుదేరఁగ నమ్మహర్షి మా
ర్తాండునిఁ బూజ సేసి కరతామరసంబులు మోడ్చి యిట్లనున్. 1

ఉ. ఎన్నఁడు మాకుఁ గ్రమ్మఱ సమీహితరాజ్యసుఖంబుగల్గు మా
యున్న తెఱంగున న్నృపకులోద్భవు లెవ్వరు మున్ను గానలన్
ఖిన్నత నుండి వెండియు నకిల్బిషసౌఖ్యముఁగాంచి రోగుణా
భ్యున్నత దెల్పవే యనఁ దపోధనచంద్రుఁడు వల్కె సత్కృపన్. 2

శా. కౌంతేయాగ్రజ! యింతచింత మదిలోఁ గావింపఁగా నేల మీ
సంతాపంబు లడంచు నాహరి హరిశ్చంద్రుండు మున్నింతకున్
వంత న్గుందఁడె వైరసేనియు విపద్వారాశిలోఁ గ్రుంకఁడే
సంతుష్టాత్ములు గారె వారు పిదప న్సంప్రాప్తసామ్రాజ్యులై. 3

క. అన విని యాయిరువురకథ
లును దెలుపుము నాకు నఖిలలోకజ్ఞ! యనన్
మునిరాజు భానుసమధా
ముని రాజుం జూచి మోదము మది న్పొదలన్. 4

ఉ. హరిచరిత్రము ల్భువనవర్ణ్యము లైనవి వేఱె పేర్కొన
న్నారె పపార్చనాసమయసంగతి తప్పెదుఁ గాన నిప్పు డో
భూరివివేక! యానృపులపుణ్యకథ ల్పదశక్తి నొందుగాఁ
గూరిచి తెల్పెద న్దెలిసికొ మ్మని నేర్పు దలిర్ప నిట్లనున్. 5

## పురవర్ణనము.

తే. అలరు మణివప్రవిజితహేమాద్రినిషధ
నగరమవతంసమఖిలభూనగరములకు
లలితజయ[1]సంపదలఁ బొల్చునిలు పయోధ్య
లఘుగభీరాంబుపరిఖాకలాప మగుచు. 6

టీక. హరిశ్చంద్రోపాఖ్యానమునకు. మణి ... రమ - మణీమయమైన, వప్ర = కోటచేత, విజిత = జయింపబడిన, హేమాద్రి, నిషధనగరములయొక్క, రమ = లక్ష్మి గలది; అఖిలభూనగరములకు, వతంసము = శిరోభూషణము. (శ్రేష్ఠమైనదనుట.) లలిత జయసంపదలచేతఁ బొల్చు, నిలుపు = నిలుకడ; (జయసంపదలకు మనికిపట్టనుట) లఘువైన గభీరాంబువులుగల, పరిఖా = అగడ్తయే, కలాపము = భూషణముగాఁ గలది, అగుచు, అయోధ్య యలరు నని యన్వయము. ఇందు స్త్రీలింగమైన యయోధ్యాశబ్దము నకుఁ బుంలింగవిశేషణమువలె లఘుగభీరాంబుపరిఖాకలాప మన్నందుకు లక్షణము.
'గీ. చెలువపేరుగాని స్త్రీలింగములకు, విశేషణములుగా రచించుపదము
లొక్కరూప యుక్తి నుభయలింగతఁ జెల్లు, నుల్కయుష్ణ యుల్క యుష్ణ మనఁగ.'
(కవిచింతామణి.)

నలోపాఖ్యానమునకు. మణివప్రవిజితమైన హేమాద్రి గలది; అఖిలభూనగరములకు, అవతంసము; లలితజయసంపదలఁ బొల్చు, ఇలు = ఇల్లు, పయో...కలాపము- పయోధి = సముద్రమువలె, అలఘులై, గభీరములైనయంబువులుగల, పరిఖ, భూషణముగాఁ గలది; అగుచు నిషధనగరము, అలరును. ఇందు "ఇలు" అను ప్రథమాంత శబ్దముమీఁది పకారము వకారము గాక నిలిచినందుకు లక్షణము—
గీ. సంధి గూర్పంగఁ బ్రథమాంతశబ్దవితతి, పైఁ గచటతపలకు వికల్పంబు సెల్లుఁ
గాకసంబోధనావ్యయకర్మధారయంబుల నచేతనంబుల నబ్జనాభ!. (కవిసంజీవని).
ప్రయోగము:— "వారణనగరిపురమతల్లి నాఁ దనర్చి" (రాఘవపాండవీయము.)

సీ. ప్రాఁతమాటలె కాని బహువాగ్విప్రాప్తి లేని
యజుఁ గెల్తు రచ్చటి యవనిసురులు
వరధర్మ మెడలి జీవముఁ గాచుకొన్న భా
ర్గవుమెచ్చ రచ్చటి రాజమణులు
నవతఁ బూనిన నిధానముల కుబ్బుకుబేరుఁ
బాటింప రచటికిరాటవర్యు

---

1. సంపదలు నిల్చు.

లోక్కుఁ డేయర్జునుఁడెవఁడు ఓకతాఁలికుఁడై యంచు
ముసలి నెంచరు శూద్రముఖ్యు లచట

గీ. గజము లచ్చట వెలిజాతికరటిఁ గినియు
వాజు లచ్చట నుచ్చైశ్శ్రవము నవల్చుఁ
దెగడు నచ్చటినగకోటి త్రిదశతరుల
నచటి¹రుచిరాంగు లడరింతు రచిరరుచుల. 7

టీక. రెంటికినిసమము. ప్రాఁతమాటలె=వేదములే కాని, బహువాగ్విహృతి=బహువాణీవిహారము, లేక, అజుని, మెచ్చరు (అనఁగా నజుఁడు మను పలవాటువడిన మాటలెకాని పలుమాట లాడనేరఁ డనియు), ఎరపర్ష మొదలి=విల్లువిడిచి, జీవమును గాచుకొనిరైన. (అనఁగా క్షత్త్రముఁ దప్పి ప్రాణముఁగాపాడుకొని రనియు;)నవలఁ బూనిన=నవసంఖ్యాకత్వముంబూనిన, నిధానములు అనఁగాఁ గృపించవినిధుల కుబ్బువాఁడనియు); ఒక్కుఁడేఱు=ఒకఁడిని; పఱపెన్=ప్రవహింపఁ జేసెను. (అనఁగా నొక్కమడకఁ బఱపెను. తానొకహాలికుఁడా? యనియు, నజాహులయందు నైచ్యము తోఁచుచున్నది. వెలిజాతికరటి యనఁగా నీచజాతి గజ మనియు; ఉచ్చైశ్శ్రవ మనఁగా పొడవైనచెవులు గల దనియు; త్రిదశతరు లనఁగా మూఁడుపది పరిమాణముగాఁ గల వృక్షము లనియు; అచిరరుచు లనఁగా చిరకాంతి లేని వనియు, నైరావతాదులయందు నైచ్యము. త్రిదశతరు అనునపుడు వ్యంగ్యార్థమున "సంఖ్యయాఽవ్యయాసన్నాదూరాధికసంఖ్యాః సంఖ్యేయే" అను శబ్దసూత్రమువలన సమాసము.)

ఉ. ఆపురిమించుటోవరుల నాఁడు నెలంతలగాన మాధురిం
బ్రాపితజీవ లయ్యును దదగ్రమణిప్రతిమల్ నిమేషము
ద్రాపలితాది²వైకృతముఁ దాల్పవు ప్రాంతపరిభ్రమత్త్రియా
మాపతిబింబనిర్గళ దమందసుధారసధారఁ దోఁగుటన్. 8

మ. పురివప్రోపరివప్రశృంగవివరంబు ల్దాఁటి యత్నంబుతో
నరుణాంశుం డిరునంజల న్నియతయాతాయాతముల్ సల్పుచోఁ
బరిఘుష్టాధికజర్జరుం డయికదా భావింపఁ డవ్వేళల
న్దొరయన్ మోహితదుర్నిరీక్ష్య³రుచి నందోహంబు దేహంబునన్.

చ. అలఘుతదీయభేయముల నాఁడెడు నన్నులగుబ్బచన్నులన్
గులికినయేణనాభి నవకుంకుమనంకుమదాంకపంక నం

1. రుచిరాంగులు హసింతు, 2. వైకృతులు...పాంత, 3. ద్యుతి.

కలితవిలేపము ల్గరఁగి గమ్మని కమ్మనితావు లీనఁ ద
జ్జలములఁ దేలి భోగు లనఁ జాలిరి చెల్వపుఁజిల్వపెందొరల్. 10

ఉ. ఆటవెలందు లందు మణిహర్మ్యతలంబుల పై నటింపఁగా
హాటకరత్ననూత్నవలయంబులు బాజె యనేకతాళ్రసం
ఘాటముఁ జేర్చుఁ బత్పదయుగంబున వ్రాలి విలాసలాస్యముల్
నూటి గ్రహింపఁ బూని మఱి సోఁకమిఁ గ్రమ్మఱమించులోయనన్.

మ. శరదవ్రాతము సౌధశైలదబలాజాలాలి నీలాలకా
భరితం బై పెతఁ గుంచి తత్పదవిఁ జెందం గోరి కాలాగరూ
త్కరధూపాకృతిఁ జేరి జిట్టిదపుఁగాకన్ దేజె తత్కుంతలా
దరణీయస్థితి మీఱి విష్ణుపదమున్ దాఁటున్ [1]వృథామోదతన్. 12

క. పెలయుఁ బురిం దపనాతప,విలయం బొనరించి సాలవేలాద్రిబహి
ర్వలయంబునని[2]లయంబై, కలయంబర్వినతమంబుగతిఁ బూఁదోఁటల్.

వ. ఆపురంబున కధీశ్వరుండు. 14

(పైపద్యంబులకు రెండర్థములు సమానము.)

తే. భువనసంత్రాణకీర్తితో బుధగణేయ
సత్కళారాజితో హారిశ్చంద్ర యనుచు
దేవతావర్గములు వినుతింప నలస
మాఖ్యఁ దగు సార్వభౌమైకముఖ్యుఁ డలరు. 15

టీక. హారి. భువనసంత్రాణకీర్తితః=భువనసంరక్షణకీర్తివలన,బుధగణేయ,సత్క
ళారాజితః=కళారాజివలన, హారిః, చంద్రః, అనుచు దేవతావర్గములు నుతింపఁగా,
అలసమాఖ్యన్=అహారిశ్చంద్రుఁ డను పేరుచేత, తగు=తగిన,సార్వభౌమైకముఖ్యుఁడు,
అలరున్=ఒప్పును, (ఈహారిశ్చంద్రనామము దేవత లితనిని గీర్వాణభాషచే నుతిసేయు
టచేఁ గలిగిన దని కవి ప్రౌఢోక్తిచేఁ గల్పించెను. కీర్తితః, రాజితః, అనునీశబ్దములు
తసిల్ ప్రత్యయాంతములు. "పంచమ్యాస్తసిల్"అని వ్యాక. భువన...కీర్తితః,బుధ...
రాజితః అను నీరెండువాక్యములతో హారిః, చంద్రః, అను నీరెండుశబ్దములకుఁ
క్రమాన్వయము హారిశ్చంద్రయనునపుడు విసర్గలు లోపించినందుకుఁ బ్రయోగము—
క. "ఇంత వని నమ్మకే! ప్రథ,మాం పిబతే వహ్ని యనెడి మా టవుఁగాదే."
(ఆముక్తమాల్యద.)

1. వృథా 2. నలయంబై.

నల. ఇందును నలుని దేవతలు సంస్కృతభాషచే నుతించినట్లు చెప్పుచున్నాఁడు. భువనసంత్రాణముచేత, కీర్తితః=కీర్తింపఁబడిన, హరిః=విష్ణువు; కళ్కళచేత, రాజితః= విరాజితుఁడైన, చంద్రః = చంద్రుఁడు, అనుచు దేవతావర్గములు నుతింప, నలసమాఖ్యన్=నలుఁడను పేరుతో, తగినట్టి, సార్వభౌమైకముఖ్యుఁడు,అలరెన్. నలచరిత్ర పరముగనే మఱియు నన్వయ భేదముచేత స్ఫురించునర్థము:—సంత్రాణ. కీర్తితో = కీర్తితోడను, కళా, రాజితో = పంక్తితోడను, హరిః చంద్రః అనుచు వినుతింప, నలసమాఖ్యుఁడగు సార్వభౌమైకముఖ్యుఁడు దనరు ననియన్వయము. "హరిః,చంద్రః" అని హరిత్వ చంద్రత్వములు నలునియం దారోపించి దేవతలు నుతిసేయఁగా నలుఁడు రక్షణకీర్తితోను, కళతోను, హరివలెను చంద్రునివలెను ప్రకాశించె ననుట.)

సీ. అతఁడు విశ్రుతబలుండై చక్రవర్తుల
యం దాదివినుతుఁడై యతనులక్ష్మి
నలరి యాత్మత్రిశక్తుల సమయవినిద్ర
శాత్రవోత్కరము త్రిశంకునంద
నవతంస మగుచు దిక్పవతిసంతతికిని
జయశోభరమలీనసాంద్రగంధ
సారసద్రుచి గాఁగ నవరించుతనరస
జ్ఞామృతపాకవిద్యావిరూఢి
గీ. కంగగుణజాతపరిణాహ మనువుపఱిచి
యరిదికల నైనను దన కల్లాడనిబలు
వీఁక ధార్మికతిలకుఁ డై వెలయఁ జేసె
ధర సుధామధురాత్ముఁ డౌ ధన్యకులము. 16

టీక. హరి. అతఁడు=ఆహరిశ్చంద్రుఁడు చక్రవర్తులయందు; ఆదివినుతుఁడై= మొదలనుతింపఁబడువాఁడై, అతనులక్ష్మిన్=అధికసంపదలచేత, (అతనులక్ష్మిని, అను ద్వితీయావిభక్తికపదంబునకుఁ దృతీయావిభక్త్యర్థము చెప్పుటకు లక్షణము:—క. వినుతద్వితీయసప్తమికిని,మూఁడవదగు విభక్తికిని నెడగానౌ) ఆత్మత్రిశక్తుల=తనప్రభు మంత్రోత్సాహ శక్తులను,వినిద్రశాత్రవోత్కరము, సమయ=సమసిపోవఁగా,త్రిశంకు నందనవతంసమగుచు, దిక్పవతిసంతతికిని, నిజమైనయశోభరము, అలీన=స్ఫుటమైన, సాంద్రమైన,గంధసార=చందనముయొక్క, సద్రుచి గాఁగ,నవరించునట్టి,తనయొక్క, రసజ్ఞ=రసము నెఱిఁగినవారలకు, అమృతపాకమైన, విద్యావిరూఢికి, అంగగుణ=అధీతి బోధాచరణ ప్రచారము లనునంగగుణములయొక్క, జాత = సమూహముయొక్క, పరిణాహమును, అనువుపఱిచి, అరిదికలదైన=అరుదగుకలయందైనను,తనయొక్క,కల్లా

య=తనసంబంధు లగు, సన్మిత్ర=తారకామిత్రుఁడైన చంద్రునియొక్క, వంశ్యులు= వంశమువం దుదయించినరాజులు గలవాఁడు; ('భం నక్షత్రం తారకా సత్' అని హలాయుధనిఘంటువు.) శ్రీ యెసఁగె నని యన్వయము.

క. పలువగతురగములుమహా
బలచిత్రప్రౌఢిఁ దోలి బహుచక్రశ్రీ
వెలయ మహీవిభుఁ డడరున్
బలియుఁడు తనగొడుగునీడఁ బఱపుచుఁ దనరన్. 18

టీక. హరి. పలువగతురగములన్-పలు = అధికమైన, పగతుర = పగవారల యొక్క, గములన్ = సమూహములను, మహాప్రౌఢిన్ - మహాబల = అధికమైన సేన యొక్క, చిత్రప్రౌఢిచేత, తోలి (పాఱఁద్రోలి యనుట) బహుచక్రశ్రీ = బహురాజ్య లక్ష్మిని, తనగొడుగునీడన్ = తనఛత్రచ్ఛాయను, పఱపుచున్ ఆమహీవిభుఁడు= ఆహరిశ్చంద్రుండు, అడరుననియన్వయము, (రాజ్యము నిరుపద్రవముగఁ బాలించె ననుట.) 'పలువగతుర' యనుకర్మధారయంబునఁ బలుశబ్దముమీఁది పకారము వకారమైనందుకు లక్షణము:—

“గీ. సంధిఁ బూర్వంబగుఁ బ్రథమాంతశబ్దవితతి, పైఁ గచటతపలకు వికల్పంబు సెల్లుఁ
గాకుసంబోధనావ్యయకర్మధారయంబుల నచేతనంబుల నబ్జనాభ!

(కవిచింతామణి)

కర్మధారయములందుఁ గచటతపలు గసడదవలుగ మాఱినందులకుఁ బూర్వకవి ప్రయోగములు:—

“చ. తెగి మన కగ్గమై యరుగుదెంచినవాఁ డితఁ డల్గి యింక నొం
డుగడకుఁ బోవకుండఁగఁ గడున్ వెస దగ్గఱి యేఁగవాలమున్
బగులుతునొ గదాహతి ... ... ... (భా. కర్ణ.)

“చ. ప్రాదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యిందును బడ్డవారికిన్
బ్రదుకులె యంచుఁ దప్పదు పురాకృత మెవ్వరి కైన నంచుఁ గొం
తదడవు గంట నీ నపుడు తద్ద్విజముఖ్యునిఁ జూచి యొయ్యనన్
... ... ... ... (కళాపూర్ణోదయము.)

పైపద్యములలోని 'యొండుగడ' 'కొంతదడవు' అను కర్మధారయంబులవలెనే యిందలి 'పలువగతు'రను గ్రహించునది.

వల. పలువగతురగముల = పెక్కువిధము (జాతు) లైనగుఱ్ఱములను, మహా... ప్రౌఢిన్-మహాబల=వాయువుయొక్క, చిత్ర=విచిత్రమైన, ప్రౌఢిచేత, తోలి (అనఁగా వాయువేగమునఁ దోలి యనుట) బహుచక్రశ్రీ=విస్తారమైన మండలాకార లక్ష్మి, వెలయు, తనగొడుగునీడఁ బఱపుచున్, మహీవిభుఁడు=నలుఁడు, అడరును;

తే. అతనిసౌందర్యవర్ణనోద్యతజనాళి
నిత్యపరిపూర్ణకాంతి నిర్నిద్రచంద్ర
మతిముదిత యై భజించుఁ దన్మానసాను
రూపసముచితసేవాతిరూఢి - మెఱయ. 19

టీక. హరి. సౌందర్య...జనాళి - (ఆహరిశ్చంద్రునియొక్క) సౌందర్య వర్ణనమందు, ఉద్యత = ఉద్యుక్తమైన, జనాళి=జనసమూహముగలదియు, నిత్యపరిపూర్ణ కాంతినిర్నిద్ర, చంద్రమతి, ముదితయై=ప్రియురాలై, త...నిరూఢి-తత్=ఆహరిశ్చంద్రునియొక్క, మానసమునకు, అనురూప=అనుగుణమై; సముచితమైన, సేవానిరూఢి మెఱయ నతనిభజించు నని యన్వయము.

నల. సౌందర్య...జనాళి; (అనలునియొక్క) సౌందర్య వర్ణనమందు, ఉద్యత= ఉద్యుక్తమైన, జనాళి=జనపంక్తి; ఇదికర్త. నిత్యపరిపూర్ణ కాంతినిర్నిద్రచంద్రుఁడను, మతి=బుద్ధిచేత, ముదితయై = సంతోషమునొందినదై, త...నిరూఢి - తత్ = అనలుని యొక్క, మానసమునకు, సముచిత=అనుగుణమైన, సేవానిరూఢిచేత, నతనిని భజించు నని యన్వయము.

వ. ఇట్లశేషభూభువనరక్షాదీక్షితుం డై వెలయుచుండ. 20

క. క్షితిభర్తకుమారుఁడు లో
హితుఁ డన విలసిల్లెఁ జేర్చి హృదయంబున సం
తతముదమునను జనాదర
మతిసాంద్రముగా బహుశ్రుతానందితుఁ డై. 21

టీక. హరి. క్షితిభర్తకుమారుఁడు=హరిశ్చంద్రపుత్త్రుఁడు, లోహితుఁడనఁగా, సంతతముదమునను = నిరంతర సంతోషముచేతను, జనాదరము = ప్రజలయందలి యాదరణమును, అతిసాంద్రముగా, బహుశ్రుతానందితుఁడై - బహుశ్రుత= పెద్దలచేత, ఆనందితుఁడై, విలసిల్లె నని యన్వయము.

నల, క్షితిభర్తకు= నలునకు, మారుఁడు, కర్త. లోహితుఁడన; లో = లోపల, హితుఁడన=ఆప్తుఁడన, సంతతము, దమునసుజను=దమయంతిని, బహుశ్రుత =మిక్కిలి వినుటచేత, ఆనందితుఁడై = సంజాతానందముగలవాఁడై, విలసిల్లె నని యన్వయము. (దమయంతిని నలుఁడు మిక్కిలివినుచే తనకు సాధనమయ్యె నని మన్మథుఁడు సంతోషించె నని ఫలితార్థము).

చ. అలఘుగుణాభిరాముఁ డతఁ డాత్మజవైఖరి యిట్లు రాఁగ నిం
పలరఁగఁ జేయ భీమతనయాధికసంగరసత్వరాచలా

చలహృదయప్రచారుఁ డయి సారసవాసకృదంచితద్విజో
క్తులు వెలయన్ మహాదరముతోఁ బరచింతఁ దొఱంగి యున్నెడన్.

టీక. హరి. అలఘుగుణాభిరాముఁడు; అతఁడు=ఆ హరిశ్చంద్రుఁడు, ఆత్మజ వైఖరి=కుమారుని యొక్క వైఖరి, రాగమున=అనురక్తిని, ఇంపలరఁగఁ జేయన్; భీమతన్=భయంకరుడగుటచేత, అయా...ప్రచారుఁడయి-అయ=శుభావహవిధులయందు, అధిక సంగర=అధికప్రతిజ్ఞ కలదైన, సత్వర=త్వరతోఁ గూడిన, అచలాచలహృదయ=నిశ్చల హృదయము యొక్క, ప్రచారము గలవాఁడై; సార...ఉక్తులు-సార=శ్రేష్ఠములైన, సవ=యజ్ఞములయందు; అనుకృత్=మాటిమాటికిని, అంచితములైన ద్విజోక్తులు, వెలయన్, పరచింత=శత్రుచింత, తొఱఁగి (భీమతచేత) విడిచి, ఉన్నెడన్=ఉన్న సమయమున.

నల. అతఁడు=ఆనలుఁడు, ఆత్మజవైఖరి=మన్మథుని యొక్క వైఖరి, రాగము=అనురాగమును, ఇంపలరఁగఁ జేయఁగా, భీమ...ప్రచారుఁడై-భీమతనయ=దమయంతి యొక్క, అధికమైన, సంగ=కూటమియందలి, రస=ప్రీతి యొక్క, త్వర=వేగముచేత, చలాచల-చలించుచున్న, హృదయప్రచారము గలవాఁడై; సారస...ఉక్తులు-సారస=సరస్సంబంధమైన, వాస=ఉనికి; కృత్=చేయుచున్న, అంచితములైన; ద్విజ=(హంసాది) పక్షుల యొక్క, ఉక్తులు, వెలయఁగా, మహాదరముతో=మహాభయముతో, పరచింత=ఇతరచింతను, తొఱంగి = విడిచి, ఉన్నెడన్ = (విరహియై) యుండుతఱి ననుట.

సీ. పరిపాటితారాతిబలశతకోటిభీ
ముఁడు జిష్ణుఁ డఖిలప్రమోదహేతు
గురుసుధర్మాధ్యాసికుండినమండల
శ్రీ మించుసరసచింతామణి మహి
తోత్తుంగపీఠిపై నొకనాఁడు [1]సమధికో
త్సాహంబుతో శుచిధర్మపుణ్య
జనరసేశమహాబలనిధికులపతిన
ర్వజ్ఞులు పరుసఁ గొల్వఁ గొలువుండి (?)

గీ. తనదుహితకార్యపరయుక్తిఁ దలఁపుఁ దెలుపఁ
జాలుమునుల నిరీక్షించి జగతి నేమ
హోత్తుఁ డప్రతిమానసత్యస్వరూప
వైభవాఢ్యుండు వివరింపనలయు ననుఁడు. 23

టీక. హరి. పరి...భీముఁడు-పరిపాటిత=ఖండింపఁబడిన, అరాతియైన, బల = బలాసురుఁడు గల, శతకోటి=వజ్రాయుధముచేత, భీముఁడు=భయంకరుఁడు, జిష్ణుఁడు,

1. సముచితో.

కర్త. అఖిల...అధ్యాసికుండు - అఖిలప్రమోదహేతువైన, గురు=బృహస్పతిగల, సుధర్మ=దేవసభయందు, అధ్యాసికుండు=స్థితిగలవాఁడు; ఇనమండలశ్రీ=సూర్యమండలశోభచేత, మించు, సరసచింతామణులచేత, మహితమైన, ఉత్తుంగపీఠిపై=ఉన్నతాసనముమీఁద, శుచి...సర్వజ్ఞులు=అగ్ని, యమ, నైరృతి, వరుణ, వాయు, కుబేర, రుద్రులు, వరుసఁగొల్వ, కొలువుండి, తనదు...యుక్తిన్-తనదు=తన యొక్క, హితకార్యముల యొక్క, వర = శ్రేష్ఠమైన, యుక్తిన్ = యోజనయందు, తలఁపులు, తెలుపఁజాలు మునులను, నిరీక్షించి, అప్రతి...ఆఢ్యుఁడు-అప్రతిమానమైన; సత్యస్వరూప=సత్యము యొక్క స్వరూపమైన, వైభవముచేత, ఆఢ్యుఁడు.

నల. పరి...కోటి-పరిపాటిత = వ్రక్కలుగాఁ జేయఁబడిన, అరాతిబలము యొక్క, శతకోటి=నూఱుకోట్లుగలవాఁడు, భీముఁడు, కర్త. జిష్ణుఁడు=జయశీలుఁడు, అఖిల...ధ్యాసి-అఖిల = సమస్తమైనవారి యొక్క, ప్రమోదమునకు, హేతువై, గురువైన, సుధర్మ=మంచిధర్మమందు, అధ్యాసి=ఆసీనుఁడు, (ధర్మాధిష్ఠాత). కుండిన మండలశ్రీన్=కుండినరాజ్యలక్ష్మిచేత; మించు, సరసచింతామణి = సరసులకు వేల్పు మానికమువంటివాఁడు, ఒకనాఁడు, మహితోత్తుంగపీఠిపైన్, సమధికోత్సాహంబులోన్, శుచి...సర్వజ్ఞులు; శుచిధర్మ=పవిత్రధర్మముచేత, పుణ్యులైన, జనులు, రసేశ=భూపతులు, కులపతి=వంశాధిపతులు, సర్వజ్ఞులు. వరుసన్ = క్రమముగా, కొలువఁగా, తనదుహితకున్=తనకుమారితకు, ఆర్యవరయుక్తిన్-ఆర్య=యోగ్యుఁడైన; వర=ప్రియుని యొక్క, యుక్తిన్=యోజనయందు, తలఁపుఁ దెలుపఁజాలు = ఆలోచన చెప్పఁదగు, మునులను, నిరీక్షించి, జగతిని = ప్రపంచమున, అప్రతి...వైభవాఢ్యుఁడు-అప్రతిమాన=సాటిలేని, సత్య=నిజమైన, స్వరూప=స్వరూపసౌందర్యము యొక్క; వైభవముచేత, ఆఢ్యుఁడు, ఏమహాత్ముఁడు అనఁగా.

క. యతు లొకకొందఱు దమలోఁ, జతకూడితలంపనంచు సౌరకులగురు
స్థితిమనుమునిరాజినుతుల,నతులమహస్స్ఫూర్తిఁ దగబుధావనుఁబలికెన్.

టీక. హరి. అందు=ఆఋషులయందు; సౌర...స్థితిన్-సౌర = సూరసంబంధమైన కులమునకు(సూర్యవంశమునకనుట.) ('సూరసూర్యార్యమాదిత్య'యని యమ.) గురుస్థితి=గురువైనస్థితిచేత, మనుమునిరాజు =మనుచుండెడుమునిశ్రేష్ఠుఁడు (వసిష్ఠుఁడనుట), ఇనుతులన్-ఇను=సూర్యుని యొక్క, తులన్ = సామ్యముచేత, అతులమహస్స్ఫూర్తి=సరిలేనితేజస్స్ఫూర్తి, తగన్=ఒప్పఁగా, బుధావనున్=ఇంద్రుని.

నల. అందున్=ఆమునులయందు, సౌరకులగురుస్థితిన్-సౌర=సురసంబంధమైన, కులమునకు, గురు=గురువైన బృహస్పతి యొక్క, స్థితిన్=స్థితివంటిస్థితిచేత, మనుమునిరాజి=ఒప్పుచుండెడిమునిపంక్తి, నుతులన్=సన్నుతులచేత, అతులోత్సవస్ఫూర్తి,('మహా

స్తాత్స్వవతేజసోః' అని యు.) తగన్=తగినట్లుగా; బుధానసన్ = బుధులకుఁ దైన ధీమూర్తిఁ గూర్చి పల్కె నని యన్వయము.

క. వినుమాదరమున పవిత్రసద్గోత్రయె
వ్వఁడు మనువంశపావనుఁ డనఁగ
నడరు నెవ్వనికీర్తి యధరితామృతవార్ధి
చంద్రమతీశుండు సాంద్రభూతి
శౌర్యవైశ్వానరజ్వాలావలీఢారి
నలుఁ డతం డలరు నాబలియునందుఁ
గలుగు నాసత్యరేఖాగుణోత్కర్ష మే
నరనాథునందు నెన్నఁడును గాన

గీ. మనుచుఁ దద్గురుసన్నిధి నభినుతింప
నాసమితి మీఱు చపుడ దమానుభవమ
నోంబుజంబున నొనరి యత్యంతశక్తి
గాధితనయర్షి యతనుఁడాగ్రహముఁ బూని. 25

టీక. హరి. పవి...గోత్ర-పవి = వజ్రాయుధముచేత, త్రసత్ = భయపడుచున్న, గోత్ర=పర్వతములుగలవాఁడా! ఎవ్వఁడు మనువంశపావనుఁ డనఁగా నడరును, ఎవ్వనియశము అధరితామృతవార్ధి గలది, చంద్రమతీశుఁడు, సాంద్రభూతి= సాంద్రమైన సంపదగలవాఁడు; శౌర్య...నలుఁడు - శౌర్యవైశ్వానరజ్వాలచేత, అవలీఢ=ఆస్వాదింపఁబడిన(దహింపఁబడిన),అరి=శత్రువు లనెడు, తృణములుగలవాఁడు. ('తృణేఽంబుజే నలం నాతు రాజ్ఞి నాళే తు నస్త్రియాం' అని విశ్వ.' అతఁడు = అహరిశ్చంద్రుఁడు, అడరున్, అబలియునందున్,కలిగియుండు; అసత్యరేఖాగుణోత్కర్షము, ఏనరనాథునందున్, ఎన్నఁడును. కాన మనుచున్, తద్గురుసన్నిధిన్-తత్ = యింద్రునియొక్క, గురు=అధికమైన, సన్నిధిని, అభినుతింప, ఆసమితిన్ = ఆసభను, మీఱుచున్ అపుడు, అదమ...అంబుజంబునన్ - అదమ = అగ్రహముయొక్క, అనుభవముగల, మనోంబుజంబుచేత, అత్యంతశక్తి, అతనుఁడు, గాధితనయర్షి=విశ్వామిత్రుఁ, కర్త. 27-వ పద్యమందలి క్రియతో నన్వయము.

నల. పవిత్రసద్గోత్ర-పవిత్ర=పవిత్రమైన, సద్గోత్ర=సద్వంశముకలవాఁడా! వినుము; ఎవ్వఁడు, వంశపావనుఁ డనంగన్, మనున్ = వర్ధిల్లును, ఎవ్వనికీర్తి = యశస్సు, అధ...చంద్రము-అధరిత = నిరస్తమైన, అమృతవార్ధిచంద్రము=సుధాబ్ధి చంద్రులు గలది, సాంద్రభూతిచేత, అతీశుఁడు = ఈశ్వరునతిక్రమించినవాఁడు; శౌర్య...అరి-శౌర్యవైశ్వానరజ్వాల=ప్రతాపాగ్నిజ్వాలలచేత, అవలీఢ = ఆస్వాదిం

పఁబడిన, అరి=శత్రువులుగలవాఁడు;(శత్రువులనుజయించినవాఁడు) నలుఁడు.అతండు, అలరుచున్, నాసత్య...కుత్కృష్టము-నాసత్య = అశ్వినీదేవతలవాటి. రేఖా గుణోత్కర్ష ము=సౌందర్యగుణాతిశయము. తద్గురుసన్నిధిన్ - తద్గురు = ఆ (దమయంతి) జనకుని యొక్క, సన్నిధిన్=సాన్నిధ్యమందు, అధీనుతింపన్, ఆన్=అతనిచేత, మితిమీఱు చున్=మట్టుననిలువక, అప్రుడే = అప్పుడే, దమా...ంబుజంబున — దమానుభవ = దమయంతియొక్క, మనోంబుజంబునన్=మనఃకమలమున, ఒనరి=ఒప్పి, అత్యంత... ఋషి-గాధిత = కొంచెముచేయఁబడిన, నయ=తపోబలముగల, ఋషి=ఋషులుగల, అతనుఁడు = మన్మథుఁడు, కర్త. 27-వ పద్యమందలి క్రియతో నన్వయము.

సీ. తలిలక యబ్జారిధరునిపైఁ బాదంబు
సంఘటించిన ద్విజస్వామియుండ
మున్న వనీఘదంబులనెల్ల నడఁచి క్ర
మ్మఱ నించునానాగమనిధి యుండఁ
బటుమహారంభేశభావంబుఁ గని యక్ష
పదరూఢి నెఱపు గీర్వాణుఁ డుండ
జగతినాదిత్యభూశాసనునపరావ
తార మహా సుమనోవతంసుఁ డుండ

గీ. సర్గవిలసిత సృష్టిచే నలినభవుఁ డె
నకిన యే నుండఁ దానొక్కనరునిఁ బ్రమద
బుద్ధి నెట్లు సత్యస్వరూపుఁ డని యెన్ను
టని యొదవ రౌద్రగతి దీపితాత్ముఁ డగుచు. 26

టీక. హరి. అబ్జారిధరునిపైన్=శంఖచక్రధారి యైన విష్ణువుమీఁద, పాదంబు, సంఘటించిన, ద్విజస్వామి యుండఁగన్, (విష్ణువును గాలితోఁ దన్నిన భృగుమహర్షి యుండఁగా ననుట) మున్ను, అవనీఘదంబులన్-అవని=భూమికి, ఘదంబులన్=వస్త్రములైన సముద్రములను, ఎల్లన్, అడఁచి.క్రమ్మఱన్, నించు=నిండించునట్టి, నానాగమనిధి=నానా వేదములకు నిధి, యుండఁగన్, (సముద్రముల నాపోశనముగఁ గ్రోలి మఱల నిండించిన యగస్త్యుఁ డుండఁగా ననుట.) పటు...భావంబున్-పటు=సమర్థమైన, మహారంభ=మహోద్యోగముగల, ఈశ్వరునియొక్క భావమును, కని=చూచి, అక్షపద రూఢిన్ - అక్ష=నేత్రముతోఁ గూడుకొనిన, పదరూఢిన్=పాదముయొక్క రూఢిని, నెఱపు, గీర్వాణుఁ డుండఁగన్, (శివున కఱకాలఁ గన్నుఁ జూపిన గౌతముఁ డుండఁగా ననుట.) జగతిన్,ఆదిత్య...అవతారము, ఔ, ఆదిత్యభూ=యముని, శాసను=శాసించిన

రుద్రునియొక్క, అపరావతారమైన, సుమనోవతంసుఁడు=ఋషిశ్రేష్ఠుఁడు, ఉండఁగ, (రుద్రాంశయందు జన్మించిన దుర్వాసుఁడుండఁగా ననుట; నవ్యవిలసితసృష్టిచేఁ=లీలా విలసితమైనసృష్టిచేత, నళినభవుఁ=బ్రహ్మదేవుని, చెనకినయేను=ఎదిరించిన నేను, ఉండఁగ;(బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసిన తా నుండఁగా,విశ్వామిత్రుఁ డుండఁగా ననుట.) తాను.ప్రమదబుద్ధిఁ = ప్రకృష్ట మదయుక్తమైన బుద్ధిగలవాఁడని, ఒకనరుని = ఒక మనుష్యమాత్రుని సత్యస్వరూపుఁ డని యున్నట; ఎట్లు ? అని రౌద్రగతి, ఒదవఁగా,

నల. అబ్జారిధరునిపైఁ=శివునిపైని, పాదంబుఁ=చరణమును, సంఘటించిన ద్విజస్వామి=నక్షత్రాధిపతియైన చంద్రుఁడు, ఉండఁగ, (శివున కవతంసమైన చంద్రుఁ డుండఁగా ననుట.) మున్న=మును పే, వనీఛదంబులఁ=వనపత్రములను; ఎల్ల నడఁచి క్రమ్మఁ బెంచు నానాగమనిధి=నానావృక్షనిధానము, ఉండఁగ,(పండుటాకుల దుల్చి వృక్షములఁ జిగురొత్తఁజేయు వసంతుఁ డుండఁగా ననుట.) రంభేశభావంబుఁ=రంభా నాయకత్వమును, కని, యక్షపద=అలకాపురమునందు, ఖ్యాతిఁ=ప్రసిద్ధిని, చెలువు గీర్వాణుఁడు, ఉండఁగ, (రంభానాయకుఁడై ప్రసిద్ధిఁగాంచిన నలకూబరుఁ డుండఁగా ననుట.) ఆదిత్యభూశాసను = దేవేంద్రునియొక్క, అపరావతారమా, సుమనోవతంసుఁడు=దేవతాశ్రేష్ఠుఁడు,ఉండఁగ,(ఇంద్రపుత్రుఁడైన జయంతుఁ డుండఁగాననుట.) నలిఁ, మిక్కిలి, అభవుఁ=ఈశ్వరుని, చెనకినయేను, ఉండఁగ, (ఈశ్వరునంతివాని నెదుర్కొనిన తాను మన్మథుఁ డుండఁగా ననుట); ఒక్కనరునిఁ = ఒకమనుష్యమాత్రుని, ప్రమద=దమయంతి, ఎట్లు సత్యస్వరూపుఁ డని యున్నట = చక్కనివాఁడని తలఁచు టెట్లు? అనియో, (ఇట్లనియూహించియో యనుట.) దవరౌద్రగతిఁ-దవ= దవానలముభంగిని, రౌద్రగతిఁ=ఉగ్రమము చేత, దీపితాత్ముఁడు, అగుచు.

మ. భయదంబై యతిరోహితాబ్జముకుళప్రౌఢాంబకోద్వృత్తవిభా
చయ మొప్పన్ శ్వసనం బుపాత్తశమనాశంబై మహోవహ్నిక
ణయకీల జ్వాలయింపఁగా మృగధరాఖండోద్ధతుల్మీఱ ని
ర్దయవృత్తిన్ దదళీకసంఘటనసంధాస్ఫూర్తిఁ దాల్చె న్వెసన్. 27

టీక. వారి. అతిరోహి...చయము-అతిరోహిత=మిక్కిలి యొప్పినై, అబ్జముకుళములభంగి, ప్రౌఢములైన, అంబ=నేత్రములయొక్క, ఉద్వృత్తవిభాచయము; శ్వసనంబు = నిశ్వాసము, ఉపాత్తశమనాశంబై - ఉపాత్త=పొందఁబడిన, శమ=శాంతియొక్క, నాశంబై=నాశముగలదై, మృగధర = ఈశ్వరునియొక్క, అఖండోద్ధతులు, త...స్ఫూర్తిఁ-తత్ =అహరిశ్చంద్రునియొక్క, అళీకసంఘటన=అనృతసంఘటనమునందు, సంధాస్ఫూర్తిఁ, తాల్చెను=వహించె నని 25-వ పద్యమందలి 'గాధితనయుర్షి' యనుకర్తతో నన్వయము.

నల. అతి...చయము - అతిరోహిత = తిరోహితములు గాని, (అమోఘము లనుట.) అజ్ఞముకళ్లను లనియెడు. ప్రాధాంబక=ప్రాధాస్త్రములయొక్క, ఉద్యత్ప్రభాచయము=పైకివ్యాపించుచుండెడు కాంతిపుంజము, శ్వసనంబు=వాయువు, ఉపాత్తశమనాశంబై - ఉపాత్త=పొందఁబడిన, శమనాశంబై=దక్షిణదిక్కుగలదై, మహాోపహ్నికిన్ = (తన ప్రతాపాగ్నికి. మృగధరాఖండోద్ధతుల్=చంద్రునియొక్క అతిశయమైనగర్వములు, తదళీక...సూక్తిన్-తత్ = ఆదమయంతియొక్క; అళీక = అప్రియమును,('అళీకం త్వప్రియేఽనృతే అని యమ.) సంఘటన=కూర్పుటయందు, సంధానూక్తిన్=ప్రతిజ్ఞానూక్తిని, తాల్చె నని 25-వపద్యమందలి 'యతనుఁ' డను కర్తతో నన్వయము.

తే. ఈకరణి నక్షమత్వసమాకులితహృ
దధ్వగాధిప్రభవమునిజాగ్రహంబు
దగ్రముగననిమిషపాళియల్క మించి
కలికిశుభదృశ్యతరుణిమగండు పూనె. 28

టీక. హరి. అక్షమత్వ...ఆగ్రహంబు-అక్షమత్వ=క్షమ లేకుండుటచేత, సమాకులితమైన, హృదధ్వ=మనోమార్గముగల. గాధిప్రభవముని = విశ్వామిత్రునియందు, జ=పుట్టిన, ఆగ్రహము, (అనఁగా ఉదగ్రముగ), అనిమిషపాలి=దేవేంద్రుఁడు, అల్క=భయపడునటుల, కలికి=కలహమునకు, ('కలిసంస్ఫోటసంయుగాః' అని యు.) శుభ...మగండు-శుభ=శుభార్థము, దృశ్య=చూడఁదగిన, తరుణీ=అరుంధతియొక్క, మగండు, (వసిష్ఠుఁ డనుట) పూనెను.

నల. అక్ష...ప్రభవము-అక్షమత్వసమాకులితమైన, హృత్=హృదయముగల, అధ్వగ = పాంథులయొక్క, అధి = మనోవ్యథకు, ప్రభవము = హేతువైనది. ('స్యాజ్జన్మ హేతుః ప్రభవః' అని యు.) నిజాగ్రహంబు, అనిమిషపాళి = మీనధ్వజుఁడు. కర్త. ('సురమత్స్యావనిమిషౌ' 'పాళిః కేతు ర్ధ్వజోలింగం' అని యు.) కలికి...తరుణిమన్ - కలికి=దమయంతియొక్క, శుభమై, దృశ్య = చూడఁదగిన, తరుణిమ=తారుణ్యముచేత, గండుపూనెన్=విజృంభించెను. (మన్మథుఁడు దమయంతియొక్క వయస్సును సాధనముగఁ జేసికొని విజృంభించె ననుట.)

సీ. పూని యి ట్లనురాగము గెరల్పఁ గల నైన
మఱచి నైనను నలమానవపతి
యన్నపలుకు దప్పు కలరుఁబోఁడిమితోఁద
[1]రాత్త మై యాత్మశోచ్యత నెనసినఁ

1. రా ష్ట్ర మై.

బలుమాట లేల భూపతిసతి నైనఁ బా
యును ధృతి నోర్చునాత్మోద్భవాభి
తాప మింతయు కాని తఱలక యుండు నే
మిటఁ బూన్కి యిదియసంఘటిత మైన
గీ. యంజికయ శేషసుమనోవనాగ్రదేశ
ముఖరభూరిద్విజావళిమ్రోల నెట్టు
గా నిలువనేర్తు నాత్మరోగంబుఁ దొఱఁగి
చనుదుఁ గా కని తాల్చె సూనృతప్రతిజ్ఞ. 29

టీక. హరి. పూని (కలహమునకుఁబూని యని) ఇట్లనుచు, రాగము=మాత్సర్యము, కెరల్పఁగ=హెచ్చరింపఁగా, ('రాగోఽనురక్తౌ మాత్సర్యే' అని విశ్వ.) అలమానవపతి=ఆహరిశ్చంద్రుఁడు, కలమైనను, మఱచియైనను, ఆత్మ=తనహృదయము, దర=భయముచేత, ఆర్తయై=పొందఁబడినదై, శోచ్యత=జనసిన=దుఃఖమునొందినను, అన్న పలుకు=అడినమాట, తప్పక (పోఁడిమితో నలుకు నని యన్వయము.) పలుమాటలేల?, భూపతి=హరిశ్చంద్రుఁడు, సతినైనను, పాయును=విడుచును, ఆత్మోద్భవాభితాపము=పుత్రశోకమును, (ధృతినోర్చు నని యన్వయము.) ఏమిటను, పూన్కిఁగ=సత్యమందలి పూనికను, తఱలక యుండును. ఇది=ఈపూన్కి అసంఘటితమైనచో, ఆశేష...మ్రోలన్-అశేషమైన, (ఇదిద్విజవిశేషణము.) సుమనోవన=దేవతారక్షకునియొక్క (ఇంద్రునియొక్క యనుట.) అగ్రదేశమందు, ముఖర=మ్రోఁగుచున్న, భూరిద్విజావళియొక్క, మ్రోలన్, ఎట్టుగా=ఏతీరున, నిలువనేర్తున్=నిలువఁగలుగుదును?, ఆత్మరోగంబున్=తన (నాయొక్క) రోగమును, (తొఱఁగి), చనుదున్, కాక యని సూనృతప్రతిజ్ఞన్ (తాల్చెను.)

నల. అనురాగము, కెరల్పన్, కలమైనన్, మఱచియైనను, నలమానవపతి, అన్న పలుకు=అనియెడిమాటను, తప్పక, అలపుఁబోఁడి=దమయంతి, కర్త. మితోదరార్తయై-మితోదర=అణుమధ్యలచేత (చెలులచేత), ఆర్తయై=పొందఁబడినదై, (తెలియఁబడినదై యనుట.) ఆత్మ శరీరము, శోచ్యతన్ = శోచనీయమాటన్, ఎనసినన్, (దేహకార్శ్యము జూచి చెలులు వ్యథనొందఁగా ననుట.) ఇటనుండి దమయంతి చెప్పెడిమాట:—పలుమాటలు, ఏల? భూపతిసతిని=నలునిభార్యను: ఐనయెడన్, ధృతి=ధైర్యముచేత, ఓర్చెదు, ఆత్మోద్భవాభితాపము=మదనతాపము, పాయును, ఏమిటన్, పూన్కిన్, తఱలక యుండును (ఎందుచేతను మదనతాపము ఎదలకయుండు ననుట). ఇదియు = ఈమదనతాపమే, సంఘటితమైన=నిలిచియుండెనా, అంజక=భయపడక, అశేష...మ్రోలన్-అశేష=సకలవిధములైన, సుమనః=పువ్వులుగల, వనాగ్రదేశమందు, ముఖర=మ్రోయు

చున్న. భూరి=అధికమైన, ద్విజావళి=కోకిలాదిపక్షిసమూహముయొక్క, ప్రోలన్=సమీపమున, నెట్టుగా=దృఢముగా, నిలువనేర్తును. ఇది తెగువమాట. ఆత్మరోగంబు; ఆత్మ=శరీరముయొక్క, రోగంబున్=సంగతిని, తొఱఁగి=విడిచి చనుదుఁగాక ! (అనఁగా మృతినొందు ననుట) అని మాతృప్రజ్ఞను. తాత్పర్యము.

చ. హరిహయుఁ డంత దక్షిణదిశాలయవాయువనాధిరాట్కళా
ధరముఖమిత్రవర్గసహితంబుగ సాహసపు సంభ్రమించి స
త్వరతశతారసాధనము వైచినఁ దత్సభయాకులత్వమ
చ్చెరువుగఁ బూని యప్రమదశీర్ణమహాయతి యయ్యె[1]నంతయున్.

టీక. హరి. హరిహయుఁడు=ఇంద్రుఁడు, దక్షిణ...సహితంబుగన్-దక్షిణదిశాలయ=యముఁడు, వాయువు, వనాధిరాట్=వరుణుఁడు, కళాధర = రుద్రుఁడు, ముఖ=మొదలుగాఁగల, మిత్రవర్గసహితంబుగన్=మిత్రవర్గముతోఁగూడ, సంభ్రమించి=చలించి, శతారసాధనము=శతకోటిసాధనమును (వజ్రాయుధము), వైచినన్=జాఱవిడువఁగా, తత్సభ=ఆయింద్రునిసభ, ఆకులత్వమున్, పూని, అప్రమద=సంతోషాభావముచేత, శీర్ణ=యథాయథలైన, మహాయతి=మహామునులుగలది, అయ్యెను;

నల. హరిహయుఁడు=మన్మథుఁడు, దక్షిణదిశాలయ...సహితంబుగన్-దక్షిణదిశాలయవాయు=దక్షిణవాయువు-(మలయమారుతము); వనాధిరాట్=వసంతుఁడు, కళాధర=చంద్రుఁడును, ముఖ=మొదలుగాఁగల, మిత్రవర్గసహితముగా, సంభ్రమించి = విజృంభించి, శతారసాధనము-శత=నూఱైన, అర=అంచులుగల, సాధనము=శతపత్రసాధనము (కమలము); తత్సభయాకులత్వము-తత్=ఆసాధనమువలననైన, సభయ = భయముతోఁగూడిన, ఆకులత్వము, అప్రమద=అదమయంతి, శీర్ణ...యతి-శీర్ణమైన, మహాయతి=అధికమైన ఉత్తరకాలముగలది, అయ్యెను. (ఉత్తరః కాల ఆయతిః అని యు.)

వ. తదనంతరంబ, 31

వసంతర్తువర్ణనము.

సీ. చైత్రికుం డై రాగసామగ్రి నెఱపి త
పస్యాంత మయి ఫలప్రాప్తి నడరి
మధు వై నవామోదమహిమఁ దార్కొని కాల
గురు వై యశేషాధ్వగులఁ గలంచి
సుమనఃప్రసూతి నై శుకలీలఁ దనరి మా
ధవుఁ డై పలాశభేదన మొనర్చి

1. నయ్యెషన్.

యామని నై భూజనైకదుర్గతిఁ బాపి
సురభి నై హరిహయస్ఫురణ [1]మెలఁగి
గీ. సారసవనప్రయోక్త నై సకలవిప్ర
వరశుభప్రదనానాసవముల నెసఁగి
యవని నలరె వసంత మత్యంతమధుర
పంచమస్వరపూర్ణతాభవ్య మగుచు. 86

టీక. రెంటికిని సమము: ఈపద్యమునఁ జమత్కారముగాఁ జైత్రికాది వసంతవాచక శబ్దములచేత నే వసంతునియం దన్యత్వారోపణ చేసి సమర్థించినాఁడు. వసంతము, కర్త. చైత్రికుండై = చిత్రకారుఁడై, రాగసామగ్రిన్-రాగ=అనురాగ మనెడువర్ణములయొక్క, సామగ్రిని, నెఱపి, తపస్యాంతమై-తపస్యా=తపశ్చర్యయొక్క; అంతమై=తుదయై; (తపస్య అనఁగా ఫాల్గునమాసము. ('స్యాత్తపస్యః ఫాల్గునికః' అని యు.) ఇది వసంతవాచకము. ఫలప్రాప్తిన్ - ఫల=ఫలము లనెడు నిష్టఫలములయొక్క, ప్రాప్తిచేత, అడరి, మధువై=మద్యమై, నవామోదమహిమన్-నవ=నూతనమైన, ఆమోద=పరిమళ మనెడు సంతోషముయొక్క; మహిమచేత, తాఁ గ్రాఁగి, కాలగురువై=సూర్యుఁడై, అశేషాధ్వగులన్=అశేష విరహు లనెడు త్రోవరులను, కలంచి; సుమనః ప్రసూతియై=విద్వత్పుత్రుఁడై; శుకలీలన్=శుకమునియొక్క లీల అనెడు శుకునియొక్క లీలలచేత, తనరి, మాధవుఁడై=విష్ణువై, పలాశభేదనమున్=మోదుగులయొక్క వికసన మనెడు రాక్షస సంహారమును, ఒనర్చి; ఆమనియై=ఆమని కాలమై, (ఆమని=సమృద్ధి); భూజనైకదుర్గతిన్-భూజ=వృక్షములయొక్క, నైక=అధికమైన, దుర్గతి=దైన్యమనెడు, భూజన=భూజనుల యొక్క, ఏకదుర్గతిన్=కేవలదారిద్ర్యమును; పాపి, సురభియై=కామధేనువై, హరిహయస్ఫురణన్-హరిహయ=మన్మథుఁ డనెడు నింద్రునియొక్క స్ఫురణతో, మెలఁగి, సారసవనప్రయోక్తయై=సారమైన, సవన=సవనత్రయముయొక్క, ప్రయోక్తయై, సకల...ఆసవములన్, సకలమైన, విప్రవర=పక్షిశ్రేష్ఠు లనెడు బ్రాహ్మణోత్తములకు శుభప్రదమైన నానావిధములైన, ఆసవములన్=మకరందము లనెడు, నానాసవములన్=యజ్ఞములచేతను, నెసఁగి, (సారసవనప్రయోక్త యనఁగా పద్మవనములను వికసింపఁ జేయువాఁడనుట, ఇదియును వసంతవాచకము.) అత్యంత...భవ్యము - అత్యంతము మధురమైన, పంచమస్వర=కోకిలధ్వనియొక్క ('షడ్జం మయూరో వదతి పికః కూజతి పంచమమ్' అని యు.) పూర్ణతచేత భవ్య మగుచు, అలరె నని యన్వయము. వసంతరాగము పంచమస్వరపూర్ణమై యలరు నని స్ఫురించుచున్నది.

1. మెసఁగి.

మ. నవశక్రోపలనీల ! నీలముఖసేనాసంభ్రమాఖేల ! భీ
లవముగ్వాలివిఘాల ! ఘాలనయనాలంఘ్యాంబకోత్తాల ! తా
లవిభేదాకులఖేల ! ఖేలశరలోలస్థూలకుత్కీల ! కీ
లవదుద్యద్రుచిజాల ! జాలపదలీలామార్గకృద్భంగదా ! 87

టీక. భీ...ఘాల; భీలవ=భయలేశమును, ముక్=విడిచిన, వాలిని, విఘాల=భేదించినవాఁడా, ఘాల...కోత్తాల - ఘాలనయన=లలాటలోచనునకు, అలంఘ్యమైన, అంబక=బాణముచేత, ఉత్తాల=అధికుఁడైనవాఁడా! తాల...ఖేల-తాలవిభేద=సప్తతాలవిభేదనముచేత, ఆకులమైన, ఖ=ఆకాశమును, ఇల=భూమియును గలవాఁడా! ఖేల...కుత్కీల-ఖేలశర=లీలాబాణముచేత, (ఖేలశబ్దము, ఖేలతి అనుధాతువుమీఁదఁ బచాద్యజంతము.) లోల=చలించిన, స్థూలకుత్కీల=గొప్పపర్వతముగలవాఁడా! ('కుత్కీలో భూధరో గిరిః' అని వైజ.) కీల...జాల-కీలవత్ = అగ్నివలె, ఉద్యత్ = ప్రకాశించుచున్న, రుచిజాలముగలవాఁడా! జాల...భంగదా - జాలపద=హంసలకు, లీలామార్గమును, కృత్ =చేసినవానికి (పరశురామునికి,) భంగదా! = భంగమునిచ్చినవాఁడా! ("హంసో మరాళో నీలాక్షశ్చక్రపక్షస్సితచ్ఛదః, మానసౌకాః పరిప్లావి శ్చక్రాంగో జాలపాదకాః" అని రత్నకోశము)

క. పవనాత్మకృతకవనా !, కవనాభ్యవహారిభావుకమనోభవనా !
భవనారీతతనవనా !, నవనామామృతవికాసినతనీపవనా ! 88

టీక. పవ...కవనా!-పవనాత్మజ=ఆంజనేయునిచేత, కృత=చేయఁబడిన, కవనా=స్తోత్రముగలవాఁడా! కవ...భవనా! - క=వాయువు, వన=ఉదకము, అభ్యవహారి=ఆహారముగాఁగల వారియొక్క, (మునులయొక్క యనుట.) భావుక=భవ్యమైన, మనః=మనస్సు, భవనా=ఇల్లుగాఁగలవాఁడా! భవ...నవనా!-భవనారీ=పార్వతిచేత, తత=విస్తృతమైన, నవనా!=నుతిగలవాఁడా!, నవ...వనా! - నవనామామృతముచేత, వికాసి=వికసించెడు నతుల నెడు, నీపవనా! = కడిమిచెట్లుగలవాఁడా!

ఉత్సాహ. నవనరోధిబహువిరోధిజయనిరాధితాకృత
స్తవనగాధితనయబోధితనయసాధితాఖిలో
త్సవ ! సురాధిపాత్మవేధిశరబలాధికాప్తబాం
ధవయుతాధిగతపయోధిదశశిరోధిపాతనా !. 89

గద్యము. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష

చతుర్విధకవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతం బైన హరిశ్చంద్రనలోపాఖ్యానం బను మహాప్రబంధంబు నందుఁ బ్రథమాశ్వాసము.

టీక. సవన...ఉత్సవ-సవనరోధి=యజ్ఞనిరోధకులగు, బహువిరోధులయొక్క, జయమువలన, నిరాధిత=మనోవ్యథ లేకుండుటచేత, కృత=చేయఁబడిన, స్తవన=స్తుతిగల, గాధితనయ=విశ్వామిత్రునిచేత, బోధితమైన, నయ=నీతిచేత, సాధిత=సాధింపఁబడిన, అఖిలోత్సవములుగలవాఁడా!, సురా...పాతనా! - సురాధిపునియొక్క; ఆత్మను, వేధి=వ్యథపెట్టుచున్న, శరబలముచేత, అధికుఁడును, ఇష్టబంధువులతో, యూతముగా, అధిగత=పొందఁబడిన, పయోధి=సముద్రముగలవాఁడును నైన, దశశిరోధి = రావణుని యొక్క; పాతనా!=పతనము గలవాఁడా!

గద్యము. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతీపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవిపెద్దిరాజతనూజ పురాతనాధునాతనకవినప్రబంధార్థబోధన సమర్థమాన సాంబోజసుధీజనవిధేయానంతయనామధేయవిరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక" యను వ్యాఖ్యానంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీ రస్తు

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

## ద్వితీయాశ్వాసము



క. శ్రీయోజిత విమతానుజ!
ప్రాయోజితదనుజ! మనుజభావశ్రితనా
రాయణ! త్రిజగద్భరణప
రాయణ! రణరంగభీమ! రఘుకులరామా! 1

వ. అవధరింపుము. మృకండునందనుండు పాండునందనున కిట్లనియె. 2

ఉ. పంచమశుద్ధి గల్గునెడ భావిఫలోదయధన్యవై లతా
చంచలలోచనల్ ప్రసవసంపద పెంపు వహింపఁగా విజృం
భించు తదీయలక్ష్మిఁ దెలిపె న్సకలాగమపారగద్విజా
భ్యంచితపక్షపాతకలితాతివినూతనజాతపత్త్రముల్. 3

టీక. పంచమశుద్ధి=పంచమస్వరశుద్ధి యనెడు పంచమరాశిశుద్ధి, కలుగునెడ, భావి...ధన్యలు - భావి=కాఁగల, ఫలోదయ=ఫలోదయ మనెడు శుభఫలోదయము చేత, ధన్యలు, ఐ, లతాచంచలలోచనల్=తీవియ లనెడు స్త్రీలు, ప్రసవసంపద=పుష్ప సంపత్తియనెడు పుత్త్రసంపదయొక్క, ("ప్రసవః పుష్పఫలయోర్జననానుజ్ఞయో స్మృతే" అని నానా.) తదీయలక్ష్మి=ఆ ప్రసవసంబంధమైన లక్ష్మిని, సకలా...పత్త్రముల్-సకలాగమ = సకలవృక్షములయందు, పారగ=పారంగతము లైన, ద్విజ=పక్షుల యొక్క, అభ్యంచిత = మిక్కిలి యొప్పుచుండెడు, పక్షపాత=పక్షప్రసరణముచేత, కలిత=కదలింపఁబడిన, అతివినూతనజాతపత్త్రముల్=చిగురుటాకు లనెడు, సకలాగమ పారగ=సకలశాస్త్రప్రవీణు లైన, ద్విజ=విప్రులచేత, అభ్యంచితమైన పక్షపాతము గలుగునటుల, కలిత=వ్రాయఁబడిన, అతివినూతజాతపత్త్రముల్=మిక్కిలి క్రొత్తవైన జాతకములు, తదీయలక్ష్మిని తెలిపె ననియన్వయము. (ప్రకృతాప్రకృతశ్లేషాలంకారము.)

ఉ. పూని మహావనీవలయపోషణభార మపారవిక్రమ
శ్రీనిధి మాధవుం డవతరించిన నేయెడ జాతిసంకరం

బూనక పూర్ణకాముఁడయి యొప్పె జగంబు సదాసవానుసం
ధానపరాయణద్విజగణంబుల కబ్బె నభీప్సితార్థముల్. 4

టీక. మహావనీవలయ పోషణభారమును పూని; అపార...నిధి - అపారమైన, వి=పక్షులయొక్క, క్రమశ్రీ=సంచారసంపదకు నిధియైన, మాధవుండు=వసంతుఁడు, అవతరించినన్=పుట్టఁగా, ఏరూపన్=ఎవ్విధమునను, జాతిసంకరంబు-జాతి=జాజులయొక్క, సంకరంబును, ఊనక, జగము, పూర్ణకాముఁడు=పరిపూర్ణుఁడైన మన్మథుఁడు కలది, అయి, ఒప్పెను, సదా...గణంబునకున్, సత్=మేలైన, ఆసవ=మకరందముయొక్క, అనుసంధానమందు, పరాయణ=ఆసక్తములైన, ద్విజగణంబునకున్=తుమ్మెదలసమూహములకు, అభీప్సితార్థములు; అబ్బెనని యన్వయము. ద్విజశబ్దమునకుఁ దుమ్మెద యని యర్థము చెప్పుటకుఁ బ్రయోగము:—

తే. ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక, జాతిఁ బాసినతేంట్లు నిస్వనముఁ గూడు
కొనుటనో యనఁ గోకిలస్వనము చెలఁగెఁ, దనకు మఱిఁ బంచమత్వంబు దప్పకుండ.
(ఆముక్తమాల్యద).

ఇందుఁ బ్రకృతార్థము. మహా...భారము-మహావనీవలయ = అధికమైనభూవలయము యొక్క, పోషణభారమును, పూని; అపార...నిధి-అపారమైన, విక్రమశ్రీ=పరాక్రమసంపదకు, నిధియైన; మాధవుఁడు=విష్ణువు, జాతిసంకరము=వర్ణసంకరము, ఊనక=వహింపక, పూర్ణకాముఁడు=పరిపూర్ణమనోరథముగలవాఁడై, సదా...గణంబులకు- సదా=ఎల్లప్పుడు, సవానుసంధాన=యజ్ఞసంధానములయందు పరాయణులైన, ద్విజగణంబులకున్=బ్రాహ్మణసమూహములకు, అభీప్సితార్థములు, అబ్బెనని యన్వయము.

మ. తనమిత్రుండు మహావనప్రియబలాధారుండు విశ్వాతిమో
హనవల్లీవలయైకజాలకకరుండై రా మృగవ్యాప్తి నే
చినప్రాచీనపుళిందమౌళి దనకుం జేదోడు గాఁ బూనెఁ బ
చ్చనివిల్ శంబరవైరి యధ్వగమృగేక్షావిభ్రమాపాదియై. 5

టీక. తనమిత్రుఁడు, మహా...ధారుండు-మహావనప్రియబల=కోకిలబలగమునకు, ఆధారుఁడైన వసంతుఁడు, విశ్వాతి...కరుండు-విశ్వ=సమస్తములైన, అతిమోహనములైన, వల్లీవలయములయందు, ఏక=ముఖ్యముగ, జాలకకరుండు=మొగ్గలను జేయువాఁడు, అయి రాఁగా, మృగవ్యాప్తిన్=మృగమును గలిగియుండుటచేత, ఏచిన...మౌళి-ఏచిన=అతిశయించిన ప్రాచీన, పుళింద = ప్రాఁతబోయవాఁడైనరుద్రునికి, మౌళి = కిరీటమైన చంద్రుఁడు, తనకుచేదోడు గాఁగా, శంబరవైరి=మన్మథుఁడు, అధ్వగ...పాది-అధ్వగమృగేక్షా=పాంథస్త్రీలకు (విరహిణులకు), విభ్రమ=మనోవిభ్రాంతిని, ఆపాది=సంపా

దించుచున్నవాఁడు, అయి, పచ్చనివిల్లుపూనెను. విశేషార్థము. తనమిత్త్రుఁడు=తనబంధువు, మహో...ధారుండు, మహోవనప్రియబల=కిరాతబలమునకు,ఆధారుండు,విశ్వ...కరుండు-వి=పక్షులును,శ్వ=కుక్కలును,అతిమోహనములైన,వల్లీవలయములును,ఏక=ముఖ్యములైన, జాలక=వలలును, కరుండు=చేతియందుఁ గలవాఁడు, ఐ=అయి, మృగవ్యాప్తిన్-మృగవ్య=వేఁటయొక్క, ఆప్తిన్=ప్రాప్తిచేత, ప్రాచీనపుళిందమాళి=పురాతనకిరాతశ్రేష్ఠుఁడు, చేవోడుగాను, పచ్చనివిల్లు=పచ్చనియాకులు గట్టిన విల్లనుట, శంబరవైరి=కిరాతుఁడు, కర్త, అధ్వగ...మాపాది-అధ్వగ=మార్గమునవచ్చిన,మృగముయొక్క,వీక్షా=చూపులకు,విభ్రమాపాది=భ్రాంతిని పుట్టించెడువాఁడు, ఐ,పచ్చనివిల్లు, పూనెను.

సీ. సరసధారావికాసప్రసవంబులై
 యెసఁగుమావుల నెన్నియేని మనిచి
 ప్రకటగంధాంధపుష్పంధయావృతములై
 యలరుపున్నాగకోటుల నమర్చి
 చక్రచంక్రమణవాచాలలీలఁ జెలంగు
 పటుపత్త్రరథపరంపరలఁ గూర్చి
 చండాంశునూతనమండలాగ్రస్ఫూర్తిఁ
 దనరారుదళములఁ దఱచు పెనచి
గీ. చిత్రపత్రముఖోజ్జ్వలశ్రీలఁ దగున
 పారశరజాదముల నించి పరమమైత్రి
 నెఱపునామనిపడవాలు నేర్పుకలిమి
 జగముల జయించెఁ బ్రద్యుమ్నచక్రవర్తి. 6

టీక. సరస...ప్రసవంబులు-సరసధారావికాస = రసధారలయొక్క వికాసముతోఁగూడుకొనిన, ప్రసవంబులు=పూవులు గలవనెడు,సరసమైన, ధారా=పంచదారలయొక్క,వికాసముయొక్క,ప్రసవంబులు=ఉత్పత్తిగలవి, ఐ=అయి, ఎసఁగు=తనరారు, మావులన్=మావిళ్లనెడు గుఱ్ఱములను,ప్రకట...వృతములు-ప్రకటమైన, గంధ=వాసన యనెడు, ప్ర=అతిశయమైన, కటగంధముచేత (మదోదకముచేత), అంధములైన, పుష్పంధయ=తుమ్మెదలచేత,ఆవృతములు ఐ, అలరెడు,పున్నాగకోటులన్-పున్నాగ=పొన్నలనెడు నేనుఁగులయొక్క, కోటులను, చక్ర...లీలన్ - చక్రచంక్రమణ=చక్రాకారమైన (గుండ్రమైనసంచార మనియొడు చక్రసంచారములయొక్క,వాచాల=రొదచేయుచుండెడు, లీలచేత, చెలంగెడు, పటుపత్త్రరథపరంపరలన్-పటు=సమర్థములైన, పత్త్రరథ=పక్షులనెడు (‘పతత్పత్త్రరథాండజాః’ అని యు.) పటుపత్త్ర=దృఢవాహ

నములుగల ('యుగ్యంపత్త్రంచఖోరణమ్' అని యు.) రథములయొక్క, పరంపరలన్ = సమూహములను, చండాంశు...స్ఫూర్తిన్-చండాంశు = సూర్యునియొక్క, నూతనమైన, మండలాగ్రమువంటి, స్ఫూర్తి=ప్రకాశమని యెంచు, చండాంశు=ప్రచండకాంతులచేత, నూతనములైన, మండలాగ్ర=ఖడ్గములయొక్క స్ఫూర్తిచేత, తనరారెడు, వళములన్=ఆకు లనెడు సేనలను, చిత్ర...శ్రీలన్-చిత్రములైన, పత్త్రముఖ=ఱేకుల కొనల (దళాగ్రముల) యొక్క, ఉజ్జ్వలశ్రీలు=ప్రకాశమానములైన కాంతు లనియెడు, చిత్రములైన ప్రముఖ=ఱెక్కలకొనలయొక్క, ఉజ్జ్వలశ్రీలచేత, తగు= ఒప్పెడు అపారశరజాతముల్-అపారములైన, శరజాతముల్ = పద్మములనెడు బాణసమూహములను, నించి=నిండించి, ఆమని...కలిమిన్-ఆమనిపడవాలు = వసంతమనెడు దళవాయియొక్క, నేర్పుకలిమిన్=సామర్థ్యసంపదచేత, ప్రద్యుమ్నచక్రవర్తి జగములు జయించెను.

మ. అలరంజేసి నితాంతనూతనలతాంగాశ్లేషము ల్సల్పు ని
శ్చలలీల న్మధుపాంగనాసమితికిన్ సంధించుఁ దామ్రాక్షి యా
కలకంఠిం [1]బలికించు నేర్పున భుజంగగ్రామధామైకసం
కలనాభ్యాసవిలాసపాటవమునన్ గంధానిలాంకూరముల్. 7

టీక. గంధానిలాంకూరముల్ = సువాసితములైనపిల్లవాయువులు, భుజంగ...పాటవమునన్-భుజంగగ్రామధామ=మలయపర్వతమందలి, ఏక=ముఖ్యమైన, సంకలన=విహారముయొక్క, అభ్యాసమునందలి, విలాసపాటవమునన్ = విలాససామర్థ్యముచేత, అలరంజేసి, నితాంత...శ్లేషముల్-నితాంతనూతన=మిగులఁగ్రొత్తలైన, లతాంగ=లతావయవములయొక్క, ఆశ్లేషమును, సల్పు, మధుపాంగనాసమితికిన్=ఆఁడుతుమ్మెదలగుంపునకు, నిశ్చలలీలను, సంధించున్=కూర్చును, తామ్రాక్షి=రక్తదృష్టిగలది, యా=అగు, కలకంఠిన్=కోయిలను, నేర్పునన్ పలికించును, ఇటనఁగా, భుజంగ...పాటవమునన్-భుజంగగ్రామ = విటసమూహముయొక్క, ధామ=గృహములయందు, ఏకసంకలన = కేవలసంచారముయొక్క, అభ్యాస=విలాసపాటవముచేత, అలరంజేసి=సంతోషపెట్టి, నూతన...శ్లేషముల్-నూతనమైన, లతాంగా=స్త్రీయొక్క, ('అంగగాత్రకంఠేభ్య స్త్వివ్యతే' అను సూత్రముచేత వికల్పమున లతాంగయనియు రూపము.) ఆశ్లేషములు సలుపును. మధుపాంగనాసమితికిన్-మధుప=మద్యపానముఁజేసిన, అంగనాసమితికిన్, నిశ్చలత సంధించును. తామ్రాక్షి=కోపముచే నెఱ్ఱనైనకన్నులుఁ గలస్త్రీని, పలికించును. (ఇట గంధానిలాంకూరములయందుఁ బ్రగల్భనాయకత్వము స్ఫురించుచున్నది.)

సీ. అతిముక్తపంక్తికి నతులితామోదమ్ము
ద్వికామృతాశ్లేషవృత్తి గలిగె

1. పరికించు.

శుకముఖద్విజరాజి కకలంకవిలసన
శ్యామావిహారకౌశలము గలిగె
గురువిభవాశోకకోటికి నభినవ
ప్రమదాళిరాగవైభవము గలిగె
బరమహంసోత్తమప్రతతి కప్రతిమాన
పద్మినీరసనిగుంభనము గలిగె
గీ. నఖిలభువనైకమోహకుం డైనమాధ
వునకు నీవనవాసిరంజన మయత్న
కార్యలేశంబు సుమ్మంచుఁ గమ్మగావ్పు
గడిమి వ్రాయించెఁ గలకంఠకంఠఘంట. 8

టీక. అతిముక్తపంక్తికి = పెన్మిచెట్లయొక్క సమూహమునకు, ('రథద్రురతిముక్తకః' అని య.) అతులితా...వృతి-అతులితమైన, ఆమోద = పరిమళముగల, మృద్వీకా=ద్రాక్షాలతలయొక్క ('మృద్వీకాగోస్తనీద్రాక్షా' అని య.) అమితాశ్లేష వృత్తి=అతిశయాలింగన వ్యాపారము, కలిగెను. శుక...రాజికి-శుకముఖ = చిలుకలు మొదలైన, ద్విజరాజికిఁ=పక్షిసమూహమునకు, అకలంక...కౌశలము-అకలంకవిలసన=నిర్మలముగఁ బ్రకాశించుచుండెడు, శ్యామా=ప్రేంకణపుఁజెట్లయందలి, 'శ్యామాతు మహిళాహ్వయా' అని య.)గురు...కోటికిఁ-గురువైభవ=అధిక వైభవముగల, అశోక కోటికిఁ=అశోకవృక్షసమూహమునకు, అభి...వైభవము-అభినవమును, ప్రమద=మిగుల మదించినవియు నైన, అళి=తుమ్మెదలయొక్క, రాగవైభవము=గానవిభవము, పరమ...ప్రతతికిఁ-పరమ=శ్రేష్ఠములైన,హంసోత్తమ=హంసశ్రేష్ఠములయొక్క, ప్రతతికిఁ= సమూహమునకు, అప్రతిమాన...నిగుంభనము-అప్రతిమాన = ఈడులేని, పద్మినీ= తామరతీఁగెలయందలి, రసనిగుంభనము = రుచిగుంభనమును, అఖిలభువనైకమోహకుండు=సకలలోకములను మోహింపఁజేయువాఁడు. ఐన, మాధవునకుఁ=వసంతునకు, వనవాసిరంజనము-ఈవనమునందు, వాసి = వాసముచేయుచుండెడు పక్షివృక్షలతాదుల యొక్క, రంజనము=రంజింపఁజేయుట, అయత్నకార్యలేశము=యత్నము లేకయే చేయనగు స్వల్పకార్యము, అని, కలకంఠ కంఠ ఘంట = కోకిలకంఠమనెడుఘంటము, కమ్మగావ్పు, కర్త, వ్రాయించెను. (సకలలోకములను మోహింపఁజేయు వసంతునకు వృక్షాదివనవాసిరంజనము తృణప్రాయ మనుట.)

ఇందలి విశేషార్థము. అతిముక్తపంక్తికిఁ=విరక్తులసమూహమునకు, అతులితా...వృత్తి-అతులితమైన, ఆమోద=సంతోషముగల, మృద్వీ=సుకుమారస్త్రీలయొక్క, (కోమలమయిన,) ఆశ్లేషవృత్తి గలిగె, శుకముఖద్విరాజికి=శుకుఁడు మొదలగు బ్రాహ్మణ సంఘమునకు,అకలంక...కౌశలము. అకలంకమైన, విలసన=విలాసముగల, శ్యామా=

యువతులతోడి ('శ్యామా షోడశవర్షా స్త్రీ త్రివృత్తా తారిబాపితా'... అని నానా.) గురువిభవాశోకకోటికి గురువిభవమైన, అశోక=శోకరహితుల యొక్క, కోటికి, (అనగా; మునులకు,) అభి... వైభవము-అభినవ=నూతనమైన, ప్రమదా=స్త్రీల యొక్క; ఆళి=సంఘమందలి, రాగవైభవమును=అనురాగవైభవమును; పరమహంసోత్తమ ప్రతతికిన్=పరమహంసశ్రేష్ఠులకు, అప్రతిమాన...నిరుంభనము-అప్రతిమానమైన, పద్మినీ=పద్మినీజాతిస్త్రీలయందలి, రసనిరుంభనమును. వసంతునకు=మాధవునకు, అనురక్తినిరుంభనమును, వనవాసిరంజనము=మునుల యొక్క రంజనము, అయత్నకార్యలేశంబు (నిఖిల లోకములను మోహపఱచువానికి మునులను మోహింపఁజేయుట యొకలెక్క యనుట.) మాధవునకున్=విష్ణువునకు, వనవాసులరంజనము లేశమాత్రమని ధ్వని.

చ. చిగురుమెఱుంగుసంజలును జిక్కనిక్రొన్ననచుక్కగుంపు లిం
పగుపువుఁదేనె క్రొన్నెలలు నచ్చపుఁబుప్పొడి చిన్నివెన్నెల
ల్దగనతలంబు గప్ప నఖిలక్షణదాభ్యుదయంబు లయ్యె నే
వగఁ బగ లూనెనో సురభివైభవముల్ పథికాంగనాళికిన్. 9

టీక. సురభివైభవముల్ = వసంతవిభవములు. అఖిలక్షణదాభ్యుదయంబులు - అఖిల=ఎల్లవారికిని, క్షణ=ఉత్సవమును, ('క్షణ ఉద్ధర్షో మహ ఉద్ధవ ఉత్సవః' అని యః.) ద=ఇచ్చునట్టి, అభ్యుదయము లనెడు; అఖిలక్షణద=నిఖిలరాత్రుల యొక్క, అభ్యుదయంబులు=శుభోదయములు, అయ్యెను, ఏవగన్=ఏరీతిగ. పగలు=విరోధము లనెడు నహస్సులను. ఊనెనో=అవలంబించెనో, పథికాంగనాళికిన్=విరహిణీస్త్రీలకు, (వసంతవైభవ మందఱకు మంచిదయ్యెను బాంథస్త్రీలకుఁ బగవహించిన దయ్యె ననుట.)

ఉ. ఆతతి సమ్మహోత్పలహితాన్వయరాజవరుం డుదాత్తభా
వాతిశయప్రకాశితదమానుభవాప్తిఁ దనర్చె నాత్మవి
ద్యోతితనవ్యపాండురగుణోన్నతిఁ జంద్రఘనావలేపవి
ఖ్యాతి నడంచుచున్ గుశలుఁడై యజనప్రథితానురాగతన్. 10

టీక. హరి. ఆతతిన్ = అట్టివసంతసమయమున; అమ్మహోత్పలహితాన్వయరాజవరుండు=సూర్యవంశరాజశ్రేష్ఠుఁడగు ('అరవిందం మహోత్పలం' అని యః.) హరిశ్చంద్రుఁడు, ఉదాత్త...భవాప్తిన్-ఉదాత్తభావమునందు, అతిశయప్రకాశిత=మిగులఁ బ్రకాశితమైన, దమ=ఇంద్రియనిగ్రహము యొక్క, అనుభవము యొక్క, ప్రాప్తిచేత, ఆత్మ...ఉన్నతిన్-ఆత్మ=తన యొక్క; విద్యోతిత=ప్రకాశితమై; నవ్య=నుతింపఁదగిన, పాండురగుణోన్నతిన్=పరిశుద్ధగుణాతిశయముచేత, చంద్ర...విఖ్యాతిన్; చంద్ర=

చంద్రునియొక్క, ఘనావలేప=అతిగర్వముయొక్క, విఖ్యాతిని, యజన...రాగతన్-యజన=యాగముచేయుటయందు, ప్రథిత=ప్రఖ్యాతమైన; అనురాగతన్ = ప్రేమగలవాఁడగుటచేత, కుశలుఁడై = [illegible]వాఁడై. (కుశాన్ లాతిగృహ్ణాతీతి = కుశలః అని సమాసము.) తనర్చెను, అని యన్వయము.

నల. అతఁడన్, అమ్మహోత్పలహితాన్వయరాజవరుండు=చంద్రవంశరాజశ్రేష్ఠుడైన నలుఁడు, ఉదాత్త...అక్షీణ్-ఉదాత్తమైన, భావ=హృదయమునందు. అతిశయముగఁ బ్రకాశితమైన, సమానుభవ=దమయంతియొక్క, అక్షీణ్=ప్రాప్తిచేత, ఆత్మ...ఉన్నతిన్-ఆత్మ=దేహమందు, విద్యోతిత=ప్రకాశితమైన, నవ్య=నూతనమైన, పాండురగుణ=పాండిమగుణముయొక్క, ఉన్నతిని; చంద్ర...విఖ్యాతి-చంద్ర = కర్పూరముయొక్క, ఘన = దట్టమైన, అవలేప = పూఁతయొక్క; విఖ్యాతిన్ = ప్రకటనచేత, అడంచుచున్ = మఱుఁగుపఱచుచును, ఆజనప్రథితానురాగతన్ - ఆజనప్రథిత= జనప్రఖ్యాతముగాని, అనురాగముచేత (దమయంతియందలి తన యతిశయానురాగము నన్యులకెఱుకపడనీయనివాఁడై యనుట), తనర్చెను.

తే. అట్టియెడ వేఁడి మిగుల మర్యాద మీఱఁ
గలఁచి కూర్తు నానాళీకముల ననుచు స
రస్వతీధరు నిర్మితిప్రౌఢశక్తి
మాఱ్కొనినమేటి గదియ నమ్మనుజవిభుఁడు. 11

టీక. హరి అట్టియెడన్, మిగులమర్యాదమీఱన్=అమితముగా, వేఁడి = అడిగి, నానాళీకములన్; నానా=అనేకములైన; అళీకములన్=అబద్ధములను, కూర్తున్(అనఁగా దబ్బఱలాడింతు ననుట.) సరస్వతీధరు=బ్రహ్మను, నిర్మితిప్రౌఢశక్తి-నిర్మితి=సృష్టియందలి, ప్రౌఢమైన శక్తిచేత, మాఱ్కొనినమేటి(అనఁగా: విశ్వామిత్రుఁడు), కదియఁగా అమ్మనుజవిభుఁడు=హరిశ్చంద్రుఁడు, కర్త. పైపద్యమునందలి క్రియతో నన్వయము.

నల. అట్టియెడన్=విరహియై యుండు సమయమున వేఁడి=వేఁడిమి, మిగులఁగా, మర్యాదమీఱన్=మితిమీఱునట్లు, కలఁచి=కలఁతనొందఁజేసి; నానాళీకములన్=నానా బాణములను ('నాళీకం పద్మషండేఽబ్జే నాళీకశ్శరశల్యయోః' అని విశ్వ.) కూర్తు ననుచున్, సరస్వతీధరున్=ఈశ్వరుని ('శోధోఽవక్రాసరస్వతీ,' అని హలా.) నిర్మితిప్రౌఢశక్తిన్=మితిలేని సామర్థ్యముచేత; మాఱ్కొనినమేటి; (మన్మథుఁడు.) కదియన్= సమీపింపఁగా, అమ్మనుజవిభుఁడు = ఆ నలుఁడు, ఈకర్త పైపద్యమునందలి క్రియతో నన్వయించును.

సీ. ఉచితక్రియల నాస్థ నొనరించి యెడపక
యోమహాభారవియోగభరస

మగ్రనీరాకరమావలికడ సేర్పఁ
    గలరె నాసరివచ్చుఘను లనన్య
జనబుద్ధిఁ జెంది తారని వేడ్క బహుతరా
    గమశిఖాప్రమితివిత్తముల నంచి
తనయ సద్భూతిభూమునినుదయోదార
    మానసు వేఁడెదనేననియతి

గీ. నరవరాన్వయమణికొమ్మనవసుధాని
ధానమూర్తి నాసొమ్మిది యౌనె కాంతు
నాయభిమతార్థ మే నొక్కనాఁటి కింక
ననుచు నాత్మమహాశ్రమం బధిగమించి. 12

టీ. హరి. ఉచితక్రియుఁడ=తగుపూజావిధులను, ఆస్థన్ = ఆసక్తితో, ఒన రించి, ఓ మహాభారవి-మహాభా=అతిశయము కాంతియును; రవి=సూర్యుఁడవైనవాఁడా! యోగభరసమగ్ర! (ఇవి సంబుద్ధులు) నీరాక=నీయాగమనము. వమాఅలికడన్=సంప దలసమీపమున, చేర్పఁగా, నాసరివచ్చుఘనులు=నాసమానులగు గొప్పవారు,కలరే ? (లే రనుట.) అనన్=అనఁగా, యతి=విశ్వామిత్రుఁడు, కర్త. యజనబుద్ధిన్ = యాగ కరణమందలి బుద్ధిని, చెంది (యాగము సేయ నిశ్చయించినవాఁడై యనుట.) తారని వేడ్కన్=చెడని వేడుకతో, బహు...విత్తముల-బహుతరమైన, అగమశిఖా=పర్వ తాగ్రముయొక్క, ప్రమితి=ప్రమాణముగల, విత్తములను=ద్రవ్యములను, అంచి తనయ (సంబుద్ధి.), సద్భూతిభమునిన్,దయోదారమానసున్, వేఁడెదన్,ఏను=నేను, (అడుగుచున్నా నని) నరవరాన్వయమణి=రాజు, కొమ్ము = తీసికొనుము, అనన్ = అనఁగా, వసుధానిధానమూర్తి-వసుధా = భూమికి; నిధానమూర్తి! = నిధిస్వరూప మైన హరిశ్చంద్రుఁడా! (సంబుద్ధి). ఇది నాసొమ్ము; ఔనె; (ఇది నా యధీనమైనదే యనుట) నాయభిమతార్థము=నా ద్రవ్యమును; ఒక్కనాఁటికిన్, కాంతున్=కైకొం దును, అనుచు, ఆత్మమహాశ్రమంబు, అధిగమించి=చేరి.

నల. ఉచితక్రియలు,అనాస్థన్=ఆసక్తిలేక,అయో (ఇదిఖేదవాక్యము.) మహా ...కరము-మహాభారమైన, వియోగభర=విరహభార మనియెడు, సమగ్రనీరాకర ము=పరిపూర్ణసముద్రమును, అవలికడ సేర్పన్,(తరింపఁజేయుట కనుట,) నాసరివచ్చు ఘనులు=నాసరివా రగుమహానుభావులు,అనన్యజనబుద్ధిన్=ఇతరుఁడుగాఁ డనుమతితో, తారు=తము, అర్పఁగల రే?=అర్పఁగలుగుదురా? అని = ఈరీతి ననుకొని, బహు... త్తములన్ ;బహుతర=ఘనమైన,అగమశిఖా= వేదాంతముయొక్క,ప్రమితి=యాథార్థ్య జ్ఞానమును, విత్తములన్=మిక్కిలి తెలిసినవారిని, (వివేకవంతు లైనవిప్రుల నసుట).

('విద్ల లాభే', అను ధాతువునకు 'క్విప్' ప్రత్యయాంతమైన 'విత్' శబ్దమునకు 'తమ' ప్రత్యయము రాఁగా విత్తమశబ్దమైనది.) అంచి=పంపి, సద్భూతిన్, ఉదయోదార మానసుని, భీముని, తనయను, వేఁడెదను.(పెద్దల నంపి భీమతనయ నడిగించెద ననుట) నియతిన్ = భాగ్యముచేత, (భాగ్యంస్త్రీనియతిర్విధిః, అని య.) నరవరాన్వయమణి, కొమ్మ, నవసుధానిధానమూర్తి = నూతనచంద్రునియొక్క మూర్తివంటిమూర్తి గలది, (చంద్రరేఖవంటి దనుట.) ఇది, నాసొమ్ము, ఔనె = అగునా, ఇఁక నొక్కఁ నాఁటికి, అభినుతార్థమును, కాంతు నే! పొందఁగల నే! (ఇవి కాకువులు.) ఆత్మన్= మనస్సునందు; మహోక్రమంబున్=అధికాయాసమును; అధిగమించి.

శా. భావం బేవఁగ దద్వశీకృతిదృఢోపాయంబుగా నాతతే
ర్ష్యావిద్యోతితసంగరాగ్రహత విశ్వామిత్రుఁ డత్యంతశూ
న్యావాసంబులు గా నొనర్చె మతిసృష్టానేకచిత్రక్రియా
ప్రావీణ్యోజ్జ్వలజంతుసంతతులఁ దత్ప్రాసాదదేశంబులన్. 13

టీక. హరి. భావంబు=మనస్సు. ఏవఁగన్ = ఏవంతి నైనను, త...ఉపాయంబు-తద్వశీకృతిన్=ఆహరిశ్చంద్రవశీకరణమందు, దృఢమైన, ఉపాయము గలది, కాన్= కాఁగా, ఆతత...గ్రహత-ఆతతేర్ష్యచేత, విద్యోతిత = ప్రకాశింపఁజేయఁబడిన, సంగర=ప్రతిజ్ఞగలవాఁడైన, (వసిష్ఠునితోఁజేసిన ప్రతిజ్ఞగలవాఁ డనుట.) ('ప్రతిజ్ఞాజి సంవిదాపత్సుసంగరః' అని య.) అగ్రహత=అగ్రహముగలవాఁడగుటచేత, మతి... సంతతులన్-మతి=బుద్ధిచేత, సృష్టములై, అనేకచిత్రక్రియా=అనేకాద్భుతకార్యముల యొక్క, ప్రావీణ్యముచేత ఉజ్జ్వలములైన, జంతుసంతతులన్ = పశుపక్షిసంఘముల చేత, తత్ప్రాసాదదేశంబులన్; తత్ = ఆహరిశ్చంద్రునియొక్క, ప్ర=ప్రకృష్టము లైన, అసాద=చెడని, దేశములను, విశ్వామిత్రుఁడు, అత్యంతశూన్యావాసములుగా నొనర్చెను.

నల భావంబు. ఏవఁగన్=ఏవఁగన నైనను;త...ఉపాయంబు-తత్ =అదమయంతి యొక్క; వశీకృతిన్=వశీకరణమందు, దృఢ=స్థిరమైన, ఉపాయముగలది, కాన్ = కాఁగా=ఆ, తత...అమిత్రుఁడు-తతేర్ష్యా = విస్తారమైనయీరసముచేత, సంగరాగ్రహమందు, హత=హింసింపఁబడిన, విశ్వ=నిఖిలమైన, అమిత్రుండు = శత్రువులుగల యానలుఁడు, అత్యంతశూన్యావాసంబులుగాన్-అతి=మిక్కిలి, అంతరహిత=కడలేని, ఆవాసంబులుగాన్ = గృహములు గలవానినిగా, సృష...సంతతులన్ - సృష్ట= సృజింపఁబడిన, అనేకములైన, చిత్రక్రియా = చిత్తరువుపనులయొక్క, ప్రావీణ్యము చేత, ఉజ్జ్వలములైన, జంతు=ప్రతిమారూప జంతువులయొక్క, సంతతులన్=సంఘములుగల, తత్ప్రాసాదదేశంబులన్-తత్ = ఆదమయంతికొఱకైన, ప్రాసాదదేశంబులన్=మేడలను, మతిన్, ఒనర్చెను (దమయంతిని వరించుటకు దృఢోపాయచింత

గలవాఁడైయాయెడకు విహారసౌధములఁ గట్టించు నని మనస్సున సంకల్పించె ననుట.)
[ఇక్కథకే మఱియొక యర్థము,భావము. దమయంతీ స్వీకరణమందు వృషోత్సాహము గలవాఁడుకాఁగా నలుఁడు, తత్ప్రాసాదకేళంబులన్=తిథావిధములైన మేడలను, అత్యంతసూన్యావాసంబులుగాన్-అత్యంతశూన్య=మిక్కిలి సారరహితమైన; ఆవాసంబులన్=స్థితిగలవానినిఁగాఁ, ఒనర్చెను, దమయంతీపాణిగ్రహణమందు వృషమనస్కుఁడైన నలుఁడు తనచిత్తరువు మేడలను విహారయోగ్యములై శాశ్వతములై నిలిచినవానిని గాఁ దలఁచె ననుట.)

తే. అపుడు నానావనీరక్షణాధికృతులు
వచ్చి కమలధరాన్వయేశ్వరుని బలికి
రెదుటఁ బ్రమదవనక్రోడవిదళితాభి
నవవిజృంభణశాలిప్రసవము[1]లునిచి. 14

టీక. హరి. అపుడు; నానా...కృతులు-అనేకులైన, అవనీరక్షణాధికృతులు=భూరక్షణాధికారులు,వచ్చి; కమలధరాన్వయేశ్వరుని, [2]కమలధరాన్వయ=సూర్యవంశమునందలి, ఈశున్=రాజును గూర్చి,ప్రమద...ప్రసవములు-ప్రమద=ప్రకృష్టమదము గల,వనక్రోడ=అడవిపందులచేత, విదళిత=కొట్టఁబడిన, అభినవవిజృంభణ=నూతనవికాసముగల, శాలిప్రసవములు=వరియెన్నులు, ఉనిచి,

నల. నానా...కృతులు-నానా=అనేకములైన, వనీరక్షణాధికృతులు=వనాధికారులు,కమల...శ్వరుని-కమలధర=కురంగధరునియొక్క,(చంద్రునియొక్క)(స్యాత్కురంగే2_పికమలః, అని య.)అన్వయముగల ఈశ్వరుని=రాజునుగూర్చి; ప్రమద...ప్రసవములు-ప్రమదవన=ఉద్యానవనముయొక్క; క్రోడ=ప్రదేశములయందు, విదళిత=వికసితములైన, అభినవవిజృంభణముచేత, శాలి=ఒప్పెడు, ప్రసవములుపుష్పములు, ఎదుటన్ ఉనిచి, పలికిరి.

చ. నిరుపమదానకేళిమహనీయ వనీవలయంబునన్ నిరం
తరఫలసంపదల్ ద్విజవితానకృతశ్రుతియోగ్యనిర్మల
స్వరములు నర్హ కాలవిలసద్ఘనపుష్పమహావిభూతియున్
నిరతము మించు నిత్తఱి జనించువిశేషము లేమి చెప్పఁగన్. 15

టీక. హరి. నిరుపమదానకేళిమహా (సంబుద్ధి), నీయవనీవలయంబునన్=నీరాజ్యమునందు,నిరంతరఫలములైన,సంపదలు, ద్విజ...స్వరములు-ద్విజ=బ్రాహ్మణులయొక్క,

---

1 విచ్చి. 2 కమలధరుఁడు సూర్యుఁడనుటకుఁ బ్రయోగము.
శ్లో. పద్మాసనః పద్మధరః పద్మగర్భసముద్యుతిః,
సప్తాశ్వస్సప్తరజ్జుశ్చద్విభుజస్స్యాత్సదారవిః,

వితాన=యజ్ఞములయందు (క్రతువిస్తారయో రస్త్రీవితానం త్రిషుతుచ్ఛకే,అని యు.) కృత=చేయఁబడినది, శ్రుతి=వేదములయొక్క; యోగ్యములైన, నిర్మలస్వరములు, అర్హ...విభూతియుక్-అర్హకాలములయందు, విలసత్=ఒప్పెడు, ఘనపుష్ప=పర్వము యొక్క, మహావిభూతియును, నిరతము, మించును, ఇత్తజీజనించువిశేషములు (ఇపుడు పుట్టినయుపద్రవము లనుట.)

నల. నిరుపమదానకేళిమహనీయ! (సంబుద్ధి.) వనీవలయంబునన్, నిరంతరఫల సంపదలు, ద్విజ...స్వరములు - ద్విజవితాన=పక్షిసమూహముచేత, కృత=చేయఁబడిన శ్రుతియోగ్యములైన,నిర్మలస్వరములు; అర్హ...విభూతియుక్-అర్హకాలములయందు, విలసత్ = ప్రకాశించుచున్న, ఘనమైన, పుష్పమహావిభూతియుక్ = పుష్పముల యొక్కకల్మియును, నిరతము = ఎల్లప్పుడును; మించును; ఇత్తజీ=ఈవసంతసమయమున, జనించు విశేషములు, ఏమిచెప్పఁగన్; (ఏమని చెప్పను మనుట.)

సీ. మనసీవు పాంథుల మదకలకంఠీర
వములు నానానగాంతముల బలసి
కలఁచుఁ బున్నాగంబు లలరెఁ గొమ్ముల మహో
న్నతిగలయనధికమతుల నైన
గమియు రసాలపుంజముల సారంగసం
తానసంతతశోభమానకిరులు
[1]కావించు బహుకేళికాసరశ్శ్రేణి య
చ్ఛాంబుజాతము లెల్ల నతనుకీర్తిఁ
గీ. దిరుగుఁ బటుచిత్రకాయముల్ ధీరనినద
ఘనరసోత్కర్షములు సిల్కగము లెనసి స
మగ్రదర్పకఖేలనామందలతల
పాలపుఁబట్టుల సురభిప్రభుక్తిఁ గాంచి. 16

టీక. హరి. పాంథులన్=తెరువరులను, మదకలకంఠీరవములు = మదించిన సింహములు; నానా; నగాంతములన్-పర్వతాగ్రములయందు, బలసి, మనసీవు, పున్నాగంబులు=సురపొన్నలు, అలరుఁగొమ్ములన్=ఒప్పెడు దంతములచేత, మహోన్నతిగల యన్ అధికమతులనైనన్=ధైర్యవంతులనైనను, కలఁచును;రసాలపుంజములన్=చెఱకు గుములను, సారంగ...కిరుల-సారంగసంతాన=ఏనుఁగుగున్నలవలె, సంతత శోభమాన మాలై,కిరులు=పందులు,కమియున్=కవియును. బహు...శ్రేణీ-బహుకేళి=అధిక లీలలు

1 కావించు.

గల, కాసర=కారెనుపోతులయొక్క, శ్రేణీ=సమూహము, అచ్ఛాంబుజాతము లెల్లన్= స్వచ్ఛమైననీటివంతను, అతనుకీర్తిన్ = అధికమైన బురదను, (కీర్తిః ప్రసాదయశసో ర్విస్తారే కర్దమేఽపి చ. అని విశ్వ.) కావించును; పటుచిత్రకాయములు = బలిష్ఠములైన పులులు. (వ్యాఘ్రేపి చిత్రకాయస్స్యాద్ద్వీపః. అని నిఘంటుసారము.) ధీర... ఉత్కర్షములు, ధీరనినదఘనరసః = మేఘధ్వనులవంటి ధీరధ్వనులయొక్క. (ఇది యుపమానోత్తర పదము.) ఉత్కర్షములు, చిల్కన్=చిందుకొనఁగ; గములు=గుంపులు, ఎనసి=ఒప్పారి; సమగ్రదర్పక ఖేలన్=పరిపూర్ణమదవిలాసముతోడ. ఆమోదలతలపాలపుఁ బట్టులన్ = ఆవులమందలు గల గ్రామసమీప ప్రదేశములయందు, సురభిప్రభుక్తిన్ = ఆవులభోజనమును, కాంచి తిరుగును.

నల. పాంథులన్=విరహులను; మద...రవములు-మదకలకంఠీ=మదించినయాఁడు కోయిలలయొక్క, రవములు = ధ్వనులు, నానా, నగాంతములన్ = వృక్షాగ్రముల యందు ('శైలవృక్షౌ నగావగౌ' అని యమ.) బలసి = మోడుకొని; మన నీవు; పున్నాగములు=పొన్నలు, అలరుఁగొమ్ములన్=పుష్పించిన శాఖలచేత, మహోన్నతి, కల=కలిగిన అనభీకమతులనైన; అనభీక=అకాముకులయొక్క (క్రమః కామయితాభీకః అని యమ.) మతులనైనన్=బుద్ధులనైనను, కలఁచున్=కలఁతనొందఁజేయును. రసాలపుంజములన్= తియ్యమామిడి గుంపులను; సారంగ...శోభ - సారంగసంతాన = తుమ్మెదగుంపుల యొక్క, సంతతశోభ = ఎడతెగని కాంతితోడ. మానక = విడువక (తుమ్మెదల కాంతితోఁ గలసి యనుట.) ఇరులు=చీఁకట్లు, కమియును; బహు...జాతములు - బహు = పెక్కైన, కేళికాసరః = క్రీడాసరస్సులయొక్క, శ్రేణియొక్క, అచ్ఛాంబుజాతములు = తెల్లదామరలు; ఎల్లను, అతనుకీర్తిన్ = మన్మథుని కీర్తిని, (కావించును;) పటుచిత్రకాయముల్ = దృఢములై చిత్రవర్ణములైన శరీరములు గలవియు, ధీరగా...ఉత్కర్షములు - ధీరనినద = గంభీరమైన ధ్వనియందు, ఘన రసోత్కర్షములు = అనూనరాగాతిశయములుగలవియునైన, (పంచమమునందుత్సాహముగలవి యనుట.) చిల్కగములు=చిలుకలగుంపులు; సమగ్ర...పట్టుల-సమగ్రమైన, దర్పకఖేలన = మన్మథవిలాసముచేత. ఆమోదములైన, లతల = తీఁగెల యొక్క, పాలపుపట్టులన్=ప్రదేశములయందు, (మన్మథోద్దీపకములైనవాసనలుగల తీఁగె లుండెడు స్థలము లనుట) సురభిప్రభుక్తి-సురభి=మనోహరమైన, ప్రభుక్తిన్= ప్రకృష్టమైన భుక్తిని, కాంచి, తిరుగును. ఇందుఁ గొమ్మలనుటకు మాఱు కొమ్ములను టకుఁ బూర్వప్రయోగము:—

క. "తిమ్మ ధనార్థులపట్టుం, గొమ్మువివేకాదిసకలగుణసలిలనిధా
నమ్ముఁ ద్రిపురారియనుఁగుం, దమ్మును బుధజనము సంతతమ్మును బొగడున్"

(శ్రీనాథుని హరవిలాసము.)

తే. అనుచు విన్నప మొనరింప నవనినాథుఁ
డావిషమపత్త్రిహింస్రబాధాపగమన
మతిజనితసంభ్రమస్ఫూర్తి మహిమ నుపవ
నాంతసంచారసాదరస్వాంతుఁ డగుచు. 17

టీ. హరి. ఆ, విషమపత్త్రికఠోరబాణుఁడు, అవనినాథుఁడు=హరిశ్చంద్రుఁడు, హింస్ర...స్ఫూర్తి - హింస్ర = సింహాదిఘాతుకజంతువులయొక్క; బాధను, అపగమన = పోఁగొట్టుట యందలి. మతిజనిత=బుద్ధిచేఁబుట్టిన, సంభ్రమస్ఫూర్తిచేత, మహి=భూమిని, మనుపన్ = రక్షించుటకు, వనాంత...స్వాంతుఁడు=అరణ్యప్రదేశ సంచారమం దాసక్తమైన చిత్తము గలవాఁడు, అగుచు

నల. ఈతీరున విన్నవింపఁగా, అవనినాథుఁడు = నలుఁడు; ఆ, విషమ ... మహిమన్ - విషమపత్త్రి = మన్మథుఁ డనియెడు, హింస్ర=ఘాతుకునివల్లనైన, బాధ యొక్క, అపగమనమతిన్=పరిహారబుద్ధియందు, జనితమైన, సంభ్రమస్ఫూర్తి=వేగిర పాటుయొక్క, మహిమచేత, ఉప...స్వాంతుఁడు-ఉపవనాంతసంచార = ఉద్యాన వనవిహారమందు, సాదర = ఆదరముతోఁ గూడుకొనిన, స్వాంతుఁడు = చిత్తము గలవాఁడు, అగుచు.

సీ. కొదమతుమ్మెదకప్పుఁ గదిమి కైకొని యొప్పు
హరినీలకోటీర మలవరించి
పికనేత్రములచాయఁ బేర్చి యొచ్చెము సేయ
నేర్చుమాణిక్యకర్ణికలు పూని
చిలుకఱెక్కలడాలుఁ జిదిమి తెమ్మనఁ జాలు
నవహరిన్మణికంకణములు దాల్చి
మగనెమ్మిపురి మించు నెగడనీక యడంచు
[1] పసిఁడినిగ్గులవింతపట్టుఁ గట్టి

గీ. సమదశంబరభేదనసాధనప్ర
కర్షహారిమహోచితాకల్పకలన
నిం పలరి లోహితవధూసమేతుఁ డగుచు
నరిగెఁ బటుశౌర్యలుబ్ధసైన్యములు గొలువ. 18

టీ. ఇందు మొదటినాల్గుచరణముల యర్థము రెంటను సమానము. సమద... కలన-సమదములైన, శంబర=మృగములయొక్క, భేదన=సంహారమునకు, సాధనమై, ప్రకర్ష=అతిశయముచేత, హారి=ఒప్పుచున్న, మహోచితమైన, ఆకల్పకలన=వేషకలనచేత,

1. పసని.

ఇంపలరి, మోహితవధూసమేతుఁడు=మోహితునితోడను; వధూ=భార్య యగుచంద్రమతితోడను, సమేతుఁడు, అగుచు, పటుశౌర్యలుబ్ధసైన్యములు - పటుశౌర్య=దృఢపరాక్రమముగల, లుబ్ధ=బోయలయొక్క, సైన్యములు కొలువ, హరిశ్చంద్రుఁడు మృగాదులు నమ్మి దగ్గఱఁ జేరుటకొఱకు వాని వానివర్ణములఁ బోలిన యలంకారములను బూని వేఁటకుఁ బోయె నని ఫలితార్థము.

నల. సమద...కలనన్-సమదములైన, శంబరభేదన=మన్మథునియొక్క, సాధన=భృంగాదిసాధనములయొక్క, ప్రకర్షను, హారి=హరించుచున్న, మహోచితమైన, ఆకల్పకలనన్=అలంకారకలనచేత, ఇంపలరి, లో...సమేతుఁడు-లో=హృదయమున, హితవధూసమేతుఁడు=ప్రియయగు దమయంతితోఁ గూడినవాఁడు; అగుచు, పటు...సైన్యములు-పటుశౌర్యలుబ్ధ=దృఢపరాక్రమాభిలాషులైన, సైన్యములు, కొలువ. నలుఁడు మథవసాధనములైన భృంగాదులను నిరసించుచున్నవస్త్రభూషణములను ధరించుకొని యావ్వనమునకుఁ బోయె ననుట.

సీ. గంతులు దక్కించు మెంతయుఁ [1]గదియుఘో
రారావపరవీరహరుల నైన
మద మడంతుము పోటుమగఁటిమి నెఱపు
భీకరలోలకరవాలకరుల నైన
నలమి గీపెట్టింతు [2]మలుకఁ గోఱలు నూఱి
పైవచ్చుభూదారపతుల నైనఁ
జర్మ మెత్తుదుము రోసమున మీసములు దీం
డ్రించుధీరచమూరురిపుల నైన
గీ. నధిప! మముఁ జూడు మనుచు నుదస్తశస్త
తరమహాఖేటముఖ్యసాధనబలంబు
లెదుట నుదుటునఁ బచరింప నిట్లు కతిప
యాప్తసచివసమేతుఁ డై యరిగి యచట. 19

టీక. హరి. ఘోరారావపరవీరహరులన్ - ఘోరారావ=భయంకరధ్వనులయందు, పర=ఆసక్తములైన, వీరహరులన్=వీరసింహములను, భీకర...కరులన్-భీకరములై, లోల=కదలుచున్న, కర=తొండములను, వాల=పుచ్ఛములును కలిగిన, కరులన్=ఏనుఁగులను, భూదారపతులన్=వరాహశ్రేష్ఠములను; ధీర...రిపులన్-ధీరములైన, చమూరురిపులన్=వ్యాఘ్రములను; ఉదస్త...బలంబులు - ఉదస్త=మీఁదికెత్తఁబడినవియు,

1. చెగయుఁ, 2. మలుక.

శస్తతరములు. నైన, మహాఖేట=వేఁటకు, ముఖ్యములైన, సాధన=కుంతాదిసాధనములు, గల, బలంబులు; కతి...సమేతుఁడు-కతిపయ = కొందఱు, ఆప్తహితులతోడను, సచివ=మంత్రియగుసత్యకీర్తితోడను, సమేతుఁడు; (ఇందు గంతులు దక్కుంతుము· మదమడంతుము, గీపెట్టింతుము, చర్మ మెత్తుదుము ; అనువాక్యములు సారస్యయుక్త నిరసన వాచకములు.)

నల. ఘోరారావపరవీరహరులన్-ఘోరమైన, ఆరావ=ధ్వనిగల, పరవీరహరులన్=శత్రువీరసింహులను. భీకర...కరులన్, భీకరములై, లోల=చంచలములైన, కరవాలకరులన్=కత్తులం జేతియందుఁ గలవారిని, భూవారపతులను = భూవరశ్రేష్ఠులను, (అనఁగా రాజశ్రేష్ఠుల ననుట.)ధీర...రిపులన్-ధీరచమూ=ధైర్యవంతములైన సేనలచేత, ఉరు=అధికులైన, రిపులను = శత్రురాజులను, ఉదస్త...బలంబులు-ఉదస్త = ఎత్తఁబడినవై, శస్తతర=మిక్కిలి ప్రశస్తములైన, మహాఖేటముఖ్య=గొప్ప కేడెములు మొదలైన, సాధన=ఆయుధములుగల, బలంబులు=సైన్యములు.

చ. క్షితిపతి గాంచె నభ్యుదితశీధుసమంజసకుంజరాజితం
బతనుఘనాచ్ఛభల్లతిలకౌఘనిశాంత మశాంతనాగభు
క్ప్రితతివికస్వరస్వరతరంగ మభంగభుజంగపుంగవా
యతన మఖర్వగర్వగవయస్థితికాంతము నవ్వనాంతమున్. 20

టీక. హరి. క్షితిపతి=హరిశ్చంద్రుఁడు, అభ్యుదిత...జితంబు - అభ్యుదితమైన, శీధు = మదముచేత, సమంజసములైన, కుంజరములచేత, అజితంబు = అప్రతిహతము, అతను...నిశాంతము, అతను = అధికమైన, ఘన = మేఘములవంటి, అచ్ఛభల్లతిలక=భల్లూకశ్రేష్ఠములయొక్క, ఓఘ=సమూహమునకు, నిశాంతము=నిలయము,అశాంత...రంగము, అశాంత=క్రూరములైన, నాగభుక్ప్రితతి = సింహసమూహములయొక్క, వికస్వరమైన, స్వరముగలదియు, అభంగ...ఆయతనము,అభంగములైన, భుజంగపుంగవ=పెనుఁబాములకు, ఆయతనము=ఉనికిపట్టు, అఖర్వ...కాంతమున్, అఖర్వమైన గర్వముగల, గవయ=గురుపోతులయొక్క,స్థితి=ఉనికిచేత, కాంతము=ఒప్పెడిది. వనాంతమును, కాంచె నని యన్వయము.

నల. క్షితిపతి=నలుఁడు,అభ్యుదిత ...జితంబు,అభ్యుదితమైన,శీధు=మకరందముచేత, సమంజస=ఒప్పుచున్న, కుంజ=పొదలచేత, రాజితంబు, అతను...నిశాంతము-అతను=మన్మథునియొక్క, ఘన=సాంద్రములైన, అచ్ఛములైన, భల్ల=బాణములుగల, (పువ్వు లనుట.)తిలక=బొట్టుగుచెట్లయొక్క,ఓఘ=సమూహమునకు,నిశాంతము, అశాంత...తరంగము-అశాంతములైన (విజృంభించినవి), నాగభుక్ప్రితతి = నెమిళ్లగుంపుల

యొక్క, వికస్వరమైన, స్వరితరంగము, కేకాధ్వనులు కల వనుట; అభంగ...తనము- అభంగులైన, భుజంగపుంగవ=విటశ్రేష్ఠులకు; ఆయతనము, అఖర్వ...కాంతము - అఖర్వగర్వమును, గ=పొందిన, వయః=పక్షులయొక్క, (ఖగబాల్యాదినోర్వయః అని యు.) స్థితిచేత, కాంతము=మనోజ్ఞము, అవ్వనాంతమును, కాంచె నని యన్వయము.

వ. ఇవ్విధంబున నారాజవంశపావనుండు వనంబు నిరీక్షించుచు మును మున్న యాతాయాతసరణి గంటకశ్రేణిఁ వారించియు బాదులు వూరించియు నురులుతరులతాంతపాళి నెఱపియు శరయంత్రంబులు వఱపియు సముచితప్రదేశంబుల మేలుకట్టుం గట్టియుఁ దెఱలు సమకట్టియు నాయితం బొనర్చినఁ దదధికారులఁ గటాక్షించుచు మహాఖేటరమణరమణీయప్రచారుం డై. 21

టీక. హరి. ఆరాజవంశపావనుండు=హరిశ్చంద్రుఁడు, కంటకశ్రేణి=క్షుద్రశత్రువులను, పాదులు=గుర్రపాదులు. ఉరులు, తరు...పాళి-తరులతలయొక్క, అంతపాళిక కొనయందు; శరయంత్రములు=బాణయంత్రములు; మేలుకట్లు= మేలైనకట్లు; మహా... ప్రచారుండు-మహా; ఆఖేటరమణ=మృగయాక్రీడయందు, రమణీయప్రచారుండై.

నల. ఆరాజవంశపావనుండు=ఆచంద్రవంశపావనుఁడు (నలుఁడు), కంటకశ్రేణి= ముండ్లు; ఉరులు...పాళి-ఉరులు=రాలుచుండెడు, తరు=వృక్షములయందలి, లతాంత= పుష్పములయొక్క, పాళి=సమూహమును; శరయంత్రంబులు=జలయంత్రములు; మహా...ప్రచారుండు-మహా=శ్రేష్ఠమైన, ఖేటరమణ=ఇంద్రునియొక్క, (ఖే, ఆకాశే, అటంతీతి ఖేటాః=దేవతలు. 'తత్పురుషేకృతి బహుళ'మిత్యలుకన్సమాసః. రమణీయప్రచారుఁడు=మనోహరమైన ప్రచారమువంటి ప్రచారము గలవాఁడై.

క. పరిఫుల్లకేసరావళి
హరి దంతస్ఫురితకాంతు లడర నెదిరినన్
సరసాస్త్ర పరాయణుఁ డ
య్యురుచిరధృతిశాలి నృపతి యోర్చెం గడఁకన్. 22

టీక. హరి. పరి...వళి పరిఫుల్ల=జుంజురించిన; కేసరావళి= మెడమీఁది వెండ్రుకలసమూహముగల, హరి=సింహము, దంతస్ఫురితకాంతులు, అడరన్, ఎదిరినన్=ఎదుర్కొనఁగా, సరసాస్త్రపరాయణుఁడు = సరసములైనబాణములయం దాసక్తుఁడు, అయ్యురుచిరధృతిశాలి, నృపతి=హరిశ్చంద్రుఁడు: కడఁకన్; ఓర్చెన్=ఓడించెను.

నల. పరి...వళి-పరిఫుల్ల=వికసించిన, కేసర=పొన్నలయొక్క ఆవళి; హరి... కాంతులు-హరిత్=దిక్కులయొక్క, అంత=కొనలయందు, స్ఫురితములైన, కాంతులు;

సరసాస్త్రపరాయణుఁడు - సరసాస్త్ర = పుష్పాస్త్రుఁడు, పరాయణుఁడు=ఆశ్రయముగాఁ గలవాఁడయ్యెను. (మన్మథునికిఁ లోఁబడినవాఁ డనుట.) ఓర్చెన్=సహించెను.

క. అతనుబలంబులు వాచా
లతఁ దగ నామేటిదొర సెలసి తానలమ
న్మతి నింపెడుసారంగా
హితము న్సంపెఁగనహర్ష మేపునఁ బొదలన్. 23

టీక. హరి. అతనుబలంబులు = అధికసైన్యములు, వాచాలతఁదగ, ఆమేటిదొర = ఆహరిశ్చంద్రుఁడు, సెలసి = విజృంభించి, తాను, అలమన్ = మతినింపెడు, పైఁబడనుంకించెడు, సారంగాహితమున్=సింహమును, సంపెన్, కనన్=చూడఁగా.

నల. అతనుబలంబులు = మన్మథబలంబులు, వాచాలతన్ = ఆర్భాటముతో, తగన్=ఒప్పగా, ఆమేటి=ఆనలుఁడు, అసితానలము = ప్రజ్వలాగ్ని, అన్మతి=అనుబుద్ధిని, నింపెడు...హితమున్-నింపెడు=నినిచెను, సారంగాహితమున్ = తుమ్మెదలకు విరోధియైన, సంపెఁగను, అహర్షము=అసంతోషము, ఏపునన్, పొదలన్=అతిశయింపఁగా, దొరసెన్=చేరెను.

మ. బహుళస్కంధసుకేసరస్తబకదీప్రంబు ల్మహాస్నిగ్ధముల్
సహసోత్కీర్ణఘనాంకురంబు లగునంచన్మత్తసారంగరా
ట్సహకారంబు లనేకలీల సమయించ న్వాగె నచ్చో మహీ
మహిళాభర్త కృతిన్ వనప్రియకదంబధ్వానము ల్మీఱఁ గాన్. 24

టీక. హరి. బహుళ...దీప్రంబుల్-బహుళములైన, స్కంధ=కంఠమూలయందు, సు=బాగైన, కేసర స్తబక=జూలుకుదుముల చేత, దీప్రంబులు, మహాస్నిగ్ధములు=క్రొవ్వుచేత బలిసి మిక్కిలినునుపైనవి, సహసోత్కీర్ణ...అంకురంబులు-సహసోత్కీర్ణ = శీఘ్రముగ పెగఁజిమ్మఁబడిన, ఘన=కుంగగడ్డలయొక్క, (కురువిందో మేఘనామా ముస్తా ముస్తకమస్త్రియామ్, అని యు.) అంకురములుగలవియు అగు, అంచ...కారంబులున్-అంచత్=ఒప్పుచున్న, మత్తసారంగరాట్=మదించినగజపతులకు, సహకారంబులన్=సమానములైనవి, ఏకలీలన్=వరాహములను, మహీమహిళాభర్త = హరిశ్చంద్రుఁడు; కర్త. వనప్రియకదంబధ్వానముల్ - వనప్రియ=కిరాతులయొక్క, కదంబ=సంఘముయొక్క, ధ్వానముల్.

నల. బహుళ...దీప్రంబుల్-బహుళములైన, స్కంధ = పెద్దకొమ్మలచేతను, సుకేసర=మంచియాకరువులచేతను, స్తబక=పూగుత్తులచేతను దీప్రంబుల్=ప్రకాశించుచున్నవి; మహాస్నిగ్ధములు = మిగులనునుపైనవి, సహ...అంకురంబులు-సహసోత్కీర్ణ=సహసోత్కీర్ణములైన, ఘనములైన, అంకురంబులు=చిగుళ్లుగలవియు, అంచ...కారంబులు-

అంచత్ = ఒప్పుచున్న, మత్త = మదించిన, సారంగరాట్ = భ్రమరరాజములుగల, సహకారంబులన్ = తియ్యమామిళ్లు, అనేకలీలన్ = అనేకములైన లీలలచేత, మహీమహిళాభర్తధృతిన్ = నలుని యొక్క ధైర్యమును, వనప్రియకదంబధ్వానముల్ - వనప్రియకదంబ = కోవెలలగుంపులయొక్క, ధ్వానములు, మీఱఁగన్, సమయించసాగెను.

తే. అలఘుకాంతారభూదారతిలక మొకటి
యతిశయోద్భిన్నజాలకప్రతతి యగుచు
నడర నలపంది బలువిడి నడచె నతఁడు
ప్రకటితాత్మీయనూతనప్రదరయుక్తి. 25

టీక. హారి. అలఘు...తిలకము-అలఘు=గొప్పదియగు, కాంతారభూదారతిలకము=మేలైనయడవిపంది, అతి...ప్రతతి-అతిశయమగునట్లు, ఉద్భిన్న=త్రెంచివేయఁబడిన, జాలక=వలలయొక్క, ప్రతతి, అగుచు, అడరున్, (వలలఁ దెంచుకొని పోవఁగా ననుట.) అలపందిన్ = ఆవరాహమును, ప్రకటితా...యుక్తిన్ - ప్రకటితమైన, ఆత్మీయనూతనప్రదర=తన నూతనబాణముయొక్క, యుక్తిన్=ప్రయోగముచేత, బలువిడిన్, అడచెను = కొట్టెను.

నల. అలఘు...తిలకము - అలఘువైన, కాంతారభూ = వనభూమియందలి, ఉదార=ఉన్నతమైన, తిలకము=బొట్టుగుచెట్టుఒకటి, అతి...ప్రతతి-అతిశయముగా, ఉద్భిన్న=వికసించిన, జాలక=మొగ్గలయొక్క, ప్రతతి=సమూహముగలది. అగుచు, అడరన్=కనుపట్టఁగా, అలపు=అలఁతను, అంది, ప్ర=అతిశయమైన, దరయుక్తిన్=భంగముచేత, బలువిడినడచెను, = గ్రక్కునదాఁటెను. ప్రకటి...యుక్తి-ప్రకటితమైన, ఆత్మీయ = తన సంబంధియైన, నూతన ముగు.

ఉ. మంగళదేవతాప్రభవమందిర మంచుఁ దలవంచియుంబకా
సంగతిఁగూర్చఁడయ్యె వరుసన్వనకుంభినిసీధువాసనా
రంగముసారెసారెనలరాజశిఖామణి తత్పరిగ్రహో
భంగసముద్భటాళిరవభంగులకున్ మది సంభ్రమించుచున్. 26

టీక. హారి. మంగళ...మందిరము-మంగళదేవతా=లక్ష్మియొక్క, ప్రభవ=ఉత్పత్తికి, మందిరము, (సంపదలకు హేతువైనదనుట.) అంచున్=అనుచు, సీధువాసనారంగమున్-సీధు=మదవిశేషముయొక్క, వాసనకు, రంగమున్=ఉనికిపట్టైన, వనకుంభిని=అడవియేనుఁగునుగూర్చి, అలరాజశిఖామణి=అహరిశ్చంద్రుఁడు, కర్త. తత్పరి...భంగులకున్-తత్=ఆయేనుఁగుయొక్క, పరిగ్రహ=పట్టుకొనుటయందు, అభంగమగునట్లు, సముత్=సంతోషముతోఁ గూడుకొనిన, భటులయొక్క; అలి=పఙ్క్తియొక్క, రవభం

గులకున్=ఆర్భటులకు, మదిసంభ్రమించుచును, అంబకాసంగతిన్ = బాణప్రయోగమును, కూర్పఁడయ్యె.

నల. మంగళదేవతా ప్రభవమందిరము = మన్మథునకు విహారస్థానము, అంచు, వనకుంభిని=వనభూమియందు, సీధు...వాసనారంగము-సీధు=మకరందమునకు, వాస=ఉనికియైన, నారంగము=నారింజచెట్టు నగూర్చి, నలరాజశిఖామణి=నలుఁడు, తత్పరి...భంగులకున్-తత్=ఆనారింజచెట్టుయొక్క, పరిగ్రహముచేత, అభంగములై, సముద్భటములైన, అళులయొక్క, రవభంగులకున్ = ఝంకారములకు, సంభ్రమించుచున్ = భయమునొందుచు, అంబకాసంగతి= నేత్రసంగతిని, కూర్పఁడయ్యె నని యన్వయము.

క. తలర కొకజాడ నవకం
దళితమహాబలసమృద్ధిఁ దరియించుచుఁ బ
ల్వలలక్ష్యౌజ్జ్వల్యముఁ గను
పులినమ్ముల నించె లీల భూవరుఁ డచటన్. 27

టీ. హరి. నవ...సమృద్ధిన్-నవ=నూతనముగ, కందళిత = అంకురింపఁబడిన, మహాబలసమృద్ధిన్ = సత్వసమృద్ధిచేత, పల్వలలు = ఎక్కువవలలను, తరియించుచు, అక్ష్యౌజ్జ్వల్యమున్ - అక్షి = నేత్రములయొక్క, ఔజ్జ్వల్యమున్ = ప్రకాశమును, కనుపులిన్ = చూచెడుపులిని, భూవరుఁడు = హరిశ్చంద్రుఁడు, కర్త. అమ్ములన్=బాణములను, నించెను = నిండించెను.

నల. భూవరుఁడు = నలుఁడు, కర్త, తలరక = చలింపక, ఒకజాడన్=ఒకప్రకారమున, నవ...సమృద్ధిన్-నవకందళిత = నూతనముగవీచుచుండెడు, మహాబల=వాయువుయొక్క, సమృద్ధిని, తరియించుచు, పల్వలలక్ష్యౌజ్జ్వల్యమున్-పల్వల=పడియలయందు, అక్ష్య=చూడఁదగిన, ఔజ్జ్వల్యమును, కను = కనిన, పులినమ్ములన్=ఇసుకదిబ్బలను, లీలన్=విలాసముచేత, ఇంచెన్ =కోరెను.

చ. ఉరుశిఖరద్రుమంబుల నవోదితఋక్షకులేంద్రమండలీ
గరిమ మడంచుభూరిఫలకాండరుచుల్ గని సంస్మరించె నా
హరిహయకాంతిశాలి యసితాక్షికఠోరపయోధరాధ్వవి
స్ఫురితతమోపసర్పణవిశోభిమహాచ్ఛవి[1]రోచనాంశువుల్. 28

టీ. హరి. ఉరుశిఖరద్రుమంబులన్ - ఉరుశిఖర = గొప్పపర్వతములయందలి, ద్రుమంబులన్=వృక్షములయందు, నవోదిత...గరిమము; నవ=నూతనములై, ఉదితములైన, ఋక్షకులేంద్ర = ఎలుఁగుబంటులయొక్క, మండలీ = సమూహముయొక్క,

1 రోచనాంశుఁడన్.

గరిమనుఁ = గౌరవమును, అడంచు...రుచుల్ - అడంచునట్టి, భూరి = గొప్పవైన, ఫల=ములుకులుగల ('ఫల మిష్వగ్రే, సస్యే ఫలకే జాతీఫలే ధనే ఫాలే, అని నానా.) కాండ = బాణములయొక్క, రుచుల్ = రుచులను, కని, ఆహరిహయకాంతిశాలి = ఇంద్రునియొక్క కాంతి వంటి కాంతికలిగినవాఁడు. (హరిశ్చంద్రుఁడు), అసితాక్షి... రోచనాంశువుల్ - అసిత = నల్లనివియు, అక్షికటోరములును, పయోధరాధ్వ=ఆకాశమందు, విస్ఫురితములునైన, తమః = చీఁకట్లయొక్క, అపసర్పణ = అడఁచుటచేత, విశోభితములై, మహాచ్ఛ = మిగులస్వచ్ఛములైన; విరోచన=సూర్యునియొక్క, అంశువుల్ = కిరణములను, స్మరించెను.

నల. ఉరుశిఖర ద్రుమంబులఁ-ఉరు=గొప్పవైన,శిఖరద్రుమంబులఁ=వృక్షవిశేషములయందు (తాటిచెట్లయం దనుట.) నవోదిత...గరిమము, నవమై, ఉదితమైన, ఋక్షకులేంద్రమండలీ = చంద్రమండలముయొక్క, గరిమము, అడంచు...రుచుల్-అణఁచునట్టి, భూరి = గొప్పవైన, ఫల=పండ్లయొక్క, కాండ = సమూహముయొక్క, రుచుల్=ఎఱ్ఱనికాంతులను, కని=చూచి, ఆహరిహయ కాంతిశాలి=మన్మథునియొక్క కాంతివంటి కాంతిగలయానలుఁడు, అసితాక్షి...అంశువుల్ - (అసితాక్షి=దమయంతియొక్క, కఠోరపయోధరాధ్వ=కఠిన స్తన మార్గమందు ('స్త్రీస్తనాబ్దౌ పయోధరౌ' అని యు.) విస్ఫురితమై, ఉపసర్పణ=పరిప్రాప్తిచేత, విశోభి=ప్రకాశించుచున్న, మహాచ్ఛవి=అధికకాంతిగల, రోచన=గోరోచనముయొక్క, అంశువుల్=కాంతులను, స్మరించె నని యన్వయము. ఇం 'దసితాక్షి' యనుచోఁ జెనుఁగువష్ఠి.

"క. స్త్రీలింగ శబ్దవితతికి, నోలిఁ దుది దీర్ఘ ముడుప నుండును దెనుఁగై
కీఁ దది యేకాక్షరశ,బ్దాళి విసర్జించి నిర్జితాసుర ! కృష్ణా!"

ఇందు స్మరణాలంకారము. లక్షణము. "సదృశానుభవా దన్యస్మృతి స్మరణ ముచ్యతే."

క. ఈకరణి నతనుశరభా,లోకాద్భుతభీమభూవిలోకనరసలీ
లాకలనోత్సాహి యతం,డాకాశనమధ్య[1]వీథి నరుగుచు నొకచోఁ.

టీ. హరి. అతను...నోత్సాహి-అతను=గొప్పవైన, శరభములచేత, అద్భుతమై, భీమ=భయంకరమైన, భూమియొక్క,విలోకన=చూచుటయందు, రసలీలాకలన=రుచిలీలయొక్కప్రాప్తిచేత, ఉత్సాహియైన, అతండు=ఆహరిశ్చంద్రుఁడు, శరభమృగములుండుభూమిం జూచుటయం దుత్సాహముగలవాఁడై యనుట)

నల. అతను...నోత్సాహి-అతనుశర = మన్మథబాణములయొక్క, భా=కాంతి

---

1 వీమ.

వంటి కాంతిగల, ఆలోక=చూపులచేత, ఆఘ్రాతమైన, భీమభూ=దమయంతియొక్క, విలోకనవన=చూచుటయందలి, లీలాకలనముచేత, ఉత్సాహియైన, ఆతండు=ఆనలుఁడు...

సీ. అతిబహుళహరిసంతతులు 1పాలించు ను
త్కటతటమండనాగముల నెచట
నుద్దండపుండరీకోత్కరంబులు సారె
మనుచు సారంగడింభములఁ నెచటఁ
బ్రచురమేచకశతపత్రశిఖావళి
వడి భుజంగులయుల్క లూడుపు నెచట
ననురక్తి జేఁచు నూతనసారసాటోప
మొంటికాండ్రకుఁ బెంపు లొసఁగు నెచటఁ

గీ. నట్టినిరుపమామృతకమలాకరంబు
సంతతామోదితామరసవనవైభ
వాంచితము గురుచరణమహాశ్రమంబు
మానసానందముగఁ గాంచె మనుజవిభుఁడు. 30

టీ. హరి. మనుజవిభుఁడు = హరిశ్చంద్రుఁడు, ఎచట, అని...సంతతులు-అతిబహుళములైన, హరిసంతతులు = సింగపుగుములు, ఉత్కట...నాగములన్-ఉత్ = ఉన్నతములైన, కటతట=గండస్థలములు, మండ=అలంకారముగాఁగల, (మండశబ్దము మడిభూషాయాం, అనుధాతువుయొక్కయచ్ప్రత్యయాంతము 'నందిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః' అని వ్యా.సూ.) నాగములన్=ఏనుఁగులను ('మతంగజో గజో నాగః' అని య.) పాలించునో, ఎచట, ఉద్దండ...రంబులు-ఉద్దండములైన, పుండరీకోత్కరంబులు=పెద్దపులుల గుంపులు ('వ్యాఘ్రేఽపి పుండరీకో నా', అని య.) సారంగడింభములన్=లేడిపిల్లలను; సారె = మాటిమాటికి, మనుచునో, ఎచట, ప్రచుర...శిఖావళి-ప్రచురమైన, మేచక=పురికన్నులయొక్క (సమౌ చంద్రక మేచకౌ, అని య.) శత=అనేకములుగల, పత్ర=రెక్కలుగల; శిఖావళి=నెమళులమూఁక, భుజంగులయుల్కలు=ఆఁడుపాములయొక్క పొలయుల్కలను, ఊడుపునో, ఎచట, అనురక్తి=అనురాగముచేత, నూతనసారసాటోపము, నూతనమైన, సార=బలముచేత, సాటోపము=అటోపసహితమైన జేఁచు = శునకము, ఒంటికాండ్రకున్ = పందులకు, పెంపులు = అభివృద్ధులు, ఒసఁగునో, అట్టి, నిరు...ఆకరంబు, అట్టి నిరుపమ = ఈడులేని, అమృతకమలా=మోక్షలక్ష్మికి ('శ్రేయోనిశ్శ్రేయసామృతమ్' అని య.) ఆకరంబు=స్థానము;

1. లాలించు.

సంతతా...వాంచితము - సంతత = ఎల్లప్పుడు, ఆమోదిత = సంతోషపెట్టఁబడిన, అమరులుగల, సవన = యజ్ఞములయొక్క, వైభవముచేత, అంచితము = ఒప్పునది. అగు, గురు...శ్రమంబు-గురుచరణ = వసిష్ఠునియొక్క (యనుట.)మహాశ్రమంబును, మానసానందముగన్, కాంచెను.

నల. మనుజవిభుఁడు = నలుఁడు, అతి...సంతతులు-అతిబహు=అసంఖ్యాకములైన, లహరి = అలలయొక్క, సంతతులు, ఉత్కట..నాగముల - ఉత్కట = ఎత్తైన, తట = దరులకు, మండన = అలంకారములైన, అగములన్ = వృక్షములను, ఉద్దండ...త్కరంబులు-ఉద్దండ = ఉన్నతనాళములుగల, పుండరీకోత్కరంబులు= తెల్లదామరలు, సారంగడింభములన్=కొదమతుమ్మెదలను, ప్రచురములైన, మేచకశతపత్ర = నల్లదామరలయొక్క, శిఖా = అగ్రములయొక్క, ఆవళి, భుజంగుల యల్కలు-భుజంగుల=విటీవిటులయొక్క ('భుజంగశ్చ భుజంగా శ్చ భుజంగాః' అని ఏకశేషవృత్తి, 'పుమాన్ స్త్రియా' అని వ్యా. సూ.) అల్కలు = పొలయల్కలు, అనురక్తి...టోపము-అనురక్తిని, రేఁచు=పుట్టించు, నూతనములైన, సారస = హంసవిశేషములయొక్క, అటోపము = సంభ్రమము, ఒంటికాంద్రకు = వియోగులకు, పెంపులు = నాశములు, (కౌర్శ్యముల ననుట.) అట్టి, నిరుపమైన, అమృత=ఉదకముగల, ('పయః కీలాలమమృతమ్' అని య.) కమలాకరంబు = కొలనిని, సంతతా... వాంచితము - సంతతము, ఆమోది = పరిమళించుచున్న, తామరవన = పద్మవనము యొక్క ('పంకేరుహం తామరసమ్' అని యు.), వైభవముచేత అంచితము, (ఇది కొలనికి విశేషణము.) గురు...శ్రమంబు-గురుచరణ=అధికసంచారముచేత, మహాత్ = అధికమైన, శ్రమంబు = ఆయాసము, మానన్ = పోవునట్టుల, సానందముగన్= ఆనందముతోఁగూడను, కాంచెను.

చ. వనరుహకందమూలఫలవారిలవంబులె యాత్మవృత్తిసా
ధనము లొనర్చుచున్ శ్రుతిహితస్వరవైఖరు లుచ్చరించుచున్
మనుశుభదీప్తిదీప్తభువనద్విజరాజులరచ్చ లచ్చటన్
గనుఁగొని సాంద్రవిస్మయవికాసవిభాసితమానసాబ్జుఁడై. 31

టీక. హారి. వన...లవంబులు-వనరుహ = వన్యములైన, కందమూలఫలములును, వారిలవంబు, (ఈవస్తువులు) ఆత్మవృత్తిసాధనములు, ఆత్మవృత్తి = తమజీవనమునకు, ('వృత్తిర్వర్తనజీవనే' అని యు.) సాధనములు (గా), శ్రుతివైఖరులు-శ్రుతి=వేదము యొక్క, హితస్వరవైఖరులు, శుభ...రచ్చలు = శుభదీప్తిచేత దీప్తములైన, భువన= లోకములుగల, ద్విజరాజుల = బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క (ఋషులయొక్కయనుట), రచ్చలు = గోష్ఠులు, అచ్చట, కనుఁగొని, సాంద్ర...మానసాబ్జుఁడు-సాంద్ర=అతి

శయమైన, విస్మయవికాస = ఆశ్చర్యవికాసముచేత, విభాసిత = ప్రకాశింపఁజేయఁబడిన, మానసాబ్జుఁడు = మనఃపద్మము గలవాఁడు.

వ౮. వన...లవంబులు-వనరుహ = తామరలు, కందమూలఫలములు, వారిలవంబులు = జలబిందువులు. శ్రుతి...వైఖరులు-శ్రుతిహిత = చెవులకింపైన, స్వరములయొక్క వైఖరులు, శుభ...రచ్చులు-శుభదీప్తచేత, దీప్త = ప్రకాశమానములైన, భువనద్విజరాజుల = జలపక్షిపంక్తులయొక్క, రచ్చలు = కలకలధ్వనులు. ('భువనం ఖాంబు లోకేషు' అని నానా.)

సీ. పరమాత్మవాసనాప్రతిపాదకం బైన
పద్మాసనంబునఁ బరిఢవిల్లి
వలమానకమలసంవాసికుండలిపూర
కానిలంబునరోమహర్ష మొంది
సత్త్వైకభావనా సమధికానంద కం
దళమున నేత్రకోణములు మొగిచి
సంశ్రితకల్యాణ సంపత్కరణదీప్త
దివ్యప్రభావార్తిఁ దేజరిల్లి
తే. యమదు విధిహరి వర్ణనీయాతిలబ్ధ
వర్ణతాశాలి హంసాన్వవాయముఖ్య
గురుఁ బ్రచేతఃప్రకీర్ణాచ్ఛగుణమనోజ్ఞ
మూర్తి నురుకీర్తి [1]నాచక్రవర్తి గనియె. 32

టీక. హరి. పర...పాదకంబు - పరమాత్మవాసనా = పరబ్రహ్మవాసనను బ్రహ్మధ్యానము ననుట.), ప్రతిపాదకంబు = నిరూపించునది యైన, పరిఢవిల్లి=ప్రవర్తించి, పద్మాసన లక్షణము.—కళాపూర్ణోదయము. పంచ. ఆ.

"సీ. దక్షిణపాదంబు దక్షిణాంకమునన, దక్షిణాపాదంబు దక్షిణాంక
మున నిడి యిరుగేలు వెనుకగా వీడ్వడ, నింగుడించి బొటవ్రేళ్లు దగులఁబట్టి
యురముపైఁ జుబుకాగ్ర మొనరంగ హత్తించి, దృష్టి నాసాగ్రసుస్థితము సేసి
యునికి పద్మాసన మన నొప్పు నిందుఁ గొం, దఱు చుబుకవ్యవస్థానియమము
తే. చెప్ప రొకకొంద ఱూరుసుస్థితిఁగనఁదగు,దోయి యుత్తానముగ నిడి తొడలనడుమ
నట్ల పాణులు నిలిపి నాసాగ్ర దృష్టి, యగుచు నునికి పద్మాసనం బండ్రు బుధులు.

1 యాచక్రవర్తి.

తే. అనఘ! తుదఁ జెప్పినట్టి పద్మాసనవిధి, యందుఁ జుబుకాగ్రము నుహృదయమునఁ జేర్చి
రాజదంతమూలంబున రసన చేర్చి, వాయుకక్ష్యగా మెయ్యనఁ జేయవలయు."

వల...నిలంబున-వలమాన=చలించుచున్న: కమల=మూలాధారకమలమందు,సంవాసీ=ఉండెడు, కుండలి = కుండలిశక్తియందలి, పూరకానిలంబునన్=పూరకవాయువుచేత, రోమహర్షము=గగుర్పాటు, సత్త్వైక్య...కందళమున-సత్త్వ = సత్త్వబ్రహ్మమునందలి, ఐక్యభావనా=ఐక్యానుసంధానముచేత,సమధికమైన,ఆనందకందళమునన్=సంతోషాతిశయముచేత, సంశ్రిత...ప్రభావాప్తిన్-సంశ్రిత=ఆశ్రితులకు, కల్యాణసంపత్ = శుభసంపదలును, కరణ = చేయుటయందును, దీప్తమైన, దివ్యప్రభావముయొక్క, ఆప్తిన్=కలిమిచేత,విధి...శాలి-విధిహరి=బ్రహ్మవిష్ణువులచేత, వర్ణనీయ=పొగడఁదగిన, అతిలబ్ధవర్ణతా=అత్యంత వైచక్షణ్యముచేత, శాలి=ఒప్పువాని; హంసాన్వవాయముఖ్య గురున్=సూర్యవంశమునకుఁ బ్రధానగురువైనవాని, ప్ర...మూర్తిన్-ప్ర = అధికముగా, చేతః=మనస్సునందు, ప్రకీర్ణ=వ్యాప్తమైనవాని, అచ్ఛగుణ=నిర్మలగుణములచేత, మనోజ్ఞమూర్తియైనవాని (వసిష్ఠు ననుట.) అచక్రవర్తి = అహరిశ్చంద్రుఁడు; కనియెన్=చూచెను.

వల. పర...పాదకంబు-పరమ=శ్రేష్ఠమైన, ఆత్మవాసనా = స్వకీయపరిమళమును, ప్రతిపాదకంబు = పుట్టించునది, ఐన, పద్మాసనంబునన్=తమ్మిగద్దియయందు, వల...కానిలంబున-వలమాన=కదలుచున్న కమలములపలన, సంవాసి=వాసించుచున్నదియు, కుండలి=సర్పములకు,పూరక=ఉదరపూరకమునైన, అనిలంబున (మలయమారుతముచే ననుట.)సత్త్వై...కందళమునన్-సతి=తన ప్రియురాలితోడ, ఐక్య=కలయుటయొక్క, భావనా=ధ్యానముచేత, సమధికమైన, ఆనందకందళముచేత, సంశ్రిత...వ్యాప్తిన్-సంశ్రిత=ఆశ్రయింపఁబడిన, కల్యాణసంపత్ = కాంచనసంపదలుగల, ("కల్యాణ మర్జునం భూరి" అని యు.) కరణ=దేహముయొక్క, ('కరణం సాధకతమ క్షేత్రంగాత్రేంద్రియేష్వపి' అని యు.)దీప్త=ప్రకాశమానమైన, దివ్యప్రభయొక్క, అవాప్తిన్=ప్రాప్తిచేత, విధిహరి=బ్రహ్మవాహనమైనది; వర్ణ...శాలి-వర్ణనీయమై,అతిలబ్ధ=పొందఁబడినది, వర్ణతా=వన్నెగలుగుటచేత,శాలి=ఒప్పునట్టిది. ప్రచేతః=వరుణునియొక్క, ప్రకీర్ణ=వింజామరముభంగి; ('చామరంతు ప్రకీర్ణకమ్' అని యు.)అచ్ఛగుణః=స్వచ్ఛగుణముచేత (చల్లదనముచే ననుట.) మనోజ్ఞమైన, మూర్తిన్=శరీరముగలది, అగు హంసాన్వవాయముఖ్యగురు = హంసవంశశ్రేష్ఠమును, అచక్రవర్తి=అనలుఁడు,

గీ. కాంచి యడఁకువతో మహీకాంతతిలకుఁ
డాత్మజప్రమదాన్వితుఁ డగుచు నవన
తాంగుఁడై విస్మయప్రకంపాదరములు
గోమరు మిగులఁ గరాబ్జము ల్మోడ్చి పట్టె. 33

టీక. హరి. మహీకాంతతిలకుఁడు = హరిశ్చంద్రుఁడు, ఆత్మజప్రమదాన్వితుఁడు-ఆత్మజ=కుమారుఁడగు లోహితునితోడను, ప్రమదా=భార్యయగు చంద్రమతితోడను, అన్వితుఁడు, అగుచు, కరాబ్జముల్గూర్చిపట్టెను = నమస్కరించె ననుట.

నల. మహీకాంతతిలకుఁడు = నలుఁడు, ఆత్మజప్రమదాన్వితుఁడు-ఆత్మ = మనస్సునందు, జ=పుట్టిన, ప్రమద = సంతోషముతోడ, అన్వితుఁడు=కూడుకొనినవాఁడు, అగుచు, అవనతాంగుఁడై=వొంచికొనియున్నవాఁడై, కరాబ్జములు = హస్తకమలములు; కూర్చి=(హంసయందుఁ) గూర్చి పట్టెను.

వ. అప్పు డప్రతిమానమనుజాలాపరాజితవృత్తి యగు నప్పతంగకులగురుశిఖామణి కన్నులు దెఱచి కనుంగొని పక్షపాతప్రకాశం బొనరించి యతికరుణోక్తుల ని ట్లనియె. 34

టీక. హరి. అప్పుడు, అప్రతిమాన...వృత్తి-అప్రతిమాన=ఈడులేని, మను=మంత్రములయొక్క, జాల = సమూహముయొక్క, అపరాజిత=అప్రతిహతమైన, వృత్తి=అవృత్తిగలవాఁడు, అగు, అప్పతంగకులగురుశిఖామణి = అసూర్యవంశగురుశ్రేష్ఠుఁడు, (అనఁగా వసిష్ఠుఁడు). ('పతంగౌ పక్షిసూర్యౌ చ' అని యు.) పక్షపాతప్రకాశంబు=పక్షీకరణము; ఒనరించి, అతికరుణోక్తులన్, అతికరుణ=మిగులదయతోఁ గూడుకొనిన, ఉక్తులన్=వాక్యములతో.

నల. అప్రతి...వృత్తి-అప్రతిమానములైన, మనుజాలాప = మానవవాక్కులచేత, రాజితమైన, వృత్తి=వర్తనముగలది, అగు, అప్పతంగకులగురుశిఖామణి = ఆపక్షికులశ్రేష్ఠమైనహంసము, పక్షపాతప్రకాశం బొనర్చి = ఱెక్కలువిదిర్చికొని, అతికరుణోక్తులన్=అత్యంతదీనాలాపములతో.

సీ. చలితసత్వజరతిసతతాంధ్యజనని మ
దాయత్తమానసజాయమాన
రాగైకనిధి హితప్రతతి విశ్లేషరు
జాభరావేదిని సంభృతాతి
నవ్యసంహనన సంతతిని తాంతాక్షేట
వృత్తి నీయట్టిలోకోత్తరునకుఁ
దగునె యీాయదయకృత్యంబు నీచిత్తంబు
న న్విడు మయ్య! యో నరవరేణ్య!
గీ. పుడమి నను భూతకారుణ్యబుద్ధి మెఱయఁ
బ్రోవ వేని తద్ధాత్రీప్రజావనమున

కటకట! గతి యొండు గలదె? నిత్యశుచిభాను
కులనృపాలచరిత్రము ల్దలఁపవలదె? 35

టీక. హరి. ఓనరవరేణ్యా = ఓహరిశ్చంద్రమహారాజా! నితాంతా...వృత్తి- నితాంతమైన, ఆఖేటవృత్తి=వేఁట, ఇదికర్త. చలిత...రతి-చలితమైన, సత్త్వజ=జంతువులయందుఁబుట్టిన,రతి=ప్రేమగలది,సతతాంధ్యజనని-సతత=ఎల్లప్పుడు, ఆంధ్య=అంధతకు, జననిఁ(కారణమైన దనుట , మదా...నిధి-మద=మదమునకు, ఆయత్త=అధీనమైన, మానసమునందు,జాయమాన=పుట్టెడు, రాగ=మాత్సర్యమునకు, ఏకనిధి=ముఖ్యస్థానమైనది, హిత...దిని- హితప్రతతి=ఇష్టులసమూహముయొక్క, విశ్లేష=వియోగముచేనైన, రుజాభర=తాపాతిశయమును, ఆవేదిని=సంపాదించునది, సంభృ...సంతతి - సంభృత=భరింపఁబడినది, అతినవ్యములైన, సంహనన=హింసాకర్మములయొక్క, సంతతి=పరంపరగలది. ఈయదయకృత్యమును, నీచిత్తమున విడువుము. అయ్యయో! ఇదిఖేదవాక్యము. అను...బుద్ధి-అనుభూత=కారుణ్యముగల, బుద్ధి, మెఱయన్ = వెలయునట్లు, తద్ధాత్రీప్రజావనమునకున్=అభూప్రజలయొక్క సంరక్షణమునకు, గతి = దిక్కు, ఒండు=ఇతరము, కలదె ? (అనఁగా లే దనుట.) నిత్య...చరిత్రముల్ - నిత్యశుచి=నిత్యపవిత్రములైన, భానుకులనృపాలచరిత్రముల్=సూర్యవంశపురాజులచరితలు; తలఁపవలదో ?

నల. ఓనరవరేణ్యా! ఓనలమహారాజా! జనని, చలితమైన,సత్త్వ=బలముగలది, జరతి=ముదుసలి, (ఈశబ్దమునకు—'జీర్యతేరతృన్' అను వ్యా. సూ. ఆధారము.)సతతాంధ్య=పెనుచీఁకు, జాయ=భార్య, మదాయత్తమానస-మత్=నాయందు, ఆయత్త=అధీనమైన, మానసముగలది, మాన...నిధి-మానరాగ=అభిమానానురాగములకు, ఏకనిధి=ముఖ్యమైననిధానము. హితప్రతతి=ఇష్టజనసమూహము, విశ్లేష...వేదిని-విశ్లేష=నాతోడబాటువల్లనైన, రుజాభర=పీడాభరమును, ఆవేదిని=ఎఱుఁగనియది, సంతతి=సంతానము (పిల్లలనుట.)సం...సంహనన-సంభృత=భరింపఁబడిన, అతినవ్య=మిక్కిలిలేఁతవైన, సంహనన=అవయవములుగలది, ('గాత్రం వపుస్సంహననం' అని య.) నితాంతాఖేటవృత్తి-నితాంత=మిక్కిలి, ఆఖేటవృత్తి=ఖేచరవృత్తిలేనిది, (ఎగురుటకు శక్తిలేనిదనుట.) ఓయయ్యా, యీయదయకృత్యమును, నీచిత్తమున విడువుము. ననున్=నన్ను, భూతకారుణ్యబుద్ధితోడ, ప్రోవవేని=రక్షింపకపోయితివా, త...వనమునకు - తత్=ఆ, ధాత్రి=తల్లియొక్కయు, ("వసుమత్యా మామలక్యా ముపమాతరి మాతరి, ధాత్ర్యాం చ ధారయిత్ర్యాం చ ధాత్రీశబ్ద ఉదాహృతః" అని లింగాభట్టీయము.) ప్రజా=సంతానముయొక్కయు, ("ప్రజా స్యాత్సంతతౌ జనే" అని య.) అవనమునకున్=రక్షణమునకు, నిత్య...చరిత్రముల్-నిత్యములైన, శుచిభానుకుల=చంద్రవంశమునందలి, నృపాల=రాజులయొక్క, చరిత్రములు. (ఇం దఖేటవృత్తి యనుపదమును పక్షాంతరమున సం

బుద్ధిగను నన్వయింపఁదగును.ఆఖేటవృత్తి=అనవద్యమైన వర్తనముగలవాఁడా! 'పూయ కుత్సితావద్య ఖేటగర్హ్యాణకౌపసమాః' అని య.) ఇక్కవి శ్రీనాథుని పద్యమునందలి యర్థము నించుమించుగ నిందుఁ బొందుపఱచియున్నాఁడు.

సీ. "తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులుఁ, గాన విప్రుఁడు మాఁదుగార్లముసలి
యిల్లాలు కడుసాధ్వి యేమియు నెఱుఁగదు, పరమపాతివ్రత్యభవ్యచరిత
కొనుకమాందలు లేదు నెవరైనచుట్టంబు; లేవడి యింతేని జీవనంబు
కొనకకన్నసంతానంబు శిశువులు, జీవనస్థితి కేన తావలంబు
తే. కృప దలంపఁగదయ్య! యో నృపవరేణ్య!
యభయ మీవయ్య! యో తుహినాంశువంశ!
కావఁగదవయ్య! యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకు మయ్య! యో నిషధరాజ!" (శృం. నై.)

ఇతర గ్రంథములయందును నిట్లే యున్నది.—

మ. "ఇది నాతల్లి శతాబ్దవృద్ధ ఇది నాయిల్లా లనన్యార్థ యు
ల్లద నాకూఁతురు కోడ లల్లయది వాఁ డాత్మోద్భవుం డిందు నె
మ్మది నుండం దగ నిట్టిపట్టున అసన్మార్గప్రచారంబులన్
బొందల జేయుమా పూతనామహిమ సుధ్యాభరిప్రతాపోదయా!"

సీ. "సంతతాశ్రిత జనాశయా నన్ను రక్షింపు, ధూర్ధరక్ష్మోపాయ భూపధేయ!
మన్నింపుమీ నీడమహితవాసుని నన్నుఁ దతసదోరాధికాదరవిధేయ!
కృపఁ జూడవే మానసేష్టవర్తను నన్నుఁ, బటుయశోదానందభాగధేయ!
సైరింపవే నన్ను సర్వదాఖేటుని, నరకాంతనవనీయ నామధేయ!
తే. గురుమనీషఁ బితామహు గురుతఁ గన్న
నీకు మావంటివార్లల్ల నినువు లగుట
వేగ మను మని దీవించి విడువవయ్య!
నఖిలజనశివతాతీత! నిషధనేత!"

క. అని శకలితఖలసంవి, త్ఖని విశ్వామిత్రుఁ డవగతనయమదుక్తుల్
వినుమయ్య శమధనాగ్రణి, వనగతుల న్వేఁట లాడవలదెవ్వాటన్.

టీక. హరి. అనిశ...ఖని-అనిశము, కలిత=పొందఁబడిన, ఖలసంవిత్=దుష్టప్రతిజ్ఞకు ('సంవిదాగూః ప్రతిజ్ఞానం' అని య.) ఖని = ఆకరమైనవాఁడు, ('ఖనిః స్త్రియామాకరస్స్యాత్' అని య. మఱవనిదుష్ప్రతిజ్ఞ గలవాఁడనుట.) విశ్వామిత్రుఁడు, అవగతనయ మదుక్తుల్-అవగత = పొందఁబడిన, నయ = నీతిగల, మదుక్తుల్ = నా

మాటలు, వినుము అయ్యశమ...గతులన్ - ఆ. అశమథనాగ్రణీ=శాంతుఁడుగాని విశ్వామిత్త్రునియొక్క, వన = ఆశ్రమమునందలి, గతులన్ = మార్గములయందు, (సంచారములచేతననియు; "గతిస్తుగమనేమార్గ" అని రత్నమాల. "ఇకోప్రస్వాఽజ్యోగాలవస్య" అను వ్యా. సూ. చేత "అశమథనాగ్రణీ" యని హ్రస్వమైనది.)

నల. అని= యుద్ధమునందు, శక...విశ్వామిత్త్రుఁడవు. శకలిత=ఖండములుగాఁ జేయఁబడిన, ఖలసంవిత్తని = నీచజ్ఞానాకరులైన, విశ్వ + అమిత్త్రుఁడవు = సమస్త శత్త్రువులు గలవాఁడవు. (యుద్ధమున శత్త్రుసంహారకుఁడ వనుట.) అవగతనయ ! = నీతియుక్తుడా ! శమథనాగ్రణి = శాంతిమంతులలో శ్రేష్ఠుఁడా! మదుక్తుల్; విను మయ్యా, వనగతులన్ = ఉదకమందు గమనము గలవానిని (జలపక్షుల ననుట).

క. అనుటయుఁ దద్వాక్యంబులు
విని కరుణావీచిధౌతవిమలాత్ముఁ డతం
డనుపఁ బ్రియాతనయాప్తిన్
దనరి సమారూఢసమ్మదసమున్నతి నై. 37

టీక. హరి. తద్వాక్యంబులు=అవనిష్ఠుఁడు; అనుపన్, ప్రియాతనయాప్తిన్ - ప్రియాతనయ = చంద్రమతీలోహితులయొక్క, ఆప్తిన్ = కూడుటచేత, 'సమారూఢ సమ్మదసమున్నతినై' అని పైపద్యముతో నన్వయము.

నల. తద్వాక్యంబులు - తత్ = ఆహంసయొక్క; వాక్యంబులు, కరుణావీచి ధౌత విమలాత్ముఁడు - కరుణావీచి = దయారంగములచేత, ధౌత = కడుగఁబడిన, విమల = నిర్మలమైన, ఆత్ముఁడు, (అనఁగా : సదయ హృదయుఁడనుట). అతఁడు= నలుఁడు, అనుపన్ = (విడిచి) పంపఁగా.

సీ. హితమాచరించె నీయతిధన్యుఁ డనుచు నా
హంసాన్వయాగ్రణి యచటనచటఁ
జెదరిన తనమూఁక సేర నోయ్యోయ్యన
మఱలి వచ్చిన వనమహితనవప
రార్థ్యవాగధికసామగ్రిఁ జెల్పుచుఁ బ్రియ
మారంగఁ గన్గొని యటవిజనత
యురుసత్త్వభయ మెల్ల నుడిపితి వీయుప
క్రియకు మా జే మొనర్చెదము దమ్ముఁ
గీ. గలుగఁ జేసితి వైనసత్కులజ నీకు
మారగురుదేవసుమమాసమష్టికిఁ దమ

యంతి యనఁదగు శుభకీర్తికాంత దొరయఁ
జేయు దేవర రాజ్యంబు సిరి ఫలింప. 38

టీ. హరి. ఈయతిథన్యుఁడు = వసిష్ఠముని, హంసాన్వయాగ్రణి = సూర్యవంశశ్రేష్ఠుఁడగు హరిశ్చంద్రుఁడు, మఱలివచ్చినన్ = తిరిగిరాఁగా, వన...సామగ్రిన్ - వనమందు, మహిత = శ్రేష్ఠములైన, నవ = నూతనములైన, పదార్థములయొక్క, వాగధిక = వాగగోచరమైన, సామగ్రిన్ = సమగ్రతను, తెల్పుచు, (వన్యవస్తువులఁ గానుక లిచ్చి తెలుపుచు ననుట.) అట...విజనత = అటవికజనసమూహము, (కర్త.) ఇనసత్కులజనీ - ఇన = ఇన (సూర్య) సంబంధమైన, సత్కులమందు, జనీ = పుట్టువుగల యోహరిశ్చంద్రమహారాజా! ఉరుసత్వభయము - ఉరు = అనేకములైన, భయము, ఉడిపితివి = పోఁగొట్టితివి, ఈయుపక్రియకున్ = ఈయుపకారమునకు, మాఱు = బదులు, ఏమి + ఒనర్చెదము, తమ్ముఁగలుగఁజేసితివి. తమ్ము (మమ్ము) బ్రతికించితి వనుట. (ఇట: 'నే నొనర్చెద' మను కాకు స్వరముమీఁది దకారము వికల్పముగఁ 'దమ్ముగలుగు' అని దకారమయ్యెను. ఇందుకు లక్షణము. (గీ. 'సంధిగూర్పంగ...యబ్జనాభ!' కవిచింతామణి.) కుమార...సమిష్టికి, కుమారగురు = ఈశ్వరునియొక్క, దేహసుషమాసమిష్టికిన్ = శరీరకాంతి పుంజమునకు, దమయంతి = దమింపఁజేయునది, (శివునిదేహకాంతిని తిరస్కరించునది యనుట. హేతుమణ్ణిజంతమైన దముధాతువునకు శతృప్రత్యయమును జీప్ను విధింపగా, దమయంతి యను రూపము.) అనఁదగు, వరకీర్తి కాంత, దొరయునట్లు, దేవర = దేవరవారు, రాజ్యంబుసిరి = రాజ్యలక్ష్మి, ఫలింప = ఫలించునట్లు, చేయు మని పూర్వమున కన్వయము.

నల. హితము. ఆచరించెను. ఈ అతిథన్యుఁడు, అనుచున్, అహంసాన్వయ గ్రామణి = అహంసశ్రేష్ఠము, అచట నచట = అక్కడక్కడ, చెదరిన మూఁక = పాతిపోయిన తన బలఁగము, ఒయ్యొయ్యన = తిన్నతిన్నఁగా, చేరన్, మఱలివచ్చి = తిరిగివచ్చి, నవన...సామగ్రిన్ - నవన = నుతిచేత, మహితములై, నవ = మనోహరములైన, పదములును, అర్థములును, గల వాక్ = వాక్యములయొక్క, అధికసామగ్రిఁదెలుపుచు (పదరచనయు నర్థపుష్టియు గలవాక్యములచేత నుతి సేయుచు ననుట.) అట = అక్కడ, విజనత = జనములేమిని, (ఏకాంత మగుట కనుఁగొని యనుట. విజనత యనునది యచేతనద్వితీయ.) ఉరుసత్వ = అధికమైన సత్వగుణముగల యో నలమహారాజా!, భయము, ఎల్లన్, ఉడిపితివి. ఈయుపక్రియకు, మాఱు, ఏమి, ఒనర్చెదన్. ముదమ్ము = సంతోషమును, కలుగఁజేసితివి. ఇనను, సత్కులజ! సంబుద్ధి మారగురు దేహసుషమాసమిష్టికిన్ - మార = మన్మథునియొక్క, గురు = అధిక, మైన, దేహ = శరీరముయొక్క, సుషమాసమష్టికిన్ = కాంతిపుంజముగల నీకు, వరకీర్తిన్, దమయంతి యనఁ

దగు కాంతఁ దొరయఁ జేయుదు, (అనఁగా దమయంతిని భార్యఁగా గూర్తు ననుట.)
ఏ = నేను, వరరాజ్యంబుసిరి = రాజ్యలక్ష్మి, ఫలింపఁగా ననుట.

మ. అని పల్కన్ దదభీష్టయోజనశుభవ్యాహారసోత్సాహుఁడై
యనవద్యోచితవృత్తిఁ దత్సవిధదేశావాసులం బంచి తా
నును నేకాంతమనోవినోదకలనానూనప్రదేశాప్తిఁ గాం
చి నరేంద్రాగ్రణి యాత్మకౌతుకరసశ్రీ మించఁగా నత్తఱిన్. 39

టీక. హరి. అనిపల్కన్, తదభీ...సోత్సాహుఁడై-తత్ = ఆయాటవికజనముయొక్క, అభీష్టయోజనముచేత, శుభమైన, వ్యాహార=పలుకులచేత, ('వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః' అని యు.) సోత్సాహుఁడై, తత్సవిధదేశావాసులన్=ఆ సమీప ప్రదేశవాసులగు జనులను, పంచి, తానును, ఏకాంత...ప్రదేశాప్తిన్-కాంచి, (ఒక ప్రదేశమున నిల్చినవాఁడై యనుట.) నరేంద్రాగ్రణి=రాజశ్రేష్ఠుఁడగు హరిశ్చంద్రుఁడు; ఆత్మకౌతుకరసశ్రీన్ - ఆత్మ=స్వకీయమైన, కౌతుకరస శ్రీ=సంతోషసంపదచేత, మించఁగా.

నల. అని పల్కఁగా, తదభీష్ట...సోత్సాహుఁడై - తత్ = ఆయంచయొక్క, అభీష్ట=కోరికయొక్క, యోజన=సమకూర్చుటయందు, శుభవ్యాహార=మంగళకరమైన పలుకులచేత, సోత్సాహుఁడై=ఉత్సాహముతోఁగూడినవాఁడై, అనవద్యోచితవృత్తిన్, అనవద్య=శ్రేష్ఠమై, ఉచితమైన, వృత్తిచేత, తత్సవిధదేశావాసులన్ = ఆచెంగటనుండు వారిని, నరేంద్రాగ్రణి = నలుఁడు, కర్త. ఈపదమునకుఁ బైపద్యములోని పలికె నను క్రియతో నన్వయము. ఏకాంత...శాప్తిన్-ఏకాంతమై, మనోవినోదకలనా=మనస్సునకు వినోదముకూర్చుటయందు, అనూన=అధికమైన, ప్రదేశముయొక్క, ఆప్తిన్=ప్రాప్తిని, కాంచి, ఆత్మ = మనస్సు, కౌతుకరసశ్రీన్ - కౌతుక = వివాహకంకణమందలి, ('కౌతుకం చాభిలాషే స్యాదుత్సవే నర్మహర్షయోః, వివాహసూత్రగీతాది భోగకాలే వ్యాపిస్మృతమ్' ఇతి విశ్వః.) రసశ్రీన్ = రుచిసంపదచేత, మించఁగాన్, దమయంతీ వివాహప్రేమచేతఁ దన హృదయము మించఁగా ననుట.

సీ. కురువిందములచంద మిరవందఁ గలయంద
ములమించు మొగమునఁ దళుకు లొలుకఁ
బగడాలు దగ డీలుపడఁ గ్రాలు జగడాలు
గల యంఘ్రులు మెఱుంగుగముల నీనఁ
గనకంపు రుచి పెంపుఁ గడనుంపు బలితంపుఁ
బక్షకాంతి వనాంతపదవిఁ బొదువ

ఘనహీర మణివార మనువారము నవార
ణ జయించు మేనివిన్నాణ మమరఁ
గీ. దనరు మానసప్రియము చిత్రద్యుతులకు
రంగము దపోజ్వలితసారసహితార్చి
కౌశికసమాఖ్యుఁడు నయముగా శయమున
నెంతయు నొనర్చి లాలించి యిట్లు పలికె. 40

టీ. హరి. కురువిందములు = మాణిక్యవిశేషములు, పగడాలు = ప్రవాళములు, డీలుపడన్=డిల్లపడునట్లు, క్రాలు=ఒప్పునట్టి, జగడాలు = విశేషకాంతి, కడనుంపు= కడపటనుంచు (అనఁగా దూరముచేయు, తిరస్కరించు అనుట) పక్షకాంతి=పార్శ్వ భాగముయొక్క కాంతి, హీరమణివారము = వజ్రములయొక్క సమూహము, మానస ప్రియము=మనోహరమైనది, చిత్ర...రంగమున్-చిత్రవర్ణములుగల లేడిని,తపో... తార్చి-తపః=తపస్సుచేత,జ్వలిత మై, సార=బలముతో, సహితమైన, అర్చి = తేజస్సు గలిగిన, కౌశికసమాఖ్యుఁడు=విశ్వామిత్రుఁడు. నయ...శయమున - నయమున్=నీతిని విడిచిన, (నీతిరహితమైన) ఆశయమునన్ = మనస్సుతో, ఒనర్చి = చేసి, (అనఁగా సృజించి). లాలించి యిట్లు పలికెను.

నల. పక్షకాంతి=రెక్కలకాంతి, మానసప్రియము=అంచ, చిత్రద్యుతులకు, రంగమున్=స్థానమైనది. (ఇది యంచకువిశేషణము)తపో...ర్చి-తపః=గ్రీష్మర్తువునందు ('ఉష్ణఊష్మాగమ స్తపః' అను.) ఉజ్వలితుఁడైన, సారసహిత=సూర్యునియొక్క, అర్చి= తేజస్సును బోలిన తేజముగలవాఁడు, కౌశికసమాఖ్యుఁడు=ఇంద్రునియొక్క కీర్తివంటి కీర్తిగలవాఁడు, ఇవి పూర్వపద్యమునందలి నరేంద్రాగ్రణి యనుకర్తకు విశేషణములు. ('కౌశికో నకులేవ్యాళగ్రాహిగుగ్గులు శక్రయోః' విశ్వః. 'యశః కీర్తిస్సమాఖ్యాచ' అను.) నయముగా, శయమునన్=చేతితో, ('పంచశాఖశ్శయః పాణిః' అను.)

ఉ. ఓవరజాతరూపకమలోత్తరశేఖర! నీమయూఖరే
ఖావిభవంబు నీకమధికశ్రుతిగోచరదీర్ఘదృష్టియున్
నీవదనప్రదీపితవినిర్మలవర్ణము లెట్టివారలన్
గైవసమాచరించుఁ ద్రిజగంబుల నెయ్యది నీ కసాధ్యముల్. 41

టీ. హరి. ఓ, వర...శేఖర! వరజాతరూప=శుద్ధసువర్ణరూపములైన,('చామీ కరంజాతరూపం' అను.) కమలోత్తర=శ్రేష్ఠములైన మృగములయందు, ('స్యాత్కు రంగేఽపి కమలం' అను.) శేఖర=శ్రేష్ఠమైనదానా! నీ, సమ...దృష్టియున్-సమధిక మైన, శ్రుతిగోచర=చెవులు కగపడుచుండెడు, (కర్ణపర్యంతము వ్యాపించియుండు.)

దీర్ఘ దృష్టియుక్=నిడుపలగుకన్నులును, నీ, వచన...వర్ణములు-వచన = ముఖమందు, ప్రదీపిత = ప్రకాశమానములై, వినిర్మలములైన. వర్ణములు = వన్నెలు, మృగము స్వర్ణమయము గనుక, రేఖావిశేష మనఁగా నొకగంటిపైని రేఖలును, దీర్ఘదృష్టి యన, నారేఖలం బరిశీలించి చూచుటయును, వినిర్మలవర్ణము అనఁగా వన్నెలనియును, ఎట్టి వారికైన పరగతులఁ జేయు ననియును, మాల్లోకములయందు బంగరునకును దుస్సాధ్యవస్తువులు లేవనియు సువర్ణగుణము లిట ధ్వనితములు.

నల. ఓ వర...శేఖర-వర=శ్రేష్ఠమైన, జాతరూపకమల = బంగారుతమ్మివంటి, ఉత్తర=ఉన్నతమైన, శేఖర=శిఖకలవాఁడా ! లేక, (వర=కుంకుమము, జాతరూప = బంగారు, కమలోత్తర=కుసుమపువ్వు: వీనివంటి, శేఖర=జుట్టుకలవాఁడా ! ('వరం బాహ్లీకపీతనే, అథ కమలోత్తరమ్, స్యాత్కుసుమ్భం వహ్నిశిఖమ్' అమ.)అనియును నర్థాంతరము. నీసమ...దృష్టియుక్ - సమధికమైన శ్రుతిగోచర = వేదగోచరమైన, దీర్ఘదృష్టియుక్=దీర్ఘజ్ఞానమును, ('దృష్టిర్ జ్ఞానేఽక్ణిదర్శనే' అమ.) నీవచన...వర్ణములు-నీవచన=నీవాక్యములయందలి, ప్రదీపితములైన, వినిర్మలవర్ణములు=నిర్మలాక్షరములు, వచనశబ్దము. వచవ్యక్తాయాంవాచి, అను ధాతువుయొక్క ల్యుడంతము.)

గీ. కాన శంబరమథనాస్త్రకలితలీలఁ
దనరు తద్రాజముఖ్యావతంసమునకు
మనసుతమి రేఁచి మన్మహావనముఁ గలయఁ
జేయు మని పంప నదియునుఁ జేరఁబోయి. 42

టీక. హరి. కానన్=అడవియందు,శం...లీలన్-శంబర=మృగములయొక్క, ('మృగదానవబౌద్ధేషు శంబర శ్శంబరీ వృషా' నా నా.) మథన=సంహారముగల,అస్త్ర కలితలీలన్=వేఁటచేత, తనరునట్టి, తద్రాజముఖ్యావతంసమునకు, ఆరాజశ్రేష్ఠశిరోమణి యగు హరిశ్చంద్రునకు, మన్మహావనమున్ = నాతపోవనమును.

నల. కాన=కావున, శం...లీలన్-శంబరమథనాస్త్ర = మన్మథబాణములవలె, కలితమైన, లీలన్ = విలాసముతోడ, తనరునట్టి, తద్రా...మునకున్-తత్=ఆ, రాజముఖీ=చంద్రముఖులకు, అవతంసమునకున్=శిరోభూషణమైనదానికి (అనఁగా దమయంతి కనుట.) మన్మహావనము-మత్=నాయొక్క, మహా, అవనమున్=రక్షణమును.

సీ. ఒకచోట గతిదూరితోరుద్విరదనారు
లొకచో సముత్పాటితోగ్రఖడ్గ
లొకచోట నుద్ధృతాధికపుండరీకంబు
లొకచో నుశిక్షితాత్యుచ్చవాజు

లోకచోట సన్నద్ధయూథనాథాగ్రణు
లోకచో నచలభావయుక్తరక్షు
లోకచోట విశిఖాగ్రవికచచామరపంక్తు
లోకచోఁ బ్రభిన్నమృగోత్కరములు

గీ. దనర నరయుచు నతిలోహితప్రకాశ
కాననం[1]బు సువర్ణరేఖానితాంత
లలితకాంతి చక్రాంగంబులతలమిన్న
కుండినైకాద్భుతశ్రీలు దండి మెఱయ. 43

టీక. హారి. గతి... నారులు-గతి=గమనమునకు, దూరిత=దూరముగాఁ జేయఁబడిన, ఊరుఊతొడలుగల, (తొడలు విఱిగిన వనుట.) ద్విరదన = గజములయొక్క, ('రదనాదశనాదంతారదా' అమ.) అరులు = శత్రువులు. (అనఁగా: సింహములు.) సము... ఖడ్గులు-సముత్పాటిత=భేదింపఁబడిన, ఉగ్రఖడ్గులు=క్రూరములైన ఖడ్గమృగములు, ('గండకః ఖడ్గఖడ్గినా' అమ.) ఉద్ధృతాధికపుండరీకంబులు,ఉద్ధృత=హరింపఁబడిన, అధికపుండరీకంబులు=అధికములైన పెద్దపులులు, ('వ్యాఘ్రేఽపి పుండరీకో నా' అమ.) సుశి...వాజులు-సుశిక్షిత = చక్కఁగ దండింపఁబడిన, అత్యుచ్చవాజులు = మిగుల నున్నతము లగు పక్షులు, ('నగౌకోవాజివికిరవివిష్కిరపతత్రిణః' అమ.) సన్నద్ధ... గ్రణులు-సన్నద్ధ = కట్టఁబడిన, యూథనాథాగ్రణులు = గజశ్రేష్ఠములు, ('యూథనాథస్తు యూథపః' అమ.) అచ... రక్షులు-అచలభావ=నిశ్చలత్వముతోడ, యుక్=కూడుకొనిన, తరక్షులు=సివంగులు, ('తరక్షుస్తుమృగాదనః' అమ.) విశిఖా... పంక్తులు-విశిఖాగ్ర=బాణాగ్రములచేత, వి=పోయిన,కచ=వెండ్రుకలుగల, చామర=చమరీమృగములయొక్క, పంక్తులు, ('చమరశ్చామరోపిఽచ' శబ్దభేది.) ప్రభిన్న... రములు, ప్రభిన్న=వ్రక్కలింపఁబడిన, మృగోత్కరములు, తనరఁగ, అతి... కాననంబు-అతి=అతిశయమైన, లోహిత=నెత్తురుయొక్క, ('రుధిరేఽసృగ్లోహితాస్ర' అమ.) ప్రకాశముగల, కాననంబు = అరణ్యమును, అరయుచు నని యన్వయము. సువర్ణ... చక్రాంగంబు - సువర్ణరేఖలయొక్క, నితాంత...మిక్కిలి-లలిత = మనోహరమైన, కాంతిచక్ర=కాంతిపుంజముగల, అంగంబు=అవయవముగలది, (అనఁగా: విశ్వామిత్రసృష్టమాయామృగము.) ఇది కర్త. తలఁక = తీఁగలయందు, మిన్నకుండి = అడఁగియుండి, నైకాద్భుతశ్రీలు, నైక=అనేకములైన, అద్భుతశ్రీలు.

నల. గతి...నారులు-గతి=నడకచేత,దూరిత=తిరస్కరింపఁబడిన, ఊరు=గొప్పవైన, ద్విరద=ఏనుఁగులుగల, నారులు=స్త్రీలు, సము...ఖడ్గులు-సముత్పాటిత=దూయఁ

1. కాననంబానునగ్న.

బడిన, ఉగ్రములైన, శస్త్రులు=కత్తులుగలవారు. (పిచ్చుకత్తులబంట్లనుట.) ఉద్ధృతాధిక పుండరీకంబులు-ఉద్ధృత = ఎత్తఁబడిన, అధికపుండరీకంబులు=గొప్ప తెల్లగొడుగులు, ('పుండరీకం సితాంభోజే సితచ్ఛత్రే౽పి భేషజే' విశ్వ.) సుశి...వాజ-సుశిక్షిత=లెస్సగా శిక్షింపఁబడిన, అత్యుచ్చ=వాజులు=మిగులనెత్తైన గుఱ్ఱములు. ('వాజివాహార్వగంధర్వ' అని య.) సన్నద్ధయూథనాథాగ్రణులు, సన్నద్ధులైన, యూథనాథాగ్రణులు = సేనాధిపతులు, అచల...రక్షులు-అచలభావ = నిశ్చల స్వభావముతోడ, యుక్త= కూడుకొనిన, రక్షులు=పురరక్షకులు, విశిఖాగ్ర వికచచామరపంక్తులు, విశిఖా=వీథుల యొక్క, ('రథ్యాప్రతోళీవిశిఖా' అమ.) అగ్రములయందు, వికచములైన, చామర= జల్లులయొక్క, పంక్తులు. ప్రభి...రములు-ప్రభిన్న=మదించిన, మృగ=అడవియందు సంచరించెడు ఏనుఁగులయొక్క, ('భద్రో మందో మృగశ్చేతి విజ్ఞేయా స్త్రివిధా గజాః' వైజ.) ఉత్కరములు=సమూహములు. అతి...నంబు-అతిలోహిత = మిగుల నెఱ్ఱనైన. ప్రకాశక=ప్రకాశించుచుండెడు, ఆననంబు=ముఖముగల, సువర్ణకాంతిగల, చక్రాంగంబులతలమిన్న = అంచలమిన్న. ('చక్రాంగా మానసౌకసః' అమ.) కుండినై కాద్భుతశ్రీలు, కుండిన=కుండినపట్టణముయొక్క, ఏక = ముఖ్యమైన, అద్భుతమైన, శ్రీలు=సంపదలు.

వ. సముచితక్రమంబున నిరీక్షించుచు నమ్మహారాజభీమునితనయపదవిం గదిసె నప్పు డయ్యత్యంతసత్త్వవైభవవాసవసతియు నసాధారణ విస్మయరసాధారమనోవీథియు నై జాతరూపవిభ్రమవిభ్రాజితంబును జగన్నుతాలోకలక్ష్మీవిరాజితంబును జనపాలతనయోపలాలనభాజ నంబును జలజభవవిచిత్రగతినిర్మాణచాతురీసముత్తేజనంబును నగు నాతిర్యగ్వితంసంబుఁ గిట్టి పట్టి సమకట్టుటయును. 44

టీక. హరి. అమ్మహారాజభీమునిన్=ఆరాజభీకరుఁడైన హరిశ్చంద్రుని, ఇతనయ పదవిన్ - ఇత=పొందఁబడిన, నయపదవిన్ = నీతిమార్గముగలవానిని, రాజభీమునికి విశేషణము. కదిసెన్=సమీపించెను. అత్యం...వసతి-అత్యంతసత్త్వవైభవముయొక్క, వాస=నిలుకడకు, వసతి=స్థానమైనవాఁడు (హరిశ్చంద్రుఁడనుట.) అసా...వీథియు, అసాధారణమైన, విస్మయరస=ఆశ్చర్యరసమునకు, ఆధారమైన, మనోవీథిగలవాఁడు. (అత్యాశ్చర్యయుక్తుఁడైనవాఁడనుట.) జాత...తంబును-జాతరూప=బంగారుయొక్క, విభ్రమ=విలాసముచేత, విభ్రాజితంబు=నుప్రకాశించునదియు, జగ...తంబును-జగన్నుత మైన, ఆలోకలక్ష్మీ=దృక్సంపదచేత, విరాజితంబును, జన...జనంబును-జనపాలతనయ= రాజకుమారులయొక్క, ఉపలాలనకు, భాజనంబును = యోగ్యమును, జలజ...త్తేజనం బును-జలజభవ=బ్రహ్మకు, విచిత్ర=ఆశ్చర్యమైన, గతి=తీరుగల, నిర్మాణ=సృష్టించుట యందలి, చాతురీ=నేర్పుచేత, సముత్తేజనంబును=ప్రకాశించునదియును, (బ్రహ్మతనచే

సృజింపఁబడకయే యొప్పారు దాని సౌందర్యమున కాశ్చర్యపడునట్లు ప్రకాశించు నది యనుట.) అగు, అతిర్యగ్వతంసంబుక్ = అమృగమును; గిట్టి పట్టి సమకట్టుట యును = పట్టుకొనఁ బ్రయత్నింపఁగా.

నల. అమ్మహా...పదవిక్-అమహారాజైన భీమునియొక్క, తనయ = కొమరిత యగు దమయంతియొక్క, పదవిక్=స్థానమును, కదిసెక్=ప్రవేశించెను. అయ్యా... పతియు-ఆ, అత్యంతము, సత్యమైన, వైభవమున, వాసవపతియు = శచీదేవియు, శచీ దేవియొక్క వైభవమువంటి వైభవముగల యాదమయంతి యనుట. జగ...తంబును - జగన్నుతమైన, ఆలోకలక్ష్మి=తేజోలక్ష్మిచేత, ('ఆలోకొదర్శనోద్యోతౌ'అమ.) విరా జితంబును, జన...జనంబును-జనపాలతనయా = రాజకుమారికలయొక్క, ఉపలాల నకు, భాజనంబును = యోగ్యంబును, ('భాజనం యోగ్యపాత్రయోః' విశ్వ.), జలజ...జనంబును-జలజభవునకు విచిత్రమైన, గతి=గమనముయొక్క, నిర్మాణచాతురి చేత, సముత్తేజనంబును=ప్రకాశమానమును, వాహనముగాన గమనముచేత బ్రహ్మకు నాశ్చర్యము కలిగించునది యనుట. తిర్యగ్వతంసంబుక్ = హంస ననుట.

చ. కలయఁగ నిచ్చు నిచ్చి వెడగబ్బున గొబ్బున దాఁటు దాఁటి య
వ్వలఁ బొడకట్టుఁ గట్టి వలవంతలఁ జెంతల నిల్చు నిల్చి యా
నల వెడ రేఁచు రేఁచి పలుజాడల నీడల వ్రాలు వ్రాలి మిం
చుల వెదచల్లుఁ జల్లి తమిచూపులఁ దీవులు వెట్టు బెట్టుగన్. 45

టీ. రెండర్థములకు సమానము. సుగమము.

చ. ఎలమి మది న్గలంచి యలయించి కరంబు లయించి యిట్లు శీ
తలతరపాటలీవకుళదాడిమకౌశికకాననావనీ
వలయము సేరఁ దెచ్చె నది వంచనఁ దెచ్చు బెఱింగి యానుదృ
క్తిలకము వెంట వచ్చు నతిధీరహితాళి మరల్చి సన్నలన్. 46

టీ. హరి. శీతల...వలయము, ... కౌశికకాననావనీవలయము = విశ్వామిత్రా శ్రమప్రదేశము. అనుదృక్తిలకము=అనుజ్ఞానశ్రేష్ఠుఁడగు హరిశ్చంద్రుఁడు, అతి ... తాళి-అతిధీర=మిగుల ధైర్యవంతులైన, హితులయొక్క, ఆళిక్=సమూహమును, అది= ఆమాయామృగము.

నల. శీతల...వలయము - శీతలతర = మిక్కిలిచల్లనైన, పాటలీ = కలిగొట్టు చెట్లును, ('పాటలిః పాటలా మోఘా' అమ.) వకుళ = అపొగడచెట్లును, ('అథ కేసరే, వకుళో' అమ.) దాడిమములును, కౌశిక = గుగ్గులు చెట్లును గల, ('కౌశికో గుగ్గులుః పురః' అమ.) కాననావనీవలయము = అరణ్యభూమండలము,

ఆసుదృక్తిలకను = ఆ స్త్రీరత్నము, (అనఁగా దమయంతి) అతిధీరహితాళిన్-అతి+ధీరహిత=మిక్కిలి తెలివిలేని, అళిన్ = చెలికత్తెయును, అది = ఆయంచ.

గీ. కినిసి పాణినాళీకంబు సోనుపుటయును
నంతలోఁ బడ కదియు మోహప్రకటన
మాని తన్ననిచినయతిమానతుంగ
తరు నెనసి తోఁన గ్రహణగోచరతఁ దొలఁగె. 47

టీ. హరి. పాణినాళీకంబున్-పాణి = పాణియందలి, నాళీకంబున్ = బాణమును, ('నాళీకంత్వస్త్రేక్లీబంశ కేపుమాన్' నానా.) అంతలోన్ పడక, అదియు = ఆ మృగమును, మోహప్రకటన=మూర్ఛాప్రకటనమును, మాని = వదలి, తన్ను, అనిచిన = పంపిన, యతి = ఋషియగు, మానతుంగతరు-మాన = అభిమానముచేత, తుంగతరున్ = మహోన్నతుఁ డగు విశ్వామిత్రుని, ఎనసి = చేరి, గ్రహణగోచరత-గ్రహణ = దృష్టిగ్రహణమునకు, గోచరత=గోచరించుట. తొలఁగెన్, (కానరాక పోయె ననుట.)

నల. పాణినాళీకంబు=హస్తకమలమును, అంత, లోఁబడక=లోఁగాక, అదియున్=అహంసయు, మోహ...మానితన్-మోహ=మోహముయొక్క, ప్రకటన = ప్రకటించుటయందు, మానితన్=చిత్తౌన్నత్యము గలదగుటచేత, ('మానశ్చిత్తసమున్నతిః' అమ.) (దమయంతి కాసఁ బుట్టించునదియై యనుట.) అని...తరున్-అనిచిన=పూఁచిన, అతిమాన = ఉన్నతమైన, తుంగతరున్ = పొన్నచెట్టును, ('పున్నాగే పురుష స్తుంగః' అమ.) ఎనసి = ఎక్కి, గ్రహణగోచరతన్ - గ్రహణ = పట్టుకొనుటకు, గోచరతన్ = గోచరమౌటను, తొలఁగెను.

సీ. అవనీపతివరప్రియాత్మజసంసక్తి
నాచిత్రవర్ణతిర్యక్ప్రకాండ
ము నఖండగతుల ని ట్లనుసరించుచు వచ్చి
యలసి చల్లనియొకనెలవుఁ జేరి
యచటఁ గౌశికకాననాగ్రమహావని
యనిభృతఫలదళాహారకృద్ద్వి
జాతిసుస్వరవాక్యచాతురి విని యుల్కి
చనకు మచ్చుటి కంచుఁ జాటుగురుని
గీ. దేశకథనాళిఁ గడచె నెంతేని యాత్మ
వెరవు దక్కి విశ్వామిత్రవిహృతికాన

నాంతసారంగశాబసంహతికిఁ దగులు
వడిఁబి నడియాస నని కడు నడలుచుండె. 48

టీ. హరి. అవనీపతి = హరిశ్చంద్రుఁడు, వర...సక్తిన్-వరప్రియ = కడుఁ బ్రియురాలగు చంద్రమతియొక్కయు, ఆత్మజ = కుమారుఁడగు లోహితుని యొక్కయు, సంసక్తిన్ = సంగతిచేత, (చంద్రమతీ లోహితులతో ననుట.) ఆచిత్రవర్ణతిర్యక్ప్రకాండమున్=ఆ+చిత్రవర్ణములు గల మృగశ్రేష్ఠమును, కౌశిక...వని-కౌశిక=విశ్వామిత్రునియొక్క, కానన=వనముయొక్క; అగ్రమహావని = శ్రేష్ఠమైన యాశ్రమభూమి, అని, భృత...చాతురి-భృత=భరింపఁబడిన, (నియతమై యనుట.) ఫలదళాహార = ఫలములను దళములను తెచ్చుటను, కృత్ = చేయుచున్న, ద్విజ = బ్రాహ్మణునియొక్క, అతిసుస్వరవాక్యచాతురిచేత, విని, (విశ్వామిత్రునికి ఫలములను పత్రములను నియతముగఁ దెచ్చెడు బ్రాహ్మణునివలన విని యనుట.) ఉల్కి = భయము నొంది, ఇటనుండి హరిశ్చంద్రవాక్యము. గురు...నాళిన్-గురు = గురువైన వసిష్ఠునియొక్క, నిదేశకథన = ఉపదేశవాక్యములయొక్క, ఆళిన్=సమూహమును, ఆత్మ, కడచెను. (గురువాక్యోల్లంఘనముఁ జేసె ననుట.) విశ్వా...కానసాంత = విశ్వామిత్రునియొక్క విహారవనాంతరమందలి, సారంగశాబ=లేడిపిల్లలయొక్క, ('భృంగే కురంగే మాతంగే సారంగ శ్శబళే త్రిషు' నానా.) సంహతికిన్=సంహారమునకు.

నల. అవ...త్మజ-అవనీపతివర = రాజశ్రేష్ఠుఁడగు భీమునియొక్క, ప్రియాత్మజ=ప్రియపుత్రియగు దమయంతి, ఆచిత్రవర్ణతిర్యక్ప్రకాండమున్ = హంసను, కౌశిక...వని-కౌశికకానన=నందనవనముతీరున, అగ్ర=శ్రేష్ఠమైన, మహావని = వనమందు, అనిభృత...చాతురి-అనిభృత=నిశ్చలములుగానివై (విజృంభించినవైయనుట), ఫలదళాహారమును, కృత్ = చేయుచున్న, ద్విజ = శుకాదిపక్షులయొక్క, ('దంతవిప్రాండజాద్విజాః' అమ.) అతిసుస్వరవాక్యచాతురిన్ = మిగుల మధురమైన వాక్యముల చమత్కారము, ఉల్కి = భయమునొంది, (ఇటనుండి దమయంతి యనుమాట). గురు...నాళి-గురు=అధికమైన, నిదేశకథన=ఆజ్ఞాకథనముగల ('నిదేశశ్శాసనంసచ' అమ.) ఆళిన్ = చెలికత్తెను, ఆత్మ=హృదయము, కడచెను, (చెలికత్తియమాట వినక వచ్చితిననుట. విశ్వా...సంహతికి-విశ్వ = సమస్తము, అమిత్ర = శత్రువులైన, విహృతికానసాంత = ఆరణ్యమందలి సంచారముగల, సారంగ = కొదమ తుమ్మెదలయొక్క, సంహతికిన్ = సంఘమునకు, తగులుపడితిన్ = చిక్కుపడితిని.

వ. అప్పు డసమానమానవవచనధర్మకర్మఠత్వంబున. 49

టీ. హరి. అస...త్వంబున-అసమాన=అసమానమైన, మానవ = మనుసంబంధమైన, వచనధర్మమునందలి కర్మఠత్వంబున, (మనునీతి మార్గమున ననుట.)

నల. అస...త్వంబున=సమానరహితమైన, మానవ...వచన=మనుష్యాలాప మండలి, ధర్మకర్మరత్వంబునన్=స్వభావాసక్తిచేత, "ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ. ఉపమాయా మహింసాయాం చాపే సోపనిషద్యతే." నానా.)

చ. చపలత మాన్పి యిట్లనుఁ బొసంగఁ బతంగకులప్రధాన మో
నృపజ! యధీర! యేమిటికి నీ విటుఁ ద్రిమ్మరఁగా నతిప్రకా
శపదవినున్న గాధిపతిసంతతిలో వగనించునీకు నే
నెపమునఁ జిక్కఁ బట్టుకొను నీతలపోఁతలు మానుమెంతయున్. 50

టీక. హరి. పతంగకులప్రధానము = సూర్యవంశపుమంత్రి, (సత్యకీర్తి యనుట.) ("పతంగస్త్వాలిఖేడేఽర్కే విహాశేశలభే ఖగే; ప్రధానం పరమాత్మాదిర్మంత్రి ప్రకృతి ముత్తమః" నానా.) ఓనృప! జయధీర! ఇవి సంబోధనలు. అతిప్రకాశపదవిన్=జ్ఞానమార్గముచేత; ఉన్న=ఉండెడు, గాధిపతిసంతతి = విశ్వామిత్రుఁడు, నీవిటుఁ ద్రిమ్మరఁగాన్=నీప్రీతియన సంచరింపఁగా; వొవఁగనించునీకేమిటి కని వెనుక నన్వయము. ఏనెపమునన్ = ఏసాకుచేత, చిక్కఁబట్టుకొనున్=(నిన్ను) జిక్కఁబట్టుకొనును, (కారణమేమియులే దనుట.) నీతలపోఁతలు = నీవిచారములు, మానుము = విడువుము.

నల. పతంగకులప్రధానము = పక్షికులశ్రేష్ఠము (అనఁగా హంసము.) కర్త. నృపజ, అధీర; ఇవి దమయంతీసంబోధనములు. అధీరలక్షణము:—

తే. "తప్పఁగల భర్తమ్రోల సోత్ప్రాసఫణితిఁ, గేరడము లాడుసతి మధ్యధీర సాశ్రు
వచనపరుష యధీర సబాష్పకుటిల, హరివచన ధీరాధీర యనఁగఁ జెలఁగు."

(నరసభూపాలీయము.)

అతి...సంతతిలో-అతి=అత్యంతము, ప్రకాశపద=సూర్యుని; వినుత్=ఒరయుచున్న, నగాధిపతి=వృక్షశ్రేష్ఠములయొక్క సంతతిలో, 'ఏమిటికి నీవిటు ద్రిమ్మరఁగా' నని పూర్వమున కన్వయము. వగనించునీకు=వ్యథనొందెడు నీకు, ఏనెపమునన్=ఏవ్యాజమునను, చిక్కను, పట్టుకొను నీతలపోఁతలు=పట్టుకొందుననునీయాలోచనలు, మానుము.

సీ. అలఘుగతిప్రౌఢి నాత్మభూహరిముఖ్యు
లౌ నన విఖ్యాతి నతిశయిల్లి
తపనీయరుచిదివ్యతటినీకమలమూల
వృత్తిచేఁ దేజోభివృద్ధిఁ గాంచి
నానాజగన్మనోజ్ఞానాదివిద్యాధు
రంధరత్వంబునఁ బ్రణుతిఁ జెంది

యశ్రాంతకలుషభావానభిజ్ఞమహాగ
భీరమానసభూతిఁ బెంపుఁ బూని
గీ. తనరువా రమోఘయశోధన హితోక్తి
పటిమ నేమించి నెయ్యంబుఁ బ్రభులయెడ నొ
నర్పుదురు మహిఁ మనలగుణంబు లరసి
కరము ముద మందుదురు చిరగౌరవమున. 51

టీక. హరి. అలఘుగతిప్రాప్తిన్ = శ్రేష్ఠమైన జ్ఞానప్రాప్తిచేత. ('గతిర్మార్గదశాయాం జ్ఞానేయాత్రాభ్యుపాయయోః' విశ్వ.) ఆత్మభూహరిముఖ్యులు = బ్రహ్మేంద్రాదులు. ('హరిర్వాతార్క-చంద్రేంద్ర యమోపేంద్రమరీచిషు' నానా.) తప... వృత్తిచేన్-తపనీయ=సూర్యసంబంధమైన (ఇట తపనశబ్దమునకంటె 'వానామధేయస్య వృద్ధసంజ్ఞా' అని వృద్ధసంజ్ఞ విధించి 'వృద్ధాచ్ఛః' అని ఛప్రత్యయము విధింపఁగాఁ 'తపనీయ' యనిరూపము.) రుచి = కిరణములును, దివ్య=వాయువును, ('దివ్'శబ్దముకంటె 'ద్యుప్రాగపాగుదక్ప్రతీచో యత్' అనుసూత్రముచే భావార్థమున యత్ప్రత్యయము విధింపఁగా 'దివ్య' అనురూపము. ఇటఁ బ్రకరణవశమున వాయువాచకము. "ఆకాశాద్వాయుః" అని శ్రుతి.) తటినీకమల = నదీజలమును, మూల=కందమూలములును, వీనియొక్క, వృత్తిచే = జీవనముచేత, మునులకు సూర్యకిరణము లాహారమనుటకు మనుచరిత్రమున—

ఉ. ఓసిమురాత్మురాల! గృహమేధిక సర్వసుఖంబు లన్ని రా
యాసములం దొఱంగి మిహిరాంశుమరుచ్ఛదనీరస
గ్రాసమె దేహధారకముగా గుహల న్దప మాచరింపఁ జొ
మ్మాసరణిం జరించి నగ నేమిఫలం బొగఁగూడెఁ జెప్పుమా,"

నానా...ధరత్వంబునన్-నానా=అనేకములైన, జగన్మనోజ్ఞ=జగన్మనోహరములైన, అనాదివిద్యా = వేదవిద్యలయొక్క, ధురంధరత్వంబునన్ = భారవాహిత్వముచేత, అశ్రాంత...భూతిన్-అశ్రాంత=ఎల్లప్పుడును, కలుషభావమును, అనభిజ్ఞ=ఎఱుంగని, మహాగభీర=అత్యంతగభీరమైన, మానసభూతిన్ = మనస్సంపదచేత, తనరు = ఒప్పువారు (మును అనుట.), అమోఘయశోధన ! రాజునకు సంబోధనము. హితోక్తిపటిమనే=హితవచనపాటవముచేతనే, ఒనర్పుదురు = చేయుదురు, మహిన్, మనల గుణంబులు=మనయొక్క గుణములు, అరసి, కరము=మిక్కిలి, ముదమందుదురు.

నల. అలఘుగతిప్రాప్తిన్=శ్రేష్ఠమైన గమనప్రాప్తిచేత, ఆత్మ...ముఖ్యులు-ఆత్మభూ=బ్రహ్మయొక్క, హరిముఖ్యులు=వాహనశ్రేష్ఠములు (అనఁగా: హంసలు)('హరిర్య

మారాఖ్యాశ్వేంద్రము' నాక.) ఇట 'క్వచి దపవాదోఽపి వక్తవ్యః' అను నాంధ్రశబ్దచింతామణి సూత్రముచేత ద్విత్వావాచకమునకు బహుళముగా వాచిముఖ్యులు అని మహద్వాచకమైనది. ప్రయోగము.—

సీ. "అట్లు పురుషోత్తముం డైనయాతనివలన, ముక్తిఁ గాంచినయాద్విజముఖ్యుఁ డెలమి
డెందమునకును వాక్కున కందరాని, యధికతర మైనయానంద మనుభవించె."
(స్కా. నైష.)

తప...వృత్తిచేన్-తపనీయరుచి = బంగారువన్నెగల, దివ్యతటినీకమల = మందాకినీ కమలములయొక్క, మూల=వేళ్లయొక్క (తూఁడులయొక్క-యనుట), వృత్తిచేన్=జీవనముచేత, నానా...ధురీణత్వంబునన్ - నానాజగత్ = నానాప్రపంచములయొక్క, మనః=మనస్సులను, జ్ఞాన=తెలియుట, ఆది=మొదలగు, విద్యలయొక్క, ధురంధరత్వముచేత, మానసభూతిన్=మానస సరోవరముయొక్క, భూతిన్=పుట్టువుచేత, తనరువారము, ఓఘనయశోధన, ఇది దమయంతీసంబోధనము. వాక్త్రోక్తిపటిమన్, ఏన్=నేను, మించి, యొనర్చుచు, ఉరు...గుణంబులు-ఉరుమహిమ=గొప్పమాహాత్మ్యముగల, నలగుణంబులు=నలునియొక్క గుణములు, ఆకని: ముదముం దనరను, రుచిరగౌరవమునన్= గుణములయందలి గౌరవముచేత ననుట.

గీ. కానఁ బ్రథితాత్మభూకరణానుసృష్టి
లీలఁ దగునమ్మహాత్ముని కేల నుగుణ
గరిమఁ గాంచునీకలయికఁ గలుగఁజేయు
చింత దవ్వ వచ్చితి శుభస్థితి భజింపు. 52

టీ. హరి, కాన=కాఁబట్టి, ప్ర...లీలన్-ప్రథిత = ప్రసిద్ధమైన, ఆత్మభూకరణ=బ్రహ్మసృష్టియొక్క, అనుసృష్టిలీలన్=ప్రతిసృష్టిలీలచేత, నీకు, అలయిక=క్రమమును, కలుగఁజేయుచింత, అమ్మహాత్ముని కేల యని యన్వయము. దవ్వ = దూరము, వచ్చితి = వచ్చినాఁడవు.

నల. కాన = అటుగావున, ఆత్మ...లీలన్-ఆత్మభూకరణ = మన్మథశరీరము యొక్క, ('కరణం సాధకతమ క్షేత్రగాత్రేంద్రియేష్వపి' అను.) అనుసృష్టిలీలన్= అనుగతసృష్టియొక్క లీలచేత, (మన్మథునిఁబోలినవాఁ డనుట.) అమ్మహాత్మునికేలన్= అమ్మహాత్ముని నలునియొక్క యనుట. కేలన్=చేతియందు, నీకలయిక=నీసంపర్కము, (నలునకు హస్తగతముగా ననుట.) కలుగఁజేయు, చింతన్=తలంపుచే,

చ. అన విని డెంద మూరడిల నయ్యెడ నించుకసేపు కన్ను మో
డ్పునెఱపి తాఁ గలం గని యపూర్వతరస్థితిఁ దత్ప్రసంగముల్

మనమున సంస్మరించుచు సమగ్రము లై పులకప్రకంపముల్
దనరఁగ నిట్లు పల్కు వసుధాపతిజాతమహాద్భుతంబుగన్. 63

టీ. హారి. కన్ను మోడ్చు సెఱపి=నిద్రించి, తాన్ = తాను, కలన్ = స్వప్నమును, కని = కాంచి; తత్ప్రసంగముల్ = ఆస్వప్నవృత్తాంతములు, వసుధాపతి= హారిశ్చంద్రుఁడు, జాతమహాద్భుతంబుగన్ = ఆశ్చర్యమునొందిన వాఁడై యనుట.

నల. కనుమోడ్చు సెఱపి = సంతోషపారవశ్యమునఁ గన్నులరమొగిచి, కలం గని = కలఁతనొందని, అపూర్వతరమైన, స్థితిచేత, తత్ప్రసంగముల్ =అనలునిగుఱించిన ప్రసంగములు, వసుధాపతిజాత=రాజపుత్రి (యనఁగా దమయంతి.)

చ. జనవినుతప్రభాకలిత చంద్రమతీ! తలఁబట్టి మోహముల్
పెనఁగొనఁ జేసి పాదహతి బెట్టుమెయిన్ ద్విజరాజు రేసి కై
కొన నిఖిలక్షమాభరము క్రూరవిషాదపయోధిఁ గ్రుంకఁ గం
టిని గలయుంగ నామనము నెవ్వగఁ బాయఁగఁజేయు మీ వనన్.

టీ. హారి. జనవినుతప్రభాకలిత! చంద్రమతీ! సంబోధనలు. తలఁబట్టి =తలనుపట్టుకొని,పాద... మెయిన్-పాదహతిన్ = కాలితన్ను యొక్క, బెట్టుమెయిన్ = తీవ్రతచేత, మోహముల్ = మూర్ఛలు, పెనఁగొనఁ జేసి యని యన్వయము. ద్విజరాజు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, నిఖిలక్షమాభరమున్ = సమస్తరాజ్యభారమును, కైకొనన్=తీసికొనఁగా, క్రూరవిషాదపయోధిన్, మనము=మనమందలము, క్రుంకన్= మునిఁగినట్లుగా, కలను, కంటిని: అంగనా! ఇదియు చంద్రమతికి సంబుద్ధి.

నల. జన...మతి-జనులచేత, వినుత = పొగడఁ దగిన, ప్రభా=కాంతితో, కలిత = చేయఁబడిన, (కలిః కామధేనః) చంద్రుఁడను, మతీ = బుద్ధిగలదానా (చంద్రునియొక్క కాంతివంటి కాంతిగలదానా!) హంసకు సంబుద్ధి. తలఁబట్టి = తలకెక్కి, మోహములు, పెనఁగొనియుండుటచేత, ద్విజరాజు = చంద్రుఁడు, రేసి = విజృంభించి, పాద...మెయిన్-పాదహతిన్ = కిరణములచేనైన తాడనముయొక్క, బెట్టుమెయిన్=తీవ్రతచేత, (వెన్నెల వేఁడిమిచేత ననుట) నిఖిలమైన, క్షమాభరమున్ = తాల్మిని ('క్షితిక్షాంత్యోః క్షమా' అమ. కైకొనన్ = తీసికొనఁగా, ధైర్యమును పోఁగొట్టఁగా ననుట. క్రూరవిషాదపయోధిన్ = భయంకరమైన దుఃఖసముద్రమునందు, కలయుంగన్ = లెస్సఁగా, క్రుంకఁగంటిని = మునిఁగితి, నామనము నెవ్వగన్ = నామనస్సునందలిచింతను.

క. లలితగుణశాలి నలభూ
తలవల్లభు బిగియఁ బొదివి తరలనియాత్మన్

దలకొనుతద్గతి యేర్పడఁ
బలికెక్ కలహంసగమన బంధురమైత్రిన్. 55

టీ. హరి, కలహంసగమన=చంద్రమతి, కర్త, లలితగుణశాలిక్=మనోజ్ఞములైన గుణములుగల వానిని, అలభూతలవల్లభుక్ = అహరిశ్చంద్రుని, తరలనియాత్మలక్ = చలింపనిహృదయముతోడ, ఓగియఁబొదివి = కౌఁగిలించి, హైన్యవతియై యనుట. తల కొనుతద్గతి-తలకొను = స్ఫురించుచున్న, తద్గతి = అస్వప్నగోచరుఁడైన బ్రాహ్మణుని వైఖరి, ఏర్పడక్=తెలియునట్లు, పలికెను (కలను తేటపఱచె ననుట).

నల. లలితగుణశాలియగు, నలభూతలవల్లభుక్ = నలమహారాజును; ఓగియక్, పొదివి=పొదవుకొని, తరలనియాత్మచేత, తలకొనుతద్గతిక్=ఒప్పెడునాదమయంతిరీతి, ఏర్పడక్ = విశదపడఁగా, (దమయంతిహృదయము నలునియందు గట్టిగా నిలుచుట తనకుఁ దేటపడఁగా ననుట.) గమనబంధురమైత్రిక్ - గమన = నలునిఁగూర్చిపోవుట యందు, బంధురమైన, మైత్రితో, కలహంస=రాయంచ. కర్త. పలికె నని యన్వయము. కలహంస యనుటకుఁ బ్రయోగము:—

క. "దమయంతికి నలునకు సంగమకారణదూత యైనకలహంస మనో
జ్ఞమనుష్యవాక్యముల నా, దమయంతికి హర్ష మెసఁగ తా నిట్లనియెన్,"

(భార. అర.)

సీ. నీసురూపౌదార్యవాసన దేవతా
రామాభిరామతా ప్రహసనంబు
నీసల్లపనలక్ష్మినిత్యనాళీకక
ళావరగౌరవాలంబనంబు
నీబుజాక్రమమఖండితరాజహంసాతి
ధీరప్రచారితాదేశికంబు
నీవిశ్వనుతనయనావధిశ్రీసుమ
నోమార్గణమరుద్గపేమతల్లి
గీ. యిట్టి నీ కేల యులుకు ధాత్రీంద్రమణికిఁ
దెలియఁ జెప్పెద నిపుడ నీకలయవస్థ
కాంత! శుభకరపీడనాత్యంతచింత
నైనయావంతయావంత యేనివలదు. 56

టీక. హరి. (ఓ కాంత! శుభకర! ఇవిహరిశ్చంద్రునికి సంబుద్ధులు.) నీసురూ... సన- నీ=నీయొక్క, సురూప=మనోజ్ఞమైన, ('ప్రాప్తరూపసురూపాభిరూపాబుధమనో

జ్ఞయోః' అని యు.) ఔదార్యవాసన=దాతృత్వవాసన, దేవ...హాసనంబు - దేవతా+ఆరామ=నందనవనముయొక్క (కల్పవృక్షపరిపూరితమైనవన మనుట.) అభిరామతా = మనోజ్ఞతను, ప్రహాసనంబు=హసించునది. ఈవియందుఁ గల్పవృక్షముల నుమించినవాఁడనుట.) నీస...లక్ష్మి-నీ=నీయొక్క, సల్లపనలక్ష్మి=వాక్యసంపద; నిత్య...నంబు-నిత్య=స్థిరమైన, నాళీకకళా=సత్యకళయొక్క, ('అళీక మనృతం న భవతీతి నాళీకమ్' సత్యమనుట) ('అళీకంత్వప్రియేఽనృతే' అని యు.) వరగౌరవమునకు, ఆలంబనంబు, నీభుజాక్రమము = నీచక్కనినడవడిక, ('భుజావజిహ్మప్రగుణౌ' అని యు.) అఖం...కంబు - అఖండితమైన, రాజహంస = రాజశ్రేష్ఠులయొక్క, అతిధీరమైన, ప్రచారిత = నడవడికను, ఆదేశికంబు=నిర్దేశించునది. నీవిశ్వ...శ్రీ-నీయొక్క, విశ్వమతమైన, నయ=నీతిచేత, సావధి=నిరవధికమైన, శ్రీ = సంపద, న్యాయార్జితసంపదయనుట, సుమ...తల్లి-సుమనః=పండితులకును; మార్గణ=యాచకులకును, ('మార్గణో యాచకే శరే' అని యు.) మరుద్గవీమతల్లి = కామధేనువు; (ఇట 'మరుద్గో' శబ్దమునకు 'గోరతద్ధితలుకి' అను సూత్రములచే 'టచ్' ప్రత్యయములను, 'ఙీప్'ను విధింపఁగా 'మరుద్గవీ' యను రూపమువచ్చినది.) ధాత్రీంద్రమణికిన్=భూలోకచింతామణికి, నీకు ఊలుకు, ఏల యని యన్వయము. ఇక్కడ నీకలయవస్థను=నీస్వప్నావస్థను, తెలియఁజెప్పెదను; పీడనాత్యంతచింతన్ = దుస్స్వప్నపీడవలని అధికచింతచేత, ఐనట్టి; ఆవంత = ఆఖేదము, ఆవంతయేని==లేశమాత్రము వల దని యన్వయము.

నల. నీను...వాసన-నీయొక్క; సుషమాపౌదార్య=సౌందర్యాతిశయముయొక్క, వాసన = సంస్కారము, దేవ...ప్రహాసనంబు - దేవతారామ = దివ్యస్త్రీలయొక్క, అభిరామతా =ఒప్పిదమును, ప్రహాసనంబు = నవ్వునది. (తిరస్కరించునది యనుట.) నీస...లక్ష్మి-నీయొక్క, సత్ =లెస్సైన, లపనలక్ష్మి=ముఖసంపద; ('ఆననం లపనం ముఖమ్' అని యు.) నిత్య...నంబు-నిత్యమైన, నాళీక=కమలములయొక్కయు, కళావర = చంద్రునియొక్కయు గౌరవమువంటి గౌరవమునకు, ఆలంబనంబు = ఆధారము, నీ...క్రమము=నీయొక్క, భుజాక్రమము=మనోహరమైన నడక, ('శక్త్యాం చరణవిక్షేపే పరిపాట్యామపి క్రమః' నానా.) అఖ...దేశికంబు, అఖండితమైన, రాజహంసలయొక్క, అతిధీర=గంభీరమైన, ప్రచారితా=నడకకు, దేశికంబు=గురువును, నీవిశ్వ...శ్రీ-నీయొక్క, విశ్వనుతమైన, నయనాధిశ్రీ = నయనాంతలక్ష్మి, (కడగంటిచూపులయొక్క సొబగనుట.) సుమనో...మతల్లి- సుమనో+మార్గణ+మరుత్ = పుష్పములు, బాణములుగాఁగల దేవునియొక్క, అనఁగా మన్మథునియొక్క, గవీ=బాణములయందు, మతల్లి=శ్రేష్ఠమైనది. ('గౌః క్రతౌ వృషభే చంద్రే వాగ్బాణదిగ్ధేనుషు స్త్రియామ్, ద్వయోస్తు రశ్మిదృగ్బాణస్వర్గవజ్రాంబులోమసు' నానా.) ఇట్టి నీకు, ఊలుకు=భయము,

ఏలికధాత్రీంద్రమణికిన్ = రాజశ్రేష్ఠుఁడైననలునకు, నీకలయవస్థన్=నీకుకలిగిన యవస్థను, తెలియన్, చెప్పెను. శుభ...చింతన్-శుభమైన కరపీడన = పాణిగ్రహణమందలి, ('తథా పరిణయోద్వాహోపయామాః పాణిపీడనమ్' అని యు.) అత్యంతమైన, చింతన్=చింతచేత, వినష్టి, అరక=అవిచారము. అరుంకయేఁ=ఇంచుకయును, వలదు.

గీ. సమధికప్రభా నీకలసద్ద్విజేంద్రుఁ
డతఁ డభంగురతేజోభరాపవారి
తారికౌశికసంజ్ఞుండు చేరి నిన్నుఁ
గైకొను సమస్తసామ్రాజ్యగరిమ ననుచు. 57

టీ. హరి. సమధికప్రభా! (ఇది హరిశ్చంద్రునికి సంబుద్ధి) నీకలసద్ద్విజేంద్రుఁడు= నీస్వప్నమందలి బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, అభంగుర...తారి-అభంగురమైన, తేజోతిశయము చేత, అపవారితమైన, అరి=శత్రువులుగలవాఁడు, కౌశికసంజ్ఞుండు=విశ్వామిత్రుఁడు.

నల. సమ...ద్విజేంద్రుఁడు-సమధికమైన, ప్రభానీక=కాంతిపుంజమునందు, అసత్=ప్రకాశించెడు, ద్విజేంద్రుఁడు = చంద్రుఁడు, అతఁడు = అనలుఁడు, అభంగుర...సంజ్ఞుఁడు, అభంగుర తేజోభరాపవారితములైన, అరి=శత్రువులనెడు, కౌశిక సంజ్ఞుఁడు = గుడ్లగూబలుగలవాఁడు. ('అథ కౌశికః, గుగ్గులూలూక నకుల ముని శక్రాహితుండికోః' నానా.)

చ. పలుమఱుఁ దెల్పి తోనె నిజభావము సమ్మతిలంగఁ జేయు నా
నెలఁతుకధీరవాక్యముల నిర్ణయ మాత్మహృదంతరంబునన్
నిలుపుచు హంసవంశమణి నేర్పున నచ్చటువాసి కాంచెఁ దా
నలనవిధాప్తి నయ్యెడ ననాహతమానస సంభ్రమస్థితిన్. 58

టీక. హరి. హంసవంశమణి = సూర్యవంశశ్రేష్ఠుఁడైన హరిశ్చంద్రుఁడు ('హంసస్స్వరే ఖగే విష్ణౌ యతౌ నిర్లేపభూభుజి, జీవేఽర్కేఽశ్వే శ్వేతవృషే స్యాన్మంత్రపరమాత్మనోః' నానా.) అచ్చటువాసి = ఆస్థలముం దఱలి, అలనవిధాప్తిన్=అలసతం బొందుటను, కాంచెను. (అలసుఁడై యుండె ననుట.) అయ్యెడన్, అనాహతమానస సంభ్రమస్థితితో నని.

నల. పలుమఱున్, తెల్పి, హంసవంశమణి = హంస, తాన్=తాను, నలనవిధాప్తిన్ = నలసమీపప్రాప్తిని, ('సదేశాభ్యాశసవిధసమర్యాదసవేశవత్' అమ.) కాంచెను. అయ్యెడన్, అనాహతమానససంభ్రమస్థితిన్, అ+నాహత = అడ్డులేని, మనస్సంభ్రమము యొక్క, స్థితిన్; అని ముందటి పద్యముతో నన్వయము.

క. అలతిర్యగన్వయాగ్రణి
వలన నశేషంబుఁ దెలిసి వారిక యతి మం
జులగతి వీడ్కొని రాజిలు
బలవద్రాగానువృత్తి భజియించి వెసన్. 59

టీక. హారి. అలతిర్యగన్వయాగ్రణివలనన్=ఆమృగమువలన, యతి = విశ్వామిత్రుఁడు, మంజులగతిన్=మంచి నడవడిని, వీడ్కొని = విడిచి, రాజి...వృత్తిన్ - రాజిల్లుచుండు, బలవద్రాగానువృత్తి=అధికమైన మాత్సర్యానువర్తనమును, ('రాగోఽనురాగేమాత్సర్యే' అమ.) భజియించి = చెంది.

నల. అలతిర్యగన్వయాగ్రణివలనన్=ఆ హంసముచేత, అశేషంబున్, తెలిసి, అతిమంజులగతిన్=సత్క్రియముచేత, వీడ్కొని = అనిచి, రాజు = నలుఁడు, కర్త. ముందటి పద్యములో నిల్చెనను క్రియతో నన్వయించును. ఇలు = ఇల్లు, బలవద్రాగానువృత్తిన్ - బలవత్ = అధికమైన, రాగానువృత్తిన్=దమయంతి యందలి యనురాగముచేత, భజియించి = ప్రవేశించి, ఇల్లుఁ జేరి యనుట.

గీ. భావమునసురజ్యేష్ఠసభాజనద్వి
జాద్భుతప్రదసమయవాక్యములు నిల్చె
నయమహిమ నప్పుడు తన్మహాశయనిపీడ
నప్రయతనాతివాంఛితోన్నతి వహించి. 60

టీక. హారి. సుర...వాక్యములు-సురజ్యేష్ఠ = ఇంద్రునియొక్క, సభాజనులైన, ద్విజులకు, అద్భుతప్రదములైన, సమయవాక్యములు=ప్రతిజ్ఞావచనములు ('సమయః కాలసిద్ధాంత ప్రతిజ్ఞాశపథేషుచ' నానా.) నిల్చెనయన్ (నిల్చు+ఎనయున్) = నిల్చియుండఁగా, మహిమచేత, అపుడు తన్మ...న్నతిన్-తత్ = ఆహరిశ్చంద్రునియొక్క, మహాత్ = అధికమైన, ఆశయనిపీడన = హృదయపీడనముయొక్క, ప్రయతన = ప్రయత్నమందలి, అతివాంఛితముయొక్క, ఉన్నతిని, వహించి.

నల. భావమునన్=మనస్సున, సుర...వాక్యములన్-సురజ్యేష్ఠ=బ్రహ్మయొక్క, భాజన=ఆనందముగల ('ఆనందనసభాజనే' అమ.) ద్విజ=హంసముయొక్క, అద్భుతప్రదములైన, సమయ (సమ్యక్+అయ.) = సమ్యక్శుభావహములైన, ('అయశ్శుభావహోవిధిః' అమ.) వాక్యములతో, నిల్చెన్, (మనస్సున నిల్చె ననుట.) ఇటనుండి దమయంతీవిరహవర్ణనము. నయమహిమన్, అపుడు=ఆసమయమున, తన్మ...యత - తత్=ఆనలునియొక్క, శయనిపీడన=పాణిగ్రహణమందు,('పంచశాఖ శ్శయః పాణిః' 'ఉపయామః పాణిపీడనమ్' అమ.) ప్రయత = నియతమైనది; ('యతౌతుబంధని యతా' అమ.) నాతి=దమయంతి, ఇది కర్త, వాంఛితోన్నతిని, వహించి.

సీ. సుకరాబ్జమైత్రి విశోభమానములైన
వదనకాంతులు వింతవగలు దెలుపఁ
[1]తళుకుఁగ్రొంగంటిచూపుల కోపులకుఁ గువ
లయము నలప్రాయ మయితనర్ప
సుకుమారబాహువల్లికలు మృణాళనా
ళమతల్లికాభరణములు గాఁగ
ముక్తాస్రగురుకుచంబులు నిర్మలఝరీప
రీతగోత్రగిరీశరీతి నెనయ
గీ. నలరు పులకండమొలుకు చిల్కలపలుకుల
కళుకులసమానభావసంగతి వహించి
తనరు మాతంగకుంభసుస్తనుల జోడు
దటియఁ జాల దురాగతత్వమునఁ జేసి. 61

టీక. హరి. సు...మానములు-సు = తెల్లనైన, కర = కిరణములుగల, అబ్జ = చంద్రునితోడి, మైత్రి=చెలిమిచేత, విశోభమానములు = మిగులఁ బ్రకాశించునవి, ఐన, వదనకాంతులు వింత వగలను, తెలుపన్ = తెలియఁజేయఁగా నని యన్వయము. కువలయము=కలువ, నలప్రాయము = తృణమువంటిది. ('నలః పోటగళే రాజవిశేషే కపినాయకే.' నానా.) మృణాళ...భరణములు - మృణా...మతల్లికా = శ్రేష్ఠమైన తామరతూఁడులయొక్క, భరణములు = పోషణములుగలవి. తామరతూఁడుల నతిశయించిన వనుట. ముక్తా...చంబులు-ముక్తాస్రక్ = ముత్యాలహారములచేత, ఉరు= గొప్పవైన, కుచంబులు, నిర్మ...రీతిన్ - నిర్మలములైన, ఝరీ = సెలయేళ్లచేత, పరీత = చుట్టుకొనఁబడిన, గోత్రగిరీశరీతిన్ = కులపర్వతశ్రేష్ఠముల తీరున, పులకండము + ఒలుకు = చక్కెర మెక్కెడు; చిల్కపల్కుల కళుకు (చిల్కపల్కుల+కళుకు)=శుకవాక్యాతిశయమున, అస...సంగతిన్-అసమానమగు = ఒప్పుచుండెడు, భావ = శృంగారచేష్టలయొక్క, సం+గతిన్ = సమ్యగ్గతిచే, వహించి, తనరెడు, మాతంగకుంభసుస్తనులన్=చండాలస్త్రీలను, ('మాతంగః కరిచండాలౌ' నానా.) జోడు దటియన్ =జోడుకూడి యుండునట్లు, దురాగతత్వమున్=దుష్టత్వము చేత, చేసి=సృజించి.

నల. సు...మానములు-సు=తెల్లనైన; కరాబ్జ=హస్తకమలముతో, మైత్రి = స్నేహముచేత, విశోభమానములు, ఐన, వదనకాంతులు; వింతవగరు = వింతలైన విచారములను, తెలుపఁగా, (చింతాక్రాంతలై చెక్కిటఁ జేయిఁజేర్చికొని యున్న దనుట.) కువలయము = భూమండలము. నలప్రాయము = నలమహారాజస్వరూపము,

మృణా...భరణములు, మృణాళ...తల్లివలె, ఆభరణములు = ఆభరణములుగాఁ గలవి, (శైత్యముకొఱకు తామరతూఁడు దండలను ధరించిన దనుట), ముక్తా...కుచంబులు-ముక్త=(కనులనుండి విడువఁబడి) జాఱుచున్న, అస్ర=కన్నీళ్లుగల ('రోదనం చాస్ర మశ్రు చ' అమ.) గురుకుచంబులు, పుల...కలుకుల - పులకండ్లయొలుకు, చిల్కల యొక్క, పలుకులవంటి పలుకులుగల, కలుకులన్ = స్త్రీలను, సమానభావసంగతిని, సమానభావ = సాదృశ్యభావముయొక్క; సంగతిని, వహించి, తనరు = ఒప్పునట్టి, మాతంగకుంభ... స్తనులన్-మాతంగకుంభ = గజకుంభములతీరున, సు = బాగైన, స్తనులన్ = చన్నులుఁ గలవారిని (కలుకులకు విశేషణము) జోడుదవిలియుఁజాలదు = జోడుగూడ కెఱుచును, రాగతత్త్వమునఁజేసి = నలునియందలి యనురాగస్థితిచేత, విరహిణిగాన చిలుకపలుకులవంటి పలుకులుగల తనచెలులతో జోడుగూడి యుండ కెఱుచు నని యన్వయము.

గీ. వెలయఁ గమలోద్భవునినారి వేఁడి నీల
కంఠసతి వేఁడియు ననూనగానలాస్య
మాధురీవిభ్రమంబులు మట్టుపఱుప
నొనరి రతి [1] వలితాత్మజాత్యుచ్ఛ్రియమున. 62

టీక. హారి. కమలోద్భవునినారిన్=సరస్వతిని, వేఁడి = ప్రార్థించి, నీలకంఠసతిన్ = పార్వతీదేవిని, వేఁడియు, అనూనగానలాస్యమాధురీవిభ్రమంబులు, మట్టుపఱుపన్=కుదురుపఱుపఁగా (నేర్పఁగా ననుట.) అతివలు=మతంగస్త్రీలు, ఇతా... యమున-ఇత = పొందఁబడిన, ఆత్మజాతి = స్వజాతియందలి (చండాలజాతియందలి) ఉచ్ఛ్రియమునన్ = ఔన్నత్యముచేత, ఒనరి రని యన్వయము.

నల. కమ...వేఁడి-కమలోద్భవుని = మన్మథునియొక్క, నారి = అల్లెత్రాటియొక్క, వేఁడిమి, తుమ్మెదలయొక్క విజృంభణ మనుట. నీలకంఠసతివేఁడియు-నీలకంఠసతి=ఆఁడు నెమళులయొక్క, వేఁడిమియు, అనూన...మంబులు-అనూనములైన గానముయొక్కయు, లాస్య=నృత్యముయొక్కయు, మాధురీ=మాధుర్యముయొక్క, విభ్రమంబులు = విలాసంబులను, మట్టుపఱుపన్ = తగ్గింపఁగా, రతి...యమునన్-రతి=నలునియందలి రతితోడ (సంభోగాభిలాషతోడ ననుట.) వలిత=కూడుకొనిన, ఆత్మ హృదయమునందు, జ = పుట్టిన, అత్యుచ్ఛ్రియమున ఒనరి యని యన్వయము.

ఉ. ఆరమణీలలామ లసితాత్మసముద్భవహేతిదీపితా
కార నిబంధబంధురతఁ గైకొనఁ దాల్చు వెలందిము త్తైవుం

1. పఠిత.

జేరులు నీలహారములపెంపు వహించు మహాద్వితీయ శృం
గారరసైకబీజ మతిగౌరవదాన ధురంధరంబులై. 63

టీక. హరి. ఆరమణీలలామలు, అసి...బంధురతల్-అసిత=నల్లనైన, ఆత్మసముద్భవ = మన్మథునియొక్క, హేతి = ఖడ్గమువలె, దీపిత=దీప్తములైన, ఆకారముల యొక్క, నిబంధ=సంబంధముయొక్క, బంధురతల్=గౌరవమును, కైకొనల్=పుచ్చుకొనునట్లు, తాల్చు...జేరులు-తాల్చు = ధరియించిన, వెలందిమాత్తెపుంజేరులు = నిర్మలములైన ముత్తెపుదండలు, నీలహారముల పెంపుల్ = నీలంపుసరముల యొప్పును, మహా...రంబులు-మహాత్, అద్వితీయ=ఈడులేని, శృంగార రసైకబీజ = శృంగార రసముయొక్క ముఖ్య బీజములనియెడు, మతి = బుద్ధియొక్క, గౌరవమును, దాన = ఇచ్చుటయందు, ధురంధరంబులు, ఐ, (నీలహారముల పెంపును) వహించు నని యన్వయము.

శృంగారరసము నలు పనుటకు రసాకరణమున
"సీ. శృంగార ముత్పలాంచితము విష్ణుఁడు రాజు
తెలుపు హాస్యము గణాధిపుఁడు భర్త" యని యున్నది.

నల. ఆరమణీలలామ=ఆస్త్రీరత్నమైన దమయంతి, అసితా...బంధురతల్ - అసిత=ప్రకాశమానమైన, ఆత్మసముద్భవహేతి = మన్మథాగ్ని జ్వాలలచేత, దీపిత = తప్తమైన, ఆకారముయొక్క, నిబంధబంధురతల్, కైకొనల్, తాల్చు=ధరించిన... తక్కుంగల భాగము పైయర్థము తీరుననే యన్వయించునది.

క. అత్తఱి ననుభావము చిగు
రొత్తఁగ నానవ్యవిప్రయోగిని రూఢిన్
చిత్తమునఁ బొదలు బెడిదవుఁ
దత్తరమునఁ జెంత నున్న తరుణులఁ బలికెన్. 64

టీక. హరి. ఆనవ్యవిప్రయోగి=ఆనూతన బ్రహ్మర్షి, అనఁగా విశ్వామిత్రుఁడు, తక్కినది సమము.

నల. ఆన...గిని-ఆ, నవ్య=నుతింపఁదగినను, విప్రయోగిని = విరహాతురయగు దమయంతి. తక్కినది సమము.

ఉ. మీశుకశారికామృదుసమీరణదూమణభామణంబులున్
మీశిశిరప్రయోగమహనీయచమత్కరణప్రబంధముల్
మీశఫరధ్వజావహనలీలలు చాలు జగద్వశీక్రియా
కౌశలశిక్షకున్ ధరణికాంతుని మన్వశుఁ జేయుఁ డెంతయున్. 65

టీక. హరి. మీశుక...గానంబులన్-మీయొక్క, శుకశారికలయొక్క, మృదువులైన, సమ్=లెస్సయైన, ఈరణ = వాక్యములయొక్క, దూషణ = నిందగల, భాషణంబులన్=మాటలను, (కీరశారికలధ్వనులఁ దిరస్కరించువాక్యము లనుట.) మీశిశిర...బంధముల్-మీయొక్క, శిశిర=శీతలమైన, ప్రయోగముచేత; మహనీయములైన, చమత్కరణ=చమత్కారముగల, ప్రబంధముల్=కైవారమందలి ఏలాదిగీతప్రబంధములును, మీ...లీలలు-మీయొక్క; శఫరధ్వజ=మన్మథుని, ఆవహింపఁజేసెడు, లీలలు=విలాసములును, (మన్మథోద్దీపకములగు విలాసము లనుట.) జగ...శిక్షకుల్ - జగత్ = జగజ్జనులయొక్క, వశీక్రియా=వశీకరణమందలి, కౌశలమయొక్క, శిక్షకు చాలును=సమర్థములగును, సమస్త జనులను వశవర్తులఁజేసికొనఁ జాలిన వనుట. ధరణీకాంతునిన్=హరిశ్చంద్రుని, మద్వశున్ = నాకు లోఁబడినవానిని (గా), చేయుఁడు.

నల. మీశు...గానంబులన్-మీయొక్క, శుకములయొక్కయు, శారికా=గోరవంకలయొక్కయు, మృదుసమీరణ=మలయమారుతముయొక్కయు, దూషణభాషణంబును, ఉపాలంభవాక్యము లనుట; మాశి...బంధముల్-మీయొక్క, శిశిరప్రయోగ=శీతలవస్తుప్రయోగమునందలి మహనీయములైన చమత్కరణ ప్రబంధములును, శైత్యోపచారములనుట, శఫరధ్వజావహనలీలలు=మన్మథపూజావిధానములును, చాలున్=వలదు. జగద్వశీ...శిక్షకుల్-జగత్ = జగత్తుయొక్క; వశీక్రియా=వశీకరణమందు, కౌశలశిక్షకుఁడైనవానిని, ధరణీకాంతుని=నలుని, మద్వశున్, చేయుఁడు.

గీ. అలయ దూరస్థితు నృపాలు నసమబుద్ధిఁ
దవిలి తగనికోర్కులు గోరి తివిరి మొగ్గ
గసికలకుఁ జాల నగ్గమై యొసఁగ నతని
యుక్తి సాధింపుఁ డని పంప నువిద లరిగి. 66

టీక. హరి. అల=ఆ, అదూరస్థితున్=సమీపముననుండు, నృపాలున్=హరిశ్చంద్రుని, అసమబుద్ధిన్=విషమబుద్ధిగలవానిని, తవిలి=తగులుకొని, తగనికోర్కులు కోరి, తివిరి=పూని, మొగ్గగసికలకు (మదనబాణముల కనుట.) అగ్గమై = లోఁబడి, ఎసఁగన్=ఒప్పునట్లు, అతనియుక్తి=అతనిపొందును (సంభోగముననుట.) సాధింపుఁడు.

నల. దూరస్థితున్, నృపాలున్=నలుని, అసమబుద్ధిన్=విషమబుద్ధిచేత, (వివేకములేక యనుట.) తవిలి = అభిలషించి, విరిమొగ్గగసికలకున్ = పూములుకులకు, అగ్గమై=లోనై, అలయన్ = అలఁతఁజెందుటకు, తగనికోర్కులుకోరితిని. అతని = ఆనలుని, యుక్తిన్ = మీయుపాయముచేత, సాధింపుఁడు,

క. ధృతిఁ దద్గురునయనిధిఁ గని
నుతిపరసురభీ! మహితమనోజ్ఞ! యయోధ్యాం

చితధామ! కీర్తివిభవా
న్విత! విను మాకన్నపా టని యథార్హగతిన్. 67

టీక. హారి. తద్గుణ[illegible]ంబుధిన్, కన్ = ఆ, మిత = అధికమైన, నయ = నీతి, నిధిన్ = స్థానమైన హరిశ్చంద్రుని; కని = చూచి, నుతిపరసురభీ! = స్తోత్రము చేయువారలకుఁ గామధేను వైనవాఁడా! (కామధేనువువలె నిష్టార్థప్రదుఁ డనుట.) మహితమనోజ్ఞ! = పూజ్యులకు, మనోహరుఁడ వైనవాఁడా! అయోధ్యాంచితధామ! అయోధ్యాపురి, అంచితమైన, ధామ = వాసస్థానముగాఁ గలవాఁడా! కీర్తివిభవాన్విత = యశో వైభవముతోఁ గూడుకొనినవాఁడా! ఈనాల్గుపదములును హరిశ్చంద్రునికి సంబోధనలు. మాకన్నపాట = మానూతనగీతమును, విను = ఆకర్ణింపుము. అని యథార్హగతిన్ = తగిన తీరున.

నల. అయఃనిధిన్ = భాగ్యనిధానమగు, తద్గురున్ = ఆదమయంతితండ్రిని, కని = చూచి, నుతిపరసుర! = స్తోత్రము చేయుచున్న దేవతలు గలవాఁడా! భీమ! = భీముఁ డను వాఁడా!, హితమనోజ్ఞ = హితులకు మనోహరుఁడైన వాఁడా!, అయోధ్యాంచితధామ! అయోధ్య (యోద్ధుమశక్యా) = యుద్ధముచేయ శక్యముగాని, అంచితమైన, ధామ = ప్రతాపముగలవాఁడా!, కీర్తివిభవాన్విత! ఈయైదును భీమునికి సంబోధనలు. కన్నపాటు = దమయంతియవస్థ, వినుమా! అని యథార్హగతిన్.

సీ. పొలుపొంద నలగుణంబులపై శ్రుతు ల్గూర్చి
సారెఁ దన్మేళప్రకార మరసి
యుచితరాగవ్యాప్తి నొనరించి యుజ్జ్వల
స్థాయిసంచారి సాంద్రత భజించి
శీతలాలంకారజాతము ల్పవరించి
నిరుపమ స్వరకంప గరిమ నెఱపి
ప్రకటిత పంచమ విశ్రుతకాకల్యంత
రములచే నలఘుమూర్ఛనలు పూని
గీ. క్రమమునఁ దదంకరూపక గ్రహవిచిత్ర
విరచనంబుల మెచ్చులు విస్తరించి
వాఙ్మనోదూరగతిఁ గాంచు వల్లకీ ని
నాదదశ లెల్ల వినిపించి రాదరమున. 68

టీ. హారి. పొలుపొందన్ = ఒప్పుగునట్లు; అలగుణంబులపైన్ = అతంత్రులమీఁద, శ్రుతుల్; కూర్చి, తన్మేళప్రకారము-తత్ = శ్రుతులయొక్క, మేళప్రకారము, ఉచి... వ్యాప్తిన్ - ఉచిత = సమయోచితమైన, రాగ = నాటాదిరాగములయొక్క, వ్యాప్తిని,

ఒనరించి=చేసి, ఉజ్జ్వ...సాంద్రత-ఉజ్జ్వలమైన, స్థాయి=స్థాయితానములయొక్కయు, సంచారి=సంచారితానములయొక్కయు, సాంద్రత, భజించి, శీత...ముల్-శీతలమైన, అలంకారజాతముల్=ధ్రువాద్యలంకారములయొక్క సమూహములు, నిరు...గరిమ-నిరుపమైన, స్వరకంపముయొక్క, గరిమ, సెలపి, ప్రక...ములచేఁ-ప్రకటితమైన, పంచమస్వరము కలిగి, వికృతములైన, కాకల్యంతరములచే=నిషాదాది స్వరాంతరములచేత, అలఘువులైన, మూర్ఛనలు=షడ్జాదిగ్రామమూర్ఛనలు, తదంక...విరచనంబులన్-తత్=ఆహారిశ్చంద్రునియొక్క, అంక=బిరుదులను, రూపక = నిరూపించెడువానియొక్క, (హారిశ్చంద్రుని బిరుదుప్రబంధములయొక్క యనుట.) గ్రహ=అతీతానాగతసమరూపములైన తాళగ్రహములయొక్కయు, విచిత్ర=మార్గభేదరూపమైన విచిత్రరీతులయొక్కయు, విరచనంబులను, మెచ్చులు, విస్తరించి, వల్లకీనినాదదశలు, వల్లకీ=వీణయొక్క, నినాద=రవముయొక్క, దశలు=భేదములు, వినిపించిరి. ఇట గ్రంథవిస్తరభీతిచే విడువఁబడినది. సంగీతలక్షణంబుల, "సంగీతరత్నాకరంబునం" జూడఁదగినది.

నల. పొలుపొందఁగ, నలగుణంబులపైఁ, శ్రుతుల్=చెవులు,కూర్చి=చేర్చి, (నలుని గుణములను విని యనుట.) తన్మేళప్రకారము=అనలునిసంగమప్రకారము, ఉచిత...వ్యాప్తిఁ-ఉచితమైన, రాగ=అనురాగముయొక్క, వ్యాప్తిని,ఉజ్జ్వల...సాంద్రత-ఉజ్జ్వలములైన, స్థాయి=రత్యాదిస్థాయీభావములయొక్కయు, సంచారి=నిర్వేదాదులైన సంచారి భావములయొక్కయు, సాంద్రతఁ=మేదురత్వమును, భజించి=పొంది, శీత...ముల్-శీతలములైన, అలంకారజాతముల్ = చందనాద్యలంకారసామగ్రులను, సవరించి=అలంకరించుకొని, నిరు...గరిమ-నిరుపమ=జోడులేని, స్వరమునందు, కంపగరిమ=గాఢద్యాతిశయమును, ప్రక...ములచే-ప్రకటితమైన, పంచమ (స్వరముగల) వి=(కోయిలలుమున్నగు) పక్షులచేత, కృత = చేయఁబడిన, కాకల్యంతరములచేఁ = అవ్యక్తమధురమైన ధ్వనిభేదములచేత, అలఘుమూర్ఛనలు=పెనుసొమ్మలు, తదంక...రచనంబుల-తత్=ఆనలునియొక్క,అంక=గుఱుతులుగల,రూపక=స్వరూపముయొక్క, గ్రహ=గ్రహణములచేత,వి=విశేషమైన, (మేలైన యనుట.)చిత్ర=చిత్తరువుయొక్క, విరచనములయందు, మెచ్చులు, విస్తరించి=విస్తరిల్లఁజేసి, వాఙ్మనోదూర=అవాఙ్మానసగోచరమైన, గతిఁ=రీతిని, కాంచు...దశలు-కాంచు=పొందిన, వల్లకీనినాద=వీణాధ్వనివంటివాణిగల దమయంతియొక్క, దశలు = అవస్థలు, ఎల్లఁ = అన్నియును, అదరమునఁ, వినిపించిరి=విన్నవించిరి (తెలియఁజెప్పిరనుట.)

క. నరపతియుఁ దన్మహోచిత

వరసముదిత రాగవైభవంబులకు మదిఁ

కర మలరి దివ్యవసనా
భరణాద్యభిమతము లొసఁగి పడఁతుల ననిచెన్. 69

టీక. హరి. నరపతియున్=హరిశ్చంద్రుఁడును, తన్మ... వైభవంబునకు-తత్=ఆ, మహోచితములై, వర=శ్రేష్ఠములై, సముదిత=అభ్యుదితములైన, రాగముల యొక్క, వైభవంబులకు.

నల. నరపతియున్=భీముఁడును, తన్మ...బునకు-తత్=ఆదమయంతి యొక్క, మహోచితమైన, వర=నాయకునియందు, సముదిత=ఉదయించిన, రాగ=అనురాగము యొక్క, వైభవంబులకు, తక్కినది రెండర్థములకు సమానము.

గీ. కౌశలమున ని ట్లనిచి నలేశబుద్ధి
నందనాదరకలనఁ బెంపొందఁ జేయు
చవనిపతి మహావైభవ వ్యంజనస్వ
యంవరణ సంభ్రమము ప్రౌఢి ననువుపఱుప. 70

టీక. హరి. అనిచినన్=పంపఁగా, లేశబుద్ధిన్=అల్పబుద్ధిచేత, అంను = ఆయిచ్చిన యాభరణములయందు, అనాదరకలన = నిర్లక్ష్యభావమును, పెంపొందన్, చేయుచు, అవని...సంభ్రమమున్-అవనిపతి=రాజగు హరిశ్చంద్రుని యొక్క మహావైభవమునకు, వ్యంజక=చిహ్నమైన ఛత్రము యొక్క, ('వ్యంజనం లాంఛనే శ్మశ్రు నిష్ఠానావయవే ష్వపి' అమ.) స్వయంవరణ=తామకోరుటయందైన, సంభ్రమము, ప్రౌఢిన్=సామర్థ్యమును, అనువుపఱుపన్, గొడుగు నడుగుటయందైన సంభ్రమము, తమకుఁ బ్రౌఢిం బుట్టింపఁగా ననుట.

నల. అనిచి, నలేశ...కలనన్-నలేశ=నలమహారాజునందలి, బుద్ధిగల; నందనా=కుమారితయగు దమయంతియందలి ఆదరకలనను, అవనిపతి = భీముఁడు, మహా...సంభ్రమమున్-మహావైభము యొక్క, వ్యంజన=చిహ్నములుగల, స్వయంవరణ = స్వయంవరము యొక్క, సంభ్రమమును; అనువుపఱుపఁగా, సంభ్రమము అచేతనద్వితీయలక్షణముక. "జంగమ పదములు..." (ఆంధ్రభాషాభూషణము.)

చ. శరనిధి వేష్టితాఖిల రసావలయంబున సుప్రసిద్ధులౌ
తరుణులు రూపదర్పములు దాల్చినరాజులు స్రుక్కి త్రోసిన
ట్లరిగిరి జిష్ణుశౌర్యుఁ డగు నన్నరపాలుని పీఠికాతత
స్ఫురదనురక్తిఁ దెల్పు పలుసొంపులతో ననిరుద్ధతోన్నతిన్. 71

టీక. హరి. శర...యంబునన్-శరనిధి=సముద్రముచేత, వేష్టిత=చుట్టఁబడిన, అఖిలరసావలయంబునన్ = సకల భూమండలమున; సుప్రసిద్ధులు = మిక్కిలిప్రసిద్ధి

కెక్కి-నతరుణులు = యువతులు; (విశ్వామిత్రునిచే సృజింపఁబడుటవలనఁ బ్రసిద్ధిఁ గాంచినవారనుట.) నరాజులు=కత్తులఁ, రూపదర్పములు తాల్చి, త్రుక్కి = గ్రుచ్చి, త్రోసినట్లు=పడఁద్రోసినరీతిని, (కత్తులఁ గ్రుమ్మి పడఁద్రోసినరీతి ననుట.)అరి...పాలుని- అరిగిరి = పర్వతములవంటి శత్రులకు, జిష్ణుశౌర్యుఁడు = ఇంద్రునియొక్క శౌర్యము వంటి శౌర్యము గలవాఁడు అగు, అన్నరపాలుని=అహరిశ్చంద్రునికి వీటికా...రక్తిఁగా- వీటికా=తాంబూలముచేత;తత=విస్తారమై.స్ఫురత్ =ప్రకాశింపుచున్న,అనురక్తిఁగా= రక్తిమను, తెల్పు=తెలియఁజేసెడు, పలుసొంపులతోఁగా=దంతసౌందర్యములతో, ఉద్ధతోన్నతిఁగా=ఉద్ధతమైనరీతిచేత. అనరపాలునిగూర్చి అనిరి అని యన్వయము.

నల. తరుణులు=యువకులు ('వయస్థస్తరుణోయువా' అమ.) రూపదర్పములు తాల్చినరాజులు,త్రుక్కి త్రోసినట్లు=(ఎడము లేకుండునట్లుగా ననుట.)అరిగిరి=పోయిరి. జిష్ణుశౌర్యుఁడగు, అన్నరపాలుని=అభీమునియొక్క,వీటికిఁగా=పట్టణమునకు, (కుండిన పురికనుట.) అతత...రక్తిఁగా-అతత=విస్తారము, స్ఫురత్ =ప్రకాశించుచుండెడు,అను రక్తిఁగా=అనురాగమును, తెల్పు=తెలియఁజేయు, పలుసొంపులతోఁగా=వివిధములగు సోయగములతో, అనిరుద్ధతోన్నతిఁగా=అడ్డులేనియౌన్నత్యముతో;అరిగి రని యన్వయము.

సీ. అడర ననంతరత్నార్చు లూర్పులవెల్లిఁ
గలఁగి విభ్రాంతి మద్విలసితాప
ఘనములు రక్షాళికాసక్తి మానవు
త్సేవతావకమణిదీపితాత
పత్రరాజముల సత్ప్రొఢి మన్నింపఁగఁ
దగు ననఁగ నితాంతతప్తహృదయ
గాఢచింతావ్యాప్తిఁ గదిసి రసాధార
ణప్రభావవిశేష నాగభర్త
గీ. లలివి నీలాలకలయందుఁ దలఁప నిక్కి
యమరసంప్రార్థనీయమహార్హవిభవ
లక్షణాకలితాత్మ లౌలలన లుచ్చ
వింపుదురె యంచు సారెకు వెఱఁగుపడుచు. 72

టీక. హరి. అనంతరత్నార్చులు-అనంతరత్న=సూర్యునియొక్క,అర్చులు=కాంతులు, అడరఁగా (ఎండగాయఁగా ననుట.)ఊర్పులవెల్లిఁగా=నిట్టూర్పుగమిచేత,కలఁగి, విభ్రాంతిఁగా=సంచలనముచేత,మద్వి...ములు-మత్ =నాయొక్క,విలసితమునైన,అపఘ నములు=అంగములు.('అంగంప్రతీకో௨వయవో'అమ.)('ప్రత్యయోత్తరపదయోశ్చ'

అనువ్యా. సూ. చేత నస్మచ్ఛబ్దమునకు 'మత్' అను నాదేశ మేకత్వమునకే విధింపఁబడి యున్నను నిట బహుత్వమునఁ బ్రయోగింపఁబడియె. ఇందునకుఁ బ్రయోగము:—

"మ. సకలాశాగతి నర్మకోపవిరతిశ్రోత్రక్రియారంభణా
  త్మకపర్ణత్రయికిన్ మరుచ్చరిత శబ్దజ్ఞానమే మూల మిం
  తకుఁ బోలన్ వినుఁ డంచుఁ జెల్వుగతిఁ జెంతన్ గొండపైపల్లెలన్
  కృకవాకు ల్మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్." (మనుచరి.)

('స్త్రీరుగ్రుజాచోప తాపరోగవ్యాధి గదామయాః,' అమ.) రుక్పాళికౌసక్తిన్. రుక్=ఉపతాపముయొక్క, పాళికా=సమూహముయొక్క, సక్తిన్ = పొందుటను, మానవు=విడువవు. (ఎండసోఁకుడుచేత, శరీరములు బాధనొందుచున్న వనుట) దేవ! (ఇది సంబోధనము). తావక...రాజమున్-తావక = నీసంబంధమైన, మణిదీపిత=రత్నమండితమైన, ఆతపత్రరాజమున్=శ్రేష్ఠమైనగొడుగును, అసత్ప్రీతి చేత, మన్నింపందగున్, ఈయవలయు ననుట. అనంగన్ = ఇట్లుచెప్పఁగా, నితాంత...చింతావ్యాప్తిని-కదిసి = చెంది, రసా...భర్త-రసా = భూమియొక్క, ధారణ = ధరించుటయందైన, ప్రభావవిశేషమున, నాగభర్త = ఆదిశేషు వైన హరిశ్చంద్రుఁడు, ఈకర్తకు ముందరిపద్యములోని 'అనియె' నను క్రియతో నన్వయము. అరిన్=ప్రేమతో, వినీలాలకలయందున్=స్త్రీలయందు, అమరసంప్రార్థనీయమై, మహార్హమైన, విభవలక్షణ = వైభవచిహ్నమందు (అనఁగా: మహారాజార్హమైన దనుట.) ఆకలిత=ఉంచఁబడిన, ఆత్మ=మనస్సుగలవారు, ఔ, అగు: అలనలు ఉద్భవింపుదురే, అంచున్,సారెకున్=మాటిమాటికి, వెఱఁగుపడుచున్=ఆశ్చర్యమునొందుచు—'రసాధారణప్రభావవిశేషనాగభర్త' అను విశేషణము. విశేష్యద్యోతకము. లక్షణము. 'విశేషమాత్రప్రయోగో విశేష్య ప్రతిపత్తౌ' (వామనసూత్రము.) ప్రయోగము—

"నిధానగర్భా మివ సాగరాంబరాం శమీ మివాభ్యంతర లీల పావకామ్, నదీ మివాంతస్సలిలాం సరస్వతీం నృపస్య సత్త్వామహిషీ మమన్యత" (రఘువంశము.)

నల. అనంతరత్నార్చులు, అనంతమూలైన, రత్న = ఫణారత్నములయొక్క, అర్చులు=కాంతులు, ఆడరన్ గా, ఊర్పులవెల్లిన్=పూత్కారపరంపరలచేత,కలఁగి= కలఁగఁబాఱి, విభ్రా...ములు-విభ్రాంతిమత్=విభ్రాంతిగల (చలించుచున్న యనుట.) విలసిత=ప్రకాశించుచుండెడు ఉదకముగల, ఘనములు = మేఘములు, ('ఋత్వార ణ్భాగపథామాన క్షే' అనువ్యా. సూ. చేత, 'అ' ప్రత్యయము విధింపఁగా 'విలసితాప' యను నకారాంత రూపము నిష్పన్నము. రుక్పాళికాసక్తిన్. రుక్పాళికా=కాంతి పుంజముయొక్క, సక్తిన్=సంగతిచేత, మానవు...సత్ప్రీతిన్ - మానవు (మాను+అవు.) = ఒప్పగు, ఇట 'క్వచి ద్గకారోవః' అను నాంధ్రశబ్దచింతామణిసూత్రముచే 'మానగు'అను పదములోని'గకారము'వకారమైనది. దేవతా=సురలకు, అవక=రక్షకుఁ

డైన యింద్రుని యొక్క, మణి=మణులచేత, (ఇంద్రనీలములచేతననుట.) దీపితమ్ములైన, ఆతపత్రరాజముల=గొడుగులయొక్క, సత్పంక్తిని, మన్నింపఁగా,(ఒసఁగఁగాననుట. మేఘములు ప్రాకారవాయువులచే, చెల్లాచెదరై ఇంద్రనీలంపుగొడుగులవలెఁ దమ పైభాగమునకురాఁగా ననుట.) తగు...వ్యాప్తిన్-తగు=తగిన, అనంగ=మదనునిచేత, నితాంత=మిక్కిలితప్తములైన, హృదయములయందు, గాఢమైన (అధికమైనయనుట.) చింతయొక్క, వ్యాప్తిచేత,(దమయంతీవివాహచింతాప్రాప్తిచేననుట.)అసా...భర్తలు-అసాధారణమైన, ప్రభావవిశేష=సామర్థ్యముచే, అధికులైన, నాగభర్తలు=వాసుకి ప్రముఖులు, అమర...తాత్ములు-అమర=దేవతలచేత, సంప్రార్థనీయ=కోరఁదగిన, మహార్హా=శ్రేష్ఠమైన, వైభవలక్షణ=వైభవలక్షణములతో, ఆకలిత=కూడుకొనిన, ఆత్ములు=దేహములుగలవారు, ఔ=అగు, (అనఁగ దేవతలు కాంక్షింపఁదగిన సౌందర్యము గలవారనుట.) అలినీలాలకలయందున్=స్త్రీలయందు, (మానవజాతిస్త్రీలయందనుట) ఉద్భవింపుదురె = పుట్టుదురా! అంచు, వెఱఁగుపడుచున్=ఆశ్చర్యమునొందుచు, (కదిసిరని పూర్వమున కన్వయము.)

గీ. వారిఁ గనుఁగొని యీనృపాన్వయలలామ
మీ రతిమనోజ్ఞశుభమూల మెట్టివారు
ధరణిఁ గోరరు మఱియుఁ బ్రార్థ్యంబు గలదె?
యనిరొ జనకోటి నుతి మీఱ నాక్షణమున. 73

టీక. హరి. వారిన్ = ఆమతంగస్త్రీలను, కనుఁగొని, ఈనృపాన్వయలలామమున్=నృపకులచిహ్నమును, అతి...మూలములను-అతిమనోజ్ఞ = మిగులమనోహరమైన, శుభమునకు మూలమును, ఐనదానిని (ఐనఛత్రము ననుట) ఈరు = ఒసంగరు. (ధరణిన్.)ఎట్టివారు, కోరరు = అడుగరు. మఱియున్, (గొడుగు దక్క నేవైన ననుట.) ప్రార్థనీయంబు = కోరఁదగినది, కలదె? = ఉన్నదా, (ఛత్రముదక్క నింక నెద్దానినైనఁ గోరుఁ డనుట.) అనిరొను.

నల. వారిన్=ఆవాసుకిమున్నగువారిని, కనుఁగొని, జనకోటి=జనసమూహము, కర్త. ఈనృపాన్వయలలామము (ను), ఈరతి మనోజ్ఞశుభమూలమును, ఎట్టివారు కోరరు? (ఇట్టియొప్పులకుప్ప యగు దమయంతి నెవ్వరు కోరకుందు రనుట.) మఱియుఁ బ్రార్థ్యంబు గలదె?=ఇంతకన్నఁ గోరఁదగిన దింకొక్కటి గలదా? (అనఁగా లే దనుట.) నుతిమీఱన్, అనిరొన్ (జనకోటి యనిరొ నని యన్వయము.)

మ. బలవద్వైఖరిఁ దత్పురం బనసి సంబంధాభిలాషంబుతో
నలఘుశ్రీఁ బచరించి రాఁ దరుణు లయ్యత్యంతజాతిప్రశ
స్తుల నీక్షించి యథోచితప్రదమనస్ఫూర్జత్తరాటోపలి
లల నొప్పించె మహార్థి యాతఁ డిల యెల్లన్ భీముఁ డౌనౌ ననన్. 74

టీక. హరి. తత్పురంబు, తత్ = ఆహరిశ్చంద్రుని యొక్క, పురంబు = పట్టణమును, ('గృహపరిగ్రహ దేహేషు నగరేచ పురంపురీ' నానా) ఏసి = కనిపించి, సంబంధాభిలాషంబుతోన్ = కలయిక యందలి ప్రేమంబుతో, అలఘుశ్రీన్, పచరించి = ప్రవర్తిల్లఁజేసి తరుణులు = (మదనంగ) స్త్రీలు, రాన్, (వైరము రాఁగా ననుట) అయ్య...స్తుతన్ - అ, అతి + అంతజాతి = అధికమైన కడజాతియందు (చండాలకులమున నని నట) ప్రశస్తుతన్ = ప్రసిద్ధిఁగాంచిన యాస్త్రీలను, యథో...లీలన్ - యథోచితమైన, ప్రదమన = కొల్లయిట యొక్క, సూక్ష్మ త్తరాటోపలీలలచేత, మహార్ధి = మహాభివృద్ధి గలవాఁడు, అతఁడు = అహరిశ్చంద్రుఁడు, భీముఁడు = భయంకరుఁడు, అట, ఔనౌనన్, లెస్సయనఁగాననుట.

నల. బలపద్వైఖరిన్, తత్పురంబు = అకుండిన పట్టణమును, ఏసి = చేసి, సంబంధాభిలాషంబుతోన్ = సంబంధము చేయవలయు ననుకోరికతో, తరుణులు = ప్రాయంపు రాజకుమారులు, అలఘుశ్రీన్, పచరించి. రాన్ = రాఁగా, అ + అత్యంత, జాతిప్రశస్తుల = వంశ ప్రసిద్ధులను, ఈక్షించి, యథో...లీలన్ - యథోచిత = (వారివారికిఁ) దగు వస్తువులను. ప్రద = ఇచ్చెడు; మనః = మనస్సు యొక్క. సూక్ష్మ త్తరాటోపలీలచేత, మహార్ధి, మహా = ఉత్సవము యొక్క, బుద్ధి = అభివృద్ధిగల, అతఁడు = భీముఁడు ఇల యెల్లన్, ఔనౌనన్ = మేలుమే అనఁగా, ఒప్పించెన్ = సమ్మతింపఁజేసెను (స్వయంవరార్థమేతెంచిన రాజపుత్త్రులకు వారివారికిం దగిన వస్తుచయము నొసంగి యుపచరించె ననుట.)

వ. అయ్యవసరంబున. 75

సీ. మనుజపకాండసంబంధసూత్రాహతిఁ
గరపల్లవాంగుళు ల్గంప మొంద
సముదితానంతశ్వాసనఘట్టనంబునఁ
బాణివీణాగుణ ప్రతతి మొరయఁ
దళుకొత్తునతిరోహితస్ఫూర్తిఁ గావివ
ట్టినయంబరంబులు దనరుచుండ
జడలు ఘనప్రభంజనకాలచరవలా
హకచంచలాకృతి ననుకరింప

గీ. నున్నమత్సరచింతామహోర్మి కలన
పర్వతావాప్తితోఁ దనపజ్జఁ జేరు
ముళ్ళయతివలమానవాఙ్ముఖరవృత్తిఁ
గడఁగి యఖిలంబు నెఱిఁగింపఁ గౌశికుండు. 76

టీక. హరి. మను...హతిన్ - మనుజప = హరిశ్చంద్రుని యొక్క కాండసంబంధ = అశ్వసంబంధమైన, ('కాండోఽస్త్రీదండబాణార్వవర్గావసరవారిషు' అమ.) సూత్రము

యొక్క=కళయొక్క, ఆహతిన్ = కొట్టుటచేత, కర...శులన్-కర = హస్తముల యొక్కయు, పత్ = పాదములయొక్కయు, లఘు=సూక్ష్మములైన, అంగుళుల్ = వ్రేళ్లు, సము...నంబునన్-సముదిత=పుట్టిన, అనంత=అపరిమితములైన, శ్వసన = నిట్టూర్పు వాయువుయొక్క, ఘట్టనముచేత, పాణివీణాగుణప్రతతి = చేతులయందలి వీణా తంత్రులసమూహము, తళుకొత్తు...స్ఫూర్తిన్-తళుకొత్తుచుండెడు, అతి = అత్యంత మైన, రోహిత=నెత్తురుయొక్క, స్ఫూర్తిచేత, అంబరములు=వస్త్రములు, (కట్టినపుట్ట ములు) ఘన...కృతిన్-ఘన = నిబిడములై, ప్రభంజనకాల = గాలికాలమునందు, చర=చరించుచున్న, వలాహక-మేఘములయొక్క, చంచలనమైన, ఆకృతిన్=ఆకార మును, ఉన్మి...కలనన్-ఉన్మిషత్=కనుపట్టినవై, పర = ఉత్కృష్టములైన, చింతా మహోర్మికల = మనోవిచారపరంపరలను, అపర్వతావాప్తితో - అపర్వత = ఉత్సవ రాహిత్యముయొక్క, ('పర్వగ్రంథౌపంచదశ్యాముత్సవేవిషువాదికే' నానా.) అ వాప్తితో, మాళ్లయాతివలు, (కలహార్థము నిర్మింపఁబడిన యాచండాలస్త్రీ లనుట) అమా...వృత్తి-అమాన=మితిలేని, ('మానంప్రమాణే ప్రస్థాదౌ' నానా.) వాఙ్ముఖరవృత్తిచేత, ఎఱిఁగింప, కౌశికుండు కర్త. (ముందటికన్వయము.)

నల. మను...హతిన్-మను=మంత్రములయొక్క, జపకాండ=జపసమూహము యొక్క, సంబంధముగల, సూత్రముయొక్క, (జపమాలికయొక్క యనుట.) ఆహతిన్= తాఁకుటచేత, సము...నంబునన్-సముదితమైన, అనంతశ్వసన = ఆకాశవాయువుల యొక్క ('అనంతంసురవర్త్మఖమ్' అమ.) ఘట్టనంబునన్ (అధికమైనసోఁకుడుచేత ననుట.) అతిరోహితస్ఫూర్తి-అతిరోహిత = మఱుఁగుపడని, స్ఫూర్తిచేత, ఘన... కృతిన్-ఘన=మేఘములయొక్క, ప్రభంజన = ప్రకృష్టమైన భంగముగల, కాల మందు, శరత్కాలమునందనుట.) చర=సంచరించుచున్న, వలాహక=మేఘమండలి, చంచలాకృతిన్=మెఱుపుయొక్క యాకారమును, ఉన్మి...కలనన్ - ఉన్మిషత్= ప్రకాశించుచున్న, పర=పరబ్రహ్మమునందలి, చింతామహోర్మి = ధ్యానపరంపరల యొక్కయు, పర్వత=పర్వతునియొక్కయు, అవాప్తితోన్, తనపజ్జన్=తనసమీప మును, చేరుమాళ్లయతి=పొందిననారదుఁడు, వల...వృత్తిన్-వలమాన = గంభీరమైన, వాఙ్ముఖరవృత్తిన్ = వాగ్ధ్వనితో, అఖిలంబున్, (దమయంతీస్వయంవరవృత్తాంతము నంతను ననుట.) ఎఱిఁగింపన్ = తెలియఁజేయఁగా, కౌశికుండు = ఇంద్రుఁడు, కర్త (ముందటి కన్వయించును.)

మ. చతురంభోధిపరీతభూభరణదీక్షం బొల్చు రాజుల్లస
ద్ధృతి యాటోపము లీననంతకులభూతిస్ఫీతనారీస్వయం
వృతిహృత్ప్రోద్ధి ననంఖ్యకోపవిధిఁ గావింపంగ శాంతక్షతా
త్మత నిస్స్వస్తివారి కబ్బుట మది న్దర్కించి రాగాంధుఁడై. 77

టీ. హరి. చతు...దీక్షన్-శాల్వరాజు = ఒప్పెడుహరిశ్చంద్రుఁడు, ఉల్లసద్ధృతి=ఒప్పెడిధైర్యము, ఆటోపములు=సంభ్రమములు, ఈనన్ = ఒసఁగఁగా, అంత...ప్రౌఢిన్-అంతకుల=కడజాతియందు, భూతి=పుట్టుటచేత, స్ఫీత = అతిశయించుచుండెను, నారీ=స్త్రీలయొక్క, స్వయంవృతి = తామువరించుటను, హృత్ = హరించుచున్న, ప్రౌఢిగల,అసంఖ్యకోపవిధిన్, అసంఖ్య=అపరిమితమైన, కోపవిధిని, కావింపన్, (అతికోపినిఁజేయఁగా ననుట.) కశాంతక్షతాత్మత-కశాంత=కశాగ్రములచేత, ('అశ్వాదేస్తాడనీ కశా' అమ.) క్షత=కొట్టి గాయములు చేయఁబడిన, ఆత్మతన్ = శరీరములు గలవారగుటచేత, నిస్వస్థితి=దీనస్థితిని ('నిస్వస్తు దుర్విధో దీనః' అమ.) వారికి=ఆస్త్రీలకు, అబ్బుట=ప్రాప్తించుట రాగాంధుఁడై=క్రోధాంధుఁడై,(విశ్వామిత్రుఁడని యర్థము.)

నల. చతు...దీక్షన్-చతురంభోధి=నాల్గుసముద్రములచేత, పరీత=చుట్టఁబడిన, భూ=భూమియొక్క, భరణ=రక్షణముయొక్క, దీక్షయందు, శాల్వరాజుల్=ఒప్పురాజులు, అసద్ధృతి-అసత్ = ప్రకాశించుచుండెను, ధృతి=సంతోషము ('ధృతి సంతోష ధైర్యయోః' విశ్వ.) ఆటోపములు=వేగిరపాటులను. ఈన్ = ఈయఁగా, అనంత...ప్రౌఢిన్-అనంతమైన, కులభూతి=వంశసంపదచేత, స్ఫీత = అధికమైన, వృద్ధినొందుచున్న యనుట.)నారీ=దమయంతియొక్క, స్వయంవృతి = స్వయంవరమండలి, హృత్ప్రౌఢిన్=హృదయప్రౌఢిమచేత, అసంఖ్యకోపవిధిన్-అసంఖ్యకోప = యుద్ధకోపములేకుండుటయొక్క, ('మృధమాస్కందనం సంఖ్యమ్' అమ.) విధిని, కావింపంగన్=చేయఁగా (పరస్పరము యుద్ధములులేక మైత్రికలవారై యుండఁగా ననుట.) శాంతక్షతాత్మతన్-శాంతమైన, క్షత=గాయములుగల, ఆత్మతన్=శరీరములు గలవారగుటచేత, నిస్వస్థితి,నిర్=నిర్గతమైన,స్వస్థితి=స్వర్గవాసము, వారికిన్ = ఆరాజులకు, అబ్బుట = లభించుట. (దమయంతీస్వయంవరనిమిత్తమేకకార్యపరులై, యన్యోన్యకలహములు లేక యుండుటచే, రాజులు స్వర్గమునకు రామిని ఇంద్రుఁడు నారదునిచే విని యని ఫలితార్థము.) రాగాంధుఁడు ఐ = దమయంతియం దనురాగము గలవాఁడై.

సీ. అతిముగ్ధహారిణీ మహామంజులాస్యోప
      లాలన క్రీడ నొల్లమి వహించి
యశ్రాంతసేవాగతాసన్న సుమనోవి
      తానంబుపై ననాదరము చూపి
ప్రతిదివసప్రవర్తిత సప్తతంతుక్రి
      యా సమాగతులపై నరుచి నించి
భవ్యకల్పకపాదప పరిష్కృతాత్మీయ
      విపినఖేలనముల వెగటుఁబూని

గీ. నూతనకళానిధికళాభిభూతిధుర్య
పార్థివాత్మభవాగ్రహప్రార్థిఁ దలఁచి
యుల్లమునఁ గ్రాఁగి తదుపాశ్రితోర్వికపుడ
యడుగు చతిమాత్రనేత్రరాగాభివృద్ధి. 78

టీ. హా. అతి...క్రీడన్ - అతిముగ్ధములైన, హారిణీ=లేళ్లయొక్క, ('హరిణీ ద్వ్యప్త్యాప్సరోభేదా స్సువర్ణప్రతిమా మృగీ, హరితాచ హరిణ్యస్స్యుః' నా. నా.)మహామంజులములైన, ఆస్య = ముఖములయొక్క, ఉపలాలనక్రీడయందు, ఒల్లమిన్=వెగటును, వహించి, అశ్రాంత...వితానంబుపైన్-అశ్రాంత=ఎల్లప్పుడు, సేవార్థము, ఆగత=వచ్చి ఆపన్న=సమీపమునొందిన, సుమనః = పండితులయొక్క, ('సుమనాః పండితే దేవే' అమ.) వితానంబుపైన్=సమూహముమీఁద, అనాదరము,చూపి, ప్రతి...గతులపై-ప్రతిదివస=అనుదినము, ప్రవర్తిత=నడిపింపఁబడిన, సప్తతంతుక్రియా = యజ్ఞకార్యములయొక్క ('సప్తతన్తుర్మఘః క్రతుః' అమ.) సమ్ ఆగతులపై = సమాచరణములమీఁద, అరుచి, నించి,భవ్య...ఖేలనములన్-భవ్య=శుభములను, కల్పక=కల్పించుచున్న, పాదప=వృక్షములచేత, పరిష్కృత=అలంకరింపఁబడిన, ఆత్మీయ=తనసంబంధమైన, విపినఖేలనములపైన్=వనవిహారములపైని, వెగటును, పూని, నూతన...ప్రార్థిన్, నూతనములైన, కళానిధి=కళావతులయొక్క, (తానుసృజించిన చండాలస్త్రీలయొక్క యనుట.) కళా = సంగీతవిద్యలయొక్క, అభిభూతి = తిరస్కారమందు, ధుర్యమైన, పార్థివ=హరిశ్చంద్రునియొక్క, ఆత్మభవ=మనస్సునందుఁబుట్టిన, ఆగ్రహముయొక్క, ప్రార్థిని;తలఁచి;తదుపాశ్రితోర్వికిన్;తదుపాశ్రిత=ఆహరిశ్చంద్రునిచే నాశ్రయింపఁబడిన, ఉర్వికిన్=భూమికి, (ఆహరిశ్చంద్రుఁడుండుస్థలమునకనుట.) అతి...వృద్ధి-అతిమాత్రమైన, నేత్రరాగ=నేత్రరక్తిమయొక్క, అభివృద్ధితో.

నల. అతి...క్రీడన్-అతిముగ్ధ = మిగులసొగసుకత్తెయైన, ('ముగ్ధ స్సుందర మూఢయోః' అమ.)హారిణీ=హారిణి యను నామముగల యప్సరసయొక్క,మహామంజు=మిక్కిలిమనోహరమైన, లాస్య=నాట్యముయొక్క, ఉపలాలనక్రీడను, సుమనోవితానంబుపైన్=దేవతాసంఘముమీఁద,సప్తతంతుక్రియా=యజ్ఞక్రియలయొక్క,సమాగమనములమీఁద, భవ్య...ఖేలనములన్ - భవ్యములైన, కల్పక పాదపములచేత, పరిష్కృతమైన, ఆత్మీయవిపిన=తనదగు నందనవనమందలి, ఖేలనములన్=విహారములపై, నూతన...ప్రార్థిన్-నూతనకళానిధి=నవీనచంద్రునియొక్క, కళయొక్క, అభిభూతి=తిరస్కారమందు, ధుర్యయైన, పార్థివాత్మభవా = రాజపుత్త్రియగు దమయంతియొక్క, గ్రహప్రార్థిన్=స్వీకరణప్రార్థిని,తలఁచి, అతి...వృద్ధిన్=అతిమాత్రములైన, నేత్రములయొక్క, రాగ=విరహజాగరణముచేనైన రక్తిమయొక్క, అభివృద్ధిన్=అధిక్యముతో,

చ. తనరఁగఁ జిత్రభానుఁడును దండధరుండుఁ బ్రచేతసుండు నై
కనలినరోప తాపకర గాఢతరాంబక లోలవృత్తిఁ దన్
వెనుకొని రాఁ దపోధనులు విస్మయ మంద మహోచిత ప్రచా
రు నలవసుంధరాధిపుని మ్రోలఁ గనుంగొనియెన్ రయంబునన్. 79

టీక. హరి. తనరఁగన్ = ఒప్పఁగా, చిత్రభానుఁడును, చిత్రమైన, భానుఁడును= తేజస్సుగలవాఁడును, దండధరుండున్ = దండధారియును, ప్రచేతసుండును= ప్రకృష్టమైన చిత్తముకలవాఁడును, ఐ, కనలి=కోపమునొంది, నరోప...వృత్తిన్-నరులకు, ఉపతాపకర=సంతాపకరమై, గాఢతరమైన, అంబక = నేత్రములయొక్క, లోలవృత్తిన్=చంచలవర్తనముగల. తన్=తన్ను, తపోధనులు = ఋషులు, వెనుకొని రాన్= వెంబడించిరాఁగా, వి...చారున్-వి = పోయిన, స్మయ=గర్వముచేత, మంద = తగ్గిన, మహోచితమైన, ప్రచారముగల (గర్వముచే నుచితప్రచారములు విడిచి ప్రవర్తించువాఁడు కాని,) అలవసుంధరాధిపునిన్ = అహరిశ్చంద్రుని, మ్రోలన్, కనుఁగొనియెన్ (చూచె ననుట.)

నల. చిత్రభానుఁడును, అగ్నిహోత్రుఁడును.('చిత్రభానుర్విభావసుః' అను.) దండధరుండున్=యముఁడును. ('కాలో దండధరః' అను.) ప్రచేతసుండును=వరుణుఁడును. ('ప్రచేతా వరుణః పాశీ' అను.) నైక...వృత్తిన్-నైక=అధికమైన, (దీనిని వృత్తిశబ్దముతో నన్వయింపవలయును.) నలినరోప = మన్మథునియొక్క, ('పత్త్రీ రోప ఇషుర్ద్వయోః' అను.) తాపకరములును, గాఢతరములును నైన, అంబక = బాణములచేత, ('అంబకం నేత్ర శరయోః' అను.) లోల=చలించుచున్న, వృత్తితో, తన్ను,(ఇంద్రుని ననుట.) వెనుకొని రాన్ = వెంబడించిరాఁగా, తపోధనలు=ఋషులు, విస్మయమందన్ = ఆశ్చర్యమునొందఁగా, మహోచితప్రచారున్-మహా=స్వయంవరోత్సవమునకు, ఉచితమైన, ప్రచారున్=గమనముగల, నలవసుంధరాధిపునిన్=నలమహారాజును, మ్రోలన్= ఎదుట, కనుంగొనియెన్, ('కౌశికుఁడు' ఇంద్రుఁడు చూచె ననుట.)

క. కనుఁగొని యతఁడు మహాదర
మున మ్రొక్కి విచిత్రనాకపురకర్తృత్వా
భినుతప్రభావయుతుఁ డా
ఘనుఁ డిట్లనుఁ దన్నిరూఢి గడలుకొనంగన్. 80

టీ. హరి. కనుఁగొని అతఁడు=అహరిశ్చంద్రుఁడు, మహాదరమునన్=అధికమైన భయముతోడ, ('దరోఽస్త్రీ శంఖభయయోః' అను.) మ్రొక్కఁగా, విచిత్ర...యుతుఁడు-విచిత్రమైన. నాకపుర=స్వర్గముయొక్క, కర్తృత్వ=సృష్టిచేత, అభినుత=కొనియాడఁదగిన, ప్రభావముతోడ, యుతుఁడు=కూడుకొనవాఁడు అగు, ఆఘనుఁడు=ఆవిశ్వా

మిత్రుఁడు, దూషికడలుకొనంగన్, తన్ని = పాదప్రహారణ మొనర్చినవాఁడై, ఇట్లనన్ = ఈతీరునఁబల్కెను.

వ॥ అతడు=అనలుఁడు, మహాత్ ఆదరమునన్, మ్రొక్కఁగా, విచిత్ర... యుతుఁడు-విచిత్రమైన, నాకపురకర్తృత్వ=స్వర్గాధిపత్యముచేత, అభినుతమైన, ప్రభావముతో, యుతుఁడు అగు, అఘవఁడు=ఇంద్రుఁడు. తన్నిరూఢి-తత్=అనలునియొక్క, నిరూఢి=ప్రసిద్ధి, కడలుకొనంగన్, (అనలునియొక్క రూఢి తేటపడఁగా) ఇట్లనన్.

సీ. తెలిపెద మావృత్తి నిలు వెందుఁ జనియెదు
రాజాన్వవాయవర్ధన కృతాంతుఁ
డితఁడు బృహద్భానుఁ డితఁడు భువనశాసి
యితఁ డనవరతరాజితవిభూతిఁ
జెలఁగున న్దలఁపు కౌశికునిఁగా నిను వేఁడు
వాంఛ నేతెంచినవార మంద
ముగఁ గాయజవ్యథఁ బొగులకుండఁ దలవు
లీడేర్పఁగా రాదె యిప్పుడు దమ

గీ. యంతికావాప్తి సాధించి యభినుతించు
వారి నొంతురె ప్రభుబుద్ధి వదలి యాత్మ
హితమృగాంబకఘటసమున్నతిసమగ్ర
మతి నొనర్చితివే మది మఱతు మెట్లు. 81

టీక. హరి॥ రాజాన్వవాయవర్ధన - రాజాన్వవాయ=క్షత్రియవంశముయొక్క, వర్ధన=ఛేదనము గలవాఁడా! (రాచకొలముం జెఱుపఁ బుట్టినవాఁడ వనుట), ('వర్ధనం ఛేదనే' అమ.) కృతాంతుఁడు కృత=చేయఁబడిన, అంతుఁడు = అంతముగలవాఁడు, ఇతఁడు, బృహద్భానుఁడు-బృహత్=అధికమైన, భానుఁడు=తేజస్సుగలవాఁడు ('భానూరశ్మిదివాకరౌ' అమ.) ఇతఁడు, భువనశాసి=లోకశాసనుఁడు, ఇతఁడు, అనన్, వర... భూతిన్-వరతర=మిక్కిలిశ్రేష్ఠమైన, అజిత = అప్రతిహతమైన, విభూతిన్ = తపోవిభూతిచేత, చెలఁగు = ఒప్పుచుండెడు, నన్ = నన్ను, కౌశికునిఁగాన్ = విశ్వామిత్రునిఁగాను, తలంపుము. వారు=అమతంగకన్యకలు, అమందముగన్ = శీఘ్రముగ, ఇప్పుడు, కౌఅవాచకపదము మీఁదితకారము దకారమయ్యెను, అక్షణము. "గీ. సంధి గూర్పంగ..." (కవిలోకసంజీవని.) తమయంతికావాప్తి(న్)-తమయొక్క, అంతిక= సమీపముయొక్క, అవాప్తిని, సాధించి=గడించి, (నీదగ్గఱకు వచ్చి యనుట.) నొంతురె=నొప్పింతురా? ఆత్మ...ఘటన-ఆత్మహిత = మనోజ్ఞమైన, మృగ = మృగమందు,

అంబక=బాణములయొక్క, ఘటన=సంఘటనము, (బాణమును వేయుట యనుట.) మున్ను=ముందు, అతి సమగ్రమతిన్=మిగుల పరిపూర్ణమైనబుద్ధిచేత, (కొంచెము కొంచెము లేనిబుద్ధితో ననుట.) ఒనర్చితివి. ఏము=మేము; అది (నీ వామృగమును బాణముతో చేసినయుక్రమము ననుట.) ఎట్లు మఱతుము. (మఱచుట లేదనుట.)

నల. రాజాన్వవాయవర్ధన = చంద్రవంశవర్ధనా! ఇతఁడు, కృతాంతుఁడు = యముఁడు, ఇతఁడు, బృహద్భానుఁడు అగ్ని, ('అగ్రయాశో బృహద్భానుః' అమ.) ఇతఁడు, భువనశాసిఃవరుణుఁడు, అన...భూతిన్-అనవరతమును, రాజితమైన, విభూతిన్=ఐశ్వర్యముచేత, చెలఁగు నన్=ఒప్పుచున్నట్టివన్ను, కౌశికునిఁగా = ఇంద్రునిఁగా, తలంపుము. అందముగా, దమయంతికావా ప్తిన్-దమయంతికో=దమయంతియొక్క, అవాప్తిని, సాధించి = చేకూర్చి, తలఁపు లీడేర్పఁగారాదా? అని యన్వయము. ఆత్మ...వము-ఆత్మహిత = మనసునకు నిష్టరాలైన, మృగాంబక = స్త్రీయొక్క, ('దీర్ఘాణాం హ్రస్వహ్న్యత్' అను సాంధ్రశబ్దచింతామణిసూత్రముచే నిట 'మృగాంబక' యని యంత్య కకారమునకు హ్రస్వము వచ్చినది) ఘటనము = పొందును, ఉన్నతిన్, సమగ్రమతిన్=పరిపూర్ణబుద్ధితోడ, ఒనర్చితి వే కీ=చేసితివా కీ, మదిన్= మనస్సునందు, ఎట్లు=ఏలాగున, మఱతుము ? (మఱచుట లే దనుట)

చ. అన నతిమాత్రచిత్రనిభృతాకృతియై విభుఁ డయ్యహార్యశా
సను బహుమన్యురూఢదివివత్సరవైభవసంవిధాను ని
ట్లను ననఘాత్మ విశ్వహృదయజ్ఞుఁడ వీగతి నన్నుఁ బల్కఁగాఁ
జనునె జగత్త్రయీవిదితసంభ్రమభీమభవాగ్రహాగతిన్. 82

టీక. హరి. అహార్యశాసనున్-అహార్య = అనివార్యమైన, శాసనముగలవానిని, బహుమన్యు(న్)-బహు = అధికమైన, మన్యున్=క్రోధముకలవానిని, ('మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి' అమ.) రూఢ...ధానున్ - రూఢ = సృజింపఁబడిన, దివివత్సర = స్వర్గముయొక్క, వైభవముయొక్క, సంవిధాను(న్) = చేయుటగలవానిని, (స్వర్గ సృష్టిగల) విశ్వామిత్రునిఁగూర్చి, ఇట్లు, అనున్, జగ...గతిన్ - జగత్త్రయీవిత్= ముల్లోకవేధకమగు ('వ్యథ = తాడనే' అను ధాతువుమీఁది క్విబంతరూపము-విత్) ఇత=పొందఁబడిన, సంభ్రమముచేత, భీమ=భయంకరమగు, భవ = ఈశ్వరునియొక్క, అగ్రహామువంటి యాగ్రహముయొక్క, అగతిచేత, పల్కఁగాన్, చనునే.

నల. అ+అహార్యశాసను(న్)=గిరిశాసనుని, ('అహార్యధరపర్వతాః' అమ.) బహుమన్యు(న్) = అనేక క్రతువులుగలవానిని, రూఢ...ధానున్-రూఢమైన, దివి వత్సరవైభవ = స్వర్గవిభుత్వముయొక్క, సంవిధానముగలవానిని, అనఁగా నింద్రుని

గూర్చి యనుట.) ఇట్లనుక్, జగ...గతిక్-జగత్త్రయీవిదితమైన, సంభ్రమ=స్వయంవరసంభ్రమముగల, భీమభవా = దమయంతియొక్క, గ్రహ = స్వీకరణముకొఱకు, ఆగతిక్=రాకగలవానిని, నన్నుక్, కల్గాఁగాక్, చనునే.

ఉ. భవదీయానుచరుండఁ దావకకృపాపాత్రుండ మీమ్రోల ని
ట్లవుఁ గా దంచు వచింప నేర్తునె బుధేంద్రా! మోహి నే నోర్వఁబ్రే
ష్యవిధుల్ గావఁగఁ బాడి మీ కన నతండ స్మద్విధేయుఁడ నం
టివి మాపం పొనరింపు మాకు మదిఁ బాటిల్లుక్ మహోల్లాసముల్.

టీక. హరి. బుధేంద్రా! సంబుద్ధి, ఏక్ + మోహిక్ = నే నజ్ఞానిని, ('అవిద్యామూర్ఖయో ర్మోహి' నానా.) ప్రేష్యవిధుల్, (బంటుచేయుకార్యముల ననుట.) ఓర్వక్ = సహించుటకును, కావఁగక్ = రక్షించుటకును, పాడి=ధర్మము.

నల. బుధేంద్రా=దేవేంద్రుఁడా! మోహిక్+ఏక్ = నేను మోహముగలవాఁడను. (దమయంతియందు మోహముగలవాఁడ ననుట.) ప్రేష్యవిధుల్=దూతకృత్యములు, ('నియోజ్య కింకర ప్రేష్య' అమ.) ఓర్వక్=సహించును, మాపంపు = మాయాజ్ఞ, ఈయర్థమునకుఁ బ్రయోగము. "ఉ. ......మీరలెల్ల నా పంపునఁ బోరికిం జనుఁడు......" (జై. భారతము.)

క. ధర గుర్వర్థిజనానా
దర మొప్పదు సుమ్ము ధరణిధవ! శుభకార్య
త్వర నాకన్యల సితివా
రిరుహాసమాలోకనల వరింపుము వేడ్కక్. 84

టీక. హరి. ధరణిధవ=హరిశ్చంద్రమహారాజా! గుర్వ...దరము-గురు = గురువులయొక్క, అర్థిజనా=యాచకులయొక్కయు, అనాదరము = తిరస్కారము, శుభకార్యత్వరచేత, నాకన్యలక్ = నాయొక్కకన్యకలను, సిత...లోకనలక్-సితవారిరుహ=తెల్లతామరలతో సమానమైన, ఆలోకనలక్ = దృష్టిగలవారిని, ('ఆలోకాదర్శనోద్ద్యోతా' అమ.) వరింపుము.

నల. గురు...దరము-గురుశ్రేష్ఠులగు, అర్థిజనులయొక్క, అనాదరము = తిరస్కారము, శుభకార్యత్వరచేత, ఆకన్యక్ = ఆదమయంతిని, అసిత...లోకక్ - ప్రకాశమానమైన, వారిరుహ = కమలములతో, సమానమైన, ఆలోకక్=దృష్టిగలదానిని, అలంకరింపుము = చేకూర్పుము.

చ. అధికవిభీతి నీదుహృదయం బటుమీఁదట భీమధామదం
డధరనిరోధశంకకుఁ దడంబడు నేని మదీయశక్తిచే

నధరితచంచలాచకచకావయవద్యుతిరేఖకన్యకా
విధుమణిచంద్రశాలలఁ బ్రవేశము నీ కవలీలఁ జేసెదన్. 85

టీక. హారి. భీమ...శంకరున్-భీమ = భయంకరమైన, ధామ = తేజస్సుగల, దండధర=యమునియొక్క, నిరోధనము వలన, శంకరున్, సుఖప్రదుఁడను. తదంబరము చేని=చలింపఁ జేని, అధ...శాలలన్-...రేఖాకన్యకా = దేవతాస్త్రీలయొక్క, విధుమణిచంద్రశాలలన్ = ...యందు, ప్రవేశము; నీకు, అవలీలఁగా నొసఁగుదును. (స్వర్గభోగమును గల్పింతు ననుట)

నల. భీమ...శంకరున్-భీమధామ=భీముని గృహమువలన, ('ధామదేహేగృహే రశ్మౌ' నా వా.) దండధర = ద్వారపాలకులయొక్క, నిరోధమువలన, శంకరు, అధ...శాలలన్-అధరిత = నిరసింపఁబడిన, చంచలా = మెఱపులయొక్క, చకచకలుగల, అవయవములయొక్క, ద్యుతిరేఖగల, 'రలయోరభేదః' అనుటచే నిట 'లేఖ' రేఖ యయ్యె. కన్యకా=దమయంతియొక్క, విధుమణి చంద్రశాలలన్=చంద్రకాంతపుఁ జంద్రశాలలయందు, ప్రవేశము, నీకు, అవలీలన్, చేసెదను. (దమయంతి యంతఃపురప్రవేశ మతిసులభముగఁ గలుగఁజేసెద ననుట.)

క. అనఁ బోనీఁ డితఁ డవిలం
ఘనీయుఁ డనిదానకలితఘనతర్జనుఁ డిం
కని కౌశికశాంబరినే
ర్పునఁ దడయక యధిగతావరోధుం డగుచున్. 86

టీక. హారి. అవిలంఘనీయుఁడు, అని...ర్జనుఁడు-అనిదాన=నిష్కారణముగ, కలిత = చేయఁబడిన, ఘనతర్జనుఁడు = అధికమైననిరసనముకలవాఁడు, ఇంక, అని = అనుకొని, కౌశికశాంబరి నేర్పునన్, కౌశిక = విశ్వామిత్రునియొక్క, శాంబరి=మాయయొక్క, ('స్యాన్మాయా శాంబరీ' అమ.) నేర్పుచేత, తడయక, అధిగతావరోధుండు-అధిగత=పొందఁబడిన, అవరోధుఁడు = అడ్డగింపు గలవాఁ డగు.

నల. ఇతఁడు = ఈఇంద్రుఁడు, అవిలంఘనీయుఁడు, అని, దాన...ర్జనుఁడు-దానముచేత, కలిత = చేయఁబడిన, ఘన=మేఘముయొక్క, తర్జనుఁడు = నిరసముగలవాఁడు, (మిక్కిలి దాతయైనవాఁ డనుట.) ఇంక...నేర్పునన్-ఇంకని=ఇంకిపోనని, (అడఁగిపోవని యనుట.) కౌశికశాంబరి = ఇంద్రమాయయొక్క, నేర్పుచేత, అధిగతావరోధుండు-అధిగత = పొందఁబడిన, అవరోధుఁడు = అంతఃపురముగలవాఁడు, అగుచును,

సీ. పరమహంసాన్వయ గురుసమాకృష్టవై
ఖరికన్న నధికమై పరఁగు చునికి

వరసువర్ణాస్పృశ్యవర్ణభామలు భజిం
పఁగఁ బ్రౌఢిమను మనుపగటుఁదనము
నేచి కడంకతో నేచందమున నైనఁ
దనుఁ గరం బలమంగఁ దలఁచుపూన్కి
తనపూనినప్రతిజ్ఞ దక్క నింద్రాదుల
మనవి కైనను మాఱుమసలు చలము
గీ. కలిగి విలసిల్లునమ్మహాకల్పభాస్వ
దలఘుదీప్తివహాకృతిఁ గలయఁ గాంచి
యచటఁ జిత్రాభిలక్ష్యమాణాత్ముఁ డగుచు
నమ్మహీవల్లభుఁడు నిల్చె నాక్షణమున. 82

టీక. హరి. పరమ...వైఖరికన్నన్-పరమ = శ్రేష్ఠమైన; హంసాన్వయ = సూర్యవంశమునకు, గురువైనవసిష్ఠునిచేత, సమాదిష్ట = ఆదేశింపఁబడిన, వైఖరికంటెను, వర...భామలు-వర=శ్రేష్ఠమైన,సు=లెస్సైన;వర్ణ=కాంతిగల;అస్పృశ్యవర్ణభామలు= చండాలజాతిస్త్రీలు, భజింపఁగన్, (భార్యలైకొలువఁగా ననుట.) మనుము, అను=అని రాయడు, ఏఁచి=అతిశయించి, తనున్ = తన్ను, కరంబు = మిక్కిలి, అలమంగన్ = అలమటపెట్టుటకు, ఇంద్రాదులమనవికైనన్ = ఇంద్రుఁడు మున్నగు దేవతలు ప్రార్థన చేసినను, అమ్మహా...కృతిన్-ఆ, మహాకల్ప = ప్రళయకాలమందలి, భాస్వత్ = సూర్యునియొక్క, ('భాస్వద్వివస్వత్సప్తాశ్వ' అమ.) అలఘుదీప్తివంటిదీప్తిని, వహించిన, ఆకృతిగలవాని, (అత్యుగ్రుఁడైన విశ్వామిత్రుని ననుట) చిత్రా...త్ముఁడు-చిత్ర = ఆశ్చర్యముచేత, అభిలక్ష్యమాణమైన, ఆత్ముఁడు = హృదయముగలవాఁడు, అగుచు, నిల్చెను.

నల. వర...కన్నన్-పరమహంసాన్వయగురు=హంసవంశశ్రేష్ఠముచేత, సమాదిష్ట=చెప్పఁబడిన, వైఖరికంటెను, అధికమైనక్రమ పరఁగుచు, ఉనికి, వర...భామలు-వర=శ్రేష్ఠమైన, సువర్ణ=బంగారమునకు, అస్పృశ్య=స్పృశింపనశక్యమైన, (పొందనసాధ్యమనుట.) వర్ణ=కాంతిగల, భామలు = స్త్రీలు, భజింపన్=కొలువఁగా, ప్రౌఢిమను=ప్రౌఢతనముతో, మనుపగటుఁదనము-మనుచుండెడు, పగటుదనము=లావణ్యము కలిగియుండుటయును, ఏచి=పూనుకొని, తనున్=తన్ను, కరంబు+అలమంగన్ = చెట్టపట్టుటకు, (పెండ్లాడుట కనుట.) ఇంద్రాదులమనవికైనను, (ఇంద్రుఁడుమున్నగువారియొక్క ప్రార్థనమునకైనప్పటికి ననుట.) అమ్మహా...కృతిన్ - ఆ+మహాకల్ప = అతిశయాలంకారమైన, భాస్వత్ = ప్రకాశించుచుండెడు, అలఘు = తక్కువకాని, దీప్తి=కాంతిని,వహ=వహించిన, ఆకృతిన్=ఆకారముగల దమయంతిని, చిత్రాభిలక్ష్యమాణాత్ముఁడు-చిత్ర=చిత్తరువునందు, అభిలక్ష్యమాన=చూడఁబడుచున్న,ఆత్ముఁడు=

శరీరముగలవాఁడు;('ఆత్మా యత్నోధృతిర్బుద్ధిస్స్వభావోబ్రహ్మవర్ష్మసు, జీవబుద్ధిశరీరేషు' నానా.) (చిత్రప్రతిమలవలెను నిలిచినవాఁడై యనుట.) అగుచు, అమ్మహీపాల భుఁడు = ఆ నలుఁడు, నిలిచెను.

ఉ. అచ్చెరు వీయపూర్వవిషమాంబకుఁ డీశుచిభానుసన్నిభుం
డిచ్చటి కెట్లు వచ్చె నని యెల్లరు గన్గొన రామహార్ష్టిభా
వోచ్చ్రితరస్థితిన్ నృపకులోదధిపూర్ణశశాంకుఁ బల్కుఁ గౌతుం
భచ్చతురోక్తి[1] వైఖరుల మారుతభోజనలీల మించఁగన్. 88

టీక. హారి. ఈయపూర్వవిషమాంబకుఁడు=ఈయపూర్వత్రినేత్రుఁడు; ఈ, శుచిభానుసన్నిభుండు, శుచి=అగ్నితోడను, ('శుచిరప్పిత్తే' అమ.) భాను=సూర్యునితోడను, ('భానుర్హంసస్సహస్రాంశుః' అమ.) సన్నిభుండు=సమానుఁడు; (కన్గొనన్, రా=రాఁగాననుట. లేక, కన్గొనన్=చూడఁగా, రామహార్ష్టి=విశ్వామిత్రుఁడు అనియు) మహర్షి=విశ్వామిత్రుఁడు, మారుతభోజనలీల-మారుతభోజన=గాలిమేపరులగు సర్పములయొక్క, లీల, మించఁగాన్, (భయంకరమైనరీతిచే ననుట) నృపకులోదధిపూర్ణశశాంకునిన్=ఆరాజకులవార్థిచంద్రుఁడగు హరిశ్చంద్రునిఁ గూర్చి.

నల. ఈయపూర్వవిషమాంబకుఁడు=ఈనూతన మన్మథుఁడు, ఈశుచిభానుసన్నిభుఁడు=ఈచంద్రసమానుఁడు ('విధుస్సుధాంశుశ్శుభ్రాంశు' అమ.) ఎల్లరున్ = అందఱును, కన్గొనన్ = చూడఁగా, ఇచ్చటికి = ఈయంతఃపురమునకు, ఎట్లువచ్చెన్ = ఏత్రోవనవచ్చెను, అని, రామ=దమయంతి, హార్ష్టి...స్థితిన్-హార్ష్టి=హర్షముగల, భావ=భావముయొక్క, ఉచ్ఛ్రితరస్థితిన్=అత్యంతౌన్నత్యముచేత, మారుతభోజనలీల-మారుత=దేవతాసంబంధమైన, భోజన=ఆహారముయొక్క, (అనఁగా నమృతముయొక్క) లీల, మించఁగాన్, నృపకులోదధిపూర్ణశశాంకునిన్=ఆ నలమహారాజునుగూర్చి.

చ. ఖరకిరణాతపంబుఁ బెనుగాలియునుం జొరరాని మద్గురు
స్థిరభవనప్రదేశ మొకచీరికినిం గొన కెట్లు సొచ్చితీ
వరయ ననూనదర్పక! తదంతరసంతతరక్షణోన్నిష
త్తరులఁ బరాభవించిన యుదగ్రబలోద్ధతి కేమి చెప్పుదున్. 89

టీక. హారి. ఖరకిరణాతపంబున్ = సూర్యకిరణములయొక్క, వేఁడిమియును, పెనుగాలియు, చొరరాని, మద్గురు... దేశము-మత్=నాయొక్క, గురు=గొప్పదియైన, స్థిరమైన, భ=కాంతిగల, వన ప్రదేశమును, చీరికినింగొనక=లక్ష్య పెట్టక, ఎట్లుచొచ్చితివి? అనూనదర్పక=అధికమైన దర్పముగలవాఁడా! తదం...రులన్-తదంతర=అవసాంతర

1. వైఖరులు...లీలఁ దెల్పఁగన్.

మందు, సంతతరక్షణముచేత, ఉన్మిషత్ = ప్రకాశించుచుండెడు, తరులన్ = వృక్షములను, పరాభవించిన...ద్ధతికిన్ - పరాభవించిన=చెఱచిన; ఉదగ్రములైన, బల=సేనల యొక్క, ('బలంసైన్యం, చక్రం చానీకమస్త్రియామ్' అమ.) ఉద్ధతికిన్=గర్వమునకు, ఏమి చెప్పుదును = ఏమందును,

నల. చోరరానివఙ్గురు...దేశము-మద్గురు=వాతండ్రి యొక్క, స్థిరమైన, భవన ప్రదేశము, అనూనదర్పక! (రూపమున మన్మథునికన్నఁ దక్కువకాని ఓనలుఁడా! యనుట.) తరం... త్తరులన్ - తదంతర = అభవనాంతరముయొక్క, సంతతరక్షణ మందు, ఉన్మిషత్తరులన్=మిగుల జాగరూకులైనవారిని, పరా...ద్ధతికిన్-పరాభవించిన=అవమానపఱచిన, ఉదగ్రబలముయొక్క, ఉద్ధతికిన్, ఏమి చెప్పుదును ?

గీ. ఇట్టి నీచంపములు వింత లెన్న నేల?
సాధునైశ్చల్యహృత్సారస! వివరింపు
భావ మిగురెత్త నీస్వరూప మతిరమ్య
యువతుల మదీయసంక్షోభముడుగుఁ గాని. 90

టీక. హరి. సాధు...త్సార-సాధు=సాధువులయొక్క, నైశ్చల్య=నిలుకడను, హృత్=హరించుచుండెడు, సార=బలముగలవాఁడా! చవిన్=చవిచేత, (ప్రేమతో ననుట. 'సవి' యనుపదము నందలి 'స' కారము 'గసడదవా స్స్వర్యః ప్రథమామాత్రా దాత్పాస్తదోర్విషైవితే" అను సాంధ్రశబ్దచింతామణి సూత్రముచేత 'చకారమున' కాదేశము) ఈస్వరూపమతిన్ = ఈస్వరూపముచేతను, మతిచేతను, రమ్య=మనోహారిణులైన, యువతులన్=స్త్రీలను, (చండాలస్త్రీల ననుట.)

నల. సాధు...రస-సాధు=లెస్సయగు,నైశ్చల్యముగల,హృత్సారస=హృదయకమలముగలవాఁడా! నీస్వరూపము (ను) వివరింపు (ము). అతిరమ్యయువతుల, అతిరమ్య=మిగులసొగసుగల, యువ=ప్రాయంపుబురుషుల ('వయస్థస్తరుణో యువా' అమ.) తుల = సాదృశ్యముగాఁగలవాఁడా! మన్మథాదులతో సరిపోలినవాఁడా యనుట.)

మ. నవలావణ్యవిలాసధన్యసురకన్యాకీతవృత్తారిపు
త్రవిభూతిన్ క్షణదాభిరామతరతారాఖేలదూరీకృత
చ్ఛవిసంపూర్ణవిభావరీ విటునియోజన్ బొల్చె దవ్యాజవై
భవ! యస్మత్కృతచిత్రసృష్టి దయితాప్తత్వంబుతో నావుడున్,

టీక. హరి. అస్మ...బుతో-అస్మత్కృతమైన,చిత్రసృష్టి=విచిత్రసృజనముగల, దయితా=నాయికలయొక్క, అప్తిత్వంబుతోన్=ప్రాప్తితో (నేనుసృజించిన చండాల కన్యలను కూడినవాఁడవై యనుట); పొల్చెదు=విహరింపఁగలవు,అవ్యాజవైభవ(సంబుద్ధి.)

నల. నవ...విభూతిన్-నవలావణ్యము యొక్క విలాసముచేత, ధన్యలైన, సుర కన్యలచేత, వీత=పరివృతుఁడైన, వృత్రారిపుత్త్ర=జయంతుని యొక్క, విభూతిన్=ఐశ్వర్యముచేతను, (జయంతుని యొక్క సౌందర్యమువంటి సౌందర్యముచేత ననుట) క్షణదా...యోజన్-క్షణదా=రాత్రియందు, ('త్రియామా క్షణదా క్షపా' అమ.), అభిరామతర=మిగుల మనోహరములైన, తారా=నక్షత్రములతో, ఖేలత్ = క్రీడించుచున్నవాఁడై, ఊరీకృతచ్ఛవి=అంగీకృతమైన దీప్తిగల, సంపూర్ణవిభావరీవిటుని యోజన్ = పూర్ణచంద్రునివలెను, ('విభావరీ తమస్విన్యౌ రజనీ యామినీ తమీ' అమ.) పొల్చెదు= ఒప్పుచున్నాఁడవు. అవ్యాజవైభవ = నిక్కమైన విభవముగలవాఁడా! అస్మ...తో-అస్మత్ =నా యొక్క, కృత=చేయఁబడిన, చిత్రసృష్టిగల, దయితా=స్త్రీల యొక్క, (ప్రతిమారూపిణులైన స్త్రీల యొక్క యనుట.) ఆసక్తత్వంబుతో = సంప్రాప్తితో, (చిత్రప్రతిమలలో నిలిచినవాఁడవై యనుట. పొల్చెదవి యన్వయము. ప్రతిమవలె నిశ్చేష్టుడై తన్నుఁజూచు నలునితో నిట్లు దమయంతి పలికె నని భావము.)

గీ. అధిపుఁడను లోకపతులాసనాభిరూప్య
వినుతవిస్ఫూర్తి నిను వేఁడ ననుపమితఋ
తోక్తిధన్య! నీశరణంబు నొందినాఁడ
బ్రోవు నాకుల ముదితకారుణ్యమహిమ. 92

టీక. హరి. అధిపుఁడు=హరిశ్చంద్రుఁడు, అనన్=చెప్పఁను, లోక...విస్ఫూర్తిన్-లోకప=లోకపాలకులతోడ, తులయందు, ఆసన=ఉండుట యొక్క, అభిరూప్య= ఒప్పిదము యొక్క, వినుతమైన, విస్ఫూర్తిని, నిన్ను, వేఁడను. (దేవతలతోఁ దులఁదూఁగఁదగిన మాహాత్మ్యము నొసంగఁ గోరువాఁడఁ గా ననుట.) అను...ధన్య-అనుపమిత= ఉపమానరహితమైన, ఋతోక్తి=సత్యవచనములయందు, ధన్యుఁడైనవాఁడా! (అమోఘ వాక్కులు గలవారలలో శ్రేష్ఠుఁడు అనఁగా ఋషిశ్రేష్ఠుఁ డనుట.) ('సత్యం తథ్య మృతం సమ్యక్' 'ఋతమయస్సత్య వచసః' అమ.) నాకులము, ప్రోవు(ము), ఉదిత కారుణ్యమహిమ(న్)=మాతంగకన్యలసంబంధమున, నన్నుఁ గులభ్రష్టుని చేయకుము అని భావము.

నల. అధిపుఁడను=రాజను, లోకపతులు = దిక్పాలకులు, ఆసన్=ఆశచేత, అభిరూప్య=వినుతవిస్ఫూర్తిన్, అభిరూప్య=సౌందర్యము యొక్క, వినుతమైన, విస్ఫూర్తి గల, నిన్ను, వేఁడుటకు, అనుపన్=పంపఁగా, మితఋతోక్తిధన్య! (ఇది దమయంతీ సంబోధనము.) నీశరణంబున్=నీగృహమును, ('శరణంగృహరక్షిత్రోః' అమ.) ముదిత= ఓదమయంతీ! కారుణ్యమహిమ(న్), ప్రోవు(ము) అని యన్వయము.

చ. హరిపద మాక్రమించెదొ హుతాశనతాపముఁ జల్లఁ జేసెదో
యరుణజు మ్రొక్కఁ గాంచెదొ జలాధిపునిం గనుసన్నఁ ద్రిప్పెదో

యరయఁగ నేమి నీమదిఁ బ్రయత్నముఁ దెల్పుము నీస్వరూపవై
ఖరిఁ గన యోగ్యు లాఘనులు గాక ధర న్నరమాత్రు లప్సలే.

టీక. హారి. హారిపదము=స్వర్గము, (న న్నిట్టి నీచకృత్యమునకు లోఁ జేసి నీ వేమి సాధింపఁ దలఁచితి వని ఫలితార్థము. లేదా, నన్ను నడఁచు ప్రయత్న మింద్రాదుల నణఁచు యత్నముగఁ జేయుచున్నావా యని భావము.)

నల. హరిపదము=ఇంద్రపదమును, హుతాశనతాపము = అగ్ని యొక్క విరహతాపమును, అరుణజుప్రొక్కు = యముని యొక్క ప్రొక్కు, జలాధిపుఁ డా = వరుణుని, (వీరిలో నేరిని వరించెద వనుట.)

చ. అనవరసద్గుణౌఘవిశదాశయవామవివేకసన్మణీ
ఖనియనురంజితార్యనయగౌరవ నీ విబుధాన్వయాగ్రణీ
వినుతమహత్త్వ మెంత పృథివీజనమాత్రవిభూతి గాంచు నే
నన మఱి యెంత యేల యిటులాడెదు చాలు నయోగ్యయోజనల్.

టీక. హారి. అన...దాశ! అనవర = శ్రేష్ఠమైన, సద్గుణసమూహముచేత, విశదములైన, ఆశ=దిక్కులు గలవాఁడా! అహమ...ఖని-అవామ=అవక్రమైన, ('వామావర్గప్రతీపౌద్వౌ' అమ.) వివేకమనెడు, సన్మణికి ఖని=ఆకరమైనవాఁడా! అనుర...గౌరవ! అనురంజిత = రంజింపఁ జేయఁబడిన, ఆర్య = పెద్దలుగల, నయగౌరవముగలవాఁడా! విబుధాన్వయాగ్రణీ! = బ్రహ్మవంశశ్రేష్ఠుఁడైనవాఁడా! విశ్వామిత్రసంబోధనములు. నీ=నీయొక్క, వినుతమైన మహత్త్వము, ఎంత, పృథివీజనమాత్ర=మనుష్యమాత్రమైన, విభూతిని.

నల. అన(డా)=ఇట్లని చెప్పఁగా, వరసద్గుణౌఘ! విశదాశయ-విశదమైన, ఆశయ=హృదయము, (తలంపు) కలయది ('అభిప్రాయశ్ఛంద ఆశయః' అమ.) వివేకసన్మణీఖనియు నగు, వామ = వనిత, (దమయంతి, కర్త.) అనుడా, రంజి...గౌరవనీవి - రంజిత=సంతోషపెట్టఁబడిన, ఆర్యులుగల, నయగౌరవ=నయాతిశయమే, నీవి=మూలధనముగాఁ గలవాఁడా! ('నీవీపరిపణో మూలధనమ్' అమ.) సంబుద్ధి. బుధా...మహత్త్వము-బుధాన్వయాగ్రణీ=దేవతలయొక్క వినుతమైన, మహత్త్వము ఎంత?

వ. అనిన జితేంద్రియుం డిట్లనియె. 95

టీక. హారి. జితేంద్రియుండు=ఇంద్రియములను జయించిన విశ్వామిత్రుఁడు.

నల. జితేంద్రియుండు=ఇంద్రియములచేత, జయింపఁబడిన నలుఁడు.

సీ. సనకాదిమునిమోహజనకాహిరిపుగేహ
కనకాసనారోహగౌరవంబు

సవనానుగుణమందపవనానుగతనంగ
నవనాధికానందవిచలనంబు
ఘనదీధితికలాపఖనదీజలఖగాప
ఘనదీపితద్వీపగతివిభూతి
యమరీభుజవిచాలిచమరీజవికచాలి
సమరీతికకచాలిచారుమహిమ
తే. నరతనువుతోనె సురవరనగరమహిత
బహుతరైశ్వర్యధుర్యులు ప్రస్తుతింపఁ
గాంచు టొప్పదె నామాట మించెనేని
నీకు నీవైభవము నిల్పుటే కడిందీ. 96

రెంటనుసమానము.—

టీక. సనకా...గౌరవంబు = సనకాదిమునులకు మోహజనకమైన, అహిరిపు = వృత్రాసురునికిశత్రువైన యింద్రునియొక్క ('శక్రేవృత్రాసురేఽప్యహిః' విశ్వః), గేహ = గృహమందలి, కనకాసన = బంగారు పీఠముయొక్క, ఆరోహ = ఎక్కుటయందు, గౌరవంబును, సవనా...వలనంబు-సవనానుగుణ = స్తోత్రానురూపమైన, మందపవన = మలయమారుతముయొక్క, అనుగత = ప్రసరణముగల నందనవనముయొక్క అధికానందముగల, విచలనంబు = విహారమును, ఘన...విభూతి-ఘనదీధితి = అధికకాంతియే, కలాప = ఆభరణముగాఁగల, ఖనదీ = మందాకినియందలి, జలఖగ = నీటిపక్షులయొక్క, ఆప ఘన = అంగములచేత దీపితములయిన, ద్వీప = నైకద్వీపములయందలి, గతి = సంచారములయొక్క, విభూతిని, అమరీ...మహిమ-అమరీ = దేవతాస్త్రీలయొక్క భుజములమీఁదుగ, విచాలి = చలించుచున్న, చమరీజ = వింజామరలచేత, వికచ = వికసించిన, అలిసమరీతిక = తుమ్మెదలతోడ సమానమైనరీతిగల, కచాలి = కొప్పులయొక్క చారుమహిమను, నరతనువుతోనె = మనుష్యశరీరముతోడనె, సుర...ధుర్యులు-సురవరనగర = ఇంద్రపట్టణమునందు మహితులైన, బహుతరైశ్వర్యధుర్యులు, ప్రస్తుతింపఁగా, కాంచుట, ఒప్పదె = తగదా? నామాట, మించెనేని = మీఱి నట్లయ్యెనా, నీకు, నీవైభవము, నిల్పుటే = నిల్పుటయే, కడిందీ = అశక్యము.

తా. హరి. నామాటవిని యీమతంగస్త్రీలను వరించినచో శరీరముతోడనే స్వర్గసుఖములననుభవింపఁ జేయుదు ననియు, లేనియెడ నీ వైభవము నీ కుండుట కష్ట మని యావిశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునితోఁ జెప్పెననియు.

నల. నాపలుకౌలకించి ఇంద్రుని వరించి యీశరీరముతోనే స్వర్గభోగము అనుభవింపు మనియు, నట్లు చేయనిచో నీకీవైభవము దక్కుట యశక్య మనియు నలుఁడు దమయంతితో నుడివె ననియు నాశయము.

మ. అనినన్ భూపతి జాతనిశ్చయముగా నమ్మేటితో నిట్లనున్
విను నాపూనిక నేల యూరకయ యువ్విళ్ళూరఁగాఁ బల్కెఁ నా
ఘనదేవేంద్రవిభూతి యెల్ల నజరాకారత్వ మే నొల్ల నా
కు నలప్రాయము జీవనం బితరవాగ్దంభంబు లిం కేటికిన్. 97

టీక. హరి. అనినన్=ఈతీరునఁ జెప్పఁగా, భూపతి=హరిశ్చంద్రుఁడు, జాతనిశ్చయముగా, నలప్రాయము=తృణప్రాయము.

నల. భూపతిజాత=రాజపుత్రి, దమయంతియనుట, నలప్రాయము=నలస్వరూపము.

చ. అనఘ వరప్రకర్ష దమనాంకమనూత్తమసంతతిన్ సిరుల్
దనర జనించి యందు నలధర్మపరిగ్రహభావ మిచ్చగిం
చిన నను నీగతిన్ బలుకఁ జెల్లునె యీబలితంపుఁబూన్కి నే
మనమున మాన నెట్లయిన మానెదఁగాని ధరిత్రి నేనియున్. 98

టీక. హరి. అనఘ వరప్రకర్ష!, దమనాంక-దమన = దాంతియే, అంక=చిహ్నముగాఁగలవాఁడా! (విశ్వామిత్రునికి సంబుద్ధులు) మనూత్తమసంతతిన్ - మను = వైవస్వతమనువుయొక్క; ఉత్తమసంతతిన్ = ఉత్తమకులమందు, ('సంతతి ర్గోత్రజనన' అమ.) అందున్=ఆవంశమునందును, అలధర్మపరిగ్రహభావమున్-అల = ఆ, ధర్మపరిగ్రహ=ధర్మపత్నీపరిగ్రహణమందలి, భావము=హృదయము, ధరిత్రి నేనియున్ = భూమినైనను, మానెదఁగాని = విడిచెదనుగాని, రాజ్యమునైనను విడిచెదను గాని, నాబలితమైనపూనికను మాన ననుట.

నల. అనఘ...సంతతిన్-అనఘమైన=వరప్రకర్షముగల, దమనాంక=దమనుఁడను పేరిటిఋషియొక్క, మనూత్తమ = మంత్రశ్రేష్ఠులయొక్క, సంతతిన్ = సంఘముచేత, నలభావ...మున్ - నలునికి, ధర్మపరిగ్రహభావమున్ = ధర్మపత్నినగుటను, ('పత్నీపరిజనాదానమూలశాపాః పరిగ్రహాః' అమ.) ధరిత్రి నేనియున్ = భూలోకము నైనను, మానెదఁగాని = విడిచెదను గాని. (శరీరత్యాగ మొనర్చి యీలోకమునైన విడిచెదనుగాని, నాపట్టును వదల ననుట.)

మ. అని నానాశ్రుతరంగసంకలితవాక్యావృత్తిఁ బాటింప నే
ర్పున నాతం డది యాలకించి యధికారుణ్యోదయాలోలలో
చనుఁడై నీతి సడల్చి యాత్మసముదంచత్కార్యమాత్రాదరం
బొనరన్ మానసభూమహోగ్రహవిశేషోదగ్రుఁడై యిట్లనున్. 99

టీక. హరి. అని, నానా...వృత్తిన్-నానా=సమస్తములైన, శ్రుత=శాస్త్రములనెడు, ('శ్రుతంశాస్త్రావధృతయోః.' అమ.) రంగమందు, సంకలిత=సమ్యక్కలితములైన, వాక్యములయొక్క, ఆవృత్తిని, పాటింపన్=ఆదరింపఁగా, (ధర్మముఁ దప్పి నడువరాదని శాస్త్రోక్తులు పలుకఁగా ననుట.) అధి...లోచనుఁడు-అధికమైన, ఆరుణ్య=రక్తిరక్తిమయొక్క ఉదయముచేత, అలోల = అంతటఁజలించుచుండెడు, లోచనములుగలవాఁడు, ఐ, మానస...దగ్రుఁడు-మానస = మనస్సునందు, భూ=పుట్టిన, మహాత్=అధికమైన, ఆగ్రహవిశేషముచేత, ఉదగ్రుఁడు; ఐ.

నల. నానా...వృత్తిన్ - నానా = అనేకములైన, అశ్రుతరంగ=కన్నీటి పరంపరలతో, ('అశ్రు నేత్రాంబు'అమ) సంకలిత = కూడిన, వాక్యములయొక్క, ఆవృత్తిని, ఆతండు=ఆనలుఁడు, అధి...లోచనుఁడు-అధికమైన, కారుణ్యోదయము చేత, అలోల=నిశ్చలమైన, లోచనుఁడు=నేత్రములుగలవాఁడు, ఐ, మానస...దగ్రుఁడు-మానసభూ=మన్మథుఁడనెడు, మహాత్=గొప్పదగు, గ్రహవిశేష=భూతవిశేషముచేత, ఉదగ్రుఁడు, ఐ=మన్మథపరాధీనుఁడై యనుట.

చ. మతకము లేల చాలు నిఁక మాటికొనంగ నలుండ నే మహో
న్నతి నిను వేడెదన్ బహుగుణస్తవనీయధరార్పణంబుచే
నతిచరితార్థుఁ జేయు మని యప్పుడ తద్ధృతిఁ గాంచి కాంచె న
య్యతివిబుధేంద్రుఁ డింద్రకలితార్థపరిచ్యుతిచింత నాత్మలోన్. 100

టీక. హరి. కనలు=కోపము, ఉండఁగా, బహుగుణస్తవనీయ! (హరిశ్చంద్ర సంబోధనము.) ధరార్పణంబుచేన్=భూమినొసంగుటచేత, అయ్యతివిబుధేంద్రుఁడు=ఆమునీశ్వరుఁడు, ఇంద్ర...చింతన్-ఇంద్రునితో, కలిత=చేయఁబడిన, అర్థ=ప్రయోజనముయొక్క, పరిచ్యుతి = చెడుటయందలి, చింతను (ఇంద్రునితోఁ దాఁ బలికిన యర్థమునకు హాని వచ్చె నని చింత నొందె ననుట.)

నల. మతకములు=మాయలు, మాటికొనంగన్=మఱుఁగుపఱచుకొనఁగా, ఏన్=నేను, నలుండన్=నలుఁడను, బహుగుణస్తవ! దమయంతీసంబోధనము. నీయధరార్పణంబుచే, తద్ధృతిన్=ఆదమయంతీసంతోషమును, అయ్యతివిబుధేంద్రుఁడు=ఇంద్రునతిక్రమించిన నలుఁడు, ఇంద్ర...చింతన్-ఇంద్రునియొక్క, కలితమైన, అర్థ = ప్రయోజనముయొక్క, ('అర్థోఽభిధేయరైవస్తుప్రయోజననివృత్తిషు.' అమ.) పరిచ్యుతి=చెడుటయందలి, చింతను, కాంచెన్=పొందెను.

గీ. అపుడు తడయక యవనికాంతానుషక్తి
నిలిచనవలాహితాద్భుతోజ్జ్వలతరాత్ముఁ

గాంచి సన్మిత్రకులమహీకాంతమణి హృ
దంతరచలాచలస్థితి నధిగమించి. 101

టీక. హారి. అవనికాంతానుషక్తిన్-అవనికాంతా = భూకాంతయందలి, అనుషక్తిన్=ఆసక్తిచేత, నిలిచిన...రాత్మున్=నిలిచినట్టి, వలాహిత=బలాహితునియొక్క, ('వబయోరభేదః') అద్భుతమైన, ఉజ్జ్వలతరమైన, ఆత్మగలవానిని, (విశ్వామిత్రుననుట) సన్మిత్ర...మణి-సత్ = శ్రేష్ఠమైన, మిత్రకుల = సూర్యవంశమునందలి మహీకాంతులలో, మణి=శ్రేష్ఠుఁడైన హరిశ్చంద్రుఁడు, హృ...స్థితిన్-హృదంతరమందు, చలాచల=మిక్కిలి చలించుచున్న, స్థితిని, అధిగమించి=పొంది.

నల. యవని...షక్తిన్-యవనికా = తెరయొక్క, అంత=అంతరముయొక్క, అనుషక్తిన్=సంసక్తిచేత, నిలిచి, నవలా=దమయంతి, కర్త. హితా...తాత్మున్=హితమును, అద్భుతమును, ఉజ్జ్వలతర = మిగులఁబ్రకాశమానమును నైన, ఆత్మున్=శరీరముగలిగినవానిని, స...స్థితిన్-సత్ = నక్షత్రములకు మిత్రుఁడైన చంద్రుని యొక్క కులముగల, మహీకాంతమణి=రాజశ్రేష్ఠుఁడగు నలునియొక్క, హృదంతరమునందలి, చలాచల=మిక్కిలి చలించిన, స్థితిని = నిలుకడను, అధిగమించి = తెలిసి.

చ. అనుపమవృత్తి నాత్మపరమాప్తముఖంబున మున్ను విన్నయే
వును గలలోనఁ గాంచినయపూర్వపురూపును నంతకన్న మిం
చునఁ దనరారుకట్టెదుటిచూపును బైపయి నద్భుతప్రగుం
భనము మనంబునం బెనుపఁ బల్కె ననుంగువెలఁదిపల్కులన్. 102

టీక. హారి. వెలందిపల్కులన్=ప్రసన్నములైన వాక్యములతో.

నల. కలన్=కలను, లోనన్ = లోపల, అనుంగువెలంది పల్కులన్=ప్రియసఖుల ద్వారా పలికె నని భావము.

సీ. పుడమి నీ వేలనియెడ మఱి యున్న దే
వేఱొక్కగతి సారె వెగడుపఱచి
తలఁపు లారసిచూడ వల దూరక యనిర
తమునీశ మజీవితంబు భవద
ధీనంబు సత్కృపాదృష్టి నాపై నింపు
మన విని యమ్మేటియతివిముక్త
దాక్షిణ్యుఁడై కటా తలఁతురు సత్యాత్ముఁ
డనుచు ననుదినంబు నధికమోహ

తే. శీలునిఁ బొమ్మ మృషలిట్టు కౌశికునియందుఁ
దగునె సత్కీర్తికై సమస్తమును నొసఁగు
పుణ్యుల గణింప మఱచితి బుద్ధి ననిన
మనమునఁ జలింపకుండెనయ్యనఘుఁ డపుడు. 103

టీక. హరి. పుడమిన్, నీ వేలసరోయిడ=నీ వేలనిష్ఠలము, మఱి, ఉన్న దే=కలదా? అనిరత=ప్రీతిలేనివాఁడా! (వస్తుప్రీతి లేనివాఁ డనుట.) మునీశ! సంబుద్ధులు. అష్మేటియతి, సత్యాత్ముఁడు=సత్యహృదయుఁడు, అనుచున్, మోహశీలుఁడగు, నిన్=నిన్ను, (తలంతు రనియన్వయము) మృషలు=అబద్ధములు, కౌశికునియందున్ = విశ్వామిత్రునివిషయమున, తగునె = యుక్తమా! (విశ్వామిత్రుఁడ నగునాతోడఁ బొంకఁ దగునా) మఱచితి=మఱచితివి. అనినన్ = చెప్పఁగా,అయ్యనఘుఁడు = ఆమహాత్ముఁడగుహరిశ్చంద్రుఁడు, అపుడు. ముందటి పద్యముతో నన్వయము.

వఱ. పుడమిన్=భూమియందు, నీవు, ఏలనిరోయిడన్ = ఏలుకొననివో (నన్ను నీవు వివాహ మాడనిచో ననుట.) వేఱొక్కగతి, ఉన్నదా? ఊరకయు, నిరతమున్= ఎల్లపుడును, ఈశ! సంబుద్ధి. అష్మేటి = అనలుఁడు, అతివిముక్తదాక్షిణ్యుఁడై, అధిక మోహశీలునిన్, ననః=నన్ను, సత్యాత్ముఁడు = సతియందుమనస్సుగలవాఁడు, స్త్రైణబుద్ధి గలవాఁడనుట. అనుచు, తలఁతు రని పై పద్యముతో నన్వయము. కౌశికునియందున్=ఇంద్రునియందు, మఱచితిన్=మఱచిపోయితిని, అని, నమనమున = నమ్రతతో, చలింపకుండెను = చింతచేఁ దలపంచుకొని యుండె ననుట.

గీ. సమధికప్రభావగణితచంద్రమతిజ
గన్నుతాకృతికలహంసగమనలీల
నరుగుదెంచి వసుంధరావరపురంద
రాత్మజోత్సాహ మెసఁగ ని ట్లనియె నెలమి. 104

టీక. హరి. సమధిక...గణిత-సమధికమైన, ప్రభావముచేత, గణిత=ఎన్నఁబడినదియు, జగన్నుతాకృతి, కలహంసగమనయు నగుచంద్రమతి,కర్త.వసుంధరా... త్సాహము-వసుంధరావరపురందర=హరిశ్చంద్రునియొక్క, ఆత్మయందు, జ = పుట్టిన, ఉత్సాహము, ఎసఁగన్=అతిశయింపఁగా, ఎలమిన్. ఇ ట్లనియెను.

వఱ. సమ...చంద్రము-సమధికమైన, ప్రభ=కాంతిచేత, అవగణిత=నిరసింపఁబడిన, చంద్రము=చంద్రుఁడుగలదియును, అతిజగన్నుతాకృతియును, నగు కలహంస, ఇది కర్త. వసుంధరా...త్సాహము - వసుంధరావరపురందర = రాజేంద్రునియొక్క, ఆత్మజ = కొమార్తెయగు దమయంతియొక్క, ఉత్సాహము.

చ. తెలుపనె ను న్నుగాఁ ద్రిజగతీనుతసత్యవతంస సద్గుణో
జ్జ్వల భవదీయదివ్యనుతిశాలినితాంతశుభాంగలక్ష్మి కీ
యలఁ గుఁడు యోగ్యుఁ డక్షయమహాసుకృతోన్నతి కిమ్ము చాలునీ
కలఁక యనంతవిఘ్నములకల్మి తిరం బని యెన్న నేటికిన్. 105

టీక. హరి. త్రిజ...తంస-త్రిజగతీనుతమైన, సత్యము, అవతంస = భూషణము గాఁ గలవాఁడా! సద్గుణోజ్జ్వల!=మంచిగుణములచేత నొప్పినవాఁడా! భవ...లక్ష్మికి-భవదీయ=నీసంబంధమైనదియు, దివ్య=దేవతలయొక్క, నుతి = స్తోత్రముచేత, శాలి = ఒప్పెడిదియు, నితాంతశుభ=మిక్కిలిశోభనకరములైన, అంగలక్ష్మికి = రాజ్యలక్ష్మికి, యోగ్యుఁడు, అక్ష...న్నతికిన్ - అక్షయమై, అధికమైన, సుకృతౌన్నత్యమునకు, ఇమ్ము = దానముచేయుము. అనంతవిఘ్నములకల్మి = అనేకవిఘ్నములతోఁ గూడిన సంపద, తిరంబని = స్థిరంబని, సుకృతోన్నతికనుఁ జతుర్థికిషష్ఠి. లక్షణము.— "క. నెలకొనితఱుచుఁ జతుర్థికి, నలవడఁగాషష్ఠివచ్చునహిపతిశయనా!" (కవిచింతామణి) 'అనంతవిఘ్నములకల్మి', అంతర్గతబహువ్రీహి.

నల. త్రిజ...తంస - త్రిజగతీనుతలైన, సతీ = పతివ్రతలయందు, అవతంస = శ్రేష్ఠమైనదానా!, సద్గుణోజ్జ్వల, దమయంతీసంబోధనములు. భవ...లక్ష్మికి, (నీయవయవసౌందర్యసంపదకనుట.) మహా...తికి, ఇమ్ము = ఉనికిపట్టు, అనంతవిఘ్నములకల్మి = పెక్కువిఘ్నములుకలుగుట, తిరంబు, అని. ఇందులకుఁ బెక్కువిఘ్నములు కలిగె నని చింత వల దనుట.)

క. వనజభవునాజ్ఞ యువిలం
ఘనీయ మిఁక సంశయింపఁగా వలదు సుమీ!
యని తెలిపి మఱియు హితమతిఁ
దనుఁ గనుఁగొని యలరు ధరణిధవుతో ననియెన్. 106

హరి. సుగమము.

టీక. నల. వనజభవునాజ్ఞ = బ్రహ్మశట్టడ, బ్రహ్మవాహన మైనయాహంసము తాను బ్రహ్మనుగూర్చి "నలుని కెవ్వతె ప్రేయసి కాఁగల" దని యడుగఁగా నా బ్రహ్మ "దమయంతి" యని చెప్పి నటులు దమయంతితో నీహంసము చెప్పె నని నైషధగాథ. అది యిట ననుసంధింపఁబడినది. ఆకారణముననే యిట వనజభవునాజ్ఞ యని చెప్పఁబడెను.

ఉ. మెత్తురు నీగుణార్ణవసమృద్ధియు శుద్ధియు వేల్పు లాత్మలో
నిత్తఱిఁ జింత మానుము దమీహితపూర్తి ఘటిల్లఁ జేసి లో

# ద్వితీయాశ్వాసము

క. లోకోత్తరకీర్తి రామనుమహోన్నతిఁ జెందు [1]మనంబులోన నా
నుత్తలమింతయుఁ బొరయ కుత్సుకుఁ డయ్యెన్నృపాలుఁ డెంతయున్.

టీక. హరి. దమిహాతపూర్తిన్-దమి=విశ్వామిత్త్రునియొక్క, ఈహిత=ఇష్టార్థముయొక్క ('ఇచ్ఛా కాంక్షా స్పృహేహా తృట్' అమ.) పూర్తి = పరిపూర్తిని, లోకోత్తరకీర్తి = లోకాతిశయమైనయశస్సు; రాన్ = రాఁగా, మన=మనుము, మహోన్నతిన్, మనుమహోన్నతిన్=మనువుయొక్క, మహోన్నతివంటిమహోన్నతి ననియు నన్వయింప నగు.

నల. ముదము = హర్షము, ఈహితపూర్తిచేత, లోకోత్తరకీర్తి. సంబుద్ధి. రామను = దమయంతిని.

వ. ఆయెడ నాఖండలాదిలోకపాలకు లమ్మర్త్యమలోకపాలు నఖిలలోకస్తుత్యప్రతిజ్ఞాసంవిధానంబుఁ జూడఁ దోడన నేతెంచి తదీయధైర్యంబును దద్దేకాయత్తచిత్త యగునమ్మత్తకాశినియుచిత[2]రచితవచనాచాతుర్యంబును గాంచి యమందానందకందళతరంగితాంతరంగులై సంప్రాప్తసౌమనస్యసర్వసర్వంసహాధీశ్వరసహితంబుగా మహోజ్జ్వలఘనమార్గంబు నలంకరించి యననుకరణీయకరణానుభావనలతానిబంధనబంధురాత్మకత్వంబునఁ గల్యాణకల్పితవిమానంబులఁ బ్రకాశించి రనంతరంబ నిరంతరోత్సాహంబున నతిశుద్ధాంతస్థితిగ్గాయి యనంతవైభవప్రతిపాదనోచితవేషంబున నచ్చక్రవర్తియు నచ్చటి వియచ్చరుల కచ్చెరువుగా విలసిల్లె నాశుభప్రదేశం బపారచారు చటులవాచాప్రపంచితవాచాలితం బయ్యె నప్పుడు.

టీక. హరి. సంప్రాప్తమైన, సౌమనస్య = దేవత్వముగల, సర్వసర్వంసహాధీశ్వర = సకలరాజులతో, (రణనిహతులై దేవత్వము నొంది స్వర్గసుఖంబుల ననుభవించు రాజులతో ననుట) సహితంబుగా, మహో...మార్గంబున్-మహోజ్జ్వల=మిక్కిలి ప్రకాశమైన, ఘనమార్గంబున్=ఆకాశంబును, అనను...త్వంబునన్-అననుకరణీయ=అనుకరింపఁగూడని, కరణ = ఇంద్రియములయొక్క, అనుభావనము లెడు, లతా=తీఁగలయొక్క, నిబంధనముచేత, బంధురమైన, ఆత్మకత్వంబున=మనముగల్గుటచేత, (ఏకాగ్రచిత్తులై యనుట.) కల్యాణ...విమానంబులన్ = కాంచనరచితవిమానంబులయందు, అతిశుద్ధాంతస్థితిగ్గాయి అతిశుద్ధ=మిగులఁబరిశుద్ధమైన,అంతస్థితిగ్గాయి=అంతరంగస్థితిగలవాఁడై, అనంత...వేషంబునన్ - అనంతమైన, వైభవ = రాజ్య

1 మనన్ మనంబులో. 2 వచనరచనా.

వైభవముయొక్క, ప్రతిపాద=దానమునకు, ('విశ్రాణనం వితరణం స్పర్శనం ప్రతిపాదనమ్' అమ.) ఉచితమైన, వేషముచేత, అచక్రవర్తియుఁ=అహరిశ్చంద్రుఁడును.

నల. సంప్రా...తంబుగాఁ(న్)-సంప్రాప్త=పొందఁబడిన, సౌమనస్య=సౌహార్దముగల, సర్వపర్వంసహాధీశ్వరసహితంబుగన్ = సమస్తరాజులతోఁగూడ, మహోజ్జ్వలఘనమార్గంబు (న్) మహా=స్వయంవరోత్సవముచేత, ఉజ్జ్వలమై, ఘనమైన, మార్గంబున్=రాజమార్గమును, అనను...త్వంబునన్ - అననుకరణీయ = అనుకరింపశక్యంబుగాని, కరణ=శరీరముయొక్క, అనుభావ = రూపాతిశయముగల, నలతా = నలభావముయొక్క, నిబంధ=సంబంధముచేత, బంధుర=రమ్యమైన ('మరాళే బంధురః పుంసి త్రిషు స్యాన్నద్రరమ్యయోః' నానా.) ఆత్మకత్వంబునన్ = దేహములుగలవారలగుటచేత, కల్యాణకల్పిత విమానంబులన్ - కల్యాణకల్పిత = శుభకల్పితములైన, విమానంబులయందు, అతిశుద్ధాంతస్థితి-అతి+శుద్ధాంతస్థితి=అంతఃపురస్థితి నతిక్రమించినవాఁడై, ('శుద్ధాంతశ్చావరోధశ్చ' అమ). అంతఃపురమునుండి వెడలినవాఁడైయనుట. అనంత......వేషంబున = అనంతవైభవప్రతిపాదనకు, ఉచితమైన, వేషంబున, అచ్చక్రవర్తియు = అనలుఁడును.

సీ. వరదానధూర్వహస్వాంతోన్నతివరాట
  కద్వీపినీనాథకాంచికాంతుఁ
డగణితప్రోత్సాహ మిగురొత్తఁ దన కన్య
  వారిజాసనరేఖ వఱలుగురుని
యతిఁ బావనాభిషేకార్ద్రకౌశేయర
  త్నవిభూషణాదులఁ దనరఁ జేసి
వాహినీగణములవారిసన్నాహంబు
  బెరయ నచ్చటికి రప్పించుటయును
తే. [1]నృపతిసద్గుణములచేఁ బ్రహృష్టహృదయ
వనజ యై నిర్మలాంబరవాణి వచ్చి
యురగసురసిద్ధసాధ్యకింపురుషయక్ష
రాక్షసాదులఁ బేర్కొని క్రమముతోడ. 109

టీక. హరి వర...కాంతుఁడు-వర=శ్రేష్ఠమైన దానముయొక్క, ధూర్వహ=భారవాహకమైన, స్వాంతోన్నతి=చిత్తౌన్నత్యమందు, వరాటకత్=గవ్వవలెనాచరించుచున్న ('స్థూలరజ్జౌ బీజకోశవరాటే చ వరాటకం' నానా.) ద్వీపినీనాథ = సముద్రుఁడు, కాంచి=మొలనూలుగాఁగలభూమి, కాంతుఁడు = కాంతగాఁగలహరిశ్చంద్రుఁడు, భూకాంతుఁడనుట (ద్వీపినీనాథకాంచీశబ్దము అబ్ధిమేఖలాశబ్దమువలె భూవాచకము.) తనకున్, అగణితప్రోత్సాహము, ఇగురొత్తన్=పుట్టఁగా, అన్యవారి

1. నన్నృపతిసద్గుణములఁ బ్రసన్నహృదయ.

శాసనరేఖన్ = రెండవబ్రహ్మయొక్క వైఖరిచేత. ఇఱులు గురుని = ఒప్పెడుగురుఁడైన, యతిన్=విశ్వామిత్రుని, పావ...దుకన్=పావనమైన అభిషేకముచేత, అర్హా=యోగ్యములైన, కౌశేయ=పట్టువస్త్రములు, రత్నవిభూషణాదులన్ = మణిమయాభరణములు మున్నగువానిచేతను, వాహినీ గణములవారి (న్) = నదులయొక్క యుదకమును, దప్పించుటయును, నిర్మలాంబరవాణి = పరిశుద్ధమైనయాకాశవాణి, వచ్చి (అచ్చటి కేతెంచి యనుట), పేర్కొని=పిలిచి.

వల. వర...న్నతి(గలవాఁడు) వరాటక...కాంతుఁడు=వరాటకదేశభూపతి యగు భీముఁడు, తనకన్యన్=తనకూఁతురగు దమయంతిని, వారిజాసనరేఖన్ - వారిజాసన = చంద్రునియొక్క, ('వారిజాని అస్యతీతి వారిజాసనః [అను త్పత్తి']) రేఖవంటి రేఖచేత, ఇఱులు గురుని యతిన్=ఒప్పునధిక భాగ్యవతి యగుదానిని, వాహి...హంబు = వాహినీగణములవారియొక్క, (సేనయొక్కయనుట) సన్నాహము=ప్రయత్నము, బెరయన్ = కలుఁగఁగా, నిర్మలాంబర = ధౌతవస్త్రపరిధానయైన, వాణి = సరస్వతి, వచ్చి, పేర్కొని = ఉగ్గడించి.

సీ. సారోద్ధృతారిమహారాష్ట్రుఁ డీతఁ డు
        జ్జ్వలజయశ్రీశాలివత్సుఁ డితఁడు
    భృతవందిమాగధుం డితఁడు కళాభిజ్ఞ
        మాళికర్ణాటసమాఖ్యుఁ డితఁడు
    బహుగుణమణిసింధుపతి యితం డభివర్ధి
        తార్యసత్కవికరహాటకప్ర
    కాండుఁ డీతఁడు దిఙ్ముఖప్రసాధనభుజా
        విక్రాంతికాశ్మీరవిభుఁ డితండు
తే. పరనృపతిదత్తయువతిచామరసమీర
    వలనసౌభాగ్యహారికుంతలకలాపుఁ
    డీతఁ డని యనివారితఖ్యాతి మెఱయ
    సకలభూపాలకులవరు సన్నుతించి. 100

టీక. వారి. ఈతఁడు, సారో...రాష్ట్రుఁడు-సార = బలముచేత, ఉద్ధృత = పెల్లగింపఁబడిన, అరిమహారాష్ట్రుండు = శత్రుమహారాజ్యంబులుగలవాఁడు, ఉజ్జ్వలజయశ్రీశాలియైన, వత్సుఁడు = ఱొమ్ముగలవాఁడు, ('ఉరోవత్సంచవక్షశ్చ' అమ.) భృత...గంధుండు-భృత = భరింపఁబడిన, వందిమాగధులుగలవాఁడు, కళా...మాఖ్యుఁడు-కళాభిజ్ఞ=విద్యానైపుణ్యముగలవారలలో, మాళి=శ్రేష్ఠులైనవారలయొక్క, కర్ణ=చెవులయందు, అట=సంచరించుచున్న, సమాఖ్యుఁడు=కీర్తిగలవాఁడు, ('యశః కీర్తిస్సమాఖ్యాచ' అమ.) బహుగుణమణిసింధుపతి-బహు=అనేకములైన, గుణము అని

---

1, శాలి.

రోదుమణులకు, సింధుపతి=సముద్రుఁడు, అభి...కొండుఁడు-అభివర్ధిత = వృద్ధినొందింపఁబడిన, ఆర్యులయిన, సత్కవులయొక్క, కర=హస్తమునందలి, హాటకప్రకాండుఁడు = సువర్ణసంఘముగలవాఁడు, దిఙ్ముఖ...విభుఁడు-దిఙ్ముఖములకు, ప్రసాధన = అలంకారమైన, భుజావిక్రాంతి = భుజవిక్రమమును, కశ్మీరవిభుఁడు = కుంకుమప్రభగలవాఁడు, పర...కలాపుఁడు = సౌభాగ్యముచేత, హారి = మనోహరమైన, కుంతల = ముంగురులయొక్క, కలాపుఁడు = సంఘముకలవాఁడు, ఇతఁడు, అని, సకలభూపాలకులవరు (లు) = హరిశ్చంద్రుని, సన్నుతించి.

నల. ఈతఁడు=ఈరాజు, సారోద్ధృతారి-సార=బలముచేత,ఉద్ధృత=హరింపఁబడిన, అరి=శత్రువులుగల, మహారాష్ట్రుఁడు=మహారాష్ట్రదేశాధీశుఁడు, ఇతఁడు=ఈరాజు, ఉజ్జ్వలజయశ్రీశాలి, ఉజ్జ్వల=ప్రకాశమానమైన, జయసంపదచేత, శాలి = ఒప్పుచుండెడు, వత్సుఁడు=వత్సదేశాధీశ్వరుఁడు, ఇతఁడు, భృతవంది-భృత=భరింపఁబడిన, వంది=పాఠకులుగల, మాగధుండు=మగధదేశపురాజు, ఇతఁడు, కళాభిజ్ఞమౌళి=కళానిపుణులయందుశ్రేష్ఠుఁడగు ('ప్రవీణోనిపుణోఽభిజ్ఞః' అమ.) కర్ణాటసమాఖ్యుఁడు=కర్ణాటరాజు, ఇతండు=ఈరాజు, బహుగుణమణియైన, సింధుపతి=సింధుదేశాధీశుఁడు,ఈతఁడు,అభివర్ధితార్యసత్కవి-అభివర్ధిత=వృద్ధినొందింపఁబడిన, ఆర్యులును, సత్కవులునుగల, కరహాటకప్రకాండుఁడు=కరహాటకదేశపురాజు, ('మతల్లికామచర్చికాప్రకాండముద్ఘతల్లజౌ, ప్రశస్తవాచకాన్యమూని' అమ.) ఇతండు, దిఙ్ము...విభుఁడు = దిఙ్ముఖములకు, ప్రసాధన = అలంకారమైన, భుజావిక్రాంతి = బాహువిక్రమముగల, కాశ్మీరవిభుఁడు = కాశ్మీరదేశాధీశుఁడు, ఈతఁడు, పరనృపతి...కలాపుఁడు-పరనృపతి=శత్రురాజులచేత, దత్త = (కానుకగా) నొసఁగఁబడిన, యువతి=స్త్రీలయొక్క (స్త్రీలచేతవీవఁబడుచున్నవనుట), చామర = వింజామరములయొక్క, సమీరవలనముచేనైన, సౌభాగ్యముచేత, హారి=ఒప్పుచుండెడు, కుంతలకలాపుఁడు=కుంతలదేశాధీశుఁడు, పర్యాయ = క్రమముగా.

సీ. ఎన్న నేరికిఁ దరంబే గురుసంగర
విజయైకనిధు లయి వెలయుచున్న
లవసుమతీశ్వరులయరీణగుణమణు
లనుచు సారెకుఁ దదీయంబులైన
నానావిపక్షఖండనధుర్యచాతుర్య
ములు మరున్మిత్రతాస్ఫురణములు మ
హౌర్యమతనయభావానుభావంబులు
భువనసంభరణవైభవములును బ్ర

గీ. కామఘనసత్కరణధామతామహత్త్వ
విలసనంబులు నొక్కటఁ దెలియఁ బలికెఁ
గౌశికానుగగీర్వాణగణము మదికి
సంభ్రమసమాకులత్వంబు సంభవింప. 111

టీక. హరి. గురు...నిధులు = గురువగు వసిష్ఠునియొక్క, సంగర = ప్రతిజ్ఞయొక్క, ('ప్రతిజ్ఞాసంవిదాపత్సుసంగరః' అమ.) విజయమునకు, ఏకనిధులు, అయి= కలిగి, వెలయు...శ్వరు - వెలయు = తెలసిన, (వసిష్ఠుఁడుచేసిన ప్రతిజ్ఞ నీచేర్పఁగల యనుట.) ఈ; నల=తృణప్రాయమైన-వసుమతీ=భూమికి,(నలవ=అనల్పమయిన,సుమతీ= బుద్ధిగల), ఈశ్వరు=ప్రభువుయొక్క, ('ఈశ్వరః పతిరీశితా' అమ.) రాజ్యమును తృణ ప్రాయముగాఁ దలంచి, (భూదానమొసంగఁదలఁచిన హరిశ్చంద్రునియొక్క యనుట.) అయ...మణులు-అయ=నాశమువలన, రీణ=జాఱిన,(అనువిరహితము అనుట) ('స్యన్నం రీణంస్రుతంస్నుతమ్' అమ.) గుణమణులకా, ఎన్నఁగా, ఏరికిఁగా=ఎవరికైనను, తరంబె = సాధ్యమా, అనుచు, నానా...ర్యములు-నానావిపక్ష ఖండన = సమస్తశత్రుఖండన మందు, ధుర్యమై,చాతుర్యములు=నైపుణ్యములు, మరు...రణములు-మరుత్ = దేవతల యొక్క, మిత్రతా = మైత్రియొక్క, స్ఫురణములు, మహా...భావంబులు-మహాత్ ఆర్య=సత్పురుషులకు, మత=సమ్మతమైన, నయభావ=నీతిభావముయొక్క, అనుభావం బులు=అతిశయములు, భువన...ములును-భువనసంభరణ=లోకరక్షణముయొక్క, వైభ వములు, ప్ర కామ...విలసనంబులు=ప్రకృష్టమైన, కామ = కోరికలయొక్క, ఘన సత్కరణ=అధికసత్కారమునకు, ధామతా=నిలయమౌట, మహత్త్వవిలసనములు, కౌశికా...మదికిఁగా-కౌశిక=విశ్వామిత్రునకు, అనుగ=సహచరులైన, గీర్వాణ=మునుల యొక్క, గణము=సమూహముయొక్క, మదికిఁగా=మనస్సునకు, "గురుసంగరవిజయైక నిధులయి" యనుచో "అయి"యనుపదమునకు'కలుగు'అను నర్థమునకుఁ బ్రయోగము లు:—సీ."అప్సరోని కురుంబ మాటలు పాటలు,నయి వినోదింపంగ నమరగణము..."

(శాంతి. భార.)

శా. "ప్రాతర్వేళల నట్టిపెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామంబుకుల్యాబహు
స్రోతస్పంధుల నంధుయంత్రనతికృతో ప్రిద్ధీత గేయాఘమౌ". (ఆముక్తమాల్యద.)

నల. ఇట నింద్రాదులగు నలురుదేవతలు నలరూపముల వహించియున్నారు. కావున, "నానా..." అది సాల్గువాక్యములయందు నలపరముగను, వానిలో

1 వెలయఁ.

నొకొక్కవాక్యము క్రమముగ నింద్ర, అగ్ని, యమ, వరుణుల పేరటను నర్థము స్ఫురించునటులను, 'ప్రకామ...' వాక్యముచేత, పైనలాగు లైదుగురిగుణములు స్ఫురించునట్లును జెప్పఁబడియున్నది. ఏగురు = ఐదుగురు (నలరూపధారులైన దేవతలు నలుగురు, నలుఁ డొక్కఁడు.)సంగర విజయనిధులు=యుద్ధములయందు జయశీలురు. అయి, వెలయు...మణులు- వెలయు = ఒప్పుచుండెడు. నలవసుమతీశ్వరుల = నలమహారాజుల యొక్క, అరీణములైన గుణమణులు, ఎన్నఁగ=గణించుటకు, ఏరికిన్=ఎవరికి,తరంబు= సాధ్యము, అనుచు, తదీయంబులు.

1. ఐన నానా...ర్యములు - (నల) నానావిపక్ష = సకలశత్రువులయొక్క, ఖండనమందు, ధుర్యమైనచాతుర్యములు. (ఇంద్ర) నానా = సమస్తములైన, అవి = పర్వతములయొక్క, ('అవయశ్శైలమేషార్క' అమ.) పక్ష=రెక్కలయొక్క, ఖండనమందు, ధుర్యములైన చాతుర్యములు.

2. మరున్మిత్రతాస్ఫురణములు-(నల) మరుత్=దేవతలయొక్క, మిత్రతా = మైత్రియొక్క, స్ఫురణములు, (అగ్ని) మరుత్=వాయువుయొక్క, మిత్రతా=సఖ్యము యొక్క స్ఫురణములు, ('మరుతౌ పవనామరౌ' అమ.)

3. మహార్యమతనయభావానుభావంబులు - (నల) మహాత్=శ్రేష్ఠులైన, ఆర్య= పెద్దలకు, మత=సమ్మతమైన, నయభావముయొక్క, అనుభావంబులు, (యమ.) మహా, అర్యమ=సూర్యునియొక్క, తనయభావముయొక్క, అనుభావంబులు=ప్రభావములు.

4. భువనసంభరణవైభవములు - (నల) భువనసంభరణ = లోకసంభరణము యొక్క, వైభవములు, (వరుణ) భువన=ఉదకముయొక్క, సంభరణవైభవములు.

5. ప్రకామఘనసత్కరణధామతామహత్త్వవిలసనంబులు - (నల) ప్ర = ప్రకృష్టమైన, కామ=మన్మథునియొక్క, ఘన=అధికమైన, సత్=యోగ్యమైన, కరణ ధామతా = దేహకాంతివంటి కాంతికలుగుటయొక్క, మహత్త్వవిలసనంబులు. ప్రకామఘన = అనేకములయిన, కరణధామతా = నేత్రములుగల్గుటయొక్క, మహత్త్వవిలసనములు = నేత్రము తైజసేంద్రియము అనియు నన్వయింపనగును.

(ఇంద్ర.) ప్రకామ = మిక్కిలి, ఘన = అమితములైన, సత్ = లెస్సైన, కరణ=ఇంద్రియములయొక్క (నేత్రేంద్రియ సహస్రముయొక్క యనుట.) ('కరణం సాధకతమక్షేత్రగాత్రేంద్రియేష్వపి' అమ.) ధామతా = నిలయమౌటయొక్క, మహత్త్వవిలసనంబులు.

(అగ్ని) ప్రకామఘన = మిక్కిలిఘనమైన, సత్కరణ = యజ్ఞాదిసత్కార్యములకు, ధామతా=ఆధారమౌటయొక్క, మహత్త్వవిలసనములు.

(యమ) ప్రకామ = మిక్కిలి, ఘన = మేఘమువలె, సత్ = లెస్సైన, కరణ=శరీరముయొక్క, ధామతా=తేజస్సుగలుగుటయొక్క, మహత్త్వవిలసనములు.

(వరు.) ప్రకామ=మిక్కిలి, ఘన=మేఘములయొక్క, సత్కరణ=సత్కారములగల, ధామతా=గృహముగలుగుటయొక్క, మహత్త్వవిలసనములు, (సముద్రము గృహముగాఁ గలుగుట యనుట.) ఒక్కట=ఒక్కసారే, (ఏకవాక్యమున నే యనుట.) కౌశి...మదికి-కౌశిక=ఇంద్రునికి, అనుగ = సహచరులైన, గీర్వాణ = దేవతలయొక్క (అగ్నియమవరుణులయొక్క యనుట), గణముయొక్క, మదికిన్ = మనస్సునకు, సంభవింపన్, తెలియఁబలికె నని యన్వయము.

గీ. అవు డవరనిశ్చయంబుతో నవనిజాని
మణిజనాకులవినుతిసంపదలు దగ భ
జించి సుమనఃప్రసాదసంసిద్ధిచే న
నంతభూస్పర్శనవిచార మాత్మఁ బొడమ. 112

టీక. హరి. అపుడ, వరనిశ్చయంబుతోన్-వర=శ్రేష్ఠమైన, నిశ్చయంబుతోడ, అవనిజానిమణి=రాజశ్రేష్ఠుఁడగు హరిశ్చంద్రుఁడు, జనా...సంపదలు=జనులయొక్క, ఆకులముతోఁగూడుకొనిన, వినుతిసంపదలు, సుమనః ప్రసాదసిద్ధిచేన్-సుమనః = మంచిమనస్సుయొక్క, ప్రసాదసిద్ధిచేత, అనంత...విచారము-అనంత = అపరిమితమైన, భూస్పర్శన = భూదానముసంబలి, విచారము ('స్పర్శనం స్పృష్టిదానయోః' యాదవ ని.)

నల. అపుడు, అవరనిశ్చయంబుతోన్ = వరనిశ్చయాభావముతో (వరుని నిశ్చయింపఁజాలక యనుట) అవనిజానిమణిజ = రాజేంద్రపుత్త్రియగు దమయంతి, నాకులన్ = దేవతలను, భజించి, సుమనః...సిద్ధిచేన్-సుమనః = దేవతలయొక్క, ప్రసాదసంసిద్ధిచేత, అనం...చారము-అనంత=ఆకసమునందలి, భూ=భూమియందలి, స్పర్శనవిచారము=స్పృశించుటయొక్క విచారము, (సంచారవిచారమనుట.) దేవతలయొక్క గగనస్పర్శనమును, నలునియొక్క భూస్పర్శనమును ననుట, ఆత్మన్ = మనస్సునందు, పొడమన్ = పుట్టఁగా.

చ. అమరవరక్షమామరవరాంచితవృత్తులు వింగడించి నే
ర్పమరఁగ నాసురూపవినుతాఖిలసద్గుణపాత్రతానిధిన్
విమలసుగంధమాల్యవినివేశవిభూషితుఁ జేసి యాత్మభూ
సమధిక రాజ్యవైభవ మొసంగె నశేషముఁ దద్వశంబుగన్. 113

టీక. హరి. అమర...వృత్తులు-అమరవర=దేవతలయొక్కయు, క్షమామరవర=భూసురవరులయొక్కయు, అంచితములైన, వృత్తులు = మాన్యవృత్తులు (దేవబ్రాహ్మణభూములను), వింగడించి = వేఱుపఱచి, ఆ సు...నిధిన్, ఆ సురూప = బుధులచేత ('ప్రాప్తరూపసురూపాభి రూపా బుధమనోజ్ఞయోః' అమ.), వినుతమైన, అఖిలసద్గుణములకు, పాత్రతా=పవిత్రతకును, నిధియైనవిశ్వామిత్రుని, విమల...విభూషితున్=

విమలములైన, సుగంధమాల్యములయొక్క, వినివేశ=సమర్పణముచేత, విభూషితుఁ=అలంకరింపఁబడినవానిఁగాఁ జేసి, ఆత్మ...వైభవము-ఆత్మ=తనయొక్క, భూ=భూమియొక్క, సమధిక రాజ్యవైభవము, అశేషము=సమస్తము, తద్వశంబుగన్=ఆవిశ్వామిత్రుని యధీనముగా, ఒసంగెను.

నల. అమ...వృత్తులు-అమరవర = దేవతలయొక్కయు, భూమామరవర= భూదేవేంద్రుఁడగు నలునియొక్కయు, అంచితమైన. వృత్తులు=వ్యాపారములు,(భూగగన సంచారము అనుట) అనుహూప= ఆ సౌందర్యవతియగు దమయంతి, ఇది కర్త. విను...నిధిన్-నిధిన్=నిధియైన నలుని, విమల...భూషితున్=విమలమైన సుగంధము గల, మాల్య=పుష్పమాలికలయొక్క, వినివేశ=అర్పణముచేత, విభూషితున్=అలంకరింపఁబడిన వానినిగాఁ జేసి, ఆత్మభూసమధిక రాజ్యవైభవము-ఆత్మభూ=మన్మథుని యొక్క, సమధిక రాజ్యవైభవమును = సామ్రాజ్యవిభవమును.

సీ. రంభాదిహారిణనేత్రలు మెలపాడిరి
పాడిరి కిన్నరాబ్జాతముఖులు
హారిదధీశ్వరులు నెయ్యమున మన్నించిరి
నించిరి విరివాన నిఖిలసురులు
ధరణిపాలకులు చిత్రములపెం పూనిరి
పూనిరి చారణుల్ భూరినుతులు
సమదవిశ్వామిత్రజనులు భ్రమించిరి
మించిరి వేడ్కతో మిత్రవంశ్యు
తే. లపు డసమమార్గణమహీలాభాత్మకప్రి
యాధికస్పర్శనకృతార్థుఁడై నృపాల
మణియును ననంతరారచ్యమానవినుత
పాత్రశుభకర్మసంరూఢిఁ బరిఢవిల్లె. 114

టీక. హారి. విశ్వామిత్రజనులు, (విశ్వామిత్రునియొక్క జను అనుట.) మిత్రవంశ్యులు = సూర్యవంశీయులు, అసమ...కృతార్థుఁడు-అసమ = సరిలేని, మార్గణ = యాచకుఁడైన విశ్వామిత్రునియొక్క ("మార్గణో యాచకార్థినా" అమ.), మహీలాభాత్మక=భూలాభరూపమై, ప్రియమైన, అధికస్పర్శన = అధికదానముచేత, కృతార్థుఁడు, వి, అనంత...సంరూఢిన్-అనంత = భూమియందు, "నిడుపులుడుపఁ డనఁగను..." రారచ్యమాన = మిక్కిలిరచింపఁబడిన. వినుతిపాత్రమైన, శుభకర్మ = భూదానరూపశుభకర్మముచే నైన, సంరూఢిన్ = ప్రసిద్ధిచేత, పరిఢవిల్లెన్ = భూమియందుఁ బ్రకాశించె నని యన్వయము.

వ్య. సమద...జనులు-సమద = మదయుక్తులైన, విశ్వ=సమస్తులైన, అమిత్ర జనులు = శత్రుజనులు, మిత్రవంశ్యులు = మిత్రులును వంశీయులును (బంధువులు అనుట), అసమ...ర్థుఁడు-అసమమార్గణ=మన్మథుని యొక్క; మహిళా=భార్యయైన రతీదేవితోడ, ఆభ=సమానమైన, ఆత్మక = దేహముగల, ప్రియా=ప్రియురాలైన దమయంతియొక్క, అధికమైన, స్పర్శన=స్పర్శనముచేత, కృతార్థుఁడు, ఐ, నృపాల మణియును=నలుఁడును, అనంత...సంబాధిక-అనంతర = తర్వాత, ఆరచ్యమాన = చేయఁబడినదై, వినుతిపాత్రమైన, శుభకర్మ = వివాహముయొక్క, సంబాధిచేత, పరిఢవిల్లెక = ప్రకాశించెను.

## ఆశ్వాసాంతము

మ. మునిసంభావన! భావనర్తితసమిన్మోదాత్మయోధావళీ
పునరుజ్జీవన! జీవనాల్పకణికాభూతాతిమాత్రప్రభీ
తనదీపావన! పావనస్వపదముద్రాధన్యసద్భక్తనూ
తనవాక్సేవన! సేవనప్రవణసుత్రామాదివైమానికా! 115

టీక. మునిసంభావన, భావ...రుజ్జీవన=భావమునందు, నర్తిత=నర్తింపఁజేయఁబడిన, సమిత్ = యుద్ధముయొక్క, మోద = సంతోషముగల, ఆత్మయోధావళీ = స్వకీయసైన్యముయొక్క, (వానరసమూహముయొక్క యనుట.) పునరుజ్జీవన = మరల బ్రదికించుటగలవాఁడా! జీవ...పావన - జీవన = ఉదకముయొక్క, అల్పకణికా భూత = సూక్ష్మకణముగాఁజేయఁబడిన, అతిమాత్ర=మిక్కిలి, ప్రభీత = భయము నొందిన, నదీప=సముద్రునియొక్క, అవన=రక్షణముగలవాఁడా! పావన...క్సేవన- పావనమైన, స్వపదముద్రా = స్వనామాంకముచేత, ధన్యమైన సద్భక్తులయొక్క, నూతనమైన, వాక్సేవన=వచనసందర్భముగలవాఁడా! ('సేవనంసీవనంస్యూతిః' అమ.) సేవన...మానికా=సేవాప్రవణులైన, సుత్రామాదివైమానికా=ఇంద్రుఁడు మొదలగు దేవతలుగలవాఁడా!

క. త్రిభువనహితమహితకుల
ప్రభవ! భవర్యాభినవవిభావిభవ! భవా
న్యభిమతచారిత్రసుధా
నుభవ! భవారిస్వనామనుతినిరతభవా! 116

టీక. త్రిభువనహిత = సూర్యునియొక్క, మహితమైనకులమునందు, ప్రభవ= పుట్టువుగలవాఁడా, భవ...విభవ-భ=నక్షత్రములలో, వర్య=శ్రేష్ఠుఁడైన చంద్రుని యొక్క, అభినవమైన, విభావిభవ=వైభవమువంటివైభవముగలవాఁడా! భవా...భవ! భవానీ=పార్వతీదేవివలన, అభిమతమైన, చారిత్రమనియెడు సుధయొక్క, అనుభవముగల

వాఁడా! భవా...భవా-భవ=జన్మములకు, అరి=విరోధియైన, స్వనామ=స్వకీయ నామముయొక్క, నతి=స్తోత్రమునందు, నిరత=ఆసక్తుడైన,భవా=శివుఁడుగలవాఁడా!

నర్కుటవృత్తము. యతిహితసత్యరూప! యవితాయ! జయాభరణా!
కృతినుత! సత్యరోప! కవిగేయ! దయాభరణా!
భృతిరత! సప్రతాప! సగభీరప్రియాచరణా!
ధృతియుత [1]తీవ్రచాప! నయాదరణా! 117

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధ కవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతం బైన హరిశ్చంద్రనలోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

టీక. యతిహితమై = సత్యమైనరూపము గలవాఁడా! అవితాయ-అవిత = రక్షింపఁబడిన, అయ=మేలుఁగలుగఁజేసెడు క్రియగలవాఁడా! జయాభరణా! కృతినుత! సత్యరోప - సత్య=నిక్కమైన, రోప = బాణముగలవాఁడా! దయాభరణా! భృతిరత-భృతి=రక్షణమందు, రత = ప్రేమగలవాఁడా! ధృతియుత - ధృతి=సంతోషముతో, యుత=కూడుకొనినవాఁడా!

ఈవృత్తమునకే కోకిలకాక మను నామాంతరముకలదు. లక్షణము:—

కొలిచెద నాదిదేవుపదకోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిజాముసఁ గుదుర్పడు పాపములం
దలఁచెద నామధేయ మతితత్పరత న్జభజా
వలఁదగు నర్కుటంబునకు భర్గవిరామములన్.

(అప్పకవీయము, ఆ. ౪.)

గద్యము. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతీపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవి పెద్దిరాజతనూజపురాతనాధునాతన కఠిన ప్రబంధార్థబోధన సమర్థమాన సాంభోజనుఃధీజనవిధేయానంతయనామధేయ విరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక" యను వ్యాఖ్యానంబునందు ద్వితీయాశ్వాసము.

---

1 దీప్ర.

శ్రీరస్తు

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

## తృతీయాశ్వాసము

---



మానితమారుతినుత
సామానితరస్వవృత్తసంశ్రవణమునీం
ద్రా ముద్రముద్రసావహ
ధీముద్రా రామభద్ర దీప్తిసముద్రా. 1

టీక. శ్రీమా...ముద్రా-శ్రీమానితుఁడైన, మారుతి=హనుమంతునిచేత, నుత=కొనియాడఁబడిన, సామ=సామవేదముకన్న, అనితర=ఇతరముకాని, స్వవృత్త = నిజచరిత్రముయొక్క, సంశ్రవణముగల, మునీంద్రులకు, అముద్ర = నిర్నిరోధమైన, ముద్రస (ముత్+రస)=సంతోషరసమును, ఆవహింపఁజేయుచున్న, ధీముద్రా = జ్ఞానసముద్రగలవాఁడా! రామభద్ర! దీప్తిసముద్రా!

వ. అవధరింపుము మృకండునందనుండు పాండునందనున కిట్లనియె. 1

సీ. అప్పుడు కౌశికుఁ డర్కసంతతిశుచి
యప్పుతి యాగసాంగాగమోప
పాదనాధికధర్మపాకసంసిద్ధివి
శ్వాత్మమాభువనవిశ్రాణనముల
నింపొందఁగ ననుగ్రహించి యాఘనుశంక
రశిఖామణికులేశుఁ బ్రస్తుతించి
యాభూరిధృతినిమఘాచలేంద్రమనోర
విందసంశుద్ధికి వెఱఁగుపడుచు
వెసఁ దిరోధాన మొందిన ససమతప
హాచరితవైభవవిలోకనాతివేల
కుతుకసంప్రాప్తకుతలనాకతలసుతల
తలనివాసులు చని రాత్మధామములకు.

టీక. హరి. కౌశికుఁడు=విశ్వామిత్రుఁడు, కర్త. అర్కసంతతిశుచి-అర్కసంతతి=సూర్యకులమందు, శుచి=పవిత్రుఁడు, అప్పతి = ఆహరిశ్చంద్రుఁడు, యాగ... విశ్రాణనములన్-యాగ = యజ్ఞముచేసెడి, సాంగ = అంగములతోఁగూడుకొనిన, ఆగమములయొక్క, ఉపపాదనముచేత, అధికమైన, ధర్మముయొక్క, పాకసంసిద్ధియు, విశ్వ=సమస్తమైన, క్షమాభువన=భూలోకముయొక్క, విశ్రాణనములన్ = ఈఁగి-ఈ పైరెంటిచేత, ఇంపొందన్ = ఒప్పఁగా, (తనయజ్ఞము భూదానము ఫలించెనని సంతసమందుచుండఁగా ననుట) అనుగ్రహించి, (కౌశికుఁ డనుగ్రహించి యనుట) శంకరశిఖామణికులేశున్-శంకరశిఖామణి=సూర్యునియొక్క, కులమునందలి, ఈశున్=ప్రభువైన, ఆఘనున్=ఆమహాత్ముఁడైన హరిశ్చంద్రుని, ప్రస్తుతించి = కొనియాడి, అభూరి...శుద్ధికి(న్) - ఆ, భూరిధృతి=అధికధైర్యమందు, నిషధాచలేంద్ర=నిషధపర్వతరాజమైన హరిశ్చంద్రునియొక్క, మనోరవింద=చిత్తసరోజముయొక్క, సంశుద్ధికి(న్)=పారిశుద్ధ్యమునకు, వెఱఁగుపడుచు=అచ్చెరువందుచు, వెసన్=శీఘ్రమున, తిరోధానము=మఱుఁగుపాటు, ఒందఁగా, (కౌశికుం డాశ్రమమునకుఁ బోఁగాననుట.) అసమ...నివాసులు-అసమ=సమానరహితమైన, తత్=ఆహరిశ్చంద్రునియొక్క, మహాచరిత=మహాచారిత్రముయొక్క, వైభవముయొక్క, విలోకన=చూచుటయందు, అతివేల=పెల్లైన, కుతుక=సంతోషముచేత, సంప్రాప్త=వచ్చిన, కుతల, నాకతల, సుతల, తలనివాసులు (ఈలోకముల యందుండెడి వారనుట.) ఆత్మధామములకున్=స్వకీయభవనములకు, చనిరి.

నల. కౌశికుఁడు=ఇంద్రుఁడు, అర్కసంతతి = సూర్యపుత్రుఁడైన యముఁడు, శుచి=అగ్నిహోత్రుఁడు, అప్పతి = వరుణుఁడు (వీరు నల్వురును వరుసఁగా) యాగ... విశ్రాణనములన్-యాగమునకు, సాంగ=మూర్తిసహితముగ, ఆగమ = వచ్చుటను, ఉపపాదన=ఉపపాదించుటను, అధికధర్మమును, పాకసంసిద్ధి = పచనసంసిద్ధియును, విశ్వక్షమా=సకలభువనములయందును, భువన=ఉదకమును, విశ్రాణనములన్=ఇచ్చుటలచేత, ఇంపొందఁగాన్, అనుగ్రహించి, (ఇంద్రుఁడు సాక్షాత్కారముతో యజ్ఞముల కేతెంచెదననియు, యముఁడు, ధర్మము గలుగుఁగాక యనియు, అగ్ని, పాకశుద్ధి గలుగుననియును, వరుణుఁడు, వలసినయెడల నుదకము గలుగుఁగాక యనియు, వరముల నొసఁగి రని యభిప్రాయము.) శంకరశిఖామణికులేశున్-శంకర = ఈశ్వరునకు, శిఖామణి=తలమానికమైన, చంద్రునియొక్క, కులమునందలి, ఈశున్ = ప్రభువైన, ఆఘనున్ = ఆమహాత్ముఁడగునలుని, ఆ, భూరి...సంశుద్ధికిన్ - ఆ, భూరిధృతి = అధికధైర్యవంతుఁడైన, నిషధాచలేంద్ర = నలునియొక్క, మనోరవిందసంశుద్ధికిన్= చిత్తశుద్ధికి, అసమతన్మహా...వాసులు - అసమమైన, తన్మహా = ఆస్వయంవరోత్సవమందు, ఆచరితమైన, వైభవముయొక్క, విలోకనా...నివాసులు.

గీ. మనుజపతియును నాగాశ్వమణిసువర్ణ
పూర్ణసామ్రాజ్యదానవిస్ఫురణ ననుప
మామ రమణీజయశ్రీసమన్వితుఁ డయి
యాత్మపురిఁ జెంది సుఖలీల నలరె నంత. 4

టీక. హరి. మనుజపతియును=హరిశ్చంద్రుఁడును, నాగాశ్వ...విస్ఫురణన్ - నాగాశ్వమణిసువర్ణపూర్ణమైన, సామ్రాజ్యముయొక్క, దానవిస్ఫురణన్ = ఇచ్చుట చేత, అనుప...న్వితుఁడు-అనుపమ = ఈడులేని, అమరమణి = చింతామణియొక్క, జయశ్రీ = జయలక్ష్మితోడను, సమన్వితుఁడు, అయి, అంత.

నల. మనుజపతియును = నలుఁడును, మామగారు, అనుపన్ = పంపఁగా, రమణీ...తుఁడు - రమణీ=దమయంతితోడను, జయశ్రీ = జయలక్ష్మితోడను, సమన్వితుఁడు. అయి,

మ. నరదేవోత్తము లుండ దేవపతు లుండన్ దివ్యదర్వీకరే
శ్వరు లుండన్ ధరలో నితండు జగతీసంస్తుత్యసత్యాధిరా
జ్యరమోత్కర్షముఁ గాంచు టెట్లనుచు విశ్వామిత్రుఁ డుగ్రుండు ని
ర్జరదుర్వారతరుండు నై కలిమహాసంరంభము ల్మీఱఁగన్. 5

టీక. హరి. నరదేవోత్తములు=రాజశ్రేష్ఠులు, దివ్యదర్వీకరేశ్వరులు=శ్రేష్ఠులైన నాగాధిపతులు, జగతీ...త్కర్షమున్ - జగతీసంస్తుత్యమైన, సత్యాధిరాజ్యరమ = సత్యసామ్రాజ్యలక్ష్మియొక్క ఉత్కర్షమును- "విశ్వామిత్రుఁడు, కర్త ('అనఘాంగనైక...' అనుపద్యములోని, చొచ్చెను. ఆక్రమించెను" అను క్రియతో నన్వయము.) కలిమహాసంరంభములు-కలి = కలహామందలి ('కలహేఽన్త్రియు గేకలిః' నానా.) మహాసంరంభములు=అధికాటోపములు, మీఱఁగన్ = అతిశయింపఁగా.

నల. జగతీ...త్కర్షమున్-జగతీసంస్తుత్యమైన, సతీ=దమయంతియొక్క, అధిరాజ్యరమా=అధిపతిత్వసంపదయొక్క, ఉత్కర్షమున్=అతిశయమును, విశ్వామిత్రుఁడు-విశ్వ=ప్రపంచమునకు, అమిత్రుఁడు = శత్రుఁడు, కలి = కలిపురుషుఁడు, కర్త. (దీనికి "అనఘాంగనైక...అను క్రియలతో నన్వయము.) నిర్జరదుర్వారతరుండున్, నిర్జర=దేవతలకు, దుర్వారతరుఁడు=నివారింప మిక్కిలి శక్యముగానివాఁడును, ఐ (కలిపురుషుఁడు స్వయంవరమునకు వచ్చుచుండఁగా, స్వయంవరమున కేతెంచి మఱచిపోవుచుండు నింద్రాదు లెదు రేతెంచు నాతనిం గాంచి దమయంతి నలుని వరించెను. నీవును మఱచిపో నగునని చెప్పినను తా మఱలక నలుని వేధింపఁబోయె నని ఫలితార్థము.)

క. కామవిమోహామర్షమ
హామదమాత్సర్యోగ్రజాగ్రదనుయాయిజన

స్తోమంబు గొలువ లక్ష్మీ
ధామంబగు తత్పురంబు దఱియం జనుచున్. 6

టీక. హరి. కామ...స్తోమంబు - కామ...మదరూపులైన, ఉగ్రజాగ్రదను యాయి జనులయొక్క స్తోమంబు.

నల. కామ...స్తోమంబు - కామము, విమోహము, అమర్షము, మహామదము, ఇవియను, రూపముచేత, ఉగ్ర=భయంకరములును, జాగ్రత్ = జాగరూకములైన, అనుయాయిజన = భృత్యజనములయొక్క, స్తోమంబు = సమూహము.

సీ. ఒకచోట మఖవాటహుతహవ్యగంధంబు
లొకచాయ ననపాయహోమవహ్ను
లొకయిక్క భృతదిక్కటకసామగానంబు
లొకమూల శుభమూలసుకృతగాథ
లొకచెంత నిగమాంతయుక్తిసంతతిచింత
లొకసీమ సురధామయోగ్యసేవ
లొకవంక సకలంకయోగివర్యసపర్య
లొకదండ నఘదండనోచితవిధు

గీ. లరసి యీదృశధర్మసంభరణధరణి
కాంతనిగ్రహ మెట్లు కావింతు ననుచు
దీపితాత్మానుకంపుఁడై ద్వాపరాప్తి
కలితుఁడై నిజసమయవాక్యములు తలఁచి. 7

టీక. హరి. మఖవాట...గంధంబులు-మఖవాట=యాగశాలలయందు, హుత=హోమముచేయఁబడిన, హవ్య=ఆజ్యాదిహవిస్సులయొక్క, గంధంబు=వాసనలు, ఒకయిక్క=ఒకచోట, భృత...గానంబులు-భృత=నిండింపఁబడిన, దిక్కటక=దిఙ్మధ్య ప్రదేశములుగల, సామగానంబులు, నిగమాంత = వేదాంతమునందలి, యుక్తిసంతతి యొక్క, చింతలు, సురధామ...సేవలు-సురధామ=స్వర్గమునకు, యోగ్యమైన సేవలు, అరసి=చూచి, ఈదృశ...నిగ్రహము-ఈదృశ=ఇట్టి, ధర్మసంభరణ=ధర్మసంభరితుఁడైన, ధరణికాంత=రాజగుహరిశ్చంద్రునియొక్క;నిగ్రహము, దీపితాత్మానుకంపుఁడు-దీపిత=ప్రకాశమానమైన, ఆత్మ=తనయొక్క, అనుకంపుఁడు = దయగలవాఁడు, ఐ, ద్వాపరాప్తికలితుఁడు, ద్వాపరాప్తి=సంశయావాప్తితోడ,('సందేహద్వాపరౌచాథ' అమ.) కలితుఁడు=కూడినవాఁడు, ఐ, నిజ...ములన్-నిజ = స్వకీయములైన, సమయ వాక్యములను ప్రతిజ్ఞానములను (సమయాశ్శపథాచారకాలసిద్ధాంతసంవిదః' అమ.)

నల. ...ద్వాపరాప్తికలితుఁడు=ద్వాపరపురుషునితోఁగూడినవాఁడనుట,ఐ,నిజ

...ములు-నిజ=స్వకీయమైన, సమయ=ప్రవేశసమయముయొక్క, వాక్యములు, (పురుషుఁ డనాచారవంతుఁ డయినవేళఁ గలి ప్రవేశించు ననెడి) వచనములు.

సీ. అనఘాంగనైకరాజ్యశ్రీమదాత్త
మైననిజస్వాంత మఁకగమించు
నతఁడు దోడ్తోనఁ బూర్వార్థసంగ్రహకైత
వము ఘటించినఁ దదక్షమతదుర్వ్య
సనమగ్నుఁ డగు నైన సాధింతు ననుచు నే
కాంతవిద్వాపరవ్యాప్తవంచ
నావృతసకలాత్ముఁ డై చొచ్చె నృపధామ
మవ్వేళఁ బ్రమదాశ్రితాత్ముఁ డవని

గీ. విభుఁడు వేవేగసమయార్హ్యవిధి సలుపుచుఁ
బూని కన్నీటఁ దనపదాంభోజయుగళిఁ
గడుగ మిన్నంది తావేగకలిత హృద్యుఁ
డగచుఁ దత్పార్థివాగ్రణి నాక్రమించె. 8

టీక. హరి. అనఘాం...శ్రీ-అనఘ=నిర్దుష్టములైన, అంగ=స్వామ్యమాత్యాది సప్తరాజ్యాంగములచేత, నైక = అనేకమైన, (ఎక్కువైన) రాజ్య=శ్రీ=రాజ్యలక్ష్మి, మదాయత్తము=నాస్వాధీనము, ఐనన్, నిజస్వాంతము, నిజ=స్వకీయమైన, స్వ = ధనముయొక్క ('స్వోజ్ఞాతా వాత్మని స్వం త్రి ష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అమ.) అతఁడు, ఆహరిశ్చంద్రుఁడు, తోడ్తోన=వెంటనే, పూర్వా...వము-పూర్వార్థ = యాగమునకై మున్నొడంబడిన ద్రవ్యముయొక్క, సంగ్రహమునందలి, కైతవమున్= కపటమును, ఘటించినన్, తదక్షమతన్-తత్=ఆద్రవ్యసంగ్రహమందు, అక్షమతన్= సామర్థ్యములేమిచేత, దుర్వ్యసనమగ్నుఁడు, అగున్, ఐన=అట్లైనచో,ఏకాంత... లాత్ముఁడు-ఏకాంత=మిక్కిలి,వి=పోయిన, ద్వాపర=సంశయముగలుగునట్లు,వ్యాప్త= పొందఁబడిన, వంచనచేత,ఆవృతమైన, సకలాత్ముఁడు=సమస్తేంద్రియములుగలవాఁడు, వి, సంశయరహితముగ మనోవాక్కాయకర్మములయందువంచనగలవాఁడై,ప్రమదాశ్రితాత్ముఁడు-ప్రమదముచేత, ఆశ్రితమైన, ఆత్మ కలవాఁడు,అవనివిభుఁడు=హరిశ్చంద్రుఁడు, సమయార్హ్యవిధిన్-సమయార్హ్య=కాలోచితమైన, విధి (న్)=పూజావిధిని,కన్నీటన్= ఆనందబాష్పములచే (పదాంభోజయుగళిన్=పాదకమలద్వంద్వమును, కడుగఁగా, (ఆనందాశ్రువులం పాదములు గడియ నమస్కరింపఁగా ననుట.) ఈయర్థము ప్రమదాశ్రితాత్ముఁ డను విశేషణముచేతఁ దోఁచుచున్నయది.) మిన్నంది=పెరిగి, తాన్ = తాను, వేగ = కోపవేగముతో, కలితహృదయుఁడు=కూడుకొనిన మనసుగలవాఁడు

నల. అన...యుత్తమా-అనఘమైన, అంగనా=దమయంతిచేతను, ఏక=ముఖ్యమైన, రాజ్యశ్రీ=రాజ్యలక్ష్మిచేతను, మదాయుత్తమా = మదమునకధీనము, ఐన, నిజస్వాంతము=స్వకీయచిత్తమును, అధి...నతఁడు-అధిగమించు = పొందిన, అతఁడు = ఆనలుఁడు, తోడ్తోన్=వెంటనే, అపూ...కైతవము-అపూర్వార్థసంగ్రహముగల, కైతవము=జూదము, ఘటించినన్=సమకూర్పఁగా, తదక్ష...మగ్నుఁడు-తత్=ఆ, అక్షమత=జూదమనెడు, దుర్వ్యసనమందు, మగ్నుఁడు = మునిఁగినవాఁడు, అగును, ఐన (న్)=దుర్వ్యసనమగ్నుఁడైనచో, ఏకాంత...జ్ఞుఁడు-ఏకాంతవిత్=రహస్యజ్ఞుఁడైన, ద్వాపరపురుషునిచేత, ఆవృత=ఆవరింపఁబడిన, సకలాత్ముఁడు = సకలమైన పాచికలుగలవాఁడు, ఐ ('అథాక్ష మింద్రియే, నాద్యూతాంగే కర్షచక్రే వ్యవహారే కలిద్రుమే' అమ. ద్వాపరునితో నేకాంతమున 'నీవు పాచికలయందుఁ బ్రవేశించియుండు' మని చెప్పినవాఁడై యనుట.) ఆవ్వేళన్=నృపధామము, చొచ్చెన్, ప్రమదాశ్రితాత్ముఁడు, ప్రమదా=దమయంతిచేత, ఆశ్రిత=పొందఁబడిన, ఆత్ముఁడు=దేహముగలవాఁడు, (దమయంతీ సంసర్గముగలవాఁ డనుట.) అవనివిభుఁడు=నలుఁడు, వే=శీఘ్రముగ, వేఁగన్=తెల్లవాఱఁగా, సమయోర్హ విధి=కాలోచితకృత్యము సలుపుచు, పూనికన్=ప్రయత్నముతో, నీటన్=ఉదకమున, కడుగమిన్=కడుగకుంట చేత, నందితా...హృదయుఁడు-నందిత = సంతుష్టమైన, ఆవేగ=త్వరతోడ, కలిత=కూడిన, హృదయుఁడు=మనస్సుగలవాఁడు, అగుచు.

వ. ఇట్లాక్రమించిన యాకలితత్త్వవిముఖవిచారుండై యసూయో
చ్ఛ్రాయంబు వడిం బెడ రేఁప బహువిధాష్టాపదకళాపాళిగ్రహదు
రాగ్రహుండగు నతండు చండవాక్పాండిత్యసమసముద్ధృతోద్దండ
పాణిపుష్కరాంకుం డమ్మేటిపుడమిఱేనిం జూచి. 9

టీక. హరి. నయా...విచారుండు-నయాకలితత్వ = నయకలనయందు, విముఖమైన, విచారముకలవాఁడు, ఐ, అసూయోచ్ఛ్రాయంబు = ఈర్ష్యాధిక్యము, వడిన్, పెడ రేఁపన్=పేరేపింపఁగా, బహు...గ్రహుండు-బహువిధములైన, అష్టాపద కలాప=సువర్ణభూషణములయొక్క, ('శరభే నా హేమ్ని శారిఫలకేఽష్టాపదోఽస్త్రియామ్' నా నా.) ఆళి=సమూహముయొక్క, గ్రహ=స్వీకరణమందు, దురాగ్రహముగలవాఁడు, అగు, అతండు=ఆవిశ్వామిత్రుఁడు, (రాజ్యహీనుఁడ వగు నీ కాభరణంబు లేల? తె మ్మని యాగ్రహము నొందినవాఁడైన విశ్వామిత్రుఁ డనుట.) చండ...కుండు-చండ=కోపకీలమైన, వాక్పాండిత్యమునకు, సమమగునట్లు, సముద్ధృత=ఎత్తఁబడినదై, ఉద్దండ=ఉన్నతదండముగల, పాణిపుష్కర=హస్తకమలము, అంకుండు = గుర్తుగాఁగలవాఁడు, అమ్మేటి పుడమి ఱేనిన్=ఆరాజశ్రేష్ఠుఁడగు హరిశ్చంద్రుని, చూచి.

నల. ఇట్లు, ఆక్రమించినయాకలి=ఆక్రమించినట్టి యాకలిపురుషుఁడు, తత్స్వవిముఖ విచారుండు, ఐ, అసూయోచ్ఛ్రాయంబు=అసూయాతిశయమును, వడిం బెడరేఁపన్=అసూయ పుట్టింపఁగా ననుట; బహువిధా...గ్రహుండు—బహువిధములైన, అష్టాపద=జూదపుఁబలకయొక్క, కళా = విద్యలయొక్క, పాళి = చిహ్నము సెడు, గ్రహ=భూతమువల్ల దురాగ్రహముగలవాఁడు, అగునతండు, (అగువాఁ డనుట) చండ...పాణి-చండవాక్పాండితిచేత, అసమునగునట్లు; సముద్ధృతమైన, ఉద్దండపాణిగలవాఁడు; (చేయియెత్తి జూదమునకు బిట్టుగాఁ బిలుచుచున్నవాఁ డనుట.) పుష్కరాంకుండు=పుష్కరుఁడను పేరుగలవాఁడు, అష్టేటిపుడమిఱేనిన్=అనలుని.

గీ. కైతవప్రౌఢి బెడిదంబుగాఁగఁ బన్ని
దములయెడ నించుకయుఁ గించుదనముఁ బూన
కురుధనము లెల్ల నావ్రాల నునిచి క్రీడ
సలుపుము నృపాలకా నల శాంతి ననిన. 10

టీక. హరి. కైతవప్రౌఢి కపటప్రౌఢి (కపటో౽స్త్రీవ్యాజదంభోపధయశ్ఛద్మకైతవే, అమ.) పన్ని=ఏర్పాటుచేసియనుట, దములయెడన్=మునులయెడ, ఉరుధనముల, కానలన్=అరణ్యములయందు.

నల. కైతవప్రౌఢి = ద్యూతప్రౌఢి (ద్యూతో౽స్త్రియామక్షవతీకైతవంపణఇత్యపి' అని అమ.) పన్నిదములయెడన్ = పందెములవిషయమున, క్రీడా = ద్యూతక్రీడను, నృపాలకా, నల, ఇవిసంబుద్ధులు.

ఉ. అక్షణదావివర్ధనకరాన్వయుఁ డట్టిద కాక యంచు స
త్యక్షయశోభమానవచనాకలనాపణితాత్మభూతి నై
శిక్షితవాజిరత్నరథసింధురకోటులతో నొనంగె వి
శ్వక్షితివైభవం బతనికర్తిఁ బరాభవముద్రఁ గాంచుచున్. 11

టీక. హరి. అక్ష...న్వయుఁడు—అ, క్షణదావివర్ధనకర = నిశావిభేదనకరుఁడైన సూర్యునియొక్క, అన్వయుఁడు = వంశముగలవాఁడు (హరిశ్చంద్రుఁ డనుట) ('వర్ధనంఛేదనే' అ.) సత్య...భూతి-సత్యమునకు, క్షయ=నివాసమై, ('నివాసశ్శరణం క్షయః' అ.) శోభమాన=ప్రకాశించుచున్న, వచనములయొక్క, ఆకలనా=నిలుపుటచేత, పణిత=సన్నుతమైన, ('ఈడితశస్తపణాయితపనాయితప్రణుతపణితపనితాని' అమ.) ఆత్మభూతి=స్వకీయజన్మము గలవాఁడు, ఐ=అయి.

నల. అక్ష...న్వయుఁడు-అ, క్షణదావివర్ధనకర = నిశాభివృద్ధికరునియొక్క, (చంద్రునియొక్క యనుట.) అన్వయుఁడు = వంశముకలవాఁడు (నలుఁ డనుట.) సత్య...భూతి-సతీ=దమయంతియొక్క, అక్షయ=అధికములు, శోభమానములునైన

వచనములయందలి, అకలనా=అనాదరముచేత; పణిత=పణముగఁ జేయఁబడిన (‘కైతవం పణఇత్యపి’అ.) ఆత్తభూతి=నిశ్శైశ్వర్యముగలవాఁడు, ఐ, దమయంతి చెప్పినను వినక తన సకలైశ్వర్యములను పందెముగ నొడ్డినవాఁడై యనుట.

క. పతి కపు డధీతనయసం
హితులుఁ బురోహితులు నీతిహితకార్యసమా
హితులుఁ దగ విన్నవించిరి
మతి నప్రతికారఘోరమానసహితులై. 12

టీ. రెంటను సమానము.

గీ. జనవర హృతారి వీరసేనుని నసంఖ్య
సవనవిఖ్యాతి హరిముఖశ్లాఘనీయ
సత్త్రి శంకుసమాఖ్యుని జనకుని మఱ
పించి ప్రోచితి విన్నాళ్లు ప్రేమ మమ్ము. 13

టీక. హరి. జనవర! సంబోధనము. హృతా...సేనుని-హృత=హరింపఁబడిన, అరివీర=శత్రువీరులయొక్క, సేనుని=సైన్యములుగలవానిని; అసంఖ్య...ఖ్యాతిన్ - అసంఖ్యసవన = అనేకయజ్ఞములవల్లనైన, విఖ్యాతిన్=ప్రసిద్ధిగలవానిని, హరి...సమాఖ్యుని-హరిముఖ=ఇంద్రాదులకు శ్లాఘనీయుఁడైన, సత్=శ్రేష్ఠుఁడైన, త్రిశంకుసమాఖ్యుని=త్రిశంకువను పేరుగలవానిని, జనకుని, తండ్రియైన త్రిశంకుని ననుట.)

నల. జనవర! హృతారి! సంబుద్ధులు-అసంఖ్య...ఖ్యాతిన్-అసంఖ్య=లెక్కలేని, సవన=యాగములవల్లనైన, విఖ్యాతిన్=ఖ్యాతిగలవానిని, హరి...సతిన్-హరిముఖ=ఇంద్రాదులకు, శ్లాఘనీయ = స్తోత్రార్హుఁడైన, సత్త్రిన్= అధ్వరియైనవానిని, (‘సత్త్రమాచ్ఛాదనేయజ్ఞే’ అ.) శంకుసమాఖ్యుని, శం=సుఖమునకు, కు=భూమియైన, (సుఖాధారమైన యనుట.) సమాఖ్యుని=కీర్తిగలవానిని, (‘శమవ్యయంచసాఖ్యార్థే’ నానా.) జనకుని, వీరసేనుని (తండ్రియైన వీరసేను ననుట.) ‘హరి...సమాఖ్యుని’ అనుచో మఱియొక యర్థము. హరి...నీయమైన, సత్=లెస్సైన, త్రిశంకు=అగ్నిత్రయమువల్లనైన, (‘శంకుస్సంకీర్ణవివరే పలాశేఽగ్నౌచకీలకే’ ధనంజయనిఘంటువు) సమాఖ్యుని, (పెక్కుజన్నములాచరించి యాహవనీయాది యగ్నిత్రయమును లెస్సఁగ నడుపువాఁ డనుట.)

ఉ. ఇప్పుడు విశ్వభారమును నే లని నేల నిజాత్తకోటితో
నొప్పన సేసె దన్యునకు నూరక నూఱక త్రావువానికే
యొప్పెడుచాలు నీగొడవ కోపము కోపము సైఁచి చూడుమా
తప్పు విభుత్వహానికిఁ గతంబె మతంబె మహీజనాళికిన్. 14

టీక. రెంటను సమానము.

ఏలని, ఏల+అని, నేలన్=భూమిని, అన్యునకున్, ఊరక, నూఱక, త్రావు వానికే, ఈగొడవకు = ఈయాపదకు, ఓపము = ఓర్వము, కోపము. పైచి, మతంబె= సమ్మతమా!

సీ. అనఘమానస నీపదాంబుజంబుల వ్రాలు
రాజహంసల కొండు ప్రాపుగలదె?
ధీరకుంజర! నీకరారోహణంబున
వెలయుకుంభిని కొండు వెరవు గలదె?
సరసచంద్ర! భవత్ప్రసన్నకళావాప్తిఁ
దగుబుధాళికి నొండుదండ గలదె?
సుగుణసాగర! భవత్సుహితజీవన లైన
వాహినులకు నొండువలను గలదె?

గీ. కని కరం బాప్తదుర్దశల్ గనికరంబు
నెరప విది యేల? మహి యేల కరిగితేని
యధిప! నీయాన నీయాన మనునరింతు
మతులపతిహితగతు లాత్తమతుల నునిచి. 15

టీక. రెంటను సమానము.

అనఘమానస = పాపరహితమైన మనస్సుగలవాఁడా! నీపదాంబుజంబుల= నీపాదకమలములయందు, వ్రాలురాజహంసలకు=వ్రాలినయట్టిరాజశ్రేష్ఠులకు, ప్రాపు = ఆశ్రయము. (అనఘమానస=శ్రేష్ఠమైనమానససరోవరమా! నీపదాంబుజంబులన్-నీ యొక్క, పదాంబుజంబులన్=స్థానమైన యుదకములయందలి కమలములయందు, వ్రాలు రాజహంసలకు=వ్రాలెడు రాయంచల కనుట.)

ధీరకుంజర! ధైర్యమున గజమునుబోలినవాఁడా! నీకరారోహణంబునన్ = నీ భుజారోహణముచేత, వెలయుకుంభినికి=ఒప్పెడుభూమికి, వెరవు=ఉపాయము, (ధీర కుంజర! ధీరమైనకుంజరమా! నీయొక్క, తుండము నాశ్రయించుటచేత, వెలయు కుంభినికి=ఒప్పెడు నాఁడేనుంగున కనుట.)

సరసచంద్ర! = సరసశ్రేష్ఠుఁడా! భవత్ప్రసన్నకళావాప్తిన్, భవత్ = నీ యొక్క, ప్రసన్నమైనకళయొక్క, అవాప్తిచేత,తగుబుధాళికిన్=తగిన విద్వత్సమూహ మునకు,దండ=ప్రాపు. (సరసుఁడవైన చంద్రుఁడా! భవత్ప్ర... ప్తిన్=నీయొక్క ప్రస న్నములైన, కళలయొక్క, ప్రాప్తిచేత, తగుబుధాలికిన్=ఒప్పెడు దేవతాసమూహమున కనుట)

సుగుణసాగర=సద్గుణసముద్రుఁడా! భవత్సహితజీవనలు - భవత్ = నీయందు, సంహితములైన, జీవనలు=జీవనములుగలవి, ఐన వాహినులకు=సేనలకు, వలను=దిక్కు, (సుగుణసాగర! సుగుణవంతుఁడవైన సముద్రుఁడా! భవత్సహితజీవనులు - భవత్ = నీయందు, సుహితములైన, జీవనలు=ఉదకములుగలవి ఐన వాహినులకు=నదులకనుట.) ఆర్తదుర్దశల్ =ఆర్తులయొక్క దుర్దశలను కని=చూచి,కరంబు=మిక్కిలి,కనికరంబున్= దయను, నెరపవు=నింపవు, నీయానమున్=నీవుపోవుటను, అనుసరింతుము (నిన్ను వెంబడించివత్తు మనుట.), అతుల పతిహితగతులు -అతుల=సమానరహితములైన, పతిహిత= భర్తృహితములైన, గతులు=రీతులు.

గీ. సకలనుత నూతనాక్షమాలికలొ గుప్త
మనుజపాళులొ దేవసంప్రార్థనములఁ
బూనునెత్తములో రాజ్యభూరిభరము
లీల సదాపాశవృత్తుల కెల సెపుమ. 16

టీక. హరి. సకలనుత! (సంబుద్ధి.) నూతనాక్షమాలికలొ - నూతనములైన, అక్షమాలికలొ=జపమాలికలో, గుప్త...ళులొ-గుప్త = గూఢములైన ('గూఢరక్షితయోర్గుప్త'నా నా.), మను=మంత్రములయొక్క, జపాళులొ=జపపంక్తులో, దేవసంప్రార్థనములన్=దేవతారాధనములయందు. పూనునెత్తములో = పూనినకమలములో, రాజ్యభూరిభరములు, సదాపాశవృత్తులకు-సదా=నిరంతరము, అప=పోయిన,ఆశ=తృష్ణగల, వృత్తులకు=వర్తనము గలవారలకు (ఋషుల కనుట.)

నల. సకలనుత! నూతనాక్షమాలికలొ-నూతనములైన, అక్ష=పాచికలయొక్క, మాలికలో,గుప్తమనుజ=రక్షింపఁబడినమనుజులుగలవాఁడా! సంబుద్ధిపాళులొ=సారెలపోఁతలో, దేవ! సంప్రార్థనములన్ = కోరికలను, పూను నెత్తములో = పందెములో, రాజ్యభూరిభరములు సదాపాశవృత్తులకు - సదా,పాశ=పాసికలయొక్క, వృత్తులకు= వర్తనముగలవారికి. (జూదగాండ్ర కనుట.) ('దేవకాః పాశకాశ్చతే' అమ.)

చ. అన జననాథుఁ డిట్లను మదాప్తులు మీరు మదిన్ మదీయశా
సనము బహూకరింపుఁ డతిసత్యనయాక్షపణైకవృత్తి నే
ననుపమరాజ్యసంపదల కాశ యొనర్తునె నాకు నిచ్చవ
చ్చినహితు లేని నీతని భజింపుఁ డనం జని రాత్రి నందఱున్. 17

టీక. హరి. అతి...వృత్తిన్-అతిసత్యనయముయొక్క, అక్షపణ=చెడకుండుట చేత, ఏక=ముఖ్యమైన, వృత్తిగలవాఁడను, నేన్=నేను.

నల. అతి...వృత్తిన్ - అతి=అత్యంతమైన, సత్యనయముగల, అక్షపణ=అక్షవ్యవహారమందు (జూదపుఁబందెమనుట);ఏక=ముఖ్యమైన, వృత్తిన్=వర్తనగలవాఁడను.

క. చన నానయవిదుదారగు
రుని శాంతస్థితికిఁ దగ నరుగుఁ డని యనిపెన్
మనమున వాత్సల్యము పొం
గ నబలగతి ననుగమించుగాదిలి ప్రజలన్. 18

టీక. హరి. అన...స్థితికిన్-అ, నయవిత్=నయజ్ఞులలోను, ఉదారు = దాతలలోను, గురుని = అధికుఁడైన హరిశ్చంద్రునియొక్క, శాంతమైన, స్థితికిన్, తగునట్లు, అబల=చంద్రమతి, అనుగమించుగాదిలిప్రజలన్-అనుగమించు=వెంబడించెడు, గాదిలి ప్రజలను=కూరిమిజనులను, అనిపెన్.

నల. అనయవిదుదార, అ, నయవిదు=నీతివిచక్షణుఁడైన నలునియొక్క, దార= భార్యయైనదమయంతి, గురునిశాంతస్థితిని - గురు=తండ్రియైనభీమునియొక్క, నిశాంత= ఇంటియందలి, స్థితికి=ఉండుటకు, అబలగతిన్-అబల = బలరహితమైన, గతిన్=గమనముచేత, అనుగమించు = వెంటవచ్చు, గాదిలిప్రజలన్ = అనుంగుగుఱ్ఱములను, (కూఁతురుకొడుకు ననుట.) అరుగుఁడు=పొండు, అని అనిపెను.

గీ. అప్పు డాయతిధూర్తహృతాత్మవిభవుఁ
డై నృపతి ప్రేయసీలోహితాంఘ్రికమల
సంచరణఖేదవిహ్వలస్వాంతుఁ డగుచుఁ
బ్రతిభయకఠోరకాంతారపదవి నరుగ. 19

టీక. హరి. ఆయతి...భవుఁడు-అ, ఆయతి ధూర్త = వంచకుఁడైన ఋషిచేత, (విశ్వామిత్రునిచేత), ('ధూర్తస్తువంచకః' అ.) హృత=అపహరింపఁబడిన, విభవుఁడు= రాజ్యవైభవముగలవాఁడు, ఐ, నృపతి=హరిశ్చంద్రుఁడు, ప్రేయసీ...స్వాంతుఁడు-ప్రేయసీ=చంద్రమతియొక్కయు, లోహితునియొక్కయు, అంఘ్రికమల=అడుగుఁదమ్ములయొక్క, సంచరణ = నడచుటయందలి, ఖేదమునలన, విహ్వల = స్వాధీనముకాని, స్వాంతుఁడు=మనస్సుకలవాఁడు, అగుచు.

నల. ఆయతి...విభవుఁడు - అ, అతి = అత్యంతము, ధూర్త = జూదగాఁడైన పుష్కరునిచేత ('ధూర్తోఽక్షదేవీకితవో'అ.)హృతమైన,ఆత్మవిభవుఁడు = నిజవైభవము గలవాఁడు, ఐ, నృపతి = నలుఁడు, ప్రేయసీ...స్వాంతుఁడు- ప్రేయసీ = దమయంతి యొక్క, లోహిత=ఎఱ్ఱనైన, అంఘ్రికమలములయొక్క సంచరణఖేదముచేత, విహ్వలమైన స్వాంతముగలవాఁడు, అగుచు.

సీ. ప్రచ్ఛాయవనవనస్పతులు నీలపుమెఱుం
గుల నింపు జగజంపుగొడుగు లయ్యె

నవలతాగలదతాంతములు పౌర
సీమంతినులు చల్లు సేస లయ్యె
తరురాజఖగకూజితము వేత్రధరసమూ
హోరుసాహోరుతివ్యూహ మయ్యె
వాతాభిహితవేణుజాతారవము వంశ
గీతాదిశుభవాద్యరీతి యయ్యె
గీ. గంధవహకందళీమందకంపమాన
మృదులదళకాంతకాంతారకదళికాండ
మండలము లగ్రవలమానమాననీయ
బహువిజయవైజయంతికాపంక్తు లయ్యె. 20

టీక. రెంటను సమానము.

ప్రచ్ఛాయవనవనస్పతులు = మిక్కిలి నీడగల వనమందలివృక్షములు, జగజంపుగొడుగులు = మనోహరమైన ముత్తెపుజాలరులతోఁగూడిన గొడుగులు, నవ...తములు - నవలతా = లేఁదీఁగెలవలన, గలత్ = రాలుచున్న, అతాంతలతాంతములు = వాఁడిపోనిపూలు, పౌరసీమంతినులు=పట్టణస్త్రీలు, సేసలు=మంగళాక్షతలు, తరు...తము - తరురాజ=వృక్షశ్రేష్ఠములయందలి, ఖగ=పక్షులయొక్క, కూజితము, వేత్ర...వ్యూహము - వేత్రధరసమూహ = కట్టికలసమూహముయొక్క, ఉరు = అధికమైన, సాహోరుతి=సాహోధ్వనులయొక్క, వ్యూహము=సమూహము, వాతా...రవము - వాత=వాయువుయొక్క, అభిహత = తాఁకుడుచేత, వేణు = బొంగువెదుళ్లయందు, జాత = పుట్టిన, ఆరవము = ధ్వని, వంశ...రీతి - వంశగీత = వేణుగానము, ఆది = మొదలుగాఁగల, శుభవాద్యరీతి = మంగళవాద్యరీతి, గంధవహ...మండలములు - గంధవహకందళీ = మొలక వాయువుచేత, మందముగ, కంపమాన=కదలుచుండెడు, మృదులదళ=మెత్తనియాకులచేత, కాంత = మనోహరమైన, కాంతారకదళీకాండమండలములు = అడవియందలి యరఁటిచెట్ల సమూహములు, అగ్ర...పంక్తులు - అగ్ర=ఎదుట, వలమాన=చలించుచుండెడు, మాననీయ = పూజనీయములైన, బహువిజయవైజయంతికాపంక్తులు=అనేకములైన జయధ్వజములయొక్క సమూహములు.

క. సమయుజ్జ్వలదశనాయా
క్షమతాధికశోచ్యవృత్తికతనం దనగా
త్రముల నుదయించునై
వశ్యము సైఁచఁగఁజాలఁడయ్యె నవనిపుఁ డచటన్. 21

టిక. హరి. సమయ...కత-సమయ = (ఆఁకటి) సమయమందు, జ్వలత్ = ప్రజ్వలించుచున్న, అశనాయా = ఆఁకటిని, ('అశనాయా బుభుక్షా క్షుత్' అ.) క్షమత=ఓర్చుకొనుటచేత, అధిక మైన, శోచ్యావృత్తికతనన్ = శోచనీయవర్తనము గలుగుటచేత, నందనగాత్రములన్ = అవయవములయందు, వైవశ్యము = వివశత.

నల. సమయ...కతనన్ - సమయజ్వలదశనాయ, అక్షమత = సహింపకుండుట చేత, అధిక మైన, శోచ్యావృత్తియొక్క, కతనన్ = హేతువుచేత, తన గాత్రములన్ = తన యవయవములయందు, అవనిపుఁడు = రాజు.

ఉ. ఆతతి నాతుషారకిరణాన్వయుమ్రోల విచిత్రసృష్టివి
ఖ్యాతిసమేతనూతనమహోద్విజసంతతి దానభూత పూ
ర్వాతతభూరివిగ్రహసమగ్రతఁ జూపుచు నిల్చె దీప్తిసం
ఘాత మనంతరత్నరుచిగౌరవలంఘనజాంఘికంబుగన్. 22

టిక. హరి. ఆ...మ్రోలన్-ఆ,అతుషారకిరణ=సూర్యునియొక్క (అజ్ప్రశ్లేషము) అన్వయ=వంశముగల వారికన్నఁ ద్రుని యొక్క, మ్రోలన్=ఎదుట, విచిత్ర...సంతతి-విచిత్రసృష్టియొక్క, విఖ్యాతితో, సమేత=కూడుకొనిన, నూతన మైన, గొప్పబ్రాహ్మణ కులముగలవాఁడు, (విశ్వామిత్రుఁడనుట) దాన...సమగ్రతన్-దానభూత=దానలబ్ధ మైన, ('లబ్ధం ప్రాప్తం విన్నం భావిత మాసాదితం చ భూతం చ' అ.), పూర్వాతత భూరి=పూర్వాధిక ద్రవ్యముయొక్క, వి=విశేష మైన, గ్రహ=స్వీకరణముయొక్క సమగ్రతను,(లేక, విగ్రహ=కలహముయొక్క, సమగ్రతను) చూపుచు మున్ను యాగార్థముధారవోసిన ద్రవ్యమును దీసికొనఁగలవాఁ డై యనుట. దీప్తిసంఘాతము = కాంతి పుంజము, అనంత...బుగన్-అనంతరత్న = సూర్యునియొక్క, రుచి= కాంతియొక్క, గౌరవముయొక్క, లంఘనమందు, జాంఘికంబుగన్ = వేగముగలదానినిగా, సూర్య కాంతిఁ దిరస్కరించునట్లుగా ననుట.

నల. అతుషార...మ్రోలన్-ఆ, తుషారకిరణాన్వయ=చంద్రవంశపురాజయిన నలునియొక్క, మ్రోలన్ = ముందట, విచిత్ర...సంతతి-విచిత్ర...సమేతమయి, నూతన మైన, మహోద్విజసంతతి = పక్షిసంతానము, తాను, అభూత...సమగ్రతన్- అభూతపూర్వ=వింతలైన, అతత=విస్తృతమైన, భూరి=అధిక మైన, విగ్రహ = దేహములయొక్క ('విగ్రహస్సమరేదేహే' నానా.) సమగ్రతన్, చూపుచు, దీప్తిసంఘాతము, అనంతరత్న=అమితములైన రత్నములయొక్క,

సీ. అటు నిల్వ నాశిఖి హంసాసమాంబక
హరిముఖాధికదీప్తి నడరువాని
నరసి యేతద్ద్విజతరసాతిశయసేవ
నమున నిల్పుదు జీవనంబు లని పే

భుండు దండ మొనర్పఁ బూని మేకోక పా
టునకు లోఁబడఁ జేయ మునుకొని యవి
కలితకోపమునఁ దత్కౌశేయము గ్రహించి
యతిరభసమున మిన్నందె పలికె

గీ. మునుహరింపమి నీయంద యునిచినట్టి
యధికవిత్త మీపట్టున యజ్ఞపరమ
నీమఁ గొనవచ్చితిమి ధాత్రి నీకు నునుపఁ
జనునె మాసొమ్ము నరయ నక్షముల మేము. 23

టి. హరి. ఆశిఖి...దీప్తి-తి, శిఖి=అగ్ని, హంస = సూర్యుఁడు, అసమాంబక=రుద్రుఁడు, హరి=యముఁడు, ముఖ = మొదలైనవారియొక్క, అధికదీప్తిచేత, అడరువానిన్ (మహోగ్రుఁడైనవానిననుట.) అరసి,ఏత...నమున-ఏతద్ద్విజతర=ఈబ్రాహ్మణశ్రేష్ఠునియొక్క, సాతిశయ=అతిశయసహితమైన, సేవనమున= సేవచేత, విభుండు=హరిశ్చంద్రుఁడు,దండమొనర్పన్=నమస్కరింపగా, మేకోక=అంగీకరింపక ,పాటునకున్=అవస్థకు, లోఁబడఁజేయన్=లోఁజేయుటకొఱకు, మునుకొని, అవికలితకోపమునన్=వికలముగాని కోపముతో, తత్కౌశేయము = ఆహరిశ్చంద్రునియొక్క వస్త్రమును, గ్రహించి=పట్టుకొని, యతి=విశ్వామిత్రుఁడు, ఈపట్టునన్ = ఈసమయమున, యజ్ఞపరమనీషన్=యజ్ఞమందలి యుత్కృష్టబుద్ధిచేత, ఏము=మేము, అక్షములము = క్షమలేనివారము, శాంతులముకా మనుట.

నల. ఆశిఖి...దీప్తి-తి, శిఖి=నెమళ్లు, హంసములు, ఆసమాంబకహారి=చిలుకలు, ముఖ=మొదలుగాఁగలవానియొక్క, అధికదీప్తిన్=అధికమైన కాంతివంటి కాంతిచేత, అడరువానిన్=ఒప్పెడునాపక్షులను, అరసి=చూచి, ఏత...వనమున-ఏతద్ద్విజతరస=ఈపక్షులమాంసముయొక్క ('పిశితం తరసంమాంసమ్' అ.) అతిశయ సేవనమున=అత్యంతభక్షణముచేత, దండమొనర్పన్=చంపుటకనుట పూని, మేకోకపాటునకున్- మే=శరీరమునందలి, కోక=వస్త్రముయొక్క, పాటునకున్=వేయుటకు, లోఁబడఁజేయన్, అవి=ఆపక్షులు, తత్కౌశేయమున్ = ఆవస్త్రమును, గ్రహించి=పట్టుకొని, మిన్నందె, పైకెగసె యనుట. అధికవిత్తము=అధికద్రవ్యమైనది. (మిక్కిలి వెలగలది యనుట) ఈపట్టు=ఈపట్టుపుట్టము, నయజ్ఞ=నీతిమంతుఁడవైన రాజా!, పరమనీషన్=శత్రుబుద్ధిచేత, అక్షములము=పాసికలము, ఏము, (మేము పాచికల మనుట.)

చ. అన విని తెచ్చుపాటు సకలాంగములం [1]గడలేనిదైన్య మా
ననమున మన్యువేగము మనంబునఁ గ్రమ్మఁగ నమ్మహీశుఁ డి
ట్లను నఖిలార్థయుక్త నఖిలావనియున్ గయికొంటి రింక సా
ధనమును గాన మానఁ దగదా పగదాయతనంబు లింతటన్. 24

1 బ్రతి. 2 క్ష.

టీక, రెంటను సమానము.

గీ. అనిన నాయమితన్యాయ్యఘనమృదూక్తి
విసకయవిరాగశీలత్వమునఁ బయిపయి
నెగయ నప్పుడు గని వాని తెగువకు జగ
తీతలాధీశుఁ డత్యంతభీతుఁ డగుచు. 25

టీ. హరి. అయమి=అవిశ్వామిత్రుఁడు, తన్న్యాయ...క్తిన్-తత్ = అహరిశ్చంద్రుని యొక్క, న్యాయమునుండి తొలఁగని, ఘనమైన మృదూక్తిని, అవిరాగశీలత్వమునన్, అవిరాగ=విరక్తిరహితమైన, శీలత్వమునన్=స్వభావముగలవాఁడగుటచేత, జగతీతలాధీశుఁడు = హరిశ్చంద్రుఁడు.

నల. అ, అమిత...దూక్తిన్-అమితమైన, న్యాయ్యఘనమృదూక్తిని, విసక, అవి=అపక్షులు, రాగశీలత్వమునన్=మాత్సర్యశీలములగుటచేత, వాని తెగువకున్ = అపక్షులయొక్క సాహసమునకు, జగతీతలాధీశుఁడు = నలుఁడు.

సీ. ప్రబలమానీశనిర్దయవృత్తిఁదొడరు నీ
యర్థంబు హరియింప నగునె నాకు
విశ్వసన్నుతసత్యవిఖ్యాతినెలకప్పుఁ
దీర్చి పెంపొందు మదీయవంశ
వృద్ధులగతిఁగాంతు వెససనసట్లకా
కనుచునావరనియమానుకూల
మానసాధ్వులమిన్న మహనీయభక్తిన
క్షత్రకులసితప్రకాశుఁబ్రాణ

గీ. సదృశునీక్షించి తత్కాలసముచితస్వ
కపటసంధానమొకకొంత గలుగఁజేసి
యోవిబుధవర్య సచ్ఛాత్రయొక్కయుచిత
కార్య మెఱిఁగింతు విను మని గరిమఁ బలికె. 26

టీక. హరి. ప్రబలమానీశ! సంబుద్ధి. నీయర్థంబున్=నీద్రవ్యమును, విశ్వసన్నుతవిఖ్యాతిన్=ప్రపంచమందు కొనియాడఁదగిన ప్రశస్తిచేత, మాటఁదప్పక నెలకు, అప్పుదీర్చి=ఋణమును చెల్లించి, మదీయ...గతిన్-మదీయవంశ=నావంశమునందలి, వృద్ధులయొక్క, గతిన్=ప్రాప్తిని, కాంతును, ఆవర...మిన్న-అ, వర=శ్రేష్ఠమైన, నియమమునకు, అనుకూలమైన, మానసాధ్వుల = మనోమార్గముగలవారలలో, మిన్న = శ్రేష్ఠుఁడు, (ఋషిశ్రేష్ఠుఁడనుట,) కర్త. మహనీయభక్తిగలవాని, నక్షత్రకుని, తత్కాల

...సంధానము-తత్కాలసముచితమైన, స్వ=స్వకీయమైన, కపటసంధానము, ఓవిబుధ వర్య సచ్ఛాత్ర! ఇవి సంబోధనములు.

నల. ప్రబ...వృత్తిన్-ప్రబలమైన, ఈశనిర్దయవృత్తిన్-ఈశ = ఈశ్వరుని యొక్క, నిర్దయవృత్తిన్=నిర్దాక్షిణ్యావృత్తిచేత, తోడరునీయర్థంబు-తోడరు = ప్రాప్త మైన, ఈయర్థంబు=ఈకార్యము, ఆపద యనుట. విశ్వ...ఖ్యాతిన్-విశ్వసన్నుతమైన, సత్యమైన, విఖ్యాతిన్=కీర్తిచే, సెలకప్పుగన్, చంద్రకళంకమును, తీర్చి=పోఁగొట్టి పెంపొందు...గతిన్-పెంపొందు=ఒప్పునట్టి; మదీయవంశవృద్ధులయొక్క, గతిన్=నడ వడిని, కొంతును.(మా పెద్దలవలె నేకీర్తిని సంపాదించెద ననుట) అవర...మిన్న-అ, వర= పెనిమిటియొక్క, నియమమునకు, అనుకూలమైన, మాన=చిత్తసమున్నతిగలది, సాధ్వ లమిన్న = పతివ్రతారత్నమైన దమయంతి, కర్త: అక్షత్రకులసితప్రకాశున్-అ, క్షత్రియకులమునకు, సితప్రకాశున్ = చంద్రుఁడును, ప్రాణసముఁడునైన నలుని, తత్కాల...ధానము-తత్కాలసముచిత=ఆవేళకుఁదగిన, స్వక=స్వకీయమైన, పట= వస్త్రముయొక్క, సంధానము, ఒకకొంతకలుగఁజేసి, (తాను గట్టుకొనినవస్త్రమును గొంతఁ గట్టుకొనిచ్చి యనుట.) ఓవిబుధవర్యసచ్ఛాత్ర!=ఓదేవతాశిష్యుఁడా! ఇంద్రా గులకు విధేయుఁ డనుట.

గీ. ఎడప కేతద్గతి భజించి యడవిఁ దిరుగు
టొప్పునే వగ మనయర్థ మొదవుదనుక
మద్గురుహితాభిదర్శనమహితయాత్రఁ
గుశలము వహింపు మత్యంతవిశదబుద్ధి. 27

టీ. హరి. ఏతద్గతిన్-ఏతత్=ఈహరిశ్చంద్రునియొక్క, గతిన్, గమనమును, (భజించి వెంటఁదిరిగి యనుట.) ఏవగన్ = ఏవిధమువనైన, మద్గురు...యాత్రన్- మత్=నాయందలి, గురుహిత=అధికవిశ్వాసమును, అభిదర్శన=చూపుటయందు, మహిత మైన, యాత్రచేతను, కుశలమును వహింపుము.

నల. ఏతద్గతిన్=ఈయవస్థను, అడవిన్=అరణ్యమందు, వగన్=దుఃఖముతో, తిరుగుట, ఒప్పునే=తగునా? మనయర్థము = మనకార్యము, ఒదవుదనుకన్=అగుపర్యం తము, మద్గు...యాత్రన్-మద్గురు = నాతండ్రియైన భీమునియొక్క, హితమైన, అభి దర్శన=సందర్శనమందు, మహిత=శ్రేష్ఠమైన, యాత్రచేత, కుశలము, వహింపుము.

క. మనదేశంబున నెత్తిన
ధనము వరుసఁ దత్ప్రియార్థదత్తము నస్మ
ద్ధనమె యవ్వుఁగానఁ దదుపా
ర్జనకలనానహానబుద్ధి సంధింపు మనన్. 28

టీ. హరి. తదుపార్జనకలనాసహనబుద్ధిన్-తత్ = ఆద్రవ్యముయొక్క, ఉపార్జనమునందలి, కలనయొక్క, అసహనబుద్ధిని.

నల. మనదేశంబునన్ = మనరాజ్యంబునందు, ఎత్తినధనమువరుసన్ = కలిగిన ద్రవ్యమువలెనే, తత్ప్రి...దత్తమున్-తత్ =ఆ, ప్రియాప్రుడైనభీమునిచేత,దత్తము= ఒసంగఁబడినదియు, (మామగారైనభీముఁ డిచ్చిన ద్రవ్యమనుట) అస్మద్ధనమే=మన పదార్థమే, అవున్=అగును, కాఁన్=కాఁబట్టి. తదుపార్జన...బుద్ధిన్-తత్ =అధనము యొక్క, ఉపార్జన కలనయొక్క, సహనబుద్ధిన్=సహించెడుబుద్ధిని.

క. ఆయమ నుత్తమ దమహిత
ధీయుక్తిం బలుకు వసుమతీతలనాథుం
డాయర్థ మెల్ల నీయది
యే యగు నే నదిగణింతునే కల నైనన్. 29

టీ. హరి. ఆయమ...యుక్తిన్-ఆ, యమ=యోగముచేత, నుత్త = పరిహృతమైన, ('నుత్తనున్నా స్తనిష్ఠ్యూత' అ.) మదముగల, మహితమైన, ధీ = బుద్ధియొక్క, యుక్తిన్=కూడికగలవానిని(కూర్చి, (విశ్వామిత్రునిఁ గూర్చి యనుట).

నల. ఉత్తమురాలగు, ఆయమన్ = అదమయంతినిగూర్చి, దమ...యుక్తిన్-దమహిత=దాంతిహితమైన, ధీయుక్తిచేత, వసుమతీతలనాథుండు=నలుఁడు, నీయదియే అగును.

సీ. చిలికినచో నెల్ల సిరి వెలయించునీ
యవనీశుదరహాస మమృతనిధియొ
మించినచో నెల్ల మించుఁ గామితవృష్టి
నీధన్యుచూపు ధారాధరంబొ
ఆడినచో నెల్ల నర్థసంపద లెచ్చు
నీకళానిధివాక్కు నాకనిధియొ
నవిచినచో నెల్ల నినుచు సత్ఫలము లీ
నరనాథుకరము సంతానతరువొ
గీ. యనుచు మూర్ధాభిషిక్తులు వినుతిసేయ
ధరణి నేలిననేఁబోయి దైన్యవృత్తి
నొక్కయాప్తునిఁబ్రార్థింప నుచిత మగునె?
నగరె "దారతిరిపం" బని నగరజనులు. 30

టీ. రెండిటను సమానము.

చిలికినచో నెల్లన్=ప్రసరించినచో నంతటను, సిరి=సంపదను, వెలయించును = ప్రకాశింపఁజేయును. ఈనృపనీశుదరహాసము=ఈరాజుయొక్క చిఱునగవు, అమృతనిధియో=పాలకడలియో.

చిలికినచో (మథించినయెడల ననుట.) సిరిని=లక్ష్మిని, వెలయించు నని సముద్రగుణము సూచితము. ఇట్లే తక్కిన మూఁడుపాదములయందును వెలుంగునది.

మ. అజితప్రక్రియ నెల్లకాలమున నన్యాధీనతం బొల్చున
ద్విజలేఖాశ్రయవన్మహావనులఁ గావింతుం బ్రచారంబు వి
శ్వజను లెచ్చ హితంబుఁ గాంతు నని తద్వశ్యాత్మజాయాసదా
ప్తిజడీభూతమనస్కుఁ డై నిఖిలధాత్రీవల్లభుం డయ్యెడన్. 31

టీ. హరి. అనన్యాధీనతన్ = అన్యులకులోఁబడకుండుటచేత, పొల్చు...వనులన్-పొల్చు=ఒప్పుచుండెడు, సద్ద్విజ=శ్రేష్ఠులైన బ్రాహ్మణులయొక్కయు, లేఖ=దేవతలయొక్కయు, ఆశ్రయవత్=ఆశ్రయముగల, మహాత్+అవనులన్ = భూములయందు, తద్వ...మనస్కుఁడు-తత్, ఆ, వశ్యాత్మజ=మునికుమారునికి, (నక్షత్రకుని కనుట.) ('తపస్వీతాపసోదాంతో ఋషిస్సత్యవచావశీ'.) ప్రయోగము.—('దైవఘటనావశంబున నోవశీంద్ర' పాండురంగమహాత్మ్యము.) ఆయాసద=శ్రమనొసంగునట్లు, ఆప్తిచేత, జడీభూతమనస్కుఁడు=మందీభూతమైన మానసము గలవాఁడు, ఐ, నిఖిలధాత్రీవల్లభుండు=హరిశ్చంద్రుఁడు.

నల. పొల్చుసద్ద్వి...వనులన్-పొల్చుచుండెడు, సత్ = లెస్సైనన, ద్విజలేఖ=పక్షిపంక్తియొక్క, ఆశ్రయవత్=ఆశ్రయముగల, మహావనులన్=కొఱడవులయందు, తద్వ...మనస్కుఁడు-తత్ = ఆ, వశ్య = స్వాధీనురాలైన, ఆత్మజాయా=స్వభార్యయొక్క, సదాప్తి=నిరంతరప్రాప్తిచేత, జడీభూతమనస్కుఁడు, ఐ, నిఖి...భుండు = నలుఁడు.

క. క్షితిరాజ్య మెల్లఁ బుష్కర
గతకమలము గాఁగఁ జనియె ఘనతరధృతి నై
యతికపటాగమకలికో
పతాపజననానుగతినిబంధన మొసఁగన్. 32

టీ. హరి. పుష్కరగతకమలము గాఁగన్ - పుష్కర=ఏనుఁగుతొండపుఁ గొనయందు, ('పుష్కరం కరితుండాగ్రం' అ.)గత=తగుమైన,కమలము గాఁగన్=పద్మము కాఁగా, యతి...బంధనము-యతి=విశ్వామిత్రునియొక్క, కపటమనియెడు, అగమ=వృక్షమునకు, కలికా = మొగ్గయైన ('కోరకజాలకకలికాఃస్త్యలమకుళానితుల్యాని' హలాయుధము.) ఉపతాప = సంతాపముగల, జనులయొక్క, నానుగతి = వెంటరాకుండుటయొక్క, నిబంధనము. (విశ్వామిత్రునికపటజనితవ్యధచేత జనులు వెంట రాక నిల్వఁగా నని భావము.)

నల. క్షితిరాజ్యము, ఎల్లెడ = అంతయును, పుష్కరగతకమలము-పుష్కరుని చేత, గత = పొందఁబడిన, కమలము = లక్ష్మికలది కాఁగా, (రాజ్యలక్ష్మి పుష్కరునిచేఁ బడఁగా ననుట.) అతి...బంధనము-అతి=అత్యంతమైన, కపటాగమ=కపటపు రాకడ గల, కలిపురుషుని యొక్క, కోపతాపము యొక్క, జనన=పుట్టువుగల, (కోపతాప హేతువైన యనుట.) అనుగతి = అనుగమించుట యొక్క, నిబంధనము, కోపతాపములఁ బుట్టించుచుఁ గలిపురుషుఁడు తన వెంటఁబడఁగా ననుట.

వ. అప్పు డప్పుడమిఱేఁడు పేరడవికడల నడచు నెడల నెడనెడ సదానగ
జోజ్జ్వలగండపాళికాసమారోపితనఖముఖవిలాసంబునం బరిజ్వలిత
పావకకలాపారుణవిలోచనవికాసంబునం బొరసి నిజాభ్యంచితపం
చాననత్వంబు పొసంగ నెసంగునవియును, ప్రతిదివసదారితానేకదాన
వద్ద్విరదరుధిరోత్సేకపాండిత్యంబున నకాండసంధాసహస్రంబులు సం
పాదించుచు నేకదానవద్ద్విరదశిక్షణంబునకు సంధ్యాప్రతీక్షణంబు
వాటించుకుహనాహారిం గహాకహానినాదంబులం బ్రహాపించునవి
యును నచలేంద్రకుక్షివినిర్గతంబులై తదుత్సంగతలవిహరణంబులం
బెచ్చు పెరిఁగి తదీయకటకజంతుసంతానంబుల శాసించుచుఁ బటుకరటి
భ్రమపాటితపయోధరపయోధారలం బట్టాభిషేకంబుఁ గావించు
నవియునై రాజిల్లు మృగరాజాధిరాజంబులవలనను గాఢతరగర్జితఘ
నాఘనత్వంబుఁ దాల్చిన తమయెదుటం జటులగర్జిత ఘనాఘనంబులం
బచరించు టెట్లని యత్యంతదంతఘట్టనాటోపక్షోపానుషంగంబున శృం
గభంగంబు లాచరించుటయుఁ బ్రచండకరపీడనంబులం గండమండ
లంబులం జదిపియుఁ బరుషతరచరణసంతాడనంబున దంతంబుల రా
ల్చియుఁ దక్షిణప్రతి [1]ధ్వాన దేశంబుల గిరిశృంగంబుల నాక్రోశింపం
జేయునవియును ననంతకుంభినీసంభరణవిజృంభణంబులు కావున
నొక్క కుంభిని భరియింపఁబోయి డెస లెనసిన దివ్యదంతావళంబుల
నవహేడనంబు లొనర్చు మొందునఁదొండంబు లెత్తి వమధువులఁజిమ్ము
నవియును నధికతరమధుపకోటిసంస్పర్శనాక్షమత్వంబునం గొలం
కుల కెలంకులకుం డిగ్గి విమలతాస్పదంబులగు తదంబువులం బ్రతి
చ్ఛాయ వీక్షించి పరద్విరదంబు[2]ల నిరదంబు లనురదంబులఁ గ్రమ్మి
కలయించి సమయించుచుఁ దదాధారతాపరాధనివాసకాసారోద

1 ధ్వానదేశంబుల. 2 లని దరంబు లనుదరంబులఁ.

రాంత్రనాళంబులు పెకలించుకరణిఁ గమలినీమృణాలంబులు దిగిచి కరేణుశుద్ధాంతంబులకు నిచ్చి మచ్చికలు సూపునవియు నై చెలువారు వారణంబులవలనను నతిధీరవీరపుంగవాస్ఫోటనకరవాలచాలనోల్లాసనంబులం గఱకుమీసంబులు దీటుచుఁ దఱచువన్నియలు నెఱపుచుం దమచిఱుతదనంబు చిత్రంబుగా మెలంగునవియును ననవరతశంబరాంతకవ్యాపారపారీణంబులు గావునఁ బైనంటియాడిన తత్తన్మృగనాభిరక్తంబుల చాఱికలనం దుఱంగలించునంగశ్యామికలసంఖ్యాతగోఘాతపాతకరేఖాంకంబులం దలఁపింప నింపు మెఱయునవియును నాకంఠనాళకీలాలకలితంబులును నవ్యపాయనిద్రాముద్రితముఖంబులు నగుచు నాత్మీయపుండరీకత్వంబు సార్థంబుగా వహించునవియును నై రహియించు బహువిధశార్దూలంబుల వలనను నంతికగతజంతుచేష్టాసమధికక్రోధసంజ్వలనంబునఁ గరంగి వెడలునెడలేనిక్రొవ్వులభంగి నంగీకరింపుచుఁ బొంగు [1]చాంగ లభంగురదంష్ట్రావిటంకసంకలితాస్యకుహరంబులం దొఱంగ నతికర్కశవిశసదందహ్యమాన విధుశకలసుధాకిరణ దంతురితవదనవిధుంతు దాడంబరంబుల విడంబించునవియును నిర్వర్తితకందమూలవృత్తులై నిరర్గళనిజవర్గసహసంచరణంబు లుజ్జగించి నిశ్చలతరులకడలం బీఁటవెట్టి నిరంతరప్రాజ్యయోగంబున నితాంతవిరక్తభావంబు భజియించుచు నిఖిలాగమమర్మభేత్తలై నిరతిశయపాపర్థికరపాశబంధంబులు తృణీకరించునవియును గఠినతరఖనిత్రసదృశపోత్రంబుల ధాత్రీసమాకర్షణంబు సమకూర్చుచుఁ దత్ప్రదేశంబులం బర్యస్తముస్తాస్తంబనిర్విశేషంబుగా నతిస్థూలసాలమూలంబుల నతివిపులోపలంబుల నగలించు తఱిం బొడము వెడంగు కోఱలమిడుంగురులపేర నప్రతిమప్రతాపబీజంబులు వెదవెట్టునవియును నై పరిక్రీడించువనక్రోడంబులవలనను బహువిధప్రవర్ధితబుభుక్షాసేనాగణసంగ్రహణబలంబున నతిప్రబలంబులై ఋక్షేశ్వరు నొడిసిపట్టి గెలుపుపందెంబు లాడునిరులమన్నీలలీలం బాండురశ్వేయముఖాకర్షణజాగ్రత్కరాగ్రంబులై ఘుమఘుమనినాదవినోదంబులు సలుపునవియును నికుంజపుంజాభ్యంతరలీననిజస్త్రీసమాసాదసాంద్రవనక్రీడాయమానమానసంబులు గావుననతి

1 బొంగులనభంగురదం,

వేలనీలనిచోళనిచుళితావయవంబు లగుభాతి నాభీలహాలాహలత్వేళకాళిమకరాళంబులై కెరలునవియును శతానందనందనాన్వయసముద్భవంబు లయ్యునుఁ దాము భుజంగీధామంబు లధిగమించుచుఁ దదధరమధురసాస్వాదంబునఁ జొక్కుచు మన్మథపరాయణత్వంబు నొందినకతంబునం దలవంపులు పూనునవియు నై యుల్లసిల్లు నచ్ఛభల్లంబులవలనను సకలప్రాణినిర్వాపణధురీణత్వంబునకు మెచ్చి నిర్భరుండై తమసాహిణియగు సమవర్తి దంష్ట్రాకౌటిల్యంబు శృంగంబులయందును నుద్దండదండచండిమంబు చరణంబులయందును బ్రతిష్ఠింప నతినిష్ఠురంబులై యమరునవియును కాలకంఠకంఠకాకోలకబళనకరకాంతికలితకాయంబులఁ గాళికానిరసనంబుఁ గల్పించుచుం గాసరాసురమూర్తికాలుష్యంబు గడుగునవియును శరధిమగ్నశైలశాతంబునకు నోపక శాతత్వవిఖ్యాతిం బూనిన శతకోటి సిగ్గువడ శైవలినీశ్వరశరణాగతశిలోచ్చయంబుల శంబరంబులతోడన శతధాశకలితంబులు గావింతమ యని కార్యాలోచనకుం జేరినకరణి శశ్వన్మిళితకోణంబులైన శరవిషాణంబులుపూని యొనరునవియును నై వెలయు లులాయంబులవలనను నశ్రాంతసరభసశరభసంఘంబుల వలనను నాయతావయవగవయవర్గంబులవలనను నాఖండలభిదురోద్దండతుండగండభేరుండంబులవలనను నఖండితశౌండీర్యగండకంబుల వలనను నారణ్యచరహృదయశల్యశల్యంబులవలనను జిత్తంబున నియత్త లేనియుత్తలంబునం దత్తటించు మత్తకాశిని నుదాత్తనిజభుజావలంబనప్రదానంబునం దేర్చుచుండె నయ్యవసరంబున. 32

టీ. రెంటను సమానము.

సదాన...విలాసంబునన్-సదాన = మదోదకముతోఁగూడుకొనిన (మదించిన) గజములయొక్క, ఉజ్జ్వలములైన, గండపాళికా=గండస్థలములయందు, సమారోపిత=ఉంపఁబడిన, నఖముఖములయొక్క, విలాసంబునన్=విలాసమనియొడు, సదా...విలాసంబునన్-సదా=నిరంతరమును, నగజా=పార్వతియొక్క, ఉజ్జ్వలములైన, గండపాళికా=కపోలదేశములయందు, సమారోపితములైన, నఖముఖ = కొనగోళ్లయొక్క, విలాసముచేతను.

పరిజ్వలిత...వికాసంబునన్-పరిజ్వలిత=మండుచుండెడు, పావకకలాప=అగ్నిపుంజముభంగి, అరుణ=ఎఱ్ఱనైన,విలోచన=నేత్రములయొక్క,వికాసంబునన్=వికాస

మనియెడు, పరి...వికాసంబునన్-పరిజ్వలితములైన, పావక కలాధరారుణవిలోచన=అగ్నిచంద్రసూర్యనేత్రములయొక్క, వికాసముచేతను, నిజా...నత్వంబు-నిజ=స్వకీయమైన, అభ్యంచిత=మిక్కిలియొప్పుచుండెడు, పంచాననత్వంబు=సింహత్వమనెడు, నిజాభ్యంచితమైన, పంచాననత్వంబు=శివత్వము, పొసంగన్, ఎసంగునవియును = తనరునవియును.

ప్రతిదివస...పాండిత్యంబునన్-ప్రతిదివసమును, దారిత=చీల్పఁబడిన, అనేకములైన, దానవత్=మదవంతములైన, ద్విరద=ఏనుఁగులయొక్క, రుధిర=నెత్తుటియొక్క, ఉత్క్షేప = ఎగఁజల్లుటయందలి, పాండిత్యముచేత, ఆకాండ...స్రంబులు-అకాండసంధ్యా=అకాలసంధ్యలయొక్క, సహస్రంబులు, సంపాదించుచు=చేకూర్చుచు, ఏక...క్షణంబునకు-ఏక=ఒకటియై, దానవత్=మదవంతమైన, ద్విరద=ఏనుఁగనెడు, ఏక=ఒక్కఁడైన, దానవద్విరద = రాక్షసశ్రేష్ఠునియొక్క, శిక్షణంబునకు, సంధ్యాప్రతీక్షణంబు వాటించు కుహనాహరిన్=సంజనెదురుచూచు కపటనారాయణుని, (నరసింహమూర్తి ననుట) కహకహనినాదంబులన్=కహకహయను ధ్వనులతో, ప్రహసించునవియును.

అచలేంద్ర...తంబులు-అచలేంద్రకుక్షి = పర్వతగుహయనెడు, అచలేంద్రకుక్షి=రాజగర్భమునుండి, వినిర్గతంబులు = బయలువెడలినవి, ఐ, తదు...బులన్-తదుత్సంగతల = ఆపర్వతోత్సంగప్రదేశమనెడు, తదుత్సంగతల - తత్=ఆరాజుయొక్క, ఉత్సంగతల=తొడయందలి, విహరణంబులన్=విహారములచేత, పెచ్చుపెరిఁగి=అతిశయించి, తదీయ...నంబులన్-తదీయ=ఆపర్వతసంబంధమైన, కటక = నితంబప్రదేశమందలి, ('కటకోఽస్త్రీనితంబోఽద్రేః' అ.) జంతుసంతానంబులనియెడు, తదీ...బులన్-తదీయ=ఆరాజుయొక్క, కటక = పట్టణమునందలి, జంతుసంతానంబులన్ = ప్రజలను, శాసించుచు = శిక్షించుచు, పటు...ధారలన్-పటు = సమర్థములైన, కరటి=యేనుఁగులనియెడు, భ్రమిచేత, పాటిత=విదారింపఁబడిన, పయోధర = మేఘములయొక్క, పయోధారలచేత, మృగరాజాధిరాజంబులవలనను = సింహశ్రేష్ఠములవలనను,

గాఢతర...త్వంబున్-గాఢతరమైన, గర్జితముగల, ఘనాఘనత్వంబున్=మదేభములగుటను, ('శక్రఘాతుకమత్తేభవర్షుకాబ్దాఘనాఘనాః' అ.) చటుల...నంబులన్ - చటులములైన, గర్జితములుగల, ఘనాఘనంబులన్ = మేఘము లనెడు ఏనుఁగులను, అత్యంత...షంగంబునన్ - అత్యంత, దంతఘట్టన=దంతఘట్టనమనెడు, పలుగొఱుకుటయొక్క, ఆటోపముగల, కోపానుషంగంబునన్ = కోపముతోఁగూడుకొనుటచేత, శృంగభంగంబులు, శృంగ = శిఖరము లనెడుశిరస్సులయొక్క, ('శృంగంప్రభుత్వేశిఖరే...............శృంగస్స్యాత్కూర్చశీర్షకే......'విశ్వః) భంగంబులు=విఱుచుటలు, ఆచరించుటయు, ప్రచండ...నంబులన్-ప్రచండకరపీడనములచేత (కర=పన్ను, తొండము), గండమండలంబులన్=గండశిలలనెడు కపోల

ప్రదేశములను, చదిపియు, దంతంబులన్=పొదరిండ్లనెడుపండ్లను, (దంతో నికుంజే దశనే దంతాస్సానునికథ్యతే' విశ్వః.) అనంత...ఫణంబులు-అనంతములైన, కుంభినీ=పిడియేనుఁగుయొక్క, సంభరణంబునందు, విజృంభితంబులు, కావునన్; ఒక్కకుంభినిన్=ఒక్క పిడియేనుఁగును(ఒక్క భూమి ననుట), భరియింపఁబోయి, దెసలెనసిన=దెసపడిన...దివ్యదంతావళంబు లొక్కకుంభిని (భూమిని) భరియింపఁబోయి, దెసలు (దిక్కులు) చేరినవనుట. అధిక...త్వంబునన్-అధికతరమైన, మధుప=తుమ్మెద అనెడు మద్యపాయులయొక్క, కోటి=సంఘముయొక్క, సంస్పర్శన=స్పృశించుట యొక్క, అక్షమత్వంబున.

అతిధీర...నంబులన్-అతిధీరములై, వీరత్వముగల, పుంగవ = వృషభముల యొక్క, ఆస్ఫోటనమును, కర=చేనెడు, వాలచాలనోల్లాసనములనెడు, అతిధీరులైన, వీరశ్రేష్ఠులయొక్క, ఆస్ఫోటనముగల, కరవాల=ఖడ్గములయొక్క, చాలనోల్లాసనంబులచేత, తఱచువన్నియలనెడు, వన్నియలు = సొగసులు, తమచిఱుతతనంబు-తమ యొక్క, (చిఱుత పులులగుట.) చిఱుతఁదనమనెడు బాల్యము. (చిఱుతఁదనమునఁ బుట్టినగుణములు ప్రకటించుచుఁ జిత్రముగా విహరించునట్టి వనుట.) అనవరత... పారీణంబులు-అనవరత=ఎల్లప్పుడు, శంబర=మృగములకు. అంతక=నాశమైన, వ్యాపారము అనెడు,...శంబరాంతక వ్యాపారపారీణములు = మన్మథవ్యాపారములయొక్క పారీణములు, కావున, తత్తన్మృగనాభి...చాతికలు-తత్తన్మృగములయొక్క, నాభి రక్తంబులనెడు మృగనాభిరక్తంబులయొక్క, చాతికలు = రేఖలు, అన(న్), అంగశ్యామికలు = పొడలు, ఆకంఠ...తంబులు, ఆకంఠనాళ = కంఠనాళపర్యంతమైన, కీలాల = నెత్తురనెడునుదకముచేత, కలితంబులు, అవ్య...ముఖంబులున్-అవ్యపాయ నిద్ర=ఎడతెగనినిద్రయనెడు, అవి=సూర్యునియొక్క; అపాయ=విశ్లేషమువల్లనైన, నిద్ర=ముకుళనముచేత, ముద్రితములైన ముఖంబులుగలవి అగుచు, ఆత్మీయపుండరీకత్వంబు, ఆత్మీయమైన, పుండరీకత్వంబు=వ్యాఘ్రత్వమనెడు సితాబ్జత్వము.

నిర్వర్తితకందమూలవృత్తులు-నిర్వర్తితమైన, కందమూలములయొక్క,వృత్తులు= వర్తనమనెడు జీవనముగలవి, ఐ, నిరర్గళ...చరణంబులు-...నిజవర్గమనెడు, నిజ=నిజమైన, వర్గ=బంధువర్గముతోడ...నిశ్చలతరులకడలన్-నిశ్చలమైన, తరుల = వృక్షము లనెడు, నిశ్చలతరుల = మిక్కిలినిశ్చలులైనవారియొక్క, కడను, నిరంతర...గంబున(న్)-నిరంతరమును, ప్రకృష్టమైన, ఆజ్యముయొక్క, యోగముచేత, నితాంత... భావంబు(న్)-నితాంతమై, వి=పోయిన, రక్తభావముగలుగుట యనెడు విరక్తభావమును, నిఖిలాగ...భేత్తలు-నిఖిల=సమస్తమైన, అగమ = వృక్షములయొక్క, ('పలాశిద్రుద్రుమాగమాః' అ.) మర్మమనెడు, నిఖిలాగమ = సమస్తశాస్త్రములయొక్క, మర్మమును, భేత్తలు=భేదించునవి,ఐ-నిరతిశయ...బంధంబులు, పాపర్ధికరులయొక్క,

పాశబంధములనెడు, పాపర్ధికర=పాపవృద్ధికరములైన, పాశబంధంబులు (భవపాశబంధంబులనుట)-కఠిన...పోత్రంబులన్ - కఠినతరములైన, ఖనిత్రసదృశ=గుద్దలితో సమానమైన, పోత్రంబులన్=ముఖాగ్రములనెడు, హలాగ్రంబులచేత, ('ముఖాగ్రే క్రోడహలయోః పోత్రం' అ.) ధాత్రీసమాకర్షణంబు=భూమియొక్క దున్నుటను.

బహుళ...బలంబులన్, బహుళపక్షమందు, ప్రవర్ధితమైన, ఋక్షసేనాగణ=నక్షత్రసేనాసమూహ మనెడు బహుళప్రవర్ధితమైన భల్లూకసేనాగణముయొక్క, సంగ్రహణబలముచేతనే, ఋక్షేశ్వరున్ = చంద్రుఁ డనెడు భల్లుకేశ్వరుని, ('నక్షత్రమృక్షంభల్లూకే' నానా.) శతా...ద్భవంబులు - శతానందనందన=బ్రహ్మపుత్రుని యొక్క (జాంబవంతునియొక్క). అన్వయమందు, సముద్భవంబులు అయ్యును, భుజంగీధామంబులు=పుట్ట లనెడు బిలగృహంబులను-తదధర...దంబున-తత్=ఆపుట్టలయొక్క, అధర=అధోభాగములయందలి, మధురస=తేనెయనెడు, తత్=ఆభుజంగీజనముయొక్క, అధరమధురసమునవైన,ఉస్వాదంబునన్, మన్మథపరాయణత్వంబున్-మన్మథ=వెలగపండ్లయందలి, ('దధిత్థగ్రాహి మన్మథాః' అ.) పరాయణత్వంబు=ఆసక్తి యనెడు, మన్మథపరాయణత్వంబు = మదనపరాయణత్వమును.

కాళికానికషంబున్-కాళికా = మేఘజాల మనెడు కాళికాదేవియొక్క, ('మేఘ జాలేఽపికాళికా' అ.) కాసరా...కాలుష్యంబున్-కాసరాసుర=మహిషాసురునివలనఁ గలిగిన, దుష్కీర్తికాలుష్యమును.

సీ. కట్టెండ తాఁకునఁ గమలదే యీలేమ
నెఱులు ఘనంబులై నెఱయకున్నఁ
గడలేనిదప్పిఁ గీడ్పడదె యీయతివ యా
స్యము సుధామూర్తియై యడరకున్న
సురగాలితిరువుల సురుఁగదే యీతన్వి
యచలంబులై చన్ను లమరకున్నఁ
[1]గార్గిసెగలకుఁ గందదే యీబాల
మేలిమియై మేను మించకున్న

గీ. ననుచు వనచక్రచంక్రమాయాసమును స
దానముజ్జ్వలసహజసౌందర్య[2]రసవి
కాసమును వన్యదేవతల్ గాంచి పొగడ
నధిపుకై దండ నరిగె వేదండగమన. 34

1 గరఁగియు సెగలకు. 2 సద్వి, కాసము వరణ్యదేవతల్.

టీ. రెంటికిని సమానము.

ఇందు 'మేలిమి' యనఁ గడాని (అపరంజి.)

ఉ. కమ్మనిపువ్వుఁ[1]దేనియలఁ గాఁక లడంచుఁ బ్రవాళతాళవృం
తమ్ముల నేదఁ దేర్చు విరితావులఁ జల్వలు గ్రుమ్మరించుఁ బూ
దుమ్ములఁ బూజ నల్పు వ్రతతుల్ వరమంజులతాధిరాజ్యయో
గమ్మునఁ బొల్చు నాసుగుణకల్పకవల్లి వనిం జరింపఁగన్. 35

టీ. రెంటికిని సమానము. వ్రతతుల్ = తీఁగెలు ("వల్లీతు వ్రతతిర్లతా" అ.) వర...యోగమునన్, వర=శ్రేష్ఠమైన, మంజులతా=మంజులత్వమనెడు, అధిరాజ్యము యొక్క, యోగమ్మునన్=కూడికచేత.

సీ. బాలిక బడలి కెంగేల నూఁదిన మావి
తావి పూరెమ్మ కై దండ యొసఁగుఁ
బల్లవాధరి తొట్రుపడి యంఘ్రి సోఁకింపఁ
గంకేళి యలరుచెంగావిఁ బొదువు
శుకవాణి యలసి యుస్సు రన వావిలి యెండ
చాటు గాఁగఁ బరాగశాటి యెత్తుఁ
దెలివ జగ్గిలి చూడఁ దిలకంబు భృంగఝుం
కారోక్తి నీడకుఁ జేరఁ బిలుచు
గీ. నతివ యత్యంత వివశ యై యలమఁ గ్రోవి
తేటతేనియ తెలినీటఁ దెలివి దెచ్చు
నకట! యప్పటి చెలిఁ జూడ నతికఠోర
తరులకైన రసోద్భేదకరము గాదె. 36

టీక. రెండింటను సమానము.

ఇందు వృక్షములు బడలికదేర దీహమున కుపచారంబులుచేసిన పనులచే దోహద కృత్యములు స్ఫురించుచున్నవి. అతికఠోరతరులకైన=మిగులఁ గఠినులకైనను, కఠోరములగు వృక్షములకైనను.

శా. కట్టెండన్ వదనంబు వాడ నడుగు ల్గందన్ గురుల్ వీడఁ జ
న్నిట్టల్ రాయఁగఁ బేదకౌ నులియఁ గన్నీ రుబ్బ ఘర్మాంబువుల్

1 దేనియలఁ నాఁక...వృంతమ్ములు...తావులు చల్వ...లుపూజ...

టీక. వర...యోగమ్మునన్, వరమైన, మంజులములైన, లతలయొక్క, అధిరాజ్య=అధిరాజత్వముయొక్క, యోగమ్మునన్.

మెట్టఁగ నట్టడవిం జరించుసతి నాలోకించు భూజానికిం
బుట్టఁగ బట్టఁగరానిశోకము హృదంభోజంబునం దయ్యెడన్. 37

టీక. రెంటను సమానము.

చ. వెనుకొనివచ్చుబాలయతి విహ్వలతావివశీకృతాకృతిం
గనుఁగొని రాజమౌళి నవగాఢవిషాదవిలోలదృష్టి ని
ట్లను రమణీయధైర్య తృష నాఁకటఁ జిక్కితివే సహింప నీ
వనగతిఖేదముం జనుము వావిరి నీకడ వారి నారయన్. 38

టీక. హరి. వెనుకొని...యతి-వెనుకొనివచ్చెడు, బాలయతి=నక్షత్రకుఁడు, కర్త. విహ్వ...కృతిన్-విహ్వలతా=తొట్రుపాటుచేత, వివశీకృతమైన, ఆకృతిన్=ఆకారముతో, రాజమౌళిన్=రాజును (హరిశ్చంద్రుఁడనుట), అవగాఢ...దృష్టిన్-అవగాఢమైన, విషాద=దుఃఖముచేత, విలోలమైన, దృష్టితో, రమణీయధైర్య! సంబుద్ధి. తృషన్=దప్పిచేతను, ఆఁకటన్=ఆఁకటిచేతను, వే=వేగము, చిక్కితి వని పూర్వమున కన్వయము. ఈవనగతిఖేదమున్=ఈవనసంచారదుఃఖమును; సంహింపన్=ఓర్వఁజాలను, వావిరిన్, ఈకడన్=ఈప్రదేశమునందు, వారిన్=ఉదకమును, ('అపస్త్రీ భూమ్ని వార్వారి' అని అమ.) అరయన్=వెదకుటకు చనుము.

నల. వెను...కృతిన్-వెనుకొనివచ్చెడు, బాలా=దమయంతియొక్క, అతివిహ్వలతచేత, వివశీకృతమైన, ఆకృతిన్, రాజమౌళి (నలుఁడనుట) కర్త, నవ...దృష్టిన్-నవ=నూతనమైన, గాఢవిషాదముచేత, విలోలమైన, దృష్టితో రమణీ! అధైర్య! సంబుద్ధులు. తృషన్, ఆఁకటన్, చిక్కితివి ఏ(న్)=నేను, నీవనగతిఖేదమున్=నీయొక్క వనసంచారదుఃఖమును, సహింపఁజాల నని యన్వయము, నీకడవారిన్=నీప్రక్కవారిని (పుట్టింటి వారి ననుట.)

చ. అని హృదయేశుఁ బల్కుసతి యాఁకటఁ గుందిన నంబువాంఛఁ జెం
దినను విచారచారునియతిం వగపొందిననాథు నేలికోఁ
జనుఁ గులకాంత ధర్మమిది సత్యము గాన నుపేక్షచేఁ గనుం
గొనవల దింక నన్ననిన గోత్రవరుండు దయార్ద్రచిత్తుఁడై. 39

టీక. హరి. సతి=చంద్రమతి, విచారచారుని(న్)-విచారమును, చారుని(న్)=పొందినవానిని, వగపు+ఒందిన+అనాథుని (న్)=దుఃఖమునొందిన యనదయగు వానిని *'చేసిన+అట్టి = చేసినట్టి' అను మొదలగుచోటులందువలె అకారసంధి,) యతిన్=మునిని (నక్షత్రకు ననుట.) ఇది, కులకాంతధర్మము, కులకాంత = గృహపతియొక్క, ధర్మము, (కులంగృహేచ. అ. శే.) ఇంకన్, అన్నన్=ఈతీరునఁ జెప్పఁగా, ఇనగోత్రవరుండు = సూర్యవంశాధిపతి.

నల. విచార...యతిన్-విచారచారువైన, నియతిన్=నియమముచేత, వగపొందిన(న్) వ్యర్థఁజెందినపుడు, నాథున్=పెనిమిటిని, ఇది (ఇట్లు నాథు నేలికొనుట) కులకాంతధర్మము కులస్త్రీలయొక్క ధర్మము. (కులకాంత లాపత్సమయములయందు, దమ యాఁకలిదప్పులను విచారించుకొనక పెనిమిటిని రక్షింపవలయును గాని విడిచి పోరాదనుట.) నన్ను, అనిన(న్) గోత్రవరుండు, (గాం భూమిం త్రాయత ఇతి, గోత్రాః = భూపాలాః.) గోత్రవరుం డనఁగా=భూపాలశ్రేష్ఠుఁడు.

సీ. కొమ్మ పల్కు-వు డీయకొని వనస్థలములా
రయుచు నొక్కెడ వినీతియుగశేషుఁ
డు శఠోగ్రతాశాలి కుశికోదితుం డను
పదమితేతరహృతి ప్రవణమాయ
నందు దోషాచారి యన్యమార్గము సూప
నతఁడు దద్వంచనాయత్తుఁ డగుచు
ఫలమూలజలములు గల వని వేతాళ
వటసాలముఖ్యైకవసతిఁ జేరి
గీ. సరవి నావరవర్ణిని జలము లానఁ
జేసి పాకసమేతరాజీవగంధి
తో రుచిరశైత్యయుతవారిపూర రమాని
యావటము మీఱు నెలవున నధివసింప. 40

టీక. హరి. వనస్థలములు=బిలప్రదేశములు, ('జీవనంభువనం వనమ్' అ.) వినీతి...శేషుఁడు, వినీతియుక్=నీతియుక్తమైన, అశేషుఁడు=సమస్తముగలవాఁడు, శఠోగ్రతాశాలి-శఠోగ్రతచేత, శాలి=ఒప్పెడువాఁడు, కుశికోదితుఁడు=కౌశికుఁడు, అనుపన్=పంపఁగా, దమి...మాయన్, దమిత=మునిభావముచేత, ఇతరహృతి = ఇతరసంహారణమందు, ప్రవణ=తగిలిన, మాయను, అందుదోషాచారి = పొందెడు (దంతఘాతుఁడను) రాక్షసుఁడు, అన్యమార్గము=తప్పుత్రోవను, చూపఁగా, అతఁడు = ఆహరిశ్చంద్రుఁడు, కలవు=ఉన్నవి,అని వేతాళ...వసతిన్-వేతాళ=భేతాళునియొక్క ('వబయోరభేదః' అనుటచే నిట, 'బ' కు 'వ') వటసాలముఖ్య = వటతరుశ్రేష్ఠముచేత, ఏక=ముఖ్యమైన, వసతిన్=ఉనికిపట్టును, ఆవరవర్ణిని=ఆశ్రేష్ఠుఁడైనబ్రహ్మచారిని (నక్షత్రకుసనుట) ('వర్ణినో బ్రహ్మచారిణః' అ.), పాక...గంధితో-పాక=పిన్నవానితోడ, సమేతయైన, రాజీవగంధితో=చంద్రమతితో, ఆవటముమీఱునెలవున = ఆవటవృక్షము మించుతావున.

నల. వనస్థలములు=అటవులు, వినీతి=పోయిననీతిగలవాఁడు, యుగశేషుఁడు=కలిపురుషుఁడు; కుశికోదితుఁడు-కుశిక=తాండ్రచెట్టునందు, ("కుశికస్స్యా-నో తైల

శేషేమజ్జాతువృతుయోః.''విశ్వ) అను...మాయక్;అనుపద=ప్రతిపదమందును, మితే తర=అమితమైన, హ్పాతిక్=హరణమందు, ప్రవీణమైన, మాయను, అందుదోషాచారి- అందిన, దోషాచారి=దోషాచారముగలవాఁడు, అన్యమార్గము=తప్పుత్రోవ,అతఁడు=అ నలుఁడు...వని=అరణ్యమును, వే=వేగమే, తాళ..వసతిక్-తాళపటపాలములచేత, ముఖ్యమైన, ఏకవసతిక్=ఏకస్థలమును, అవరవర్ణినిక్ = దమయంతిని, పాకసమేత ... పూరము-పాకసమేత=వికస్వరములైన, రాజీవ=పద్మములయొక్క, గంధితి=సంజాతగం ధముగలవై, ఉరుచిరశైత్యయుతమైన, వారిపూరమును, అవటము మీఱునెలవునక్ = లైనైనతావున (ననుట) అవటశబ్దమునకుఁ బూర్వ ప్రయోగము.—

"గీ. పలయుసంపదలంద నావటము వటను...... (భాగ. చ. స్క౧.)

శా. భూమీమండలమండనాయితయశోభూరిప్రభావుక్ విధు
శ్రీమద్వంశమునం జనించిన ధరిత్రీకాంతునిం గాంతతో
నీమాయానిధి కాసిఁ బెట్టఁ దగునే యి ట్లంచు రాగోజ్జ్వలుం
డై మిత్రుండు దదీక్షణాక్షమతమై నంభోధి గ్రుంకె న్వేసక్. 41

టీక. హారి. విధు...శమునక్-విధు=చంద్రునియొక్క, శ్రీమంతమైన, వంశము నందు, ఈమాయానిధి=ఈకవి, కడమపైయట్లు.

నల. విధుశ్రీక్=చంద్రునివలె, మద్వంశమునక్=నావంశమునందు, ఈమాయా నిధి=ఈవిశ్వామిత్రుఁడు, రాగోజ్జ్వలుఁడు, రాగ = (సంధ్యా)రాగ మనెడు రాగము (కోపము)చేత, ఉజ్జ్వలుండు, ఐ, మిత్రుండు = సూర్యుఁడనెడు మిత్రుఁడు (స్నేహి తుఁడు) తదీ...మైక్-తత్ =ఆగాసియొక్క, ఈక్షణ = చూచుటయందు, అక్షమత మైక్=క్షమతలేకుండుటచేత.

క. అతతినలవిరచితశ
య్యాతలమునఁ బవ్వళించె నతివ యభినవో
ద్భూతశ్రమకణికావి
ద్యోతితమాణవకభూషితోన్నతకుచయై. 42

టీక. హారి. అతతి, నల...తలమునక్ - నల = తృణములచేత, ('తృణేఽంబు జేనలంనామ'అ.) విరచితమైన, శయ్యాతలమునక్ = పాన్పునందు, అతివ=చంద్రమతి, అభి...కుచ-అభినవోద్భూతములైన, శ్రమకణికా=స్వేదబిందువులచేత, విద్యోతిత = ప్రకాశితములై, మాణవక = పిన్నవానిచేత, ('బాల స్తు స్యా న్మాణవకః' అ.) భూషిత ములై, ఉన్నతములైన, కుచములుగలది, ఐ, పవ్వళించె నని యన్వయము. లోహిత కుమారు నక్కునఁ జేర్చికొని పవ్వళించె ననుట.

నల. నల...తలమునకె-నలునిచేత, విరచితమైన, శయ్యాతలమున, అతివ=దమయంతి, అభి...కుచ-అభినవోద్భూతక్రమకఠినకలశమై, విద్యోతితమైన, మాణవక = ఏఁబదినాలుగు ముత్యములుగల హారవిశేషముచేత. ('అర్థహారో మాణవకః' అ.)

గీ. తడయ కాద్విజరాజసంతతియు నిదుర
వోవఁగా నల్కి యున్నిద్రభావయుక్తి
నమరె నాపతితత్రాణసమయ మెఱిఁగి
భయదబహుజంతుదుర్దాంతపదవి నంత. 43

టీక. హరి. ఆద్విజరాజసంతతియు = ఆనక్షత్రకుఁడు, నిదురవోవఁగా = నిద్రింపఁగా, అల్కి=అళికినవాఁడై, ఆపతి=ఆహరిశ్చంద్రుఁడు, తత్త్రాణసమయము, తత్=వారియొక్క, త్రాణసమయము, ఇందుఁ బ్రథమాంతమైన పతిశబ్దముమీఁది తకారము దకారముగాక యున్నది.

నల. ఆద్విజరాజసంతతి=ఆచంద్రవంశము గలవాఁడు (నలుఁ డనుట.) నిదుర వోవఁగా. అల్కి=భయపడి, ఉన్నిద్రభావయుక్తిన్, ఉన్నిద్రభావ=మేలుకొనుట యొక్క, యుక్తిన్ = యోగముచేత, ఆపతితత్రాణసమయము, ఆపతిత = ఆపన్నుల యొక్క, త్రాణ=రక్షణముయొక్క, సమయము, ఎఱిఁగి. ప్రయోగములు:—

"విముఖితసమదాటోపారి పంక్తిరఘుఁడు", "గృహమేధి తద్విశేష మహిమ", "వెలయు నఖిలభువనములలోన వారణనగరి పురమతల్లి నాఁ దనర్చి." (రాఘవపాండ)

సీ. ఆదిత్యమండలాపాయచండిమశాలి
భుజగదానవపరిస్ఫురితకేళి
నిఖిలవర్ణగ్రాసనిర్విశంకవిహారి
తారకాత్యంతవిస్తారకారి
ఉగ్రకంఠాగ్రసముద్భటఘూత్కారాధి
కాభీలవృత్తి పుంజీభవత్స
మస్తదిశాపాలి మాయాబలానమ
వేతాళకాభిఖ్య వెలయుమేటి

గీ. ఘోరతమము భూతకోటిప్రకృతిదుర్వి
గాహతానితాంతగాఢబలము
నధిగ[1]మించి మించి యవ్వు డవనీచక్ర
మెల్లఁ దాన యగుచు నేవుఁ జూపె. 44

---

1. మించియప్వు డఖిలావనీచక్ర.

టీక. హరి. ఆదిత్య...శాలి-ఆదిత్యమండల=దేవసమూహముయొక్క, ('ఆదిత్యౌ రవిగీర్వాణౌ'' 'మండలం నద్వయోః కుష్ఠే వృషసూర్యైకభేకయోః, బింబే ద్వాదశరాజౌఘేఽపి కురుంబే'... నానా.) అపాయమందలి, చండిమ = చండతచేత, శాలి = ఒప్పెడువాఁడు, భుజగ...కేళి-భుజమునందలి గదయొక్క, నవమై పరిస్ఫురితమైన కేళిగలవాఁడు, నిఖిల...విహారి - నిఖిలమైన, వర్ణ = బ్రాహ్మణాది వర్ణములయొక్క, గ్రాస=గ్రసించుటయందు నిర్విశంకవిహారియైనవాఁడు, తారకా...కారి-తారక = కనుగ్రుడ్లయొక్క, ('తారకాదైత్యనాసికా, కనీనికాయాం భేదాయాం' నానా.) అత్యంతవిస్తారమును, కారి=చేసెడువాఁడు, ఉగ్ర...పాళి-ఉగ్రమును, కంఠాగ్ర సముద్భటమైన, క్ష్వేళా = సింహనాదముయొక్క, ('దంతోష్ఠవాద్యే క్ష్వేళా స్త్రీ పుంసి కర్ణమలే విషే' అమరశేషము.) అధికమైన, ఆభీలవృత్తిచేత, పుంజీభవత్ = గుంపులుగూడుచుండెడు, సమస్తదిశాప = సకలదిక్పతులయొక్క, ఆళి = పంక్తిగలవాఁడు, మాయా...భిఖ్యన్-మాయాబలముచేత, అసమ=సరిలేని, వేతాళక=బేతాళుఁడనెడు, 'వబయోరభేదః' అభిఖ్యన్=పేరుచేత, వెలయుమేటికర్త. ఘోరతమము= మిక్కిలి భయంకరమైనది, భూత...బలమున్, భూతకోటి = పిశాచకోటియొక్క, ప్రకృతి=స్వభావముచేత, దుర్విగాహతా = చొరశక్యముగానిదగుటచేత, నితాంత గాఢ=మిక్కిలిగాఢమైన, బలము(న్)సేనను, అధిగమించి = కూర్చుకొని, వనీచక్రమెల్లన్ = అరణ్యప్రదేశమంతయు.

నల. ఆదిత్య...కేళి-ఆదిత్యమండల = సూర్యమండలముయొక్క, అపాయ= అస్తమయమువల్లనైన, చండిమన్=తీవ్రతచేత, శాలి=ఒప్పెడు, భుజగములయొక్కయు, దానవులయొక్కయు, పరిస్ఫురితమైన కేళిగలది, నిఖిల...విహారి-నిఖిలములైన, వర్ణ= నీలపీతాదివర్ణములయొక్క, గ్రాస=కబళనమందు, నిర్విశంకమైన విహారిణియైనది, తార...కారితారక=నక్షత్రములయొక్క, అత్యంతవిస్తారమును, కారి=చేసెడిది, ఉగ్ర...పాళి-ఉగ్ర=శివునియొక్క, ('శూద్రాయాం క్షత్రజశ్శంభౌ చోగ్రో ఘోరే త్వయం త్రిషు' నానా.) కంఠాగ్రమందు, సముద్భటమైన, క్ష్వేళ=విషముయొక్క, అధికాభీలమైనవృత్తివంటివృత్తిచేతను, (గాఢనైల్యముచేత ననుట.) పుంజీభవత్=ఏకీభవించుచున్న (కుప్పలౌచున్న యనుట.) సమస్తమైన, దిశాపాళి = దిక్ప్రదేశములుగలది. మాయా...భిఖ్య=మాయయనెడు, అబలా=వనితయొక్క, సమవేతమైన, (ముడువఁబడిన దనుట.) అలక=వెండ్రుకలయొక్క, అభిఖ్య = శోభవంటి శోభచేత, (మాయాకాంతయొక్క కొప్పువలె ననుట.) ఘోరతమము=ఘోరమైన, చీకటి, భూత ... బలమున్-భూతములయొక్క, ప్ర=ప్రకృష్టమైన, కృతి=చేష్టలచేత, దుర్విగాహతా= విగాహింప శక్యముగానిదౌటచేత, నితాంత=గాఢమైన, బలమును, అవనీచక్ర మెల్ల.

ఉ. అప్పుడు రాజు శైత్యసముదగ్రకరోద్గతమండలాగ్రుఁడై
ముప్పిరిఁ గ్రమ్ము నయ్యురులమూఁకల మేటిరహిన్ హరింపఁగాఁ

గప్పె దిశాముఖంబున నఖండితనూతనరక్త దీధితుల్
దప్పె ననల్పకౌశికమదప్రతిపాదితచేష్ట లంతటన్. 45

టీక. హరి. అప్పుడు, రాజు=హరిశ్చంద్రుఁడు. శైత్య...గ్రుఁడు-శైత్య=వాఁడి చేత, సముదగ్రమై, కరము చేత, ఉద్గత=ఎత్తఁబడిన, మండలాగ్రుఁడు = ఖడ్గముగల వాఁడు, ఐ, అయ్యిరులమూఁకల మేటిన్=బేతాళుని, నూతనరక్త దీధితుల్, నూతన మైన రక్త=నెత్తురుయొక్క, దీధితుల్, కప్పెన్; అనల్ప... చేష్టలు - అనల్పములైన, కౌశిక = విశ్వామిత్రునియొక్క, మదప్రతిపాదిత = మదసంపాదితములైన, చేష్టలు, తప్పెన్.

నల. రాజు = చంద్రుఁడు, ("ప్రభౌ భూమిపతౌ రాజా క్షత్రియే రజనీపతౌ" రభసః) శైత్య...గ్రుఁడు-శైత్య=చల్లఁదనముచేత, సముదగ్రమైన, కర=కిరణములు గల, ఉద్గత=ఉదితమైన, మండలాగ్రుఁడు=బింబాగ్రముగలవాఁడు, ఐ, అయ్యిరుల మూఁకల(న్)=ఆచీఁకటిగములను, నూతనరక్తదీధితుల్-నూతనమైన, రక్తదీధితుల్ = అరుణకాంతులు, అనల్ప...చేష్టలు - అనల్పములైన, కౌశిక = గూబలయొక్క, ('మహేంద్రగుగ్గులూలూక వ్యాళగ్రాహిషు కౌశికః" అ.) మదప్రతిపాదితచేష్టలు, తప్పెన్.

సీ. విదళితకువలయోద్వేలనూతనరస
ధారల సారంగతతులు దేల
సకలశిలోచ్చయస్తబకితాంబువిశేష
విలసనంబున సింధుజలము లుబ్బఁ
దరుణతటిత్ప్రభాధరసితాంతప్రసం
గతి భుజంగశ్రేణి[1]కదలకుండ
గాఢముక్తాసంఖ్యకరకాశనిరసన
స్ఫూర్తిఁ బాంథుల డెందములు దలంకఁ
గీ. గౌశికాశాంతిమాయాబ్ధికలితవృద్ధి
కంబు ఘనరాజమండలి గలయ నింప
మెఱసి తామేటివెన్నెలమి న్నయించెఁ
బ్రకటగతి వాన జవనాతిభయద మగుచు. 46

టీక. హరి. విదళిత...ధారలన్-విదళిత=వ్రిక్కలింపఁబడిన, కువలయ=భూ వలయముగల, ఉద్వేల=అధికమైన, నూతనరసధారలన్=నూతన జలధారలయందు.— ("శృంగారముఖ్యమధురాదిసువర్ణకతో నిర్యాసరాగగరళద్రవపారదేషు, ఆస్వాదన ధ్వనిసుధాంబురసాఖ్యధాతువ్వష్టౌరసోఽథరసనా ధరణీ రసా స్యాత్" నానా). సారంగతతులు=చాతకసమూహములు ('సారంగశ్చాతకే భృంగే' విశ్వః) సకల...విస

1 కదలుచుండ.

నంబునన్-సకలమైన, శిలోచ్చయ=పర్వతములందు, స్తబకిత=నిబిడములైన, (అధికములైనవనుట.) అంబువిశేషములయొక్క, విలసనముచేత, సింధుజలములు = సముద్రోదకములు, తరుణ...సంగతి(న్) తరుణములైన,తటిత్ప్రభా=మెఱుపులయొక్క కాంతులు, అధర=అధోభాగములయందు, నితాంత=ఎడతెగని, ప్రసంగతిన్ = ప్రసరణముచేత, భుజంగశ్రేణి=సర్పపంక్తి, గాఢ...స్ఫూర్తిన్-గాఢమగునట్లు, ముక్త=విడువఁబడిన, అసంఖ్య=అమితములైన, కరక=వడగండ్లయొక్కయు, అశని=పిడుగులయొక్కయు, రసనస్ఫూర్తిన్=ధ్వన్యాధిక్యతచేత, పాంథులడెందములు=తెరువర్లమనస్సులు,కౌశి...కంబు-కౌశిక=విశ్వామిత్రునియొక్క, అశాంతి = శాంతిరహితమైన, మాయయనెడు, అబ్ధి=సముద్రముయొక్క, కలితమైన, వృద్ధికంబు=వృద్ధిగల యుదకము గలది; ఘనరాజమండలి=మేఘశ్రేష్ఠములయొక్క, సమూహము, కలయ, నింపఁ(న్), వర్షింపఁగా తామేటివెన్నన్=హూర్మముయొక్క, వీఁపును, ఎలమిన్=వికాసమును, నయించెన్=పొందించెను. ద్వికర్మకము. వాన. కర్త. జవనాతిభయదము-జవన = వేగములచేత, (వాన కూర్మము వెన్నంటఁ గురిసెననుట.)

నల. విదళిత...ధారలన్-విదళిత=వికసితములైన, కువలయ=కలువలయొక్క, ఉద్వేలములైన, నూతనరసధారలన్=నూతనమకరందధారలచేత. సారంగతతులు = తుమ్మెదగుంపులు. సకల...నంబునన్-సకలశిలా (కలాభిస్సహవర్తతఇతి సకలః = చంద్రః, తస్యశిలాః) చంద్రకాంతమణులయొక్క, ఉచ్ఛ్రయ=సమూహములయందు, స్తబకిత=నిబిడమైన, అంబువిశేషవిలసనముచేత, సింధుజలములు, ఉబ్బన్, తరుణ...సంగతి(న్)-తరుణ=ప్రాయపురాండ్రైన,తటిత్ప్రభా=స్త్రీలయొక్క, అధర=పెదవులయొక్క, నితాంతప్రసంగతిచేత, (చుంబనముచేసెననుట), భుజంగశ్రేణి = విటసమూహము ("భుజంగౌవిటపన్నగౌ" నానా). గాఢ...స్ఫూర్తిన్-గాఢమైన, ముక్తా=ముత్తెములతో, సంఖ్యకర=కలహముచేయునదియు, కౌశ=తెల్లురొయొక్క, నిరసనము గలదియునైన, స్ఫూర్తిన్=శుభ్రస్ఫూర్తిచేత. కౌశికా...కంబు-కౌశికౌశ=ఇంద్రదిశయొక్క (తూర్పుయొక్కయనుట), అంతిమ=అంతమును, అయ = పొందిన, అబ్ధియొక్క, కలితమైన, వృద్ధికంబు = అభివృద్ధికలది; ఘనరాజమండలి = ఘనమైన చంద్రమండలము, తా=తాను, మేటియగువెన్నెలలయొక్క, మిన్న=నిగ్గు, ఇదికర్త, ఇంచెన్=ఒప్పెను; వానజవనాతిభయదము - వానజ = వనజసంబంధమైన, వనము అకు, అతిభయదము; అగుచు.

గీ. అపుడు ఘనవనపతన ఖిన్నాంగి యైన
వనిత దురవస్థ [1]నాత్యంతమును గణించి
సంతతదురంత చింతానిశాత శల్య
శకలితనిజాంతరంగుఁడై జనవిభుండు. 47

---

1 నాద్యంత.

టీక. హరి. ఘన...స్నాంగి-ఘనవన=మేఘోదకముయొక్క, పతన = పడుట చేత, ఖిన్నాంగి, ఐన, వనిత=చంద్రమతియొక్క.

నల. ఘన...స్నాంగి-ఘనవన=గొప్పయడవులయందలి, పతన = గమనముచేత, ఖిన్నాంగి, ఐన, వనిత=దమయంతియొక్క.

సీ. కచభృంగములు పరాగసమన్వితము లయ్యె
నేత్రమీనంబులు నీటఁ దేలెఁ
దళుకు లేఁజెక్కుటద్దము లూరుపులఁ గందె
నాననేందుఁడు నైల్య మావహించె
నధరబింబఫలంబు నవసి బీటలువాఱెఁ
గరనాళములు కంటకములు పూనెఁ
బాదాంబుజములు జంబాలసంగతిఁ గాంచె
గాత్రహేమశలాక కాఁకఁ [1]జెందె
గీ. నీలతాంగికిఁ గటకటా యిదటు వాసి
యనఘశుభజనకస్థాన మందినపుడు
గాని వెడఁబాయ దీ తనుగ్లాని యనుచుఁ
దలపఁ దుస్సహ మయ్యెఁ దద్దర్శనంబు. 48

టీక. హరి. కచభృంగములు, పరాగసమన్వితములు=ధూళితోఁగూడుకొనినవి, అయ్యెన్, అనుటచే, భృంగములు పరాగసమన్వితము లౌట సహజమే యని స్ఫురించుచున్నది. అంతట నిర్లే రోజించునది. అనఘశుభజనకస్థానము=అనఘమై శుభములకు జనకమైనస్థానమును.

నల. అనఘమై, శుభమైన, జనకస్థానము=(దమయంతియొక్క) తండ్రి యగు భీమునిగృహమును.

క. ఆవేళనరిగె నాకుల, జీవాతువు వేగఁ దద్రుచిరరుచిరేఖన్
బోవిడిచి యపరగిరికట, కావనికంగీకృతాంబరాంతుం డగుచున్.

టీక. హరి. నాకులజీవాతువు = దేవతలకు జీవాతువైనవాఁడు, చంద్రుఁడనుట. ("జీవాతుర్జీవనౌషధమ్" అ.) వేగన్=తెల్లవాఱఁగా, తత్...రేఖన్-తత్ = ఆ, రుచిరమైన, రుచిరేఖన్=కాంతిరేఖను,అపర...వనికిన్-అపరగిరి=అస్తపర్వతముయొక్క, కటకావనికిన్ = నితంబప్రదేశమునకు, అంగీకృ...తుండు-అంగీకృతమైన, అంబరాంతుండు=గగనాంతముగలవాఁడు ('అంబరం వ్యోమ్నివాససి' నానా.)

1 జిక్కు.

నల. అకులజీవాతువు = ఆవంశ జీవనౌషధమైననలుఁడు, తద్రుచిరరుచిరేఖన్ - తత్ =ఆ, రుచిరమైన, రుచిరేఖన్=రుచిరేఖగలదాని, (దమయంతి ననుట.) అపర... వనికిన్-అపర=ఇతరమైన, గిరియొక్క, కటకావనికిన్=నితంబప్రదేశమునకు, ("కటకోఽ స్త్రీనితంబోద్రేః" అ.) అంగీ...రాంతుండు-అంగీకృత=స్వీకరింపఁబడిన, అంబరాంతుండు = కొంకకొంగు గలవాఁడు, అగుచున్. (దమయంతిచీరలో సగము చించి తీసికొన్నవాఁడై యనుట.)

మ. అపు డభ్రాంతసమాపతత్కపిశతం బాపాసనిర్యక్షగం
బపయాతాఖిలఋక్షకోటి దళితోద్యత్పుండరీకంబు నై
విపులార్చిర్విభవంబు మించ దివిఁ బర్వెన్ గౌశికాశాసనై
కపరిభ్రాజితుఁ డై విభావసుఁ డతిక్రాంతాగమాంతాకృతిన్. 50

టీక. హరి. అభ్రాంత...శతంబు-అభ్రాంత=చలింపనిదై, సమాపతత్ = పడుచున్న, కపిశతంబు=మర్కట శతకముగలది, అపయాతాఖిలఋక్షకోటి-అపయాత = పాఱిపోవునట్టి, అఖిలమైన, ఋక్షకోటి=ఎలుఁగులుగలది, దళితోద్యత్పుండరీకంబున్-దళిత=సంహరింపఁబడిన,ఉద్యత్పుండరీకంబు=బెబ్బులులు గలదియు,నై,('వ్యాఘ్రేఽపి పుండరీకో నా' అ.) విపులార్చిర్విభవంబు = విపులజ్వాలాతిశయము, కౌశి...భ్రాజితుఁడు-కౌశిక=విశ్వామిత్రునియొక్క, ఆశాసన=అజ్ఞచేత, ఏక = కేవలము, పరిభ్రాజితుఁడు, ఐ,విభావసుఁడు=అగ్నిహోత్రుఁడు, ('సూర్యవహ్నీ విభావసూ'అ.) అతి...కృతిన్-అతిక్రమింపఁబడిన, అగమాంత=వృక్షాగ్రములుగల,ఆకృతిన్=ఆకారముచేత.

నల. అభ్రాం...తంబు-అభ్రాంత=ఆకాశాంతమందు, సమాపతత్=ప్రసరించుచున్న, కపిశతంబు = పిశంగవర్ణభావంబుగలది, అప...కోటి-అపయాత = పోఁగొట్టఁబడిన, అఖిలమైన, ఋక్షకోటి=నక్షత్రసమూహముగలది, దళితోద్యత్పుండరీకంబు-దళిత=వికసింపఁబడిన, పుండరీకంబు=పద్మములుగలది, విపులార్చిర్విభవంబు, ఘనతేజోవిభవము, మించన్=అతిశయింపఁగా, కౌశికా...భ్రాజితుఁడు-కౌశికాశా = ఇంద్రదిశయందలి, ఆసనస్థితిచేత,ఏకపరిభ్రాజితుఁడు,విభావసుఁడు=సూర్యుఁడు, అతి...కృతిన్-అతిక్రాంత=అతిక్రమించఁబడిన, అగమాంత=ఉదయపర్వతాగ్రముగల, ఆకృతిచేత.

చ. మనుజవరాధిరాజకులమానవతీమణి యప్పు డాస్థలం
బనలసమన్వితం బగుట యారసి హారసికాగ్రగణ్య హా
యనుపమపుణ్య నీకు విపినావని మద్భరణప్రయాసముల్
గనక యడంగి పోవలసెఁ గా విధి చేఁతకు నేమి సేయుదున్. 51

టీక. హరి. అనలసమన్వితంబగుట = అగ్నిసమేతమగుట, కనక = పొందక, అడంగి = నాశమై.

నల. అనలసమన్వితంబగుట = నలసమన్వితకాని, దగుట, కనక = పొందక, ఆడంగి=డాఁగి.

చ. అని జవరాలు వెండియుఁ బ్రియవ్యసనాకులబుద్ధిఁ బల్కు నే
యనువుననైన నీ కగు నపాయముఁ బాయుదు గాని కానలో
నను దిగనాడి పోవుటకు నాథ తలంకకుమీ మదీయజ
వన మతిఘోరతాపభరవహ్నికి నాహుతిఁగా నొసంగెదన్. 52

టీ. హరి. అతి...వహ్నికిన్-అతిఘోరమైన, తాపభర=తాపాతిశయముగల, వహ్నికిన్.

నల. అతి...వహ్నికిన్-అతిఘోరమైన, తాపభర=వియోగతాపభరమనెడు, వహ్నికిన్ = (ఎట్లయిన నిన్ను నీవు రక్షించుకొనఁగలవు గాన నన్ను దిగవిడుచుటకు సంకోచింపక చను మని పతి నుద్దేశించి పలికె నని భావము).

క. పదివేలజన్మములకున్, బదిలంబుగ నాకు నీవె పతివి సుమీ యో
హృదయేశ యనుచు నతనిన్, మదినునిచి తదాశ్రయాశమార్గోన్ముఖియై.

టీ. హరి. తదా...ఖి-తత్ = ఆ, ఆశ్రయాశ = అగ్నియొక్క మార్గమునకు, ఉన్ముఖి, ఐ.

నల. తదా...ఖి-తత్ = ఆనలుఁడు, ఆశ్రయము గాఁగల, ఆశ = కాంక్షచేత, మార్గ = వెదకుటను, ("మార్గో మా సేమృగమదేఽన్వేషణేపథి సౌమ్యభే" నానా.) ఉన్ముఖి, ఐ.

ఉ. 'ఆపగలార దివ్యలతలార వనస్పతులార లోకసం
తాపమడంచు నోషధివితానములార మృగంబులార నా
నాపతగంబులార నరనాథుని మార్గము సూపిప్రోవరే
యాపదఁ బాపికావరె' యటంచు సమాహితశోకపాకయై. 54

టీ. హరి. నరనాథుని=హరిశ్చంద్రుని, సమా...పాక-సమాహిత = పొందఁబడిన, శోక=దుఃఖముగల, పాక=విన్నవాఁడుగలది, ఐ, లోహితుఁడుగలదై యనుట.

నల. నరనాథునిమార్గమున్=నలునియొక్క మార్గమును, సమా...పాక-సమాహితమైన, శోకపాకముగలది, ఐ.

సీ. చనిచని బహువిషఘనసముత్థితధూమ
భీమమై రోజునాభీలగంధ
వాహసముచ్ఛ్రితదావ్యాళలోలజిహ్వాల
తాపటుజ్వాలనంబుఁ దఱియఁ బోయి
పరమతేజోధన్య వరదయనల ప్రోవు
మేఁ బతివ్రతనైతి నేని యనుచుఁ

బోరఁబోరఁ దన్ముఖంబునఁ జొరఁగం బొలు
వెలఁదిప ల్కాలించి విపినచారి
గీ. పవనసఖుఁడు రయమ్మున బాలికాద
శానివారణశాలి యై మానసమునఁ
బ్రేమఁ బూని తదీయశోభితచరిత్ర
నియతిచేఁ గేవలము భస్మ మయి యడంగె. 55

టీక. హరి. బహువిష...భీమము-బహుళమైన, విష=జలముగల, ఘన=మేఘము వలె, సముత్థితమైన, ధూమముచేత, భీమము, ఐ, రోజు...జ్వలనంబుళ్-రోజెడు, అఖిల గంధవాహ=భయంకరములైన వాయువులతో, సమున్మిళత్=కూడినవై, వ్యాలోలము లైన, జిహ్వాలతా=జ్వాలామాలికలచేత, పటు = సమర్థమైన, జ్వలనంబుళ్ = అగ్నిని, తతీయుణ్, బోయి, వరద, అనల, సంబుద్ధులు. తన్ముఖంబునళ్=ఆయగ్నిముఖమునందు, విపినచారిపవనసఖుఁడు, విపిన=అరణ్యమును, చారి=భక్షించుచుండెడు, ('చరభక్షణే' అని ధాతువు.) పవనసఖుఁడు=అగ్ని, తదీయశోభితచరిత్రనియతిచేళ్ - తదీయ = ఆ చంద్రమతీసంబంధమైన, శోభితచరిత్రనియతిచేత, భస్మమై, అడంగెళ్, (భస్మమాత్ర ముచిక్కఁ జల్లారెననుట).

నల. బహు...భీమము-బహువిష=అధికమైనవిషమువల్ల, ఘనమగునట్లు, సముత్థి తమైన, ధూమముచేత, భీమము, ఐ, రోజు నా...వాహసముళ్-రోజుచున్న, అఖిలమై, గంధ=గర్వముగల, వాహసముళ్=సర్పమును, ('అజగరే శయుర్వాహసఇత్యభి' అ.) మిళ...జ్వలనంబుళ్-మిళత్=కలియుచున్న ద్వైద్వి=రెండైన, ఆలోలజిహ్వాలతా=చల జ్జిహ్వాలతికయొక్క, పటుజ్వలనంబుళ్=పటుదీప్తిగలదానిని, ఇదివాహసమునకు విశేష ణము. పరమతేజోధన్య, వరదయ,నల, ఇవిసంబోధనములు. తన్ముఖంబునళ్=ఆసర్పముఖ మునందు,విపినచారి=కిరాతుఁడు, రయముళ్=వేగముచేత, పవనసఖుఁడు=వాయుసమా నుఁడు. (ఇది కిరాతునికి విశేషణము.) బాలికాదశానివారణశాలి-బాలికా=దమయంతి యొక్క, దశా=అవస్థయొక్క, నివారణముచేత, శాలియై, (దమయంతియవస్థను నివారిం చినవాఁడైయనుట) ప్రేమఁబూని, (ఆయమను మోహించి యనుట.) తదీయ = ఆదమ యంతీసంబంధమైన, శోభితచరిత్రనియతిచే, పాతివ్రత్యనియతిచేతననుట. కేవలము, భస్మము,ఐ, అడంగెను. ఇట 'వాహ...వ్యాలోల' యనుచోఁ బ్రాదియతి. లక్షణము—

"గీ. ధాత్రిఁ బ్రాదియోగమాత్రంబుగల్గిన, నుభయమును రచింపనొనరు యతికి
పాతిరి క్తభ క్తికృత్రసేవితకమ,లాలయాధివాసలక్ష్యమిదియొ?" (కవిచింతామణి.)
ప్రయోగము:—

"క. వేమరుమనగుర్వశ్వ, త్థామలకిఘోరవీరతరుబాణకదం
బామితవర్ష మా......................(?)" (రాఘవపాండవీయము.)

చ. అనుపమదివ్యదుందుభిరవార్భటి గర్జ వియచ్చరాంగనా
ఘనతరలాస్యకౌశలము కాఱుమెఱుంగులయాట చారణా
భినుతిశిఖావళస్వనము పెంపును గాఁ గురిసెన్ లతాంగిపై
ననిమిషరాట్ప్రకల్పితము లైన మహాఘనపుష్పవర్షముల్. 56

టీక. (రెండిటను సమానము.) ఘనపుష్పవర్షముల్ = ఘనమైనపుష్పవర్షము లనెడు, ఘనపుష్ప=ఉదకముయొక్క, వర్షములు. ఇది శ్లిష్టరూపకము.

గీ. ఇట్లు సాధ్వీలలామ ప్రాణేశ్వరప్ర
పత్తివారితసకలవిపత్తి యగుచుఁ
[1]దరలి శుచిముఖవినుతుల వరదముల నె
దుర్కొనియెఁ బుణ్యవర్తనోద్భాతమహిమ. 57

టీక. హరి. శుచిముఖవినుతుల-శుచి=అగ్నియొక్క, ముఖ=అగ్రమందు, వినుతుల(న్) = వినుతిగలవారిని, (అగ్నిహోత్రుని స్తోత్రము చేయుచున్నవారి ననుట.) వరదములన్=పెనిమిటిని, ఋషిని, (అనఁగా నక్షత్రకు ననుట.)

నల. శుచిముఖవినుతులన్-శుచిముఖ (శుచి రగ్నిర్ముఖం యేషాం తే శుచిముఖాః దేవాః=అగ్నిహోత్రుఁడు ముఖముగాఁగలవారు దేవతలు)=దేవతలచేత, వినుతులన్= నుతిచేయఁబడినవారిని, వరదములన్=శ్రేష్ఠులైన మునులను.

చ. అతులదీప్తి నప్పుడు తదగ్రమునం దగుమానిరాజిత
ద్రుతకనకప్రభం గని గురుప్రియవాగుపదేశకౌశలా
న్వితహృదయాబ్జవీథి యయి నెయ్యము దోఁపఁగ నిట్లు పల్కెనే
కతమున నిట్టి బెట్టిదపుఁగానఁ జరించెద వేలసన్మతీ. 58

టీక. హరి. మాని = నక్షత్రకుఁడు, రాజిత...ప్రభన్-రాజితమై, ద్రుత= కరఁగిన, కనకముయొక్క ప్రభవంటి ప్రభగలదానిని, చంద్రమతిననుట (మాని రాజ=నక్షత్రకుఁడు, ఇత...ప్రభన్-ఇత=పొందఁబడిన, ద్రుతకనకముయొక్క,) గురు...వీథి-గురు=విశ్వామిత్రునకు, ప్రియమైన, వాక్=భేదవాక్కులయొక్క, ఉప దేశకౌశలముతో, అన్వితమైన, హృదయాబ్జవీథిగలవాఁడు,అయి, (చంద్రమతి నెడఁ బాప విశ్వామిత్రుఁ డుపదేశించిన మాటలు స్మరించుకొని యనుట.) ఏకతమునన్= ఏకాంతమందు (పల్కెనని యన్వయము.) ఏల=ఎందులకు, సన్మతీ! (చంద్రమతీ సంబోధనము)

నల. తదగ్రమునన్=ఆదమయంతిముందట, మానిరాజి, తద్ద్రుతకనకప్రభన్- తత్=ఆ, ద్రుత=కరఁగిన, కనకముయొక్క, ప్రభన్ = కాంతివంటికాంతిగల దమ యంతిని, గురు....వీథి-గురు=అధికమైన, ప్రియవాక్కులయొక్క, ఉపదేశమునందలి,

1 వఱలి.

కౌశలముతో, అన్వితమైన, హృదయాబ్జవీథిగలది, అయి, ఏ కతమునన్ = ఏ హేతువు చేత, అసన్మతీ! (దమయంతీ సంబోధనము.)

క. చింతింపవచ్చునే నీ
కాంతునినిర్దయత నిన్నుఁ గని కనికర మా
వంతయును లేక దావా
భ్యంతరమున విడిచె నకట! యతిసాహసి యై. 59

టీక. హారి. దావాభ్యంతరమునన్ = కార్చిచ్చులో ('దావోదవఇతిఖ్యాతౌ దావాగ్నివనయో రపి' విశ్వ).

నల. దావాభ్యంతరమునన్ = అడవిలో ('దవదావౌవనారణ్యవహ్నీ' అమ.)

సీ. అయినఁ [1]గాని మ్మలయకు గోల వైదేశి
కజనభావంబునఁ గలుగుకార్య
మరసితి మతిధన్య వై నీవ పత్యాప్తి
నడరి యెప్పటియట్ల యవని నెల్ల
నేలుదు గాన యీయడ రేది చను మంచుఁ
దడయక భేదతత్పరతఁ బలుక
విని చాలు పదివేలు విభుని వీక్షింపఁ గ
ల్గుటయె సామ్రాజ్యంబుఁ గొనుట మాకు
గీ. గానఁ దన్మార్గము ఘంటిపఁగా నను గ్ర
హించు గావింపుఁ డన హృదయాంబుజమున
వెలఁది మెచ్చి యంతర్హితవృత్తిఁ గడకు
నరిగె నమ్మునిసంతతి యాక్షణమున. 60

టీక. హారి. గోలవు, ఐ, దేశికజనభావంబునన్-దేశికజన=విశ్వామిత్రనియోక్త, భావంబున=హృదయమునందు, అరసితి(న్)=తెలిసినాఁడను, మతిధన్యవు, ఐ, నీవు, అపత్యాప్తిన్=కుమారప్రాప్తిచేత, ('అపత్యంతోకంతయోస్స్యమే' అ.) అడరి, భేద తత్పరతన్=భేదోపాయతాత్పర్యముచేత, అంత...వృత్తిన్-అంతః = లోపలి, హిత వృత్తిచేత, అమ్మునిసంతతి = ఆనతుత్రకుఁడు.

నల. గోల, సంబుద్ధి. వైదేశికజనభావంబునన్=పారదేశికజనునిరీతిని, (అరయుకు మని పూర్వమున కన్వయము. ఇట 'రలలక భేదము.) కలుగుకార్యము=కాఁగలకార్య మును,అరసితిమి=(దివ్యజ్ఞానమున)నెఱింగితిమనుట, నీవ=నీవే,పత్యాప్తిన్=భర్తృప్రాప్తి

1 గానిమ్ము నీవడలకు గోలవై, దేశికజనభావదీర్ఘదృష్టి.

చేత, ఈరొదరు=ఈవ్యథను, ఏది=పాపి, ఏలుదుఁగాని యని పూర్వమున కన్వయము. అక్షేదతత్పరతచేత, అంతర్హితవృత్తిన్=అంతర్ధానవ్యాపారముచేత, కడకు, నరిగెన్, (దమయంతికి హితోపదేశము చేసి ముని అంతర్ధానము నొందె ననుట.)

క. ఆనరపతి దేవేరియుఁ, దాను న్నగసరణిఁ జనుచుఁ దగ నొక్కెడ గ్రం
దై నడచునధ్వనీనజ,నానీకముఁ గాంచి యొచటి కరిగెద రనినన్. 61

టీక. హరి. ఆనరపతి=ఆహరిశ్చంద్రుఁడు, దేవేరియున్, తానున్,

నల. ఆనరపతిదేవేరియు=ఆనలునిభార్యయగుదమయంతి, అధ్వనీనజనానీకమున్- అధ్వనీనజన=తెరువరులయొక్క,- ('అధ్వనీనోధ్వగోఽధ్వన్యః పాంథః పథిక ఇత్యపి' అ).

శా. వారీచెంతట రాజశేఖరుఁడు విశ్వక్ష్మాభృతిస్ఫారకే
యూరభ్రాజిసుబాహుఁ డున్న నెల వన్యూనస్థిరామోదధా
మారామద్రుమమంజరీమధురఝరీప్రోద్ధూర్మికాశీతలం
బౌరమ్యస్థలరాజ మొందెదము నిర్వ్యాజప్రయాణంబునన్. 62

టీక. హరి. వారు, రాజశేఖరుఁడు = చంద్రావతంసుఁడగుశివుఁడు, విశ్వ... బాహుఁడు-విశ్వక్ష్మాభృత్తులచేత, స్ఫారమైన, కేయూరములచేత (శేషాంగదములచేత ననుట.) భ్రాజి=ప్రకాశించుచుండెడు, సుబాహువులుగలవాఁడు, ఉన్న నెలవు, అనన్యూ...ధోర్మి-మధుఝరీప్రోద్ధూర్ములుగలది, కాశీతలంబు=కాశీస్థలము.

నల. వారు=ఆతెరువరులు,కర్త.ముందటిపద్యములోని యనుటయు నను క్రియతో నన్వయించుచున్నది. రాజశేఖరుఁడు=రాజశ్రేష్ఠుఁడు, విశ్వ...భ్రాజి = విశ్వక్ష్మా భృతియు నెడు, స్ఫారకేయూరములచేత, భ్రాజి=ప్రకాశించువాఁడు, సుబాహుఁడను రాజు, ఉన్న నెలవు, అన్యూన...శీతలంబు-ఊర్మికా = తరంగములచేత, శీతలంబు = చల్లనైనది, ఆ, రమ్యస్థలరాజము-ఆ.రమ్యమైన స్థలరాజమను సుబాహునిపట్టణము.

చ. అనుటయు నప్పురోత్తమము నందినఁ గల్గు మదీయవాంఛితం
బనువుపడంగ నొక్కగతి యంచుఁ దదధ్వగపాళి వెంటనె
మ్మన మలరార నమ్మననమాత్రనిరస్తమహోఘనారితోఁ
జని కనియెన్ వినిర్మలరసాధరసారము వారిపూరమున్. 63

టీక. హరి. తదధ్వగపాళివెంట(న్)-తత్=ఆ, అధ్వగపాళివెంటన్=తెరువరి మూఁక వెంబడిని, మనన...నారి - మననమాత్ర=స్మరణమాత్రముచే, నిరస్త=నిర సింపఁబడిన, మహోఘులైన,అరి=శత్రువులుగలవాఁడు (హరిశ్చంద్రుఁడనుట.)తోన్= తోడనే, చని, వినిర్మల...సారము(న్)-వినిర్మల=స్వచ్ఛమైన, రసాధర=పర్వతము వలన, (హిమవంతమువలన ననుట.) సారమున్=ప్రవణముకలదానిని, వారిపూరమున్= గంగావారిపూరము ననుట.

నల. తద...వెంటన్-తదధ్వగ=ఆతెరువరులను, పాలి=పాలించువానియొక్క,

వెంటన్=వెంబడిని, మనన...మహాఘ-మననమాత్రముచేత, నిరస్తమైన,మహాఘ=మహాపాపములుగలది, నారి = దమయంతి, తోఁజని = తోడ నేపోయి, వినిర్మల...సారము(న్)-వినిర్మలమైన, రసాధరమునుండి, స్రవణముగలదాని, వారిపూరమున్=సెలయేటియుదకము ననుట.

సీ. అలఘుగిరీశ శీర్షాటనవ్యక్తనై
    ర్మల్యధార హంసమణులు దేల
గాలవశాండిల్యకౌశికాదిపరార్ధ్య
    తరు లక్షవటయుక్తి దరుల నెసఁగఁ
బ్రబలపాతకబంధభవభంగగతి నుర్వి
    హరినివాసతలంబు ననుగమింప
దీప్తాహిమకరజాతివిభిన్నసలిలౌఘు
    మజహదభోహిపగూహనముఁ దెలుప
గీ. నొనరునన్నదిఁ గ్రుంకి యచ్చోదకంబు
లానియమితనయపతివ్రతానుగతుఁడు
సుగుణమణిసార్థవాహుండు శుచిసమాఖ్యుఁ
డచట నొకరమ్యతలమున నధివసించె. 64

టీక. హరి. అలఘు...ధారలన్-అలఘువైన, గిరీశ=ఈశ్వరునియొక్క, శీర్ష=శిరస్సునందు, అటన=సంచరించుటచేత,వ్యక్త=ముఖ్యమైన,నైర్మల్యముగల, ధారలన్=ధారలయందు, హంసమణులు=పరమహంసలు, తేలన్=స్నానముచేయఁగా, గావ...తరులు-గాలవుఁడు, శాండిల్యుఁడు,కౌశికుఁడు మొదలుగాఁగల, పరార్ధ్యతరులు=శ్రేష్ఠులు,('పరార్ధ్యాగ్ర్యప్రాగ్రహరప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయమగ్రియమ్'అ)అక్షవటయుక్తిన్-అక్షవట=రుద్రాక్షమాలికలయొక్క, 'వట'శబ్దముమాలికాపరమగుటకుఁబ్రయోగము.-

"పుస్తకజపవటహస్తే! వరదాభయచిహ్నచారుబాహులతే!
కర్పూరామలదేహే! వాగీశ్వరి! శోధయాశుమమచేతః,"

యుక్తిన్=యోగముచేత, ప్రబల...గతిన్-ప్రబలమైన, పాతకబంధ=పాపబంధము గల, భవ=పుట్టువులయొక్క,భంగగతిన్=నాశగతిచేత, ఉర్వి,హరినివాసతలంబున్=విష్ణువాసస్థలమును, అనుగమింపన్, దీప్తా...లౌఘము-దీప్తమైన, అహిమకరజా=యమునానదితోడ, అతివిభిన్న = కూడిన, సలిలౌఘము, యమి...గతుఁడు-యమి=నక్షత్రకునిచేత, తనయ = కుమారుఁడైన లోహితునిచేత, పతివ్రతా=చంద్రమతిచేతను, అనుగతుఁడు, సుగుణ...వాహుండు-సుగుణమణులయొక్క, సార్థ=సమూహమును, వాహుండు=వహించినవాఁడు, శుచిసమాఖ్యుఁడు-శుచి=శుభ్రమైన, సమాఖ్యుఁడు=కీర్తిగలవాఁడు, ('శుక్లశుభ్రశుచిశ్వేతాః' 'యశఃకీర్తిస్సమాఖ్యాచ' అ.) హరిశ్చంద్రుఁ డనుట.

నల. అలఘు...ధారలన్-అలఘువైన, గిరీశశీర్ష=పర్వతాగ్రమందు, అటన=చరించుటచేత; (ప్రవహించుటచేతననుట.) వ్యక్తమైన, నైర్మల్య=స్వచ్ఛతగల, ధారలయందు, గాలవ...తరులు-గాలవ=లొద్దుగుచెట్లు, శాండిల్య=మారేడుచెట్లు, శాక=గుగ్గిలపుఁజెట్లు, ఆది=మొదలుగాఁగల, పరార్థ్య=శ్రేష్ఠములైన; తరులు=వృక్షములు, అక్షవటయుక్తిన్-అక్ష=తాడిచెట్లయొక్క; వట=మఱ్ఱిచెట్లయొక్కయు, యుక్తిన్=యోగముచేత, (లేక, తరులక్ష యనఁగా అక్షసంఖ్యాకమైన తరువు లనియుఁ జెప్పనగును.) దరులన్=తీరములయందు, ప్రబల...గతిన్-ప్రబలమైన, పాత=దుముకుటగల, కబంధ=ఉదకమువలన, భవ=పుట్టిన, భంగ=పగులుటయొక్క, గతిచేత, ఉర్వి, హరినివాసతలంబున్=నాగలోకమును ('శుక్రాహికపిభేకేషు హరిర్నాకపిశేత్రిషు' అ.) దీప్తా...సవిశాఘమున్-దీప్తములైన, అహి=సర్పములయొక్క, మకర=మొసళ్లయొక్క, జాతులచేత, విభిన్న=భేదింపఁబడిన, సలిలౌఘము=ఉదకసమూహము, అజహా...హవమున్-అజహాత్=విడువని, అభ్రి=ఆకాశముయొక్క, ఉపగూహనమున్=ఆలింగనము, అమిత...గతుఁడు-అమితమైన, నయ=నీతిగల, పతివ్రతా=దమయంతిచేత, అనుగతుఁడు=అనుసరింపఁబడినవాఁడు, సార్థ...డు-సార్థ=పథికసంఘమును, వాహుఁడు=వహించినవాఁడు, శుచిసమాఖ్యుఁడు=శుచియను పేరుగలవాఁడు, అచట=ఆసెలయేటితీరమున, ఒకరమ్యస్థలమున; అధివసించెను.

ఆశ్వాసాంతము.

శా. ప్రక్షుణ్ణక్షణదాచరప్రవరశుంభద్రోప! భద్రోపలం
భక్షేమంకరదృక్సుధాశమితధీమత్తాప! మత్తాపగా
ధ్యక్షక్షోభకళాధురంధరశరాసారోప! సారోపకా
రాక్షారాతినితాంతలాలనవినీతాలాప! తాలాపహా! 65

టీక. ప్రక్షుణ్ణ...ద్రోప-ప్రక్షుణ్ణ=చూర్ణముచేయఁబడిన, క్షణదాచరప్రవర=నిశాచరేంద్రులుగలదై, శుంభత్=ఒప్పుచున్న, రోప=బాణముగలవాఁడా! భద్రోప...మత్తాప-భద్ర=శుభములయొక్క, ఉపలంభ=సంప్రాప్తిగలదై, క్షేమంకరమైన, దృక్=చూపులనెడు, సుధచేత, శమితమైన, ధీమత్=బుద్ధిమంతులయొక్క, తాప=పరితాపముగలవాఁడా! మత్తాపగా...సారోప-మత్త=మదించిన, అపగాధ్యక్ష=సముద్రునియొక్క, క్షోభ=కలఁచుటయందలి, కళా=కౌశలముచేత, ధురంధరమైన, శరాసన=వింటియొక్క, ఆరోప=ఎక్కుపెట్టుటగలవాఁడా! సారోప...లాప-సారమైన, ఉపకారముగల, అక్షారాతి=హనుమంతునియొక్క, నితాంత=లాలనమందు, వినీత=వినయయుక్తములైన, ఆలాప=వాక్కులుగలవాఁడా! తాలాపహ-తాల=సప్తతాలములను, అపహ=హరించినవాఁడా!

క. ప్రధనపరిభూతపార
శ్వధిక! ధరారథిక కథికవర్ణిత! భువన

ప్రథితనయాకర ! జలధి
ప్రథితనయాకరవిమర్దపణదోర్విభవా ! 66

టీక. ప్రధన...శ్వధిక-ప్రధన=యుద్ధమునందు, పరిభూత=పరిభవింపఁబడిన, పారశ్వధిక=పరశురాముఁడుగలవాఁడా ! ధరా...వర్ణిత-ధరారథిక = శివుఁడనెడు, రథికునిచేత, వర్ణితుఁడైనవాఁడా ! భువన...కర-భువనప్రథిత = లోకప్రసిద్ధమైన, నయ=నీతికి, ఆకరమైనవాఁడా ! జల...ర్విభవా-జలధి = సముద్రము, ప్రథి=నేమిగాఁగలభూమియొక్క, ('జలధిః ప్రథి ర్నేమి ర్యస్యాస్సా=జలధిప్రధిర్భూమిః' 'నేమిః(స్త్రీ)స్యాత్ప్రధిః పుమాన్' అ.) తనయా = కుమారియొక్క, (సీతయొక్కయనుట.)కరవిమర్ద=పాణిగ్రహణమునకు,పణ=ఓంకువయైన, దోర్విభవముగలవాఁడా!

పృథ్వీ. స్మరాసనశరాసనక్షపణసారదోర్బంధురా !
ఖరాదిమనరాదిమస్తవనికామహాసింధురా !
పురాహితపురాహితప్రదరభూషితాశాంబరా !
పరాజితపరాజితప్రబలభార్గవాడంబరా ! 67

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధ కవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతంబైన హారిశ్చంద్రనలోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

టీక. స్మరా...బంధురా-స్మరాసన = శివునియొక్క, శరాసన=వింటియొక్క, క్షపణ=విఱుచుటయందు, సార=బలముగల, దోః=(దీర్ఘ)బాహువులచేత, బంధురా=మనోహరుఁడవైనవాఁడా! ఖరా...సింధురా-ఖరా=ఖరాసురుఁడు, ఆదిమ=మొదలుగాఁగల, నరాది=రాక్షసులయొక్క, మస్త=శిరస్సులనెడు, వనికా=వనములకు,మహాసింధురా=మహాగజేభమైనవాఁడా! పురాహిత...శాంబరా-పురా=మునుపుగా, అహితపుర=శత్రుదేహములయందు, ఆహిత=ప్రయుక్తములైన, ప్రదర = బాణములచేత, భూషితమైన, ఆశా=దిక్కులు, అంబరా=ఆకాశమును గలవాఁడా ! పరాజిత...డంబరా-పరాజిత=నిరసింపఁబడిన, పరులచేత, అజితమైన, ప్రబలమైన, భార్గవాడంబరము గలవాఁడా!

వ్యాఖ్యాతృ గద్యము. ఇది శ్రీహనూమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్రచిత్రకవి పెద్దిరాజతనూజ పురాతనసాధునాతనసకలప్రబంధార్థబోధన సమర్థమానసాంభోజబుధజనవిధేయానంతయనామధేయవిరచితంబైన హారిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక యను వ్యాఖ్యానంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

## చతుర్థాశ్వాసము



రామచంద్ర! రావణ
వారణ[1]దారుణమృగేంద్ర! వందీకృతవా
ణీరమణశివమహేంద్ర! ధ
రారంజనసుగుణసాంద్ర! రణనిస్తంద్రా!

టీక. సులభము.

వ. అవధరింపుము మృకండునందనుండు పాండునందనున కిట్లనియె. 2

టీక. సుగమము.

మ. జనియించెన్ బహుపద్మినీరుచులతోఁ సంఘించె సాహస్రకాం
చనగౌరద్యుతులన్ వహించె వివిధాశావ్యాప్తి నత్యంతరా
గనిరూఢిన్ దుది[2]మ్మట్టి వెన్క నపరాగప్రక్రమం [3]బూన మే
లనఁ జూపట్టెఁ గషాయితాంబరయుతుండై భాస్కరుం డయ్యెడన్.

టీక. రెంటనుసమము.

బహుపద్మినీరుచులతోన్-బహు=అధికములైన, పద్మినీ=పద్మలతలయందలి, రుచులతోన్=వికాసములతోడ, సాహస్ర...ద్యుతులన్-సాహస్ర=సహస్రసంఖ్యాకమైన, కాంచనమువలె, గౌర=ఎఱ్ఱనైన, ద్యుతులన్, వివిధాశావ్యాప్తిన్ - వివిధములైన, ఆశా=దిక్కులయందు, వ్యాప్తిన్=వ్యాపించుటను, అత్యంతరాగనిరూఢిన్-అత్యంతమైన, రాగ=రక్తిమయొక్క, నిరూఢిచేత, అపరాగప్రక్రమంబు-అపరాగ=పశ్చిమగిరియందు, ప్రక్రమంబు=నిలుచుటను, కషా...యుతుండు-కషాయిత=ఎఱ్ఱగాఁజేయఁబడిన, అంబర=ఆకాశముతోడ, యుతుండు, ఐ, భాస్కరుండు=సూర్యుఁడు. ఇంతలి యప్రకృతార్థము. (ధ్వన్యర్థము.) భాస్కరుండు=భాస్కరుఁ డను నొకా

1 ధారణ. 2 మట్టె. 3 బూని.

నొకపురుషుఁడు, బహు...లతో=అనేకములైన, పద్మినీజాతిస్త్రీలయందలి, రుచులతో=ఆసక్తులతో, సాహస్ర...ద్యుతులన్-సాహస్ర = సహస్రసంఖ్యాకలైన, కాంచనగౌరద్యుతులన్=స్త్రీలను, వివి...వ్యాప్తిన్-వివిధములైన, ఆశా=కోరికల యొక్క, వ్యాప్తిని, అత్యంత...నిమాఢిన్-అత్యంతమైన, రాగ = అనురాగము యొక్క, నిరూఢిన్, అప...మంబు-అప=అపగతమైన, రాగ=అనురాగముయొక్క, ప్రక్రమంబు=విరక్తిక్రమంబనుట. కషాయితాంబరయుతుండు = కావికోకలతోడ, యుతుండు=కూడుకొనినవాఁడు, ఐ (సన్యసించినవాఁడై యనుట).

చ. పులుఁగులుసాలుగట్టుకొనిపోఁదొడఁగెన్ ముడిఁగెన్ బయోజముల్
దొలినుడిమానికంపుగని దోరగిలె న్నొగిలెన్ రథాంగముల్.
జిలిబిలిమైల నల్దెసలఁ జేకొనియెన్ జనియెన్ మరీచికల్
గలువలవింతనవ్వుమొలకల్ దొరసెన్ విరిసెన్ బ్రకాశముల్. 4

టీక. సుగమము. రెండర్థములను సమము.

చ. తనపయి రాజు రా వెనఁ బతంగుఁడు గాలవశా ద్రి నేఁగుచో
మునుకొని కప్పుమూఁక వెనుముట్ట మహానిధిపత్ని గావునన్
జన కెడ లేచి తా మఱలి చాయ మహోన్నతిఁ జూపఁ జూచి ది
గ్గనఁ దుద గట్టు లెక్కనఁ దదంశుబలం బడఁగెన్ విలక్షతన్. 5

టీక. రెంటను సమానము.

రాజు=చంద్రుఁడనెడురాజు, కప్పుమూఁక = చీఁకటిగుమి యను నల్లప్రజలు, మహానిధిపత్ని-మహానిధి=సూర్యుఁడనెడు ప్రతాపనిధియొక్క, పత్ని = వీరపత్ని యనుట. కావున, మహోన్నతిన్=ధైర్యమనునాధిక్యమును, తదంశుబలంబు-తత్ = ఆసూర్యునియొక్క, అంశు=కిరణములనెడు, బలంబు=సేన, విలక్షతన్=అతివిస్మయయుక్తమైన లజ్జచేత, ('విలక్షోవిస్మయాన్వితే' అ.) విలక్షబ్దమునకతిలజ్జావంతుఁడని చెప్పుటకు మురారి వ్యాఖ్యానమున— ("ఆత్మనశ్చరితేసమ్యక్ జ్ఞాతేఽన్యైర్యస్యజాయతే,అపత్రపాఽతి మహతీసవిలక్ష ఇతి స్మృతః."నిఘంటుసారము.)అనియున్నది.

సీ. పరగోత్రవిభ్రమాస్పదమిత్రవిశ్లేషి
వారుణీశోణాక్షివలన మనఁగ
శమితద్విజోన్మేషసమయభిల్లనిపాతి
తపతంగకీలాలధార యనఁగ
శరధిసంవేశసాదరకమలాప్తలో
కావనన్యస్తచక్రార్చి యనఁగ
నూష్మాంతతరళతాయుతహంసమండలో
చ్చాటన చంచలాకోటి యనఁగ

గీ. నంబునిధి తోయదృశ్యాత్మబింబజనిత
పరతురగభావనాలోలభానురథ్య
ఖురవిధూతాస్త్రగైరికక్షోద మనఁగ
సంజకెంజాయ తారకాసరణిఁ బొదివె. 6

టీక. రెంటను సమాసము.

పర...వలనము-పరగోత్ర=అస్తాద్రియందలి, విభ్రమమనెడు; పర=అన్యస్త్రీ యొక్క, గోత్రవిభ్రమ=నామస్ఖలనమునకు, ('గోత్రంతునామ్నిచ'అ.) ఆస్పదమైన, మిత్ర=సూర్యుఁడనెడు ప్రాణసఖుని, విక్షేపి=ఆక్షేపించుచున్న, వారుణీ = పశ్చిమదిశ యొక్క.

శమిత...ధార - శమిత = శమింపఁజేయఁబడిన, ద్విజోన్మేష = పక్షివిజృంభణ మనెడుబ్రాహ్మణోన్మేషముగల, సమయ=సాయంసమయమనెడు, భిల్ల=కిరాతునిచేత,నిపాతిత=పడఁగొట్టఁబడిన, పతంగ=సూర్యుఁడనెడు పక్షియొక్క, కీలాలధార=రక్తధార.

శరధి...చక్రార్చి-శరధిసంవేశమందు, సాదరుఁడైన, కమలాప్త=సూర్యుఁడనెడు విష్ణువుచేత, లోకావన = లోకసంరక్షణముకొఱకు, న్యస్త = ఉంపఁబడిన, చక్రము యొక్క, అర్చి=జ్వాల.

ఊష్మాంత...కోటి-ఊష్మాంత = వర్షాకాలమునందు, తరళతా = చాంచల్యము తోడ, యుత=కూడిన, హంసమండల=సూర్యమండలమనెడు హంససంఘముయొక్క, ఉచ్చాటనముగల, చంచలా = మెఱుపులయొక్క, కడమనులభము. (ఇందుఁ బరస్త్రీ యొక్క గోత్ర మనుచోఁ బరాశబ్దమునకుఁ బుంవద్భావమువచ్చి అకారాంతమైనది. ఇందుకు— 'సర్వనామ్నోవృత్తి మాత్రే పుంవద్భావః' అని వ్యా. వృత్తి).

సీ. పతి చన్నదిక్కు తప్పక చూచి యఱచుఁ గాం
తుని మాటి తే లని దూఱుకరణి
మగఁ డున్నతోంటితామరఁ జేరు సదృశరే
ఖాశ్లేషమున నడలార్చుకరణిఁ
గాంతము క్తబిసముఁ గమియ [1] గామది మెచ్చు
నాస్యముద్రామృతం బందు కరణి
సైకతాంకితనాథచరణ మక్కునఁ జేర్చు
ననఘరతౌయంత్ర మునుచుకరణి

గీ. నబ్జబాంధవుఁ డరుగుచో నాప్తబుద్ధి
నాత్మవసుజాల మునిచిన నంతరంగ

1. గామిడు మెచ్చు.

సరణి నిది దాల్చెనో యనఁ బరితపించుఁ
గవవదలి సంజ నొక్కఁ జక్కవ వెలంది. 7

టీక. సుగమము. రెంటికిని సమానము.

చ. అరయ రజోరుణావరణ యయ్యుఁ బ్రియుం బగలెల్లఁగూడి త
త్కరజసమృద్ధిమీఱ నది దా నతిరాగిణియంచుఁ గల్వ లో
నరయఁగ యోజితాధరదళాంచలయై ముఖముద్రఁ గాంచి తా
మరకొమరాలు మాఱె వళిమండలిపేరిటి కప్పు లన్నియున్. 8

టీక. రజోరుణావరణ-రజః=పుప్పొడిచేత, అరుణ=ఎఱ్ఱనైన, ఆవరణ = ఆవరణ ప్రదేశముగలది, అయ్యు, (చెఱఁగుమాసినదై యుండినదనుట) తత్కరజసమృద్ధి-తత్ =ఆప్రియునియొక్క, కరములవలన, జ=పుట్టిన, సమృద్ధి, అతిరాగిణి = అత్యంత రక్తిమగలది (అత్యంతానురాగముగల దనుట.) యోజి...చల-యోజిత=కూర్పఁబడిన, అధర=అధోభాగమునందలి, దళాంచలములనెడు, యోజితమైన, అధరదళాంచల=ఓష్ఠ దళాంచలముగలది,ఐ, ముఖముద్రన్ = అగ్రముకుళనమనెడు నోరుమూసికొనుటను, తామరకొమరాలు=తామరయనుజవ్వని, అళి...కప్పులు-అళిమండలిపేరిటి = అళిసంఘ వ్యాజముగల, కప్పులు=దంతక్షతములు, ఇందు దంతక్షతములు నలుపుగఁజెప్పినందుకుఁ బ్రయోగము.—

శ్లో. "కిమియం కాళిమా బాలే! పక్వబింబాధరే తవ,
పీత్వాధరామృతం శేషే, వల్లభో ముద్రికాం దదౌ," మఱియు:—

చ. పవడముమీఁదఁ గస్తురి యిభస్ఫుటకుంభముమీఁద నంకుశ
ప్రవిహతరేఖ లొప్పెసఁగ భావజనూత్నశరక్షతంబు లీ
యువతికి భూషణస్ఫురణ నొప్పుచు నున్నది చూడరమ్మ మా
ధ్రువపురనాథుమన్ననఁ బ్రరూఢత నొందినచిన్నె లన్నియున్. (రసాభరణము.)

మ. దివికిం ధాత్రికిఁ గాలకారకుఁడు జ్యోతిర్ధిపరూపానురూ
పవిభూషానికురుంబకంబు రచియింపం బూని యంభోజబాం
ధవజాంబూనదసారముం జరమసంధ్యావహ్నిచేఁ గాఁచి య
ర్ణవతోయంబున నద్దె నిగ్గు పొగ తోరంబై పయిం బర్వఁగన్. 9

టీక. రెంటను సమము. సుగమము.

సీ. అంబరాంబుధిశాయి యరుణచక్రము వైవ
నుదధి వెల్వడు దైత్యయూథ మనఁగ
సకలతత్త్వార్థదర్శకుఁ డంగగతి వాప
విశ్వంబు నలమునవిద్య యనఁగ

సమయసిద్ధుఁ డశేషజగదీక్షణముఁ గప్పఁ
బోడము రోదసి ముంచుకడలి యనఁగ
దినసింధుమథనసందీప్తమై యంధక
హారునిఁ గానమిఁ బొంగుగరళ మనఁగ
గీ. చండికాప్రాణనాథుఁ డఖండసాంధ్య
తాండవోద్దండదండపాదమునఁ దాఁచ
జగతిపై నంట వ్రాలిన గగన మనఁగ
దళముకొనియె దురంతసంతమసరాశి. 10

టీక. సకలతత్త్వార్థదర్శకుఁడు=సూర్యుఁడనెడుజ్ఞానోపదేశకుఁడు, అంగగతిన్= అవయవరూపకిరణములయొక్క, ప్రసరణమనెడుశరీరగతిని, పాపన్ = ఎడఁబాఁగా, అశేషజగదీక్షణము = సూర్యుఁ డనెడు సమస్తజగజ్జనులయొక్కదృష్టిని, కప్పన్, కనుకట్టుఁగట్టఁగా ననుట. అంధకహారుని = తమోహరుఁ డనెడు శివుని ('అసురేశత్రిషుధ్వాంతే' నానా.)

సీ. వల్లవీరతిఁ దేలి వనమాలి యిచ్చిన
గగనధాత్రీసమాక్రమణశక్తి
మునివధూరతిఁ జొక్కి ముక్కంటి గూర్చిన
యఖిలలోకోపసంహారణపటిమ
గౌతమీరతిఁ బొంగి కౌశికుఁ డిడిన ది
క్పాలితదీశ గోపనవిభూతి
గురుసతీరతి నుబ్బి కుముదబాంధవుఁ డొసం
గిన మహాచిహ్న లక్ష్మీసమృద్ధి
గీ. యాత్తబిరుదాంకనములుగా నమరునట్టి
దివ్యపరమోపకారిఁ గీర్తింపనేర్చు
వారె మాదృశజను లంచు జారతతులు
పొగడఁ జీఁకటి జగమెల్లఁ బొదివికొనియె. 11

టీక. సుగమము.

చ. అపరపయోధిఁ బ్రొద్దుగడియారము గ్రుంక ద్విజాళి మ్రోయ న
చ్చపు టెలసంజతోఁపు తెర చా టెడలం దనరెం దమోభరం
బపుడు నుదంచితేందువదనాభ్రమకబరాభఁ బొల్చె నం
దపరిమితోడుపంక్తి సమయాధిపుఁ డుంచిన సేసఁబ్రాలనన్. 12

టీక. సులభము.

సీ. ఇనుఁ బాసి తమ మొందువినులబ్బిమై సంజ
చెలి నించుకపురంపుఁబలుకు లనఁగఁ
బతిరాక కిరులధూపము[1]నించి నింగికొ
ప్పున నిశాసతి దాల్చు నన లనంగ
గాఢాంధకారసాగర ముబ్బి దివిముట్టఁ
దవిలిన శుక్తిబృందము లనంగ
నంబరాబ్ధిఁ దమిస్రయము నార్షురముఁగూడ
నెదురెక్కు బేడిసకొదమ లనఁగఁ
గీ. గాలగురుఁడు హారిద్బాలికలకుసంత
మసమషీలుప్తవరవర్ణమహితగగన
ఫలకమున వ్రాసిన లతాంతబాణబిరుద
పద్యరేఖిక లన నుడుప్రతతు లలరె. 13

టీ. ఇనకా = సూర్యుఁడనెడుప్రియుని, తమము = చీకఁటియనెడుగ్లానిని, సంత...ఫలకమునకా-సంతమసమనెడు, మషీ=మసిచేత, లుప్త=[2]కొట్టఁబడిన, వర=కుంకుమవంటి, వర్ణ=వన్నెయనెడు (సంధ్యావర్ణమనుట.), వర=శ్రేష్ఠములైన, వర్ణ=అక్షరములుగల, మహితమైన, గగనమనెడు, ఫలకమునకా=పలకయందు.

గీ. అపరదిశ యిర్లచూపుల నభ్రతిలక
శాఖనుడుసూనములు నింప శక్రదిశయు
పొడుపుమలపొన్నపై నెలపువ్వు గొలక
నెలకొన నొకింత నగియె నాఁ దెలుపు దోఁచె. 14

టీక. సుగమము. గొలక=(పూల) గుత్తి.

సీ. సితదంతిమదదంతురతమిస్రపంకాప్తిఁ
దనరుతొల్లైన కమ్మిదాఁక డిగియె
విమలాంశువాలుకావితతిఁ దత్పంక మిం
కఁగ నవ్వల సగంబు గానఁ బడియె
మోగ్రిలఁ దారకశిలాజాలకీలన[3]సమ
న్వితనభోవీథి నచ్చేలుపడియె

1 నించికొప్పున నలినిశాసతి. 2 కట్టనచేయఁబడు. 3. సమన్వితనభోవీథి నచ్చెరువుపడియె (పూర్వముద్రణము); సమంచితనభోవీథి నచ్చెరువుపడియె; సమన్వితనభోవీథి నచ్చేలుకపడియె; సమన్వితనభోవీథి నంచెలుకపడియె (వ్రాతప్రతులు).

వరపాతపీడితాధ్వగజాతరుధిరప
రంపరఁ దోఁరంపుఁగెంపుఁ గనియె

గీ. భళిర భువనజయాభంగచలదనంగ
మంగళశతాంగఘటితరథాంగ మనఁగ
రేక నై సగ మై బింబ మై కరంబి
తారుణచ్ఛాయఁ బొల్చె నేణాంకమూర్తి. 15

టీక. సుగమము.

చ. కళలకు నిమ్ము సొమ్ము సెకకంటికి మింటికిఁ జెన్ను వెన్ను తొ
య్యలినయిదోడు కూడు దివిజాళికి హేళికి జంట తుంటవిల్
గలదొలవిందుపొందు విరిగల్వకుఁ జల్వకు నిక్క రిక్కరో
వెలఁదుల సీవి బావి రుచిపీఠికిఁ బ్రాచికివచ్చెఁ జెచ్చెరన్. 16

టీక. సులభము.

శా. ప్రాలేయాంశుఁడు ప్రాగ్వధూఘుసృణతామ్రచ్ఛాయ సద్యోమిళ
ద్ద్యోలక్ష్మీరభసోపగూహబహుచాతుర్యంబుచే డించి త
త్కేళీసంకలితాంకుఁ డై నిజకరక్రీడాగతిం గప్పెఁ దా
రాలోకంబుల నించె నిగ్గుకపురం బాశాచకోరాక్షులన్. 17

టీక. తారాలోకంబులన్-తారా = చుక్కలయొక్క, ఆలోకంబుల(న్)= తేజస్సుల నెడుచూపులను, ఆశాచకోరాక్షులన్-ఆశా=దిక్కులయొక్క, చకోరములను, అక్షులన్ = నేత్రములయందు (ఇటఁ జంద్రునియందు ధూర్తనాయకత్వము స్ఫురించుచున్నది).

చ. చనియె ముహూర్తమాత్రమున శక్రదిశాకృతరాగ మేఁగె న
య్యనుపమతారకారుచియు నంజిక లో నుడురాట్కరోపరం
జనములు గంటి నేన యని సారెఁ గుముద్వతి నవ్వఁ బర్వె త
ద్ఘనకుముదాప్తదీధితియె కౌముది నా నెగడెన్ జగంబునన్. 18

టీక. శక్రదిశాకృతరాగము-శక్రదిశయందు, కృతమైన, రాగము = రక్తిమ (అనురాగమనుట), తారకారుచిన్=తారకలయందలి తేజమును, (ప్రేమ యనుట) ఉడురాట్కరోపరంజనములు-ఉడురాట్ = చంద్రునియొక్క, కర = కిరణముల యొక్క, ఉపరంజనములు, (హస్తోపలాలనము అనుట.) తద్ఘన...దీధితియె-తత్ = కుముద్వతియొక్క, ఘన = అధికమైన, కుముద=కలువలచేత, ఆప్త=పొందఁబడిన, దీధితియె=కాంతియే, కౌముది, నాన్=అనఁగా, నెగడెన్. (కుముదసంబంధమైనదీధితి కౌముది గాన యొప్పుననుటఁగుముదాప్తునిదీధితి కౌముది యగు నేకదాయని తోఁచుచున్నది.)

మ. అలఘుశ్రీయుతగాత్రుఁ బుత్రుఁ గని దుగ్ధాంబోధి యుద్యన్నిర
ర్గళవీచీభుజపాళి నెత్తి యెగురం గా వైచి ముద్దాడఁ ద
త్కులకాంతామణి గంగయుం బొదివి కోర్కుల్మీఱ నుప్పొంగ నా
నలరె న్వెన్నెల తన్ముదశ్రు లన నీహారంబు లొల్కెన్ వెసన్. 19

టీక. సుగమము.

ఉ. వెన్నెలపాలవెల్లి యలవెన్నునిఁ బూనిన తెల్లదీవి శ్రీ
వి న్నెలకందుతో నడరె వేమఱుఁ దప్పుచిఁ జిక్కి సద్గుణం
బెన్నికఁ గాంచె మించుగనియెం గరబృందములందు నచ్ఛతా
సన్నత దివ్యమేఘములజాడ హిమామృతవృష్టి నించుచున్. 20

టీక. సులభము.

సీ. వలిజక్కవకె కాదు వడి నడల్ సనమి య
ఉయరత స్వైరిణీసమితి కెల్ల
నెలచట్టునకె కాదు నెఱి జల్లు మనుట పాం
థమితోదరీమానసముల కెల్లఁ
బుష్పాస్త్రునకె కాదు పోటు సంధిల్లుట
కలశసాగరతరంగముల కెల్లఁ
దరుణరాజికె కాదు దగునన్ను లెడలమి
యమితభోజన చకోరముల కెల్లఁ
గీ. గగనభాగంబునకె కాదు కప్పుసడలు
టతుల రతిలోల బాలాంగలతల కెల్ల
ననుచు నఖిలజనంబులు నభినుతింప
నిండువెన్నెల తెలినిగ్గు నిట్టవోడిచె. 21

టీక. అడలు=దుఃఖము, నడలు=చరించుట, నెలచట్టు = చంద్రకాంతపు ఱాయి: నెఱిజల్లు=నీటిచాలు, మనుట=అభివృద్ధియౌట, జల్లుమనుట = దిగులగుట, పోటుసంధిల్లుట = పోటెత్తుట, అన్నులు= స్త్రీలు, అన్నులు=మత్తిల్లుటలు, కప్పు= ఆచ్ఛాదనము.

క. ఆరేయి వార లందఱు
భూరిగణోజ్జ్వలగభీరపుప్కరతటినీ
తీరగతాపారలతా
గారవితానములనుండి కనుమోడ్పుతఱిన్. 22

టీక. హరి. భూరి...వితానములన్-భూరి=అనేకములైన, గుణ=పవిత్రత్వాది గుణములచేత, ఉజ్జ్వలమై, గభీరమైన, పుష్కరతటినీ=నాకనదియొక్క.

నల. భూరి...వితానములన్-భూరిగుణ=నైర్మల్యాదిగుణములచేత, ఉజ్జ్వలమై, గభీరమయిన, పుష్కర=ఉదకముగల, తటినీ=నదియొక్క.

సీ. అతిశంబరదరేఖ నగకోటి నొరసి యె
క్కువగాననఁరాశి గురిసికొనుచు
ఘనరాగపద్మినీగణముఁ జెంది తదీయ
సరసపుష్కరముద్ర లరసికొనుచుఁ
బరగంధవారణప్రౌఢిమించు మహాసి
తాభ్రము ల్విరియంగ నలమికొనుచు
నఖిలజీవనభంగదాత్మఖేలనములఁ
గువలయావలనంబు గూర్చికొనుచు
గీ. ననిమిషేశ్వరవాహినీఘనరసైక
బంధురసితోర్మికా ప్రకంపనము లతిమ
దాంధసారంగములు చచ్చి యచట వారి
బహుతరశ్రమసంసక్తిఁ బొలుఁ ద్రోలె. 23

టీక. హరి. అతిశంబరదరేఖన్-అతి=అతిక్రాంతమైన, శంబరద = జలదములయొక్క, ('నీరక్షీరాంబుశంబరమ్' అ.) రేఖన్ = పంక్తిగలదాని, ('శ్రేణీరేఖాస్తు రాజయః' అ.) అధ్రింకష మైనదనుట. అగకోటి = వృక్షములసమూహమును, సనల రాశిన్=పుష్పరాశిని, కురిసికొనుచు, ఘన...గణమున్-ఘనమైన, రాగ=రక్తిమగల, పద్మినీ=పద్మలతలయొక్క, గణమును, చెంది, తదీయ...ముద్రలు-తదీయ=ఆపద్మలతా సంబంధమైన, సరస=మకరందసహితములైన, పుష్కర=పద్మములయొక్క,ముద్రలు= ముకుళనమును, పర...ప్రౌఢిన్-పరగంధ-ఇతరగంధములయొక్క, వారణ=నివారణ యందలి, ప్రౌఢిచేత, మించునట్టి, మహాసితాభ్రముల్ = కర్పూరపుటనఁటిచెట్లను, అఖిల...ఖేలనములన్-అఖిలమైన, జీవన=ఉదకములకు, భంగ=కరళ్లను, ద= ఇచ్చు చుండెడు, ఆత్మఖేలనములన్, కువలయావలనంబున్-కువలయములయొక్క, అవల నంబున్=ఈషచ్చలనమును, అనిమి...ప్రకంపనములు-అనిమిషేశ్వరవాహినీ = గంగా నదియొక్క, ఘనరస=ఉదకమందలి, ఏక=ముఖ్యములైన, బంధురములైన, సితో ర్మికా=శుభ్రతరంగములయందలి, ప్రకంపనములు=వాయువులు, ('వాయూప్రకంపన మహాబలాః' అ. శే.) అతిమదాంధసారంగములు - అతిమదాంధములైన, సారంగ ములు=తుమ్మెదలుగలవి, (వాయువునకు విశేషణము.) వాక బహు...సక్తిన్-వారి= ఆ హరిశ్చంద్రాదులయొక్క, బహుతరమైన, శ్రమ = బడలికయొక్క, సంసక్తిని,

ఇందుఁ గర్పూరవాచకమైన సితాభ్రశబ్దమును గర్పూరతరువాచకముగఁ జెప్పఁబడు టకుఁ బ్రయోగము.—

"ఘనసార కానవే ఘనసారశోభితు, బంధూక కానవే బంధుమిత్రు."
(10. స్కం. భాగ.)

నలి. అతిశంబరదరేఖన్-అతిశంబ=వజ్రాయుధము నతిక్రమించిన, ('శతకోటి స్స్వరుశ్శంబ' అ.) రదరేఖన్=దంతరేఖచేత, అగకోటిన్-అగ=పర్వతములయొక్క, కోటిన్=అంచును, అనలరాశిన్=అగ్నిరాశిని, ఘన...గణమున్-ఘనమైన, రాగ=అనురాగముగల, పద్మినీ=ఆఁడేనుఁగులయొక్క ('ఇభ స్తంబేరమః పద్మీ' అ.) గణమును, చెంది, తదీయ...ముద్రలు-తదీయ=ఆకరేణుసంబంధమైన, సరసములైన, పుష్కర=తుండాగ్రములయొక్క, ముద్రలు, పర...ప్రౌఢి(న్)-పరగంధవారణ=ఇతరమదగజములయొక్క, ప్రౌఢివంటిప్రౌఢిచేత, మించుమహాసితాభ్రముల్-మహత్ అసితాభ్రముల్=నీలమేఘములను, అఖిల...ఖేలనములన్-అఖిలమైనవారియొక్క, జీవనములకు, భంగమును, ద=ఇచ్చెడు, ఆత్మఖేలనములచేత, కువలయావలనంబున్-కువలయ=భూవలయముయొక్క, ఆవలనంబున్=చలనమును, అనిమిషేశ్వర...కంపనములు-అనిమిషేశ్వర=ఇంద్రునియొక్క, హ్రాదినీ=వజ్రాయుధముయొక్క. ('హ్రాదినీవజ్రమస్త్రీ' అ.) ఘనమైన, రస=ధ్వనులకు, ఏకబంధు = కేవలబంధువులైన, రసిత = బృంహితధ్వనులయొక్క, ఊర్మికా=పరంపరలచేత, ప్రకంపనములు = కంపింపఁజేయునట్టివి. అతి...రంగములు-అతిమదాంధములైన, సారంగములు=ఏనుఁగులు, వారిన్=ఆతెరువరులను, బహుసక్తిన్-బహుతర=అతివేగముయొక్క, శ్రమ=పరిశ్రమముయొక్క, సంసక్తిచేత,

ఉ. దీపితతారమౌక్తికతతిన్ గగనాపథవాటిఁ బాపి కా
లాపణికుండు వేగ విపులాచ్ఛకరండమునందు నించి రా
జాపగమం బెఱింగి బలహారిదెసన్ నెలకొల్పె నాఁగఁ బ్రా
గ్ద్వీపవతీసితాబ్జమగు వేఁగురుఁజుక్క వెలింగె నయ్యెడన్. 24

టీక. రాజాపగమంబు-రాజ=చంద్రుఁడనెడు ప్రభువుయొక్క, అపగమంబు=పోవుటను, బలహారిదెసన్-బలహారి=ఇంద్రుఁడనెడు బలశాలియొక్క, దెసన్=దిక్కునందు, (అచ్ఛకరండము=గాజుబుడ్డి).

మ. తరణిం దత్సమయప్రతీక్షణవినిద్రప్రౌఢి మెప్పించి త
ద్వరలబ్ధారుణదీప్తి మౌళిఁ గొని తత్త్రైలోక్యరక్షాత్రయీ
పరిణామత్రిగుణత్వవైభవము దోఁపన్ సారెఁ గీర్తించువై
ఖరిమ్రోసెన్ జరణాయుధంబులు త్రిరేఖాభుగ్నకంఠార్భటిన్. 25

టీక. సుగమము.

చ. లలితరసోపభోగదశలన్ రహిఁ బాసి కులంబు కాకృతిన్
దెలఁ తెఱంగై వడంకు కులదీప మపాకృతరశ్మిబంధమున్
గళితశిఖాప్రకాండమును గాఁ గని తత్తపనీయ కాంతియున్
దలఁగి విరాగియై సవితృధామము సేరఁ గడంగె నయ్యెడన్. 26

టీక. రెంటనుసమానము.

లలిత...దశలన్-లలితమైన, రస=చమురుయొక్క ("శృంగారాదౌ కషాయాదౌ ఘృతాదౌ చలితే జలే, నిర్యాసే పారదే రాగే వీర్యే చ రస ఇష్యతే" ధనంజయ నిఘంటువు.) ఉపభోగ=అనుభవించుటగల (చమురును బీల్చియనుట); దశలన్=వత్తులను, రహిఁ, బాసి=విడిచి, కులదీపము=గృహమందలిదీపము ('కులంగృహేచ' అ. శేష), అపా...బంధమున్-అపాకృత=పోఁగొట్టఁబడిన, రశ్మిబంధమున్ = తేజోబంధముగలదియు, గళితశిఖాప్రకాండమును-గళితమైన, శిఖాప్రకాండమును = శ్రేష్ఠమైన జ్వాలకలదియు, కాన్=కాఁగా, కని = చూచి, తత్త...కాంతియున్-తత్ = ఆదీపమందలి, తపనీయ - సూర్యసంబంధమైన, కాంతియును, విరాగ = విశేషమైన రక్తిమగలది, ఐ, సవితృధామమున్=సూర్యతేజమును.

ఇందలి యప్రకృతార్థము.

లలిత...దశలన్-లలిత=రసములయొక్క, ఉపభోగ = అనుభవమందలి, దశలన్=అవస్థలను, (విషయరసావస్థలననుట.) రహి(న్)=తెలివిచేత, పాసి = విడిచి, కులదీపము, వంశదీపకుఁడనుట. అపా...బంధములన్-అపాకృతమైన, రశ్మిబంధమున్=యజ్ఞోపవీతముగలవాఁడును, గళి...కాండమున్-గళితమైన, శిఖాప్రకాండమును=శిఖగలవాఁడును, కాన్,జందెములను,సిగను,తీసి(సన్న్యసించినవాఁడు కాఁగా ననుట.), తత్త...యున్, తత్=ఆసన్న్యాసియైనకులదీపకునియొక్క, తపనీయకాంతియున్=వనితయును,సవితృధామము=తండ్రియిల్లు ('జనక స్సవితా పితా'శాశ్వతము).

మ. జలజాప్తుఁడు శార్వరాహత జగత్సంధానపారీణతన్
నలువై రా సమయాధికారి విలసన్నాళీకపీఠిన్ బహి
ర్దళరత్నోపటలగ్నభృంగజతుముద్రన్ వాపి తత్కర్ణికా
వలయంబున్ గయినేసె నుద్గతరజోవర్గంబు మేల్కట్టుగన్. 27

టీక. శార్వ...ణతన్-శార్వర=అంధకారమనెడుశత్రురులచేత, ('శార్వరంత్వంధతమసే ఘాతుకే భేద్యలింగకమ్' అ.) ఆహతమైన, జగత్తుయొక్క, సంధానమందలి, పారీణతచేత, నలువై=బ్రహ్మయై.

చ. కుముదిని వేగునంతకు నకుంఠితతక్రమకళావిలాసి యా
రమణునితోఁ బెనంగి మకరందకణశ్రమవారి జాఱఁగా
విమలమృదుచ్ఛదావరణవేష్టితయై నిదురించుచో నయు
క్తము రొద సేయుటంచు నరుగందొడఁగెన్ సరసాళివర్గముల్. 28

టీక. రెంట నొక్కరీతిగనే.

అకుంఠిత...విలాసి-అకుంఠితములైన, క్రమ = మనోహరములైన, కళా = కళ లనెడు కోమకళయొక్క, విలాసి=విలాసముగలవాఁడు, ఔ, రమణునితో=ప్రియుఁడైనచంద్రునితో, సర...వర్గముల్-సరసమైన, అళివర్గముల్=తుమ్మెదగుంపులనెడు, సరసాళి=సరసులైన సఖులయొక్క, వర్గముల్=సమూహములు.

శా. కామాస్త్రంబయి వేగునంతకు మముల్ గాఱించె నెట్లట్ల తా
నామోదంబరి తెల్విపడి తొఁగ దైన్యంబందెఁ దోడ్తోన నా
ధామార్థాచరణంబు రిత్త చనునే యంచున్ రథాంగాంగనా
స్తోమంబుల్ రహిఁ గేరె నాథమిళనోద్భూతప్రమోదార్భటిన్. 29

టీక. రెంటను సమము.

చ. అతినవపల్లవోజ్జ్వలతరాంబర యా తొలుసంజ గబ్బి బో
యెతతటి వేచి వింటఁ గదియించిన వేగురుఁజుక్క యుంట ను
ద్ధతగతిఁ దద్ద్విజాధిపతిదారఁదమిం గెడపం దదండసం
హతి క్రియఁ జారక ల్బెదర నండజకోటి భ్రమించె నల్గడన్. 30

టీక. రెండర్థముల సమానము.

అతి...రాంబర-అతినవమైన, పల్లవ = చిగురుటాకువలె, ఉజ్జ్వలతరమైన, అంబర=ఆకాశమనెడు వస్త్రముగలది, ఔ=అయిన, వింటన్ = విన్ను (ఆకాశము) నెడు వింటియందు, తద్ద్వి...దారన్-తత్=అప్రసిద్ధుఁడైన, ద్విజాధిపతి = చంద్రుఁడనెడు పక్షిశ్రేష్ఠముయొక్క, దారన్=భార్యయగుదానిని, తమిన్=రాత్రిని. (ఉంట=ఉండ.)

శా. ఆశాదైన్యదశానివారక సరాగాలోకయై మించు నా
కాశశ్రీ యిరుచక్కిఁ బూర్వచరమగాత్రివాఖ్య దంతావళా
ధీశద్వంద్వము మాళిఁ బూను భువనాధిష్ఠానకుంభంబులో
నా శోభిల్లె రవీందుబింబము లొగిం దత్తద్దిశాంతంబులన్. 31

టీక. రెంటను సమానము.

ఆశా...లోక-ఆశా=దిక్కులయొక్క, దైన్యదశలను, నివారక=పోఁగొట్టునదియై, సరాగ=రక్తిమముతోఁ గూడుకొనిన, ఆలోక = తేజస్సులనెడు, ఆశా...లోక-ఆశా=

కోరికలవల్లనైన, దైన్యదశను, నివారించునదియై, సరాగ = అనురాగముతోఁగూడుకొనిన, ఆలోక=చూపుగలది, ఐ, మించు...చక్కిఁ-మించుచుండెడు, ఆకాశశ్రీ = ఆకాశలక్ష్మియొక్క, ఇరుచక్కిఁ = రెండుపార్శ్వములను, భువ...కుంభంబులో - భువన=లోకములనెడు ఉదకమునకు, అధిష్ఠానంబులైన,కుంభంబులు+ఓ.=కలశములో.

మ. దినలక్ష్మీవసుభూషణంబులు సముజ్జ్వలప్రదోషాప్తి ధా
వనశీర్ణంబు లడంచి రంచు నడి మోఁవం బ్రాక్ప్రతీచీవధూ
జనము ల్పూనినదివ్యదీపములయోజం బొల్చి రక్కెందు లా
త్మనవోన్మేషనిమీలనస్థితులఁ దత్ప్రామాణ్యముం దెల్పుచుక్. 32

టీక. రెంటను సమము.

దిన...ణంబులు-దినలక్ష్మియొక్క, వసు = కిరణములనెడు బంగారముయొక్క, భూషణములు, ప్రదోషా...శీర్ణంబులు-ప్రదోష=సాయంకాలమనెడు, నధికదోషము గలవారియొక్క, ఆప్తి=పరిప్రాప్తివల్లనైన, ధావనముచేత, శీర్ణంబులు=జారినవానిని.

సీ. తొలిమిన్కు చెలు లాడు తలిరాకుటుయ్యెలఁ
జేర్చిన పగడంపుఁ జేరు లనఁగ
రాజు పై నెత్తిన ప్రత్యూషవిభుచంద్రి
కగుడారు పట్టుపగ్గంబు లనఁగ
బూర్వదిశాలక్ష్మి పూను బంగరుతమ్మిఁ
దళుకొత్తునున్నిద్రదళము లనఁగ
మునుగట్టుసులు తాని మోఁపిలఁబట్టిన యింద్ర
గోపంపుఁబెల్లి కెంగుచ్చులనఁగఁ

గీ. కుక్కుటవ్యూహ కాహళి ఘోషబిరుద
శాలివాసరయోధాగ్రసరసరాగ
ఫలక మాంజిష్ఠచామరప్రతతు లనఁగ
నవ్వరవిరోచు లల్లన నభముఁ బ్రాఁకె. 33

టీక. రెంటికిని సమము.

రాజుపైక్=చంద్రుఁడనెడురాజుమీఁద, ఎత్తిన=దండెత్తిన, ఇంద్రగోపంపు బెల్లి = ఇంద్రగోపపుఁ బట్టుగొడుగుయొక్క.

గీ. అపుడు శుచిసార్థహితవృత్తి యానరపతి
యువతియతిపాకదశ లొర్చి యొక్కగత వ

నాంతనిఖిలకంటకవారణార్తి నెడలి
భూరిధర్మావహసుబాహుపురముఁ జెందె. 34

టీక. హరి. అప్పుడు, శుచి...వృత్తి-శుచి = పవిత్రులైనవారియొక్క, సార్థ= సమూహమునకు, హితమైన,వృత్తి=వర్తనముగలవాఁడు, అనరపతి=ఆహరిశ్చంద్రుఁడు, యువ...దశలు-యువతి=చంద్రమతి, యతి = నక్షత్రకుఁడు, పాక=పిన్నవాఁడు (లోహితాస్యుఁడనుట), వీరలయొక్క, దశలు=అవస్థలు, ఓర్చి=సహించి,వనాంత... ర్తిన్-వనాంతమందలి, నిఖిలమైన, కంటక = బేతాళాదిక్షుద్రశత్రువులయొక్క, వారణమందలి, ఆర్తిన్ = ఆయాసమును, వెడలి, భూరి...పురమున్-భూరిధర్మ= సువర్ణధనువును, (మేరువు) ఆవహ=ధరించిన, సుబాహు=మంచిబాహువులు గలవాని (శివుని)యొక్క, పురమున్ = కాశీపురమును, చెందెను.

నల. అపుడు, అనరపతియువతి=ఆరాజపత్ని (దమయంతి యనుట), శుచి... వృత్తి-శుచియనువానియొక్క, సార్థ=వర్తకజనసమూహముయొక్కయు, హితవృత్తి= హితాచరణముగలది (దమయంతివిశేషణము.) అతిపాకదశలు-అతిపాక = పాకము నతిక్రమించిన (ముదిరినవనుట.) దశలు=అవస్థలు, ఓర్చి, వనాంత... ర్తిన్-వనాంత = అడవియందలి, నిఖిల=సమస్తమైనవారికి, కంటకములైన, వారణ = ఏనుఁగులచేనైన, ఆర్తిని, ఎడలి, భూరి...పురమున్ - భూరిధర్మావహ = అధికధర్మావహుఁడైన, సుబాహువను రాజుయొక్క, పురమును, చెందెన్=చేరె ననుట.

సీ. ఏపీట శ్రీవిశాలేక్షణ సహజది
వ్యాన్నకల్పకగుణప్రాఢిఁ దనరు
నేపీట ననఘపద్మావాస పదపంక
జమరంద సింధుప్రచార మొనరు
నేపీట రాజభూషైక నిత్యస్ఫూర్తిఁ
బ్రబలదోషాంధకారములు వాయు
నేపీట వరవృత్తిహీనుఁ డౌ నతఁడు సం
స్థితుఁడై ధనేశుతోఁ జెలిమి సేయు
గీ. నట్టి నగరోత్తమమున మోహానవిలాస
లాసికానృత్తగీతోజ్జ్వలంబు కాల
భైరవగజేంద్రముఖబలప్రావృతంబు
నై వెలయు లోకనాథాలయంబుఁ గాంచె. 35

టీక. హారి. శ్రీవిశాలేక్షణ=అన్నపూర్ణ, సహజ...ప్రాప్తిక్-సహజమైన, దివ్యా ద్యమును, కల్పక=కల్పించునట్టి, గుణముయొక్క, ప్రాప్తిచేత, అనఘ...ప్రచారము - అనఘ=పాపరహితమైన, పద్మావాస=విష్ణువుయొక్క, పదపంకజమునకు, మరంద=తేనె యైన, సింధు=గంగానదియొక్క, ప్రచారము, రాజ...మూర్తిక్-రాజభూష=చంద్ర భూషణుఁడగు శివునియొక్క, ఏక = ముఖ్యమైన, నిత్యమూర్తిచేత, ప్రబలదోషము నెడు, అంధకారములు, వరవృత్తిహీనుఁడు+బౌనతఁడు, సద్వర్తనలేనివాఁడు, సంస్థితుఁడు=మృతినొందినవాఁడు. ('పరేతప్రేతసంస్థితా' అ.) ఐ, ధనేశుతోన్=కుబేరుతో, చెలిమిసేయుక్, ఈశ్వరుఁడగుననుట, కాల...ప్రావృతంబుక్ - కాలభైరవుని యొక్క, గజేంద్రముఖ (దుంతి) విఘ్నేశ్వరునియొక్క, బలముచేత, ప్రావృతంబును, లోకనాథాలయంబున్-లోకనాథ=విశ్వేశ్వరునియొక్క ఆలయంబును, కాంచెను.

నల. శ్రీవిశాలేక్షణ=లక్ష్మీకాంత, సహజ...ప్రాప్తిక్-సహజ=తోఁబుట్టువులైన, దివ్యాన్న=అమృతముయొక్కయు, కల్పక=కల్పవృక్షముయొక్కయు, గుణప్రాప్తివంటి గుణప్రాప్తిచేత, తనరుక్ = ఒప్పును, (చల్లఁదనము గలిగి కోరికల నొసంగు ననుట.) అనఘ...ప్రచారము-అనఘములైన, పద్మావాస=పద్మాకరములు, పద=ఉనికిపట్టుగాఁ గల పంకజములవల్లనైన, మరందసింధు = మకరందనదులయొక్క, ప్రచారము, రాజ...మూర్తిక్ - రాజ=రాజులయొక్క, భూష=సొమ్ములయొక్క; ఏక=ముఖ్యమైన, నిత్యమూర్తిచేత, ప్రబలదోషాంధకారములు - ప్రబలమైన, దోష=రాత్రులయందలి, అంధకారములు, వరవృత్తిహీనుఁడు=దరిద్రుఁడు, బౌనతఁడు, (అగువాఁడనుట.) సంస్థితుఁడు = ఉన్నవాఁడు, ఐ, ధనేశుతోన్ = కుబేరునితోడ, చెలిమిసేయుక్, (సంపన్నుఁ డగుననుట.) కాల...వృంతంబు-కాల=నల్లనైన, భైరవ=భయంకరములైన, గజేంద్ర=ఏనుఁగులు, ముఖ=మొదలైన, బల = సేవలచేత, ప్రావృతంబు, లోకనాథాలయంబుక్-లోకనాథ=జననాథునియొక్క, ('లోకస్తుభువనేజనే' అ.) ఆలయంబుక్, (సుబాహునియొక్క నగరి ననుట.) కాంచెను.

గీ. కాంచి తద్దివ్యలింగమంగళవిభూతి
యచ్చెరువు మీఱఁ గొనియాడి యచట మెలఁగు
నచలితైశ్వర్యసిద్ధుల నాత్మ మెచ్చి
యుచితగతి నొక్క నెలవున నుండు వేళ. 36

టీక. హారి. తద్ది...విభూతి - తద్దివ్యలింగ = ఆవిశ్వేశ్వరలింగములయొక్క, మంగళవిభూతి=శుభవైభవము, అచలితైశ్వర్యసిద్ధులక్-అచలిత = నిశ్చలమైన, ఐశ్వర్య సిద్ధిగల పురుషులను.

నల. త...విభూతి- తత్ = ఆరాజగృహమందలి, దివ్యలింగ=దివ్యచిహ్నముల యొక్క, మంగళవిభూతిని, అచలితైశ్వర్యసిద్ధులక్=నిశ్చలైశ్వర్యసిద్ధిగలవారిని,

మ. సతతాభ్యంచితమానగౌరవుఁడు నక్షత్రాసదాలాపత
ర్జితుఁడుఙ్ విత్తలవైకశూన్యుఁడు మహాచింతానతాస్యుండు నౌ
పతి హృత్పంకజభావనంబు దొరయం బల్కు న్పయోజాస్య యు
ద్ధతి నిశ్వాససమీరసంజ్వలిత సంతాపాన[1]లక్లాంతయై. 37

టీక. హరి. నక్ష...తర్జితుఁడుఙ్-నక్షత్రకునియొక్క, అసత్ = దుష్టములైన, ఆలాప=మాటలచేత, తర్జితుఁడుఙ్, పతి...భావనంబు-పతి = భర్తయగుహరిశ్చంద్రుని యొక్క, హృత్పంకజమందలి, భావనంబు = భావించుటను, దొరయుఙ్, (హృదయాభిప్రాయానుగుణము గాఁగా ననుట.)

నల. అక్ష...తర్జితుఁడుఙ్-అక్ష=పక్షిరూపములైనపాచికలయొక్క, త్రాసద=భయదములైన, ఆలాప=వాక్కులచేత, తర్జితుఁడుఙ్ = భర్జింపఁబడినవాఁడును, పతి=నలుఁడు, హృత్పంకజభావనంబు-హృత్పంకజ = మనఃకమలమునందలి, భావనమును, దొరయుఙ్, (ధ్యానగోచరుఁడుకాఁగా ననుట.)

సీ. జనపాల సకలరక్షాలోల సత్కీర్తి
వాసనాసంగతి వదలకుండ
మునుమున్న మేకొన్న ఘనసత్యవచన వి
త్తమునకు మితిమీఱఁ దగునె నీకు
మామకప్రేమసంబంధంబు సడలింపఁ
జను నేయెడరు ముంచికొనినఁ బ్రోవ
నగుఁ గాక నన్ను నీ వతిదుర్దశలఁ బోవు
నప్పుడు విల్వఁగరాదె యనుచు నాడ

గీ. నార్తియై మహాబలదళనాహతస్వ
రూపపతితనగోచ్చలతాపరిణతి
దొరయ నిల వ్రాలి యిట్లనుఁ దోనె తెలిసి
ధరణిపతి సతి నమితాస్యదైన్య మెసఁగ. 38

టీ. హరి. జనపాల ! సకలరక్షాలోల ! ఇవిసంబోధనలు-సత్కీర్తి...సంగతి-సత్కీర్తివాసనయొక్క, సంగతి, వదలకుండ, మునుమున్న, మేకొన్న...మనకు - మేకొన్న=ఒప్పుకొనిన, ఘనుఁడైన, సత్యవచన=ఋషియైన విశ్వామిత్రునియొక్క('ఋషయస్సత్యవచసః' అ.) విత్తమునకు=ధనమునకు, మితి=గడువు, మీఱఁదగునె, (తప్పనగునాయనుట.) మామ...బంధంబు- మామక=నాసంబంధమైన, ప్రేమసంబంధంబు=ప్రేమానుబంధమును, (నామీఁదిమోహమునననుట.) సడలింపఙ్=విడుచుటకు, చనును=

1 లాక్రాంత.

తగును. ఏరొడరు=ఏయాపత్తు, మూంచికొనినన్, వచ్చినప్పటికిని ననుట. ప్రోవన్, అగుఁగాక, అతిదుర్దశలన్=అత్యంతదురవస్థలను, పోవునపుడు, (పొందునపుడనుట.) పిల్వఁగా రాదె=అమ్మకొనఁగూడదా? అనుచు, ఆడన్=పలుకఁగా, మహా... పరిణతి-మహాబలదళన=బలారియగు నింద్రునియొక్క, అహత=అప్రతిహతమైన, స్వరు=వజ్రాయుధముచేత, ఉపపతిత=పడఁగొట్టఁబడిన, నగ=పర్వతముయొక్క, ఉచ్ఛలత్=సంచలనముయొక్క, పరిణతి=పరిణమించుట, దొరయన్, ధరణిపతి; (హరిశ్చంద్రుఁడనుట.) సతిన్=చంద్రమతినిఁగూర్చి, అమితాస్యదైన్యము, ఎసఁగన్.

నల. జనపాల! సకల...కీర్తి-సకలరక్షాలోలమైన, సత్కీర్తికి, వాస!=ఉనికిపట్టయినవాఁడా! సంబోధనములు. నాసంగతి=నాయొక్క, సాంగత్యము; మేకొన...త్తమునకున్-మేకొన్న=కైకొన్న, ఘన=అధికమైన, సత్యవచన=సత్యవాక్యమును, విత్తమునకు=ఎఱిఁగినవారిలో శ్రేష్ఠుఁడవగుటకనుట (అనఁగా: సత్యసంధుఁడు)మితిమీఱఁదగునె? = మేరమీఱవగునా? సడలింపఁజనునె=విడువఁదగునా? పోవునపుడు = పోరాడితిరుణమున, పిల్వఁగరాదె? = పిలువఁగూడదా? ఆడ=ఆస్థలమందు, మహా... పరిణతి-మహాబల=వాయువుయొక్క, దళన=విదళనముచేత; అహత=చెఱుపఁబడిన, స్వరూపముగలదై, పతిత=పడిన, నగ=వృక్షముయొక్క, ఉచ్చ=ఉన్నతమైన, లతా=శాఖయొక్క, ('సమేశాఖాలతేస్కంధ' అ.) పరిణతి, దొరయ, ధరణిపతిసతి=దమయంతి, నమితాస్య=వంచఁబడిన ముఖముగలది, ఇందు 'అపుడువిల్వఁగ'ననుచో 'అపుడు' అనుపదము కాలవాచకమైన యవ్యయముగాన సప్తమికిఁ బ్రథమ వచ్చినది.

లక్షణము.—

గీ. కాలవాచకముల కడనున్న సప్తమి, ప్రథమ యగును రాత్రిపవ్వళించె
దానకాల మెంతవానికిఁబోరాదు, రేయిపోయిపగలు ప్రేతవచ్చె.(కవిచింతామణి.)

చ. వనచరభూతనిష్ఠురణ వైరసముద్ధతినేని యుత్ప్రకం
పనవిమ[1]భుక్ప్రకాండవిమపాళికనేని జగజ్జనానుభం
జనదవమండలీభరదచండశిఖాహతినేని ప్రాణముల్
సనమిగదా కఠోరగతిసైఁచెద నీదృశఘోరదుర్దశల్. 39

టీ. హరి. వన...నేని-వనచరములైన, భూత=బేతాళాదిభూతములయొక్క, ఉత్ప్ర...నేని-ఉత్=ఉద్ధతమైన, ప్రకంపన=వాయువుగల, విమభుక్ప్రకాండ=మేఘసంఘముయొక్క, విమపాళిక నేని=ఉదకపరంపరచేనైనను, (గాలివానచేనైన ననుట.)జగ...హతి నేని-జగజ్జనానుభంజనమైన;దవమండలీ=దావాగ్నిపుంజముయొక్క, భర=అతిశయమును, ద=ఇచ్చుచున్న, చండశిఖా=తీవ్రజ్వాలలయొక్క, హతినేని.

1 భృత్ర.

నల. వన...ద్ధతిఁ-వనచర=కిరాతునిచేత, భూత=పొందఁబడిన ('భావితమాపాదితంచభూతంచ' అ.) నిష్కరుణ=కరుణారహితమైన, వైరసముద్ధతి చేని, విరోధాతిశయముచేతనైనను,ఉత్ప్రి...పాళిక చేని-ఉత్ప్రి)కంపన=కంపింపఁజేసెడు, విషభుక్ప్రి)కాండ=సర్పములయొక్క, విషపాళిక చేని=విషపరంపరచేతనైనను, జగ...హతి చేని=జగజ్జనులయొక్క,అశుభంజనముగల,దవమండలి=వనమండలి, ఇభ=ఏనుఁగులయొక్క, రద=కొమ్ములయొక్క,చండమైన, శిఖా=అగ్రములయొక్క, హతిని=దెబ్బచేతనైనను.

క. అని వనరి నిజసమీహిత
మున కొండొక వెరవులేమి భూపతికులపా
వని నెట్టన నమ్ముందగ
మనము౦చివిషాద మొదవ[1] మసలెడునంతన్. 40

టీ. హరి. వనరి = దుఃఖించి, నిజసమీహితమునకు, (అప్పుతీర్చవలెననుకోరిక కనుట) భూపతి=హరిశ్చంద్రుఁడు, కులపావని=కులపవిత్రకురాలైన చంద్రమతిని, నెట్టనన్=గట్టిగా, అమ్మన్=అమ్ముకొనుటకు, తగన్ = తెప్పగా, మనము, ఉంచి,

నల. నిజసమీహితము హితమునకు.(నలునిఁజూడవలెనను)తనకోరికకు, భూపతి...వనిన్-భూపతికుల=రాజగృహమును, ప=పాలించెడు వారలయొక్క, అవనిన్, (రాజగృహద్వారసమీపభూమియందనుట.) ఎట్టు+అనన్, (లోకులు కటకట పడునట్లుగాననుట) అమ్ముందగమన=అదముడుంతి, కర్త, ముంచి=మూంచుకొని.

సీ. సార్వభౌమునిభార్య సత్య మీాకమలాక్షి
కమలాక్షిఁ దులఁ బోలఁగల దటంచుఁ
గంటె మీాక్షణసుధాకల్లోలమన నాతి
మననాతిగవిలాసమహిమ యనుచుఁ
బతి కెట్టు మతి జత వాయఁగా రామ
గారా మడరఁ గాంచి కాంచి యనుచు
గొంటరిధాత కీకుసుమకోమలయంగ
మలయంగ జేయ నేచల మటంచుఁ

గీ. జలదలఘునవ్యచలద శాంచలద శాతి
నిర్భరహిమానీ రహి మాని నింద్యమైన
విభవకలనమ్ము కలనమ్ము వెర వటంచు
నెన్ను మనుజాలి మనుజాలి యొదల రోసి. 41

1 ముటఁగెడు.

టీ. రెంటను సమానము.

చ. పురముపురంధ్రు లయ్యెడ నపూర్వముగాఁ గని సన్నుతించి రా
కరివరయానఁ గంబునిభకంధరఁ గంధరవేణిఁ గఁజజి
త్కారఁ గనకాంగిఁ గంతుశరకమ్రకటాక్షఁ గలేశలేశధి
క్కారకమనీయఫాలతలఁ గైతకకాంతికపోలపాలికన్. 42

టీ రెంటను సమానము.

సీ. కలికిక్రొవ్వెద తృణగ్రాహులఁ గృపఁ జూచుఁ
గొఱరాజుఁ గైకోదు కొమ్మనుదురు
తరుణిచూపులు నెలత్రావడంబులఁ ద్రోచు
నివురుచాయల నెన్న దంతిమోవి
ముదితగుబ్బలు నీరుమోపరుల గణింప
వప్పఁబుట్టువ్రుఁ గాచు నతివకేలు
చెలిరోమలత పుట్టచేర్పుల మన్నించు
వాపులఁ గరుణించు వనితనాభి

గీ. సరకుసేయదు తిరుగండ్లఁ జామపిఱుఁదు
జడతరులఁ బాటిగొన వన్నుతొడలు మనుచు
మొగపిఱికిఁ గాంత ప్రపదముల్ దగులఁ బోవు
జాతిమొగవిప్పదళము లౌ సతినఖములు. 43

టీ. రెంటను సమము.

కలికిక్రొవ్వెద=ఆస్త్రీయొక్క కొప్పు, తృణగ్రాహులన్ = నీలములను, కృపఁ జూచున్, అనఁగాఁ, బూరిఁగఱచినవారినిఁ గృపఁజూచుట యుక్తమే యనుట. కడమ యీతీరున నే గ్రహించునది.

చ. ఎనయ నుమాకుమారుని వహించినఁ బాయదు వర్ణసంకరం
బని శిఖిరాజ మింతితురు మై జనియించి రమాకుమారు నిం
పొనర వహించి విశ్వనుతియోగ్యత మస్ఫురితైకవర్ణభా
జన మయి కాంచె నెంతయు నజస్రఘనోజ్జ్వలకాంతిలక్ష్మియున్. 44

టీ. రెంటను సమానము.

వర్ణసంకరము-వర్ణ=వన్నెల చెడు, జాతులయొక్క, సంకరంబు = సాంకర్యము, విశ్వ...భాజనము-విశ్వనుతియోగ్యమై, తమః=చీఁకటివలె, స్ఫురితమైన,ఏకవర్ణవెల్య ము చెడు ముఖ్యవర్ణమునకు, భాజనము=ఉనికిపట్టు,అయి, అజస్ర...లక్ష్మియున్-అజస్ర

మును, ఘన=పే ఘనమయొక్క, ఉజ్జ్వలమైన, కాంతిలక్ష్మియనెడు, ఘన=అధికమైన కాంతి, లక్ష్మియును.

గీ. అతివచూపులు గర్ణసూచితమహాని
ధానగణనాధిక శ్రీల నూనఁబోలు
నంజనస్ఫూర్తిఁ గానిచో నలరు బెట్లు
వరమకరనీలపద్మాదివైభవములు. 45

టీక. (రెంటనుసమము) కర్ణ...శ్రీలక్-కర్ణములచేత, సూచిత=సూచింపఁబడిన, మహానిధానగణన=సొమ్మిదవలెక్కయొక్క, అధికశ్రీలనెడు, మహానిధాన = మహానిక్షేపముయొక్క, గణనాధిక=గణనాతీతమలైన, శ్రీలను, అంజనస్ఫూర్తిక్, అంజన=కాటుకయనెడు, అంజనముయొక్క స్ఫూర్తిచేత, వర...వైభవములు-వరమైన, మకర=మత్స్యములు ('మకరామత్స్యరాడ్మషః' నిఘంటుపారము.) నీలపద్మ=నీలాంబుజములు, ఆది=మొదలుగాఁగలవానియొక్క, వైభవములనెడు, వరములైన, మకరనీలపద్మములు, ఆదిరైన నిధులయొక్క, వైభవములు.

చ. మెలఁతముఖద్విజేంద్రుకడ మిన్కులు నేరఁగ వచ్చి యద్దముల్
నిలుచుచు నాభిముఖ్యమున నిచ్చలుఁ దత్కళఁ గొంత చాయపా
టొలయ గ్రహించియు న్మగుడ నొజ్జల కిచ్చు నొకింతయంతిక
స్థలి యెడమైన బింబరుచిశాలికి ధారణశక్తి నిల్చునే. 46

టీక. (రెండర్థముల నొక్కటీయు.)

మెలఁతముఖమనెడు, ద్విజేంద్రుకడ = చంద్రునివద్ద, మిన్కులు=నిగ్గులనెడు, విద్యలు, తత్కళక్=అనిగ్గనెడు విద్యను, చాయపాటొలయక్ = ప్రతిబింబ ప్రాప్తి గలుగు నట్లుగా (పరిపాటిగాననుట.) బింబరుచిశాలికి, బింబరుచి=ప్రతిబింబ కాంతియనెడు, బింబరుచి=దొండపండునందలి రుచిచేత, శాలికిక్=ఒప్పెడువానికి,

చ. తొగరును దీపు తేటయు మృదుత్వము మించ సుధాబ్ధిలోని క్రొం
బగడపుఁబచ్చితీవనె యమర్చఁగఁబోలుఁ బయోజగర్భుఁ డీ
జగదభినంద్యరూపనిధి సన్నపువాతెఱ జన్మసిద్ధమై
తగు నమృతాప్లవం బన నితాంతనితాంత రసోజ్జ్వలంబుగన్. 47

టీక. రెంటనుసమానము.

చ. కినిసి కరీంద్రకుంభములు కేసరిఁ బైకొనునేని యభ్రనూ
తనరుచి రేఖకున్ మొగడతమ్ములు ప్రేలక సైఁచునేని యిం
దుని వెఱ దక్కి జక్కవ లెదుర్కొనునే నిలఁ గానుఁ గ్రమ్మి యా
రెనసి మొగంబు పై కెగురు నింతిచనుంగవఁ బోల్పఁగాఁదగున్. 48

టీక. రెంటికిని సమము.

క. నిరపాయనఖరకోరక
కరపల్లవకలితబాహుకల్పలతల నీ
వరలావణ్యసుధానిధి
హరిహాయునకు నొసఁగకున్నె యభిమతఫలముల్. 49

టీక. రెంటనొక్కటియు.

చ. అలఘుకటీరకంతుమణిహర్మ్యతలోపరినాభిజాలిక
స్థలమున మేఖలాతపము దారసిలం బొడరెండచాలు సం
ధిలుగతి ధూమనీలమయి నీరజలోచన రోమరేఖఁ జె
న్నలరెఁ దదంతరాళ పరమాణువుఁ బోలువలగ్న మెంతయున్. 50

టీక. రెంటికి సమానము (కటీరము=మొల.)

చ. అనఁటుఁ జన్మ మెత్తి లలితాంగితొడల్ గఁదళ్మ యెల్లఁ గై
కొన నవి జన్మదేశములు గోల్పడి రాజనివాసవాటికిన్
జని దివసక్రమంబున నసారము లై యపసార మొందు మా
ర్గ్కాని మహితోరులం జడతరు ల్తెఱుఁగు ల్మరలింపఁ గంటిమే. 51

టీక. రెండర్థములకు సమము.

చ. నలువ నవారవిందములు నాతిపదంబులుగా నొనర్చి ని
చ్చలు నవి యుజ్జ్వలోరుమదసామజరాజకరాగ్రసంగతిం
దలఁకక యుండ నందుఁ బ్రపదచ్ఛలకచ్ఛపయుగ్మకంబు డీ
కొలుపఁగఁ బోలుఁ దొంటిగజకూర్మవివాదము సంస్మరించుచున్.

టీక. రెంటికిని సమానము.

మ. అరవిందప్రకరం బపారమదధారాభంగమాతంగదు
ష్కరబాధాకులతన్ మహాతపము కాఁకల్ సైఁచి యీకాంతశ్రీ
కరపాదద్వయ మై జనించి రహిఁ దద్గంధాంధలీలాగతుల్
హరియించెన్ భరియించెఁ దాభువనభవ్యశ్రీపురావాసనన్. 53

టీక. రెంటను సమానము.

గీ. పాదతలమహాపద్మంబుఁ బ్రపదకచ్ఛ
పంబు రేఖామకరశంఖపద్మములును
తరుణిమెడ నిల్పి యజుఁ డానిధానపంచ
కంబు సూచించె నంగుళికైతవమున. 54

టీక. రెంటను సమానము.

క. అని యనిమిషనవనవభా
జనజనతామహితజననజననాథకులాం
గనఁ గనకనిగనిగద్యుతిఁ
గనికని యి ట్లెలమిఁ బొగడు గడు నెఱపుతఱిన్. 55

టీక. రెంటికి సమము.

సీ. అటమున్న తద్భూతలాధీశు ననఘు రా
జ్యశ్రీఁ గనియె నేనయాహితమతి
యాయతి వసుగుణైకావలంబనమూ ర్తి
నవసుధారుచిశిరోభవనసీమ
నెనసి మానసమున్నతి నెలర్పఁగ నితాంత
రమణీయగాత్రిఁ దద్రమణి నపుడు
గొని తెమ్మటంచు నంచిన భూరిజనవశీ
కరణాభిరతి మహాకలితదాది

గీ. వితతభూదేవతాగురువృత్తి విదిత
కాలకౌశికగోత్రప్రకాశి ధైర్య
నిధి సముచితార్థసంధాననిరుపమాన
లీల నేతెంచి నృపవంశపాలిఁ బలికె. 56

టీక. హరి. తద్భూతలాధీశున్=ఆహరిశ్చంద్రుని యొక్క, అనఘమైన, రాజ్యశ్రీని, ఏనయాహితమతి = ఏనయువిరుద్ధమైన మతిగలవాఁడు, కనియెన్, (పొందెనాయనుట.) ఆయతి=అట్టి విశ్వామిత్రుఁ డనుట, వసు...మూర్తి-వసు=అగ్ని యొక్క (దేవభేదే౽నలే రశ్మౌ వసూరత్నే ధనే వసు' అ.) గుణమువంటిగుణమునకు, ఏకావలంబనమైన, మూర్తిగలవాఁడు, (ఇది యతికి విశేషణము) నవ...సీమన్-నవ=నూతనమైన, సుధారుచి=చంద్రుఁడుగల, శిరః=శిరస్సుగలవాని (శివుని) యొక్క, భవనసీమన్=గృహమును (కాశీపురి యనుట.) ఎనసి=చేరి, నితాంత...గాత్రిన్-మిగులమనోహరమైన శరీరముగల, తద్రమణిన్=ఆచంద్రమతిని, కొని=విలిచి, తెమ్మటంచున్, అంచిన(న్),భూరి...రతి-భూరి=పదార్థముచేతనైన, జనవశీకరణమందు, అభిరతిగలవాఁడు, మహాకలి=కలిపురుషుఁడు, తదా...వృత్తి- తదాది=అదిమొదలు, వితతమైన, భూదేవతా=బ్రాహ్మణుని యొక్క, గురువృత్తిగలవాఁడు, విదిత...ప్రకాశి-విదిత=ప్రసిద్ధమైన, కౌశికుఁడనెడు, గోత్ర=పేరుచేత. ('గోత్రంతు నామ్నిచ' అ.) ధైర్యనిధి, సము...లీలన్-సముచితమైన, అర్థసంధాన=కార్యసంధానమందు, (చంద్రమతిని విక్రయమునకుఁ దీసికొను ప్రయోజన

మందు ననుట), నిరుపమానమైన, లీలచేత, నృపవంశపాలిక = రాజవంశ పాలకుఁడైన హరిశ్చంద్రునిఁగూర్చి, పలికెను.

నల. అనఘ...శ్రీక్-అనఘమైన, రాజ్యశ్రీక్=రాజ్యసంపదగలవానిని, తద్భూతలాధీశుక్=ఆనుబాహుఁడనెడు రాజును, ఏనయాహితమతి, కనియెక్=కుమారునిగఁ గాంచెనో? అయతివ, (ఆరాజమాత యనుట.) సుగు...మూర్తి-సుగుణములకు, ఏకావలంబనమైన,మూర్తిగలది, ఇదిరాజమాతకువిశేషణము, నవ...సీమక్-నవమైన, సుధారుచిగల, శిరోభవనసీమక్=చంద్రశాలయందు, ఎవని = నిలిచి, మానసము, ఉన్నతిని, ఎలర్పక్, తాంత...గాత్రిక్-తాంత=బడలిన, రమణీయగాత్రముగల, తద్రమణిక్=ఆదమయంతిని, కని=చూచి, కొని తెమ్మటంచుక్=తో తెమ్మని, అంచిన, భూరి...కలిత-భూరి = అధికమైన, జనవశీకరణాభిరతిచేత, మహాకలిత=మిక్కిలి యొప్పెడిది. దాదికర్త, వితత...వృత్తి- వితతమైన,భూదేవతా=భూదేవియొక్క,గురు=అధికమైన, వృత్తి వంటివృత్తిగలది, విదిత కాల-విదిత=ఎఱుఁగఁబడిన, కాలముగలది, కాశక...నిధి-కాశకగోత్ర=ఇంద్రాచలముయొక్క, ప్రకాశించుచుండెడు, ధైర్యమువంటిధైర్యమునకు, నిధియైనది (ఇవన్నియు దాదికి విశేషణములు) సము...లీలక్-సముచితార్థసంధాన=ఉచితకార్యసంధానమందు, నిరుపమాన=సమానములేని, లీలచేత, నృపవంశపాలిక - నృప=నలునియొక్క, వంశపాలిక=కులపాలికను, (దమయంతినిఁగూర్చి యనుట.)

ఉ. ఎయ్యది నీకుఁ బేరు కుల మెద్ది ప్రియోరువియోగహేతువౌ
నియ్యెడ రెయ్యెడం గలిగె నేవఁగ నీవఁగ పెల్ల మాని మే-
లయ్యెడు నట్లు నేర్పు మెఱయక్ వ్యవసాయ మొనర్పరాదె యీ
శయ్య నలంగె దేల ఘనసారసఖావయవమ్ము వమ్ముగక్. 57

టీక. హరి. ప్రియో...హేతువు - ప్రియా=భార్యయొక్క, ఉరు=అధికమైన, వియోగమునకు, హేతువు, ఔ, ఈయెడరు=ఈవ్యథ, వ్యవసాయము = కృషి, ఒనర్పరాదె=చేసికొనరాదా? ఈశయ్య=ఈతీరున, నలంగెదెల=ఏలనలిగెదవు, ఘన...వమ్ము-ఘనమైన,సార=బలిమికి,సఖమైన, అవయవము=శరీరము, వమ్ముగక్=వ్యర్థమగునట్లుగా.

నల. ప్రియో...హేతువు - ప్రియునియొక్క, ఉరువియోగము, హేతువు, ఔ=అగు నట్టి, ఈయెడరు=ఈదుఃఖము, వ్యవసాయము=ఉద్యోగము, ఒనర్పరాదే = చేయరాదా? ఈశయ్య(క్)=ఈరీతిని, (భూమిమీఁదబడియనుట.) ('శయ్యారీత్యాంచ తల్పేచ' అ.)

క. [1]కనన య్యో ననఘనానా
వనితల మతిమహిమ నేలి వర్తిలుగతి యో
వనజాక్షి నమ్ము వెరవిది
యొనరింతు హితంబు విను మదుక్తం బెల్లన్. 58

టీక. హరి. అనఘ! సంబోధనము, నానావనితలము = సమస్తభూమండలము, అతిమహిమన్, ఏలి: వర్తిలుగతియో=వర్తించుమార్గమో, వనజాక్షిని, అమ్ము వెరవు, ఇది కనన య్యొడున్ (అని పూర్వమున కన్వయము.) భార్య నమ్ముకొని యేమి యుద్ధరించెద వనుట.

నల. అనఘ...తల(న్)-అనఘులైన, నానావనితల(న్)=స్త్రీలను, మతిమహిమ చేత, ఏలి, వర్తిలుగతి, కనన య్యొడున్, ఓవనజాక్షి, నమ్ము=విశ్వసింపుము, ఇది, వెరవు, హితంబు, ఒనరింతు.

గీ. పురుషులకు నేడ సత్యంబు ధరణిఁ దలఁప
నిన్ను మానిన విభునీతి నెన్నఁ జనునె?
వలవదమ్మ వెలంది నీవగ నరేంద్ర
వృషభజనిఁ దగ భజియింపు వేయు నేల? 59

టీక. హరి. నిన్ను, మానినవిభునీతిన్ - మానిన=విడిచిన, విభునీతిన్=రాజనీతిని, వెలందిని, అమ్మవలదు, (భార్య నమ్మవల దనుట.) ఈవగ(న్) = ఈతీరున, నరేంద్ర సంబుద్ధి. వృషభజని=వృషభ=వృషభములు, జనిన్=కొణముగాఁగలదానిని (వ్యవసాయము ననుట.)

నల. నిన్ను, మానినవిభునీతిన్=విడిచిపెట్టిన భర్తయొక్క నీతిని, ఎన్నఁజనునె? నీవగ=నీదుఃఖము. నరేంద్రవృషభజనిన్=రాజమాతను, భజియింపుము.

సీ. అనుటయు నన్నరేంద్రాగ్రణి వామత
ద్వాక్యము ల్విని లాటదవాళ[2]చోళ
కురుకుంతలకరూశకోసలావంతిము
ఖ్యావనీకాంతకాంతావతంస
ఖచితమాణిక్యమంగళదీపికారాజి
రచితనీరాజనరాజితాంఘ్రి

1. కనన య్యొడనఘ. 2. ఛోట.

నైనదానికి నాకు సర్వామే [1]యీవ్యవ
సాయం బని మనోంబుజమునఁ దలఁచి
గీ. యొండుగతి లేమిఁ దన్ముఖ మొయ్యఁ జూచి
యెఱుఁగు దఖిలంబుఁ బలుపల్కు లేల యిట్టి
యాపదకుఁ దోడుగ మ్మన నమ్ముదుసలి
[2]వెలఁదికిఁ దగిన యర్థంబు విస్తరించి. 60

టీక. హరి. అన్నరేంద్రాగ్రణి = ఆహరిశ్చంద్రుఁడు, వామతద్వాక్యముల్ - వామ=వక్రములైన, ('వామంవల్గుప్రతీపాద్వా',అ.) తత్ =ఆకౌలకాశికుని యొక్క, వాక్యములు, విని, లాట...తాంఘ్రిక్-లాట...ముఖ్యులైన, అవనీకాంతుల యొక్క; కాంత=మనోహరములైన, అవతంస=శిరోభూషణములయందు, ఖచితమైన; మాణిక్య మంగళదీపికారాజిచేత, రచితమైన, నీరాజనముచేత, రాజితమైన, అంఘ్రిక్=పాదము గలవాఁడను, ఐనదానికిన్ (దానమస్యాస్తీతి దానీ) దాతనైన నాకు, ఈవ్యవసాయము=ఈసేద్యము, తన్ముఖము = ఆకౌలకాశికుని యొక్క ముఖమును, అఖిలంబున్= సమస్తమును, ఎఱుఁగుదువు, అమ్ముదుసలి=ఆకౌలకాశికుఁడు, వెలఁదికిన్=చంద్రమతికి, తగినయర్థము=తగినద్రవ్యమును, విస్తరించి=ఇచ్చి.

నల. అన్నరేంద్రాగ్రణి, వామ=ఆదమయంతి, తద్వాక్యములు=ఆదాదియొక్క పలుకులు, లాట...అంఘ్రిక్-లాట=ముఖ్యులైన, అవనీకాంత = రాజులయొక్క, కాంతా=స్త్రీలయొక్క, అవతంస=శిరోభూషణములయందు, ఖచిత...తాంఘ్రిక్, ఈవ్యవసాయము=రాజమాతృసేవారూపమైన యీయుద్యోగము, తన్ముఖము=ఆదాది ముఖమును, ఎఱుఁగుదువు, అమ్ముదుసలి=ఆదాది, వెలఁదికిన్ = దమయంతికిని, తగు నర్థంబు=ఉచితప్రయోజనమును (సైరంధ్రీకృత్యము ననుట.)

క. కొని చనఁ గని జననుతిభా
జనధృతి భూకాంతజనని జాలిఁబడుచు మా
ననికూరిమి నమ్మ యిదే
మి నీగతి యటన్నఁ బొగిలి మృగలోచనయున్. 61

టీక. హరి కొనిచనన్=విక్రయమునకుఁ దీసికొనిపోఁగా, జననుతిభాజన - జననుతికి, భాజన=నెలవైనది, ధృతిభూకాంత-ధృతియందు, భూకాంత=భూదేవి యైన దానిని, జననిన్=తల్లిని, కని=చూచి, జాలిన్=వెతచేత, పడుచు=పొట్టువాఁడైన లోహితుఁడు, అమ్మ! సంబుద్ధి.

1. వ్యవసాయమని...దలచి. 2. వెలఁదికిని దగునర్థంబు.

నల. కొనిచనన్=తోడుకొనిపోఁగా, జన...ధృతి-జననుతిభాజనమైన,ధృతి గలది, ఇది రాజమాతకువిశేషణము. భూకాంతజనని=రాజమాత, జాలిఁబడుచున్= విచారపడుచు.

మ. మగనిం బాసితి మందభాగ్య ననుచున్ మాయమ్మ దైవంబు నె
వ్వగకుం బాలుగఁ జేసె నిల్పు మికఁ మద్వాత్సల్య మీవంచు న
జ్జగతీశాంగన బాష్పపూరములు మించం బట్టి తారళ్యముం
దగ వారించుచు సంఘటించుచు నెదన్ దత్కాలయోగ్యక్షమన్.

టీక. హరి. మద్వాత్సల్యమున్ = నాసంబంధమైన ప్రేమమును, నిల్పుము (మానుమనుట.) పట్టితారళ్యమున్=కుమారునియొక్క చాంచల్యమును.

నల. ఇఁక, మద్వాత్సల్యము=నాయందలి వాత్సల్యమును, నిల్పు = ఉంపుము, బాష్పపూరములు, మించన్=వృద్ధినొందఁగా, పట్టి=నిలుపఁబట్టి, (అపుకొనియనుట.)

క. చేరువ నిలిచిన నపుడు మ
హారాజపురంధ్రిఁ జూచి యమ్ముసలి భవ
ద్దారక వరవిరహార్తి వి
చారము వారింతు నబల సైఁపు మటంచున్. 63

టీక. హరి. మహారాజపురంధ్రిన్=చంద్రమతిని, అమ్ముసలి = అవృద్ధుఁడగు కాలకౌశికుఁడు, భవ...విచారము(న్)-భవత్=నీయొక్క, దారకవర = పిన్నవాని యొక్క, ('దారకనందినోర్భకః' వైజ.)విరహ=ఎడఁబాటుచేనైన, ఆర్తిన్ = విచారమును, వారింతును.

నల. మహారాజపురంధ్రిన్ = దమయంతిని, అమ్ముసలి=ఆముదుసలియైన రాజమాత, అబల!-సంబోధనము, భవ...విచారము(న్)-భవత్=నిన్ను, దారక = విదారించుచుండెడు, వరవిరహ=ప్రియవిరహమువల్లనైన, ఆర్తిన్=విచారమును,

గీ. ప్రాఢి నాజనపోషకరమణితోడఁ
గదు[illegible]సవత్సలసద్గతిక్రమము మించఁ
గాఁ దగవు లాడి యయ్యింతి గాఢశోక
తరళదశ సనందనని శాంతమునఁ జేర్చె. 64

టీక. హరి. అజన...తోడన్-అ, జనపోషకర = జనులను పోషించువారల యందు, మణి=శ్రేష్ఠుఁడైనవానితోఁడ, (హరిశ్చంద్రునితో ననుట.) సవత్సల... క్రమము-సవత్సల, (వత్సైస్సహితా స్సవత్సాః=లేఁగలతోఁగూడిన యావుల యొక్క యనుట.) సద్గతిక్రమము మించఁగా, తగవులాడి=వ్యవహారములాడి, గాఢశోకతరళ

దశ(న్)=గాఢమైన శోకముచేత తరళమైన దశకలదానిని, సనందన(న్)=నందనునితోఁ గూడుకొనినదానిని, అయ్యింతిన్=ఆచంద్రమతిని, నిశాంతమునన్=ఇంటను, చేర్చెను.

నల. ఆ...తోడ-ఆ, జనపోషకునియొక్క, రమణితోడ, (దమయంతితోడ ననుట.) సవత్స...క్రమము-సవత్స=కౌమారితతోడఁగూడునట్లుగా, ('వత్సశేపుటజే వత్సస్తనాదౌతర్ణకేత్వితి', రత్నమాలా.) లసత్ = ఒప్పెడు, గతిక్రమము, మించఁగా, (తనకూఁతురైన సునందతోఁగూడ నుండు క్రమము మించఁగా ననుట.) తగవులాడి=తగినమాటలాడి, అయ్యింతి(న్) = ఆదమయంతిని, గాఢతరళశోకదశ, చనన్=పోవునట్లుగా, తననిశాంతమునన్=తనగృహమునందు.

ఉ. ఆతతి నాగుణోన్నతమహాద్విజ రాజకులాగ్రగణ్యు ప
త్నీతిలకంబు వృద్ధరమణీమణి మెచ్చ ననిందిత క్రియా
జాతము లాచరించుచుఁ దుషారమహారహితాసితాబ్జినీ
రీతిమెయిం దినంబులు దరించుచు నుండె నితాంతఖిన్నయై. 65

టీక. హరి. ఆగుణోన్నత=ఆచంద్రమతి; మహా...తిలకంబు - మహాద్విజరాజకులాగ్రగణ్య=బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన కౌలకౌశికునియొక్క, పత్నీతిలకంబు=కలహకంఠియనుభార్య, వృద్ధరమణీమణి = వృద్ధురాలు, మెచ్చ, అనిందిత...జాతములు, అనిందితములైన, క్రియా = ప్రయోజనములయొక్క, జాతములు, ఆచరించుచు, తుషార...మెయిన్ - తుషారమహః = చంద్రునితోడను, రహిత = ఎడఁబాపిన, అసితాబ్జినీ=నీలాబ్జినియొక్క, (కలువ) రీతి మెయిన్=రీతిచేత.

నల. ఆగుణో...తిలకంబు-ఆగుణోన్నతమైన, మహాద్విజరాజకులాగ్రగణ్య = చంద్రవంశశ్రేష్ఠుఁడైన నలునియొక్క, పత్నీతిలకంబు=దమయంతి, వృద్ధరమణీమణి= రాజమాత, మెచ్చన్.

సీ. అచ్చట నలమానవాన్వయేంద్రుండు ద
    త్పరణి మహావనీధరసమున్న
తిఁ దనర్చు ప్రచురదీప్తిజ్వాలనము భూరి
    సముదయం బీక్షించి చపలగతి త
ద్దకలగ్నాత్మకుం డై కడు ఘోషించు
    వాని నాగాధిరాట్ప్రాను నికట
సంవాసిఁ బేర్కొని సడలింతు నీచిక్కుఁ
    జను మిహావసుప్రాప్తి ననుచుఁ దన్ను

గీ. నప్పుకడఁ జేర్పఁ బూనిన నాద్విజాతి
మద్భృతిఘటించి తెనయ సేమంబు నీకు
నీఁదగినయట్టి గుర్వర్థ మెద్ది యనుచుఁ
దోనె పలుజాడలఁ గరాబ్జ మూని తివియ. 66

టీక. హరి. అల...ద్రుండు-అల=ఆ, మానవ=మనుసంబంధమైన, అన్వయమునకు, ఇంద్రుండు = హరిశ్చంద్రుఁడనుట, తత్సరణి=ఆరీతిని, మహో...సమున్నతిన్-మహోవనీధర=గొప్పపర్వతముయొక్క, సమున్నతిన్ = ఉన్నతివంటి యున్నతిచేత, తనర్చు=తనర్చుచుండునది (ఇది) భూరిసముదయమునకు విశేషణము ప్రచురదీప్తిచేత, జ్వలనము=ప్రకాశించునది, భూరిసముదయంబు-భూరి = ధనముయొక్క ('స్వర్ణేపి భూఃచంద్రే ద్యో' అ.) సముదయంబు = రాశి, తదేకలగ్నాత్మకుండు, తత్=ఆద్రవ్యరాశియందు, ఏకలగ్న=కేవలలగ్నమైన, ఆత్మకుండు=మనస్సుగలవాఁడు, ఐ, ఘోషించువానిన్, ఆగాధిరాట్సూనునికటసంవాసిన్, ఆ, గాధిరాట్సూను = విశ్వామిత్రునియొక్క, నికటసంవాసిన్=శిష్యుని, (నక్షత్రకుని ననుట.) పేర్కొని=పిలిచి, ఈవసుప్రాప్తిన్=ఈద్రవ్యప్రాప్తిని, తన్నున్, అప్పుకడఁ జేర్పఁబూనిన, (తాను ఋణవిముక్తుఁడుగాఁ బూనఁగా ననుట.) ఆద్విజాతి=నక్షత్రకుఁడు, మద్భృతి-మత్=నాయొక్క, భృతి=జీతము, ('భృతయోభర్మ వేతనమ్' అ.)ఘటించితి = ఇచ్చితివి. (నీ వెంటఁదిరుగు నాజీతమునిచ్చితివనుట) నీకు, సేమంబు = క్షేమము. (ఇది యాశీర్వాదము) ఈఁదగినయట్టిగుర్వర్థము=ఇయ్యఁదగిన మాగురుద్రవ్యము, ఎద్ది=ఏది, అనుచు, పలుజాడలన్=బహుప్రకారములను, కరాబ్జము(న్)=ఆచేతిని, ఊని=పట్టి, తివియ(న్)=ఈడ్వఁగా.

నల. నలమానవాన్వయేంద్రుఁడు = నలరాజు, తత్సరణి(న్) ఆమార్గమునను, మహో...న్నతిన్, మహోవనీధర=అరణ్యభూమియందు, సమున్నతిన్ = ఉన్నతిచేత, తన...జ్వలనము(న్) తనర్చు, ప్రచురదీప్తిగల, జ్వలనము(న్)=దావాగ్నిని, భూరిసముదయంబు-భూరి=అధికమైన, సముదయంబు = ఉత్పత్తిగలదానిని, ఈక్షించి, తదేకలగ్నాత్మకుండు-తత్=ఆయగ్నియందు, ఏక=కేవలము, ('ఏకేముఖ్యాన్యకేవలాః, అ.) లగ్న=తగిలిన, ఆత్మకుండు=దేహముగలవాఁడు, ఐ, చపలగతి(న్), కడు ఘోషించువాని, నాగాధిరాట్సూను-నాగాధిరాట్ = వాసుకియొక్క, సూనున్=అనుజుఁడైన వానిని, (కర్కోటకు ననుట.) ('సూనుః పుత్రే ఽనుజేరవౌ' నానా.) నికటసంవాసిన్=సమీపముననుండువానిని, పేర్కొని=పిలిచి,నీచిక్కుసడలింతు(న్) =పరిహరించెదను, ఈవు, అసుప్రాప్తిని = ప్రాణసంప్రాప్తిని, అప్పుకడన్ = ఉదకసమీపమున, చేర్పన్,పూనినన్, ఆద్విజాతి=సర్పము, ఎనయ, మద్భృతి=నాయొక్క

రక్షణము, ఘటించితి=చేసితివి; ఈఁదగినగుర్వర్థము=ఇయ్యఁదగిన, గుర్వర్థము=అధిక పదార్థము, ఎద్ది, (నీవు నేనేమిత్తుననుట) తోనె=వెంటనే, పలుజాడలన్ = దంతములయొక్క జాడలచేత, కరాబ్జమూనితివిత్తున్, (చేయికఱవఁగా ననుట.)

చ. వెఱఁగును సంభ్రమంబుఁ బ్రభవింపఁగ నన్నరనాథచంద్రుఁ డ
త్తఱి వికృతాత్ముఁ డై కెరలి తా నతిమాత్రదురాగ్రహోద్ధతిన్
గఱచినయయ్యురాళగతిఁ గద్గాని కాంచితి నీహితార్థ ము
ల్లఱిమఱి నోరఁ జేదుఁ గురియందగునే యన నాతఁ డిట్లనున్. 67

టీక. హరి. వెఱగును=భీతియు, సంభ్రమంబు=త్వర, ప్రభవింపఁగ, వికృతాత్ముఁడై=వికృతహృదయుఁడు, ఐ, కెరలి, దురాగ్రహోద్ధతిన్ = కోపోద్ధత్యముచేత, కఱచినయయ్యురాళగతిన్, కఱచిన=నేర్చిన, అయ్యురాళగతిన్=అకుటిలగతియైన నక్షత్రకుని, కొంచితివి, ఈహితార్థము = అభీష్టద్రవ్యము, నోరన్ = నోటితో, చేఁదు గురియందగునే, విషపుమాట లాడవచ్చునా?

నల. వికృతాత్ముఁడై=వికృతశరీరుఁడై (కర్కోటకవిషముచేత, వైవర్ణ్యము నొందినవాఁడై యనుట.) అయ్యురాళగతిన్=అసర్పమును (ఈశబ్దము జిహ్మగశబ్దమువంటిది). ఈహితార్థము=ఈప్సితార్థము, చేఁదు=విషము, కురియందగునె? (కఱవందగునా యనుట.)

క. సామాన్యునిఁ గాఁ దలఁపకు
మేమియుఁ గర్కోటకుండ నే నీయెడ నీ
చే మద్భృతిఁ గాంచితి నిక
నామహితార్థంబు మఱతునా యె ట్లైనన్. 68

టీక. హరి. కర్కోటకుండను=కఠినుఁడను, ఏను, మద్భృతిని = నాజీతమును, కాంచితిని, నామహితార్థంబు(న్) = నాకు, మహిత = పూజితుఁడైన వానియొక్క, (గురువైన విశ్వామిత్రునియొక్క యనుట.) అర్థంబున్=ద్రవ్యమును.

నల. సామాన్యునిఁ గాన్, (సామాన్యసర్పమునుగా ననుట.) కర్కోటకుండను=(కర్కోటకుఁ డను పేరు గలవాఁడ ననుట.) ఏను, మద్భృతి(న్) = నారక్షణమును, కాంచితిని, ఆమహితార్థంబున్, (ఆయుపకారము ననుట.)

చ. వగవకు నాదుసేఁతకు భవత్కలివార్తలు విన్నచో నరుల్
నగుదురు గుట్టు మేలు నరనాథ మదీయగురుద్విజాగ్రభూ
రిగరమునిల్వ రక్షయొనరించు నవశ్యము నిన్ బయల్పడన్
మిగులఁ గడంగితేని యటమీఁదటఁ బేర్కొను నన్ను నెంతయున్.

టీక. హరి. భవత్కలివార్తలు: భవత్ =నీయొక్క, కలివార్తలు=కలహవార్తలు, నరుల్ =ప్రజలు, మదీయ...భూరి - మదీయగురుఁడైన, ద్విజునియొక్క, అగ్రభూరి = శ్రేష్ఠమగుధనము (విషమనుటయే లెస్స), కరము = మిక్కిలి, నిల్వ(న్) (అటుంచిన ననుట.) రక్ష యొనరించున్, ఆపదార్థము నిన్ను రక్షించు ననుట.

నల. భవత్కలివార్తలు- భవత్ = నీ యొక్క, కలిపురుషునివల్లనైన, వార్తలు, విన్నచోన్, అరుల్ =శత్రువులు, మదీయ...గరము-మదీయ= నా యొక్క, గురు=గొప్పదైన, ద్విజాగ్ర = దంతాగ్రములయందలి, ('దంతా విప్రాండజా ద్విజా' అ.) భూరి= అధికమైన, గరము = విషము, నిల్వ(న్) = నిల్చియుండిన, రక్షయొనరించును, (నిన్నా విషమే రక్షించు ననుట.) బయల్పడక మిగులన్ కడంగితే=నిజరూపమున నుండఁదలంచితివా, నన్నున్, పేర్కొన=తలంపుము.

గీ. నిజ మిది యనంగ శుభరూపనిధి యనుమతి
పుట్ట నను నమ్మికొమ్ము నాపట్టు నేమ
మెసఁగ వలసినయెడఁ బూని యిష్టసిద్ధి
నొందు మనసారధృతిగుణయుక్తిఁ బెనచి. 70

టీక. హరి. అనంగ, (నక్షత్రకుఁ డిట్లాడఁగా ననుట.) శుభరూపనిధి=హరిశ్చంద్రుఁడు, కర్త. అనన్=పలికెను. మతిపుట్ట=బుద్ధుల పుట్టయైనవాఁడా! ననున్, అమ్మికొమ్ము=విక్రయించుకొనుము. నాపట్టు = నాపూనికియొక్క, నేమము = నియమము, ఎసఁగన్...అనన్=హరిశ్చంద్రుఁడు చెప్పఁగా, సారధృతితో, గుణయుక్తిన్, గుణ=త్రాటియొక్క, యుక్తిన్=యోగముచేత, పెనచి=కట్టి.

నల. అనంగశుభరూపనిధి=మన్మథరూపమునకు నిధియైనది, అనుమతి=అనిరొడు బుద్ధి, పుట్టన్=పుట్టఁగా (మదనరూపకరణహేతువైనదను మతిచేత ననుట.)నను(న్), నమ్మి=విశ్వసించి, నాపట్టు=నావస్త్రమును, కొమ్ము=పుచ్చుకొనుము, వలసినయెడన్= కావలసినపుడు, పూని=ధరించి, మనసార=మనస్ఫూర్తిగా, ధృతిగుణయుక్తిన్=ధృతి గుణము, పెనచి=(మనస్సునఁ) బెనచికొని, (దృఢముగా స్థైర్యమును పూని యనుట.)

క. అని హితమృదునేత్రుం డై
పెనుపరి ఘురుశక్తి తిమిరభిత్సంతతి యా
ఘనుఁడు మహిమాలయైకాం
తనిరూఢిం గనుటఁ దలఁచి ధరణిపుఁ బలికెన్. 71

టీక. హరి. అని...నేత్రుండు-అనిహిత=ఉంపఁబడిన, మృదునేత్రుండు=మృదు దృష్టిగలవాఁడు, ఐ, (ఉగ్రదృష్టిగలవాఁడై యనుట.) పెనుపరి=కలహములను పెంచు

వాఁడు (నక్షత్రకుఁడు), కర్త. గురుశక్తి = గురువైన విశ్వామిత్రునియొక్క శక్తిచేత, (తృతీయకు బదులుగఁ బ్రథమ.) తిమిరభిత్సంతతి - తిమిరభిత్ = సూర్యునియొక్క, సంతతి=సంతానము, ఔఘుఁడు, (అనఁగా యమఁడు.) మహి(న్)=భూమియందు, మాలడై (మాలవాఁడై యనుట.) కాంతనిరూఢిన్=కాంతమైన ప్రసిద్ధిని.

వల. అని = పలికి, హితమృదుచేత్రుండు - హితుఁడైన నలునియందు, మృదు చేత్రుండు = మృదువైన వస్త్రముగలవాఁడు, ఐ, నలునియందు వస్త్రమును జేర్చినవాఁడై యనుట. ('స్యాజ్జటాంశుకయోర్నేత్రం' అ.) పెనుపరి = పెనుచుకొనువాఁడు, (కర్కోటకుఁ డనుట.) గురుశక్తి = అధికమైన సామర్థ్యము గలవాఁడు, తిమి...తతి-తిమిరభిత్=సూర్యునియొక్క, సంతతి = వంశముకలవాఁడు, ఔఘుఁడు, (అగునట్టి మహాత్ముఁడగు ఋతుపర్ణుఁ డనుట.) మహిమా...నిరూఢిన్ - మహిమకు, ఆలయమైన, ఏకాంతనిరూఢిన్=అత్యంతప్రసిద్ధిని, కనుటన్=పొందుటను, తలఁచి, (ఇది పెనుపరి యనుకర్తతో నన్వయించును.) ధరణిపున్=నలునిఁ గూర్చి.

సీ. అమరు నీనికటదేశమున ఘనర్తుప
ర్ణాభిఖ్యుఁడు విదారితారివీర
బాహుఁ డుద్భటభుజాబలనుతిశాలి మా
తంగరాడ్గోత్రుఁ డాతని భజించి
వనజబంధుప్రభావాహాళి మనసు స
ప్రత్యయంబుగఁ దెల్పి పరమతత్ర
వాస్యాత్మతత్వసంప్రాపకవృత్తి యొ
ప్పఁ దదీయహృదయంబు వడయు మీవు
గీ. కానిచో నెట్లు దొరకు నీ కామితార్తి
మాత్రకల్యాణము లటన్న మనుజవరవ
తంసుఁ డాయహితాపవేధకవచఃప్ర
సంగసంభిన్నచిత్తుఁడై చనుచు నెదుట. 72

టీక. హారి. ఘన...ఖ్యుఁడు-ఘనర్తు=వర్షర్తువందలి, పర్ణ=ఆకులయొక్క, అభిఖ్యుఁడు=కాంతివంటి కాంతికలవాఁడు, (నల్లనివాఁ డనుట.) వీరబాహుఁడు, మాతంగరాడ్గోత్రుఁడు=చండాలవంశము గలవాఁడు, అతని = ఆవీరబాహుని, వనజబంధుప్రభావా-వనజబంధు=సూర్యునియొక్క, ప్రభావా = తేజమువంటి తేజముగలవాఁడా! ('ప్రభావశ్శక్తితేజసీ' నా.నా.) హాళి(న్)=ఆసక్తిచేత, మనసు, సప్రత్యయంబుగా = విశ్వాసయుక్తముగా, పరమ...వృత్తి-పరమమైన, తత్=ఆవీరబాహునియొక్క, రహ

స్యముయొక్క, అత్‌తత్త్వ=చెడకుండుటను, సంప్రాపక = పొందించెడు, వృత్తి = హిత వృత్తి, ఒప్పన్=ఒప్పుగా, తదీయహృదయంబు వడయును, (అతనిమనసురాఁ దిరుగు మనుట.) కౌమి...ణములు, నీకామితమైన, అతిమాత్రకల్యాణములు=అధికసువర్ణము లు,మనుజవరపతంసుఁడు = హారిశ్చంద్రుఁడు, అయహి...చిత్తుఁడు-అ, అహితమైన, అపవేధక = అపగతమైన వేధగల, (అప్రతిహతమైన దనుట.) వచఃప్రసంగముచేత, సంభిన్న=ప్రకృలింపఁబడిన, చిత్తముగలవాఁడు, ఐ.

నఁ. ఘనర్తుపర్ణాభిఖ్యుఁడు = ఘనుఁడైన ఋతుపర్ణుఁడనెడు పేరుగల రాజు, విదా...బాహుఁడు - విదారితములైన, అరివీరులయొక్క, బాహువులు గలవాఁడు, ఉద్భట...గోత్రుఁడు-ఉద్భటమైన,భుజాబల=బాహుబలముయొక్క,నుతిచేత, శాలి= ఒప్పెడి, మాతంగరాట్=దిగ్గజములు, గోత్రుఁడు=కులపర్వతములు గలవాఁడు, (భూ భారమును వహించినవాఁ డనుట.)అతని(న్)=ఋతుపర్ణుని, భజించి, వనజబంధుప్రభా (నలసంబోధనము), వాహాళిమనను = అశ్వహృదయమనువిద్య, సప్రత్యయంబుగన్ = విశ్వాసముతోఁ గూడునట్లుగ ('ప్రత్యయోఽధీనశపథజ్ఞానవిశ్వాసహేతుషు' అ.) పరమ...వృత్తి-పరమమైన, తత్=ఋతుపర్ణునియొక్క, రహస్యమైన,అత్=పాచికల యొక్క, తత్త్వ = నిశ్చితార్థమును, సంప్రాపక = పొందించెడు, వృత్తి, తదీయహృద యంబు-తదీయ = ఆయతసంబంధమైన, హృదయంబు, (అశ్వహృదయ మను విద్య ననుట.) నీకామి...కల్యాణములు - నీయొక్క, కామితములైన, అతిమాత్రకల్యాణ ములు = అధికశుభములు, మనుజవరపతంసుఁడు = నలుఁడు, అయహి...చిత్తుఁడు-అ, అహి = కర్కోటకునియొక్క, తాపవేధక=తాప నివారకమైన, వచఃప్రసంగముచేత, సంభిన్న=వికసితమైన, చిత్తముగలవాఁడు, ఐ.

సీ. అంగీకృతార్థ్వాకాలాయసాలంకారు
నుత్తమగోరాజకృత్తివాసు
మధురసభాజన మానితాలఘుకృత్యుఁ
బటుయథోచితదండభరణశాలి
నతులకుంతలవరాటాదిబంధనధుర్యు
సుప్రసన్నామోది విప్రవచను
నతిరోహితోజ్జ్వలద్యుతితారకాకాంతు
సంతతోన్నతి మదస్ఖలితచరితు
గీ. సురభిదానానుసంధానపరమసమ్ము
దాగతబహు ద్విజారవవ్యాప్తభవన
తలునినకులీను నమ్మహాధర్మమూర్తిఁ
గనుఁగొనియె సంభ్రమస్ఫూర్తి గడలుకొనఁగ. 73

టీక. హరి. అంగీ...లంకారుఁ-అంగీకృతమును, జాత్యుచితమునైన, కౌలాయసాలంకారుఁ=ఇనుపసొమ్ములుగలవానిని, ఉత్త...వాసుఁ - ఉత్తమగోరాజము యొక్క, కృత్తి=చర్మమందు, వాసుఁ=కూర్చున్నవానిని, మధు...కృత్యుఁ-మధుర సభాజన=మద్యభాండముయొక్క, మానితా=సన్మానించుట యనెడు; అఘుకృత్యుఁ=నీచకర్మముగలవానిని, పటు...శాలిఁ - పటువై; యథోచితమైన, దండ = గుదియ యొక్క, భరణముచేత, శాలి=ఒప్పెడువానిని, అతుల...ధుర్యుఁ-అతులితమైన, కుంతల=వెండ్రుకలయందలి; వరాట=గవ్వలు, ఆది=మొదలయిన వానియొక్క, బంధనముచేత, ధుర్యుఁడైనవానిని. సుప్ర...వచనుఁ, సు=లెస్సైన; ప్రసన్న=మద్యముచేత; ఆమోది=పరిమళించుచున్న, విప్రవచనుఁ=అసంగతోక్తులుగలవానిని, అతి...కాంతుఁ - అతిరోహిత=మిక్కిలి యొఱ్ఱనైన, ఉజ్జ్వలద్యుతిగల, తారకా=కనుగ్రుడ్లచేత, కాంతుఁ=ఒప్పెడివానిని, సంత...చరితుఁ-సంతత=ఎల్లప్పుడు, ఉన్నతమైన, మదముచేత; సఫలితమైన, చరితుఁ=చర్యగలవానిని, సురభి.....తలునిఁ-సురభీ = ఆవులయొక్క, దాన=ఖండనముయొక్క, (దానఖండనే అనుధా.) అనుసంధానమువల్లనైన, పరమ సమ్మదముచేత, ఆగత=వచ్చిన, బహుద్విజ=గృధ్రాద్యనేకపక్షులయొక్క; ఆరవముల చేత, వ్యాప్తమైన, భవనతలునిఁ = గృహప్రదేశముగలవానిని, అకులీను=మష్కాల జాతుని, అమ్మహాధర్మమూర్తిఁ=ఆవీరబాహుని, సంభ్రమమూర్తి=తొట్రుపాటు.

నల. అంగీ...కారుఁ - అంగీకృతమైన, అర్హాకారములయందలి, ఆయుః = శుభావహావిధిగలుగునట్లుగా, సాలంకారుఁ = అలంకారసహితుఁడైనవానిని, ఉత్తమ...వాసు(ఁ) = ఉత్తముఁడైన, గోరాజకృత్తివాసుఁ = భూనాథపరమేశ్వరుని, మధు...కృత్యుఁ-మధుర=మనోజ్ఞులైన, సభాజనులచేత, మానిత=సన్మానింపఁబడిన, అలఘుకృత్యుఁ=అలఘుప్రయోజనములు గలవానిని, పటు...శాలిఁ-పటువై, యథోచితమైన, దండ = దండోపాయముయొక్క, భరణముచేత, శాలిఁ=ఒప్పెడువానిని, అతుల...ధుర్యుఁ-అతుల=సమానరహితులైన, కుంతలుఁడు, వరాటుఁడు, ఆది = మొదలుగాఁగల రాజులయొక్క, బంధనముచేత, ధుర్యుఁడైనవానిని, సుప్ర...వచనుఁ-సుప్రసన్నులై, ఆమోది=సంతుష్టులైన విప్రులయొక్క, వచనుఁ=ఆశీర్వాదవచనములు గలవానిని, అతి...కాంతుఁ-అతిరోహిత=తిరోహితముకాని, ఉజ్జ్వలద్యుతియందు, తారకాకాంతుఁ=చంద్రుఁడైనవానిని, సంత...చరితుఁ - సంతతోన్నతిమత్=నిరంతరోన్నతిగల, అచలితచరితుఁ=దృఢచర్యగలవానిని, సురభి...తలుఁ-సురభి=మనోహరమైన, దాన=షోడశమహాదానములయొక్క, అనుసంధాన = ఆచరణమువల్లనైన, పరమసమ్మదముచేత, ఆగతులైన, బహుద్విజ = అనేకవిప్రులయొక్క, ఆరవములచేత, వ్యాప్తమైన, భవనతలుఁ=ఇల్లుగలవాసని, ఇనకులీనుఁ, అమ్మహాధర్మమూర్తిఁ = ధర్మస్వరూపుఁడైన యాఋతుపర్ణుని, సంభ్రమమూర్తి = సంతోషాతిశయము,

క. అతఁడును నాస్థానంబున, హితపరివారంబు గొలువ నిరవంది పురో
గతు [1]నక్షత్రగుణసమన్వితాత్ము నవ్విభునిఁజూచి యిట్లని పలికెన్.

టీక. హరి. అతఁడును = ఆవీరబాహుఁడును, ఆస్థానంబునన్ = ఆచోటున, నక్షత్ర...తాత్మున్-నక్షత్ర=నక్షత్రకునియొక్క, గుణ=పగ్గములతోడ, సమన్విత మైన, ఆత్మున్=శరీరముగలవానిని, (నక్షత్రకునిచే విఱిచికట్టఁబడినవాని ననుట.) అవ్విభునిన్ =అహరిశ్చంద్రుని.

నల. అతఁడును=ఆబుతుపర్ణుఁడును, ఆస్థానంబున(న్) = కొల్వుకూటమున, అక్షత్ర...తాత్మున్-తాంద్రచెట్టును, అక్షత్ర = పాలించెడు, గుణ=గుణముగల వానితో(కలిపురుషునితో ననుట.) సమన్వితమైన, ఆత్మున్=హృదయము గలవానిని, (కలిపురుషావేశముగలవానిననుట.) అవ్విభునిన్ =అనలుని.

ఉ. ఎక్కడివాఁడ వీకరణి నేల చరించెదు దీనవృత్తి నై
నిక్కడ నన్నుఁ గొల్చి మను మింకఁ గలంక దలంక నేల నీ
యక్కఱ లెల్లఁ దీర్తు నన నాతనితో నరనాథుఁ డిట్లనున్
వెక్కసమైన శోకశిఖి వేఁడిమిఁ దాలిమిచే నడంచుచున్. 75

టీక. రెంటనొక్కటీక.

సీ. సమధికాసమతురంగమసంతతిమనోజ్ఞ
తాసమున్నతికీర్తిభాసురుండ
నేకరసాధారతాకలితాస్తోక
పాకభేదకరోచ్ఛ్రయాకరుండ
నంగవంగాంధ్రకళింగాదివిఖ్యాత
వర్తనంబున మించువాఁడ నే వి
నీతిపరమహీన నినుఁ గొల్తు నే పొంది
యన బలువున్కి ని ల్వార విప్ర
గీ. నూతి వలసినగతి కోర్కి చొప్పడఁగ భ
జింపు మమ్ముకైనన్న నియతిస్థిరతఁ దెల్పి
మగుడఁ దగునాయన నితాంతమానసీయ
సత్యగుణమునఁ జిక్కి యాజనవిభుండు. 76

1 నక్షత్ర... తాత్మున్-నక్షత్రములవంటి, గుణ = (పరిశుద్ధములైన) గుణము లతో సమన్వితమైన, ఆత్మున్=మనస్సుగలవానిని, అనియు నొకపక్షము. (ఇది రెండు కథలకునొక్క టీక.)

టీ. హరి. సమ...భానురుండన్- సమధికమైన, అసమతురంగమసంతతి=సూర్యవంశముయొక్క, మనోజ్ఞతా=మంజులత్వముచేతను, సమున్నతమైన కీర్తిచేతను, భాసురుండును, ఏక...కరుండన్-ఏక=అద్వితీయమైన, రసాధారతా = భూధరణము చేత, ఆకలిత=సంపాదింపఁబడిన, అస్తోకమైన, పాకభేదకర = పాకశాసనునియొక్క (ఇంద్రునియొక్క), ఉచ్ఛ్రియ=అతిశయమువంటి యతిశయమునకు, ఆకరుండను, ఏన్=నేను, వినీతిపరమహీన-వినీతి=నీతి లేకపోవుటచేత, పరమహీన=మిగుల నీచుఁడవైనవాఁడా? నినున్, కొల్తునే? (నిన్ను సేవింతునా యనుట) పొంది=నిల్చి, అనన్=అనఁగా, విప్రమాతి=నక్షత్రకుఁడు, కోర్కి, చొప్పడఁగ, భజింపుము=పొందుము, అమ్మనన్నని=నన్నమ్ముకొనుమని, అతిస్థిరతచేత, తెల్పి, మగుడఁదగునా=తిరుగఁబడఁదగునా? అనన్=అనఁగా, అజనవిభుండు=అహరిశ్చంద్రుఁడు.

నల. సమ...భానురుండు-సమధికమైన, అసమ = సరిలేని, తురంగమసంతతి యొక్క, మనోజ్ఞతా=మనస్సు తెలియుటచేత, సమున్నతమైన, కీర్తిచేత, భాసురుండు=ప్రకాశించుచున్నవాఁడు, అనేక...కరుండు-అనేకరస = మద్రసములకు, ఆధారతా=ఆధారమగుటచేత, కలితమయి, అస్తోకమయిన, పాకవిభేద=పాకవిశేషమును, కర=చేసెడు, ఉచ్ఛ్రియమునకు, ఆకరుండు, అనంగన్=అనఁగా, నేన్=నేను, వినీతిపరమహీన-వినీతిపర=వినయపరులైన, మహీన=రాజులుగలవాఁడా! ఏపు ఒంది, అనన్=అనఁగా, బలుపూన్కి-నిల్పు-బలువైన, పూనికకు, నిల్పు=నిలుకడయైనవాఁడు, ఆరవిప్రమాతి=ఆ సూర్యవంశముగలవాఁడు, (ఋతుపర్ణుఁ డనుట.) మమ్మున్ భజింపు, అన్నన్=అనఁగా, నియతిస్థిరతన్-నియతి = సేవానియతియొక్క, స్థిరతను, తెల్పి=తెలుపుకొని, మగుడన్=తిరుగ, తగు=యుక్తమైన, ఆయన, సత్యగుణమునన్, (ఆ ఋతుపర్ణుయొక్క సత్యగుణమున ననుట.)

శా. సేవింతున్ భవదీయమానసము రంజిల్లన్ విపన్నార్తిము
ద్రావారాశి తరంగతారణమహోదార ప్లవా యంచుఁ జే .
తోవీథిన్ గృప యొల్కఁ బల్కఁగఁ గృతార్థుం డాతఁ డీపుణ్యాస
ద్భావున్ జేకొని వాంఛితం బొసఁగె నత్యంతానురాగంబునన్. 77

టీక. హరి. విప...దార-విపన్నార్తిముద్రావారాశితరంగములను, తారణ=తరింపఁజేయుటయందు, మహోదారుండవైనవాఁడా, ప్లవా=మతంగుఁడా, ఈ రెండును సంబోధనలు. ('చండాలప్లవమాతంగా' అ.) కృతార్థుండు=ప్రయోజనముగలవాఁడు, విశ్వామిత్రప్రయోజనమును చేసినవాఁడనుట.) ఆతఁడు = ఆవీరబాహుఁడు, వాంఛితంబు, ఒసఁగెన్.

వల. విప...ప్లవా-విపన్నార్తివారాణితరంగమాలను, తారణ=తరింపఁజేయుట యందు, మహోదారమైన, ప్లవ=తెప్పయైనవాఁడా! ('ఉడుపంతుప్లవఃకోలః' అ.) అతఁడు=అబుతుపర్ణుఁడు.

మ. అవదాతాంబుజనేత్ర! నేత్రలఘువాక్య ప్రస్తర స్థానిమా
నవతీత్రాణపవిత్ర! విత్రసదనన్యప్రాపితాశ్వాసవా
సవజాకారణమిత్ర! మిత్రకులశశ్వత్ఖ్యాతిహేతుస్వసం
భవధన్యాయితగోత్ర! గోత్రనిభశుంభత్కుంభకర్ణాంతకా! 78

టీక. అవ...నేత్ర!- అవదాతాంబుజ = తెల్లతామరపుష్పములవంటి, నేత్రములుగలవాఁడా! నేత్ర...పవిత్ర- నేత్ర=పతులయొక్క, అలఘులైన, వాక్య=శాపవాక్యముచేత, ప్రస్తరత్=పాషాణరూపమువలెనున్న, మానిమానవతీ=అహల్యయొక్క, త్రాణ=రక్షణమునందు, పవిత్ర=యోగ్యుఁడైనవాఁడా! విత్రస...మిత్ర!- విత్రసత్ = భయపడుచున్నవాఁడయి, అనన్యప్రాపిత=అన్యులచేఁ బొందఁబడని, ఆశ్వాస=ఊరటగల, వాసవజ=కాకాసురునకు, అకారణమిత్ర=అకారణబంధువైన వాఁడా! మిత్ర...గోత్ర!-మిత్రకుల = సూర్యవంశముయొక్క, శశ్వత్ ఖ్యాతి=శాశ్వతకీర్తికి, హేతువైన, స్వసంభవ=నిజజన్మముచేత, ధన్యాయిత=పుణ్యవతియైన, గోత్ర...తకా-గోత్రనిభ=పర్వతసమానుఁడై, శుంభత్=ఒప్పుచున్న, కుంభకర్ణునకు, అంతకుఁడయినవాఁడా!

క. ఉద్ధతహారిణాశర! శర, విద్ధఖర! ఖరత్నకులవివృద్ధికర! కరా
శ్యుద్ధతిహార! హరమానస, పద్ధతిచర! చరణభజన భాగ్జనసుకరా!

టీక. ఉద్ధత...శర-ఉద్ధత = హింసింపఁబడిన, హారిణాశర = లేడిరక్కసుఁడు గలవాఁడా!, శరవిద్ధఖర - శర=బాణముచేత, విద్ధ=భేదింపఁబడిన, ఖర=ఖరాసురుఁడు గలవాఁడా, ఖరత్న...కరా - ఖరత్నకుల = సూర్యవంశమునకు, వివృద్ధికర = అభివృద్ధికరుఁడైనవాఁడా!, కరా...హార - కరాశి = సముద్రముయొక్క, ఉద్ధతిని, హార=హరించినవాఁడా!, హార...చర - హార=ఈశ్వరునియొక్క, మానస పద్ధతి=మనోమార్గమునందు, చర = చరించువాఁడా!, చరణ...సుకర - చరణభజన భాక్కులైన, జనులకు, సుకర=సులభుఁడయినవాఁడా!

మాలినీ. విముఖితభృగురామా! విశ్వరక్షాభిరామా!
సమధికభుజధామా! జానకీప్రేమధామా!

సమదదనుజభీమా ! సంస్తవాతృప్తభీమా !
దమివిహితవినామా ! తారకబ్రహ్మనామా ! 80

గద్యము. ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధ కవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణకవిప్రణీతంబైన హరిశ్చంద్రనలోపాఖ్యానం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

టీక......సంస్తవాతృప్తభీమా! - సంస్తవ = స్తోత్రముచేత; అతృప్తుఁడైన, భీమా=శివుఁడు గలవాఁడా!, దమివిహితవినామా!-దమి=ఋషులచేత, విహిత=చేయఁబడిన, వినామా=నమస్కారములు గలవాఁడా, తారకబ్రహ్మనామా! = తారకబ్రహ్మమను పేరు గలవాఁడా!

గద్య. ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవి పెద్దిరాజతనూజ పురాతనాధునాతనకవిప్రబంధార్థబోధనసమర్థమానసాంభోజ బుధజనవిధేయానంతయనామధేయ విరచితంబైన హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక యను వ్యాఖ్యయందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.



శ్రీరస్తు

# హరిశ్చంద్రనలోపాఖ్యానము

## పంచమాశ్వాసము

---



సీతాహృదయేశ్వర !
కౌసల్యాగర్భజలధికౌస్తుభ ! విజయ
శ్రీసాంద్ర ! చంద్రధరగా
రీసన్నుతదివ్యనామ ! శ్రీరఘురామా ! 1

టీక. సులభము.

వ. అవధరింపుము మృకండునందనుండు పాండునందనున కిట్లనియె. 2

గీ. ఇట్లయోధ్యాధిపతి గూర్చు నీప్సితార్థ
మధిగమించి ముదంబున నాఫణీంద్ర
గరళసమధికకుటిలతాధరుఁడు తన్మ
హాత్మగురుకుశచీవరోపాస్తి నెఱపె. 3

టీక. హరి. అయోధ్యాధిపతి = హరిశ్చంద్రుఁడు, కూర్చునీప్సితార్థము (న్)- కూర్చు = చేకూర్చిన, ఈప్సితమైన, అర్థమున్ = ధనమును, అధిగమించి, (పుచ్చుకొని యనుట.) ఆఫణీం...ధరుఁడు- ఆ, ఫణీంద్ర=సర్పముయొక్క, గరళమునకంటె, సమధికమైన, కౌటిల్యమును, ధరుఁడు = ధరించినవాఁడు, తన్మ...పాస్తి(న్) - తత్=అ, మహాత్+ఆత్మగురు = తనగురువైన, కుశచీవర = దర్భవస్త్రునియొక్క (ఋషియొక్క యనుట.) ('చీరచీవరపంజరమ్' అ. శే.) ఉపాస్తి(న్)=సేవను, నెఱపె(న్) = ఓనరించెను. (నక్షత్రకుఁడు విశ్వామిత్రుఁ జేరె ననుట.)

నల. అయోధ్యాధిపతి=ఋతుపర్ణుఁడు, కూర్చు...ర్థమున్-కూర్చు = ఒనర్చిన, ఆఫణీం...ధరుఁడు-ఆ, ఫణీంద్ర=కర్కోటకునియొక్క, గరళముచేత, సమధికమైన, కుటిలతను,ధరుఁడు=ధరించినవాఁడు, నలుఁడనుట. (సర్పవిషముచేత, శరీరవైవర్ణ్యము నొందినవాఁడు) తన్మ...పాస్తి(న్)-తత్=అ, మహాత్ములయందు,గురు=అధికుఁడైన,కు+శ-చీవర=భూదేవేంద్రునియొక్క, (ఋతుపర్ణుని యొక్కయనుట.) ఉపాస్తిని, నెఱపెను.

క. భూరితరశాంతి వాహకుఁ
డై రాజిలునయ్యిలాబలారి కుడిగెనా
హారజలచింత లంత ను
దారతరాదిత్యకులదయాసంపత్తిన్. 4

టీ. హరి. భూరి....వాహకుఁడు-భూరితరమైన, శాంతిని, వాహకుఁడు=వహించినవాఁడు, ఐ, అయ్యిలాబలారికిన్=ఆహరిశ్చంద్రునకు, ఆహారజలచింతలు=అన్నోదకచింతలు, ఉదార...సంపత్తిన్-ఉదారతరమైన, ఆదిత్యకుల=దేవతాకులముయొక్క, దయాసంపత్తిచేత, ఉడిగెను; (దైవానుగ్రహమునఁ గలిదప్పుల నెఱుంగకుండెననుట.)

వల. భూరితరశాంతిచేత, వాహకుఁడై=బాహుకుఁడను పేరుగలవాఁడు, ఐ, (వబయోరభేదః) అయ్యిలాబలారికిన్=అనలునికి, ఆహారజలచింతలు=అన్నపానీయములయందలిచింతలు, ఉదార.....సంపత్తిన్-ఉదారతరుఁడైన, ఆదిత్యకుల=సూర్యవంశజుఁడగుఋతుపర్ణునియొక్క, దయాసంపత్తిచేత, అన్నోదకములు గలిగి సుఖంబుననుండెననుట.

సీ. ధరణీశుఁ డాఁకలిదప్పులెఱుంగ కీ
పగిదిఁ గొల్వఁగ మదిఁ బ్రమద మొంది
యయ్యవదాత మాహాకులగ్రామణి
గోపతి హయవాటికాపు భజన
పరబహుళానూత్నతరసాదుల గణింప
కతని కొప్పించి యక్షతమనోజ
వాతిపాతికలాత్తరీతి నానానువీ
తుల నిరోధించి చాతురిఁ బొసంగ
గీ. సంతరింపు మటంచు నత్యంతమైత్రిఁ
దనదుముద్ర నొసంగ సంతతవశీకృ
తాక్షతజ్ఞాతివినిహితానంతవిభవుఁ
డాతఁడు దదాజ్ఞఁ దల మోచి యరుగు చెదుట. 5

టీక. హరి. అయ్యవ...గ్రామణి-అవదాత = ఖండింపఁబడిన ('దాతందితంఛిదం వృక్ణం' అ.) మాహాకుల = ధేనుకులము గలవారిలో ('ఉస్రామాహాచశృంగిణీ' అ.) గ్రామణి=శ్రేష్ఠుఁడు (నీచజాతివారియందు, శ్రేష్ఠుఁడు అనఁగా వీరబాహుఁడు.) గోపతి...కాపు, గోపతిహయవాటి=రుద్రభూమియొక్క, కాపు=పాలనము, భజన...తరసాదులన్-భజనపరులు, బహుళ=అనేకులు, అనూత్న = పూర్వులైన, తరసాదులన్= మాంసాశనులను, (తనకు తగినవారనుట.) గణింపక, అక్షతమనోజ!-అక్షత = దృఢమైన, మనః = మనస్సునందు, అజ=ఈశ్వరుఁడుగలవాఁడా! (సంబుద్ధి) 'అజావిష్ణుహరచ్ఛాగాః' అ.) వాతిపాతికలు, ఆత్తరీతిచేత, నానానువీతులన్; నానా, అను =

ప్రాణములతోడ, వీతుల(న్)=ఎడఁబాసినవారిని(శవములననుట.) సంతత...విభవుఁడు-సంతతమునన్, వశీకృతములైన, అక్ష=ఇంద్రియములుగల, తజ్జ్ఞునియందు (విశ్వామిత్రునియం దనుట.) అతివినిహిత=ఉంపఁబడిన, అనంత=అమితమైన, విభవుఁడు=ద్రవ్యము గలవాఁడు, ('అర్థరై విభవా అపి' అ.) అతఁడు=హారిశ్చంద్రుఁడు.

నల. అయ్యవ...గ్రామణీ-అ, అవదాత=పరిశుద్ధులైన, ('అవదాతస్సితేపీతేవిశుద్ధేవిదితేఽపిచ. వైజ.) మాహాకుల, (మహాకులసంభవులయం దనుట.) ఇట "మహాకులాదఞ్‌ఖఞౌ" అనువ్యా. సూ. చేత నీమహాకులశబ్దమునఁ భావార్థమున అఞ్ ప్రత్యయము విధింపఁబడినది, గ్రామణీ=శ్రేష్ఠుఁడు, గోపతి=భూపతి (ఋతుపర్ణుఁడనుట.) ('గౌరిలాకుంభినీక్షమా'అ.) హయవాటికొల్పు=అశ్వశాలాధిపత్యము, భజనపరబహుళానూత్నతరువైన, సాదులన్=సాహిణులను('అశ్వారోహాస్తుసాదినః')గణింపక, అక్షతమనో...వీతుల(న్) అక్షతమైన, మనోజవమును, అతిపాతి=అతిక్రమించుచుండెడు, కళా=వేగకళను, ఆత్త=పొందిన, రీతిగల, నానావిధములైన, సువీతులన్=ఉత్తమాశ్వములను ('ఘోటకేవీతితురగ', అ). సంతత...విభవుఁడు - సంతత=ఎల్లపుడు, వశీకృతములైన, అక్షక=పాసికలుగల, తద్జ్ఞాతి=ఆదాయాదివానియందు (పుష్కరునియం దనుట.) వినిహిత=ఉంపఁబడిన, అనంత=భూసంబంధమైన, విభవుఁడు=వైభవము గలవాఁడు. అతఁడు=అనలుఁడు.

సీ. శూలశయాభీలశూరదుర్వారంబు
భూరిమాయుగతి ప్రభూషితంబు
రాజితనానాస్థిరాజిపరికరంబు
నవతరసాతినంద ద్ద్విజంబు
ఘననాట్యభూతాళికారవవాచాల
మధికరక్తాశ్మదీప్తాజిరంబు
ప్రాజ్యధూమనిరంతచితానలవితాన
మనవధి కార్తస్వరాభిపూర్ణ
గీ. మలఘుభూతి యగణ్యాపుణ్యాజనపాళి
కానమసనంబ రోధ్యద్ధ్వాన్యానమాన
మంత్రికృత్యాస్పద మనూనమానసాబ్జ
గుంభితాశ్చర్యుఁడై కనుంగొనుచు వచ్చి. 6

టీక. హారి. శూల...ర్వారంబు-శూల=కొఱ్ఱులయందు, శయ=పడియుండెడు, ఆభీల=భయంకరులైన, శూరులచేత, (కార్తివీరులచేననుట.) దుర్వారమైనది, భూరి...షితంబు-భూరిమాయు=నక్కలయొక్క,('స్త్రియాంశివాభూరిమాయుః'అ.)గతులచేత

ప్రభూషితము. రాజిత...కరంబు-రాజితమై, నానావిధములైన, అస్థిరాజి = అస్థి పరంపరలయొక్క, ('కీకసంకుల్య మస్థిచ' అ.) పరికరములుగలది, నవ...ద్విజంబు - నవతరస=పచ్చిమాంసముచేత, అతినందత్ = మిగులసంతోషించుచున్న; ద్విజంబు = పక్షులుగలది, ('దంతవిప్రాండజాద్విజాః' అ.) ఘన...వాచాలము-ఘనమైన; నాట్యముగల, భూతాళికా=భూతపంక్తియొక్క, రవముచేత, వాచాలము=గర్జితధ్వనిగలది, ('వాచాలో బహుగర్హ్యవాక్') అధిక...జిరంబు-అధికమైన, రక్తముగల; అశ్మ = పాషాణముల(వధ్యశిలల)చేత, దీప్తమైన, అజిరంబు=అంగణప్రదేశముగలది, ప్రాజ్య...వితానము-ప్రాజ్య=ప్రచురమైన, ధూమముచేత, నిరంతర=నిరంధ్రమైన, చితానల = చిత్యగ్నియొక్క; ('చితాచిత్యాచితిస్త్రియామ్' అ.) వితానముగలది; అన...పూర్ణము-అనవధికమైన ఆర్తస్వరములచేత, అభిపూర్ణము, అలఘుభూతి, అలఘువైన; భూతి = భస్మముగలది, అగణ్య...పాళిక(న్)-అగణ్యమైన, పుణ్యజనపాళిక(న్)= రాక్షసపంక్తికి, (బ్రహ్మరాక్షసు లనుట.) ఆస=ఆశ్రయమైనది, మసనంబు = శ్మశానము, అయోధ్యా...స్పదము-అయోధ్యమైన, ధైర్యముచేత, అసమానులైన; మంత్రి= మంత్రగాండ్రయొక్క, కృత్యములకు, ఆస్పదమయినది.

నల. శూల...దుర్వారంబు-శూలశయ=శూలపాణివలె, అభీల=భయంకరులైన, శూరులచేత, దుర్వారమైనది, భూరి...భూషితంబు-భూరి = అధికమైన; మా=సంపదతో, యుక్ = కూడినవారిచేత, అతిప్రభూషితంబు; రాజిత...కరంబు-రాజితములైన, నానా, స్థిరములైన, ఆజిపరికరంబు=యుద్ధసాధనములుగలది, నవ...ద్విజంబు- నవతరములైన; సాతి=దానములచేత, ('సాతి ర్దానావసానయోః' అ.) సీ. [నాశమాటయు సాతి నాశమునకుఁగడపల యనుటకు నీగి కలదుఁబేరు. (ఆంధ్ర అమరనిఘంటువు.)] నందత్=సంతోషించుచున్న, ద్విజంబు=బ్రాహ్మణులుగలది, ఘన...వాచాలము-ఘనమైన, నాట్యభూ=రంగస్థలమందలి, తాళికారవ=తాళధ్వనులచేత, వాచాలమయినది, అధిక...జిరంబు-అధికములైన, రక్తాశ్మ=కెంపులచేత, దీప్తమైన, అజిరంబు= ముంగిటిప్రదేశముగలది, ప్రాజ్య...వితానము-ప్ర = ప్రకృష్టమైన, ఆజ్యధూమముల చేత, నిరంత=ఎడతెగకయుండునట్లు, రచితమైన, అనలముగల, వితానము=యజ్ఞములుగలది, ('క్రతువిస్తారయో రస్త్రీ వితానం త్రిషుతుచ్ఛకే'అ.) అన...పూర్ణము- అనవధి = అపరిమితమైన, కార్తస్వర=సువర్ణముచేత, ('రుక్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదోఽస్త్రియామ్'అ.) అభిపూర్ణమైన, అలఘువైన,భూతి=ఐశ్వర్యముగలది, అగణ్య...సమసనంబు-అగణ్యమైన, పుణ్యజనపాళికయొక్క, సమసనంబు=ఏకత్రావసానముగలది. ('సంక్షేపణంసమసనం' అ.) ధైర్యా...స్పదము-ధైర్యమునందు, అసమానులైన, మంత్రి=ప్రధానులకును, కృతి=కుశలురకును, ఆస్పదంబు=ఆవాసమైనది. అయోధ్య! ఇటస్త్రీలింగమైన యయోధ్యాశబ్దమునకుఁ బుంలింగ విశేషణములఁ గూర్చినందుకు లక్షణము:—

క. చెలువపేరుగాని స్త్రీలింగములకు వి
శేషణములుగా రచించుపదము
లొక్క రూపమూని యుభయలింగత నెల్లు
నుల్కయున్న యుల్కయున్నమనఁగ. కవిలోకచింతామణి.

క. ధృతమండలాగ్రధారా
గతిశిక్షాపాత్రవివిధగంధర్వసమా
తతవాసవాటికాసు
స్థితుఁడై జగతీతలేంద్రశేఖరుఁ డచటన్. 7

టీక. హారి. ధృత...సుస్థితుఁడు-ధృతమైన, మండలాగ్ర = ఖడ్గముయొక్క, ధారా=ధారలయొక్క, గతిచేత, (కత్తివాదరతోడ్పాటుచేత ననుట.) శిక్షా=శిక్షానామాంగమునకు, ('శిక్షావ్యాకరణం ఛందోనిరుక్తం జ్యోతిషంతథా, కల్పశ్చేతి వ్యాహృతాని వేదాంగానిమనీషిభిః'.) పాత్ర=ఉనికిపట్టయి, వివిధములైన, గంధర్వ=గుఱ్ఱములు గలవానియొక్క, (వేదాశ్వునియొక్క యనుట.) సమాతతమైన, వాసవాటికా=నివాసప్రదేశమందు, సుస్థితుఁడు, ఐ, రుద్రవాటికయందు నిలిచినవాఁడై యనుట.)

నల. ధృత...సుస్థితుఁడు-ధృత=ధరింపఁబడిన, మండల=భూమండలము గలవానియొక్క, (మండలాధిపతియైన ఋతుపర్ణునియొక్క యనుట.) అగ్ర=శ్రేష్ఠములైన, ధారా=పంచధారాగతులయొక్క, శిక్షకు, పాత్రములైన,వివిధగంధర్వములు (అశ్వములుగల, సమాతతవాసముయొక్క, వాటికయందు, (అశ్వవాటికయం దనుట.) సుస్థితుఁడు ఐ.

గీ. పనిగొనియెఁ గ్రౌర్యచాంచల్యభరముగర్వ
ములఁ దగినవానిఁ బరమనశ్చలన హేతు
భూతములఁ బంపు సేయకపోయిన నద
లించికొనుచు లోనైన లాలించికొనుచు. 8

టీక. హారి. క్రౌర్య...గర్వములన్-క్రౌర్యచాంచల్యములయొక్క, భరము = అతిశయముయొక్క, గర్వములచేత,తగినవానిని, ఒప్పెడువానిని, పర...భూతములన్=పరమనశ్చలనహేతువైన; భూతములన్=దయ్యములను.

నల. క్రౌర్య...గర్వములన్-క్రౌర్యచాంచల్యభరమును, ముక్=విడిచిన, అశ్వములన్=గుఱ్ఱములను, తగినవానిన్, పర...భూతములన్-పర=శత్రువులయొక్క, మనశ్చలనమునకు,హేతుభూతములన్=హేతువైనవానిని, (పనిగొనియె నని యన్వయము.)

1 యుక్తిను.

ఉ. ఈగతి నేర్పు మీఱఁ దనయేలికకున్ హితమాచరించుచున్
సాగరమేఖలావలయశాసనుఁ డాత్మకులాంగనావియో
గాగతశోకవారిధికి నంతము గానక యుండె శర్వరీ
జాగరణారుణాక్షి జలజద్యుతిసూచితరాగరాశియై. 9

టీక. రెంటను సమానము.

క. ఆసార్వభౌమసతియుధ
రాసురపతి యింటఁ దజ్జరఠ మెచ్చఁబనుల్
వాసి నొనర్చుచుఁ బ్రియుచిం
తాసంతాపంబుతో దినంబులు గడపెన్. 10

టీక. హారి. ఆసార్వభౌమసతియున్ = అచంద్రమతియు, ధరాసురపతి యింటన్=కౌలకౌశికుని యింటియందు, తజ్జరఠ=ముసలి పెండ్లము.

నల. ఆసార్వభౌమసతియు=దమయంతియు, ధరాసురపతియింటన్= భూదేవేంద్రుఁడగు సుబాహునియింటియందు, తజ్జరఠ=ఆ రాజమాత.

గీ. అపుడు భీముఁ డక్షయప్రభావాప్తి న
క్షత్రగురుఁడు మనసు జాలి నంద
నావిభుండు నతని దేవియుఁ గడ లేని
వగలఁ దగిలి మిగుల నొగుల వగచి. 11

టీక. హారి. భీముఁడు=భయంకరుఁడు, అక్షయప్రభావాప్తి-అక్షయమయిన, ప్రభావముయొక్క, ఆప్తి=ప్రాప్తిగలవాఁడు; నక్షత్రగురుడు = విశ్వామిత్రుఁడు జాలిన్, అందఁగా, ఆవిభుఁడున్=ఆహరిశ్చంద్రుఁడును, ఆతనిదేవియున్ = చంద్రమతియు, మిగులన్ నొగులన్=నొగులుటకు, వగచి=తలఁచి, 'వగచి' యనుపదమునకుఁ 'దలఁచి' యనునర్థముఁ జెప్పినందులకుఁ బూర్వప్రయోగము—

"క. నావచనమున నపత్యముఁ
గావించును గొంతి నీకుఁ గడు నెయ్యముతో
నీవగచినయీయర్థము
నూవె మనంబునను దలఁతు సొలయక యేనున్", భారతము. ఆది. ఆ. 5.

నల. భీముఁడు=భీమభూపతి, అక్షయప్రభయొక్క, అవాప్తిచేత, నక్షత్రగురుఁడు=నక్షత్రరాజైనచంద్రుఁడు ('బృహస్పతావుపాధ్యాయే పితృరాజ్ఞోః పితామహే, మాతామహే మాతులేచతత్పత్నీషుగురుస్స్మృతః' లింగాభట్టీయము)నందనావిభుఁడున్=అల్లుఁడును, ఆతనిదేవియున్=దమయంతియు, నొగులఁగా,వగచి=కలతపడి.

మ. అతిసౌహార్దనిధిన్ సుదేవవినుతాఖ్యాశాలికల్యాత్మకున్
క్షితిదేవోత్తముఁ జేరఁగాఁ బిలిచి యక్షీణాఖిలోపాయధు
ర్యతఁ గానంబడఁ జేయు మెట్లయిన సత్యాచారధన్యాగ్రస
న్నుతి మన్ముఖ్యసుతావతంసమణి నన్యూనప్రభావోదయా. 12

టీ. హరి. సుదేవ...శాలి(న్)-సు=లెస్సైన, దేవ=దేవతలయొక్క, (యమేంద్రుల యొక్కయనుట.) వినుతమైన, ఆఖ్యా=పేరుచేత, శాలి=ఒప్పెడువానిని, (లోహితాశ్వు ననుట.) కల్యాత్మకున్=కలిస్వభావుని, కానన్=అడవియందు, సత్యా...మణిన్-సత్యాచార=ధన్యులయందు; అగ్రసన్నుతిమత్=అగ్రనుతిగల, ముఖ్యునియొక్క, (హరిశ్చంద్రునియొక్క యనుట.) సుతావతంసమణిని; (లోహితు ననుట.) అడవి యందుఁ బడఁజేయుమని పూర్వమున కన్వయము.)

నల. సుదేవ...కల్యాత్మకున్-సుదేవుఁడను, వినుత=ప్రసిద్ధమయిన, ఆఖ్యా=పేరుచేత, శాలి = ఒప్పెడు, కల్య = మనోహరమైన, ('కల్యాసజ్జనిరామయా'అ.) ఆత్మకున్=హృదయముగలవానిని, క్షితిదేవోత్తమున్ = బ్రాహ్మణుని, కానంబడన్ = అగపడునట్లుగా, సత్య...సన్నుతి - సతి = పతివ్రితలయొక్క, ఆచారముచేత, ధన్యులైనవారలలో, అగ్ర=మొదటిదైన, సన్నుతి=స్తుతిగలది, (ప్రతివ్రతలయందు మొదల నెన్నఁదగిన దనుట.) మన్ముఖ్య...మణిన్-మత్ = నాయొక్క, ముఖ్యసుతావతంస మణిన్ = ముఖ్యకుమారికామణిని, (దమయంతి ననుట.)

సీ. అనుచు నంచిన నాథరామరాగ్రణి వడి
నిక్కువ లరయుచు నేఁగి యొక్క
యెడ హోమవిధసమాహితవృత్తిఁ బూని య
నాహతగతి భూతనాథ భూతి
హరిసుబాహునియవరోధము భజించి
సుప్రీతి నందురాచూలిఁ గని ని
తాంతసంభ్రమమునఁ దల్లి నీ విచటఁ బా
యక యుండఁ గత మేమి యకట యిష్ట
గీ. ఘటనకుశలతావహానంబు గట్టిపెట్టి
యనుచు మన్యువేగంబున నడువ నతని
నిజపితృమహాహితునిఁ జూచి నృపతిలోక
వాసవుని పట్టి మనమున వగపు పుట్టి. 13

టీక. హరి. అథ రామరాగ్రణి=ఆ కౌలకౌశికుఁడు, ఇక్కువలు, అరయుచు; (ఉపాయములు యోచించుచు ననుట.) ఒక్కయెడన్=ఒక్క సమయమున, హోమవిధి...వృత్తిన్-హోమవిధియందలి, సమాహితవృత్తిని, పూని, అనాహతగతిన్=అప్రతిహతగతిచేత, భూతి...బాహుని- భూతనాథభూ=రుద్రభూమియొక్క, ఊతి=రక్షణముచేత, ''ఊతి స్స్యూతౌ చ రక్షణే' రత్నమాలా.) హరి=ఒప్పెడు, సుబాహుని=లెస్సైన బాహువులు గలవానియొక్క, (రుద్రభూభరణశాలిభుజాదండుఁడగు హరిశ్చంద్రునియొక్క యనుట.) అవరోధమున్=అంతఃపురస్త్రీని, (చంద్రమతి ననుట.) భజించి, (సుప్రీ....చూలిన్, సుప్రీతినందు=ఇష్టమునందెడు, రాచూలిన్=రాకొమరుఁడగు లోహితుని. తల్లిని; ఈవు, ఇష్ట...వహనంబున్-ఇష్ట=హోమముయొక్క; ఘటనకు, కుశలతా=దర్భలతలయొక్క, ఆవహనంబున్=తెచ్చుటను; మన్యువేగంబునన్=కోపవేగముచేత; ('మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి' అ) అడువన్=కొట్టఁగా, అతనిని=ఆ కౌలకౌశికుని, జపితృమహాహితుని, జపితృ=విశ్వామిత్రర్షి, మహాహితునిన్, అత్యంతహితుఁడైనవాని, (లేక. అతని=ఆ కౌలకౌశికుని, నిజ...హితునిన్-నిజపితృ=తనతండ్రియగు హరిశ్చంద్రునికి మహా. అహితుని=అత్యంత విరోధియగువానిని,) నృపతిలోకవాసవునిపట్టి = లోహితుడు.

నల. అథ రామరాగ్రణి = అసుదేవుఁడను విప్రుఁడు, ఇక్కువలు=సెలవులు అరయుచున్=విచారించుచు, హోమ...వృత్తిన్ - హోమవిధియందలి, సమాహిత వృత్తిన్ = సావధానవృత్తిని, పూని, అనాహతగతిన్ = అడ్డగింపులేనిగమనముచేత. భూత...రోధము(న్)-భూతనాథ = సదాశివునియొక్క, భూతి = ఐశ్వర్యమువంటి యైశ్వర్యముచేత, హరి = ఒప్పెడు, సుబాహుని = సుబాహుఁడను రాజుయొక్క, అవరోధము(న్)=అంతఃపురమును, భజించి = ప్రవేశించి, అందు(న్)=ఆయంతఃపురమునందు, రాచూలి=దమయంతి, తల్లి! సంబుద్ధి. ఇష్ట...వహనంబున్-ఇష్ట=ప్రియుని యొక్క, ఘటనమందలి, కుశలతా=కౌశలముయొక్క, వహనమును, మన్యువేగంబునన్= దైన్యవేగముచేత, అడువన్ = అడుగఁగా, నిజపితృ...హితునిన్-నిజపితృ = తన తండ్రికి, మహాహితుఁడైనవాని, నృపతిలోకవాసవుని పట్టి = దమయంతి.

క. తనవగఁ దెలుపఁగ విని య
మ్మనుజేశ్వరభవుని జనని మానసము వినూ
తనతరకరుణార్ణవమున
మునుఁగఁగ నిట్లను నితాంతమోహాన్వితయై. 14

టీక. హరి. తనవగ=తనదుఃఖమును, అమ్మనుజేశ్వరభవునిజనని=ఆ రాజకుమారుని తల్లి, (చంద్రమతియనుట.) కరుణార్ణవమునన్=దైన్యరససముద్రమున ('కరుణ స్త్వరసే వృక్షే కృపాయాం కరుణామతా' విశ్వము.)

నల. తనవగ=తనవిధము, అమ్మనుజేశ్వరభవునిజనని = ఆరాజపరమేశ్వరునితల్లి, కరుణార్ణవమునఁ=దయాసముద్రమునందు.

క. పుట్టక పుట్టిన ముద్దుల, పట్టీ నీ విట్టివగలపాలై పోఁగలఁ
గట్టిఁడిదైవం బేమని, కట్టడ గావించె నెట్టు గనలుదు నింకన్. 15

టీక. రెంటను సమము.

గీ. అవరజనని నైతి నారయ నీకు నేఁ
బట్టి సుమతి! గురునిభవనమునకుఁ
జనియె దే యటంచుఁ జాలఁ గౌఁగిట నొత్తి
ప్రబలరక్షఁ గూర్చి పంపుటయును. 16

టీక. హరి. ఆవరజననిన్ = వరజననిని, కానైతిని, (నీకుఁదల్లినిగానైతి ననుట.) సుమ...నిభ—సుమతి, గురు = బృహస్పతికి, నిభ = సమానమైనవాఁడా! ప్రబల రక్షన్=ప్రబలమైనరక్షను, కూర్చి=కట్టి.

నల. అవరజననిన్=పినతల్లిని, ఐతిని, సుమతి! సంబుద్ధి. గురునిభవనమునకున్= తండ్రియింటికి, ప్రబలరక్షన్=అధికమైన సేనారక్షను, కూర్చి.

క. తన కగ్రజాతిసంభవు
లనుపమగతిఁ దోడునీడ లై రా ధృతిఁ గై
కొని చనుచు నటవి జనకా
ననము నిరీక్షించుతమి మనంబునఁ బొదలన్. 17

టీక. హరి. అగ్రజాతిసంభవులు=విప్రకుమారులు, విజనకాననము(న్)=నిర్జనారణ్యమును.

నల. అగ్రజాతిసంభవులు-అగ్ర=శ్రేష్ఠులైన, జాతిసంభవులు (యోగ్యులనుట.) జనకాననము(న్) తండ్రియొక్క, ఆననమును.

సీ. బలితంపుగొమ్మలఁ బ్రబలినసాలంబు
లబ్జబాంధవుమార్గ మాక్రమింప
నవయవసరసస్థావములఁ బెంపొందు
మృగవిశాలేక్షణల్ పగటు సూప
ఘనరూఢి నపహరించునుదారభూదార
సంతతు లిక్కుర్తుల నందడింప
గాలదండాభము ల్గరములు నెఱపు నా
గేంద్రంబు లగకోటి యేపుమాపఁ

గీ. బృథివిఁ బొగడొందుభీమభూభృత్కటకము
గాన విరుతవాచాలది క్తటము సేరి
యావసుమతీతలేంద్ర బాలావతంస
మచట నుచితప్రచారంబు లాచరించి. 18

టీక. హరి. బలితంపుఁ గొమ్మలన్ = గొప్పశాఖలచేత, ప్రబలినసాలంబులు=అతిశయించిన వృక్షములు, నవ... శాద్వలములన్-నవమైన, యవస=తృణముయొక్క, ('యవసస్తృణమర్జునమ్' అ.) రససాద్వలములన్=ఆస్వాద్యశాద్వలములచేత, పెంపొందు మృగవిశాలేక్షణల్ = ఒప్పుచుండెడు మృగకాంతలు, ఘనఘూర్ణిక్- ఘన = తుంగముస్తలయొక్క, ఘూర్ణిని, ఉదారభూదారసంతతుల్-ఉదార=ఉద్ధురములైన, భూదారసంతతుల్=వరాహసమూహములు, కీర్తుల(న్)=బురదలయందు; ('కీర్తిః ప్రసాదయశసోర్విస్తారే కర్దమేపిచ' విశ్వ.) కాలదండాభముల్=యమదండసమానములు, గరములు = విషములు, నాగేంద్రంబులు=పెనుబాములు,అగకోటి=వృక్షమండములయొక్క, భీమ... కము-భీమ=భయంకరమైన, భూభృత్ =పర్వతముయొక్క,కటకము=నితంబప్రదేశము గలదానిని, విరుత... క్తటము(న్)-వి=పక్షులయొక్క, రుత = ధ్వనులచేత, వాచాలమైన, దిక్తటములుగలదానిని, కాన = అరణ్యమును, ఆవసుమతీతలేంద్ర, బాలావతంసము = అలోహితుఁడు (కటకముగాన) అనునపుడు కటకశబ్దము చేతనద్వితీయకైన ప్రథమగలది గావున దానిమీఁది 'క' కారము 'గ' కారమైనది.

నల. బలితంపుఁ గొమ్మలన్ = బలితములైన, బురుజులచేత, ప్రబలినట్టి, సాలంబులు=కోటలు, అవ...వములన్ - అవయవములయొక్క; సరససాద్వములచేత, మృగవిశాలేక్షణల్=స్త్రీలు, ఘనఘూర్ణిక్ = మేఘముయొక్క ఘూర్ణిని, అప...సంతతుల్-అపహరించునట్టి, ఉదార=దాతృత్వముగల, భూదారసంతతుల్=రాజకుమారులు, కరములు = తుండములు, ('కరములు' ఇందులోని 'క' కారము ప్రథమమీఁదిదిగాన 'గ' కారమైనది.) ఇందులకు లక్షణము.—

"క. ప్రథమాంతవిభక్తులపైఁ, గథితములగు కచటతపలు గసడదవలగున్
బృథివిని గజడదబలగుం, బ్రథమపునున్నలగు నాంతపదములమీఁదన్".

నాగేంద్రంబులు=గజములు, అగకోటి దేపుల్=పర్వతముల గర్వమును, మాపన్ = అణఁపఁగా (మహోన్నతము లనుట), భీమభూభృత్కటకము=భీమభూపాలుని పట్టణమును ('కటకం వలయే సానౌ రాజధానినితంబయోః' ని.), గానవి... క్తటము-గాన విరుత=గానధ్వనిచేత, వాచాలమైన, దిక్తటము గలదానిని, ఆవసుమతీంద్రబాలావతంసము = ఆదమయంతి.

క. మానక పు డాకు లాకులు
మానసగతి యగుచు నాత్మ మలినార్ధపటిన్
దా నలసత్కుశలతలన్
బూని యరయు చుండె నంగముల నడ లెసఁగన్. 19

టీక. హారి. ఆకులు, ఆకులమానసగతి = ఆకులమైన, మనోగతికలవాఁడు, అగుచు, తాను, అలసత్కుశలతలన్ - అల=ఆ, సత్కుశలతలన్=మంచిదర్భలతలను, పూని, అరయుచున్=ఆకులను వెదకుచుండెనని పూర్వమున కన్వయము.

నల. ఆకు...గతి - ఆకులాకుల = మాటిమాటికి వ్యాకులము నొందుచున్న, మానసగతిగలది, అగుచు, నలసత్కుశలతలన్=నలునియొక్క మంచి క్షేమములను.

సీ. ఆవేళ నాశుచిభావసవిత నవ
నాకరాజ్యాకల నైకధీరుఁ
డలఘుపర్ణాదగోత్రాంచితుఁ గుండలి
గణములో విఖ్యాతిఁ గనినభవ్య
తరు మహాతక్షుఁ దగఁ బిల్చి పావన
వ్రతకులోత్తమ చక్రవర్తి దార
కునికిఁ గాన నవాస ఘనదీనదశ యయ్యో
నాబాలవరుని నీ వరసికొనుచుఁ

గీ. జను మటవిఁ గాంత హితధర్మజననిఁ బాసి
నట్టి ముగ్ధుం డవాచ్యోక్తి యార్వఁ డనిన
నయ్యెడ దురుత్తరోక్తి యానతని నెఱిఁగి
వేగ రమ్మన లసమానవృత్తి మెఱయ. 20

టీక. హారి. ఆవేళన్, ఆ, శుచిభావసవిత-శుచిభావ=శుచిత్వమందు, సవిత=సూర్యుడైనవాఁడు, నవ...ధీరుఁడు - నవనాకరాజ్య=నూతనస్వర్గరాజ్యముయొక్క, ఆకలన=సృజనమందు, ఏకధీరుఁడైనవాఁడు, (విశ్వామిత్రుఁడనుట.) అలఘు...చితున్-అలఘుఁడైన, పర్ణాద = ఋషియొక్క, (కశ్యపునియొక్క యనుట.) గోత్రముచేత, అంచితుఁడైనవాని, కుండలిగణములో=సర్పసమూహములో, విఖ్యాతి, (ఈశబ్దముచేతనద్వితీయకు వచ్చినప్రథమ.) కనినభవ్యతరున్-కనిన=కాంచిన, భవ్యతరు(న్), మహాతక్షకున్ = (తక్షకుఁడను సర్పముననుట.) పావన... త్తమ-పావనవ్రత=పవనవ్రతసంబంధమైన కులమందు, పవనాశనులగు సర్పములయొక్క కులమునం దనుట.) ఉత్తమ = శ్రేష్ఠుఁడైన వాఁడా! సంబుద్ధి. చక్రవర్తిదారకునికిన్ = హారిశ్చంద్రనందనునికి ('దారకోనంద

నోర్భకః' ధనం.) కాంత ...జననిన్ - కాంత=ఒప్పుచున్న, హితమైన, ధర్మముగల, జననిన్=తల్లిని, ముగ్ధుండు=సౌందర్యవంతుఁడైన లోహితుఁడు, అవాచ్యక్రియార్హుఁడు= అవాచ్యమైన, క్రియకు (మరణమునకనుట), అర్హుఁడు; అనినన్, దురుత్తరోక్తి-దురుత్తర = దాఁటశక్యముగాని, ఉక్తి = వాక్యములు గలవాఁడు, ఔ, అతనిన్ = ఆ విశ్వామిత్రుని, వే= వేగముగా, గరము=విషము.

నల. ఆ వేళన్, అశుచిభావపవిత-శుచిభావ=పరిశుద్ధ హృదయురాలైన దమయంతి యొక్కయనుట. ఇది నిడుపు లుడుపఁ జెప్పఁగువచ్చి. సవిత=తండ్రి; (భీముఁడనుట.) నవ...ధీరుఁడు-నవన=స్తోత్రమునకు, అర్హమైన, ఆజి=యుద్ధముయొక్క; అకలనమందు, ఏకధీరుఁడైనవాఁడు, అలఘు...గోత్రాంచితున్-అలఘువైన; పర్ణాదుఁడనెడు, గోత్ర=పేరుచేత, అంచితున్ = ఒప్పుచుండెడువానిని, కుండలిగణములోన్ = సోమయాజిసంఘములో, విఖ్యాతిగనిన్=విఖ్యాతినిధియైనవాని, అభవ్యకు...తక్షకున్-అభవ్య=అశుభములనెడు, తరు=వృక్షములకు, మహాతక్షకున్ = ఛేదకుఁడైనవాని, పావనవ్రితకులోత్తమ! సంబుద్ధి. చక్రవర్తిదారకు=నలునిభార్యకు, ఉనికిఁగానదు = నిలుకడను గానను (ఆయమ బ్రతుకునట్టు లేదనుట.) అవాస=వస్త్రహీనురాలైనది, ఘనదీనదశ=అధికమైన దీనదశగలది, ఆర్యున్! (ఏకవస్త్రముతో మిక్కిలి దీనురాలైనదనుట.) అబాలవయనిన్=ఆదమయంతి భర్తయగు నలుని, అటవిన్ = అడవియందు, హితధర్మజననిన్ - హితధర్మమునకు, జననిన్ = కారణమైనదానిని, ముగ్ధుండు= మూఢుఁడు, ('ముగ్ధసుందరమూఢయోః' ఇతి విశ్వః.) అవాచ్యక్రియకర్హుఁడు, పచింపయోగ్యుఁడు గాఁడు, అనినన్=ఇట్లని నీవుసెప్పఁగా, దురుత్తరోక్తి=దుష్టమైన ప్రత్యుత్తరోక్తిగలవాఁడు, వినయుతనినిఎఱిఁగి= తెలిసికొని, వేగ, రమ్మనన్ = రమ్మనఁగా, అసమానవృత్తి, మెఱయన్=ప్రకాశింపఁగా.

చ. అనవధికోపకారి యతఁ డారయుచున్ గహనప్రదేశముల్
సని సరసర్తుపర్ణవిలసన్నగరాజిరసన్నుతంబులై
తనరు వినూత్నపత్రసముదాయములన్ భరియించుచొక్కక్రే
వనెసఁగువాని నక్కుఱుచవానిఁ గ్రమంబునఁ జేరఁ బోవుచున్. 21

టీక. హరి. అన...కారి-అనవధి=మితిలేని, కోపమును. కారి=చేసెడువాఁడు, అతఁడు=ఆతక్షకుఁడు, గహనప్రదేశముల్=కొనస్థలములను, ఆరయుచున్=వెదకుచును, చని=పోయి, సరస...రసన్-సరసమైన, ఋతువుగల, (కోయఁబక్వములైన యనుట.) పర్ణ=ఆకులచేత, విలసత్=ఒప్పుచుండెడు, నగ=వృక్షములయొక్క, రాజి= పంక్తులుగల, రసన్=భూమియందు, వినూ...యములన్ - వినూతనములైన, పత్ర= ఆకులయొక్క, సముదాయములన్, భరించుచు=వహించుచు, కుఱుచవానిన్=పిన్నవానిని, (లోహితు ననుట.)

నల. అనవ... కారి-అనవధికముగునట్టులు, ఉపకారి = ఉపకర్తయైనవాఁడు. అతఁడు=ఆపర్ణాదుఁడు, గహనప్రదేశములన్-గహన = చొరశక్యముకాని, ('కలిలం గహనంసమే' అ.) ప్రదేశములన్=ప్రకృష్టస్థలములను, (ఆరయు ననిపూర్వముతో నన్వయము.) సరస...సన్నుతంబులు-సరసమైన, ఋతుపర్ణుని యొక్క, విలసన్నగర= ఒప్పెడు పట్టణముయొక్క, అజిర = ముంగిటియందు, సన్నుతంబులు, ఐ, తనరు... యములన్-తనరుచుండెడు, వినూత్నములైన, పత్త్ర=గుఱ్ఱములయొక్క, సముదాయము లను, భరించుచు=రక్షించుచు, అక్కటుచవానిన్ = ఆపొట్టివానిని.

క. ఆలోకించి తదుక్తవచోలీలన్ మర్మమంటి సోఁకఁగ నవనిన్
దాలపనదుర్విషహతాత్మలోలాత్మునిఁ జేయ ఘూర్ణిలుచు నచ్చోటన్.

టీక. హరి. తదుక్తవచోలీలన్-తత్ =ఆవిశ్వామిత్రునిచేత, ఉక్తమైన, వచో లీలన్, మర్మమంటి=ఆయుమునుస్పృశించి, అవనిన్=భూమియందు, సోఁకఁగన్=వ్రాలు నట్లుగా, తాఁ(న్)=తాను, (తత్కుఁడనుట.) లపన...లాత్మునిన్-లపన = ముఖము నందలి, దుర్విషముచేత, హతమై, ఆలోల=నిశ్చేష్టితమైన, ఆత్మని=దేహముగలవానిని.

నల. తదుక్తవచోలీలన్. తత్ =ఆఋషియొక్క, ఉక్తవచోలీలను, మర్మము, అంటి=తాఁకి, సోఁకఁగన్=పడునట్లుగా, నవ...లాత్మునిన్-నవ=క్రొత్తలైన, నిందా లపన=నిందావాక్యములయొక్క, దుర్విషహతా = శమింప శక్యముగాకుండుటచేత, లోలాత్మునిన్, చంచలమానసుని, చేయఁగా.

సీ. అతఁడు మోహము గలయంగ నసనత్తి
స్థిరత నిల్చుట దక్కి వరుసవిధివి
పాకసమానశక్తిఁ బలువగ నాటింప
హా యసమాన యమ్మా యటంచు
నుదిరి పడినఁ గాంచి యొగిఁ బఱతెంచి యా
చంద మంతయుఁ దద్ద్విజాతిపృథుకు
లారూఢి గురునకు నాక్షణంబునఁ దెల్ప
నాత్మలోహితు నేగి నబల యెఱిఁగి

గీ. నానిధానంబ ననుఁ బాసి కాన నెచటి
కేఁగి [1]తింక నిద్దన్నార నెట్లు గాంతుఁ
గలికినునుమేనినిను భోగి గాసిపెట్టఁ
దగునె యని చాల మూర్ఛిలి మగుడఁ దెలిసి. 23

1 టీక నిన్నుఁ గన్నార.

టీక. హారి. అతఁడు=ఆలోహితుఁడు, మోహము = మూర్ఛ, కలయఁగన్, అసన్మతిస్థిరత=సన్మతిస్థిరుఁడు కాకుండుటచేత, నిల్పుటఁదక్క, (నిలువలేకయనుట.) వరుస, విధి=దైవము, విపాకసమాసక్తిచేత, పలువగన్=అధికదుఃఖమును, నాటింపన్= (తెచ్చిపెట్టఁగా ననుట.) హా! అసమాన! అమ్మా (సంబోధనలు.) ఊదిరి పడినన్= పడఁగా, తద్ద్విజాతిపృథుకులు=ఆవిప్రకుమారులు, గురునకున్ = కౌలకౌశికునకు, తెల్పన్, ఆత్మయందు, లోహితుసేగి = లోహితునియాపదను; అబల=చంద్రమతి, కలికి...నిను(న్)=కలికియైన, నునుమెయిగలనిన్ను, భోగి=సర్పము.

నల. అతఁడు=ఆనలుఁడు, మోహముగల, అంగన, వచ్చ(న్) = పెనిమిటిని, సవిధి విపాకసమాసక్తిన్, (దైవోపహతుఁడైనవానినసుట.) పలువగన్, నాటింపన్= నాటించుట, అసమా=యశమా ? నయమ్మా=నీతియా ? (కీర్తియో? న్యాయమో ? యనుట) తద్ద్విజాతి=ఆపర్ణాదుఁడను బ్రాహ్మణుఁడు. పృథుకులారూఢి-పృథు=అధిక మైన, కులారూఢిగలవాఁడు, గురునకున్=తండ్రికి, ఆత్మలో, హితుసేగి, ప్రియుని చెఱుపు, అబల=దమయంతి, కలికి=కలిపురుషునకు, నునుమేనినిను = బాగైనశరీరము గలనిన్ను, భోగి(న్)=భోగము గలవానిని.

క. మన మెరియఁగ వనరుచుఁ దను
గొని తెచ్చినవిప్రుఁ గాంచి గుణరత్నమహా
ఖని యార్యపుత్త్ర నరయం
జనవలయుఁ గృపారసంబు సంధింపు మదిన్. 24

టీక. హారి. తనున్, కొని తెచ్చిన=విలిచి తెచ్చిన, విప్రున్ = కౌలకౌశికుని, గుణరత్న మహాఖని! ఆర్య! సంబుద్ధులు.

నల. తనున్=తన్ను, కొని తెచ్చినవిప్రున్ = తోడుకొనివచ్చిన సుదేవుఁ డను బ్రాహ్మణుని, గుణరత్నమహాఖని, సంబుద్ధి. ఆర్యపుత్త్రుని = పెనిమిటిని. (నలు ననుట.) భర్తనార్యపుత్త్రుండనుట నాటకములయందుఁ బ్రసిద్ధము.

చ. అని నతులాచరింప హృదయంబున [1]నింతయు వంతఁ బూనక
మ్మనుచు ద్విజుండు సత్కరుణ మాని మదిన్ వడిఁ ద్రోచి యేఁగెనూ
తనతరసంభ్రమం బెసఁగఁ దత్ప్రమదాజనకోక్తిభంగి ని
ట్లనియె నయోధ్యనేలువసుధాధిపుభార్యమునీడితోన్నతిన్. 25

టీక. హారి. అమ్మనుచు ద్విజుండు = ఆపోషించు బ్రాహ్మణుఁడు (కౌలకౌశికుం డనుట), సత్కరుణ, మాని = విసర్జించి. తత్ప్ర...భంగిన్-తత్ = ఆచంద్రమతి యొక్క, ప్రమద=సంతోషమునకు, అజనక = హేతువుగాని, భంగిన్ = తీరున,

1 నెంత యు.

అయోధ్యకు, ఏలు...భార్యన్ = ఏలెడునట్టిరాజు (హరిశ్చంద్రుని)యొక్క, భార్యను, ముని...న్నతిన్ - మునీడితమైన, ఉన్నతిగలదానిని, ఇట్లనియె నని పూర్వముతో నన్వయము.

నల. వంతన్, పూనకు, అమ్మ అనుచు, సత్కారణము=లెస్సయగు కరుణారసమును, మదిన్ = మనస్సున, ఆని=పానముచేసి, తత్ప్రియ...భంగిన్ - తత్ప్రియదా = ఆ దమయంతియొక్క, జనక=తండ్రియైన భీమునియొక్క, ఉక్తిభంగిని, భార్యమున్, భా=తేజస్సునందు, అర్యమున్ = సూర్యుఁడైనవాని, ముని...న్నతిన్ - ఈడిత= నుతింపఁబడిన, ఉన్నతిగలవానిని, అయోధ్యన్, ఏలు, వసుధాధిపున్ = ఋతుపర్ణుని గూర్చి, ఇట్లనియె నని యన్వయము.

గీ. ఇచటి యావశ్యకక్రియ లెల్ల మట్టు
పఱిచి యోసత్యవాక్ప్రియా! పటురయమునఁ
జను వరాటవిభూపాంతమునకుఁ దగఁద
దాత్మభూస్వయముద్వహానాప్తి కనిన. 26

టీక. హరి. ఓసత్యవాక్ప్రియా! సత్యవాక్ = సత్యవచనముగల హరిశ్చంద్రునకు, ప్రియా=ప్రియురాలవైన యోచంద్రమతీ! సంబుద్ధి. వరా...తమునకున్- వరమైన, అటవిభూ = అరణ్యముయొక్క, ఉపాంతమునకున్ = సమీపమునకు, తదా...ప్తికిన్ - తత్ =ఆ, ఆత్మభూ=కుమారుఁడైన లోహితునియొక్క, స్వయముద్వహానముయొక్క, ఆప్తికిన్, (ఆపుత్రుని నీవు సంరక్షించుటకొఱ కనుట.) ఇట నటవీశబ్దమికారాంతముగఁ బ్రయోగించుటకుఁ బూర్వప్రయోగము.—

క. "అతిసత్వస్థవిరాటవి, తతనగరుచిప్రచారతన్ నుతికెక్కన్
ధృతిసరసి రాముభార్యన్, రతిఁగానక కాంతిభంగ రణతనులీలన్.
(రాఘవపాండవీయము.)

నల. సత్యవాక్ప్రియా = సత్యవచనమే ప్రియముగాఁగలవాఁడా! సంబుద్ధి. వరాటవిభు=భీమునియొక్క, ఉపాంతమునకు, చనుము, తదా...ప్తికిన్-తత్= ఆభీమునియొక్క, ఆత్మభూ=కొమారితయైన దమయంతియొక్క, స్వయముద్వహాన= స్వయంవరముయొక్క, ఆప్తికి,

క. నరపతి ముదితమతిఁ దు
స్తరమోహాతమిస్రమెనసి చంచలనయనా
వరణ మొనర్ప భరంపడి
ధరణీసురకథితవేళఁ దప్పక చనుచోన్. 27

టీక. హారి. నరపతి ముదిత=చంద్రమతి, మోహతమిస్రము = మూర్ఛాంధకారము, చంచల...రణము-చంచలములైన, నయనములయొక్క, ఆవరణము = ఆచ్ఛాదనము, ఒనర్పన్, ధరణీసురకథితవేళన్=కాలకౌశికుఁడు చెప్పిన సమయమునందు.

నల. నరపతి=ఋతుపర్ణుఁడు, ముదితమతిన్ = సంతుష్టమతిచేత, దుస్తర...స్రము-దుస్తరమైన, మోహతమిస్రము = మోహాంధకారము, చంచలనయనావరణము(న్)-చంచలనయనా=దమయంతియొక్క, వరణము=వరించుటను.

చ. అతులితదూరమార్గగమనైకపరిశ్రమశాలిరథ్యసం
    తతిఁ బురికొల్పుచున్ దగ ననంతపథంబుఁ దరింపఁజేసె న
    క్షతబహుదీప్తి వాహుకుఁడు సారథి లీలఁ దనర్చి యాజగ
    ద్ధితురథమున్ ద్విజాతిసముదీరితవాక్కబళీకృతాశుఁడై. 28

టీక. హారి. అతులిత...సంతతిన్ - అనంతపథంబున్ = ఆకాశమార్గమును, అక్షతబహుదీప్తివాహుకుఁడు, అక్షతమైన,బహుదీప్తిని. వాహుకుఁడు=వహించినవాఁడు, సారథి=అనూరుఁడు, ఆజగద్ధితురథము=అనూర్యుని రథమును; ద్విజాతి...తాశుఁడు-ద్విజ=పక్షులచేత, అతిసముదీరిత=మిక్కిలి పలుకఁబడిన, వాక్కులచేత. కబళీకృతమైన, ఆశుఁడు=దిక్కులుకలవాఁడు, ఐ.

నల. అనంతపథంబున్=అపరిమితమైన మార్గమును, అక్షత...వాహుకుఁడు-అక్షతమైన, బహుదీప్తిగలవాఁడు, వాహుకుఁడు=బాహుకుఁడను పేరుగల నలుఁడు, (వబయోరభేదః) సారథిలీలన్=సారథివలెను, ఆజగ...రథమున్-ఆ,జగద్ధితుఁడైన ఋతుపర్ణునియొక్క రథమును, ద్విజాతి...శుఁడై-ద్విజాతి = సుదేవుఁడను బ్రాహ్మణునిచేత, సముదీరిత=చెప్పఁబడిన, వాక్కులచేత, కబళీకృతమైన, ఆశుఁడు=ఆశగలవాఁడు, ఐ, (దమయంతీ పునస్స్వయంవరవార్తచేత నిరాశ నొందినవాఁడై యనుట.)

గీ. అపుడు వికలాంగసారథినిపుణతావి
    భావితశతాంగరయవిజృంభణమువలన
    ననధిగమ్యవినిర్గళితాంశుకుఁ డయి
    యినుఁడు వనరాశిమధ్యంబు నెనయుచుండె. 29

టీక. హారి. వికలాంగ...వలనన్-వికలాంగసారథి=అనూరునియొక్క, నిపుణతచేత, విభావితమైన, శతాంగరయవిజృంభణమువలన, అనధి...శుకుఁడు-అనధిగమ్య = పొందశక్యముగాని, వినిర్గళిత = జాఱిపోయిన, అంశుకుఁడు = కిరణములుగలవాఁడు, అయి, ఇనుఁడు = సూర్యుఁడు, వనరాశిమధ్యంబున్=సముద్రమధ్యమును, ఎనయుచుండెన్=పొందుచుండెను.

నల. అప్పుడు, వికలాంగ...విజృంభణమువలనన్-వి=విగతమైన, కళా=కళగల, అంగములగల సారథియొక్క, (నలునియొక్క యనుట) నిపుణతా = నేర్పుచేత, విభావిత=పొందింపఁబడిన, శతాంగ = రథముయొక్క, రయవిజృంభణమువలన, అనధి...శుకుఁడు-అనధిగమ్య=పొందశక్యము గానట్లు, వినిర్గళితమైన, అంశుకుఁడు = వస్త్రములు గలవాఁడు, ఐ, ఇనుఁడు = ఋతుపర్ణుఁడను రాజు, వనరాశిమధ్యంబునన్=వనసమూహమధ్యమునందు.

సీ. తారకాపథవీథిఁ దనరునాకులు హరి
దద్వైతవిభ్రాంతి నావహింప
నరుణాంశుహరణక్రియాపదాశ్రితమైన
చాయనాఁ బెనుమబ్బుచాయ మెఱయఁ
బ్రతినవపల్లవభవనం బెనయుకొమ్మ
ల నిహతాశావ్యాప్తి నధిగమింప
నాత్మమూలసమాశ్రయాతలస్థితిమైత్రి
నహులు నిర్వ్యథనైకవిహృతి మెఱయ

గీ. నిజనిబిడతానిరాకులనిఖిలఘూక
పటలపటుహుంక్రియారబ్ధపథికలోక
తర్జనము మహాధ్వాంత మంతయును నలమి
కొని యొనరె భూతవాస మత్యుద్రగరిమ. 30

టీక. హరి. ...నాకులు=దేవతలు, హరి...భ్రాంతిన్-హరిత్=దిక్కులయొక్క, అద్వైత=ఐక్యమందలి, విభ్రాంతిన్=భ్రమను ఆవహింపన్ = సంపాదింపఁగా, అరుణాంశు...శ్రిత-అరుణాంశు=సూర్యునియొక్క, హరణక్రియచేత, ఆపత్=ఆపదను, ఆశ్రిత=పొందినది, ఐన చాయనాన్=ఛాయాదేవియనునట్టుగా, పెనుమబ్బుచాయ = నైల్యము, ప్రతి...భవనంబు(న్)-ప్రతినవ=నూతనములైన, పల్లవ=విటులయొక్క, భవనంబు(న్)=గృహములను, జాత్యేకవచనము, కొమ్మలు=స్త్రీలు, అని...వ్యాప్తిన్-అనిహత=అప్రతిహతములైన, ఆశా=కోరికలయొక్క,వ్యాప్తిని, ఆత్మ...మైత్రిన్-ఆత్మ=తమకు, మూలసమాశ్రయ=మూలాధారమైన, అతల = పాతాళమందలి, స్థితివల్లనైన, మైత్రిచేత, (ఏకత్రావస్థాన మైత్రిచేతననుట.) అహులు=సర్పములు,నిర్వ్య...విహృతి-నిర్వ్యథ=వ్యథారహితమైన, నైకవిహృతి = అనేకవిహారములను, మహాధ్వాంతము = చీఁకటి, భూతవాసము=భూతములకు నివాసమైనది.

నల. తారకాపథవీథిన్=ఆకాశవీథియందు, తనరునాకులు=ఒప్పెడుపర్ణములు,హరిత్=పచ్చఁదనముయొక్క, అద్వైత=అభేదముయొక్క,విభ్రాంతిన్,ఆవహింపన్=

సంపాదింపఁగా, (అభ్రంకషములైన యాకులుగలిగినదనుట.) అరుణాంశు...శ్రిత - అరుణాంశు = సూర్యకిరణములయొక్క. హరణక్రియచేత. పదాశ్రిత=పాదముల వ్రాలినది, ఐన, ఛాయనాన్=ఛాయాసాదేవియనఁగా, పెనుమబ్బుచాయ=పెనుమబ్బుగల నీడ, ప్రతి...భవనంబు-ప్రతినవ = నూతనమైన, పల్లవ = చిగురుటాకులయొక్క, భవనంబు=పుట్టువును, ఎనయుకొమ్మలు=...శాఖలు, అని...వ్యాప్తిన్ - అనిహత= అప్రతిహతమైన, ఆకాశవ్యాప్తిన్=దిగ్వ్యాప్తిని. ఆత్మ...మైత్రిన్-ఆత్మ = తన యొక్క, మూల=వేళ్లకు, సమాశ్రయమైన, అతల=పాతాళమునందలి, స్థితివల్లనైన, మైత్రిచేత, అహులు = సర్పములు, నిర్వ్యథ...విహృతిన్-నిర్వ్యథన=రంధ్రముల యందలి, ఏకవిహృతి(న్) = ముఖ్యవిహారమును, మహాధ్వాంతము = మహామార్గాంత మును. భూతవాసము=తాండ్రచెట్టు-కర్త ('భూతావాసః కలిద్రుమః' అ.)

గీ. అందు దఱియంగఁ జనుదెంచి యపుడపర్ణ
గణనఁ గనునాపరమధీరమణి విచిత్ర
గతి నిరీక్షించి ఘోరాహికలితవికృతి
రాజసంతతి దైన్య మేర్పడఁగఁ బలికె. 31

టీక. హరి. అందు=ఆచీఁకటియందు, అపర్ణగణనన్, అపర్ణ=పార్వతియొక్క, గణనన్=ప్రసిద్ధివంటిప్రసిద్ధిని, కను...మణి. కను=వహించిన, ఆ, పరమధీ=ఉత్కృష్ట బుద్ధిగల, రమణీ=చంద్రమతి. ఘోరాహికలితవికృతి(న్), ఘోరాహిచేత,కలితమైన, వికృతిగలవాని, రాజసంతతి (న్)=రాచపట్టియగు లోహితుని, ఇటఁ 'బరమధీ' యను సమస్తపదమున 'ధీ' యను శబ్దము మీఁది దీర్ఘము హ్రస్వముగాక నిలిచినది. ఏకాక్షరశబ్దము లిట్లు నిలుచును. ఇందుకు లక్షణము,—

"క. స్త్రీలింగంబులనిడుపులు, వాలాయము నడుపఁ దెనుఁగువచనములగు నం
దాలోలశ్రీధీహ్రీ. స్త్రీలనులపితములుదక్కఁ జిక్కనవల్లన్."

(కావ్యాలంకారచూడామణి.)

నల. అందు=తాండ్రచెట్టునందు, అపుడ=అప్పుడే, పర్ణగణనన్ = ఆకుల యొక్క లెక్కను, కను...గతి(న్), కను = కనిన, ఆ, పరమ = ఉత్కృష్టుఁడైన, ధీరమణి = ధీరశ్రేష్ఠుఁడగు బుతుపర్ణునియొక్క, విచిత్రగతి(న్) = ఆశ్చర్యగతిని, నిరీక్షించి, ఘోరా...వికృతి-ఘోరమైన, అహి = కర్కోటకసర్పముచేత, కలిత= చేయఁబడిన, వికృతిగలవాఁడు, రాజసంతతి=చంద్రవంశజుఁడగు నలుఁడు.

సీ. నరలోకనుతభావ నాపుణ్యనిధి బంధు
మందార భూజనానందన నిను

నే మననేర్తు నీయెడ నయోహ హా కానఁ
  డు గురుండు నీవగ నగనమణికు
లాధార కాన నాగాగ్రగచ్ఛదసంఖ్య
  గర మొందు[1]గతి యెట్లు గలిగె నయ్య
యిది నా కెఱింగింపవే సద్గుణాప్తకు
  తూహలవిశ్వకా లోహితాశ్వ
గీ. హృదయ మొనగూర్తు నీయందుఁ జెదరకుండ
ననుచు నిజమహావిద్యాకథనపురస్స
రముగ నమ్మానవసతి తత్ప్రాపితాక్ష
హృత్సరణి నై యలోలత నెనసి యపుడు. 32

టీక. హరి. నరలోకనుతభావ! నా పుణ్యనిధి! బంధుమందారభూజ! జానందన! లోహితసంబోధనములు. గురుండు=తండ్రి (హరిశ్చంద్రుఁడనుట) నీవగ=నీదుఃఖమును, కానక్=అడవియందు, నాగా...గరము-నాగాగ్రగచ్ఛత్ = సర్పాగ్రేసరముయొక్క, అసంఖ్య=అధికమైన, గరము=విషము, సద్గుణా...విశ్వకౌ-సద్గుణములచేత, ఆప్త=పొందఁబడిన, కుతూహలముగల, విశ్వకా = సమస్తమైనవారు గలవాఁడా! లోహితాశ్వ! (లోహితునకు లోహితాశ్వుఁ డను పేరు గలదు.) (సంబోధనములు.) నిజ...స్సరముగన్-నిజ=స్వకీయమైన, మహా, అవిద్యాకథనముల యొక్క, పురస్సరముగ (అజ్ఞానవాక్యపూర్వకముగా ననుట.) అమ్మానవసతి, ఆ, మానవ=మనువంశసంభవుఁడైన హరిశ్చంద్రునియొక్క, సతి=భార్యయైనచంద్రమతివి, తత్ప్రా...రణి-తత్=ఆలోహితునియందు, ప్రాపిత=ఉంపఁబడిన, అక్ష=చక్షురింద్రియములయొక్కయు, (అథాక్ష మింద్రియే నాద్యూతాంగేకర్ష చక్రే వ్యవహారే కలిద్రుమే అ.) హృత్=హృదయముయొక్క, సరణి = మార్గముగలది, ఐ, అలోలతన్=నిశ్చేష్టతచేత.

నల. నర...వనా! నరలోకనుతమైన, భావనా = నిజధ్యానముగలవాఁడా! పుణ్యనిధి! బంధుమందార! భూజనానందన ఋతుపర్ణుని సంబోధనలు, భూజనులను, ఆనందన=సంతోషపెట్టువాఁడా! నయోహా! నయ=నీతియందు, ఊహా!=యోజనగల వాఁడా! గురుండును=బృహస్పతియు, ఈవగ=ఈవిధమున, కానన్=అడవియందు, ఆగా...సంఖ్య-అగ=వృక్షములయొక్క, అగ్రమును గ=పొందిన, ఛద=ఆకుల యొక్క, సంఖ్య=లెక్క, కరము(న్)హస్తమును, ఒందుతీరు (నేర్చుమార్గమనుట.) ఎట్లు కలిగెన్, అయ్య! సద్గుణాప్తకుతూహల! విశ్వ...హృదయము(న్) విశ్వకాల=సమస్తకాలములయందు, ఊహితమైన, అశ్వహృదయ మనువిద్యను, నిజ...

1 కెట్టులు.

స్సరముగన్-నిజ=తనయొక్క, మహావిద్యయొక్క, కథనముయొక్క; పురస్సరముగ, అమ్లానవసతి-అ, మాన=చిత్తసమున్నతికి, వసతి=నిలయుఁడైన నలుఁడు, త...దణి-తత్=ఆ ఋతుపర్ణునిచేత, ప్రాపిత=పొందఁబడిన, అక్షహృత్=అక్షహృదయ మను విద్యయొక్క, సరణి=మార్గముగలవాఁడు, ఐ, అలోలతన్=నిశ్చలత్వముతో.

క. మగుడ నను భావవాసన, యిగురొత్తనొకింత వెలయ నీక్షించి కనుఁ
వగఁజిక్కి వెచ్చనూర్చుచు, యుగావధివిమోహగరిమనుల్లంఘడలన్.

టీక. హారి. మగుడన్=మరల, అనుచ్ = పలుకును, భావవాసన = తెలివి, వెలయఁగా, యుగా...గరిమన్-యుగావధి = ప్రళయమైన, విమోహ= పుత్ర మోహముయొక్క, గరిమచేత.

నల. అనుభావవాసన=అతిశయవాసన, (మగుడ వెలయఁగా నని పూర్వముతో నన్వయము.) యుగావధి = కలిపురుషుఁడు, విమోహ = విగతమోహముయొక్క, గరిమను.

చ. అనుపమపుణ్యసాంద్రుఁ డగు నయ్యవనీశ్వరచంద్రుఁ బాసి యి
ట్లను దినముల్ ద్వదాశ్రయసమాహితవృత్తివహించు నే భవ
త్తనుగతదారుణాహిగరదాహముఁ గాంచి విపత్పయోనిధిన్
మునిఁగితి నాపయిం గరుణ నూల్కొనఁ గాఁ గనువచ్చి చూడవే.

టీక. హారి. ఇట్లు, అనుదినముల్=నిరంతరమును, కాంచి=చూచి;

నల. ఇట్లను(ల్)=ఈతీరునఁబల్కుచు, దినముల్ కాంచి=పొంది.

గీ. నిన్నుఁ దలఁచినవార్త నే నిలువఁ జాల
నింక ననుచు నక్షాంతంబు నెనసి నంద
నవికృతిక్లేశదశఁ దత్క్షణమున వికలి
తోపలబ్ధిప్రభవధైర్యయుక్తి నడఁచి. 35

టీక. హారి. అక్షాంతింబున్=క్షాంతాభావమును(తాలిమిలేమి), ఎనసి,నంద... దశన్, నందన = లోహితునియొక్క, వికృతివల్లనైన, క్లేశదశన్=దుఃఖావస్థను, విక...యుక్తిన్, వి=విశేషముగా, కలిత=పొందఁబడిన, ఉపలబ్ధిన్=జ్ఞానమువలన, ప్రభవమైన, ధైర్యయుక్తిచేత, అడఁచి, (క్లేశదశఁ బోఁగొట్టి యనుట.)

నల. అక్షాంతంబున్-అక్ష=తాండ్రచెట్టుయొక్క, అంతంబున్=అగ్రమును, ఎనసినన్ = పొందఁగా, తన...దశన్, తనశరీరవికారమువలననైన, క్లేశదశన్ = క్లేశదశావస్థను, విక...యుక్తిన్, వి=విగతమైన, కలిత = కలిపురుషుఁడు గలవాఁ డనుటయొక్క, ఉపలబ్ధి = పరిప్రాప్తివలన, ప్రభవ = పుట్టిన, ధైర్యముయొక్క, యుక్తిచేత, అడఁచి=కప్పిపుచ్చి; కలిపురుషుఁడు విడువఁగా నైన ధైర్యముచేత శరీర వికృతిక్లేశముఁ గనఁబడనీయనివాఁడై యనుట.

క. అలసాధ్వీడితమతి చ
క్రలలామాక్రమణరయదురీక్షాకృతి న
య్యలఘుఁ దనయు న్మనస్థితి
నెలకొన నేకతమ భీమనిలయముఁ జేర్చెన్. 36

టీక. హారి. సాధ్వీడితమతి, సాధ్వీ=పతివ్రతలచేత, ఈడిత=స్తుతిచేయఁబడిన, మతిగలది, చంద్రమతి = కర్త, చక్రి...కృతిన్, చక్రిలలామ = సర్పశ్రేష్ఠము యొక్క, ఆక్రమణముయొక్క, రయ=వేగముచేత, (కఱచుటచేత ననుట) దురీక్ష = చూడశక్యముగాని, ఆకృతిగలవాని, తనయున్ = లోహితుని, మనస్థ్సితి=చిత్తస్థైర్యము, నెలకొనన్, ఏకతమ=రహస్యముగా, భీమనిలయమున్ = రుద్రభూమిని చేర్చెను.

నల. సాధ్వీడితమతి=సాధువులచేత ఈడితమైనమతిగలవాఁడు. నలుఁడు=కర్త, చక్రి...కృతిన్-చక్రి=రథముయొక్క, అలామ = అశ్వములయొక్క, ('ప్రధాన శృంగలాంగూల భూషాపుండ్రప్రభావనా, ధ్వజలక్ష్మతురంగేషు అలామనవ నుస్మృతమ్'. ధనంజయము.) ఆక్ర...కృతిన్-ఆక్రమణరయ = గమనవేగముచేత, దురీక్ష=చూడశక్యముగాని, లేక, కనిపింపని ఆకృతిగలవాని, అయ్యలఘున్ = ఋతుపర్ణుని, తనయున్మనస్థ్సితి, తనయొక్క, ఉన్మనస్థ్సితి=సంతుష్టస్థితి, ('ఉత్క ఉన్మనాః' అ.) ఏకతమ = ముఖ్యతమమైన, భీమనిలయమున్ = కుండినపురమును.

ఉ. ఆయెడ సార్వభౌమసతి యప్రతిరోధ్యనిశాంచితక్రమో
చ్ఛ్రాయసమేతపత్త్రరథశబ్దము వీనులఁ బర్వ నాత్మహృ
న్నాయకుఁ డైన భూవలయనాథుఁ దలంచుచు నేడ్చుచుండె
నత్యాయతపద్మినీదళగతాంబువిడంబిమనోంబుజంబునన్. 37

టీక. హారి. సార్వభౌమసతి=చంద్రమతి, అప్రతి...శబ్దము-అప్రతిరోధ్య= అడ్డగింపశక్యముగానిదై, నిశా=రాత్రులయందు, అంచిత=విజృంభితమయిన, క్రమ = సంచారములయొక్క, ఉచ్ఛ్రాయ=అతిశయముతో సమేతములైన, పత్త్రరథ = పక్షులయొక్క, ('పతత్పత్త్రరథాండజా' గూబలు మొదలగు పక్షులయొక్కయనుట) శబ్దము.

నల. సార్వభౌమసతి=దమయంతి, అప్రతిరో...శబ్దము, అప్రతిరోధి=ఎదురు లేనిదై, అనిశాంచితమైన, క్రమోచ్ఛ్రాయ = గమనాతిశయముతోడ, సమేత = కూడిన, పత్త్ర=గుఱ్ఱములుగల, రథ=రథముయొక్క, శబ్దము, (ఋతుపర్ణుని రథధ్వని విని యారథము నలునిది కాదని[1] యెంచి నలుఁ దలంచుచు దమయంతి వ్యథ నొందుచుండె ననుట.), నాత్మహృన్నాయకుఁడైన = నలుఁడు కానట్టు.

---

1. నలునిదియకా యెంచి.

గీ. అపు డయోధ్యాధిపతియును నచటిభీమ
శాసనాదిష్టకర్బురస్థాపితాధి
వాసముననుండి యిచటి కెవ్వారు రారు
నేఁ డిదేమొకో యనుచుఁ జింతించుచుండె. 38

టీక. హరి. అపుడు, అయోధ్యాధిపతియును = హరిశ్చంద్రుఁడును, అచటి... వాసమునన్-అచటి=అరుద్రభూమియందలి, భీమ=భయంకరమైన, శాసన=ఆజ్ఞచేత, అదిష్ట=నిర్దేశింపఁబడిన, కర్బుర = నిశాచరులచేత, స్థాపిత = నిలుపఁబడిన, అధివాసమునన్=మంచెయందు.

నల. అయోధ్యాధిపతియును = ఋతుపర్ణుఁడును, అచటిభీమ...వాసమునన్, అచటి = ఆకుండినపట్టణమునందలి, భీమభూపాలునియొక్క శాసనముచేత, ఆదిష్ట = చూపఁబడిన, కర్బురస్థాపిత = సువర్ణఖచితమైన, ('గాంగేయం భర్మకర్బురమ్' అ., అధివాసమునన్=గృహమునందు.

క. సముచితపరిశోధనలా
ల్యము లవ్వేళన్ రుజావిలాపవ్యక్త
క్రమకాంతాశ్రుతి నలభూ
రమణోత్తమువెలఁదిమదికిఁ బ్రభవించుటయున్. 39

టీక. హరి. రుజా...శ్రుతిన్-రుజా=పరితాపమువల్లనైన, విలాప=రోదనముచేత, వ్యక్తమైన, క్రమము కలుగునట్లుగ, కాంతా=ఆఁడుదానియొక్క, శ్రుతిన్=వినుటచేత, అల...మదికి(న్), అల, భూరమణోత్తము=ఆహరిశ్చంద్రునియొక్క, వెలఁదిమదికిన్= పరిశుద్ధమైన మనస్సునకు, శోధనలోలత్వములు ప్రభవించుటయు నని పూర్వముతో నన్వయము.

నల. రుజా...శ్రుతిన్ - రుజా=పీడచేత, అవిల=కలుషమైనవాఁడై, ('కలుషో నచ్ఛ ఆవిలః' అ.) అవ్యక్త=తెలియఁబడని, క్రమముగలవాఁడైన, కాంత = పెనిమిటి యొక్క, అశ్రుతి(న్)=వినకుండుటచేత, నలభూరమణోత్తము వెలఁదిమదికిన్ = దమయంతిమదికి,(పరిశోధనలౌల్యములు ప్రభవించుటయున్ అని పూర్వమున కన్వయము.

సీ. హాళిఁ గాలప్రాప్తుఁ డైనసంతతికిఁ ద్రో
వ ఘటింప నెవ్వారు వచ్చిరో య
టంచు నారయఁ గోరి యలసు కేశిని నను
వ మహితశీల సత్పద్ధతి నది
దారసిన కవినుతదోర్మహాస్ఫూర్తిప్ర
చ్ఛన్నాత్మమూర్తి యాచక్రవర్తి

యి ట్లను నతివ! నీ వెవ్వరిదాన వి
ట్లేల వచ్చితి వొంటి నిచటి కనిన
గీ. నవనిధవకులపాలిక యను మహాత్ము
సాంద్రగుణబంధు రాజాన్వయేంద్రు నింటఁ
దగుపను ల్దీర్చుచుండెడుదాన ధాత్రి
నినుఁడు నను నమ్మఁ జరియింతు నివ్విధమున. 40

టీక. హరి. కాలప్రాప్తుఁడు = మృతుఁడు, ఐన, సంతతికి = కుమారునికి, త్రోవ ఘటింపన్=రక్షణమునొనర్పఁగా, అరయన్ కోరి, అలసుకేశునిన్=ఆచంద్రమతిని, అను...నదిన్-అనుపమమైన=హితమైన, శీల=సద్వర్తనయందు, సత్పద్ధతినదిన్=ఆకాశగంగయైనదానిని, దొరసి=చేరి, నర...స్ఫూర్తి-నరవినుతమైన, దోర్మహాస్ఫూర్తిన్=బాహుశౌర్యస్ఫూర్తిగలవాఁడు, ప్రచ్ఛన్నాత్మమూర్తి=ప్రచ్ఛన్నమైన నిజస్వరూపముగలవాఁడు, ఆచక్రవర్తి=ఆహరిశ్చంద్రుఁడు, ఇట్లనున్=ఈరీతిఁబలుకును, అవనిధవకులపాలిక=అవనిధవ (హరిశ్చంద్రునియొక్క యనుట.) కులపాలిక = కులస్త్రీయగు చంద్రమతి ('కులస్త్రీకులపాలికా' అ.) మహాత్మున్=హరిశ్చంద్రునిఁగూర్చి, అగు నని పూర్వమున కన్వయము. సాంద్ర...యేంద్రునింటన్-సాంద్రగుణములచేత, బంధురుఁడైన, అజాన్వయేంద్రు=బ్రాహ్మణునియొక్క, ఇంటన్=ఇంటియందు, ఇనుఁడు = భర్త, ననున్, అమ్మన్=విక్రయింపఁగా.

నల. హాళిన్ = ఆసక్తిచేతను, కాలప్రాప్తుఁడు-కాల = స్వయంవరనిర్ణయకాలమునకు, ప్రాప్తుఁడు = వచ్చినవాఁడు, ఐనసంతతికిన్=సూర్యసంబంధమైన వంశముగలవానికి, (ఋతుపర్ణునకనుట.) ఇందుఁ 'గాలప్రాప్తుఁ'డను ప్రథమాంతపదమును 'ఐనసంతతికి' అను షష్ఠ్యంతపదమునకు విశేషణముగఁ జెప్పినందులకు లక్షణము.

"గీ. భేద్యభేదకముల భేదంబు సెల్లదు, వరవిభక్తిలింగవచనములకు
నొండు భేదకమున కుండును బ్రథమయు, జయము రక్షకుండు శౌరి కనఁగ.

ప్రయోగము.— (కవిలోకచింతామణి.)

"మ. వనితారత్నము తల్లమాంబకును శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందనుల్ విమలవిద్యాభారతీ వల్లభుల్." (నైషధము.)

త్రోవ, ఘటింపన్=నడిపించుటకు, ఆరయఁగోరి=తెలిసికొనఁదలఁచి, అలసుకేశినిన్-అల=ఆ, సు=బాగైన, కేశిని యను పేరుగలదానిని, అనుపన్=పంపఁగా, మహితశీల=దమయంతి, కర్త. మహితశీలయగు దమయంతి యనుపఁగా నని పూర్వమున కన్వయము, సత్పద్ధతిన్=మంచిమార్గముచేతను, అది=ఆకేశిని, దొరసినన్=చేరఁగా, రవి...

స్ఫూర్తిచే-రవి = సూర్యునివలె, నుతమైన, దోర్మహాస్ఫూర్తి = భుజమహాస్ఫూర్తి గలవాఁడు, ప్రచ్ఛన్నాత్మమూర్తి, ఆచక్రవర్తి, అవనిధవకులపాలిక-అవనిధవకుల = రాజగృహమును, పాలిక=పాలించునది యగు కేళిని, మహాత్ము (న్)=నలునిఁగూర్చి, అను నని యన్వయము. సాంద్ర...నింటన్-సాంద్రగుణ = మంచిగుణములకు, బంధుమైన, రాజాన్వయేంద్రుని = భీమునియొక్క, ఇంటన్, ధాత్రిన్ = దాదిని, ఇనుఁడు=ప్రభువు, నను, నమ్మన్=నమ్మునట్లు.

ఉ. మానవలోకచంద్ర విను మాన్నృపుపట్టి మదీయజీవక
ల్పానఘమూర్తి గూఢచరణాధిపనిర్దయతాని వేశితా
హీనతరార్తిపాల్పడియె నీయెడఁ దత్పతితత్వ మంతయున్
మానసమంత్రగౌరవచమత్కృతి గల్గినఁ దెల్పవే యనన్. 41

టీక. హరి. ఆన్నృపపట్టి=ఆరాజకుమారుఁడు (లోహితుఁడనుట). మదీయ... మూర్తి-మదీయజీవకల్పమైన, అనఘమూర్తిగలవాఁడు; గూఢ...తరార్తిపాలు, గూఢచరణాధిప=సర్పశ్రేష్ఠముయొక్క, నిర్దయచేత, నివేశితమైన, అహీనతరమైన, ఆర్తియొక్క, పాలు, పడియెను. ఈయెడన్=ఈసమయమున, తత్పతితత్వమున్ = ఆయార్తిఁబడుటను, అంతయున్=పూర్ణముగ, మానసనట్లుగా, సమంత్ర...చమత్కృతి - సమంత్రగౌరవ = మంత్రగౌరవముతోఁ గూడుకొనిన, చమత్కృతి, కల్గినన్, తెల్పవే=మేలుకొల్పవే, అనఁగా.

నల. మాన్నృపపట్టి=మారాజుకొమార్తె, మదీయ...మూర్తి-మదీయజీవకల్ప=నాప్రాణసదృశమైన, అనఘమూర్తిగలది, గూఢ...పాల్-గూఢమైన, చరణ = సంచరణముగల, అధిప=విభునియొక్క, నిర్దయచేత, నివేశిత=ఉంపఁబడిన, అహీనతరార్తియొక్క, పాలు, పడియెను. నీయెడన్=నీయందు, తత్పతితత్త్వము=ఆదమయంతీభర్తృస్థితి, మానస...చమత్కృతిన్ - మానసమందలి, మంత్రిగౌరవ = రహస్యగౌరవముయొక్క, చమత్కృతిగల్గినన్, (ఆనలునిస్థితి మనసునఁ దెలిసియుండినచో ననుట. నీయెడలఁ దద్భర్తృత్వమున్నచోఁ దెల్పు మని యర్థాంతరము.)

శా. చండాలేశ మహోదయార్తిదినకృత్సంతానరాడ్వీరదా
సుం డామేటి నిజప్రచార మవు డాశుభ్రాంశుబింబాస్యతోఁ
బాండిత్యంబునఁ దెల్పి యిట్లను భవద్బాలాహితాపక్రియా
ఖండాపద్వినివారణైకమహిమ ల్గాంచ న్నరేంద్రుండనే. 42

టీక. హరి. చండా...దాసుఁడు-చండాలేశ = చండాలశ్రేష్ఠునియొక్క, మహోదయ=పుట్టువును, ఆర్త=పొందిన, దినకృత్సంతానరాట్=యముఁడురాజుగాఁగల,వీరదాసుండు=వీరదాసుఁడను పేరుగలవాఁడు, ఆమేటి=ఆహరిశ్చంద్రుఁడు, భవద్బాలా...మహిమల్ - భవద్బాల = నీకుమారునియొక్క, అహి=సర్పమువల్లనైన,

తాపక్రియ=పరితాపక్రియచేత, అఖండమైన, ఆపదయొక్క, వినివారణమందు, ఏక=ముఖ్యమైన, మహిమలు. కాంచను=పొందను, నరేంద్రుండనే = విప్రవైద్యుండనా? ("నరేంద్రో విప్రవైద్యోఽపి వాక్యేకేవ సుధాపతే" నానా.)

నల. చండాలేక...రాడ్వీరదాసుండు-చండ = తీవ్రమైన, ఇది 'మహా' శ్శబ్దమునకు విశేషణము) ఆవేశ=అధికమైన, (ఇది 'దయా' శబ్దమునకు విశేషణము) మహః=ప్రతాపమును, దయయును, (ఇది క్రమాలంకారము, మహోదయ = అభ్యుదయమును, ఆత్త=పొందిన, దినకృత్సంతానరాడ్వీర=సూర్యవంశమగు అరాజవీరునికి, (ఋతుపర్ణునియొక్క యనుట) దాసుండు; అమేటి=అనలుండు, భవ...మహిమల్ - భవద్బాలా=మీబాలికయొక్క, హిత= పెనిమిటివల్లనైన. అపక్రియా = అపకారముచేత, అఖండమైన, ఆపత్=ఆపదయొక్క, వినివారణమందు, ఏకమైన, మహిమలు, నరేంద్రుండనే=రాజునా? లేక వార్తాహరుండనా యనియుం జెప్పవచ్చును.

క. ఓలేమ యేతదవనీ, పాలనసంభావితార్థపరికల్పనకుఁ
జాలిన నిలు మిట లేదా, వైళమ చనుమింక మనలవల దిచ్చోటన్.

టీక. హరి. ఏత...కల్పనకున్-ఏతదవనీ=ఈరుద్రభూమియొక్క, పాలన=పరిపాలనయొక్క, సంభావితమైన, అర్థ=ద్రవ్యముయొక్క, పరికల్పనకున్=ఇచ్చుటకు.

నల. ఏత...కల్పనకున్-ఏతదవనీపాలన=ఈఋతుపర్ణునియొక్క, సంభావితమైన, అర్థ=ప్రయోజనముయొక్క, పరికల్పనకు.

చ. అలఘుతరార్తవృత్తిగతయై నృపుదేవి ప్రియోక్తిఁ గ్రమ్మఱన్
గులపతిఁ జేరఁబోయి యటకున్ గొనివచ్చిన తత్తనూజుముం
గల నిది ధాత్రి నవ్యతరకాంతిసముజ్జ్వలరేఖఁ జిన్నిక్రొ
న్నెల నగు నీకుమారునికి నీ వనలాప్తి ఘటింపవే యనన్. 44

టీక. హరి. అలఘుతరార్తవృత్తిని, గత=పొందినది, ఐ, కులపతిన్ = హరిశ్చంద్రుని, ఈకుమారునికి, నీవే, అనలాప్తి(న్)=అగ్నిసంస్కారమును, ఘటింపవే.

నల. అలఘుతరార్తవృత్తి(న్), అలఘుతరమైన, ఆర్తవృత్తిచేత, గత=పోయినది, ఐ, నృపుదేవిప్రియోక్తిన్=దమయంతియొక్క ప్రియవచనముచేత, కులపతిన్=నలుని, ధాత్రి=దాది, ఈ కుమారుని = ఈచిన్నికుఱ్ఱనికి, నీవ = నీవే, నలాప్తి(న్) = నలుని యొక్క పరిప్రాప్తిని, ఘటింపవే, అనన్.

ఉ. మారునివంటిరూపసుకుమారుఁ గుమారుఁ గుమారజైత్రునం
భోరుహపత్రనేత్రుఁ దనపుత్త్రునిఁ గాఁ దిలకించి యాత్మదు
ర్వారవిషాదవేదనల వ్రాలియు నాకృతిగోపనక్రియా
పారగుఁడై నృపాలకుఁ డపారకృపారసదృష్టిఁ నిట్లనున్. 45

టీక. రెంటికి సమానము.

చ. రతిపతిమూ_ర్తి యీనిసువు రాజసుతుం డటె గూఢభావసం
స్థితజనకాననంబుఁ గనఁజేయుటకు న్వగ లేక మానునే
మతిఁ బరికింపనేల యిది మాటికి నేఁ బరతంత్ర తాలఘు
స్థితి మనుదుర్గతిన్ గృతగతిన్ భవదిష్టము సేయ నే_ర్తునే. 46

టీక. హారి. గూఢభావ=గూఢమైనయభిప్రాయముగలదానా! సంబుద్ధి. (గుట్టుగల దనుట) సంస్థితజనకాననంబున్; సంస్థితజన = ప్రేతజనులయొక్క, ('పరేత ప్రేత సంస్థితాః' అ.) కాననంబున్, (ప్రేతవనము ననుట) వగలేకమానునే = (గతిలేక పోవునా యనుట.)

నల. గూఢ...ననంబున్ - గూఢభావ=గూఢత్వముచేత, సంస్థిత = ఉండెడు, జనక = తండ్రియొక్క, ఆననంబున్ = మొగమును, కనఁజేయుటకున్, వగలేక మానునే? = (లేకపోవునాయనుట.)

గీ. ఎగ్గు వాటించు నాస్వామి యెటిఁగెనేని
వారిజాక్షి యేతద్భూమివ_ర్తన యిది
మానవే యన్న నాసుధామధురవచన
యరుగ కనునయశీల యై యచట నిలిచి. 47

టీక. హారి. ఏతద్భూమివ_ర్తన-ఏతద్భూమి = ఈరుద్రభూమియొక్క, వ_ర్తన, (వ_ర్తనరూపమున వచ్చుబడి పైఁడియనుట.) వేయన్నన్ = వేయిచెప్పినను, ఇది, మానన్=విడువను, నాన్=అనఁగా, సుధామధురవచన=చంద్రమతి.

నల. ఏతద్భూమివ_ర్తన=ఇచట వ_ర్తించుటను; ఇది మానవే, అన్నన్=అనఁగా, అసుధామధురవచన=ఆ కేళిని;

గీ. జనవిభుఁడు పాకసంస్కారసాధనముగ
ననితరప్రాప్యగతిఁ జెందునప్రయత్న
మహితశుచిజీవనావాస మంగళగుణ
మరసి యఱుతఁ దెల్పినఁ గుంది యావెలంది. 48

టీక. హారి. పాక ... ధనముగన్ - పాక = పిన్నవానియొక్క ('పోతః పాకో౽ర్భకోడింభః' అ.) సంస్కారమునకు, సాధనముగా, అనితరప్రాప్యగతిన్-అనితరప్రాప్య=ఇతరులకుఁ దెలియశక్యముగాని, గతిన్, (అన్యులకుఁ గానరాకుండునది యనుట.) చెందు...గుణమున్-చెందు = పొందిన, అప్రయత్నముచేత, మహితమైన, శుచిజీవన=పవిత్రజీవనమునకు, ఆవాస = ఆధారమైన, మంగళగుణమున్ = మంగళ సూత్రమును, అరసి=చూచి, అఱుతన్=కంఠమందు.

నల. పాకసంస్కారసాధనముగన్, పాకసంస్కార=పచనసంస్కారమునకు, సాధనముగా, అనితరప్రాప్యగతిన్=అన్యులకుఁబొందరానిగతిని, చెందు...గుణమున్-చెందిన, అప్రయత్నముచేత, మహితమైన, (యత్నములేక కలిగినయనుట.) శుచిజీవన = అగ్నిజలములకు, ఆవాసమైన, మంగళగుణ=శుభగుణమును, అరసి=తెలిసికొని, ఆయిఠన్=(దమయంతి) సమీపమున, తెల్పినన్=చెప్పఁగా, ఆ వెలంది=ఆదమయంతి, శుంది.

ఉ. తప్పదు ప్రాణవల్లభుఁ డితం డని యారసి హా నృపాల! వా
తప్పక నిత్యసత్యసుకృతంబునఁ బోల్చు పవిత్రశీల నీ
విప్పుడు దీనతం బరమహీనుని నొక్కనిఁ గొల్చి యుండఁగా
నిప్పృథివీపురంధ్రి సహించెనె దైవము మెచ్చవచ్చునే! 49

టీక. హరి. పరమహీనునిన్, పరముఁడైన, చండాలుని.

నల. పరమహీనునిన్, పర=ఇతరుఁడైన, మహీనునిన్=రాజును.

క. అని వనరి వనరుహానన
కనుదమ్ములఖండబాష్పకాండాళులన్
దనరన్ గురువాక్యాహూ
తనిజాధిపయై యగణ్యతరదైన్యమునన్. 50

టీక. హరి. గురు...జాధిప-గురు=అధికములైన, వాక్యములచేత, ఆహూత=పిలువఁబడిన, నిజాధిప=హరిశ్చంద్రుఁడుగలది, ఐ.

నల. గురు...జాధిప-గురు=జనకుని యొక్క, వాక్యముచేత, ఆహూత=పిలువఁబడిన, నిజాధిప=నలుఁడుగలది, ఐ.

సీ. రావేల మద[1]నిర్ఝరావేల సౌరభ్య
లోభలుబ్ధాళిభద్రేభఘటలు
తగవేల చూడఁ గ్రొత్తగ వేలసంఖ్యలై
పడివాగెఁ బఱతెంచు ప్రౌఢహరులు
తనరవేల జయాయతనరవేలాధర
ప్రతిమతుంగశతాంగశవశతములు
కలయ వేల భయానకలయవేలాఘనా
ఘనగర్జనగుణానకస్వనములు
గీ. మించవేల తనుప్రభల్ మించుగముల
మించవే లాస్యము లొనర్చు మెఱుఁగుఁబోండ్ల,

1. నిర్భరా.

తరళవలయఝుళంకృతు ల్ధావకాగ్ర
సరణి రాజేంద్ర! రాజేంద్రసరణి ననుచు. 51

టీక. రెంటను సమము.

చ. అడుగుల వ్రాలి శోకకలితాకులతాచలితాత్మవీథినై
నడుకుచుఁ బ్రాణనాథ! కరుణాభరణాభరణాంతరంగ నీ
కొడుకుతెఱంగుఁ గోమలినెగుల్ దిలకింపఁగదయ్య నేఁడు నీ
బొడఁగనఁగల్గెఁ జాలుఁ దలఁపు ల్జరితార్థములయ్యె నెంతయున్. 52

టీక. రెండింటను సమానము.

క. అన నాజననాథాగ్రణి
మననాధికశోకశిఖల మానసమార్తిం
గన నాచ్ఛాదించి కులాం
గన నాత్మకథావిబోధకారిణిఁ బలికెన్. 53

టీక. రెండర్థముల నొక్కటీర.

చ. * కుదురు మెఱుంగు నిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
సెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసాబ్జ వయి వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటదరంబె యేరికిన్. 54

టీక. రెంటను సమానము.

గీ. అఖిలదేశంబులు సదాసహాయవృత్తి
నెఱపితి విలాసవతి! యిట్టినిన్ను నమ్మి
కనుఁగొనుట యెట్లు నిర్విశంకత దలిర్ప
నిపు డెదుట నిల్చి మాటాడు టెట్లటన్న. 55

టీక. హారి॰ సదాసహాయవృత్తి = నిరంతర సహాయవృత్తిని, నెఱపితి = ఆచరించితి, ఇట్టి నిన్ను=ఇటువంటినిన్ను, అమ్మి;

నల॰ సదా, అసహాయవృత్తి, నెఱపితివి, ఒంటరిగాఁ దిరిగితి వనుట. నమ్మి కనుక=విశ్వాసముచేత, కొనుట = పరిగ్రహించుట, ఎట్లు?

క. తలఁపునఁ దద్గుణరాగముఁ
గలయనిలాధిపతి నాతిఘనతరవేగం

* ఈపద్యము శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునం గలదు.

బలరఁగఁ దత్పదమున వ్రా
లి లసన్మృదులోక్తి కందళిక నిట్టనియెన్. 56

టీక. హరి. తద్గుణరాగముల్, తత్=హరిశ్చంద్రునియొక్క, గుణములయందలి, రాగముల్, కలయన్=ప్రాపింపఁగా, ఇలాధిపతినాతి=చంద్రమతి; తత్పదమున=అహరిశ్చంద్రునిపాదద్వయమున, వ్రాలి=పడి, ఇందుఁ దత్పదమును ననుపదమునకు, 'స్తనాదీనాంద్విత్వవిశిష్టాజాతిః" అను వామనసూత్రముచేత, ద్విత్వమున జాత్యేకవచనము.

నల. తలఁపునన్, తద్గుణరాగముల్-తత్=ఆదమయంతియొక్క, గుణ=పాతివ్రత్యాదిగుణములయందలి, రాగముల్ = అనురాగమును, కలయనిలాధిపతి, కలిగిన, అనిలాధిపతి=వాయుభట్టారకుఁడు, నాతి... వేగంబు-నాతిఘనతర = అతిఘనతరము గాని, వేగంబు, (కించిద్వేగ మనుట.) అలరఁగా, తత్పదమున(న్) = అస్థలమందు, వ్రాలి = నిలిచి.

ఉ. మందరధీర! ధీరనుతమానస! మానసమగ్ర! యిట్లు ప
ల్కందగునే భవత్ప్రమదగౌరవహేతుపవిత్రభావని
ష్పందచరిత్రసంపదకు సాక్షులు గోవిధుకర్మసాక్షు లీ
చందమునన్ ద్వదాత్మజలజంబునఁ జింత యొనర్ప నేటికిన్. 57

టీక. హరి. భవ...సంపదకు-భవత్=నీయొక్క, చరిత్రసంపదకువిశేషణము. ప్రమదగౌరవ = సంతోషాతిశయమునకు, హేతువైన, పవిత్రతచేతను, నిష్పంద = చలింపని, చరిత్రసంపదకు.

నల. భవత్ప్రమద...భవత్ప్రమద = నీభార్యయొక్క.

గీ. అనుచు విన్నందనమితనయాంచితోక్తి
నుడుప లలితాస్య నెనసి యయ్యురుతరస్థి
రావహానకేళి ఫణికుమారప్రయుక్త
నేత్రభవభువనాధికోన్మేషుఁ డగుచు. 58

టీక. హరి. విన్నందనము(న్), ఇత... క్తిన్-ఇత=పొందఁబడిన, నయముచేత, అంచితమైన, ఉక్తిన్=వాక్యముచేత, ఉడుపన్ = పరిహరింపఁగా, లలితాస్యన్, (చంద్రమతిననుట.) ఎనసి, ఆ, అయ్యా, ఉరు...ఫణిన్-ఉరుతరస్థిరావహానకేళిన్=భూభరణక్రీడయందు, ('రసావిశ్వంభరాస్థిరా' అ) ఫణి=శేషుఁడైన హరిశ్చంద్రుఁడు, కుమార...న్మేషుఁడు, కుమార = లోహితకుమారునియందు, ప్రయుక్త=ప్రరోపింపఁబడిన (నింపఁబడినయనుట.) నేత్రభవ=నయనజనితమైన, భువన = ఉదకముయొక్క, ('జీవనంభువనంవనమ్.' అ) ఉన్మేషుఁడు = అధిక్యము గలవాఁడు, అగుచు, (భార్యాయుక్తుఁడై కన్నీరు లోహితునిమీఁదం బడునట్లు దుఃఖించె ననుట.)

నల. అనుచు, విన్నందుఁ=ఆకాశమందు, ('వినువిన్ను మినుమిన్ను' ఆం. సం.) అన(ఁ)=వాయుభట్టారకుఁడు పల్కఁగా, మిత...తోక్తిఁ-మితమై నయాంచితములైన, ఉక్తిఁ=వాక్కులు గలదానిని, ఉడుపలలితాస్యఁ, ఉడుప = చంద్రునివలె, లలితమైన, ఆస్యఁ=ముఖముగలదాని, (దమయంతిననుట.) ఎఫసి=కూడి, అయ్యో ర...కేళి-ఆ, ఉరుతరమైన, స్థిరావహన = భూభరణమందు, కేళి=కేళిగలవాఁడు (నలుఁడనుట.) ఫణి...న్మేషుఁడు-ఫణికుమార = కర్కోటకునిచేత, ప్రయుక్త=ఈఁబడిన, నేత్ర=వస్త్రమువల్ల('స్యాజ్జటాంశుకయోర్నేత్రం' అ.) భవ=పుట్టిన, భువనాధికమైన, ఉన్మేషుఁడు=దేహప్రకాశము గలవాఁడు, అగుచు.

ఉ. భూనుతపూర్వరూపధృతిఁ బొల్చి నితాంతదురంతమానస
జ్యాని వహించుమానిని నసంతతి సద్విధిఁ దేర్చి యయ్యయో
ధ్యానగరాధినేత వెస నంపె యథోచితమైన వర్తనఁ
దేనియ నుంచి యబ్బురపుఁదీయఁదనంబులు సిల్కఁబల్కులన్. 59

టీక. హరి. భూ...భృతిఁ- భూనుతమైన, పూర్వరూపధృతిఁ = మునుపటి ధైర్యముచేత, పొల్చి = ప్రకాశించి, నితాంతజ్యాని(ఁ), నితాంతదురంతమైన, మానసజ్యా(ఁ) మనోవైకల్యమును, ('జ్యానిర్జీర్ణా' అ.) వహించుమానినిఁ=పొందిన చంద్రమతిని, అసంతతిఁ = కుమారరహితయైన దానిని, అయ్యయోధ్యానగరాధినేత=అహరిశ్చంద్రుఁడు, యథోచితమైన, వర్తనఁ, యథోచితమైన, వర్తనఁ= శ్మశానమున కీవలసిన కట్టఁడిపైఁడి, (వాతిపాతిక యనుట.) తేనియమించిన, (తెచ్చుటకు నియమించి యనుట.)

నల. భూ...ధృతిఁ-భూనుతమైన, పూర్వరూప = మునుపటి యాకారము యొక్క, ధృతిఁ=ధరించుటచేతను, పొల్చి, నితాంత...జ్యానిఁ-నితాంత=దురంతమైన, మానసజ్యానిఁ=మనోవ్యథను, వహించు మానిఁ=వహించు, మానిఁ=అభిమానియైనవానిని (నలునంతటివానిచేఁ దెలియక సేవఁ జేయించుకొంటి నని మనమున వ్యథపడెడువాని ననుట.) ఇనసంతతిఁ=సూర్యవంశము గలవానిని, సద్విధిఁ = సద్విధానముచేత, (అశ్వహృదయోపదేశవిధిచే ననుట) తేర్చి, అయ్యయోధ్యానగరాధినేతఁ=ఋతుపర్ణుని, యథోచితమైన వర్తనఁ, తేనియ(ఁ) = తేనెను, మించి, అబ్బురపుఁదీయఁదనంబులు, చిల్కఁ, పల్కులఁ.

సీ. అపుడు ధర్మపరిగ్రహాగురునియొద్దఁ ద
త్సంతతి నునిచి యధ్యక్షహృదయ
మర్మబోధసమగ్రమతి నలసన్నారి
సన మునుమున్నఁ దజ్జనపదేశు

పద మాక్రమించి తత్ప్రజ నొంచి కల వెల్లఁ
జూఱగాఁ గొనినదస్యుఁడు ప్రతీప
గాధేయశాంబరి సాధనాఢ్యుఁడు పుష్క-
రాభిఖ్యుఁ డెదిరించి యానృపాలు
గీ. నువిద లోఁబడునట్లు కైతవ మొనర్చి
తాఁ గొనిన యంతవట్టు నత్తఱి నొసంగి
చనినఁ దద్వసుమతి రాజశాసనైక
పాత్రమై చెందెఁ దద్వీరబాహువసతి. 60

టీక. హరి. ధర్మపరిగ్రహగురునియొద్దన్ = ధర్మసంగ్రహణాధికుఁడైన హరిశ్చంద్రునిదగ్గఱ, తత్సంతతిన్=ఆతనికుమారుని, అధ్యాత్మ...మతిన్-అధ్యాత్మ = విభుని యొక్క, హృదయమర్మమును, బోధ=తెలియుటచేత, సమగ్రమైన, మతిన్=బుద్ధిచేత, అలసన్నారి, అ: సన్నారి=సద్వనిత, (చంద్రమతి,) చనన్=పోఁగా, తజ్జ = పదమున్, తజ్జనపదేశు = ఆకాశిరాజుయొక్క, పదమున్=ఇంటిని-ఆక్రమించి = ప్రవేశించి, తత్ప్రజన్ = ఆరాజుపుత్రిని, ('ప్రజాస్యాత్సంతతౌజనే' అ.) దస్యుఁడు=దొంగ, ప్రతీప...సాధ్యుఁడు-ప్రతీప=ప్రతికూలుఁడైన, గాధేయ = విశ్వామిత్రునియొక్క, శాంబరియనెడు, సాధనముచేత, ఆఢ్యుఁడు, పుష్కరాభిఖ్యుఁడు=పుష్కరుఁడనువాఁడు; ఎదిరించి=ఎదురుగావచ్చి, ఆనృపాలునువిద=చంద్రమతి, లోఁబడునట్లు, కైతవమొనర్చి=కపటముచేసి, తద్వసుమతి=ఆచోరద్రవ్యముగల చంద్రమతి, రాజ...పాత్రము-రాజశాసన = రాజాజ్ఞకు, ఏక = ముఖ్యమైన, పాత్రము, ఐ, తద్వీరబాహువసతి, (చెందె నని పూర్వముతో నన్వయము.)

నల. ధర్మ...యొద్దన్-ధర్మపరిగ్రహ=తనధర్మపత్నియొక్క, గురునియొద్ద=తండ్రియొద్ద, (భీమునియొద్దననుట) తత్సంతతిన్=ఆయనకుమారికను, అధ్యాత్మ...మతి-అధి=అధిగతమైన, ఆత్మహృదయ=విద్యామర్మముయొక్క, బోధ=తెలియుటచేత, సమగ్రమైన, మతి=బుద్ధిగలవాఁడు, నలసన్నారి, నల=తృణమువలె, సన్న=ఛేదింపఁబడిన, అరి=శత్రువులుగలవాఁడు, (నలుఁడనుట) కర్త=చనన్, (రాజ్యపరిగ్రహణార్థము పోఁగా ననుట.) తజ్జనపదేశపదము=ఆరాజుయొక్కరాజ్యము, దస్యుఁడు = శత్రువు. ('దస్యుశాత్రవశత్రవః' అ.) ప్రతీప...సాధ్యుఁడు-ప్రతీపగ = కుటిలవర్తనులకు, ఆధేయమైన, శాంబరి = మాయయనెడిసాధనముతో, ఆఢ్యుండు, అనృపాలునువిద=దమయంతి, లోఁబడునట్లుగా, కైతవము = జూదము, ఒనర్చి, (జూదమాడి యనుట.) తద్వసుమతి, ఆభూమి, రాజశాసనైకపాత్రము, రాజశాసన=ఆరాజపరిపాలనకు, ఏకపాత్రము = యోగ్యము, ఐ, తద్వీ...సతిన్-తత్ =

ఆ, వీరుఁడైన నలునియొక్క, బాహువందలి, వసతిన్ = ఉనికిని, చెందె నని పూర్వముతో నన్వయము.

సీ. తద్వేళ భీమగోదారసంప్రేషిత
యగుచుఁ బ్రజావృత యగుచు రాజ
ధామచౌర్యప్రథాధార సల్లపన సం
దీపిత యగుచు నాత్మీయవనిత
తనయున్కి సేరి యుక్తక్రియానుగుణవృ
త్తి వహింప నాధరాధీశమౌళి
నిజవిధానవిఘాత నిరతవిశ్వామిత్ర
పరిహారణోత్సాహపటిమ మెఱసి

గీ. వరుసఁ బ్రత్యర్థిమండలస్వాస్థ్య హేతు
దానఘనతరవారిధారానితాంత
హారిహస్తసరోరుహుం డగుచుఁ బ్రీతి
నిలయజనవర్ధనప్రౌఢి నించువేళ. 61

టీక. హారి.భీమగోదారసంప్రేషిత-భీమ=భయంకరుఁడైన, గోదార=గోహింసకుఁడైన వీరబాహునిచేత, 'గాః దారయతీతి గోదారః' వ్యుత్పత్తి. 'దౄ = విదారణే' ధాతువు.) సంప్రేషిత=పంపఁబడినది, అగుచు, ప్రజావృత్త = ప్రజలచేతఁ బరివేష్టింపఁబడినది, అగుచు, రాజ...దీపిత-రాజధామ=రాజగృహమందలి, చౌర్యముచేనైన, ప్రథా=ప్రసిద్ధికి, ఆధారమైన, సల్లపన=సల్లాపములచేత, సందీపిత, అగుచున్, ఆత్మీయ వనిత=తనభార్య, యుక్త...వృత్తిన్-యుక్తమైన, క్రియా = ఆజ్ఞాక్రియకు, (ఛేదన క్రియకనుట) అనుగుణమైన, వృత్తిని, అధరాధీశమౌళి=అహరిశ్చంద్రుఁడు, నిజ...పటిమ(న్), నిజ=స్వకీయమైన, విధాన = చంద్రమతీఖండనవిధానముయొక్క, విఘాత మందు, నిరతుఁడైన, విశ్వామిత్రునియొక్క, పరిహారణమందలి, ఉత్సాహపటిమతో, మెఱసి=ప్రకాశించి, ప్రత్యర్థి...సరోరుహుండు-ప్రత్యర్థిమండల = శత్రుమండలము యొక్క, స్వాస్థ్య=స్వర్గస్థితికి, హేతువైన, దాన=ఖండనముచేత, ఘనమైన, తరవారి ధారా=ఖడ్గధారచేత, నితాంతహారి=మిక్కిలి యొప్పుచున్న, హస్తసరోరుహములుగల వాఁడు, అగుచును, ప్రీతి...ప్రౌఢిన్-ప్రీతినిలయజన = ప్రేమాస్పదజనముయొక్క, (భార్యయొక్క యనుట.) వర్ధనప్రౌఢిన్ = ఛేదనప్రౌఢిమచేత, నించువేళ (న్) = నింపెడువేళయందు.

నల. భీమ...ప్రేషిత-భీమగోదార=భీమభూపాలునిచేత ('గాఃభూమిః, దారాః యస్యసః గోదారః, భీమఇతిగోదారః=భీమగోదారః') సంప్రేషిత, అగుచు, ప్రజా వృత ప్రజా=బిడ్డలతోడ, ఆవృత=కూడుకొనినది, అగుచు, రాజ...దీపిత-రాజధామ =

చంద్రకాంతియొక్క, చౌర్యమువల్లనైన, ప్రథా = ప్రసిద్ధికి, ఆధారమై, పత్ = శిస్సైన, లపన=ముఖముచేత, సందీపిత అగుచు, ఆత్మీయవనిత=తనభార్య (దమయంతి), తనయున్కి=తానున్న తావు, చేరి, యుక్త...వృత్తి-యుక్తక్రియలకు, అనుగుణమైన, వృత్తిని, వహింపన్, అధరాధీశమౌళి=అనలుఁడు, నిజ...పటిమ-నిజవిధానముయొక్క, విఘాత=విఘ్నమందు, నిరతులైన, విశ్వ=సమస్తమైన, అమిత్రులయొక్క, పరిహారణమువల్లనైన, ఉత్సాహపటిమచేత, మెఱసి, ప్రత్యర్థి...సరోరుహుండు - ప్రత్యర్థిమండల=ప్రతియాచకసంఘముయొక్క, స్వాస్థ్య = స్వస్థతకు, హేతువైన, దానముయొక్క, ఘనతరమైన, వారిధారలచేత, నితాంతహారియైన, హస్తసరోరుహుండు=పాణిపద్మముగలవాఁడు, అగుచున్, ప్రీతిన్ = ప్రేమచేత, ఇలన్ = భూమియందు, యజనవర్ధనప్రౌఢిన్=యజ్ఞవర్ధనప్రౌఢిచేత, ఇంచువేళన్=ఒప్పెడు వేళయందు.

సీ. పస మీఱు నేవేల్పుఫాలసన్నుతహేతి
యురుబలమదనాశనోగ్రవృత్తి
ఘనదీప్తికర్బురాకారమై యేవేల్పు
వి ల్లనంతశరాప్తి నుల్లసిల్లుఁ
దనరు నేవేల్పునందనమహాక్రీడ చి
త్రమహిమందార కాంతత వహించు
వరసర్వమంగళావాసమై యేవేల్పు
మూర్తి నానాభోగములఁ దనర్చు
గీ. నట్టికలధౌతగిరికటకాభిరామ
సదనతరవర్తి సురలోకచక్రవర్తి
యఖిలమునినిర్జరులు గొల్వ నానృపాలు
నెదురఁ బ్రత్యక్షమై నిల్చి యిట్లు పలికె. 62

టీక. హరి. ఏవేల్పు...హేతి-ఏవేల్పుయొక్క, ఫాల=లలాటమందు, సన్నుతమైన, హేతి=అగ్నిజ్వాల, ఉరు...వృత్తిన్-ఉరుబల=అధికబలుఁడైన, మదన=మన్మథునియొక్క, అశన=ఆహారమందు, ఉగ్రమైన, వృత్తిచేత, ఘన...కారము-ఘనమైన, దీప్తిచేత, కర్బురాకారము=సువర్ణాకృతిగలది, ఐ, అనంతశరాప్తిన్, అనంతశర=నారాయణాస్త్రముయొక్క, ఆప్తిచేత; ... నందనమహాక్రీడ; ... నందన = కుమారునియొక్క, మహత్ క్రీడ=విహారము, చిత్రమహిమన్=ఆశ్చర్యమహిమచేత, తారకాంతత(న్)-తారక=తారకాసురునియొక్క, అంతత(న్)=నాశముగలుగుటను, వర...వాసము-వర=శ్రేష్ఠమైన, సర్వమంగళా=పార్వతీదేవికి, ఆవాసము, ఐ, నానాభోగములన్=అనేకసర్పములచేత, కలధౌత...వర్తి-కలధౌతగిరి = రజతాద్రియొక్క, కటక

మందు, అభిరామమైన సదనతర=గృహాక్షేత్రమందు, వర్తి = వర్తించువాఁడు, (శివుఁడనుట), అనృపాలు నెదుర=అహరిశ్చంద్రునెదుట.

నల. ఏవేల్పు...హేతి-ఏవేల్పుయొక్క, భా=తేజస్సుచేత, లసత్ = ఒప్పుచున్నదై, నుతమైన, హేతి = ఆయుధము, ఉరు...వృత్తిన్-ఉరు = అధికమైన, బలమద = బలాసురగర్వముయొక్క, నాశమందు, ఉగ్రమైన, వృత్తిన్ = వర్తనచేత, (పసమీాలు నని పూర్వముతో నన్వయము.) ఘన...కారము-ఘనదీప్తిన్= మేఘకాంతిచేత, కర్బురాకారము = చిత్రవర్ణమైనయాకృతి గలది, ఐ, అనంత శరాప్తిన్-అనంత=అపరిమితమైన, శర=ఉదకముయొక్క, ఆప్తిన్ = ప్రాప్తిచేత, నందన=నందన మనెడు, మహత్+ఆక్రీడ=గొప్పయుద్యానవనముయొక్క, ('పుమానాక్రీడ ఉద్యాన' అ.) చిత్రమైన, మహీ=ప్రదేశము; మందారకాంతత(న్) = కల్పవృక్షముయొక్క ఒప్పిదములు, వర...వాసము-వరములైన, సర్వమంగళములకు, ఆవాసము, ఐ, నానాభోగములన్ = నానావైభవములతో, అట్టి, కలధౌత...వర్తి-కలధౌతగిరి=స్వర్ణపర్వతముయొక్క, ('కలధౌతంరౌప్యహేమ్నోః' అ.) కటక = నితంబప్రదేశమందలి, అభిరామమైన, సదనతర=గృహాక్షేత్రమందు, వర్తి=వర్తించువాఁడు, సురలోకచక్రవర్తి=ఇంద్రుఁడు, అనృపాలు నెదురన్= అనలు నెదుట.

చ. బడలితిగా నృపాల! బలుబాములపాలయి యిన్నినాళ్లు నీ
యుడుగని తాల్మికిన్ద్రిభువనోన్నతసూనృతసూక్తికల్మికిన్
జడియని ధైర్యభూతికిని జాలినినీతికిఁ జిత్రమైన నీ
పడఁతి పవిత్రరీతికినిఁ బల్మలు మెచ్చితి నాత్మలోపలన్. 63

టీ. రెంటను సమానము.

గీ. అనుచు నాభీమరాష్ట్రనాయకునిపట్టి
తోన తద్రాజసంతతి దురితరహిత
పరమజీవనమున మించ వర మొసంగి
యన్యసేవాదివైలక్ష్య మపనయింప. 64

టీక. హరి. ఆభీమ...తోనన్-ఆ, భీమరాష్ట్ర=శివరాజ్యమునకు, నాయకుని= నాయకుఁడైనవానియొక్క, (కాశిరాజుయొక్క యనుట) పట్టితోనన్ = కుమారునితోడ, తద్రాజసంతతి-తద్రాజ=హరిశ్చంద్రునియొక్క, సంతతి=సంతానము(లోహితుఁడనుట) దురిత...జీవనమునన్-దురితరహితమై, పరమమైన, జీవనమునన్=జీవించుట చేత, మించ(న్)=మించునట్లు, వరము, ఒసంగి, అన్య...వైలక్ష్యము(న్)-అన్య=ఇత

రుని యొక్క, (వీరబాహుని యొక్క యనుట.) సేవాదులవల్లనైన, వైలక్ష్యముఁ = సిగ్గును, ('ఆత్మనశ్చరితే సమ్యగ్జ్ఞాతేఽన్యైర్యస్య జాయతే, అపత్రపాతిమహతీ సవిలక్ష ఇతి స్మృతః' పంచాశన్నిఘంటుపాఠః-విలక్షస్వభావః) అపనయింపఁగ = హరింపఁగా.

నల. అభీమ...తోనఁ-అ, భీమరాష్ట్రనాయకుని=భీమభూపతియొక్క, పట్టి తోనఁ=కొమార్తెతోడ, తద్రాజసంతతి, తత్ = అ, రాజ = చంద్రునియొక్క, సంతతి=వంశముగలవాఁడు, (నలుఁడు) దురితరహితపరమజీవనమున-దురితరహితమైన, పరమజీవనమునఁ = లోకోత్కృష్ట జీవనముచేత.

క. ఒనరఁ బునఃపునరవనతు
లొనరించి నృపాలచంద్రుఁ డున్నిద్రశ్రీఁ
దనయువిదను మోదావహ
వినయానతమూర్తి నెనసి విలసితభక్తిన్. 65

టీక. హారి. నృపాలచంద్రుఁడు=హారిశ్చంద్రుఁడు, ఉన్నిద్రశ్రీన్=ఉన్నిద్రమైన ప్రకాశము గలవాని, తనయున్ = లోహితుని, విద...మూర్తిన్-విత్ = జ్ఞానముచేతను, అనుమోదావహమైన, వినయముచేతను, అవనతమైన, మూర్తిగల వానిని, ఎనసి.

నల. నృపాలచంద్రుఁడు = నలుఁడు, ఉన్నిద్రశ్రీన్=ఉన్నిద్రమైనశోభగల దానిని, (దమయంతి ననుట.) మోదా...మూర్తిన్-మోదావహమైన, వినయముచేత, అనత = నమ్రమైన, మూర్తిన్ = మూర్తిగలదానిని, ఎనసి = కూడి.

శా. ధాత్రీస్యందనవిశ్రుతాగమమహోధారాటధాటీప్రియా!
వృత్రధ్వంసవిధాయకాంబకమహోవిఖ్యాత! సతోద్యదిత
స్తోత్రాపాదనపాత్ర! దివ్యభృతికృచ్చూడామణీ! విత్రస
ద్గోత్రోదంచితనేత్ర! నిన్ను భజియింతుఙ్ హ్లాదినీధారకా! 66

టీక. హారి. ధాత్రీ...ప్రియా! - ధాత్రీస్యందన=భూరథమందు, విశ్రుతము లైన, ఆగమ=వేదములనియెడు, మహోధారాట=అశ్వములయొక్క, ('ధారాటౌహయచాతకే' నానార్థరత్నమాలా.) ధాటీ=దాడి, ప్రియా=ప్రియముగాఁగలవాఁడా! వృత్ర...విఖ్యాత! వృత్ర = చీఁకటియొక్క, (ధ్వాంతారిదానవావృత్రాః. అ.) విధ్వంస=నాశమును, విధాయక = చేసెడు, అంబక=నేత్రములయొక్క, మహః= తేజస్సుచేత, విఖ్యాతుఁడైనవాఁడా! సూర్యచంద్రాగ్నులు నేత్రములుగాఁ గలవాఁ డనుట. సతోద్యదిత...పాత్ర! సతోద్యదిత = వేదము లనెడు, స్తోత్రములయొక్క,

ఆపాదన=సంపాదనముగల, పాత్ర=పళ్లెరముగలవాఁడా, (బ్రహ్మకపాలము పళ్లెరముగాఁ గలవాఁడనుట.) దివ్య...మణీ! - దివ్య=దేవతలయొక్క, భృతి=రక్షణమును, కృత్=చేసెడు, చూడామణీ = శిరోరత్నముగలవాఁడా! (చంద్రశేఖరుఁడనుట) విత్ర ... నేత్ర! - విత్రసత్ = భయపడుచున్న, గోత్ర = గోసమూహముగల, ('గవ్యాగోత్రాగవాం' అ.) ఉదంచిత=మనోహరమైన, నేత్ర=వస్త్రముగలవాఁడా! (వ్యాఘ్రాజినధారి యనుట.) హ్రాదినీధారకా! హ్రాదినీ=నదిని, ధారకా = ధరించినవాఁడా! ('తటినీ హ్రాదినీ ధునీ'' అ.)

నల. ధాత్రీ...ప్రియా!-ధాత్రీ=భూమియందు,స్యందన=స్రవించుటచేత, విశ్రుతమైన, ఆగమ=రాకడగల, మహోధారాట=అశ్వములయొక్క, ధాటీ = దాడి, ప్రియముగా గలవాఁడా! (మేఘవాహనుఁ డనుట.) వృత్ర...విఖ్యాత-వృత్రాసురుఁడనెడు చీఁకటియొక్క,ధ్వంసమును, విధాయక=చేసెడు, అంబకమహః=బాణప్రతాపమనెడు, అవి=సూర్యునిచేత, విఖ్యాతుఁడైనవాఁడా! (వృత్రధ్వంసవిధాయక=వృత్రాసురనాశకరమైన, అంబకమహః=బాణతేజముచేత, విఖ్యాతుఁడైనవాఁడా! యనియుఁ జెప్పనొప్పు.) సత్యో...పాత్ర-సత్యోదిత = సత్యవాక్కులయొక్క, (ఋషులయొక్కయనుట.) స్తోత్రాపాదనమునకు, పాత్రమైనవాఁడా! దివ్యభృతికృచ్చూడామణీ! దివ్య=దేవతలకు, భృతికృచ్చూడామణీ=రక్షకశిరోమణియైనవాఁడా! విత్ర... నేత్ర-విత్రసత్=భయపడుచున్న, గోత్ర=పర్వతములుగల, ఉదంచిత నేత్రములు గలవాఁడా! హ్రాదినీధారకా!=వజ్రాయుధమును ధరించినవాఁడా! ('హ్రాదినీవజ్రమస్త్రీస్యాత్' అ.)

చ. అని యధికాంబకు న్పొగడి యంచితసత్కరుణీసుధావలో
కనమున నీదదేరి యల కౌశికుఁ డిచ్చు ననంతరాజ్యపా
లనవిభవంబు దన్మహితలాలనచాటుపురస్సరంబుగా
నెనసి నృపాలుఁ డొప్పెఁ బునరిద్ధకళాకలితేందువైఖరిన్. 67

టీక. హరి. అధికాంబకున్=త్రిలోచనుని, అలకౌశికుఁడు=అవిశ్వామిత్రుఁడు.
నల. అధికాంబకున్=సహస్రాక్షుని, కౌశికుఁడు=ఇంద్రుఁడు.

క. ఆశాంతగజావధిపృథి
వీశాశ్వతభోగభాగ్యవిభవము లటు లు
ర్వీశునకుఁ గృప నొసంగి హ
వాశనతిలకుఁడు తిరోహితాత్మకుఁ డయ్యెన్. 68

టీక. హరి. హవ్యాశనతిలకుఁడు - హవ్యాశన=అగ్నిహోత్రుఁడు, తిలకుఁడు = తిలకముగాఁ గలవాఁడు, (శివుఁడనుట.)

నల. హవ్యాశనతిలకుఁడు=దేవేంద్రుఁడు.

మ. అపుడాశాంతనిశాంతసామజసమాజాధారదోస్స్ఫారుఁ డై
విపులావల్లభుఁ డాత్మవంశనగరీవిఖ్యాతసామ్రాజ్యభ
ద్రపదశ్రీ నిరవొంది యాప్తజనచేతశ్చాతకప్రీతిదా
నపయోదానఘమూర్తి యై వెలసె భూనాథాగ్రణు ల్గొల్వఁగన్.

టీక. రెంటను సమానము.

సీ. అతనుపావక[1]దీపితాభితాపము డిందె
నత్కామహార్ఘసామగ్రిఁ జెందె
వనమాళిదురాప వప్రకంపము జాఱె
నిష్టలీలాస్ఫూర్తి లింపుమీఱె
ఖరరాజకరజాతకాతరత్వ మడంగె
గరిమఁ జెలంగి యంగములు పొంగె
మదమత్తపరభృతస్మయచయంబు శమించె
నాకల్పసద్వృద్ధు లతిశయించె
గీ. సమరనుతవైభవుని వివేకాబ్జభవుని
ధవునిఁ దేజోరవిందబాంధవునిఁ బాసి
యెట్టకేలకుఁ గ్రమ్మఱ నెనసి వసుమ
తీమహారాజ్యలక్ష్మి సుస్థిరత నిలువ. 70

టీక. రెంటను సమము.

తా. ఇందు రాజ్యలక్ష్మి యితరబాధలు లేక సుఖంబున నుండె నని చెప్పుటచే ప్రియవిరహమువల్లనైన మదనాగ్నితాపాధిక్యాదులు లేక యుండె నని స్ఫురించుచున్నది.

క. అని యిట్లు పాండుసుతునకు
జననుతుఁడు మృకండుసుతుఁడు చతురత నెఱిఁగిం
చిన యీవిచిత్రకృతి విను
ఘనులకు సిరు లొసఁగు మహిమకరవంశభవా! 71

1. పీడితా.

శా. నమ్రారామవసంత! సంతతనుతిన్యస్తాదరాహార్యజా
కమ్రస్వాంతనిశాంత! శాంతభయరింఖద్దేవమర్త్యాంతకృ
ద్ధూమ్రాక్షాదికృతాంత! తాంతభృగురాడ్దోర్దర్పతేజోమహా
తామ్రాంశుక్షణదాంత! దాంతజనసంత్రాణైకచింతామణీ! 72

టీక. నమ్రా...వసంత! నమ్ర=నతుల నెడు, ఆరామములకు, వసంత=ఆమనియైన వాఁడా!, సంతతి...నిశాంత-సంతతనుతియందు, న్యస్త = ఉంపఁబడిన, ఆదరముగల, ఆహార్యజా=పార్వతియొక్క, కమ్ర=మనోజ్ఞమైన, స్వాంత=మనస్సే, నిశాంత = గృహముగాఁ గలవాఁడా!, శాంత...కృతాంత! - శాంతభయ = నిర్భయముతో, రింఖత్ = చరించుచున్నవారై, దేవమర్త్య = దేవమానవులయొక్క, అంత = నాశమును, కృత్ =చేసెడు, ధూమ్రాక్షాదిరాక్షసులకు, కృతాంత=అంతకుఁడైనవాఁడా!, తాంత...దాంత! - తాంత=వాడిన, భృగురాట్ = భార్గవునియొక్క, దోర్దర్ప = తేజము నెడు, మహత్ =అధికుఁడైన, తామ్రాంశు=సూర్యునికి, క్షణదాంత = ప్రాతఃకాలమైనవాఁడా, దాంతజన...మణీ - దాంతజన = ఋషిజనులయొక్క, సంత్రాణమందు; ఏక = ముఖ్యమైన, చింతామణియైనవాఁడా!

క. కంజభవాభవచేతో
రంజన! ఖరభంజనా! నిరంజనజనజీ
వంజీవకాజవంజవ
సంజీవకచరణ నఖర చంద్రమయూఖా! 73

టీక. కంజ...రంజన-కంజభవ=బ్రహ్మయొక్కయు, అభవ=శివునియొక్కయు, చేతః=చిత్తమును, రంజన=రంజింపఁజేయువాఁడా! ఖరభంజన=ఖరాసురసంహారియైన వాఁడా!,నిరంజన...మయూఖా-నిరంజనజన=నిష్కల్మషజనుల నెడు, జీవంజీవక=చకోరములయొక్క, ఆజవంజవ=సంసారమునకు, సంజీవక=రక్షకమైన, చరణనఖరచంద్రమయూఖములు గలవాఁడా!

పంచచామరము.

అయాశ్రయా ధరాధరా హృతాహితా హితాన్వితా
జయాన్వయా పరాపరా యసాధ్వసాహసాహసా
నయాలయా నిరాకరా సనాతనా జనావనా
దయామయా చిరాదరా సదాప్రదా చిదాస్పదా! 74

## కృతికర్తృ గద్యము.

గద్యము. ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణకవిప్రణీతం బైన హరిశ్చంద్రనలోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

## వ్యాఖ్యాతృ గద్యము.

ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధ సారస్వతపాత్ర భారద్వాజగోత్రపవిత్ర చిత్రకవి పెద్దిరాజతనూజ పురాతనాధునాతన కఠినప్రబంధార్థబోధన సమర్థ మానసాంభోజ బుధజన విధేయానంతయనామధేయ విరచితంబైన "హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రకాశిక" యను వ్యాఖ్యయందు సర్వంబును బంచమాశ్వాసము. శ్రీ. శ్రీ. శ్రీ.



చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము.—1953.

# వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

**292, ఎస్ప్లనేడ్,**

**పోస్టుబాక్సు 1872, చెన్నపురి. 1.**

## తెనుగు నిఘంటువులు

| | రూ. | అ. |
|---|---|---|
| నానార్థనిఘంటువు, పద్యకావ్యము | 0 | 4 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకా, అకారాద్యనుక్రమణికతో (నిఘంటుత్రయము) | 1 | 12 |
| డిటో కాలికోబైండు | 2 | 0 |
| వావిళ్లనిఘంటువు (అ-ఔ వఱకు) I సంపుటము | 10 | 0 |
| డిటో (క-ఘ వఱకు) II | 12 | 0 |
| డిటో III వ సం॥ (ట-న వఱకు) | 10 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక | 6 | 0 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr Rs. | 2 | 0 |
| Gellettes' Telugu Dictionary (Printed in Roman letters) | 7 | 8 |
| Sankaranarayana's Telugu-English Dictionary శంకరనారాయణగారినిఘంటువు (తెనుగుపదములకు ఇంగ్లీషు అర్థములుగలది | 12 | 0 |
| Do. English-Telugu Dictionary. శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషు పదములకు తెనుగు అర్థములుగలది) | 15 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుగు పాకెట్టుడిక్షనరి | 5 | 0 |

| | రూ. | అ. |
|---|---|---|
| Translation Guide (English to Telugu & vice-versa (useful for Revenue Officials) | 2 | 8 |

## తెనుగుపద్యకావ్యములు

| | రూ. | అ. |
|---|---|---|
| ఆడవిమల్లెలు | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | 2 | 0 |
| అనంతునిఛందము,(ఛందోదర్పణము) | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్య | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | 5 | 0 |
| ,, శ్రీగిడుగురామమూర్తిగారివిమర్శ | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | 0 | 8 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము 2 సంపుటములు | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:—పద్యకావ్యము, ఆదిపర్వము, పెద్దచ్చు | 1 | 8 |
| ,, టీక (ప్రాతది) | 8 | 0 |
| ఆదిపంచకము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వం | 7 | 8 |
| శాంతిసప్తకము | 7 | 8 |
| ఆది సభాపర్వములు, కలసంపుటము | 4 | 0 |
| అరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 4 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి | 0 | 12 |

| | రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | 0 | 4 |
| ,, టీకతో | 0 | 10 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము. విమర్శతో | 0 | 6 |
| బసవపురాణము ద్విపద | 4 | 8 |
| భక్తిరసశతకసం॥ I, 20 శతకములు | 3 | 0 |
| ,, II ,, | 3 | 0 |
| ,, III ,, | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ,, | 3 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము— శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనిది | 6 | 0 |
| ఉత్తరహరివంశము | 3 | 0 |
| కవికంఠోక్తి | 0 | 4 |
| కవిజనాశ్రయము | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | అచ్చు | |
| కవిరాజమనోరంజనము | 1 | 4 |
| కవిజనరంజనము | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరన | 4 | 0 |
| కృష్ణదండకము | 0 | 2 |
| కవిత్వతత్వవిచారవిమర్శనము | 1 | 8 |
| కవిగజాంకుశము | 0 | 4 |
| చేరీజుపద్యములు | 0 | 4 |
| కృష్ణరాయవిజయము | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథుని | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతం) | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | 0 | 10 |
| కుమారసంభవము, నన్నెచోడ | 5 | 0 |
| గయోపాఖ్యానము, రామనామాత్య | 0 | 12 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జున సంవాదము) గోపమంత్రి | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 12 |
| ,, శ్రీగొర్తిసూర్యనారాయణశాస్త్రిగారిది | | |
| గరుడాచలము-యక్షగానము | 0 | 4 |
| గణికాగుణప్రవర్తనతారావళి | 0 | 4 |
| గీతమంజరి, శ్రీచిలకమర్తిలక్ష్మీనరసింహము | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగం | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మన | 1 | 8 |
| చెన్నపురీ విలాసము | 0 | 8 |
| ఛందోదర్పణము (అనంతుని ఛందస్సు) | 2 | 0 |
| జైమినీభారతము | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | 0 | 8 |
| ధనాభిరామము | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకార సంగ్రహము) | 3 | 0 |
| హరిశ్చంద్రద్విపద, గౌరనకృతము | 3 | 0 |
| సౌగంధికాప్రసవాపహరణము ద్విపద | 3 | 0 |
| శుకసప్తతి, కదిరీపతి | 3 | 0 |
| వేమన పద్యములు, తాత్పర్యము | 7 | 8 |
| రాధికాసాంత్వనము | 1 | 8 |
| పాండురంగమహాత్మ్యము సటీక | 6 | 8 |
| రాఘవపాండవీయము సటీక | 4 | 0 |
| పారిజాతాపహరణము సటీక | 5 | 0 |

## హరిశ్చంద్రనలోపాఖ్యానము

# పద్యసూచి.

## శ్రీ చిలకపాటి వేంకటరామానుజశర్మగారి గ్రంథములు.

☞ వినోదకథాకల్పవల్లి, ఆంధ్రభోజచరిత్రము, కాళిదాసప్రకరణము నీమూఁడు గ్రంథములును బరస్పరసంబంధము గలిగియుండును గాఁబట్టి యిందొకటిఁ గొన్నవారికి తక్కిన రెండట్యావశ్యకములు.

# ఆంధ్రభోజచరిత్రము

ఇది సంస్కృతభాషయందుండు భోజచరిత్రమును శ్లోకములకు సరియయిన యాంధ్రపద్యంబులతో సంస్కృతవచనమునకు సరియయినయాంధ్రవచనములతోఁ జేర్చి రచియింపఁబడినది. కాళిదాసులతో భోజునిసభయం దుండినమహాకవులచరిత్రమును భోజకాళిదాసుల చరిత్రము నుండును. ప్రతి 1-కి రూ. 2—8—0

# చమత్కారకథాకల్లోలిని

ఇది రోచనుఁడను రాజకుమారుఁడు మందారమాల, మదనమాల, మదనసేన, వసంతసేన, మదనలేఖ, చందనలేఖలను విద్వద్రాజకన్యారత్నములను బరకీయాభావంబునఁ బరిణయ మయినశృంగారచరిత్రము. పద్యములును శ్లోకములును గలిసియుండు మనోహరవచనము వినోదకథాకల్పవల్లివంటిది. ప్రతి 1-కి రూ. 3—0—0

# శ్రీతులస్యుపాఖ్యానము

ఇది లక్ష్మీదేవి తులసి యనురాజపుత్రియై జన్మించి శంఖచూడునికిం బత్నియై నారాయణునిచేతఁ బాతివ్రత్యభంగమునుబొంది తత్పత్నియై తులసీపత్రరూపమును ధరించి భగవంతుని కేకాంతకైంకర్యప్రవణయైనచరిత్రము. ఇది తులసీదళములచే భగవత్పూజసేయువారలకెల్ల నత్యాదరణీయము. బహుసుందరమైనకథ. శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణములోనిది. ప్రతి 1-కి రూ. 1—0—0

# ఆంధ్ర తనిశ్లోకి

ఇది ద్రవిడభాషలోఁ పెరియవాచ్చాంపిళ్లగారు రచించినతనిశ్లోకికి సరిగా నాంధ్రీకరింపఁబడి మధ్యోదాహృతములగు ప్రమాణవాక్యములకర్థములతో ముద్రితమై యుండును. దీనియందు శ్రీరామాయణములో ముఖ్యములగుశ్లోకములకు శ్రుత్యాదిసమ్మతము లగు మహార్థము లొక్కొకపదమునకును వాక్యమునకును నలువదేఁబదివిధముల నుపన్యసింపఁబడియుండు. ఈయర్థములతిమనోహరములయినవి. (అచ్చగుచున్నది.)

## వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

**292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.**